# శ్రీమద్భగవద్గీత

## శంకరభాష్యము

(సంస్కృత మూలము-తెలుగు అనువాదము)

అనువాదకులు

సూరపరాజు రాధాకృష్ణమూర్తి

# శ్రీమద్భగవద్గీత

## శంకరభాష్యము

(సంస్కృత మూలము-తెలుగు అనువాదము)


తెలుగు అనువాదం:

**సూరపరాజు రాధాకృష్ణమూర్తి**





**రామకృష్ణ మఠం**

దోమలగూడ, హైదరాబాదు - 500 029

# ప్రకాశకుల మనవి

పంచమవేదమైన మహాభారత మధ్యభాగంలో ప్రస్థాన త్రయాలలో ఒకటైన భగవద్గీత విరాజిల్లుతూ ఉంది. విశ్వవాఙ్మయంలో భగవద్గీతకున్న విశిష్ఠత మరేదేనికి లేదు. సమస్త వేదవేదాంతాల యొక్క సారం దీనిలో నిక్షిప్తమై ఉంది. దీనిపై ఎంతో మంది ఆచార్యులు భాష్యాలను, వ్యాఖ్యానాలనూ వ్రాసారు. శ్రీ శంకరాచార్యులు రాసిన భాష్యం అత్యంత ప్రాచీనతమమైనది. శ్రీ శంకరుల మృదుమధురమైన సంస్కృత భాష, ఉపనిషదాదుల వ్యాఖ్యలను ఉదహరిస్తూ సాగిన సరళ వ్యాఖ్యాన రీతి, సులభంగా అవగతం అయ్యేటట్లు అవలంబించిన పద్ధతి సహృదయ హృదయరంజకమైనది. ఆధ్యాత్మిక సాహిత్యంలో దేనికీ లేనంతగా దీనికి అనువాదాలు వెలువడ్డాయి. ఆధునిక కాలానికి తగ్గట్టు ఇప్పటికీ క్రొత్త క్రొత్త వ్యాఖ్యానాలు వెలువడుతున్నాయి. శ్రీరామకృష్ణులు గీతను 'గీతా, గీతా' అంటూ పదిమార్లు ఉచ్చరిస్తే 'తాగీ తాగీ' అవుతుంది అని బోధించారు. భగవద్గీత త్యాగబోధనను ప్రతిపాదిస్తుంది. దృశ్యమాన ప్రపంచంలో ప్రతీ వస్తువు నశించిపోయేదన్న భావనతో త్యాగివి కమ్మంటుంది. క్షుద్రవిషయాల పట్ల ఆసక్తిని త్యజించమంటుంది. 'నేను, నాది' అన్న భావన విడనాడమంటుంది. సాధకుడికి సాధనా పథంలో తన అభిరుచికి తగ్గట్టు కర్మ, భక్తి, జ్ఞాన, రాజ యోగ మార్గాలను విపులంగా విశదీకరించిన ఆధ్యాత్మిక గ్రంథరాజం 'శ్రీమద్భగవద్గీత'.

ఈ గ్రంథకర్త బ్రహ్మశ్రీ సూరపరాజు రాధాకృష్ణమూర్తిగారు నిరంతరాధ్యయన తత్పరులు, తత్త్వజ్ఞులు. అంతేకాక సంస్కృతం, తెలుగు, ఆంగ్లం, హిందీ, ఫ్రెంచ్ భాషలలో పాండిత్యం ఉన్నవారు. బెనారస్ విశ్వవిద్యాలయం నుండి యమ్.ఎ (ఇంగ్లీషు) పట్టాను పొంది రాష్ట్రంలో వివిధ ప్రభుత్వ కళాశాలలలో అధ్యాపకుడుగా సేవలందించి ఉపన్యాసకుడుగా పదవీ విరమణ చేశారు. ప్రాచీన గ్రంథాలను మొదలుకొని అత్యాధునికమైన సిద్ధాంతాలను సైతం సులభంగా, సునిశితంగా పరిశీలించే వీరు 'ICFAI' అనే సంస్థ ప్రచురించే ఆంగ్ల పత్రికకు సంపాదకులుగా ఉన్నారు. అనేక ఆంగ్ల గ్రంథాలకు 'గ్రంథపరిచయాలు' రాసి పలువురి ప్రశంసలు పొందారు. అంతేగాక శ్రీ మూర్తిగారు **ఈశావాస్యోపనిషత్తు, కేనోపనిషత్తులకు** తెలుగులో అనువాదంతో పాటు విశేష వ్యాఖ్యానాన్ని రచించారు. **'Upanishads: insights into infinity'; 'Krishna calling : The Bhagavad Gita'** అనే రెండు గ్రంథాలను ఆంగ్లంలో రచించారు.

ఇక ప్రస్తుత గ్రంథం శ్రీమద్భగవద్గీతకు రాసిన శ్రీ శంకరాచార్యుల సంస్కృతభాష్యానికి తెలుగు అనువాదం భాషాపరంగానూ, భావపరంగానూ కూడా అతి దగ్గరగా ఉండి ప్రతీ ఒక్కరికీ సులభంగా అర్థమయ్యే రీతిలో సాగింది. శ్రీ శంకరుల సంస్కృత భాష్యం చదవలేనివారికి ఆ లోటును ఈ అనువాదం తీర్చగలదనడం అతిశయోక్తి కాబోదు. ఈ గ్రంథం ఇదివరలో 'జనని' సంస్థ ద్వారా రచయితే స్వయంగా ముద్రించడం జరిగింది. అయితే రచయిత గ్రంథ సర్వహక్కులను రామకృష్ణ మఠానికి ఇవ్వడం జరిగింది. వారికి మా కృతజ్ఞతలు. గ్రంథ ముద్రణకు అనేక విధాలుగా సహాయసహకారాలు అందించిన గ్రంథకర్త కుమార్తెలు డాక్టర్ రమాదేవి, లత గార్లకు మా అభినందనలు. గ్రంథకర్త అల్లుడు డాక్టర్ కె. నీలకంఠంగారికి, మఠ ప్రచురణా విభాగంలో సేవలందిస్తున్న వారందరికీ మా ప్రత్యేక అభినందనలు. భగవద్గీత భాష్యాన్ని పవిత్ర గ్రంథమని మాత్రమే తలచక, ఇది అనుష్ఠించదగ్గది అని తెలియజేయడం కోసం సులభమైన, సరళశైలిలో సాగిన ఈ భగవద్గీతా శంకరభాష్య తెలుగు అనువాదాన్ని పాఠకుల ముందుంచుతున్నాం. తెలుగు పాఠకుల ఆత్మవికాసానికి ఈ గ్రంథం తోడ్పడుతుందని ఆశిస్తున్నాం.

**– ప్రకాశకులు**

# పీఠిక

శంకరుని గీతాభాష్యంపై ప్రముఖమైన అభియోగం ఏమిటంటే, ఆయన గీతను పట్టి సన్యాసి గ్రంథంగా మార్చివేశాడు అని. కాని శంకరుడు తన గీతాభాష్య ప్రారంభంలోనే వేదోక్తధర్మం ద్వివిధము, ప్రవృత్తి నివృత్తి అని ప్రకటించాడు. ఈ ద్వివిధధర్మం ఏ ఒక్కరు ఒకే సమయంలో అనుష్ఠించతగినవి కావు. కనుకనే భగవానుడు ముందుగా మరీచి మొదలైన ప్రజాపతులను సృష్టించి వారిచేత ప్రవృత్తిలక్షణమైన ధర్మాన్ని గ్రహింపజేశాడు. తరువాత, సనక సనందనాదులను సృష్టించి వారిచేత జ్ఞానవైరాగ్య లక్షణమైన నివృత్తిధర్మాన్ని గ్రహింపజేశాడు. కనుక, జ్ఞానవైరాగ్య లక్షణమైన నివృత్తిని మాత్రమే గీత చెప్పింది, అందులో ప్రవృత్తి లేదు, ఉన్నా అది ప్రధానం కాదు అని శంకరుడు అన్నాడు అనడం వాస్తవం కాదు. ఆయన అన్నది ఆ రెండూ, అంటే కర్మలనుండి నివర్తించడం, కర్మలయందు ప్రవర్తించడం ఏ ఒక్కడు ఒకే సమయంలో అనుష్ఠించడం అసంభవం అని మాత్రమే.

గీతాభాష్యానికి తన సంబంధగ్రంథంలో శంకరుడు గీతలోని విషయం వాసుదేవతత్త్వమని, దాని ప్రయోజనం మోక్షమని, ఆ మోక్షం సర్వకర్మసంన్యాసపూర్వక జ్ఞాననిష్ఠవల్లనే కలుగగలదని స్పష్టం చేశాడు. సర్వకర్మ సంన్యాసమే గీతాశయమని శంకరుని భాష్యం. 'కేవలం జ్ఞానం వల్లనే మోక్షం ప్రాప్తించదు. విహితకర్మలు ఆచరించడం కూడా అవసరం', అన్న జ్ఞాన కర్మల సముచ్చయాన్ని ఆయన అంగీకరించలేదు. వేదవిహితకర్మలను ఆయన నిరాదరించాడన్నది ఆయనపై ప్రధాన అభియోగం. ఈ సందర్భంగా, శంకరుడు జ్ఞాన కర్మలను ఏవిధంగా వివరించాడు, ఆ రెండూ కలిసి ఉండలేవు అని ఏ కారణంగా అన్నాడు అన్నది మనం అర్థం చేసుకోవలె. సర్వకర్మసంన్యాసంలో సంన్యసించేది కర్మను కాదు, కర్తను. సంన్యాసం అంటే కర్మలు విడిచిపెట్టడం. కర్మకు, అహంకు ఉన్న బంధం వదలిపోవడం. (వదలవలసిన బంధం అదే. తక్కినవేవీ బంధాలు కావు) ఆ బంధం వదలిన తరువాత అహం అహం కాదు, కర్మ కర్మ కాదు. బంధం ఉన్నంతవరకే ఆ రెండూ ఉంటాయి. బంధం తెగిన తరువాత రెండూ ఉండవు. అవి కలిస్తే సంసారం. విడివడితే సంన్యాసం. కర్త కర్మ రెండూ భ్రమలే అన్న అకర్మదర్శనమే జ్ఞానం. ఆ జ్ఞానమే సంన్యాసలక్షణం. (తక్కినవన్నీ అవలక్షణాలు). కర్తకు కర్మకు ఉన్న బంధం వదలిపోవడమే బంధముక్తి. అదే మోక్షం. అహంతో బంధం తెగిన తరువాత చేయడానికి మానడానికి కర్మలే లేవు, చేసేవాడే లేడు కనుక. సంన్యాసమంటే అర్థమిది. లేని కర్మతో సముచ్చయమేమిటి? జ్ఞానం అంటేనే అకర్మ దర్శనమయినపుడు, కర్మ కేవలం భ్రమ అన్న జ్ఞానమే జ్ఞానమైనపుడు, ఆ జ్ఞానం కర్మతో కలియడమెట్లా? శంకరుడు గీతార్థమని చెప్పిందిదే. కాని ప్రవృత్తి లేదనలేదు. అకర్మదర్శనం కలిగేవరకు ప్రవృత్తి ఉంటుంది. గీతాభాష్యం స్వయంగా చదివి, శంకరుడు వాస్తవంగా ఏమన్నాడో ఎవరికివారు తెలుసుకోగలగడం కొరకు యీ ప్రయత్నం.

**– అనువాదకుడు**

# సంకేతవివరణ

| | |
|---|---|
| అను గీత | – అనుగీత |
| అశ్వ.ప. | – అశ్వమేధపర్వము |
| ఆప.ధ.సూ. | – ఆపస్తంబధర్మసూత్రాలు |
| ఆప.శ్రౌ.సూ. | – ఆపస్తంబ శ్రౌతసూత్రాలు |
| ఈశ.ఉ. | – ఈశావాస్యోపనిషత్తు |
| ఐ.ఆ. | – ఐతరేయ ఆరణ్యకము |
| ఋ.వే. | – ఋగ్వేదము |
| కఠ.ఉ. | – కఠోపనిషత్తు |
| కేన.ఉ. | – కేనోపనిషత్తు |
| గౌ.ధ.సూ. | – గౌతమధర్మసూత్రాలు |
| ఛాం.ఉ. | – ఛాందోగ్యోపనిషత్తు |
| జాబాల.ఉ. | – జాబాలోపనిషత్తు |
| తై.ఆ. | – తైత్తిరేయ ఆరణ్యకము |
| తై.ఉ. | – తైత్తిరేయోపనిషత్తు |
| తై.బ్రాహ్మ | – తైత్తిరీయ బ్రాహ్మణము |
| తై.సం. | – తైత్తిరేయ సంహిత |
| నార.పరి.ఉ. | – నారద పరివ్రాజకోపనిషత్తు |
| నృ.పు | – నృసింహపురాణము |
| ప్రశ్న.ఉ. | – ప్రశ్నోపనిషత్తు |
| బ్ర.సూ.భా. | – బ్రహ్మసూత్రభాష్యము |
| బృ.ఉ. | – బృహదారణ్యక ఉపనిషత్తు |
| బౌ.ధ.సూ. | – బౌద్ధాయన ధర్మసూత్రాలు |
| మను.స్మృ | – మనుస్మృతి |
| మహా.నా.ఉ. | – మహానారాయణోపనిషత్తు |
| మహా.భా. | – మహాభారతము |
| మ.భా.అశ్వ | – మహాభారతము, అశ్వమేధపర్వము |
| మ.భా.శాం | – మహాభారతము, శాంతిపర్వము |
| మ.భా.స్త్రీ | – మహాభారతము, స్త్రీ పర్వము |
| ముం.ఉ. | – ముండకోపనిషత్తు |
| వన.ప. | – వనపర్వము |
| విష్ణు.పు | – విష్ణుపురాణము |
| శత.బ్రాహ్మ | – శతపథబ్రాహ్మణము |
| శాం.భా. | – శాంకరభాష్యము (గీతపై) |
| శ్వేత.ఉ. | – శ్వేతాశ్వతరోపనిషత్తు |
| స్కం.పు. | – స్కందపురాణము |

# ఉపయుక్త గ్రంథాలు


1. వావిళ్లవారు ప్రచురించిన 'శంకరభాష్యోపేతా శ్రీమద్భగవద్గీతా' – 1953.
2. రామకృష్ణమఠం వారు ప్రచురించిన Srimadbhagavadgita Bhasya of Sri Sankaracharya - English Translation by Krishna Warrior. 1983.

# విషయ సూచిక

# శ్రీ గురుధ్యానమ్

వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనమ్ ।
దేవకీపరమానన్దం కృష్ణం వందే జగద్గురుమ్ ॥

కృష్ణద్వైపాయనం వ్యాసం సర్వలోకహితే రతమ్ ।
వేదాబ్జభాస్కరం వన్దే శమాదినిలయం మునిమ్ ॥

శ్రుతిస్మృతి పురాణానామాలయం కరుణాలయమ్ ।
నమామి భగవత్పాదం శంకరం లోకశంకరమ్ ॥

గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీగురవేనమః ॥

అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజనశలాకయా ।
చక్షురున్మీలితం యేన తస్మై శ్రీగురవే నమః ॥

# గీతా ధ్యానమ్

పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయం
వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యే మహాభారతమ్ ।
అద్వైతామృతవర్షిణీం భగవతీమష్టాదశాధ్యాయినీం
అమ్బ త్వామనుసందధామి భగవద్గీతే భవద్వేషిణీమ్ ॥

నమోఽస్తు తే వ్యాస విశాలబుద్ధే
ఫుల్లారవిందాయతపత్రనేత్ర ।
యేన త్వయా భారతతైలపూర్ణః
ప్రజ్వాలితో జ్ఞానమయః ప్రదీపః ॥

ప్రపన్నపారిజాతాయ తోత్రవేత్రైకపాణయే ।
జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృతదుహే నమః ॥

సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనన్దనః ।
పార్థో వత్సః సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్ ॥

# శ్రీమచ్ఛంకరాచార్య విరచితమ్

# శ్రీభగవద్గీతాభాష్యమ్

# సంబంధభాష్యమ్

నారాయణః పరోఽవ్యక్తాత్ అణ్డమవ్యక్త సమ్భవమ్ ।
అణ్డస్యాన్తస్త్విమే లోకాః సప్తద్వీపా చ మేదినీ ॥

**తె.అ.** నారాయణుడు అవ్యక్తానికి అతీతుడు. అవ్యక్తం నుండి అండం పుట్టింది. ఈ లోకాలు, సప్తద్వీప అయిన భూలోకంతో సహా, అండంలోనివి.

**1. స భగవాన్ సృష్ట్వేదం జగత్ తస్య చ స్థితిం చికీర్షుః, మరీచ్యాదీన్ అగ్రే సృష్ట్వా ప్రజాపతీన్, ప్రవృత్తిలక్షణం ధర్మం గ్రాహయామాస వేదోక్తమ్. తతః అన్యాన్ చ సనకసనన్దనాదీన్ ఉత్పాద్య, నివృత్తిలక్షణం ధర్మం జ్ఞానవైరాగ్యలక్షణం గ్రాహయామాస. ద్వివిధో హి వేదోక్తోధర్మః, ప్రవృత్తిలక్షణః నివృత్తిలక్షణశ్చ, జగతః స్థితికారణమ్. ప్రాణినాం సాక్షాత్ అభ్యుదయ నిశ్రేయసహేతుః యః స ధర్మః బ్రాహ్మణాద్యైః వర్ణిభిః ఆశ్రమిభిః శ్రేయోర్థిభిః అనుష్ఠీయమానః. దీర్ఘేణ కాలేన అనుష్ఠాతౄణాం కామోద్భవాత్ హీయమానవివేకవిజ్ఞానహేతుకేన అధర్మేణ అభిభూయమానే ధర్మే ప్రవర్ధమానే చ అధర్మే, జగతః స్థితిం పరిపిపాలయిషుః సః ఆదికర్తా నారాయణాఖ్యః విష్ణుః భౌమస్య బ్రహ్మణః బ్రాహ్మణత్వస్య రక్షణార్థం దేవక్యాం వసుదేవాత్ అంశేన కృష్ణః కిల సమ్బభూవ. బ్రాహ్మణత్వస్య హి రక్షణే రక్షితః స్యాత్ వైదికో ధర్మః తదధీనత్వాత్ వర్ణాశ్రమభేదానామ్.**

**తె.అ.** ఆ భగవానుడు ఈ జగత్తును సృష్టించి, దానిని నిలుపవలెననే కోర్కెతో ముందుగా మరీచి మొదలైన ప్రజాపతులను సృజించి వేదోక్తమైన ప్రవృత్తిలక్షణధర్మాన్ని గ్రహింపజేశాడు. ఆ తరువాత ఇతరులను సనక సనందనాదులను సృష్టించి జ్ఞానవైరాగ్య లక్షణమైన నివృత్తిరూపధర్మాన్ని గ్రహింపజేశాడు. ఈ జగత్తును నిలిపిఉంచేది వేదం చెప్పిన ధర్మం. అది రెండు విధాలు, ప్రవృత్తిలక్షణము, నివృత్తిలక్షణమునని. ప్రాణులకు సాక్షాత్తు అభ్యుదయము నిశ్రేయసము (మోక్షము) కలిగించే ఆ ధర్మాన్ని శ్రద్ధగలవారైన బ్రాహ్మణాదివర్ణాశ్రమాల వారు అనుష్ఠిస్తారు. దీర్ఘకాలం గడచిన కారణంగా అనుష్ఠించేవారిలో వివేకవిజ్ఞానాలు క్షీణించి కామం ఉద్భవించి, అధర్మంచేత ధర్మం అణగద్రొక్కబడి, అధర్మం పెరిగిపోతూ ఉన్నపుడు

జగత్తుయొక్క స్థితికి కారణమైన మర్యాదను సురక్షితం చేయడం కొరకు ఆ ఆదికర్త నారాయణుడనబడే విష్ణువు భూమిమీద వెలసిన బ్రహ్మను అంటే బ్రాహ్మణత్వాన్ని రక్షించడం కొరకు వసుదేవునివలన దేవకీగర్భంలో తన అంశతో కృష్ణుడిగా పుట్టడం తెలిసిందే. వర్ణాశ్రమభేదాలు బ్రాహ్మణత్వం మీద ఆధారపడి ఉంటాయి కనుక బ్రాహ్మణత్వాన్ని రక్షించడం వల్లనే వైదికధర్మం సురక్షితమవుతుంది.

**2. స చ భగవాన్ జ్ఞానైశ్వర్యశక్తిబలవీర్యతేజోభిః సదా సమ్పన్నః త్రిగుణాత్మికాం వైష్ణవీం స్వాం మాయాం మూలప్రకృతిం వశీకృత్య, అజః, అవ్యయః భూతానాం ఈశ్వరః నిత్యః శుద్ధబుద్ధ-ముక్తస్వభావః అపి సన్, స్వమాయయా దేహవాన్ ఇవ జాతః ఇవ చ లోకానుగ్రహం కుర్వన్నివ లక్ష్యతే. స్వప్రయోజనాऽభావేऽపి భూతానుగ్రహజిఘృక్షయా వైదికం ధర్మద్వయం అర్జునాయ శోకమోహమహోదధౌ నిమగ్నాయ ఉపదిదేశ, గుణాధికైః హి గృహీతః అనుష్ఠీయమానశ్చ ధర్మః ప్రచయం గమిష్యతీతి. తం ధర్మం భగవతా యథోపదిష్టం వేదవ్యాసః సర్వజ్ఞః భగవాన్ గీతాఖ్యైః సప్తభిః శ్లోకశతైః ఉపనిబబన్ధ.**

**తె.అ.** జ్ఞాన ఐశ్వర్య శక్తి బల వీర్యములచేత సదా సంపన్నుడైన ఆ భగవానుడు త్రిగుణాత్మిక అయిన మూలప్రకృతిని స్వీయవైష్ణవీమాయను వశం చేసుకుని అజుడు (జన్మ లేనివాడు) అవ్యయుడు (శాశ్వతుడు) అయిన సర్వేశ్వరుడు నిత్యశుద్ధబుద్ధముక్త స్వభావుడై ఉండి కూడా తన మాయచేత దేహం ధరించినట్లు పుట్టినట్లు లోకానుగ్రహం చేస్తున్నట్లు కనిపిస్తాడు. స్వప్రయోజనం లేకపోయినా, ప్రాణులను కరుణించే కోరికతో శోకమోహాలనే మహాసముద్రంలో మునిగి ఉన్న అర్జునునికి వైదికమైన ధర్మద్వయాన్ని ఉపదేశించాడు, గుణాధికులైన వారిచేత గ్రహింపబడి అనుష్ఠింపబడిన ధర్మం ప్రచారమవుతుందని. భగవానుడు ఉపదేశించిన విధంగా ఆ ధర్మాన్ని సర్వజ్ఞుడైన వేదవ్యాసభగవానుడు గీత అనే పేరుతో ఏడువందల శ్లోకాలలో గ్రంథస్థం చేశాడు.

**3. తత్ ఇదం గీతాశాస్త్రం సమస్త వేదార్థసార సంగ్రహభూతం దుర్విజ్ఞేయార్థం తదర్థా- విష్కరణాయ అనేకైః వివృతపదపదార్థవాక్యార్థన్యాయమ్ అపి అత్యన్తవిరుద్ధానేకార్థత్వేన లౌకికైః గృహ్యమాణం ఉపలభ్య అహం వివేకతః అర్థనిర్ధారణార్థం సంక్షేపతః వివరణం కరిష్యామి.**

**తె.అ.** అటువంటి ఈ గీతాశాస్త్రం సమస్తవేదార్థ సారసంగ్రహం. కాని అర్థం చేసుకోవడం కష్టం. ఆ అర్థాన్ని వివరించడానికి అనేకులు పదచ్ఛేద, పదార్థ, వాక్యార్థ ఆక్షేప, సమాధానాలతో వ్యాఖ్యలు వ్రాశారు. అయినా లౌకికులు అత్యంత విరుద్ధమైన అనేకార్థాలు గ్రహిస్తూ ఉండడం చూసి వివేకంతో అర్థ నిర్ధారణం చేయడంకొరకు నేను సంక్షేపంగా వివరిస్తున్నాను.

**4. తస్య అస్య గీతాశాస్త్రస్య సంక్షేపతః ప్రయోజనం పరం నిశ్శ్రేయసం సహేతుకస్య సంసారస్య అత్యంతోపరమలక్షణమ్ తచ్చ సర్వకర్మసంన్యాసపూర్వకాత్ ఆత్మజ్ఞాననిష్ఠారూపాత్ ధర్మాత్ భవతి. తథా ఇమం ఏవం గీతార్థం ధర్మం ఉద్దిశ్య భగవతా ఏవ ఉక్తమ్ –**

> **'స హి ధర్మః సుపర్యాప్తో బ్రహ్మణః పదవేదనే'**
> **(మ.భా.అశ్వ. 16.12) ఇతి అనుగీతాసు. తత్రైవ చ ఉక్తమ్.**
> **'నైవ ధర్మీ న చాధర్మీ న చైవ హి శుభాశుభీ' (మ.భా. అశ్వ.19.7)**
> **'యః స్యాదేకాసనే లీనః తూష్ణీం కిఞ్చిదచిన్తయన్' (మ.భా.అశ్వ.19.1)**
> **'జ్ఞానం సంన్యాసలక్షణమ్' (మ.భా.అశ్వ.43.25) ఇతి చ. ఇహాపి అన్తే ఉక్తం అర్జునాయ–**
> **'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ' (18.66) ఇతి.**

**తె.అ.** ఒక్కమాటలో చెప్పాలంటే, ఈ గీతాశాస్త్ర ప్రయోజనం పరమనిశ్శ్రేయసం (మోక్షం). అంటే వేటి కారణంగా సంసారం సాగుతూ ఉన్నదో ఆ కారణాలతో సహా సంసారం ఆగిపోవడం. అది సర్వకర్మ సంన్యాసపూర్వక ఆత్మజ్ఞాననిష్ఠారూపధర్మం వలన కలుగుతుంది. ఈ గీతార్థ ధర్మాన్నే ఉద్దేశించి స్వయంగా భగవానుడే అనుగీతలయందు 'బ్రహ్మపదమును తెలుసుకొనుటకు (గీతలో చెప్పిన) ఆ ధర్మము సుసమర్థము' (మ.భా.అశ్వ.16.12) అన్నాడు. మరొకచోట ఇట్లాకూడా అన్నాడు. 'ఎవడు ధర్మంకాని అధర్మంకాని చేయడో ఎవనికి శుభము అశుభములు లేవో', (మ.భా.అశ్వ. 19.7) 'ఎవడైతే ఏ చింతనా లేక తూష్ణీంభావంతో బ్రహ్మమందు లీనమై ఉంటాడో' (మ.భా.అశ్వ.19.1) అని. 'జ్ఞానం సర్వకర్మ సంన్యాసలక్షణం' (మ.భా.అశ్వ.43.25) అని కూడా అన్నాడు. ఈ గీతాశాస్త్రంలో కూడా చివర అర్జునునితో అన్నాడు. 'సర్వధర్మాలను పరిత్యజించి నన్ను మాత్రమే శరణుపొందు' (18.66) అని.

**5. అభ్యుదయార్థోఽపి యః ప్రవృత్తిలక్షణః ధర్మః వర్ణాన్ ఆశ్రమాంశ్చ ఉద్దిశ్య విహితః స దేవాదిస్థానప్రాప్తిహేతుః అపి సన్, ఈశ్వరార్పణబుద్ధ్యా అనుష్ఠీయమానః సత్త్వశుద్ధయే భవతి ఫలాభిసన్ధివర్జితః. శుద్ధసత్త్వస్య చ జ్ఞాననిష్ఠాయోగ్యతాప్రాప్తిద్వారేణ జ్ఞానోత్పత్తిహేతుత్వేన చ నిశ్శ్రేయసహేతుత్వమ్ అపి ప్రతిపద్యతే. తథా చేమమ్ ఏవ అర్థమ్ అభిసంధాయ వక్ష్యతి – 'బ్రహ్మణ్యాధాయ కర్మాణి' (5.10) 'యోగినః కర్మ కుర్వన్తి సఙ్గం త్యక్త్వాత్మశుద్ధయే' (5.11) ఇతి.**

**తె.అ.** వర్ణాశ్రమాలనుద్దేశించి విధించిన ప్రవృత్తిలక్షణధర్మం అభ్యుదయం కొరకు స్వర్గాది ప్రాప్తికొరకు చెప్పిందే అయినా ఫలాపేక్ష లేకుండా ఈశ్వరార్పణబుద్ధితో అనుష్ఠించినపుడు

సత్త్వశుద్ధి కలుగుతుంది. సత్త్వశుద్ధి కలిగినవానికి జ్ఞాననిష్ఠాయోగ్యత కలిగించి జ్ఞానోత్పత్తికి హేతువై ఆ ప్రవృత్తిరూపధర్మం నిశ్శ్రేయసానికి కూడా కారణమవుతుంది. ఈ అర్థాన్నే దృష్టిలో ఉంచుకుని అంటాడు – 'కర్మలను బ్రహ్మమునందు అర్పించు' (5.20), 'యోగులు సంగరహితులై ఆత్మశుద్ధికొరకు కర్మచేస్తారు' (5.11), అని.

**6. ఇమం ద్విప్రకారం ధర్మం నిశ్శ్రేయసప్రయోజనం పరమార్థతత్త్వం చ వాసుదేవాఖ్యం పరబ్రహ్మాభిధేయభూతం విశేషతః అభివ్యఞ్జయత్ విశిష్టప్రయోజనసమ్బన్ధాభిధేయవత్ గీతాశాస్త్రమ్. యతః తదర్థవిజ్ఞానే సమస్తపురుషార్థసిద్ధిః, అతః తద్వివరణే యత్నః క్రియతే మయా.**

**తె.అ.** ఇటువంటి ద్విప్రకారమైన ధర్మాన్ని వివరించేది ఈ గీతాశాస్త్రం. దీని ప్రయోజనం నిశ్శ్రేయసం. ఈ గీతాశాస్త్రం వాసుదేవుడనే పరబ్రహ్మరూప పరమార్థతత్త్వాన్ని విశేషంగా ప్రకటిస్తుంది. కనుక ఈ శాస్త్రం విశిష్టమైన ప్రయోజనం సంబంధం విషయం కలది. దీని అర్థం తెలుసుకుంటే ధర్మార్థకామమోక్షాలనే సమస్త పురుషార్థాలు సిద్ధిస్తాయి. కనుక దీన్ని వివరించడానికి ప్రయత్నిస్తున్నాను.



# ప్రథమోఽధ్యాయః

# అర్జునవిషాదయోగః

**ధృతరాష్ట్ర ఉవాచ –**

**మూ. ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః ।**
**మామకాః పాణ్డవాశ్చైవ కిమకుర్వత సంజయ ॥ 1**

ధృతరాష్ట్రుడు అన్నాడు –

**తె.అ.** సంజయా, ధర్మక్షేత్రమైన కురుక్షేత్రంలో యుద్ధం చేయడం కొరకు కూడిన నావారు, పాండవులు ఏమి చేశారు?

**సంజయ ఉవాచ –**

**మూ. దృష్ట్వా తు పాణ్డవానీకం వ్యూఢం దుర్యోధనస్తదా ।**
**ఆచార్యముపసంగమ్య రాజా వచనమబ్రవీత్ ॥ 2**

సంజయుడు అన్నాడు –

**తె.అ.** అప్పుడు వ్యూహంగా అమర్చబడిన పాండవసైన్యాన్ని చూచి రాజు దుర్యోధనుడు ద్రోణాచార్యులను సమీపించి ఇట్లా అన్నాడు.

**మూ. పశ్యైతాం పాణ్డుపుత్రాణామాచార్య మహతీం చమూమ్ ।**
**వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా ॥ 3**

**తె.అ.** ఆచార్యా! బుద్ధిశాలి అయిన నీ శిష్యుడు ద్రుపద పుత్రుడు వ్యూహంగా పన్నిన పాండవుల మహాసైన్యాన్ని చూడు.

**మూ. అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి ।**
**యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః ॥ 4**

**మూ. ధృష్టకేతుశ్చేకితానః కాశిరాజశ్చ వీర్యవాన్ ।**
**పురుజిత్ కున్తిభోజశ్చ శైబ్యశ్చ నరపుఙ్గవః ॥ 5**

**మూ. యుధామన్యుశ్చ విక్రాన్త ఉత్తమౌజాశ్చ వీర్యవాన్ ।**
**సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః ॥ 6**

**తె.అ.** యుద్ధంలో భీమార్జునులతో సమానమైనవారు శూరులు గొప్ప విల్లులు ధరించి యీ సైన్యంలో వున్నారు – యుయుధానుడు, విరాటుడు, ద్రుపదుడు, ధృష్టకేతుడు, చేకితానుడు, కాశీరాజు, పురుజిత్తు, కుంతిభోజుడు, శైబ్యుడు, యుధామన్యుడు, ఉత్తమౌజుడు, అభిమన్యుడు, ద్రౌపదేయులు – వీరందరూ మహారథులే.

**మూ. అస్మాకం తు విశిష్టా యే తాన్నిబోధ ద్విజోత్తమ ।**
**నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే ॥ 7**

**తె.అ.** బ్రాహ్మణోత్తమా, యిక మనవారిలోని శ్రేష్ఠులను నా సైన్యంలోని నాయకులను నీకు గుర్తు కొరకు చెపుతాను. తెలుసుకొనుము.

**మూ. భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః ।**
**అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తిర్జయద్రథః ॥ 8**
**మూ. అన్యే చ బహవః శూరాః మదర్థే త్యక్తజీవితాః ।**
**నానాశస్త్రప్రహరణాః సర్వే యుద్ధవిశారదాః ॥ 9**

**తె.అ.** తమరు, భీష్ముడు, కర్ణుడు, యుద్ధాలు గెలిచే కృపాచార్యుడు, అశ్వత్థామ, వికర్ణుడు, సోమదత్తుని కుమారుడు భూరిశ్రవుడు, జయద్రధుడు యింకా యితరులనేకులు నానావిధాలైన శస్త్రాస్త్రధారులు, యుద్ధవిశారదులు అందరూ నా కోసం ప్రాణాలు వదలడానికి సిద్ధమై వచ్చివున్నారు.

**మూ. అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్ ।**
**పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభిరక్షితమ్ ॥ 10**

**తె.అ.** భీష్మునిచేత రక్షింపబడుతున్న మన సైన్యం అపారమైనది. భీమునిచేత రక్షింపబడుతున్న యీ పాండవసైన్యం అల్పమైనది.

**మూ. అయనేషు చ సర్వేషు యథాభాగమవస్థితాః ।**
**భీష్మమేవాభిరక్షన్తు భవన్తః సర్వ ఏవ హి ॥ 11**

**తె.అ.** అన్ని వ్యూహాలలో మీరంతా నియమించిన స్థానాలలో వుండి భీష్ముణ్ణి మాత్రం బాగా కాపాడండి.

**మూ. తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః ।**
**సింహనాదం వినద్యోచ్చైః శఙ్ఖం దధ్మౌ ప్రతాపవాన్ ॥ 12**

**తె.అ.** ఆ దుర్యోధనునకు ఆనందాన్ని, ఉత్సాహాన్ని కలిగిస్తూ కురువృద్ధుడు, ప్రతాపశాలి అయిన భీష్ముడు సింహనాదం చేసి శంఖం పూరించాడు.

**మూ. తతః శఙ్ఖాశ్చ భేర్యశ్చ పణవానకగోముఖాః ।**
**సహసైవాభ్యహన్యన్త స శబ్దస్తుములోఽభవత్ ॥ 13**

**తె.అ.** అటుపిమ్మట శంఖములు, భేరీలు, పణవములు, తప్పెటలు, రణభేరులు ఒక్కసారిగా మ్రోగాయి. ఆ శబ్దం పాండవసైన్యానికి భీతి కలిగించింది.

**మూ. తతః శ్వేతైర్హయైర్యుక్తే మహతి స్యన్దనే స్థితౌ ।**
**మాధవః పాణ్డవశ్చైవ దివ్యౌ శఙ్ఖౌ ప్రదధ్మతుః ॥ 14**

**తె.అ.** ఆ తరువాత తెల్లని గుర్రాలు పూన్చిన గొప్ప రథంలో ఉన్న శ్రీకృష్ణుడు అర్జునుడు దివ్య శంఖాలను పూరించారు.

**మూ. పాఞ్చజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః ।**
**పౌణ్డ్రం దధ్మౌ మహాశఙ్ఖం భీమకర్మా వృకోదరః ॥ 15**

**తె.అ.** శ్రీకృష్ణుడు పాంచజన్యాన్ని, అర్జునుడు దేవదత్తాన్ని, భయంకరమైన పనులు చేయగల భీముడు పౌండ్రాన్ని పూరించారు.

**మూ. అనన్తవిజయం రాజా కున్తీపుత్రో యుధిష్ఠిరః ।**
**నకులః సహదేవశ్చ సుఘోషమణిపుష్పకౌ ॥ 16**

**తె.అ.** యుధిష్ఠిరుడు అనంతవిజయము, నకులుడు సుఘోషము, సహదేవుడు మణిపుష్పకము అనే శంఖాలను పూరించారు.

**మూ. కాశ్యశ్చ పరమేష్వాసః శిఖణ్డీ చ మహారథః ।**
**ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకిశ్చాపరాజితః ॥ 17**
**మూ. ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే ।**
**సౌభద్రశ్చ మహాబాహుః శఙ్ఖాన్ దధ్ముః పృథక్ పృథక్ ॥ 18**

**తె.అ.** మహారాజా ! గొప్ప ధనుస్సు గల కాశీరాజు, మహారథుడైన శిఖండీ, ధృష్టద్యుమ్నుడు, విరాటుడు, ఓటమి ఎరుగని సాత్యకి, ద్రుపదుడు, ద్రౌపది కుమారులు, గొప్ప బాహువులు గల అభిమన్యుడు, అన్నివైపుల నుండి వేరువేరుగా శంఖాలను పూరించారు.

**మూ. స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్ ।**
**నభశ్చ పృథివీం చైవ తుములో వ్యనునాదయన్ ॥ 19**

**తె.అ.** ఆ మహాధ్వని ఆకాశాన్నీ, భూమినీ ప్రతిధ్వనింపచేస్తూ కౌరవాదుల గుండెలను బద్దలు చేసింది.

**మూ. అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః ।**
**ప్రవృత్తే శస్త్రసంపాతే ధనురుద్యమ్య పాణ్డవః ॥ 20**
**మూ. హృషీకేశం తదా వాక్యమిదమాహ మహీపతే ।**

**తె.అ.** మహారాజా, ఆ సమయంలో కపిధ్వజుడైన అర్జునుడు యుద్ధానికి సిద్ధంగా ఉన్న కౌరవ సైన్యాన్ని చూసి, ఇక ఆయుధ ప్రయోగం జరుగబోతున్నదనగా, విల్లును ఎక్కుపెట్టి శ్రీకృష్ణునితో ఇట్లా అన్నాడు.

**అర్జున ఉవాచ -**
**సేనయోరుభయోర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత । 21**
**మూ. యావదేతాన్నిరీక్షేఽహం యోద్ధుకామానవస్థితాన్ ।**
**కైర్మయా సహ యోద్ధవ్యమస్మిన్ రణసముద్యమే ॥ 22**

అర్జునుడంటున్నాడు -
**తె.అ.** అచ్యుతా, రెండు సేనల మధ్య నా రథము నిలుపు. ఎవరితో నేను యుద్ధం చేయవలెనో, యుద్ధకాములై వచ్చినవారెవరో వారిని చూస్తాను.

**మూ. యోత్స్యమానానవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః ।**
**ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేర్యుద్ధే ప్రియచికీర్షవః ॥ 23**

**తె.అ.** దుర్బుద్ధి అయిన దుర్యోధనునికి ప్రియం కలిగించడం కొరకు యుద్ధం చేయడానికి ఇక్కడ చేరిన వారిని చూస్తాను.

**సంజయ ఉవాచ -**
**మూ. ఏవముక్తో హృషీకేశో గుడాకేశేన భారత ।**
**సేనయోరుభయోర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్ ॥ 24**
**మూ. భీష్మద్రోణప్రముఖతః సర్వేషాం చ మహీక్షితామ్ ।**
**ఉవాచ పార్థ పశ్యైతాన్ సమవేతాన్ కురూనితి ॥ 25**

సంజయుడు అన్నాడు –

**తె.అ.** అర్జుననిచేత ఈ విధంగా చెప్పబడినవాడై శ్రీకృష్ణుడు రథాన్ని రెండు సేనల మధ్య భీష్మద్రోణుల మరియు అందరు రాజుల ఎదుట నిలిపి 'అర్జునా ! యిక్కడ చేరిన కౌరవులను చూడు' అని అన్నాడు.

**మూ. తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄనథ పితామహాన్ ।**
**ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్ పౌత్రాన్సఖీంస్తథా ॥ 26**

**మూ. శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయోరుభయోరపి ।**
**తాన్ సమీక్ష్య స కౌన్తేయః సర్వాన్ బన్ధూనవస్థితాన్ ॥ 27**

**తె.అ.** అప్పుడు అర్జునుడు ఇరుసేనలలోను ఉన్న తండ్రులను తాతలను, ఆచార్యులను, మేనమామలను, అన్నదమ్ములను, పుత్రులను, మనుమలను, సఖులను, మామలను, మిత్రులను చూచాడు.

**మూ. కృపయా పరయాఽఽవిష్టో విషీదన్నిదమబ్రవీత్ ।**
**దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితమ్ ॥ 28**

**తె.అ.** అక్కడ చేరిన బంధువులనందరినీ చూచి అర్జునుడు మిక్కిలి జాలిపడినవాడై దుఃఖిస్తూ ఈ విధముగా అన్నాడు.

**అర్జున ఉవాచ –**

**మూ. సీదన్తి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి ।**
**వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే ॥ 29**

అర్జునుడు అంటున్నాడు –

**తె.అ.** కృష్ణా ! యుద్ధం చేయడం కొరకు ఇక్కడ చేరిన ఈ స్వజనాన్ని చూచి నా అవయవాలు పట్టు తప్పిపోతున్నాయి. నోట తడి ఆరిపోతున్నది. శరీరం వణుకుతున్నది. గగుర్పాటు కూడా కలుగుతున్నది.

**మూ. గాణ్డీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే ।**
**న చ శక్నోమ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః ॥ 30**

**తె.అ.** చేతి నుండి గాండీవం జారిపోతున్నది, చర్మం కాలిపోతున్నది. మనసు గిర్రున తిరుగుతున్నట్లున్నది. నిలువలేకుండా ఉన్నాను.

**మూ. నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ ।**
**న చ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజనమాహవే ॥ 31**

**తె.అ.** కేశవా! విపరీతమైన అపశకునాలు తోస్తున్నాయి. అదీ కాక యుద్ధంలో స్వజనాన్ని చంపడంలో ఏ మేలూ నాకు కనిపించడంలేదు.

**మూ. న కాఙ్క్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖాని చ ।**
**కిం నో రాజ్యేన గోవిన్ద కిం భోగైర్జీవితేన వా ॥ 32**

**తె.అ.** కృష్ణా! నాకు విజయం వద్దు, రాజ్యం వద్దు, సుఖాలు వద్దు. గోవిందా, రాజ్యం కాని, భోగాలు కాని, చివరికి జీవితం కాని, ఏం చేసుకోను?

**మూ. యేషామర్థే కాఙ్క్షితం నో రాజ్యం భోగాః సుఖాని చ ।**
**త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాంస్త్యక్త్వా ధనాని చ ॥ 33**

**తె.అ.** ఎవరితో కలిసి అనుభవించాలని మనం రాజ్యము, భోగాలు, సుఖాలు కోరుకుంటామో అట్టి బంధుజనం అంతా ప్రాణాలపై, ధనంపై ఆశ వదలుకుని ఇక్కడ ఉన్నారు.

**మూ. ఆచార్యాః పితరః పుత్రాస్తథైవ చ పితామహాః ।**
**మాతులాః శ్వశురాః పౌత్రాః శ్యాలాః సంబన్ధినస్తథా ॥ 34**
**మూ. ఏతాన్న హన్తుమిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన ।**
**అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిం ను మహీకృతే ॥ 35**

**తె.అ.** ఆచార్యులు, తండ్రులు, పుత్రులు, తాతలు, మేనమామలు, మామలు, మనుమలు, బావమరుదులు - బంధువులు వీరిని నేను ప్రాణాలు పోయినా యీ భూమి కొరకు గాదు గదా ముల్లోకరాజ్యం కొరకు గూడ చంపను.

**మూ. నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతిః స్యాజ్జనార్దన ।**
**పాపమేవాశ్రయేదస్మాన్ హత్వైతానాతతాయినః ॥ 36**

**తె.అ.** జనార్దనా! ధృతరాష్ట్రుని సంతానాన్ని చంపితే మాకేమి సంతోషం కలుగుతుంది? ఈ పాపాత్ములను చంపినందువల్ల మాకు పాపమే చుట్టుకుంటుంది.

**మూ. తస్మాన్నార్హా వయం హన్తుం ధార్తరాష్ట్రాన్ సబాన్ధవాన్ ।**
**స్వజనం హి కథం హత్వా సుఖినః స్యామ మాధవ ॥ 37**

**తె.అ.** కనుక మన బంధువులైన కౌరవులను మేము చంపరాదు. మాధవా! స్వజనాన్ని చంపుకుని మేము ఎట్లా సుఖంగా వుండగలము ?

**మూ. యద్యప్యేతే న పశ్యన్తి లోభోపహతచేతసః ।**
**కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకమ్ ॥ 38**

**మూ. కథం న జ్ఞేయమస్మాభిః పాపాదస్మాన్నివర్తితుమ్ ।**
**కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భిర్జనార్దన ॥ 39**

**తె.అ.** ఈ దుర్యోధనాదులు రాజ్యలోభం చేత యుక్తాయుక్త జ్ఞానములేని మనస్సు కలవారై యుద్ధ పరిణామంగా కలిగే కులక్షయం, దాని వల్ల కలిగే దోషము, మిత్రద్రోహం వల్ల కలిగే పాపము చూడలేకపోవచ్చు. చూడగలిగిన మేము తెలిసి కూడా ఈ పాపకర్మనుండి తప్పుకోకుండా ఎట్లా వుండగలం?

**మూ కులక్షయే ప్రణశ్యన్తి కులధర్మాః సనాతనాః ।**
**ధర్మే నష్టే కులం కృత్స్నమధర్మోఽభిభవత్యుత ॥ 40**

**తె.అ.** కులనాశనం వల్ల సనాతన కులధర్మాలు నశిస్తాయి. ధర్మం నశించిన తరువాత అధర్మం కులాన్నంతా అణచివేస్తుంది.

**మూ. అధర్మాభిభవాత్ కృష్ణ ప్రదుష్యన్తి కులస్త్రియః ।**
**స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః ॥ 41**

**తె.అ.** కృష్ణా! అధర్మవ్యాప్తి చేత కుల స్త్రీలు చెడిపోతారు. స్త్రీలు చెడిపోతే వర్ణసంకరం కలుగుతుంది.

**మూ. సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ ।**
**పతన్తి పితరో హ్యేషాం లుప్తపిణ్డోదకక్రియాః ॥ 42**

**తె.అ.** సంకరం వల్ల కుల నాశనం చేసినవారికి, కులమునకు కూడా నరకమే గతి. వీరి పితరులు పిండోదక క్రియలు లేక అధోగతి చెందుతారు.

**మూ. దోషైరేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః ।**
**ఉత్సాద్యన్తే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః ॥ 43**

**తె.అ.** కులాన్ని నాశనం చేసి యీ వర్ణసంకరానికి కారకులైనవారి దోషానికి జాతి కులధర్మాలు శాశ్వతంగా నాశనమవుతాయి.

**మూ. ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన ।**
**నరకే నియతం వాసో భవతీత్యనుశుశ్రుమ ॥ 44**

**తె.అ.** జనార్దనా! కులధర్మాలు నష్టమైన మనుష్యులకు నరకవాసం తప్పదని వింటుంటాము.

**మూ. అహో బత మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్ ।**
**యద్రాజ్యసుఖలోభేన హన్తుం స్వజనముద్యతాః ॥ 45**

**తె.అ.** అయ్యో! ఎంత కష్టము ! మేమెంత పాపానికి పూనుకున్నాము! రాజ్యసుఖలోభం చేత స్వజనాన్ని చంపడానికి సిద్ధమైనాము.

**మూ. యది మామప్రతీకారమశస్త్రం శస్త్రపాణయః ।**
**ధార్తరాష్ట్రా రణే హన్యుస్తన్మే క్షేమతరం భవేత్ ॥ 46**

**తె.అ.** ఆయుధం వదలివేసి ప్రతీకారం చేయబోని నన్ను ఆయుధాలు ధరించి ధృతరాష్ట్ర కుమారులు యుద్ధంలో చంపినా నాకు మేలే.

**సంజయ ఉవాచ -**

**మూ. ఏవముక్త్వార్జునః సంఖ్యే రథోపస్థ ఉపావిశత్ ।**
**విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః ॥ 47**

సంజయుడు అంటున్నాడు -

**తె.అ.** అర్జునుడు యుద్ధభూమిలో ఈ విధంగా అని శోకం చేత వ్యాకులమైన మనసుతో విల్లును అమ్ములను వదలి వేసి రథం మీద కూర్చుండిపోయాడు.

**ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే అర్జునవిషాదయోగో నామ ప్రథమోఽధ్యాయః.**

ఇది వ్యాస విరచితమైన శతసహస్ర సంహిత అయిన శ్రీమహాభారతంలో భీష్మ పర్వంలో శ్రీకృష్ణార్జున సంవాద రూపము, యోగశాస్త్రము, ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య అయిన శ్రీమద్భగవద్గీతల యందు అర్జునవిషాదయోగమనే ఒకటవ అధ్యాయానికి తెలుగు అనువాదం.



# ద్వితీయోఽధ్యాయః

# సాంఖ్యయోగః

**సంజయ ఉవాచ –**

**మూ. తం తథా కృపయావిష్టమశ్రుపూర్ణాకులేక్షణమ్ ।**
**విషీదన్తమిదం వాక్యమువాచ మధుసూదనః ॥ 1**

సంజయుడు అంటున్నాడు –

**తె.అ.** అర్జునుణ్ణి జాలి ఆవేశించింది. అతని కళ్ళు కన్నీటితో నిండి కలతపడిఉన్నాయి. అతడు దిగులుతో వున్నాడు. ఆ స్థితిలో వున్న అర్జునునితో శ్రీకృష్ణుడు ఈ మాటలంటున్నాడు.

**శ్రీ భగవానువాచ –**

**మూ. కుతస్త్వా కశ్మలమిదం విషమే సముపస్థితమ్ ।**
**అనార్యజుష్టమస్వర్గ్యమకీర్తికరమర్జున ॥ 2**

శ్రీ భగవానుడంటున్నాడు –

**తె.అ.** అర్జునా! ఈ సంకట సమయంలో నీకు ఈ మోహం ఎక్కడనుండి వచ్చిపడింది? ఇది ఆర్యులకు రాకూడనిది, స్వర్గప్రాప్తికి అడ్డు, అపకీర్తిని కూడా తెచ్చిపెడుతుంది.

**మూ. క్లైబ్యం మా స్మ గమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే ।**
**క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప ॥ 3**

**తె.అ.** శత్రువులను తపింపచేసే అర్జునా, పిరికితనం పొందకు. అది నీకు తగదు. నీచమైన అధైర్యమును వదిలి లేచి నిలువుము.

**అర్జున ఉవాచ –**

**మూ. కథం భీష్మమహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన ।**
**ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హావరిసూదన ॥ 4**

అర్జునుడు అంటున్నాడు –

**తె.అ.** మధుసూదనా! శత్రువులను నశింపజేయువాడా, పూజింపదగిన భీష్మద్రోణులను ఎట్లా నేను యుద్ధంలో బాణాలతో ఎదిరించగలను?

**మూ. గురూనహత్వా హి మహానుభావాన్ శ్రేయో భోక్తుం భైక్ష్యమపీహ లోకే ।**
**హత్వార్థకామాంస్తు గురూనిహైవ భుఞ్జీయ భోగాన్ రుధిరప్రదిగ్ధాన్ ॥ 5**

**తె.అ.** పెద్దలను చంపి నెత్తుటితో తడిసిన అర్థకామ భోగాలను ఈ లోకంలోనే అనుభవించినవాణ్ణి అవుతాను. మహానుభావులైన పెద్దలను చంపడం కంటే ఈ లోకంలో బిచ్చమెత్తుకుని బ్రతకడం మేలు.

**మూ. న చైత ద్విద్మః కతరన్నో గరీయో యద్వా జయేమ యది వా నో జయేయుః ।**
**యానేవ హత్వా న జిజీవిషామ స్తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః ॥ 6**

**తె.అ.** యుద్ధంలో వారిని మనం జయించడమా మనల్ని వారు జయించడమా ఏది మేలో కూడా మనకు తెలియడం లేదు. ఎవరిని చంపిన తరువాత మనకు జీవించి ఉండవలెనన్న కోర్కెకూడా ఉండదో ఆ ధృతరాష్ట్ర కుమారులు ఎదుట నిలిచి ఉన్నారు.

**మూ. కార్పణ్యదోషోపహతస్వభావః పృచ్ఛామి త్వాం ధర్మసంమూఢచేతాః ।**
**యచ్ఛ్రేయః స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్ ॥7**

**తె.అ.** మనసు చెదరి నా శౌర్య స్వభావం దెబ్బతిన్నది. ఏది ధర్మమో తెలియలేని సంశయచిత్తంతో నిన్ను అడుగుతున్నాను. ఏది మేలో నిశ్చయించి నాకు చెప్పు. నీ శిష్యుణ్ణి. నీ శరణుజొచ్చినాను. నన్ను శాసించు.

**మూ. న హి ప్రపశ్యామి మమాపనుద్యా ద్యచ్ఛోకముచ్ఛోషణమిన్ద్రియాణామ్ ।**
**అవాప్య భూమావసపత్నమృద్ధం రాజ్యం సురాణామపి చాధిపత్యమ్ ॥ 8**

**తె.అ.** ఈ భూమి మీద శత్రువులు మిగలని సమృద్ధమైన రాజ్యం పొందినా, పై లోకంలో దేవేంద్రపదవి పొందినా, అవి ఇంద్రియాలను పనిచేయకుండా చేస్తున్న నా ఈ శోకం నివారించగలవని నాకు అనిపించడం లేదు.

**సంజయ ఉవాచ –**

**మూ. ఏవముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతపః ।**
**న యోత్స్య ఇతి గోవిన్దముక్త్వా తూష్ణీం బభూవ హ ॥ 9**

సంజయుడు అంటున్నాడు

**తె.అ.** హృషీకేశునితో ఈ విధంగా అని శత్రువులను తపింపజేసే అర్జునుడు యుద్ధం చెయ్యను అని మాట్లాడకుండా ఊరకున్నాడు.

**మూ. తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత ।**
**సేనయోరుభయోర్మధ్యే విషీదన్తమిదం వచః ॥ 10**

**తె.అ.** రాజా! ఉభయ సేనలమధ్య దిగులుపడి వున్న అతనితో శ్రీకృష్ణుడు పరిహసిస్తున్నట్లుగా ఈ మాటలన్నాడు.

**భాష్యమ్ : 11.0.1. అత్ర "దృష్ట్వా తు పాండవానీకమ్" (1.2) ఇతి ఆరభ్య యావత్ న యోత్స్య ఇతి గోవిన్దముక్త్వా తూష్ణీం బభూవ హ" (2.9) ఇత్యేతదంతః ప్రాణినాం శోకమోహాది సంసారబీజభూతదోషోద్భవ కారణ ప్రదర్శనార్థత్వేన వ్యాఖ్యేయః గ్రన్థః. తథా హి – అర్జునేన రాజ్యగురుపుత్రమిత్రసుహృత్స్వజన సంబన్ధిబాన్ధవేషు "అహమ్ ఏషామ్" "మమ ఏతే" ఇత్యేవం భ్రాన్తిప్రత్యయనిమిత్తస్నేహవిచ్ఛేదాది నిమిత్తౌ ఆత్మనః శోకమోహౌ ప్రదర్శితౌ – "కథం భీష్మమహం సంఖ్యే" (2.4) ఇత్యాదినా. శోకమోహాభ్యాం హి అభిభూతవివేకవిజ్ఞానః స్వత ఏవ క్షత్రధర్మే యుద్ధే ప్రవృత్తోఽపి తస్మాత్ యుద్ధాత్ ఉపరరామ. పరధర్మం చ భిక్షాజీవనాదికం కర్తుం ప్రవవృతే.**

**తథా చ సర్వప్రాణినాం శోకమోహాది దోషావిష్ట చేతసాం స్వభావతః ఏవ స్వధర్మపరిత్యాగః ప్రతిషిద్ధ సేవా చ స్యాత్. స్వధర్మే ప్రవృత్తానామపి తేషాం వాఙ్మనః కాయాదీనాం ప్రవృత్తిః ఫలాభిసంధిపూర్వికా ఏవ సాహంకారా చ భవతి. తత్ర ఏవం సతి ధర్మాధర్మోపచయాత్ ఇష్టానిష్ట– జన్మ సుఖదుఃఖప్రాప్తిలక్షణః సంసారః అనుపరతః భవతి. ఇత్యతః సంసార బీజభూతౌ శోకమోహౌ. తయోశ్చ సర్వకర్మసంన్యాసపూర్వకాత్ ఆత్మజ్ఞానాత్ నాన్యతః నివృత్తిః ఇతి తత్ ఉపదిదిక్షుః సర్వలోకానుగ్రహార్థమ్ అర్జునం నిమిత్తీకృత్య ఆహ భగవాన్ వాసుదేవః – అశోచ్యానిత్యాది.**

**తె.అ.** ఇక్కడ "దృష్ట్వా తు పాండవానీకమ్" (1.2) అనే శ్లోకం మొదలుకొని "న యోత్స్య ఇతి గోవిన్దముక్త్వా తూష్ణీం బభూవ హ" (2.9) వరకు గల గ్రంథాన్ని ఇట్లా వ్యాఖ్యానించాలి: శోకము, మోహము మొదలైనవి సంసారానికి బీజభూతమైన దోషాలు. ఆ శోకమోహాలు పుట్టడానికి గల కారణాన్ని చూపడానికి ఈ ప్రకరణం, అని. కనుకనే అర్జునుడు రాజ్య గురు పుత్రమిత్ర స్వజన బాంధవులయందు నేను వీళ్ళవాడను వీళ్ళు నా వాళ్ళు అన్న భ్రాంతి చేత, వీరు నాకిక ఉండరు అని స్నేహవిచ్ఛేద నిమిత్తమైన శోకమోహాలు ప్రదర్శించాడు, "నేను భీష్మద్రోణులను యుద్ధంలో బాణాలతో ఎట్లా ఎదురించగలను?" (2.4) అంటూ. శోకమోహాలచేత వివేక విజ్ఞానాలు అణగి, సహజంగా క్షాత్రధర్మమైన యుద్ధమందు ప్రవృత్తి కలిగినవాడు నేను యుద్ధం చేయను అన్నాడు. అంతే కాకుండా పరధర్మమైన భిక్షాజీవనం చేస్తాననీ అంటున్నాడు.

ఇదే విధంగా, శోకమోహాలు కలిగిన సర్వప్రాణులకు స్వధర్మాన్ని వదలడం వైరుధ్య ధర్మాన్ని ఆచరించడం స్వాభావికం అవుతున్నది. స్వధర్మం ఆచరించే వారిలో కూడా మనోవాక్కాయ ప్రవృత్తి కర్మఫలానికి అంటుకునే ఉంటున్నది. ఈ విధంగా ధర్మము, అధర్మము కూడా పెరుగుతూ ఉండడం చేత ఇష్టానిష్టాలు, సుఖదుఃఖాలు సంప్రాప్తించే ఈ సంసారం తొలగదు. కనుకనే శోకమోహాలు సంసారానికి బీజం వంటివి. సర్వకర్మ సంన్యాస పూర్వకమైన ఆత్మజ్ఞానం వల్లనే ఈ శోకమోహాలు తొలగుతాయి. మరేవిధంగానూ కాదు అని ఉపదేశించే కోరికతో భగవానుడు అర్జునుని నిమిత్తంగా చేసుకుని సర్వలోకాన్ని అనుగ్రహించడం కొరకు 'అశోచ్యాన్' మొదలుగాగల శ్లోకాలలో అంటున్నాడు.

**భాష్యమ్ : 11.0.2 అత్ర కేచిత్ ఆహుః - సర్వకర్మసంన్యాసపూర్వకాత్ ఆత్మజ్ఞాననిష్ఠామాత్రాత్ ఏవ కేవలాత్ కైవల్యం న ప్రాప్యతే ఏవ. కిం తర్హి? అగ్నిహోత్రాది శ్రౌతస్మార్త కర్మ సహితాత్ జ్ఞానాత్ కైవల్యప్రాప్తిః ఇతి సర్వాసు గీతాసు నిశ్చితః అర్థః ఇతి. జ్ఞాపకం చ ఆహుః అస్య అర్థస్య- "అథ చేత్త్వమిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి" (2.33), "కర్మణ్యేవాధికారస్తే" (2.47), "కురు కర్మైవ తస్మాత్త్వమ్" (4.15) ఇత్యాది.హింసాది యుక్తత్వాత్ వైదిక కర్మ అధర్మాయ ఇతి ఇయమ్ అపి ఆశంకా న కార్యా. కథమ్? క్షాత్రం కర్మ యుద్ధలక్షణం గురుభ్రాతృపుత్రాది హింసాలక్షణం అత్యంతక్రూరమ్ అపి స్వధర్మః ఇతి కృత్వా న అధర్మాయ; తదకరణే చ - "తతః స్వధర్మం కీర్తిం చ హిత్వా పాపమవాప్స్యసి" (2.33). ఇతి బ్రువతా యావజ్జీవాది శ్రుతి చోదితానాం పశ్వాదిహింసా- లక్షణానాం చ కర్మణాం ప్రాగేవ న అధర్మత్వమితి సునిశ్చితం ఉక్తం భవతి - ఇతి.**

**తె.అ.** ఇక్కడ కొందరంటారు, కేవలం సర్వకర్మ సంన్యాసపూర్వకమైన ఆత్మజ్ఞాన నిష్ఠామాత్రం చేత కైవల్యం ప్రాప్తించదు, అగ్నిహోత్రాది శ్రౌత స్మార్త కర్మ సహితమైన జ్ఞానం చేత కైవల్యప్రాప్తి అనేది గీతయొక్క నిశ్చితార్థం అని. ఇందుకు ప్రమాణంగా "ఈ ధర్మయుద్ధం నీవు చేయకపోతే" (2.33), "నీకు కర్మయందే అధికారము" (2.47), "కర్మనే చెయ్యి" (4.25) మొదలైన వాక్యాలు గుర్తు చేస్తారు కూడా. (పైగా ఇట్లా కూడా వాదిస్తారు) వైదికకర్మ హింసాదులతో కూడినది కనుక అధర్మమని సందేహించ పనిలేదు. ఎందుకంటే క్షత్రియులకు యుద్ధం ధర్మం. యుద్ధమంటే గురువులు, సోదరులు, పుత్రులు మొదలైనవారిని హింసించే అతి క్రూరకర్మ, అయినా అటువంటి క్రూరకర్మ స్వధర్మబుద్ధితో చేసినపుడు అధర్మం కాదని, పైగా చేయకపోవడం దోషమనీ అంటున్నాడు భగవానుడు, "స్వధర్మము, కీర్తి కూడా పోగొట్టుకుని పాపం పొందుతావు" (2.33) అని. కనుక యావజ్జీవము చేయవలసినవని వేదం విధించిన కర్మలు, పశువులు మొదలైనవాటి హింసతో కూడినవి చేయడం అధర్మం కాదని భగవానుడు ముందే నిశ్చయించి చెప్పినట్లయింది, అని.

**భాష్యమ్ : 11.0.3. తత్ అసత్; జ్ఞానకర్మనిష్ఠయోః విభాగవచనాత్ బుద్ధిద్వయా- శ్రయయోః. 'అశోచ్యాన్' (2.11) ఇత్యాదినా భగవతా యావత్ 'స్వధర్మమపి చావేక్ష్య' (2.31) ఇత్యేతదంతేన గ్రంథేన యత్పరమార్థాత్మతత్త్వ నిరూపణం కృతమ్, తత్ సాంఖ్యమ్. తద్విషయా బుద్ధిః, ఆత్మనః జన్మాది షడ్విక్రియాభావాత్ అకర్తా ఆత్మా ఇతి ప్రకరణార్థనిరూపణాత్ యా జాయతే, సా సాంఖ్యబుద్ధిః. సా యేషాం జ్ఞానినాం ఉచితా భవతి, తే సాంఖ్యాః, ఏతస్యాః బుద్ధేః జన్మనః ప్రాక్ ఆత్మనః దేహాది వ్యతిరిక్తత్వకర్తృత్వభోక్తృత్వాద్యపేక్షః ధర్మాధర్మవివేక పూర్వకః మోక్షసాధనానుష్ఠాన- లక్షణః యోగః తద్విషయా బుద్ధిః, యోగబుద్ధిః. సా యేషాం కర్మిణాం ఉచితా భవతి తే యోగినః. తథా చ భగవతా విభక్తే ద్వే బుద్ధీ నిర్దిష్టే "ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు" (2.39) ఇతి. తయోశ్చ సాంఖ్యబుద్ధ్యాశ్రయాం జ్ఞానయోగేన నిష్ఠాం సాంఖ్యానాం విభక్తాం వక్ష్యతి - 'పురావేదాత్మనా మయా ప్రోక్తా' (3.3) ఇతి. తథా చ యోగబుద్ధ్యాశ్రయాం కర్మయోగేన నిష్ఠాం విభక్తాం వక్ష్యతి - "కర్మయోగేన యోగినామ్" (3.3) ఇతి. ఏవం సాంఖ్యబుద్ధిం యోగబుద్ధిం చ ఆశ్రిత్య ద్వే నిష్ఠే విభక్తే భగవతా ఏవ ఉక్తే జ్ఞానకర్మణోః కర్తృత్వాకర్తృత్వైకత్వానేకత్వ బుద్ధ్యాశ్రయయోః యుగపత్ ఏకపురుషాశ్రయత్వాసంభవం పశ్యతా.**

**తె.అ.** అది నిజం కాదు. జ్ఞాన నిష్ఠను, కర్మనిష్ఠను వేరుచేసి అవి రెండు విధాలైన బుద్ధులను ఆశ్రయించి ఉంటాయని చెప్పడం చేత. 'అశోచ్యాన్' (2.11) మొదలు "స్వధర్మమపి చావేక్ష్య" (2.31) వరకు గ్రంథంలో ఏ పరమార్థ తత్త్వం నిరూపించబడిందో అది సాంఖ్యం. ఆత్మకు షడ్వికారాలు లేవు. కనుక ఆత్మ అకర్త అని ప్రకరణార్థాన్ని నిరూపించడం చేత కలిగే బుద్ధి సాంఖ్యబుద్ధి. అది ఏ జ్ఞానులకు తగినదో వారు సాంఖ్యులు. ఈ బుద్ధి కలగడానికి ముందు దేహాదులు వేరు ఆత్మవేరు అది కర్త భోక్త అని భావించి ఇది ధర్మం ఇది అధర్మం అనే వివేకంతో మోక్షసాధనానుష్ఠానం చేయడం యోగం. ఆ విషయమైన బుద్ధి యోగబుద్ధి. అది కర్మలు చేసే ఎవరికి యోగ్యమో వారు యోగులు. భగవానుడు ఈ విధంగానే రెండు బుద్ధులను విభజించి నిర్దేశించాడు, "ఇంతవరకు నీకు నేను చెప్పింది సాంఖ్యబుద్ధి. ఇక యోగబుద్ధి విను", (2.39) అని. ఆ రెంటిలో సాంఖ్యబుద్ధిని ఆశ్రయించి జ్ఞానయోగనిష్ఠులైన సాంఖ్యులను వేరుచేసి చెపుతాడు. 'పూర్వం (వేదరూపంలో) నేను చెప్పాను' (3.3) అని. అదే విధంగా యోగబుద్ధిని ఆశ్రయించిన కర్మయోగనిష్ఠులను వేరు చేసి 'కర్మయోగేన యోగినామ్' (3.3) అని చెప్పబోతున్నాడు. 'చేసేది నేను, నేను చెయ్యడంలేదు', 'ఉన్నదంతా ఒకటే, ఒకటి కాదు' వంటి వేరు వేరు బుద్ధులు ఒకేకాలములో ఒకరియందే ఉండడం అసంభవమని గ్రహించిన భగవానుడు సాంఖ్యబుద్ధిని యోగబుద్ధిని ఆశ్రయించి ఉండే రెండు నిష్ఠలను వేరు చేసి చెప్పాడు.

**భాష్యమ్ : 11.0.4 యథా ఏతద్విభాగ వచనం తథైవ దర్శితం శాతపథీయబ్రాహ్మణే – "ఏతమేవ ప్రవ్రాజినో లోకమిచ్ఛన్తో బ్రాహ్మణాః ప్రవ్రజన్తి" ఇతి సర్వకర్మసంన్యాసం విధాయ తచ్ఛేషేణ – "కిం ప్రజయా కరిష్యామో యేషాం నోఽయమాత్మాఽయం లోకః" (బృ.ఉ.4.4.22) ఇతి. తత్రైవ చ ప్రాగ్ దారపరిగ్రహాత్ 'పురుషః' 'ఆత్మా' ప్రాకృతః ధర్మజిజ్ఞాసోత్తరకాలం లోకత్రయసాధనం – పుత్రం, ద్విప్రకారం చ విత్తం – 'మానుషం', 'దైవం చ' ; తత్ర మానుషం కర్మరూపం పితృలోకప్రాప్తిసాధనం, విద్యాం చ దైవం విత్తం దేవలోకప్రాప్తిసాధనం "సోఽకామయత" ఇతి అవిద్యాకామవతః ఏవ సర్వాణి కర్మాణి శ్రౌతాదీని దర్శితాని. తేభ్యః (వ్యుత్థాయ, ప్రవ్రజన్తి ఇతి) వ్యుత్థానమ్ ఆత్మానమ్ ఏవ లోకమ్ ఇచ్ఛతః అకామస్య విహితమ్, తదేతద్విభాగవచనమ్ అనుపపన్నం స్యాత్, యది శ్రౌతకర్మజ్ఞానయోః సముచ్చయః అభిప్రేతః స్యాత్ భగవతః.**

**తె.అ.** శాతపథీయ బ్రాహ్మణంలో కూడా ఇటువంటి విభజన చూడవచ్చు, 'ఆత్మలోకాన్ని కోరే విరాగులైన బ్రాహ్మణులు సంన్యసిస్తారు' (బృ.ఉ. 4.4.22) అని సర్వకర్మ సంన్యాసాన్ని విధించి మిగిలిన వాక్యంలో 'ఈ ఆత్మయే లోకమైన మాకు బిడ్డలతో పనియేమి' (బృ.ఉ. 4.4.22) అని. అదేచోట ఇది కూడ చెప్పబడింది. ప్రాకృతపురుషుడు ధర్మజిజ్ఞాస కలిగిన తరువాత వివాహానికి ముందు మూడు లోకాలను సాధించడానికి అవసరమైన పుత్రుని, మానుషము, దైవమునని రెండువిధాలైన విత్తాన్ని కోరుకున్నాడు. ఇందులో పితృలోక ప్రాప్తికి సాధనా రూపమైన కర్మ మానుషవిత్తము, దేవలోక ప్రాప్తికి సాధనమైన విద్య దేవవిత్తము (బృ.ఉ. 1.4.17) అని. ఈ విధంగా అవిద్య కామము ఉన్నవానికే శ్రౌతాది సర్వకర్మలు అని చెప్పబడింది. 'వానినుండి (కర్మలనుండి) నివృత్తులై సంన్యసిస్తారు' (బృ.ఉ. 4.4.22) అని ఆత్మలోకాన్ని తప్ప మరి దేనిని కోరనివారికి సంన్యాసమే విధించబడింది. శ్రౌతకర్మలతో జ్ఞానాన్ని ముడిపెట్టడమే భగవానుని ఆశయమైతే ఆయన పైన చేసిన విభజనకు అర్థం ఉండదు.

**భాష్యమ్ : 11.0.5. న చ అర్జునస్య ప్రశ్నః ఉపపన్నః భవతి 'జ్యాయసీ చేత్కర్మణస్తే' (3.1) ఇత్యాదిః. ఏక పురుషానుష్ఠేయత్వాసంభవం బుద్ధికర్మణోః భగవతా పూర్వం అనుక్తం కథం అర్జునః అశ్రుతం బుద్ధేశ్చ కర్మణః జ్యాయస్త్వం భగవతి అధ్యారోపయేత్ మృషైవ 'జ్యాయసీ చేత్కర్మణస్తే మతా బుద్ధిః' (3.1) ఇతి.**

**తె.అ.** 'కర్మకంటే జ్ఞానమే శ్రేష్ఠమని నీ అభిప్రాయమైతే' (3.1) అన్న అర్జునుని ప్రశ్నకు తావులేదు కూడా. జ్ఞాన కర్మలను రెంటినీ ఒకడే అనుష్ఠించడం అసంభవమని భగవానుడు చెప్పి ఉండకపోతే అర్జునుడు కర్మకంటె జ్ఞానం గొప్పది అని తాను వినని మాటను భగవానుడికి ఎట్లా అంటగడతాడు. 'కర్మకంటే జ్ఞానం గొప్పది అని నీ అభిప్రాయమైతే' (3.1) అని.

**భాష్యమ్ : 11.0.6. కించ – యది బుద్ధికర్మణోః సర్వేషాం సముచ్చయః ఉక్తః స్యాత్, అర్జునస్యాపి సః ఉక్తః ఏవ ఇతి, "యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్" (5.1) ఇతి కథముభయోః ఉపదేశే సతి అన్యతరవిషయః ఏవ ప్రశ్నః స్యాత్? న హి పిత్తప్రశమనార్థినః వైద్యేన మధురం శీతం చ భోక్తవ్యమ్ ఇతి ఉపదిష్టే "తయోరన్యతరత్పిత్తప్రశమనకారణం బ్రూహి' ఇతి ప్రశ్నః సంభవతి. అథ అర్జునస్య భగవదుక్తవచనార్థవివేకానవధారణనిమిత్తః ప్రశ్నః కల్ప్యతే, తథాఽపి భగవతా ప్రశ్నానురూపం ప్రతివచనం దేయం, "మయా బుద్ధికర్మణోః సముచ్చయః ఉక్తః, కిమర్థమ్ ఇత్థం త్వం భ్రాంతోఽసి" ఇతి. న తు పునః ప్రతివచనమననురూపంపృష్టాత్ అన్యత్ ఏవ 'ద్వే నిష్ఠే మయా పురా ప్రోక్తే' (3.3) ఇతి వక్తుం యుక్తమ్.**

**తె.అ.** జ్ఞానం కర్మలతో ముడిపడే వుంది అని అందరి విషయంగా భగవానుడు చెప్పినప్పుడు అర్జునుని విషయంలో కూడా చెప్పినట్లే. అటువంటప్పుడు 'ఈ రెంటిలో ఏది మేలో బాగా నిశ్చయించి నాకు దానిని చెప్పు' (5.1) అని రెంటిని కలిపి చెప్పిన దాని విషయంలో ఆ రెంటిలో ఏది మేలు అని అడగడంలో అర్థం లేదు. పైత్యం తగ్గడానికి చల్లనివి తీయనివి తినమని వైద్యుడంటే, ఆరెంటిలో పైత్యం తగ్గించేదేదో ఒకదాన్ని చెప్పు అని అడగడంలో ఏమిటి అర్థం? లేదా, భగవానుని మాటలు సరిగా అర్థం చేసుకోకపోవడం చేత అర్జునుడిట్లా ప్రశ్న అడిగాడు అని అంటే, ప్రశ్నకు తగినట్లుగానే భగవానుడు సమాధానం ఇచ్చి ఉండవలెను. 'నేను జ్ఞానకర్మలను కలిపి చెప్పాను, నీవెందుకిట్లా భ్రాంతిలో పడ్డావు' అని. అట్లా అనకుండా ప్రశ్నకు అతకని సమాధానం ఇవ్వడం జరగదు, 'నేను ఇంతకుముందు రెండు నిష్ఠలను చెప్పివున్నాను' అని.

**భాష్యమ్ : 11.0.7. నాపి స్మార్తేనైవ కర్మణా బుద్ధేః సముచ్చయేఽభిప్రేతే విభాగవచనాది సర్వమ్ ఉపపన్నమ్ కించ క్షత్రియస్య యుద్ధం స్మార్తం కర్మ స్వధర్మ ఇతి జానతః 'తత్ కిం కర్మణి ఘోరే మాం నియోజయసి' (3.1) ఇతి ఉపాలంభః అనుపపన్నః.**

**తె.అ.** లేక (శ్రౌతకర్మలతో కాదు) స్మార్తకర్మలతో మాత్రమే జ్ఞానం ముడిపడివున్నది అని అభిప్రాయమైతే కూడా జ్ఞానకర్మలను వేరుచేసి చెప్పినదంతా అతకకుండా పోతుంది. అంతేకాదు, యుద్ధరూపమైన స్మార్తకర్మ క్షత్రియుడికి స్వధర్మమని తెలిసిన అర్జునుడు 'మరి నాకెందుకీ ఘోరకర్మ విధిస్తున్నావు?' (3.1) అని నిందించడం కూడా జరగదు.

**భాష్యమ్ : 11.0.8. తస్మాద్ గీతాశాస్త్రే ఈషన్మాత్రేణాపి శ్రౌతేన స్మార్తేన వా కర్మణా ఆత్మజ్ఞానస్య సముచ్చయః న కేనచిద్దర్శయితుం శక్యః.**

**తె.అ.** కనుక గీతాశాస్త్రంలో శ్రౌతకర్మతో గాని స్మార్తకర్మతో గాని జ్ఞానం ఏ మాత్రమైనా ముడిపెట్టబడి వుంది అని చూపడం ఎవ్వరికీ శక్యం కాదు.

**భాష్యమ్ : 11.0.9.యస్య తు అజ్ఞానాద్రాగాది దోషతో వా కర్మణి ప్రవృత్తస్య యజ్ఞేన, దానేన, తపసా వా విశుద్ధసత్త్వస్య జ్ఞానమ్ ఉత్పన్నం పరమార్థతత్త్వ విషయం "ఏకమేవేదం సర్వం బ్రహ్మ అకర్తృ చ" ఇతి, తస్య కర్మణి కర్మప్రయోజనే చ నివృత్తేఽపి లోకసంగ్రహార్థం యత్నపూర్వం యథా ప్రవృత్తిః తథైవ కర్మణి ప్రవృత్తస్య యత్ప్రవృత్తి రూపం దృశ్యతే న తత్ కర్మ యేన బుద్ధేః సముచ్చయః స్యాత్, యథా భగవతః వాసుదేవస్య క్షాత్రధర్మచేష్టితం న జ్ఞానేన సముచ్చీయతే పురుషార్థసిద్ధయే; తద్వత్ తత్ఫలాభిసంధ్యహంకారాభావస్య తుల్యత్వాత్ విదుషః. తత్త్వవిత్తు 'నాహం కరోమీ'తి మన్యతే, న చ తత్ఫలమ్ అభిసంధత్తే. యథా చ స్వర్గాది కామార్థినః అగ్నిహోత్రాది కామసాధనానుష్ఠానాయ ఆహితాగ్నేః కామ్యే ఏవ అగ్నిహోత్రాదౌ ప్రవృత్తస్య సామికృతే వినష్టేఽపి కామే తదేవ అగ్నిహోత్రాది అనుతిష్ఠతోఽపి న తత్ కామ్యమ్ అగ్నిహోత్రాది భవతి. తథా చ దర్శయతి భగవాన్ "కుర్వన్నపి న లిప్యతే" (5.7), "న కరోతి న లిప్యతే" (13.31) ఇతి తత్ర తత్ర. యచ్చ "పూర్వైః పూర్వతరం కృతమ్" (4.15), "కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయః" (3.20) ఇతి, తత్తు ప్రవిభజ్య విజ్ఞేయమ్. తత్కథమ్? యది తావత్పూర్వే జనకాదయః తత్త్వవిదః అపి ప్రవృత్తకర్మాణః స్యుః, తే లోకసంగ్రహార్థం "గుణా గుణేషు వర్తన్తే" (3.28) ఇతి జ్ఞానేనైవ సంసిద్ధిం ఆస్థితాః. కర్మసంన్యాసే ప్రాప్తేఽపి కర్మణా సహైవ సంసిద్ధిమ్ ఆస్థితాః న కర్మసంన్యాసం కృతవన్తః ఇత్యర్థః. అథ న తే తత్త్వవిదః - ఈశ్వరసమర్పితేన కర్మణా సాధనభూతేన సంసిద్ధిం, సత్త్వశుద్ధిం, జ్ఞానోత్పత్తి లక్షణాం వా సంసిద్ధిమ్ ఆస్థితాః జనకాదయః ఇతి వ్యాఖ్యేయమ్. ఏతమేవ అర్థమ్ వక్ష్యతి భగవాన్ "సత్త్వశుద్ధయే కర్మ కుర్వన్తి" (5.11) ఇతి. "స్వ కర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః". (18.46) ఇత్యుక్త్వా సిద్ధిం ప్రాప్తస్య చ పునః జ్ఞాననిష్ఠాం వక్ష్యతి "సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ" (18.50) ఇత్యాదినా.**

**తస్మాత్ గీతాశాస్త్రే కేవలాత్ ఏవ తత్త్వజ్ఞానాత్ మోక్షప్రాప్తిః, న కర్మ సముచ్చితాత్ ఇతి నిశ్చితః అర్థః. యథా చ అయమర్థః తథా ప్రకరణశః విభజ్య తత్ర తత్ర దర్శయిష్యామః.**

**తె.అ.** అజ్ఞానం చేతగాని, ఆసక్తితోగాని కర్మలు చేసేవానికి యజ్ఞం వల్లనో దానం వల్లనో తపస్సువల్లనో అంతఃకరణం విశుద్ధమై పరమార్థతత్త్వ విషయమైన 'ఇదంతా ఒకటే, బ్రహ్మము, అతడు అకర్త' అనే జ్ఞానం కలుగుతుంది. జ్ఞానం కలిగిన తరువాత కర్మలవల్ల ఎటువంటి ప్రయోజనమూ లేకపోయినా, అతడు లోకకల్యాణం కోసం ప్రయత్నం చేస్తూ కర్మలు ఆచరిస్తూనే

వుంటాడు. ప్రవృత్తి రూపమైనదిగా కనిపించే ఆ కర్మ కర్మ కాదు. అది జ్ఞానంతో ముడిపడిలేదు. భగవానుడైన వాసుదేవుడు క్షత్రియకర్మలు చేస్తున్నా పురుషార్థసిద్ధికి ఆ కర్మలు జ్ఞానంతో ముడిపడి లేవు. అదేవిధంగా, ఫలాపేక్ష, అహంకారము లేకపోవడం చేత జ్ఞాని చేసే కర్మలు గూడా జ్ఞానంతో ముడిపడిలేవు. (కేవలం జ్ఞానం వల్లనే కైవల్యం కలుగుతుంది. జ్ఞానం కలిగిన తరువాత కర్మలాచరించినా ఆచరించకపోయినా కైవల్యానికి బాధలేదు. ఎటువంటి కర్మవల్ల కూడా కైవల్యం కలగదు. అంటే జ్ఞానము, కర్మానుష్ఠానము కలిసినపుడే కైవల్యం అనడం సరికాదు. జ్ఞానకర్మలు కలిసి కనిపిస్తే, అంటే జ్ఞాని కర్మలు చేస్తున్నట్లు కనిపిస్తే, ఆ కర్మ లోకానికి కర్మగా కనిపిస్తుంది. కాని జ్ఞానికి అది కర్మ అనిపించదు.) తత్త్వం తెలిసినవాడు నేను చేస్తున్నాను అనుకోడు, చేసే పనికి ఫలాన్ని కోరడు. కోరికలకు అగ్నిహోత్రం మొదలైనవి సాధనాలు. స్వర్గమో మరొకటో కావాలనుకునేవాడు అగ్నిహోత్రాది కర్మలు ఆరంభిస్తాడు. కాని కర్మ పూర్తికాక ముందే కోరిక నశిస్తుంది. అయినా కర్మ కొనసాగిస్తూనే ఉంటాడు. అటువంటి అగ్నిహోత్రాది కర్మ కామ్యకర్మ కాదు. అట్లాగే జ్ఞానియొక్క కర్మ కూడా. భగవానుడు కూడా అక్కడక్కడ ఆ విధంగానే చెపుతున్నాడు, "కర్మలు చేస్తూ ఉన్నప్పటికి" (5.7) 'కర్మ చేయడు, కర్మ ఫలము అతనికి అంటుకోదు' (13.31) అని. ఇది కాక, 'పూర్వము ప్రాచీనులు ఆచరించిరి' (4.15) 'జనకాదులు కర్మచేతనే సిద్ధిపొందిరి' (3.20) అనే మాటలను రెండు విధాలుగా అర్థం చేసుకోవలెను. అదెట్లా అంటే, పూర్వం జనకుడు మొదలైనవారు తత్త్వవేత్తలయినప్పటికి లోకానుగ్రహం కోసం కర్మలు చేసి 'గుణాలు గుణాలయందు ప్రవర్తిస్తున్నాయి' అనే జ్ఞానంతో సిద్ధిని పొందారు. కర్మ సంన్యాసం ప్రాప్తించినప్పటికి కర్మలు చేస్తూనే సిద్ధిని పొందారు, కర్మలు వదలలేదు అని అర్థం. లేక, వారు తత్త్వవేత్తలు కానట్లయితే సాధనములైన కర్మలు ఈశ్వరునకర్పిస్తూ సత్త్వశుద్ధి అనగా జ్ఞానాన్ని ఇచ్చేటటువంటి సిద్ధిని పొందారు అని వ్యాఖ్యానించవలెను. ఇదే అర్థాన్ని చెపుతున్నాడు భగవానుడు 'సత్త్వశుద్ధి కొరకు కర్మ చేస్తారు' (5.11) అని. 'స్వకర్మతో అతనిని అర్చించి మానవుడు సిద్ధి పొందుతాడు' (18.46) అని చెప్పి సిద్ధిపొందిన వానికి మరల జ్ఞాన నిష్ఠను తరువాత చెపుతాడు "సిద్ధి పొందినవ్యక్తి ఏ విధముగా బ్రహ్మమును పొందునో" (18.50) మొదలైన మాటలలో. కనుక, కేవలం తత్త్వజ్ఞానం వల్లనే మోక్షం కలుగుతుంది, కర్మతో ముడిపడిన జ్ఞానంతో కాదు అనేది గీతలోని నిశ్చితార్థం. ఇదే అర్థాన్ని ఆయా సందర్భాలలో విభజించి చూపుతాం.

**భాష్యమ్ : 11.0.10. తత్రైవం ధర్మసంమూఢ చేతసః మిథ్యాజ్ఞానవతః మహతి శోకసాగరే నిమగ్నస్య అర్జునస్య అన్యత్ర ఆత్మజ్ఞానాత్ ఉద్ధరణమ్ అపశ్యన్ భగవాన్ వాసుదేవః తతః అర్జునమ్ ఉద్దిధారయిషుః ఆత్మజ్ఞానాయ అవతారయన్ ఆహ–**

**తె.అ.** ఈ విధంగా ధర్మ విషయంలో మూఢుడై మహాశోక సాగరంలో మునిగి వున్న అర్జునుణ్ణి ఉద్ధరించాలనే కోరికతో ఆత్మజ్ఞానం కంటె వేరే దారి లేదు అని భగవానుడైన వాసుదేవుడు ఆత్మజ్ఞానాన్ని ప్రస్తావిస్తూ అంటున్నాడు.

**శ్రీ భగవానువాచ-**

**మూ. అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే ।**
**గతాసూనగతాసూంశ్చ నానుశోచన్తి పణ్డితాః ॥ 11**

భగవానుడంటున్నాడు -

**తె.అ.** ఎవరిని గురించి శోకించనవసరం లేదో వారిని గురించి నీవు శోకిస్తున్నావు. మళ్ళీ పండితుని వలె మాట్లాడుతున్నావు. ప్రాణాలు పోయినవారి గురించిగాని, ఇంకా పోని వారి గురించి గాని పండితులు శోకించరు.

**భాష్యమ్ : 11.1 అశోచ్యాన్ ఇత్యాది. న శోచ్యాః అశోచ్యాః, భీష్మద్రోణాదయః సద్వృత్త్వాత్ పరమార్థ స్వరూపేణ చ నిత్యత్త్వాత్. తాన్ అశోచ్యాన్, అన్వశోచః అనుశోచితవానసి, 'తే మ్రియన్తే మన్నిమిత్తమ్. అహం తైర్వినాభూతః కిం కరిష్యామి రాజ్యసుఖాదినా?' ఇతి. త్వం ప్రజ్ఞావాదాన్ ప్రజ్ఞావతాం బుద్ధిమతాం వాదాంశ్చ వచనాని చ భాషసే. తదేతత్ మౌఢ్యం పాండిత్యం చ విరుద్ధం దర్శయసి ఆత్మని, ఉన్మత్త ఇవ ఇత్యభిప్రాయః యస్మాత్ గతాసూన్ గత ప్రాణాన్, మృతాన్, అగతాసూన్, అగత ప్రాణాన్ జీవతశ్చ నానుశోచన్తి పండితాః ఆత్మజ్ఞాః. పండా ఆత్మవిషయా బుద్ధిః యేషాం తే హి పండితాః "పాండిత్యం నిర్విద్య" (బృ.ఉ.3.5.1) ఇతి శ్రుతేః. పరమార్థతస్తు తాన్ నిత్యాన్ అశోచ్యాన్ అనుశోచసి, అతః మూఢః అసి ఇత్యభిప్రాయః**

**తె.అ.** సద్వర్తనం వల్లను పరమార్థ దృష్టిలో నిత్యులవడం చేతను భీష్మద్రోణాదులు శోకింపబడదగనివారు. వారి విషయంలో నీవు చింతిస్తున్నావు, నా కారణంగా వీరు చస్తున్నారు, వీరు లేకుండా రాజ్యసుఖాదులు నేనేం చేసుకోను, అని. పైగా ప్రజ్ఞానివలె పండితునివలె మాట్లాడుతున్నావు, పిచ్చివానివలె విరుద్ధమైన మౌఢ్యము, పాండిత్యము రెండూ ఒకేసారి ప్రదర్శిస్తున్నావు, అని అభిప్రాయం. ఎందుకంటే ప్రాణాలు పోయినవారి గురించి గాని యింకా పోనివారి అంటే జీవించివున్నవారిని గురించి గాని ఆత్మజ్ఞులు శోకించరు. పండా అనగా ఆత్మవిషయమైన బుద్ధి, అది ఉన్నవాడు పండితుడు. 'పాండిత్యమును నిశ్శేషముగా తెలుసుకొని' అని శ్రుతి. (బృ.ఉ.3.5.1). పరమార్థ దృష్టిలో నిత్యులు శోకింపబడదగనివారి విషయంలో శోకిస్తున్నావు కనుక మూఢుడవు అని అభిప్రాయం.

**భాష్యమ్ : 12.0 కుతః తే అశోచ్యాః? యతః నిత్యాః. కథమ్?**

**తె.అ.** ఎందువల్ల వారు శోకింపబడదగనివారు ? నిత్యులు కనుక. ఎట్లా నిత్యులు?

**మూ. న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః ।**
**న చైవ న భవిష్యామః సర్వే వయమతః పరమ్ ॥ 12**

**తె.అ.** ఎప్పుడు గాని నేను లేకపోవడమన్నది లేనేలేదు. నీవు లేకపోవడం లేదు. ఈ రాజులు లేకపోవడమూ లేదు. మనమందరము ఇకముందు కూడా ఉండబోము అన్నది కూడా లేనేలేదు.

**భాష్యమ్ : 12.1 న తు ఇతి ॥ న తు ఏవ, జాతు కదాచిత్ అహం న ఆసమ్, కింతు ఆసమ్ ఏవ. అతీతేషు దేహోత్పత్తివినాశేషు ఘటాదిషు వియద్ ఇవ నిత్యః ఏవ అహం ఆసం ఇతి అభిప్రాయః. తథా – న త్వం న ఆసీః, కిం తు ఆసీః ఏవ. తథా – న ఇమే, జనాధిపాః న ఆసన్, కిం తు ఆసన్ ఏవ. తథా – న చ ఏవ న భవిష్యామః, కిం తు భవిష్యామః ఏవ సర్వే వయం అతః అస్మాత్ దేహవినాశాత్ పరం ఉత్తరకాలేఽపి. త్రిష్వపి కాలేషు నిత్యాః ఆత్మ స్వరూపేణ ఇత్యర్థః, దేహభేదానువృత్త్యా బహువచనమ్, న ఆత్మ భేదాభిప్రాయేణ.**

**తె.అ.** ఎప్పుడు కూడా నేను లేకపోవడమన్నది లేదు. ఎప్పుడూ ఉన్నాను. వెనుకటి దేహాలు పుడుతూగిడుతూ వున్నా నేను మాత్రం కుండ పగిలిపోయినప్పుడు కూడా ఆకాశం ఉంటూనే ఉన్నట్లుగా నిత్యమూ ఉంటున్నాను. కావున నీవూ లేకపోవడమన్నది లేదు. ఎప్పుడూ వున్నావు. అదేవిధంగా ఈ రాజులు. వారూ లేకపోవడమన్నది లేదు. ఎప్పుడూ ఉన్నారు. అదేవిధంగా ఈ దేహాలు నశించిన తరువాత కూడా మనమంతా ఉండకపోవడమన్నది లేదు. తప్పక వుంటాము. మూడు కాలాలలోను ఆత్మస్వరూపంలో నిత్యులమని అర్థం. 'మనం' అని బహువచన ప్రయోగం దేహాలు వేరు అన్న దృష్టితో, 'ఆత్మలు' వేరు అని కాదు.

**భాష్యమ్ : 13.0 తత్ర కథమివ నిత్యః ఆత్మా ఇతి? దృష్టాంతం ఆహ –**

**తె.అ.** ఆత్మ నిత్యము, దేనివలె? దృష్టాంతం చెపుతున్నాడు.

**మూ. దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా ।**
**తథా దేహాన్తరప్రాప్తిర్ధీరస్తత్ర న ముహ్యతి ॥ 13**

**తె.అ.** ఈ దేహంలో ఏవిధంగా బాల్యము, యౌవనము, ముసలితనము కలుగుతున్నాయో అదే విధంగా దేహాంతరం కూడా ప్రాప్తిస్తున్నది. ఆ విషయంలో బుద్ధిమంతుడు మోహం చెందడు.

**భాష్యమ్ : 13.1 దేహినః ఇతి. దేహః అస్య అస్తి ఇతి దేహీ తస్య దేహినః దేహవతః ఆత్మనః అస్మిన్ వర్తమానే దేహే యథా యేన ప్రకారేణ కౌమారం కుమారభావః బాల్యావస్థా, యౌవనం యూనః భావః మధ్యమావస్థా, జరా వయోహానిః జీర్ణావస్థా, ఇతి ఏతాః, తిస్రః అవస్థాః అన్యోన్యవిలక్షణాః. తాసాం ప్రథమావస్థానాశే న నాశః, ద్వితీయావస్థోపజననే న ఉపజననం ఆత్మనః. కిం తర్హి? అవిక్రియస్య ఏవ ఏకస్య ద్వితీయ తృతీయావస్థాప్రాప్తిః ఆత్మనః దృష్టా. తథా తద్వత్ ఏవ దేహాత్ అన్యః దేహః దేహాంతరం, తస్య ప్రాప్తిః దేహాంతర ప్రాప్తిః అవిక్రియస్య ఏవ ఆత్మనః ఇత్యర్థః. ధీరః ధీమాన్, తత్ర ఏవం సతి, న ముహ్యతి న మోహం ఆపద్యతే.**

**తె.అ.** దేహం ఎవరిదో అతడు దేహి. ఆ దేహి అయిన ఆత్మకు ఈ దేహంలో బాల్యము యౌవనము, వార్ధక్యము అనే వేరు వేరు అవస్థలు మూడు ప్రాప్తిస్తున్నాయి. వాటిలో మొదటి అవస్థ నశించడంతో ఆత్మ నశించడం లేదు. రెండవ అవస్థ పుట్టడంతో ఆత్మ మళ్లీ పుట్టడమూ లేదు. ఏమవుతున్నది? మారని ఆత్మకు రెండవ మూడవ దశలు ప్రాప్తించడం చూస్తున్నాం. ఇదేవిధంగా ఆ మారని ఆత్మకు మరో దేహం ప్రాప్తిస్తున్నది. అటువంటప్పుడు బుద్ధి ఉన్నవాడు మోహం చెందడు.

**భాష్యమ్ : 14.0 యద్యపి ఆత్మవినాశనిమిత్తః మోహః న సంభవతి నిత్యః ఆత్మా ఇతి విజానతః తథాపి శీతోష్ణసుఖదుఃఖప్రాప్తినిమిత్తః మోహః లౌకికః దృశ్యతే, సుఖవియోగనిమిత్తో మోహః దుఃఖసంయోగనిమిత్తశ్చ శోకః. ఇత్యేతత్ అర్జునస్య వచనం ఆశంక్య భగవాన్ ఆహ.**

**తె.అ.** ఆత్మ నిత్యమని తెలిసినవానికి ఆత్మ వినాశ నిమిత్తమైన మోహం కలగకపోవచ్చు. కానీ శీతోష్ణ సుఖదుఃఖ ప్రాప్తి నిమిత్తమైన మోహము, సుఖవియోగ దుఃఖ సంయోగ నిమిత్తమైన శోకం లోకంలో చూస్తున్నాం గదా అని అర్జునుడు అనవచ్చునని అనుమానించి భగవానుడు అంటున్నాడు. (అంటే, చావని ఆత్మ గురించి కాదు నా విచారం, మరణిస్తూ వున్న ఈ దేహాన్ని గురించే అని అర్జునుడు అంటాడని).

**మూ. మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ శీతోష్ణసుఖదుఃఖదాః ।**
**ఆగమాపాయినో-నిత్యా స్తాంస్తితిక్షస్వ భారత ॥ 14**

**తె.అ.** అర్జునా ! ఇంద్రియాలు, విషయాలతో వాటి సంయోగాలు, చలిని వేడిని సుఖాన్ని దుః ఖాన్ని ఇస్తాయి. అవి వస్తూపోతూ ఉంటాయి. ఎప్పుడూ ఉండేవి కావు. వాటిని సహించు.

**భాష్యమ్ : 14.1 మాత్రాస్పర్శాః ఇతి. మాత్రాః ఆభిః, మీయంతే శబ్దాదయః ఇతి శ్రోత్రాదీని ఇంద్రియాణి. మాత్రాణాం స్పర్శాః శబ్దాదిభిః సంయోగాః. తే శీతోష్ణసుఖదుఃఖదాః శీతం ఉష్ణం**

**సుఖం దుఃఖం చ ప్రయచ్ఛంతీతి. అథవా – స్పృశ్యంతే ఇతి స్పర్శాః విషయాః శబ్దాదయః మాత్రాశ్చ స్పర్శాశ్చ శీతోష్ణసుఖదుఃఖదాః – శీతం కదాచిత్ సుఖం, కదాచిత్ దుఃఖమ్. తథా ఉష్ణమ్ అపి అనియతస్వరూపమ్. సుఖదుఃఖే పునః నియతరూపతాం న వ్యభిచరతః. అతః తాభ్యాం పృథక్ శీతోష్ణయోః గ్రహణమ్. యస్మాత్ తే మాత్రాస్పర్శాదయః ఆగమాపాయినః ఆగమాపాయశీలాః తస్మాత్ అనిత్యాః. అతః తాన్ శీతోష్ణాదీన్ తితిక్షస్వ ప్రసహస్వ. తేషు హర్షం విషాదం వా మా కార్షీః ఇత్యర్థః.**

**తె.అ.** వేటిచేత శబ్దాదులను తెలుసుకుంటామో అవి మాత్రలు, అంటే శ్రోత్రాది ఇంద్రియాలు. శబ్దాదుల తోటి ఆ మాత్రల సంయోగం మాత్రాస్పర్శ. ఈ మాత్రాస్పర్శలు శీతోష్ణాలను సుఖ–దుఃఖాలను ఇస్తాయి. లేక స్పృశింపబడునవి కనుక స్పర్శలు అని కూడా అర్థం చెప్పుకోవచ్చు. అంటే శబ్దాది విషయాలు, అని. అప్పుడు, మాత్రాస్పర్శలు శీతోష్ణ సుఖదుఃఖాలను ఇచ్చేవి అనే అర్థం వస్తుంది. చల్లదనం ఒకసారి సుఖంగాను, మరొకసారి దుఃఖంగాను ఉంటుంది. అట్లాగే వేడి ఒకేరూపంలో ఉండదు. సుఖదుఃఖాలు అట్లాకాక ఎప్పుడూ ఒకటిగానే ఉంటాయి. మార్పు ఉండదు. కనుకనే వాటికంటే వేరుగా శీతోష్ణాలను చెప్పవలసి వచ్చింది. ఆ మాత్రాస్పర్శలు ఒకప్పుడు వచ్చేవి మరొకపుడు పోయేవి కనుక అనిత్యాలు. కనుక ఆ శీతోష్ణాదులను సహించు. అంటే అవి కలిగినపుడు ఆనందదుఃఖాలు చెందవద్దు అని అర్థం.

**భాష్యమ్ : 15.0 శీతోష్ణాదీన్ సహతః కిం స్యాత్ ఇతి? శృణు –**

**తె.అ.** శీతోష్ణాదులు సహించేవానికి దానివలన ఏమి ప్రయోజనం అంటే విను.

**మూ. యం హి న వ్యథయన్త్యేతే పురుషం పురుషర్షభ ।**
**సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే ॥ 15**

**తె.అ.** ఓ పురుషశ్రేష్ఠా! ఈ శీతోష్ణాదులు ఎవరిని బాధించవో, ఎవడు దుఃఖంలో సుఖంలో సమంగా ఉంటాడో అటువంటి నిత్యానిత్య వివేకంకలవాడు మోక్షానికి సమర్థుడవుతాడు.

**భాష్యమ్ : 15.1 యం హి ఇతి. యం హి పురుషం సమదుఃఖసుఖం సమే దుఃఖసుఖే యస్య తం సమదుఃఖసుఖం సుఖదుఃఖప్రాప్తౌ హర్షవిషాదరహితం ధీరం ధీమంతం న వ్యథయన్తి న చాలయన్తి నిత్యాత్మ దర్శనాత్ ఏతే యథోక్తాః శీతోష్ణాదయః, సః నిత్యాత్మస్వరూపదర్శననిష్ఠః ద్వంద్వసహిష్ణుః అమృతత్వాయ అమృతభావాయ మోక్షాయ కల్పతే సమర్థః భవతి.**

**తె.అ.** దుఃఖంలో, సుఖంలో ఒకేరీతిగా ఎవడుంటాడో అంటే దుఃఖం కలిగినపుడు విషాదము, సుఖం కలిగినపుడు హర్షం పొందడో అటువంటి ధీరుని ఈ శీతోష్ణాదులు బాధించవు. అంటే

నిత్యమైన ఆత్మదర్శనం నుండి చలింపచేయలేవు. అటువంటి నిత్యాత్మదర్శననిష్ఠుడు, శీతోష్ణాది ద్వంద్వాలను సహించగలిగినవాడు మృత్యువును దాటిపోగలడు. అంటే మోక్షానికి సమర్థుడవుతాడు.

**భాష్యమ్ : 16.0 ఇతశ్చ శోకమోహౌ అకృత్వా శీతోష్ణాదిసహనం యుక్తం, కర్తుమ్, యస్మాత్–**

**తె.అ.** మరొక కారణం చేత గూడా మనం శీతోష్ణాదులను శోకమోహాలు లేకుండా సహించడం సముచితం. ఎందుకంటే –

**మూ. నాఽసతో విద్యతే భావో నాఽభావో విద్యతే సతః ।**
**ఉభయోరపి దృష్టోఽన్తస్త్వనయోస్తత్త్వదర్శిభిః ॥ 16**

**తె.అ.** అసద్వస్తువునకు ఉనికి లేదు, సద్వస్తువు ఉండకపోవడం లేదు. తత్త్వవేత్తలు ఈ రెంటిని గురించిన సత్యమును తెలుసుకున్నారు.

**భాష్యమ్ : 16.1 నాసతః ఇతి – (న) అసతః అవిద్యమానస్య శీతోష్ణాదేః సకారణస్య న విద్యతే నాస్తి భావః, భావనమ్, అస్తితా. న హి శీతోష్ణాది సకారణమ్ ప్రమాణైః నిరూప్యమాణం వస్తు సత్ భవతి. వికారో హి సః. వికారశ్చ వ్యభిచరతి. యథా ఘటాది సంస్థానం చక్షుషా నిరూప్యమాణం మృద్వ్యతిరేకేణ అనుపలబ్ధేః అసత్, తథా సర్వో వికారః కారణవ్యతిరేకేణ అనుపలబ్ధేః అసన్. జన్మప్రధ్వంసాభ్యాం ప్రాక్ ఊర్ధ్వం చ అనుపలబ్ధేః కార్యస్య ఘటాదేః మృదాదికారణస్య చ తత్కారణవ్యతిరేకేణ అనుపలబ్ధేః అసత్త్వమ్.**

**తదసత్త్వే చ సర్వాభావప్రసంగః ఇతి చేత్ – న; సర్వత్ర బుద్ధిద్వయోపలబ్ధేః – సద్బుద్ధిః అసద్బుద్ధిః ఇతి. యద్విషయా బుద్ధిః న వ్యభిచరతి, తత్ సత్, యద్విషయా బుద్ధిః వ్యభిచరతి తత్ అసత్ ఇతి సదసద్విభాగే బుద్ధితన్త్రే స్థితే సర్వత్ర ద్వే బుద్ధీ సర్వైః ఉపలభ్యేతే సామానాధికరణ్యే – న నీలోత్పలవత్, సన్ ఘటః, సన్ పటః, సన్ హస్తీ, ఇతి. ఏవం సర్వత్ర. తయోః బుద్ధ్యోః ఘటాదిబుద్ధిః వ్యభిచరతి. తథా చ దర్శితమ్. న తు సద్బుద్ధిః. తస్మాద్ ఘటాదిబుద్ధివిషయః అసన్, వ్యభిచారాత్, న తు సద్బుద్ధివిషయః, అవ్యభిచారాత్.**

**తె.అ.** శీతోష్ణాదులు వాటి కారణాలు వాస్తవంలో లేనివి. లేనివాటికి ఉండడమన్నది కలుగదు. ప్రత్యక్షాది ఏ ప్రమాణం చేతగాని ఇది శీతము, ఇది ఉష్ణము అని నిరూపించగల సద్వస్తువేదీ లేదు. ఎందుకంటే ఆ శీతోష్ణాదులు వికారం. వికారం ఎప్పుడూ మారుతూ వుంటుంది. మట్టితో చేసిన కుండలో ఎంత జూచినా మట్టిగాక మరొకటి కనిపించదు. కనుక కుండ అసత్తు. (కారణం మట్టి, వికారం కుండ. మట్టిగాక మరొకటి కుండలో లేదు గనుక కారణమైన మట్టి సత్తు, వికారమైన కుండ అసత్తు), ఇటువంటివే అన్ని వికారాలు. కారణం కంటె వేరుగా లేవు గనుక అవి అసత్తు. పుట్టుకకు పూర్వము, ప్రధ్వంసానికి తరువాత అవి లేవు.

ఆక్షేపణ – కుండకు కారణమైన మట్టికీ ఒక కారణం ఉంటుంది. ఆ కారణానికి కారణమైంది మరొకటి ఉంటుంది. వాటిలో కూడా వాటి కారణం కంటె వేరుగా మరేమీ ఉండదు కనుక అవన్నీ అసత్తే. ఒక్కొక్కటి అసత్తు అనుకుంటూ పోతే చివరకు అంతా అభావమే, ఉన్నదంటూ ఏదీ లేదు అనవలసి వస్తుంది.

సమాధానం – కాదు. ఎందుకంటే అన్నిటా సద్బుద్ధి, అసద్బుద్ధి అని రెండు బుద్ధులు కలుగుతున్నాయి కనుక. దేని విషయంలో బుద్ధి మారదో ఆ వస్తువు సత్తు. దేని విషయంలో బుద్ధి మారుతుందో ఆ వస్తువు అసత్తు. ఈ విధంగా సదసద్విభాగం బుద్ధియొక్క అధీనంలో ఉంటున్నది. సమానాధికరణంలో (ఒకే అధిష్ఠానంలో) అన్నిటా అందరికీ రెండు బుద్ధులుంటున్నాయి – నీలోత్పలం వలె కాదు. కుండ వుంది, గుడ్డ వుంది, ఏనుగు వుంది. ఈ విధంగా సర్వత్రా రెండు బుద్ధులుంటున్నాయి. ఈ రెండు బుద్ధులలో కుండ గుడ్డ ఏనుగు అన్న బుద్ధి మారుతూ ఉంటుంది, ఇంతకు పూర్వం చెప్పినట్లు. కాని 'ఉంది' అన్న బుద్ధి (సద్బుద్ధి) మారదు. కనుక ఇది కుండ, ఇది గుడ్డ – ఈ విధంగా అనుకునే బుద్ధికి విషయమైనవి, (అంటే కుండ మొదలైనవి) మారిపోయేవి కనుక, అసత్తు. 'ఉంది' అన్న సద్బుద్ధికి విషయమైనది (అస్తిత్వం) అసత్తు కాదు, అందులో మార్పు లేదు గనుక.

**భాష్యమ్ : 16.2 ఘటే వినష్టే ఘటబుద్ధౌ వ్యభిచరన్త్యాం సద్బుద్ధిరపి వ్యభిచరతి ఇతి చేత్, న; పటాదౌ అపి సద్బుద్ధిదర్శనాత్. విశేషణవిషయైవ సా సద్బుద్ధిః. సద్బుద్ధివత్ ఘటబుద్ధిరపి ఘటాన్తరే దృశ్యతే ఇతి చేత్, న; పటాదావదర్శనాత్. సద్బుద్ధిరపి నష్టే ఘటే న దృశ్యతే ఇతి చేత్ న – విశేష్యాభావాత్. సద్బుద్ధిః విశేషణవిషయాసతీ విశేష్యాభావే విశేషణానుపపత్తౌ కిం విషయా స్యాత్, న తు పునః సద్బుద్ధేః విషయాభావాత్.**

**తె.అ.** ఆక్షేపణ – కుండ నష్టమైన తరువాత కుండ అన్న బుద్ధితోపాటు 'ఉంది' అన్న సద్బుద్ధి కూడా నశిస్తుంది గదా?

సమాధానం – కాదు. ఉంది అన్న సద్బుద్ధి పోయిన కుండతో పోవడం లేదు. గుడ్డ మొదలైన వాటి విషయంలో కూడా వుంటూ వున్నది. సద్బుద్ధికి విశేషణమే విషయం.

ఆక్షేపణ – సద్బుద్ధి వలెనే ఘటబుద్ధి కూడా ఒక కుండ పోయినా మరొక కుండ విషయంలో కనిపిస్తున్నది కదా?

సమాధానం – కాదు. గుడ్డ మొదలైన వాటియందు కనిపించడం లేదు.

ఆక్షేపణ – కుండ పోయిన తరువాత సద్బుద్ధి కూడా కనిపించదు కదా?

సమాధానం – కాదు. ఎందుకంటే విశేష్యం లేకపోవడం చేత. సద్బుద్ధికి విశేషణం విషయం. విశేష్యం (కుండ) లేనప్పుడు విశేషణం ఉండదు. కనుక దేన్ని విషయం చేసుకొని సద్బుద్ధి కలుగుతుంది? విషయం లేనంత మాత్రాన సద్బుద్ధి లేనట్లు కాదు.

**భాష్యమ్ : 16.3 ఏకాధికరణత్వం ఘటాది విశేష్యాభావే న యుక్తమ్ ఇతి చేత్ – న; 'ఇదమ్ ఉదకమ్' ఇతి మరీచ్యాదౌ అన్యతరాభావేఽపి సామానాధికరణ్యదర్శనాత్. తస్మాత్ దేహాదేః ద్వన్ద్వస్య చ సకారణస్య అసతో న విద్యతే భావః ఇతి. తథా సతః చ ఆత్మనః అభావః అవిద్యమానతా న విద్యతే, సర్వత్ర అవ్యభిచారాత్ ఇతి అవోచామ. ఏవం ఆత్మానాత్మనోః సదసతోః ఉభయోః అపి దృష్టః ఉపలబ్ధః అంతః నిర్ణయః, సత్ సదేవ అసత్ అసదేవ ఇతి తు అనయోః యథోక్తయోః తత్త్వదర్శిభిః.**

**తె.అ.** ఆక్షేపణ – కుండ మొదలైన విశేష్యం లేనపుడు ఏకాధికరణత్వం కుదరదు.

సమాధానం – కాదు. ఎండమావియందు అధిష్ఠానం కానిది మరొకటి లేకపోయినా ఇది నీరు అని సమానాధికరణత్వం చూస్తున్నాం. (ఇక్కడ సమానాధికరణత్వం అంటే ఒకే అధిష్ఠానంలో రెండు వస్తువులున్నట్లుగా కనిపించడం, వాస్తవంగా రెండు వస్తువులుండడం గాదు.) కనుక దేహాదులు శీతోష్ణాది ద్వంద్వాలు వాటి కారణాలు ఇవన్నీ అసత్తు, అంటే అవి ఉండడమన్నది లేదు. అదేవిధంగా సత్తు అయిన ఆత్మ ఉండకపోవడమన్నదీ లేదు. ఎందుకంటే అది అంతటా చలించకుండా ఉన్నది అని చెప్పాం. ఈ విధంగా ఆత్మానాత్మల సదసత్తుల నిర్ణయం చేశారు తత్త్వం తెలిసినవారు, ఉన్నది ఉన్నదని లేనిది లేనిదని.

**భాష్యమ్ : 16.4 తత్ ఇతి సర్వనామ; సర్వం చ బ్రహ్మ; తస్య నామ తత్ ఇతి తద్భావః తత్త్వం, బ్రహ్మణః యాథాత్మ్యమ్. తత్ ద్రష్టుం శీలం యేషాం తే తత్త్వదర్శినః తైః తత్త్వదర్శిభిః. త్వమపి తత్త్వదర్శినాం దృష్టిం ఆశ్రిత్య శోకం మోహం చ హిత్వా శీతోష్ణాదీని నియతానియతరూపాణి ద్వంద్వాని, వికారోఽయమసన్ ఏవ మరీచి జలవత్ మిథ్యా అవభాసతే – ఇతి మనసి నిశ్చిత్య తితిక్షస్వ ఇతి అభిప్రాయః.**

**తె.అ.** 'తత్' అనేది సర్వనామం. సర్వం బ్రహ్మమే కనుక దానిపేరు 'తత్'. దాని భావమే అంటే బ్రహ్మ యొక్క యదార్థభావమే తత్త్వం. ఆ తత్త్వం దర్శించడం ఎవరికి స్వభావమో వారు తత్త్వదర్శనులు. నీవుకూడా తత్త్వదర్శనుల దృష్టిని ఆశ్రయించి శోకమోహాలను వదలి నియతా –నియతరూపమైన శీతోష్ణసుఖాదుఃఖాది ద్వంద్వాలను సహించు. "ఇవి వికారాలు. ఎండమావులలో నీటివంటివి. లేనివిఉన్నట్లుగా కనిపించేవి" అని తెలుసుకోని ద్వంద్వాలను సహించు.

**భాష్యమ్ : 17.0 కిం పునః తత్ యత్ సత్ ఏవ సర్వదా ఇతి? ఉచ్యతే –**

**తె.అ.** అయితే ఎల్లప్పుడూ ఏది సత్యమైనది, అంటే ఎప్పుడూ ఉండేది ఏది? అంటే చెపుతున్నాడు.

**మూ. అవినాశి తు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్ ।**
**వినాశమవ్యయస్యాస్య న కశ్చిత్కర్తుమర్హతి ॥ 17**

**తె.అ.** ఈ సర్వము దేనితో నిండివున్నదో సత్ అనబడే బ్రహ్మము నశించనిదని తెలుసుకో, అవ్యయమైన దీనిని నశింపజేయడం ఎవరికీ సాధ్యం కాదు.

**భాష్యమ్ : 17.1 అవినాశి ఇతి. అవినాశి న వినష్టుం శీలం అస్య ఇతి. తు శబ్దః అసతః విశేషణార్థః, తత్ విద్ధి విజానీహి. కిం? యేన సర్వం ఇదం జగత్ తతమ్ వ్యాప్తం సదాఖ్యేన బ్రహ్మణా సాకాశం, ఆకాశేన ఇవ ఘటాదయః. వినాశం అదర్శనం అభావమ్. అవ్యయస్య న వ్యేతి ఉపచయాపచయౌ న యాతి ఇతి అవ్యయం, తస్య అవ్యయస్య. న ఏతత్ సదాఖ్యం బ్రహ్మ స్వేన రూపేణ వ్యేతి, వ్యభిచరతి నిరవయవత్వాత్, దేహాదివత్. నాపి ఆత్మీయేన, ఆత్మీయాభావాత్. యథా దేవదత్తః ధనహాన్యా వ్యేతి, న తు ఏవం బ్రహ్మ వ్యేతి. అతః అవ్యయస్య అస్య బ్రహ్మణః వినాశం న కశ్చిత్ కర్తుం అర్హతి, న కశ్చిత్ ఆత్మానం వినాశయితుం శక్నోతి ఈశ్వరోఽపి. ఆత్మా హి బ్రహ్మ; స్వాత్మని చ క్రియావిరోధాత్.**

**తె.అ.** దేనికి నశించడం స్వభావం కాదో అది అవినాశి. 'తు' శబ్దం అసత్తు నుండి సత్తును వేరుచేసి చెప్పడానికి, దాన్ని తెలుసుకో. దేనిని? దేనిచేత ఈ సర్వజగత్తు, ఘటాదులలో నిండి ఉన్న ఆకాశంవలె, నిండివున్నదో ఆ సత్ అనబడే బ్రహ్మమును. వినాశము అంటే కనిపించకపోవడం, లేకపోవడం. వ్యయం కానిది అవ్యయం, తరగడం పెరగడం లేనిది. సత్ అనబడే బ్రహ్మం యొక్క స్వరూపం వ్యయం కాదు, దేహము మొదలయిన వాటివలె అవయవములున్నది కాదు గనుక. తను వ్యయం కాకపోవడమే గాక తనదంటూ ఏమీ లేదు గనుక తనది వ్యయం కావడం కూడా లేదు. దేవదత్తుడు ధనహాని వల్ల నష్టపోయాడు అన్నవిధంగా బ్రహ్మం వ్యయం కాదు. కనుక అవ్యయమైన ఈ బ్రహ్మమును నశింపజేయడం ఎవరికీ సాధ్యం కాదు. ఎవడు కూడా తన్ను తాను నాశనం చేసుకోలేడు, ఈశ్వరుడు కూడా. ఎందుకంటే బ్రహ్మమే ఆత్మ. తనయందు తనకు ఏ క్రియా జరుగదు.

**భాష్యమ్ : 18.0 కిం పునః తత్ అసత్ యత్ స్వాత్మసత్తాం వ్యభిచరతి ఇతి? ఉచ్యతే.**

**తె.అ.** అయితే తన సత్తును వదలివేసే ఆ అసత్తు ఏమిటి? అంటే చెబుతున్నాడు.

**మూ. అంతవంత ఇమే దేహా నిత్యస్యోక్తాః శరీరిణః ।**
**అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత ॥ 18**

**తె.అ.** అర్జునా! ఆత్మ శరీరి. అది నిత్యము. దానికి నాశనం లేదు. అది ఏ ప్రమాణాన్ని అపేక్షించనిది. ఆ శరీరి యొక్క ఈ శరీరాలు అంతమయేవి. కనుక యుద్ధం చేయి.

**భాష్యమ్ : 18.1 అంతవంతః ఇతి. అంతః వినాశః విద్యతే యేషాం తే అంతవంతః. యథా మృగతృష్ణికాదౌ సద్బుద్ధిః అనువృత్తా ప్రమాణనిరూపణాంతే విచ్ఛిద్యతే, స తస్య అంతః; తథా ఇమే దేహాః స్వప్నమాయా దేహాదివచ్చ అంతవంతః నిత్యస్య శరీరిణః శరీరవతః అనాశినః అప్రమేయస్య ఆత్మనః అంతవంతః ఇతి ఉక్తాః వివేకిభిః ఇత్యర్థః. 'నిత్యస్య' 'అనాశినః' ఇతి న పునరుక్తమ్; నిత్యత్వస్య ద్వివిధత్వాత్ లోకే, నాశస్య చ.యథా దేహః భస్మీభూతః అదర్శనం గతః నష్టః ఉచ్యతే. విద్యమానోఽపి యథా అన్యథా పరిణతః వ్యాధ్యాదియుక్తః జాతః నష్టః ఉచ్యతే. తత్ర 'నిత్యస్య' 'అనాశిన'ః ఇతి ద్వివిధేనాపి నాశేన అసంబద్ధస్య ఇత్యర్థః. అన్యథా పృథివ్యాదివత్ అపి నిత్యత్వం స్యాత్ ఆత్మనః, తత్ మా భూత్ ఇతి 'నిత్యస్య' 'అనాశినః' ఇత్యాహ.**

**తె.అ.** వేటికి అంతం అంటే వినాశముందో అవి అంతవంతములు. ఎండమావిలో నీరున్నది అన్న సద్బుద్ధి ప్రమాణం చేత నిరూపించబడిన తరువాత విచ్ఛిన్నమవుతున్నది. అది దాని అంతం. అట్లాగే ఈ దేహాలు. స్వప్నంలో కనిపించిన దేహాలవలె మాయచేత కల్పించిన దేహాలవలె అంతమయేవి. ఆత్మ శరీరి. అది నిత్యము, నాశరహితమైనది, ప్రమాణాతీతము ఊహింపశక్యం కానిది. ఆ శరీరి యొక్క ఈ శరీరాలన్నీ నశ్వరములు అని వివేకం గల వారంటారు అని అర్థం. నిత్యము, అవినాశి అనడం పునరుక్తి గాదు. లోకంలో నిత్యత్వము నాశము రెండువిధాలుగా వున్నాయి. ఎట్లాగంటే ఈ దేహం బూడిదై కనిపించనపుడు నశించింది అంటున్నాం. వ్యాధివల్లనో మరొక కారణం చేతనో మరొకవిధంగా మార్పు చెందినపుడు కూడా, అది కనిపిస్తూ ఉన్నా, నాశనమైంది అంటున్నాం. అవినాశి నిత్యము అనడం ఈ రెండు విధాలైన నాశము దీనికి లేదు అని చెప్పడానికి. ఇట్లా అనకపోతే భూమి మొదలైన వాటి నిత్యత్వం వలెనే ఆత్మయొక్క నిత్యత్వము అని అర్థం కలుగుతుంది. అట్లా కాదు అనడానికే అవినాశి నిత్యము అనడం.

**భాష్యమ్ : 18.2 అప్రమేయస్య స ప్రమేయస్య ప్రత్యక్షాది ప్రమాణైః అపరిచ్ఛేద్యస్య ఇత్యర్థః. నను ఆగమేన ఆత్మా పరిచ్ఛిద్యతే, ప్రత్యక్షాదినా చ పూర్వమ్. న, ఆత్మనః స్వతః సిద్ధత్వాత్. సిద్ధే హి ఆత్మని ప్రమాతరి ప్రమిత్సోః ప్రమాణాన్వేషణా భవతి. న హి పూర్వం 'ఇత్థం అహం' ఇతి ఆత్మానం అప్రమాయ పశ్చాత్ ప్రమేయ పరిచ్ఛేదాయ ప్రవర్తతే. న హి ఆత్మా నామ కస్యచిత్ అప్రసిద్ధః భవతి. శాస్త్రం తు అంత్యం ప్రమాణం అతద్ధర్మాద్ధ్యారోపణమాత్ర నివర్తకత్వేన**

**ప్రామాణ్యం ఆత్మనః ప్రతిపద్యతే, న తు అజ్ఞాతార్థజ్ఞాపకత్వేన. తథా చ శ్రుతిః – 'యత్ సాక్షాదపరోక్షాద్ బ్రహ్మ య ఆత్మా సర్వాంతరః'. (బృ.ఉ.3.4.1) ఇతి.**

**యస్మాత్ ఏవం నిత్యః అవిక్రియశ్చ ఆత్మా తస్మాత్ యుధ్యస్వ, యుద్ధాత్ ఉపరమం మా కార్షీః ఇత్యర్థః. న హి అత్ర యుద్ధకర్తవ్యతా విధీయతే, యుద్ధే ప్రవృత్తః ఏవ హి అసౌ శోకమోహ ప్రతిబద్ధః తూష్ణీం ఆస్తే. అతః తస్య కర్తవ్య ప్రతిబంధాపనయనమాత్రం భగవతా క్రియతే. తస్మాత్ 'యుధ్యస్వ' ఇతి అనువాదమాత్రం. న విధిః.**

**తె.అ.** ప్రత్యక్షాది ప్రమాణాలచేత నిశ్చయింపరానిది అప్రమేయం. (ఆత్మను తెలియడానికి ఏ ప్రమాణము పనిలేదు.)

ఆక్షేపణ – శాస్త్రం ఆత్మ స్వరూపాన్ని నిరూపిస్తున్నది గదా? ప్రత్యక్షంగా కూడా ఆత్మను తెలుసుకోవడం పూర్వం ఉన్నదే.

సమాధానం – కాదు. ఆత్మ స్వతస్సిద్ధం. తెలుసుకొనదగిన ఆత్మ సిద్ధంగా ఉన్నపుడే దాన్ని తెలుసుకోవాలనుకున్నవాడు ప్రమాణాలు వెదకడం ప్రారంభిస్తాడు. ముందు నేనిట్లా అని తన్ను తాను తెలిసికోకుండా ఎవడూ మరొక వస్తువును తెలుసుకొనే ప్రయత్నం చేయడు. ఎవడికీ తన ఆత్మ అప్రసిద్ధంగా ఉండదు. (నేనున్నానన్నది ప్రతివాడికీ ప్రత్యక్షం. అందులో అనుమానం లేదు. ఆగమం అసలు పనిలేదు). ప్రమాణాలలో చివరిదైన శాస్త్రం ఆత్మయందు ఆరోపించబడిన అనాత్మను తొలగించడం వరకే ప్రమాణం, తెలియని వస్తువును తెలుసుకోడంలో కాదు. 'మన ఎదుట అపరోక్షంలో ఉన్నదే బ్రహ్మం. అదే అంతటా నిండివున్న ఆత్మ', అని శ్రుతి (బృ.ఉ.3.4.1) కూడా అంటున్నది. ఈ విధంగా ఆత్మ నిత్యము, వినాశనము లేనిది. కనుక యుద్ధం చేయి. యుద్ధం మానవద్దు అని అర్థం. ఇక్కడ యుద్ధం కర్తవ్యమని విధించడంలేదు. యుద్ధానికి పూనుకున్నవాడు శోకమోహాలచేత ప్రతిబద్ధుడై ఆగిపోయినపుడు ఆ ప్రతిబంధకాలైన శోకమోహాలను తొలగించడం మాత్రమే భగవానుని పని. యుద్ధం చేయి అనడం అనుమోదన మాత్రం, విధించడం కాదు.

**భాష్యమ్ : 19.0 శోకమోహాది సంసారకారణనివృత్త్యర్థం గీతాశాస్త్రం, న ప్రవర్తకం, ఇతి ఏతస్య అర్థస్య సాక్షిభూతే ఋచౌ (కఠ.ఉ.2.18.19) ఆనినాయ భగవాన్. యత్తు మన్యసే 'యుద్ధే భీష్మాదయః మయా హన్యంతే, అహమ్ ఏవ తేషాం హంతా' ఇతి ఏషా బుద్ధిః మృషైవ తే. కథం?**

**తె.అ.** శోకమోహాది సంసారకారణాల నివృత్తికొరకే గీతాశాస్త్రం, ప్రవర్తకం (ప్రవృత్తి కొరకు)

కాదు. ఈ అర్థానికి సాక్షిభూతమైన రెండు ఋక్కులను (కఠ.ఉ.2.18,19) భగవానుడు ఉదహరిస్తున్నాడు. 'భీష్మాదులు యుద్ధంలో నా చేతిలో చనిపోతారు.' 'నేనే వారి హంతకుడిని' అని నీవనుకోవడం మిథ్య మాత్రమే. ఎట్లా అంటే

**మూ. య ఏనం వేత్తి హన్తారం యశ్చైనం మన్యతే హతమ్ ।**
**ఉభౌ తౌ న విజానీతో నాయం హన్తి న హన్యతే ॥ 19**

**తె.అ.** నేను చంపుతున్నాను అని నేను చంపబడుతున్నాను (ఆత్మ చంపుతుంది, చంపబడుతుంది) అని అనుకునే వారిద్దరు తెలిసినవారు కారు. ఆత్మ చంపదు, చంపబడదు.

**భాష్యమ్ : 19.1 య ఏనం ఇతి. యః ఏనం ప్రకృతం దేహినం వేత్తి విజానాతి హంతారం హనన క్రియాయాః కర్తారం, యః చ ఏనం అన్యః మన్యతే హతం దేహహననేన 'హతః అహమ్.' ఇతి హనన క్రియాయాః కర్మభూతం, తౌ ఉభౌ న విజానీతః న జ్ఞాతవంతౌ అవివేకేన ఆత్మానమ్. 'హంతా అహమ్,' 'హతః అస్మి అహమ్' ఇతి దేహహననేన ఆత్మానం అహం ప్రత్యయవిషయం యౌ విజానీతః తౌ ఆత్మస్వరూపానభిజ్ఞౌ ఇత్యర్థః. యస్మాత్ న అయం ఆత్మా హంతి న హనన క్రియాయాః కర్తా భవతి, న హన్యతే న చ కర్మ భవతీత్యర్థః, అవిక్రియత్వాత్.**

**తె.అ.** హంత అంటే హననక్రియకు కర్త, చంపువాడు. హతం అంటే హననక్రియకు కర్మ, చంపబడువాడు. ప్రస్తుతం మనం చెప్పుకుంటున్న దేహిని హంత అనుకునేవాడు, దేహం చనిపోయినపుడు అది హతమయిందనుకునే వాడు – వీరిద్దరూ అహం ప్రత్యయవిషయమైన ఆత్మను అవివేకకారణంగా తెలిసినవాళ్ళు కారు. దేహం చనిపోయినపుడు నేను చంపాను నేను చచ్చాను అని అనుకునేవాళ్ళిద్దరూ ఆత్మ స్వరూపం ఏ మాత్రము తెలిసినవాళ్ళు కారు. ఎందుకంటే ఈ ఆత్మ చంపదు. హనన క్రియకు కర్త కాదు. చంపబడదు, హననక్రియకు కర్మ కాదు. అది క్రియలేనిది.

**భాష్యమ్ : 20.0 కథం అవిక్రియః ఆత్మా ఇతి ద్వితీయః మంత్రః–**

**తె.అ.** ఆత్మ ఎట్లా అవిక్రియం అనేదానికి రెండవ ఋక్కు –

**మూ. న జాయతే మ్రియతే వా కదాచిన్నాయం భూత్వాఽభవితా వా న భూయః ।**
**అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే ॥ 20**

**తె.అ.** ఈ ఆత్మ పుట్టడం లేదు. ఇది ఎప్పటికీ చావదు కూడా. ఇది ఒకప్పుడుండి మళ్ళీ లేకపోవడం లేదు. ఇది పుట్టుకలేనిది, నిత్యము, శాశ్వతము, పురాణము, చంపబడుతున్న శరీరంలో (శరీరంతో పాటు) ఇది చావదు.

**భాష్యమ్ : 20.1 న జాయతే ఇతి. న జాయతే న ఉత్పద్యతే, జనిలక్షణా వస్తువిక్రియా న ఆత్మనః విద్యతే ఇత్యర్థః. తథా న మ్రియతే వా. వా శబ్దః చార్థే. న మ్రియతే చ ఇతి అంత్యా వినాశలక్షణా విక్రియా ప్రతిషిధ్యతే. కదాచిత్ శబ్దః సర్వవిక్రియా ప్రతిషేధైః సంబధ్యతే – న కదాచిత్ జాయతే, న కదాచిత్ మ్రియతే, ఇత్యేవమ్. యస్మాత్ అయం ఆత్మా భూత్వా భవనక్రియాం అనుభూయ పశ్చాత్ అభవితా అభావం గంతా న భూయః పునః, తస్మాత్ న మ్రియతే. యో హి భూత్వా న భవితా స మ్రియతే ఇతి ఉచ్యతే లోకే. వా శబ్దాత్ న శబ్దాచ్చ అయం ఆత్మా అభూత్వా వా భవితా దేహవత్ న భూయః పునః. తస్మాత్ న జాయతే. యో హి అభూత్వా భవితా స జాయతే ఇతి ఉచ్యతే. నైవం ఆత్మా. అతః న జాయతే. యస్మాత్ ఏవం తస్మాత్ అజః. యస్మాత్ న మ్రియతే తస్మాత్ నిత్యః చ.**

**తె.అ.** ఆత్మ పుట్టదు. పుట్టుక లక్షణమైన వస్తువికారం ఆత్మకు లేదు అని అర్థం. చావదు కూడా. ఇక్కడ 'వా' శబ్దం 'చ' ('కూడా') అర్థంలో వాడబడింది. చావదు కూడా అని వినాశలక్షణమైన చివరి వికారాన్ని ప్రతిషేధిస్తున్నాడు. 'కదాచిత్' ('ఎన్నడూ') అన్న శబ్దం సర్వవికార ప్రతిషేధంతో సంబంధిస్తుంది, ఎన్నడూ పుట్టదు, ఎన్నడూ చావదు ఈ విధంగా. ఈ ఆత్మ ఒకప్పుడుండి, అంటే పుట్టడం అనే వికారం పొంది, తరువాత మళ్ళీ లేకపోవడం లేదు. కనుక అది చావదు. ఒకప్పుడుండి మళ్ళీ ఉండనిదాన్ని అది చచ్చింది అని లోకంలో అంటుంటాం. 'వా', 'న' శబ్దాల వల్ల ఈ ఆత్మ దేహం వలె ముందు లేకుండా తరువాత ఉండేది కాదు, కనుక పుట్టడం లేదు అని అర్థం కలుగుతున్నది. ముందు లేకుండా వుండి తరువాత ఉండేదాన్ని లోకంలో 'పుట్టింది' అంటున్నాం. ఆత్మ అట్లాకాదు, కనుక పుట్టడం లేదు. పుట్టడం లేదు కనుక జన్మరహితము, ఉత్పత్తిలేనివాడు, చావడం లేదు కనుక నిత్యము.

**భాష్యమ్ : 20.2 యద్యపి ఆద్యన్తయోః విక్రియయోః ప్రతిషేధే సర్వాః విక్రియాః ప్రతిషిద్ధాః భవన్తి, తథాపి మధ్యభావినీనాం విక్రియాణాం స్వశబ్దైః ఏవ తదర్థైః ప్రతిషేధః కర్తవ్యః ఇతి అనుక్తానామ్ అపి యౌవనాది సమస్త విక్రియాణాం ప్రతిషేధః యథా స్యాత్ ఇత్యాహ – శాశ్వతః ఇత్యాదినా. శాశ్వతః ఇతి అపక్షయలక్షణా విక్రియా ప్రతిషిధ్యతే. శశ్వత్ భవః శాశ్వతః. నాపక్షీయతే స్వరూపేణ, నిరవయవత్వాత్. నిర్గుణత్వాచ్చ నాపి గుణక్షయేణ అపక్షయః. అపక్షయవిపరీతా అపి వృద్ధిలక్షణా విక్రియా ప్రతిషిధ్యతే పురాణః ఇతి. యః హి అవయవాగమేన ఉపచీయతే సః వర్ధతే, అభినవః ఇతి చ ఉచ్యతే. అయం తు ఆత్మా నిరవయవత్వాత్ పురాపి నవః ఏవ ఇతి పురాణః; న వర్ధతే ఇత్యర్థః. తథా – న హన్యతే న విపరిణమ్యతే, ఇత్యర్థః హన్యమానే విపరిణమ్యమానేఽపి శరీరే. హన్తిః అత్ర విపరిణామార్థః ద్రష్టవ్యః అపునరుక్తతాయై.**

**అస్మిన్ మన్త్రే షట్ భావవికారాః లౌకిక వస్తు విక్రియాః ఆత్మని ప్రతిషిధ్యన్తే. సర్వప్రకారవిక్రియా రహితః ఆత్మా ఇతి వాక్యార్థః. యస్మాత్ ఏవం తస్మాత్ 'ఉభౌ తౌ న విజానీతః' (2.19) ఇతి పూర్వేణ మన్త్రేణ అస్య సంబన్ధః.**

**తె.అ.** మొదలు తుది అనే రెండు వికారాలు లేవు అని చెప్పడంతో వికారాలు అన్నీ కూడా లేవని చెప్పినట్లే అయినా మధ్యలో కలిగే వికారాలను కూడా ప్రత్యేకించి లేవని చెప్పవలసి వుంది అని. చెప్పని యౌవనం మొదలైన వికారాలన్నింటినీ లేవని చెప్పడం కొరకు శాశ్వతము మొదలైన మాటలు వాడబడ్డాయి. ఎప్పుడూ ఉండేది శాశ్వతం, అపక్షయ లక్షణమైన వికారం లేదని చెప్పడానికి శాశ్వత శబ్దం. అవయవాలు లేవు కనుక స్వరూపంలో క్షయం లేదు. నిర్గుణం కనుక గుణంలోను క్షయం లేదు. అపక్షయానికి విపరీతమైన వృద్ధి లక్షణంగా గల వికారం కూడా లేదు అనడానికి పురాణశబ్దం. అవయవం కలిగి లావయినపుడు దానిని వృద్ధిచెందినది, కొత్తది అయింది అంటాము. కాని ఈ ఆత్మకు అవయవాలు లేవు. పూర్వమే కొత్తది (పురాణం). అందుకే వృద్ధి చెందడం అన్నది లేదు. చంపబడడం లేదు కూడా. శరీరం చంపబడి విపరీతమైన పరిణామం చెందినపుడు కూడా ఆత్మ ఏ విధమైన మార్పు చెందడం లేదు. ఇక్కడ 'హన్తిః' క్రియకు విపరిణామమనే అర్థం చెప్పుకోవలెను. లేకపోతే పునరుక్తి అవుతుంది. అంటే ఆత్మస్వరూపం నుండి మారదు అని అర్థం. లోకంలోని వస్తువులకు కలిగే షడ్భావ వికారాలు ఆత్మకు లేవని ఈ మంత్రం చెపుతున్నది. ఆత్మ ఏ రకమైన వికారము లేనిది అని వాక్యార్థం. కనుక వారిద్దరూ తెలిసినవారు కారు అని వెనుకటి శ్లోకంతో దీన్ని కలుపుకోవాలి.

**భాష్యమ్ : 21.0 'య ఏనం వేత్తి హన్తారమ్' (2.19) ఇత్యనేన మంత్రేణ హననక్రియాయాః కర్తా కర్మ చ న భవతీతి ప్రతిజ్ఞాయ 'న జాయతే' ఇత్యనేన అవిక్రియత్వే హేతుమ్ ఉక్త్వా ప్రతిజ్ఞాతార్థమ్ ఉపసంహరతి.**

**తె.అ.** 'య ఏనం వేత్తి హన్తారమ్' (2.19) అనే శ్లోకంలో ఆత్మ హననక్రియకు కర్తగాని కర్మగాని కాదు అని ప్రకటించి, 'న జాయతే' (2.20) లో ఆ క్రియ లేకపోవడానికి కారణం చెప్పి ప్రకటార్థాన్ని ముగిస్తున్నాడు–

**మూ. వేదావినాశినం నిత్యం య ఏనమజమవ్యయమ్ ।**
**కథం స పురుషః పార్థ కం ఘాతయతి హన్తి కమ్ ॥ 21**

**తె.అ.** పార్థా! ఈ ఆత్మ పుట్టుకలేనిదిగాను, నాశరహితునిగాను, నిత్యునిగాను తెలిసినవాడు ఎవర్నిగాని ఎట్లా చంపించగలడు చంపగలడు?

**భాష్యమ్ : 21.1 వేదావినాశినమితి :- వేద విజానాతి, అవినాశినమ్ అన్త్యభావ వికారరహితం, నిత్యం, విపరిణామరహితం "యః వేద" ఇతి సంబన్ధః. ఏనం పూర్వేణ మన్త్రేణ ఉక్తలక్షణమ్ అజం, జన్మరహితమ్, అవ్యయమ్, అపక్షయరహితం, కథం కేన ప్రకారేణ సః విద్వాన్ పురుషః అధికృతః హన్తి, హనన క్రియాం కరోతి? కథం వా ఘాతయతి హన్తారం ప్రయోజయతి? న కథం చిత్ హన్తి, న కథంచిత్ కంచిత్ ఘాతయతి ఇతి ఉభయత్ర ఆక్షేపః, ఏవార్థః ప్రశ్నార్థాసంభవాత్. హేత్వర్థస్య అవిక్రియత్వస్య తుల్యత్వాత్ విదుషః సర్వకర్మప్రతిషేధ ఏవ ప్రకరణార్థః అభిప్రేతః భగవతః. హన్తేస్తు ఆక్షేపః ఉదాహరాణార్థత్వేన కథితః.**

**తె.అ.** వెనుకటి మంత్రంలో చెప్పినట్లు ఆత్మ అవినాశి. అంటే వికారాలలో చివరిదైన చావు లేనిది, నిత్యము, అంటే మధ్యలో వచ్చే మార్పులు లేనిది, అజము, జన్మలేనిది. అవ్యయము, అపక్షయం లేనిది అని ఈ విధంగా ఆత్మ తత్త్వం తెలిసినవాడు అధికారి (యుద్ధం చేయడం ధర్మమైనవాడు, యుద్ధం చేస్తూ) ఎట్లా చంపగలడు ఎట్లా చంపించగలడు? ఏ విధంగానూ ఎవ్వరినీ చంపలేడు, ఏ విధంగానూ ఎవ్వరినీ చంపించనూలేడు. ఎట్లా చంపగలడు ఎట్లా చంపించగలడు అన్నవి రెండూ ప్రశ్నలు కావు, ఆక్షేపం వాటి అర్థం. మార్పులేనిది అనే హేతువు అన్ని క్రియలకు ఒకటే కనుక విద్వాంసునికి సర్వకర్మ ప్రతిషేధమే భగవానునికి అభీష్టమైన ప్రకరణార్థం. చంపడం లేదు అని చెప్పడం ఉదాహరణం కొరకే. (చంపడం చంపించడం అనే క్రియలు మాత్రమే చేయడు విద్వాంసుడు, తక్కిన క్రియలన్నీ చేస్తాడు అని కాదు అర్థం. తత్త్వం తెలిసిన విద్వాంసుడు ఏ క్రియ చేయడు చేయించడు అని అర్థం.)

**భాష్యమ్ : 21.2 విదుషః కం కర్మాసంభవే హేతువిశేషం పశ్యన్ కర్మాణి ఆక్షిపతి భగవాన్ 'కథం స పురుషః' ఇతి. నను ఉక్తః ఏవ ఆత్మనః అవిక్రియత్వం సర్వకర్మాసంభవకారణవిశేషః. సత్యం ఉక్తః న తు సః కారణవిశేషః అన్యత్వాత్ విదుషః అవిక్రియాత్ ఆత్మనః ఇతి. న హి అవిక్రియం స్థాణుం విదితవతః కర్మ న సంభవతి ఇతి చేత్ – న; విదుషః ఆత్మత్వాత్. న దేహాది సంఘాతస్య విద్వత్తా. అతః పారిశేష్యాత్ అసంహతః ఆత్మా విద్వాన్ అవిక్రియః ఇతి తస్య విదుషః కర్మాసంభవాత్ ఆక్షేపః యుక్తః 'కథం స పురుషః' ఇతి.**

**తె.అ.** ఆక్షేపణ – విద్వాంసునికి కర్మలు లేకపోవడానికి ఏ ప్రత్యేకమైన హేతువు చూచి భగవానుడు 'కథం స పురుషః' అని కర్మలను ఆక్షేపిస్తున్నాడు?

సమాధానం – ఆత్మ యొక్క మార్పులేకపోవడం సర్వకర్మాసంభవకారణ విశేషమని చెప్పబడింది కదా?

ఆక్షేపణ – చెప్పబడింది. నిజమే. కాని ఆ కారణం సరి అయింది కాదు. ఎందుకంటే మార్పులేని ఆత్మ వేరు, విద్వాంసుడు వేరు. పందిరిగుంజ పనిచేయదు అని తెలిసినవాడు పనులు మానేసి కూర్చోడం లేదు గదా?

సమాధానం – కాదు. తెలుసుకునేది విద్వాంసుని ఆత్మ, దేహాది సంఘాతం కాదు. కనుక పారిశేష్యన్యాయంలో దేహాదులనన్నిటినీ తొలగించిన తరువాత చివరికి మిగిలే ఆత్మ మార్పులేనిది, తెలుసుకునేదీ అదే, అటువంటి విద్వాంసునికి కర్మ అసంభవం. కనుకనే 'కథం స పురుషః' అన్నదాంట్లో ఆక్షేపం సరి అయినదే.

**భాష్యమ్ : 21.3 యథా బుద్ధ్యాద్యాహృతస్య శబ్దాద్యర్థస్య అవిక్రియః ఏవ సన్ బుద్ధివృత్త్య–వివేకవిజ్ఞానేన అవిద్యయా ఉపలబ్ధా ఆత్మా కల్ప్యతే. ఏవం ఏవ ఆత్మానాత్మవివేకజ్ఞానేన బుద్ధివృత్త్యా విద్యయా – అసత్యరూపయా ఏవ పరమార్థతః అవిక్రియః ఏవ ఆత్మా విద్వాన్ ఉచ్యతే. విదుషః కర్మాసంభవవచనాత్ యాని కర్మాణి శాస్త్రేణ విధీయంతే తాని అవిదుషః విహితాని ఇతి భగవతః నిశ్చయోఽవగమ్యతే.**

**తె.అ.** వాస్తవంలో ఏమీ చేయని ఆత్మను చేస్తున్నది అంటాం. ఇట్లా అనడానికి రెండు కారణాలు – అవిద్య, విద్య. బుద్ధి వ్యాపారం వేరు ఆత్మ వేరు అని తెలియకపోవడం అవిద్య. ఈ అవిద్య మూలంగా బుద్ధి గ్రహిస్తున్న శబ్దాది విషయాలు ఆత్మ గ్రహిస్తున్నది అంటున్నాం. ఆత్మ వేరు అనాత్మ వేరు అని తెలుసుకునే బుద్ధి వ్యాపారం విద్య. ఇదీ రూపంలేనిదే. ఈ విద్యవల్ల ఆత్మను విద్వాన్ (తెలుసుకున్నవాడు) అంటున్నాం. విద్వాంసునికి సర్వకర్మాసంభవం చెప్పడం వలన శాస్త్రం విధించిన కర్మలన్నీ అవిద్వాంసునికే విధించబడినవని అనేది భగవానుని నిశ్చయము అని అర్థమవుతున్నది.

**భాష్యమ్ : 21.4 నను విద్యాపి అవిదుషః ఏవ విధీయతే, విదితవిద్యస్య పిష్టపేషణవత్ విద్యావిధానానర్థక్యాత్, తత్ర అవిదుషః కర్మాణి విధీయన్తే, న విదుషః ఇతి విశేషః నోపపద్యతే. న, అనుష్ఠేయస్య భావాభావవిశేషోపపత్తేః. అగ్నిహోత్రాదివిధ్యర్థజ్ఞానోత్తరకాలమ్ అగ్నిహోత్రాదికర్మ అనేక సాధనోపసంహారపూర్వకమ్ అనుష్ఠేయం, 'కర్తా అహమ్ మమ కర్తవ్యమ్' ఇత్యేవంప్రకారక–విజ్ఞానవతః అవిదుషః యథా అనుష్ఠేయం భవతి న తు తథా "న జాయతే" ఇత్యాద్యాత్మస్వరూప విధ్యర్థజ్ఞానోత్తర కాలభావి కించిత్ అనుష్ఠేయం భవతి, (కింతు) "న అహం కర్తా" "న అహం భోక్తా" ఇత్యాద్యాత్మైకత్వాకర్తృత్వాది విషయజ్ఞానాత్ అన్యత్ న ఉత్పద్యత ఇతి ఏషః విశేషః ఉపపద్యతే. యః పునః "కర్తా అహమ్" ఇతి వేత్తి ఆత్మానం, తస్య "మమ ఇదం కర్తవ్యమ్" ఇతి అవశ్యంభావినీ బుద్ధిః స్యాత్; తదపేక్షయా సః అధిక్రియతే ఇతి తం ప్రతి కర్మాణి,**

**సంభవంతి. స చ అవిద్వాన్ "ఉభౌ తౌ న విజానీతః" (2.19) ఇతి వచనాత్. విశేషితస్య చ విదుషః కర్మాక్షేప వచనాత్ – "కథం స పురుషః" (2.21) ఇతి. తస్మాత్ విశేషితస్య అవిక్రియాత్మదర్శినః విదుషః ముముక్షోః చ సర్వకర్మసంన్యాసే ఏవ అధికారః.**

**అత ఏవ భగవాన్ నారాయణః సాంఖ్యాన్ విదుషః, అవిదుషః చ కర్మిణః ప్రవిభజ్య ద్వే నిష్ఠే గ్రాహయతి – "జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్" (3.3) ఇతి. తథా చ పుత్రాయ ఆహ భగవాన్ వ్యాసః – "ద్వావిమావథ పన్థానౌ" (మ.భా.శాం.240.6) ఇత్యాది. తథా చ "క్రియాపథశ్చైవ పురస్తాత్ పశ్చాత్ సంన్యాసశ్చ" (తై.ఆ.10.62.12 అర్థతోనువాదం). ఇతి ఏతమేవ విభాగం పునః పునః దర్శయిష్యతి భగవాన్ – "అతత్త్వవిదహంకార విమూఢాత్మా కర్తాహమితి మన్యతే", "తత్త్వవిత్తు న అహం కరోమి" (3.27-28) ఇతి. తథా చ "సర్వ కర్మాణి మనసా సంన్యస్యాస్తే" (5.13) ఇత్యాది.**

**తె.అ.** ఆక్షేపణ – విద్య కూడా అవిద్వాంసుడికే (విద్వాంసుడు కానివారికే) గదా విధించబడింది. విద్య నెరిగినవానికి విద్యను విధించడం కొట్టినపిండి కొట్టినట్లుగా అర్థం లేనిది. అటువంటప్పుడు అవిద్వాంసునికే కర్మలు విధించబడినవి విద్వాంసునికి కాదు అని ప్రత్యేకించి చెప్పడం కుదరదు.

సమాధానం – కాదు. అనుష్ఠించదగింది ఉండడం లేకపోవడం అన్న విశేషం ఉంది. అగ్నిహోత్రాదులను విధించే వాక్యాలను అర్థం చేసుకున్న తరువాత అగ్నిహోత్రాది కర్మను 'నేను కర్తను' 'ఇది నా కర్తవ్యము' అనుకునే అవిద్వాంసునికి ఏ విధమైన అనుష్ఠానం చేయవలసి ఉంటుందో ఆ విధంగా 'న జాయతే' మొదలైన ఆత్మ స్వరూప విధాయక వాక్యార్థం తెలిసిన విద్వాంసునికి కలగడం లేదు. కర్తను భోక్తను కాను, ఉన్నదొకే ఆత్మ, అది ఏమీ చేయదు అని తెలుసుకోవడం వల్ల కర్తవ్యమేమీ కలగడం లేదు. కనుకనే విద్వాంసుని విషయంలో విశేషం. నేను కర్తను అని తనను గురించి అనుకునేవానికి ఇది నా కర్తవ్యం అనే బుద్ధి కూడా తప్పక కలుగుతుంది. ఆ బుద్ధి వలన కర్మలకు వాడు అధికారి అవుతున్నాడు. వానికే కర్మలు. వాడే అవిద్వాంసుడు, 'వారిద్దరూ తెలిసివారు కారు' (2.19) అన్న వాక్యానుసారం కర్మలు లేవు అని చెప్పే 'ఎట్లా చంపగలడు చంపించగలడు?" అన్నమాట విద్వాంసుని విశేషిస్తున్నది. కనుక అవిక్రియమైన ఆత్మను దర్శించిన విశిష్టుడైన విద్వాంసునికి ముముక్షువుకు సర్వకర్మ సంన్యాసమందే అధికారం. కనుకనే భగవానుడైన నారాయణుడు 'సాంఖ్యులకు జ్ఞానయోగము యోగులకు కర్మయోగము' (3.3) అని విద్వాంసులైన సాంఖ్యులను అవిద్వాంసులైన కర్మిష్ఠులను విభజించి రెండు నిష్ఠలు గ్రహింపజేశాడు. వ్యాసభగవానుడు కూడా పుత్రునితో ఇదే అన్నాడు, 'మార్గాలు ఇవి రెండు' (మ.భా.శాం.241.6) మొదలైన వాక్యాలు. ఇదేవిధంగా 'ముందు కర్మమార్గము

తరువాత సన్న్యాసము' (తై.ఆ. 10.62.12) అని. ఈ విభాగమే భగవానుడు పదే పదే ప్రదర్శిస్తాడు. తత్త్వం తెలియనివాడు 'అహంకారం చేత మూఢబుద్ధి కలవాడు నేను కర్తను అని అనుకుంటున్నాడు' (3.27), తత్త్వం తెలిసిన వాడేమో 'నేను చేయడంలేదు' (3.28) అని, 'సర్వధర్మాలను మనసుతో సంన్యసించి' (5.13) మొదలైన వాక్యాలు కూడా చెప్పనున్నాడు.

**భాష్యమ్ : 21.5 తత్ర కేచిత్ పండితంమన్యాః వదన్తి - జన్మాదిషడ్భావవిక్రియారహితః, అవిక్రియః అకర్తా, ఏకః, అహమ్ ఆత్మా ఇతి న కస్యచిత్ జ్ఞానమ్ ఉత్పద్యతే. యస్మిన్ సతి సర్వకర్మసంన్యాసః ఉపదిశ్యతే, ఇతి. తత్ న; "న జాయతే" ఇత్యాది శాస్త్రోపదేశానర్థక్యాత్. యథా చ శాస్త్రోపదేశ సామర్థ్యాత్ ధర్మాధర్మాస్తిత్వ విజ్ఞానం కర్తుశ్చ దేహాన్తర సంబన్ధవిజ్ఞానం చ ఉత్పద్యతే, తథా శాస్త్రాత్ తస్యైవ ఆత్మనః అవిక్రియత్వాకర్తృత్వైకత్వాది విజ్ఞానం కస్మాత్ న ఉత్పద్యతే ఇతి ప్రష్టవ్యాః తే. కరణాగోచరత్వాత్ ఇతి చేత్ - న, "మనసైవానుద్రష్టవ్యమ్' (బృ.ఉ.4.4.19) ఇతి శ్రుతేః. శాస్త్రాచార్యోపదేశ శమదమాదిసంస్కృతం మనః ఆత్మదర్శనే కరణమ్. తథా చ తదధిగమాయ అనుమానే ఆగమే చ సతి జ్ఞానం నోత్పద్యతే ఇతి సాహసమ్ ఏతత్.**

**తె.అ.** పండితులమనుకునే కొందరు ఈ విషయంలో అంటారు - పుట్టుకనుండి కలిగే ఆరు వికారాలు లేని అకర్త ఏకము అయిన ఆత్మను నేను అన్న జ్ఞానం అసలెవరికీ కలగనే కలగదు. కనుక సర్వకర్మ సంన్యాసం ఉపదేశించడం అనే ప్రసక్తే లేదు.

సమాధానం - కాదు. అట్లా అయితే శాస్త్రం వ్యర్థమవుతుంది. వీళ్ళను మనం ఒక మాట అడగవచ్చు. శాస్త్రోపదేశసామర్థ్యం చేత ధర్మం ఉన్నదన్న జ్ఞానం, దేహాంతరసంబంధమైన జ్ఞానం కలుగుతున్నపుడు, ఆత్మ వినాశనంలేనిది, అకర్త, ఏకము, అనే జ్ఞానం శాస్త్రం చేత ఎందుకు కలుగకూడదట? మనోబుద్ధ్యాది కరణాలకు ఆత్మ అగోచరం కనుక, అంటారా? కాదు. "మనసుచేతనే చూడదగినది" (బృ.4.4.19) అని శ్రుతి. శాస్త్రాచార్య ఉపదేశం వల్ల శమదమాది సాధనల వల్ల సంస్కృతమైన మనస్సు ఆత్మదర్శనసాధనమవుతుంది. అంతేకాకుండా ఆత్మప్రాప్తికి అనుమానము, ఆగమము ప్రమాణాలుగా ఉన్నపుడు అసలు జ్ఞానమే కలగదు అనడం సాహసం.

**భాష్యమ్ : 21.6 జ్ఞానం చ ఉత్పద్యమానం తద్విపరీతం అజ్ఞానం అవశ్యం బాధతే ఇతి అభ్యుపగంతవ్యమ్. తత్ చ అజ్ఞానం దర్శితం 'హంతా అహం, హతః అస్మి' ఇతి, "ఉభౌ తౌ న విజానీతః" (2.19) ఇతి. అత్ర చ ఆత్మనః హననక్రియాయాః కర్తృత్వం, కర్మత్వం, హేతుకర్తృత్వం చ అజ్ఞానకృతం దర్శితమ్. తత్ చ సర్వక్రియాసు అపి సమానం కర్తృత్వాదేః అవిద్యాకృతత్వం,**

**అవిక్రియత్వాత్ ఆత్మనః. విక్రియావాన్ హి కర్తా ఆత్మనః కర్మభూతం అన్యం ప్రయోజయతి 'కురు' ఇతి – తత్ ఏతత్ అవిశేషేణ విదుషః సర్వక్రియాసు కర్తృత్వం హేతుకర్తృత్వం చ ప్రతిషేధతి భగవాన్ వాసుదేవః విదుషః కర్మాధికారాభావప్రదర్శనార్థం "వేదావినాశినం ... కథం స పురుషః" ఇత్యాదినా.**

**తె.అ.** ఉత్పన్నమైన జ్ఞానం దానికి విపరీతమైన అజ్ఞానాన్ని తప్పక బాధిస్తుంది అని ఒప్పుకోక తప్పదు. ఆ అజ్ఞానం 'నేను హంతను హతుడను, అనడంలో చూశాం. "వారిద్దరూ తెలిసినవారు కారు" అన్న వాక్యం ఈ అజ్ఞానం గురించే. ప్రస్తుత శ్లోకంలో కూడా ప్రదర్శించబడింది, ఆత్మయందు మనం హననక్రియ, కర్తృత్వము, కర్మత్వము, హేతుకర్తృత్వము చూడడం అజ్ఞానం వల్లనే అని. ఆత్మ అవిక్రియం కనుక కర్తృత్వము మొదలైనవాటిని చూసినట్లుగానే అన్ని క్రియలు మనం అవిద్య వల్లనే చూస్తున్నాం. వికారి అయినవాడే కర్త అయి తనకు కర్మ అయిన మరొకరిచేత 'చేయి' అని కర్మ చేయించగలడు. విద్వాంసునికి కర్మలయందు అధికారం లేదు అని ప్రదర్శించడానికి 'అవినాశి అని తెలుసుకో ...' 'ఎట్లా చంపగలడు చంపించగలడు' మొదలైన వాక్యాలలో విద్వాంసుడు ఎంతమాత్రము ఏ కర్మా చేయడు చేయించడు అంటున్నాడు భగవానుడు.

**భాష్యమ్ : 21.7 క్వ పునః విదుషః అధికారః ఇతి? ఏతత్ ఉక్తం పూర్వమేవ 'జ్ఞానయోగేన సాంఖ్యానామ్' (3.3) ఇతి. తథా చ సర్వకర్మసంన్యాసం వక్ష్యతి 'సర్వకర్మాణి మనసా' (5.13) ఇత్యాదినా.**

**నను 'మనసా' ఇతి వచనాత్ న వాచికానాం కాయికానాం చ సంన్యాసః ఇతి చేత్ – న, సర్వకర్మాణి ఇతి విశేషితత్వాత్. మానసానాం ఏవ సర్వకర్మణాం ఇతి చేత్ – న, మనోవ్యాపార పూర్వకత్వాత్ వాక్కాయవ్యాపారాణాం, మనోవ్యాపారాభావే తదనుపపత్తేః, శాస్త్రీయాణాం వాక్కాయకర్మణాం కారణాని మానసాని కర్మాణి వర్జయిత్వా అన్యాని సర్వకర్మాణి మనసా సంన్యస్య ఇతి చేత్–న, 'నైవ కుర్వన్నకారయన్' (5.13) ఇతి విశేషణాత్. సర్వకర్మసంన్యాసః అయం భగవతా ఉక్తః మరిష్యతః, న జీవతః ఇతి చేత్ – న, 'నవద్వారే పురే దేహీ ... ఆస్తే' (5.13) ఇతి విశేషణానుపపత్తేః. న హి సర్వకర్మసంన్యాసేన మృతస్య తద్దేహే ఆసనం సంభవతి. అకుర్వతః అకారయతశ్చ దేహే సంన్యస్య ఇతి సంబంధః, న దేహే ఆస్తే ఇతి చేత్ – న, సర్వత్ర ఆత్మనః అవి– క్రియత్వావధారణాత్, ఆసనక్రియాయాః చ అధికరణాపేక్షత్వాత్, తదనపేక్షత్వాత్ చ సంన్యాసస్య. సంపూర్వస్తు న్యాసశబ్దః అత్ర త్యాగార్థః, న నిక్షేపార్థః. తస్మాత్ గీతాశాస్త్రే ఆత్మజ్ఞానవతః సంన్యాస ఏవ అధికారః, న కర్మణి ఇతి తత్ర తత్ర ఉపరిష్టాత్ ఆత్మజ్ఞాన ప్రకరణే దర్శయిష్యామః.**

**తె.అ.** మరి విద్వాంసునికి దేనియందు అధికారం అంటే ముందే చెప్పాడు. 'జ్ఞానయోగం సాంఖ్యులకు' (3.3) అని, అట్లాగే సర్వకర్మసంన్యాసం కూడా చెప్పబోతున్నాడు. 'మనసుచేత సర్వకర్మలను త్యజించి' (5.13) మొదలైనవాక్యాల్లో.

ఆక్షేపణ – మనసుచేత అంటే మానసిక కర్మలు త్యజించమని గాని వాచిక కాయిక కర్మలను సంన్యసించ మనలేదు గదా.

సమాధానం – కాదు 'అన్ని కర్మలను' అని విశేషించడం చేత.

ఆక్షేపణ – 'అన్ని' మానసిక కర్మలను అని అర్థం చేసుకోవచ్చు గదా?

సమాధానం – కాదు. వాక్కాయవ్యాపారాలన్నీ, మనోవ్యాపార పూర్వమైనవి. మనోవ్యాపారం లేనపుడు అవి కలుగవు.

ఆక్షేపణ – శాస్త్రం విధించిన వాక్కాయకర్మలకు కారణరూపమైన మానసికకర్మలు తప్ప తక్కిన అన్ని కర్మలను మనసులో త్యజించి అని అర్థమైతే?

సమాధానం – కాదు. 'చేయక చేయింపక' (5.13) అని వెంటనే అంటున్నాడు.

ఆక్షేపణ –భగవానుడు చెప్పిన ఈ సర్వకర్మసంన్యాసం చనిపోతున్నవాళ్ళకు కాని జీవిస్తున్న వాళ్ళకు కాదు, అంటే ?

సమాధానం – కాదు, 'నవద్వారపురమైన శరీరంలో దేహి ఉంటాడు' (5.13) అన్న విశేషణం పొసగదు. సర్వకర్మసంన్యాసం చేసి మరణించినవాడు ఏ కర్మలు చేయని చేయించనివాడు ఆ దేహంలో ఉండడం అసంభవం.

ఆక్షేపణ – దేహంలో ఉంటాడు అని కాదు అక్కడ అర్థం దేహంలో సంన్యసించి (ఉంచి) అని అర్థం.

సమాధానం – కాదు, ఆత్మ మార్పుచెందనిదీ అని అన్నిచోట్ల నిశ్చయింపబడింది. 'ఉండుట' అనే క్రియకు ఆధారం అవసరం, సంన్యాసానికి లేదు. 'సం' ముందు గల 'న్యాస' శబ్దానికి నిక్షేపించటం అని కాక త్యజించడం అని అర్థం చెప్పుకోవలెను. కనుక గీతాశాస్త్రంలో ఆత్మజ్ఞానికి సంన్యాసమందే అధికారం, కర్మలందు కాదు అని ముందు ఆత్మజ్ఞాన ప్రకరణంలో ప్రతిచోటా ప్రదర్శిస్తాం.

**భాష్యమ్ : 22.0 ప్రకృతం తు వక్ష్యామః తత్ర ఆత్మనః అవినాశిత్వం ప్రతిజ్ఞాతమ్ తత్ కిమివ ఇతి? ఉచ్యతే –**

**తె.అ.** ఇక ప్రస్తుత విషయానికి వద్దాం. ఆత్మ అవినాశి అని ప్రకటించబడింది. అది ఎట్లా? చెబుతున్నాడు.

**మూ. వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరో-పరాణి ।**
**తథా శరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని సంయాతి నవాని దేహీ ॥ 22**

**తె.అ.** చిరిగిపోయిన వస్త్రాలను విడిచి వేరే కొత్తవి ధరించినట్లుగానే, దేహి శిథిలాలైన శరీరాలను విడిచి వేరే కొత్తవాటియందు ప్రవేశిస్తున్నాడు.

**భాష్యమ్ : 22.1 వాసాంసి ఇతి. వాసాంసి వస్త్రాణి జీర్ణాని దుర్బలతాం గతాని యథా లోకే విహాయ పరిత్యజ్య నవాని అభినవాని గృహ్ణాతి ఉపాదత్తే నరః పురుషః అపరాణి అన్యాని, తథా తద్వత్ ఏవ శరీరాణి విహాయ జీర్ణాని అన్యాని సంయాతి సంగచ్ఛతి నవాని దేహీ ఆత్మా పురుషవత్ అవిక్రియః ఏవ ఇత్యర్థః.**

**తె.అ.** లోకంలో పురుషుడు దుర్బలములైన గుడ్డలను వదలివేసి వేరే కొత్తవి తెచ్చుకున్నట్లు, ఆత్మ దుర్బలములైన శరీరాలను వదలి వేరు శరీరాలను కొత్తవాటిని తెచ్చుకుంటున్నది. పురుషుడు ఏ విధంగా (మారిన దుస్తులతో) మారడంలేదో, ఆత్మ కూడా (మారిన దేహాలతో) మారడం లేదు.

**భాష్యమ్ : 23.0 కస్మాత్ అవిక్రియ ఏవేతి? ఆహ –**

**తె.అ.** ఎందువలన మార్పులేనిదో చెపుతున్నాడు.

**మూ. నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః ।**
**న చైనం క్లేదయన్త్యాపః న శోషయతి మారుతః ॥ 23**

**తె.అ.** దీనిని శస్త్రములు ఛేదించలేవు. నిప్పు కాల్చలేదు. నీరు తడుపలేదు. గాలి ఎండింపలేదు.

**భాష్యమ్ : 23.1 నైనం ఛిందంతి ఇతి. ఏనం ప్రకృతం దేహినం న ఛిందంతి శస్త్రాణి, నిరవయత్వాత్ న అవయవవిభాగం కుర్వంతి. శస్త్రాణి అస్యాదీని.తథా న ఏనం దహతి పావకః, అగ్నిః అపి న భస్మీకరోతి. తథా – న చ ఏనం క్లేదయన్తి ఆపః. అపాం హి సావయవస్య వస్తునః ఆర్ద్రీభావకరణేన అవయవవిశ్లేషాపాదనే సామర్థ్యమ్. తత్ న నిరవయవే ఆత్మని సంభవతి. తథా స్నేహవత్ ద్రవ్యం స్నేహశోషణేన నాశయతి వాయుః. ఏనం తు ఆత్మానం న శోషయతి మారుతః అపి. యతః ఏవం తస్మాత్ –**

**తె.అ.** ప్రస్తుతం చెప్పుకుంటున్న ఆత్మను కత్తులు మొదలైన ఆయుధాలు ఛేదించలేవు, అవయవాలు లేవు కనుక అవయవ విభాగం చేయలేవు. అట్లాగే దీనిని అగ్ని దహించలేదు, భస్మం చేయలేదు. అట్లాగే దీనిని నీరు తడుపలేదు. అవయవాలున్నదానినే నీరు తడపడం గాని కుళ్ళునట్లు గాని చేయగలుగుతుంది. అంటే అవయవాలను వేరు చేయగలుగుతుంది. అవయవాలు లేని ఆత్మయందు అది అసంభవం. అట్లాగే నూనెతో తడిసిన వస్తువును నూనెను ఎండింపజేసి నశింపజేయగలదు గాలి. ఆత్మను మాత్రం గాలి గూడ ఎండింపజేయలేదు. కనుక –

**మూ. అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవ చ ।**
**నిత్యః సర్వగతః స్థాణురచలోఽయం సనాతనః ॥ 24**

**తె.అ.** ఈ ఆత్మ ఛేదింప శక్యం కాదు. కాలదు, తడవదు, ఎండదు. ఇది ఎప్పుడూ ఉండేది, అంతటా వ్యాపించి ఉండేది, కదలించరానిది. ఎప్పటికీ ఉండేది.

**భాష్యమ్ : 24.1 అచ్ఛేద్యోఽయమితి – యస్మాత్ అన్యోన్య నాశహేతూని భూతాని ఏనమ్ ఆత్మానం నాశయితుం న ఉత్సహన్తే తస్మాత్, నిత్యః నిత్యత్వాత్ సర్వగతః, సర్వగతత్వాత్ స్థాణుః, స్థాణుః ఇవ స్థిరః, ఇత్యేతత్. స్థిరత్వాత్ అచలః అయమ్ ఆత్మా, అతః సనాతనః చిరంతనః, న కారణాత్ కుతశ్చిత్ నిష్పన్నః అభినవః ఇత్యర్థః.**

**తె.అ.** ఒకదానినొకటి నాశనం చేసుకునే పంచభూతాలు ఆత్మను నాశనం చేయగల సామర్థ్యం లేనివి. కనుక ఆత్మ నిత్యం. నిత్యం గనుక అంతటా ఉన్నది, స్థాణువు, స్థాణువు వలె స్థిరం. స్థిరం గనుక చలనం లేనిది. కనుక సనాతనం. ఏదో ఒక కారణం చేత కొత్తగా పుట్టింది కాదు.

**భాష్యమ్ : 24.2 న ఏతేషాం శ్లోకానాం పౌనరుక్త్యం చోదనీయమ్ – యత ఏకేనైవ శ్లోకేన ఆత్మనః నిత్యత్వమ్ అవిక్రియత్వం చ ఉక్తమ్ – "న జాయతే మ్రియతే వా" ఇత్యాదినా, తత్ర యదేవ ఆత్మ విషయం కించిత్ ఉచ్యతే తత్ ఏతస్మాత్ శ్లోకార్థాత్ న అతిరిచ్యతే. కించిత్ శబ్దతః పునరుక్తం, కించిత్ అర్థతః ఇతి. దుర్బోధత్వాత్ ఆత్మవస్తునః పునఃపునః ప్రసంగమ్ ఆపాద్య శబ్దాన్తరేణ తదేవ వస్తు నిరూపయతి భగవాన్ వాసుదేవః కథం ను నామ అవ్యక్తం సంసారిణామ్ బుద్ధిగోచరతామ్ ఆపన్నం సత్ సంసార నివృత్తయే స్యాదితి. కించ –**

**తె.అ.** ఈ శ్లోకాలలో (21–24) పునరుక్తి (దోషం) వుందని ఆక్షేపించరాదు. 'పుట్టదు, చావదు' (2.20) అన్న ఒక్క శ్లోకంలోనే ఆత్మ యొక్క శాశ్వతత్త్వం, నిత్యత్వము చెప్పబడింది. అయినా ఆత్మ విషయకంగా ఏమి చెప్పినా ఈ శ్లోకంలో చెప్పినదానికి మించి చెప్పడానికేమీ లేదు. కొన్నిచోట్ల శబ్దంలో కొన్నిచోట్ల అర్థంలో పునరుక్తి. ఆత్మతత్త్వం అర్థం కావడం కష్టం. పదే పదే

ప్రస్తావించి వేరు వేరు మాటల్లో అదే వస్తువును నిరూపిస్తున్నాడు భగవానుడు, వాసుదేవుడు. ఎట్లాగైనా ఆ అవ్యక్తతత్త్వం సంసారంలో ఉన్నవాడికి అర్థమై వానికి సంసారనివృత్తి కలగవలెనని ఆలోచన.

ఇంతే కాకుండా –

**మూ. అవ్యక్తోఽయమచిన్త్యోఽయమవికార్యోఽయముచ్యతే ।**
**తస్మాదేవం విదిత్వైనం నానుశోచితుమర్హసి ॥ 25**

**తె.అ.** ఈ ఆత్మ అవ్యక్తము (ఇంద్రియాలకు గోచరించదు), అచిన్త్యము (ఊహింపశక్యం కానిది), అవికార్యము (మార్పుచెందనిది) అంటారు. కావున ఇది ఇటువంటిది అని తెలుసుకుని దీనిని గురించి నీవు శోకించవద్దు.

**భాష్యమ్ : 25.1 అవ్యక్తోఽయమితి – అవ్యక్తః సర్వకరణావిషయత్వాత్ న వ్యజ్యతే ఇతి అవ్యక్తః అయమ్ ఆత్మా. అత ఏవ అచిన్త్యః అయమ్, యత్ హి ఇన్ద్రియగోచరః వస్తు తత్ చిన్తావిషయత్వమ్ ఆపద్యతే. అయం తు ఆత్మా అనిన్ద్రియగోచరత్వాత్ అచిన్త్యః అవికార్యః అయమ్. యథా క్షీరం దధ్యాతఞ్చనాదినా వికారి న తథా అయమ్ ఆత్మా. నిరవయవత్వాత్ చ అవిక్రియః. న హి నిరవయవం కించిత్ విక్రియాత్మకం దృష్టమ్. అవిక్రియత్వాత్ అవికార్యః అయమ్ ఆత్మా ఉచ్యతే. తస్మాత్ ఏవం యథోక్త ప్రకారేణ ఏనమ్ ఆత్మానం విదిత్వా త్వం న అనుశోచితుమ్ అర్హసి – "హన్తా అహమ్ ఏషామ్", "మయా ఏతే హన్యన్తే" ఇతి.**

**తె.అ.** ఈ ఆత్మ ఏ ఇంద్రియాదుల చేత తెలియబడదు. అందుకే అవ్యక్తం ఈ ఆత్మ. అందుకే అచిన్త్యం. ఇంద్రియ గోచరమైనదే చింతకు (ఆలోచనకు) విషయమవుతుంది. ఈ ఆత్మ ఇంద్రియగోచరం కానిది కనుక ఆలోచనకు అందదు. ఇది అవికార్యం, పాలు తోడుకుని పెరుగు మొదలయినవిగా మారినట్లు ఆత్మ మారదు. అవయవాలు లేనందువలన కూడా అవిక్రియం. అవయవాలు లేనిదేదీ మార్పు చెందడం మనం చూడము. అవిక్రియం కనుక ఆత్మను అవికార్యము అంటారు. కనుక ఇది ఇటువంటిది అని ఆత్మను తెలుసుకుని నేను వీరిని చంపేవాడిని, వీరు నా చేత చంపబడెదరు అని వీరిని గురించి దుఃఖించవద్దు.

**భాష్యమ్ : 26.0 ఆత్మనః అనిత్యత్వం అభ్యుపగమ్య ఇదం ఉచ్యతే –**

**తె.అ.** పోనీ ఆత్మ అనిత్యమే అనుకుందాం, అని ఇట్లా అంటున్నాడు.

**మూ. అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్ ।**
**తథాపి త్వం మహాబాహో నైవం శోచితుమర్హసి ॥ 26**

**తె.అ.** ఓ వీరుడా ! లేదా ఈ ఆత్మ అనిత్యము, చస్తూ పుడుతూ ఉంటుంది అని నీవు అనుకుంటున్నా దాని గురించి నీవు దుఃఖించడం తగదు.

**భాష్యమ్ : 26.1 అథ చైనమితి – 'అథ చ ఇతి అభ్యుపగమార్థః. ఏనం ప్రకృతమ్ ఆత్మానం, నిత్యజాతం, లోక ప్రసిద్ధ్యా ప్రత్యనేకశరీరోత్పత్తిం జాతః జాతః ఇతి వా మన్యసే, తథా ప్రతితత్తద్వినాశం నిత్యం వా మన్యసే మృతం, మృతః మృతః ఇతి, తథాపి తథా అభావే అపి ఆత్మని త్వం మహాబాహో న ఏవం శోచితుమ్ అర్హసి. జన్మవతః నాశః నాశవతః జన్మ చ ఇత్యేతౌ అవశ్యంభావినౌ ఇతి. యస్మాత్ –**

**తె.అ.** 'లేదా' అనడం వాదం కొరకు ఒప్పుకోవడం అనే అర్థంలో. లోకమంతా అనుకున్నట్లు ఈ ఆత్మ ఎప్పుడూ అనేక శరీరాలు పుట్టడంతో పుడుతున్నది అని నీవు అనుకునేటట్లయితే, అదేవిధంగా శరీరం నష్టమైనపుడంతా చనిపోయింది అనుకుంటే, అపుడు కూడా నీవు దీనిని గురించి ఈ విధంగా దుఃఖించవలసిన పనిలేదు. ఎందుకంటె పుట్టినదానికి మరణం, మరణించినదానికి పుట్టుక తప్పవు కనుక –

**మూ. జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ ।**
**తస్మాదపరిహార్యేఽర్థే న త్వం శోచితుమర్హసి ॥ 27**

**తె.అ.** పుట్టినవానికి మరణము తప్పదు. మరణించిన వానికి పుట్టుక తప్పదు. కావున తప్పించలేని దానికొరకు నీవు దుఃఖించ పనిలేదు.

**భాష్యమ్ : 27.1 జాతస్యఇతి. జాతస్య హి లబ్ధజన్మనః, ధ్రువః అవ్యభిచారీ, మృత్యుః మరణమ్ ధ్రువం జన్మ మృతస్య చ. తస్మాత్ అపరిహార్యః అయం జన్మమరణలక్షణః అర్థః, యస్మాత్ తస్మాత్ అపరిహార్యే అర్థే న త్వం శోచితుమ్ అర్హసి. (జన్మవతః నాశః, నాశవతః జన్మ ఇతి చ స్వాభావికః చేత్ అపరిహార్యార్థః తస్మిన్ అపరిహార్యే అర్థే న త్వం శోచితుమ్ అర్హసి).**

**తె.అ.** పుట్టుక కలిగినవానికి మరణము నిశ్చయము. మరణించినవానికి పుట్టుక అంతే. కనుక జనన మరణాలు తప్పించరానివి. తప్పించరాని విషయంలో నీవు దుఃఖించ పనిలేదు.

**భాష్యమ్ : 28.0 కార్యకరణసంఘాతాత్మకాని అపి భూతాని ఉద్దిశ్య శోకః న యుక్తః కర్తుం, యతః –**

**తె.అ.** కార్యకారణాల కూడిక అయిన ప్రాణుల గురించి కూడా నీవు శోకించదగదు. ఎందుకంటే –

**మూ. అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత ।**
**అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా ॥ 28**

**తె.అ.** అర్జునా! ప్రాణుల పుట్టుక, తుది తెలియదు. మధ్యలో మాత్రం అవి కనిపిస్తున్నాయి. ఇటువంటి వాటి కొరకు దుఃఖమెందుకు?

**భాష్యమ్ : 28.1 అవ్యక్తాదీనితి – అవ్యక్తాదీని – అవ్యక్తమ్ అదర్శనమ్, అనుపలబ్ధిః ఆదిః యేషాం భూతానాం పుత్రమిత్రాది కార్యకారణసంఘాతాత్మకానాం తాని అవ్యక్తాదీని భూతాని ప్రాక్ ఉత్పత్తేః, ఉత్పన్నాని చ ప్రాక్ మరణాత్ వ్యక్తమధ్యాని. అవ్యక్తనిధనాన్యేవ – పునః అవ్యక్తమ్ అదర్శనం నిధనం మరణం యేషాం తాని అవ్యక్తనిధనాని. మరణాత్ ఊర్ధ్వమ్ అవ్యక్తతామేవ ప్రతిపద్యన్తే ఇత్యర్థః తథా చోక్తమ్.**

**"అదర్శనాదాపతితః పునశ్చాదర్శనం గతః,**
**నాసౌ తవ న తస్య త్వం వృథా కా పరిదేవనా" (మ.భా.స్త్రీ.ప.2.13)**
**ఇతి తత్ర కా పరిదేవనా, కో వా ప్రలాపః అదృష్టదృష్టప్రణష్టభ్రాన్తిభూతేషు భూతేషు ఇత్యర్థః**

**తె.అ.** ప్రాణులు కార్యకారణాల కూడిక తప్ప మరేమీ కాదు. అటువంటి పుత్రమిత్రాది సమస్తప్రాణుల యొక్క మొదలు మనకు తెలియదు. అంటే పుట్టుకకు పూర్వం వీరు మనకు లేరు, కనిపించరు. పుట్టినవారు మరణం వరకు మాత్రం, అంటే మధ్యలో కనిపిస్తున్నారు. మరణంతో మళ్ళీ కనిపించకుండా పోతున్నారు. అంటే మరణం తర్వాత కూడా వాళ్ళు ఏమవుతున్నారో మనకు తెలియడంలేదు. ఇదే అన్నారు, 'ఈ ప్రాణి కనపడని స్థితి నుండి వచ్చాడు మళ్ళీ కనపడని స్థితిలోకే వెళ్ళిపోయాడు. వాడు నీవాడు కాదు నీవు అతని వాడివి కావు. వృథా శోకమెందుకు' (మ.భా.స్త్రీ.2.13) అని. ముందు కనిపించక మధ్యలో కనిపించి మళ్ళీ నశించే భ్రాంతిరూపమైన ప్రాణుల కొరకు ఎందుకు బాధపడడం అని అభిప్రాయం.

**భాష్యమ్ : 29.0 దుర్విజ్ఞేయః అయం ప్రకృతః ఆత్మా, కిం త్వాం ఏవ ఏకం ఉపాలభే సాధారణే భ్రాంతినిమిత్తే? కథం దుర్విజ్ఞేయః అయం ఆత్మా ఇతి? అతః ఆహ–**

**తె.అ.** ప్రస్తుతం చెప్పుకుంటున్న ఆత్మ సులభంగా అర్థమయేది కాదు. అందరినీ భ్రమపెట్టే ఈ విషయంలో నిన్ను ఒక్కడినే ఎట్లా నిందించగలను? ఆత్మను అర్థం చేసుకోవడం ఎంతకష్టం అంటే చెపుతున్నాడు –

**మూ. ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేనమాశ్చర్యవద్వదతి తథైవ చాన్యః ।**
**ఆశ్చర్యవచ్చైనమన్యః శృణోతి శ్రుత్వాప్యేనం వేద న చైవ కశ్చిత్ ॥ 29**

**తె.అ.** దీనిని ఆశ్చర్యంగా చూస్తాడు ఒకడు. ఆశ్చర్యంగా మాట్లాడుతాడు మరొకడు దీన్ని గురించి. మరొకడు దీన్ని గురించి ఆశ్చర్యంగా వింటాడు. విన్నా ఎవడూ దీన్ని సరిగా అర్థం చేసుకున్నవాడు లేడు.

**భాష్యమ్ : 29.1 ఆశ్చర్యవత్ ఇతి. ఆశ్చర్యవత్ ఆశ్చర్యం అదృష్టపూర్వం అద్భుతం అకస్మాత్ దృశ్యమానం తేన తుల్యం ఆశ్చర్యవత్ ఆశ్చర్యమివ ఏనం ఆత్మానం పశ్యతి కశ్చిత్. ఆశ్చర్యవత్ ఏనం వదతి తథైవ చ అన్యః, ఆశ్చర్యవత్ చ ఏనం అన్యః శ్రుణోతి. శ్రుత్వా దృష్ట్వా ఉక్త్వా అపి ఏనం ఆత్మానం వేద న చైవ కశ్చిత్.**

**తె.అ.** ముందు మనం చూడనిది, అద్భుతమైనది, అకస్మాత్తుగా మన కంటబడితే దాన్ని ఆశ్చర్యం అంటాం. దీనిని, అంటే ఆత్మను ఆశ్చర్యంవలె చూస్తాడొకడు. మరొకడు ఆశ్చర్యంగా మాట్లాడుతాడు. మరొకడు ఆశ్చర్యంగా వింటాడు. మరొకడు విని, చూచి, చెప్పిన కూడా ఈ ఆత్మను తెలుసుకొనజాలడు. (ఆత్మ ఇంద్రియముల ద్వారా తెలియదగినది కాదు).

**భాష్యమ్ : 29.2 అథవా - యః అయం ఆత్మానం పశ్యతి స ఆశ్చర్యతుల్యః యః వదతి యః చ శ్రుణోతి, సః అనేకసహస్రేషు కశ్చిదేవ భవతి. అతః దుర్బోధః ఆత్మా ఇత్యభిప్రాయః**

**తె.అ.** లేక - ఈ ఆత్మను చూచినవాడు ఆశ్చర్యంతో సమానమైనవాడు (అతడే ఒక అద్భుతం). మాట్లాడేవాడు వినేవాడు కూడా. అటువంటివాడు ఎన్నోవేలలో ఒకడుంటాడు. కనుక ఆత్మను అర్థం చేసుకోడం సులభం కాదు.

**భాష్యమ్ : 30.0 అథ ఇదానీం ప్రకరణార్థం ఉపసంహరతి -**

**తె.అ.** ఇక ప్రకరణాన్ని ముగిస్తూ అంటున్నాడు -

**మూ. దేహీ నిత్యమవధ్యోఽయం దేహే సర్వస్య భారత ।**
**తస్మాత్సర్వాణి భూతాని న త్వం శోచితుమర్హసి ॥ 30**

**తె.అ.** అన్ని దేహాలలోను ఉండే దేహి నిత్యము, చంపబడనిది. కనుక ఏ ప్రాణిని గురించి నీవు శోకించ పనిలేదు.

**భాష్యమ్ : 30.1 దేహీ ఇతి. దేహీ శరీరీ నిత్యం సర్వదా సర్వావస్థాసు అవధ్యః నిరవయవత్వాత్ నిత్యత్వాత్ చ తత్ర అవధ్యోఽయం దేహే శరీరే సర్వస్య సర్వగతత్వాత్ స్థావరాదిషు స్థితోఽపి. సర్వస్య ప్రాణిజాతస్య దేహే వధ్యమానేఽపి అయం దేహీ న వధ్యః యస్మాత్ తస్మాత్ భీష్మాదీని సర్వాణి భూతాని ఉద్దిశ్య న త్వం శోచితుం అర్హసి.**

**తె.అ.** స్థావరజంగమాలైన సర్వదేహాదులయందు వ్యాపించి ఉండేటటువంటి ఈ దేహి సర్వదా సర్వావస్థలయందు చంపరానిది, దానికి అవయవాలు లేవు కనుక, అది నిత్యం కనుక. సర్వప్రాణుల దేహాలను వధించిన తరువాత కూడా ఈ దేహి వధించబడడంలేదు. కనుక భీష్మాదులైన సర్వప్రాణులను గురించి నీవు శోకించవలసిన పని లేదు.

**భాష్యమ్ : 31.0 ఇహ (2.30) పరమార్థతత్త్వాపేక్షాయాం శోకో వా మోహో వా న సంభవతి ఇత్యుక్తమ్. న కేవలం పరమార్థతత్త్వాపేక్షాయామ్ ఏవ కింతు –**

**తె.అ.** పై శ్లోకంలో పరమార్థతత్త్వం దృష్ట్యా శోకము కలుగదు అని చెప్పబడింది. కేవలం పారమార్థికంగానే కాదు –

**మూ. స్వధర్మమపి చావేక్ష్య న వికమ్పితుమర్హసి ।**
**ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య న విద్యతే ॥ 31**

**తె.అ.** స్వధర్మమని చూచి అయినా నీవు చలించరాదు. క్షత్రియునికి ధర్మయుద్ధం కంటె మేలైనది మరొకటి లేదు.

**భాష్యమ్ : 31.1 స్వధర్మ ఇతి. స్వధర్మం అపి స్వః ధర్మః క్షత్రియస్య ధర్మః యుద్ధం తమపి అవేక్ష్య త్వం న వికంపితుం ప్రచలితుం అర్హసి ధర్మ్యాత్ క్షత్రియస్య స్వాభావికాత్ ధర్మాత్ ఆత్మస్వాభావ్యాత్ ఇత్యభిప్రాయః. తచ్చ యుద్ధం పృథివీజయద్వారేణ ధర్మార్థం ప్రజారక్షణార్థం చ పరమం ధర్మ్యమ్. ధర్మాత్ అనపేతం ధర్మ్యమ్. తస్మాత్ ధర్మ్యాత్ యుద్ధాత్ శ్రేయః అన్యత్ క్షత్రియస్య న విద్యతే హి యస్మాత్.**

**తె.అ.** యుద్ధం క్షత్రియునికి స్వధర్మమని చూచి అయినా నీవు చలించరాదు. తనకు స్వాభావికమైన ధర్మం నుండి చలించరాదు అని అభిప్రాయం. ఆ యుద్ధం, భూమిని జయించడం ద్వారా ధర్మం కొరకు ప్రజారక్షణ కొరకు కనుక , ధర్మంతో నిండిన యుద్ధం. అటువంటి ధర్మయుద్ధం కంటె క్షత్రియునికి శ్రేయస్కరం మరొకటి లేదు.

**భాష్యమ్ : 32.0 కుతశ్చ తత్ యుద్ధం కర్తవ్యం ఇతి? ఉచ్యతే –**

**తె.అ.** యుద్ధం ఇంకా ఎందుకు కర్తవ్యమో చెపుతున్నాడు –

**మూ. యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వారమపావృతమ్ ।**
**సుఖినః క్షత్రియాః పార్థ లభన్తే యుద్ధమీదృశమ్ ॥ 32**

**తె.అ.** పార్థా! కోరకుండా స్వర్గద్వారం నీ కొరకు తెరచుకుంది. అదృష్టవంతులైన క్షత్రియులకు మాత్రం ఇటువంటి యుద్ధం చేసే అవకాశం దైవవశం చేతనే లభిస్తుంది.

**భాష్యమ్ : 32.1 యదృచ్ఛయా ఇతి. యదృచ్ఛయా చ అప్రార్థితయా ఉపపన్నం ఆగతం స్వర్గద్వారం అపావృతం ఉద్ఘాటితం యే ఏతత్ ఈదృశం యుద్ధం లభంతే క్షత్రియాః హే పార్థ! కిం న సుఖినః తే?**

**తె.అ.** కోరకుండా తెరచిన స్వర్గద్వారం అయిన ఈ యుద్ధాన్ని పొందిన క్షత్రియులు సుఖవంతులు కారా అర్జునా!

**భాష్యమ్ : 33.0 ఏవం కర్తవ్యతా ప్రాప్తమ్ అపి –**

**తె.అ.** ఈ విధంగా కర్తవ్యరూపంలో ప్రాప్తించినప్పటికీ –

**మూ. అథ చేత్త్వమిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి ॥**
**తతః స్వధర్మం కీర్తిం చ హిత్వా పాపమవాప్స్యసి । 33**

**తె.అ.** ఈ ధర్మయుద్ధం నీవు చేయకపోతే స్వధర్మము విడిచిన కీర్తి కూడా పోగొట్టుకుని పాపాలను పొందుతావు.

**భాష్యమ్ : 33.1 అథ ఇతి. అత చేత్ త్వం ఇమం ధర్మ్యం ధర్మాదనపేతం విహితం సంగ్రామం యుద్ధం న కరిష్యసి చేత్, తతః తదకారణాత్ స్వధర్మం కీర్తిం చ మహాదేవాది సమాగమనిమిత్తాం హిత్వా కేవలం పాపం అవాప్స్యసి.**

**తె.అ.** ఈ ధర్మయుద్ధం నీకు విహితమయింది. ఈ యుద్ధం నీవు చేయకపోతే ఆ చేయకపోవడం వలన స్వధర్మం వదులుకుంటున్నావు. అంతేకాక మహేశ్వరాది దేవతలతో చేసిన యుద్ధాల వల్ల నీకు కలిగిన కీర్తిని పోగొట్టుకుంటావు. పాపం పొందుతావు.

**భాష్యమ్ : 34.0 న కేవలం స్వధర్మకీర్తిపరిత్యాగః –**

**తె.అ.** కేవలం స్వధర్మాన్ని కీర్తిని పోగొట్టుకోడం మాత్రమే గాదు –

**మూ. అకీర్తిం చాపి భూతాని కథయిష్యన్తి తేఽవ్యయామ్ ।**
**సంభావితస్య చాకీర్తిర్మరణాదతిరిచ్యతే ॥ 34**

**తె.అ.** అంతములేని నీ అపకీర్తిని అందరూ కథలుగా చెప్పుకుంటారు. గౌరవంగా బ్రతికినవానికి అపకీర్తి కన్న మరణం మేలు.

**భాష్యమ్ : 34.1 అకీర్తిం ఇతి. అకీర్తిం చ అపి భూతాని కథయిష్యన్తి తే తవ అవ్యయాం దీర్ఘకాలామ్. ధర్మాత్మా శూరః ఇత్యేవమాదిభిః గుణైః సంభావితస్య చ అకీర్తిః మరణాత్ అతిరిచ్యతే, సంభావితస్య చ అకీర్తేః వరం మరణం ఇత్యర్థః కించ –**

**తె.అ.** నీ అపకీర్తిని జనులు కలకాలం కథలుగా చెప్పుకుంటారు. ధర్మాత్ముడని, శూరుడని ఇంకా అనేక సుగుణాలున్నవాడని గౌరవించబడిన వానికి అపకీర్తికంటె మరణం మేలు. అంటే ఆ విధంగా గౌరవం పొందినవాడు అపకీర్తి పొందడం కంటె చనిపోవడం మేలు. అంతేకాదు–

**మూ. భయాద్రణాదుపరతం మంస్యన్తే త్వాం మహారథాః ।**
**యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్ ॥ 35**

**తె.అ.** భయం చేత నీవు యుద్ధం మానుకున్నావని మహారథులంటారు. ఇంతవరకు నిన్ను గొప్పగా చెప్పుకున్నవారు ఇకముందు నిన్ను తక్కువ చేస్తారు.

**భాష్యమ్ : 35.1 భయాత్ ఇతి. భయాత్ కర్ణాదిభ్యః రణాత్ యుద్ధాత్ ఉపరతం నివృత్తం మంస్యంతే చింతయిష్యంతి న కృపయా ఇతి త్వాం మహారథాః దుర్యోధనప్రభృతయః(కే మంస్యంతే? ఇతి ఆహ) యేషాం చ త్వం దుర్యోధనాదీనాం బహుమతః బహుభిః గుణైః యుక్తః ఇత్యేవం మతః బహుమతః భూత్వా పునః త్వం యాస్యసి లాఘవం లఘుభావమ్. కించ.**

**తె.అ.** కర్ణాదులకు భయపడి నీవు యుద్ధం మానుకున్నావని దుర్యోధనాదులైన మహారథులు అనుకుంటారు. 'దయతలచి' అని ఎవరూ అనుకోరు. అనేక గుణాలు గలవాడివని నిన్ను మెచ్చుకున్నవారే నిన్ను ఇక చులకనగా చూస్తారు. అంతేకాదు –

**మూ. అవాచ్యవాదాంశ్చ బహూన్వదిష్యన్తి తవాహితాః ।**
**నిన్దన్తస్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్ ॥ 36**

**తె.అ.** నీ శత్రువులు నీ సామర్థ్యాన్ని నిందిస్తూ నిన్ను అనరాని మాటలు అనేకం అంటారు. అంతకంటె బాధాకరమైంది ఏముంటుంది?

**భాష్యమ్ : 36.1 అవాచ్యవాదాన్ ఇతి. అవాచ్యవాదాన్ అవక్తవ్యాన్ వాదాన్ చ బహూన్ అనేక ప్రకారాన్ వదిష్యంతి తవ అహితాః శత్రవః నిందంతః కుత్సయంతః తవ త్వదీయం సామర్థ్యమ్ నివాతకవచాది యుద్ధనిమిత్తమ్. తతః తస్మాత్ నిందాప్రాప్తేః దుఃఖాత్ దుఃఖతరం ను కిం? తతః కష్టతరం దుఃఖం నాస్తి ఇత్యర్థః.**

**తె.అ.** నివాతకవచాదులతో యుద్ధం చేసిన నీ సామర్థ్యాన్ని నిందిస్తూ నీ శత్రువులు అనేక ప్రకారాలుగా నిన్ను అనరాని మాటలు అంటారు. అటువంటి నింద పడటం కంటె బాధాకరమైంది ఏముంటుంది? అంతకంటె ఎక్కువ దుఃఖం కలిగించేది మరొకటి ఉండదు అని అర్థం.

**భాష్యమ్ : 37.0 యుద్ధే పునః క్రియమాణే కర్ణాదిభిః -**

**తె.అ.** అట్లా కాక కర్ణాదులతో యుద్ధం చేసినట్లయితే -

**మూ. హతో వా ప్రాప్స్యసి స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్ ।**
**తస్మాదుత్తిష్ఠ కౌన్తేయ యుద్ధాయ కృతనిశ్చయః ॥ 37**

**తె.అ.** చనిపోతే స్వర్గం పొందుతావు. జయిస్తే ఈ భూమిని అనుభవిస్తావు. కనుక అర్జునా యుద్ధం చేయడానికి నిశ్చయించుకుని లే.

**భాష్యమ్ : 37.1 హతో వా ఇతి. హతః వా ప్రాప్స్యసి స్వర్గం, హతః సన్ స్వర్గం ప్రాప్స్యసి. జిత్వా వా కర్ణాదీన్ శూరాన్ భోక్ష్యసే మహీమ్. ఉభయథాపి తవ లాభః ఏవ ఇత్యభిప్రాయః. యతః ఏవం తస్మాత్ ఉత్తిష్ఠ కౌంతేయ! యుద్ధాయ కృతనిశ్చయః. 'జేష్యామి శత్రూన్, మరిష్యామి వా' ఇతి నిశ్చయం కృత్వా ఇత్యర్థః.**

**తె.అ.** చనిపోతే స్వర్గం పొందుతావు. కర్ణాదులను జయిస్తే ఈ భూమిని అనుభవిస్తావు. రెండు విధాలుగా కూడా నీకు లాభమే అని అభిప్రాయం. కనుక అర్జునా యుద్ధానికి కృతనిశ్చయుడవై లే. శత్రువులను జయిస్తాను లేదా ప్రాణాలు వదలుతాను అని నిశ్చయించుకో అని అర్థం.

**భాష్యమ్ : 38.0 తత్ర యుద్ధం స్వధర్మః ఇత్యేవం యుధ్యమానస్య ఉపదేశమ్ ఇమం శృణు -**

**తె.అ.** యుద్ధం స్వధర్మమని యుద్ధం చేసేవానికి ఈ ఉపదేశం -

**మూ. సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ ।**
**తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి ॥ 38**

**తె.అ.** సుఖదుఃఖాలను, లాభాలాభాలను, జయాపజయాలను సమానంగా భావించి యుద్ధానికి పూనుకో. ఈ విధంగా చేస్తే నీవు పాపం పొందవు.

**భాష్యమ్ : 38.1 సుఖదుఃఖే ఇతి. సుఖదుఃఖే సమే తుల్యే కృత్వా, రాగద్వేషౌ (అపి) అకృత్వా ఇత్యేతత్. తథా లాభాలాభౌ జయాజయౌ చ సమౌ కృత్వా తతః యుద్ధాయ యుజ్యస్వ ఘటస్వ. న ఏవం యుద్ధం కుర్వన్ పాపం అవాప్స్యసి (ఇతి) ఏషః ఉపదేశః ప్రాసంగికః.**

**తె.అ.** సుఖదుఃఖాలను సమంగా భావించి, అంటే సుఖమందు రాగం, దుఃఖమందు ద్వేషం లేక అట్లాగే లాభాలాభాలయందు, జయాపజయాలయందు సమభావంతో యుద్ధానికి పూనుకో. యుద్ధం ఈ భావంతో చేసినట్లయితే పాపం పొందవు అని ప్రాసంగికమైన ఉపదేశం.

**భాష్యమ్ : 39.0 శోకమోహాపనయే (నయనాయ) లౌకికః న్యాయః 'స్వధర్మమపి చావేక్ష్య' ఇత్యాద్యైః శ్లోకైః ఉక్తః, న తు తాత్పర్యేణ. పరమార్థదర్శనం తు ఇహ ప్రకృతమ్. తచ్చ ఉక్తం ఉపసంహ్రియతే – ఏషా తే అభిహితా ఇతి శాస్త్రవిషయవిభాగ ప్రదర్శనాయ. ఇహ హి ప్రదర్శితే పునః శాస్త్రవిషయవిభాగే ఉపరిష్టాత్ 'జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్' (3.3) ఇతి. నిష్ఠాద్వయవిషయం శాస్త్రం సుఖం ప్రవర్తిష్యతే, శ్రోతారశ్చ విషయవిభాగేన సుఖం గ్రహిష్యంతి ఇతి – అతః ఆహ –**

**తె.అ.** 'స్వధర్మమని చూచి అయినా నీవు యుద్ధం చేయదగును' (31) మొదలుగా గల శ్లోకాలలో శోకమోహాలను తొలగించడం కొరకు లౌకికన్యాయం చెప్పబడింది. అదే పరమార్థమని కాదు. ప్రస్తుత విషయం పరమార్థదర్శనం. ఇంతవరకు చెప్పినదాన్ని 'ఏషా తేఽభిహితా' అనే శ్లోకంతో ముగిస్తున్నాడు, శాస్త్రవిషయవిభాగం ప్రదర్శించడానికి. ఈ విభాగం చేసినందువల్ల ముందు 'సాంఖ్యులకు జ్ఞానయోగము యోగులకు కర్మయోగము' (3.3) అని రెండు నిష్ఠలను చెప్పే శాస్త్రం సుఖంగా అర్థమవుతుంది. వినేవారు సులభంగా అర్థం చేసుకోగలరు అని భగవానుడు అంటున్నారు.

**మూ. ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు ।**
**బుద్ధ్యా యుక్తో యయా పార్థ కర్మబన్ధం ప్రహాస్యసి ॥ 39**

**తె.అ.** ఇంతవరకు నీకు నేను సాంఖ్యాన్ని (ఆత్మస్వరూప జ్ఞానాన్ని) గూర్చిన బుద్ధిని చెప్పాను. ఇక యోగబుద్ధి విను. దీనివలన నీవు కర్మబంధం నుండి విడివడగలవు.

**భాష్యమ్ : 39.1 ఏషా తే ఇతి. ఏషా తే తుభ్యం అభిహితా ఉక్తా సాంఖ్యే పరమార్థవస్తు వివేకవిషయే బుద్ధిః జ్ఞానం సాక్షాత్ శోకమోహాదిసంసారహేతుదోషనివృత్తి కారణమ్, యోగే తు తత్ప్రాప్త్యుపాయే నిఃసంగతయా ద్వన్ద్వప్రహాణపూర్వకమ్ ఈశ్వరారాధనార్థే కర్మయోగే కర్మానుష్ఠానే సమాధియోగే చ ఇమాం అనంతరమ్ ఏవ ఉచ్యమానాం బుద్ధిం శ్రుణు. తాం చ బుద్ధిం స్తౌతి ప్రరోచనార్థమ్. బుద్ధ్యా యయా యోగవిషయయా యుక్తః హే పార్థ! కర్మబంధం కర్మ ఏవ ధర్మాధర్మాఖ్యః బంధః కర్మబంధః తం ప్రహాస్యసి ఈశ్వరప్రసాదనిమిత్తజ్ఞానప్రాప్త్యా ఏవ ఇత్యభిప్రాయః. కించ అన్యత్ –**

**తె.అ.** ఇప్పుడు నీకు నేను వినిపించినది సాంఖ్యబుద్ధి. అనగా పరమార్థవస్తు వివేక విషయజ్ఞానం. ఈ జ్ఞానం శోకమోహాది సంసారహేతువులను నివృత్తి చేయడానికి సాక్షాత్కారణం. ఈ జ్ఞానాన్ని పొందడానికి ఉపాయమైన యోగబుద్ధిని ఇప్పుడు చెప్పబోతున్నాను. విను. యోగమంటే

కర్మయోగం. ద్వంద్వాలను విడిచి సంగరహితంగా ఈశ్వరారాధనకై చేసే కర్మానుష్ఠానమే కర్మయోగం. సమాధియోగం. దానిలో శ్రద్ధ కలగడం కొరకు ఆ యోగబుద్ధిని స్తుతిస్తున్నాడు భగవానుడు. అర్జునా! ఈ యోగబుద్ధి చేత నీకు ఈశ్వరకృప లభిస్తుంది. దానివలన జ్ఞానం కలుగుతుంది. ఆ జ్ఞానం వలన పుణ్యపాపకర్మరూపబంధాలనుండి విముక్తుడవుతావు అని అభిప్రాయం. అంతేకాదు–

**మూ. నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే ।**
**స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ ॥ 40**

**తె.అ.** ఈ కర్మయోగం ప్రారంభించగానే నష్టం కలిగేది లేదు. విపరీత ఫలితాలుండవు. స్వల్పంగా ఆచరించినా ఈ ధర్మం పెద్ద భయం నుండి రక్షించగలదు.

**భాష్యమ్ : 40.1 నేహ ఇతి. న ఇహ మోక్షమార్గే కర్మయోగే అభిక్రమనాశః అభిక్రమణం అభిక్రమః ప్రారంభః తస్య నాశః న అస్తి యథా కృష్యాదేః. యోగవిషయే ప్రారంభస్య న అనైకాంతికఫలత్వం ఇత్యర్థః. కించ – న అపి చికిత్సావత్ ప్రత్యవాయః విద్యతే. కింతు స్వల్పమ్ అపి అస్య ధర్మస్య యోగధర్మస్య అనుష్ఠితం త్రాయతే రక్షతి మహతః భయాత్ సంసారభయాత్ జన్మమరణాదిలక్షణాత్.**

**తె.అ.** కర్మయోగమనే ఈ మోక్షమార్గంలో ప్రారంభించినదేదీ వృథా కాదు, వ్యవసాయం వంటి పనులలో వలె. అంటే యోగవిషయంలో ప్రారంభించిన దానికి ఫలం అనైకాంతికం కాదు. (పొలంలో పనిచేసినవానికి తన కృషికి తగిన ఫలితం ఉంటుందా అన్న విషయంలో సంశయం ఉంటుంది. యోగ విషయంలో కృషికి సత్ఫలితం ఉండడంలో సంశయం లేదు.) చికిత్సావిషయంలో వలె విపరీతఫలితమూ ఉండదు. (కొండనాలుకకు మందు వేస్తే ఉన్న నాలుక ఊడింది అన్నట్లు కాదు.) ఈ యోగధర్మాన్ని స్వల్పంగా అనుష్ఠించినా అది జన్మమరణాది లక్షణమైన సంసారమనే మహాభయం నుండి మనలను రక్షిస్తుంది.

**భాష్యమ్ : 41.0 యా ఇయం సాంఖ్యే బుద్ధిః ఉక్తా యోగే చ వక్ష్యమాణలక్షణా సా –**

**తె.అ.** ఇంతకుముందు చెప్పిన సాంఖ్యబుద్ధికి, చెప్పబోయే యోగానికి కూడా లక్షణం ఏమంటే –

**మూ. వ్యవసాయాత్మికా బుద్ధిరేకేహ కురునన్దన ।**
**బహుశాఖా హ్యనన్తాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్ ॥ 41**

**తె.అ.** కురునందనా! నిశ్చయాత్మకమైన బుద్ధే శ్రేయస్కరమైనది. చంచలచిత్తం గల వారి బుద్ధులకు (ఆలోచనలకు) అంతం అనేది ఉండదు.

**భాష్యమ్ : 41.1 వ్యవసాయేతి :- వ్యవసాయాత్మికా నిశ్చయస్వభావా, ఏకైవ బుద్ధిః ఇతర విపరీతబుద్ధిః శాఖాభేదస్య బాధికా సమ్యక్ ప్రమాణజనితత్వాత్, ఇహ శ్రేయోమార్గే, హే కురునన్దన. యాః పునః ఇతరాః బుద్ధయః, యాసాం శాఖాభేదప్రచారవశాత్ అనన్తః అపారః అనుపరతః సంసారః నిత్యప్రతతః విస్తీర్ణః భవతి, ప్రమాణజనిత వివేకబుద్ధినిమిత్తవశాచ్చ ఉపరతాసు అనన్తభేదబుద్ధిషు సంసారః అపి ఉపరమతే, తాః బుద్ధయః బహుశాఖాః బహ్వ్యః శాఖాః యాసాం తాః బహుశాఖాః బహుభేదాః ఇత్యేతత్. ప్రతిశాఖాభేదేన చ అనన్తాః బుద్ధయః కేషామ్? అవ్యవసాయినామ్, ప్రమాణజనితవివేకబుద్ధిరహితానామ్ ఇత్యర్థః.**

**తె.అ.** అర్జునా, ఈ శ్రేయోమార్గంలో నిశ్చయస్వభావమైన బుద్ధి ఒక్కటే. యథార్థమైన ప్రమాణంవల్ల కలిగిన ఈ బుద్ధి విపరీతబుద్ధుల శాఖాభేదాలను తొలగిస్తుంది. ఈ ఇతరబుద్ధుల శాఖాభేదాల ప్రాచుర్యం వల్లనే అనంతము, అపారము, ఎల్లలులేనిది అయిన సంసారము నిరంతరము విస్తరిస్తూ ఉంటుంది. ప్రమాణజనితం, వివేకం చేత ఈ అనంతబుద్ధి భేదాలు సమసిపోవడంతో సంసారమూ శమిస్తుంది. వివేకబుద్ధిలేనివారు అని అర్థం. వారి బుద్ధులు అనేకశాఖలు గలవి. అంటే వాటిలో అనంతభేదాలు.

**భాష్యమ్ : 42.0 యేషాం వ్యవసాయాత్మికా బుద్ధిః నాస్తి తే -**

**తె.అ.** నిశ్చయాత్మకమైన బుద్ధి లేనివారి గురించి -

**మూ. యామిమాం పుష్పితాం వాచం ప్రవదన్త్యవిపశ్చితః ।**
**వేదవాదరతాః పార్థ నాన్యదస్తీతి వాదినః ॥ 42**

**తె.అ.** అర్జునా! వేదోక్తకర్మలయందు అనురక్తులైన అవివేకులు, వేదంలో చెప్పిన కర్మకాండ తప్ప మరొకటి లేదు అనేవారు పుష్పించిన పూలవలె శోభాయమానమగు మాటలు పలికెదరు.

**భాష్యమ్ : 42.1 యామితి :- యామిమాం వక్ష్యమాణాం, పుష్పితాం పుష్పితవృక్ష ఇవ శోభమానాం శ్రూయమాణ రమణీయాం, వాచం వాక్యలక్షణాం ప్రవదన్తి, కే? అవిపశ్చితః అల్పమేధసః అవివేకినః ఇత్యర్థః, వేదవాదరతాః బహ్వర్థవాదఫలసాధనప్రకాశకేషు వేదవాక్యేషు రతాః హే! పార్థ! న అన్యత్ స్వర్గపశ్వాదిఫలసాధనేభ్యః కర్మభ్యః అస్తి ఇత్యేవం వాదినః వదనశీలాః**

**తె.అ.** వేదవాదరతులు అంటే వేదోక్తకర్మలయందు అసక్తులు (అల్ప ఫలాన్ని ఆశించే) ఈ అల్పబుద్ధులయిన అవివేకులు పూచిన చెట్టువలె చెవులకు ఇంపైన మాటలు మాట్లాడుతారు (శ్రుతిసుభగమైన ద్విజకలరవమే చెట్టు మాట్లాడే మాటలు. పూచినచెట్టు చూపులకు ఎంత ఇంపుగా ఉంటుందో చెవులకు అంత ఇంపుగా ఉండే మాటలు అని అర్థం చెప్పుకోవచ్చు. లేక,

పూచిన చెట్టువైపుకు మన దృష్టిని లాగే చెట్టును ఆశ్రయించి ఉన్న పక్షుల ఇంపైన కమ్మని శబ్దాలు అనీ అర్థం చెప్పుకోవచ్చు.) స్వర్గమో, పశువులో ఫలంగా ఇచ్చే కర్మలకంటె వేరే ఏదీ లేదు అనేవారు.

ఇంకా వారు ఎటువంటివారు అంటే –

**మూ. కామాత్మానః స్వర్గపరాః జన్మకర్మఫలప్రదామ్ ।**
**క్రియావిశేషబహులాం భోగైశ్వర్యగతిం ప్రతి ॥ 43**

**తె.అ.** వారు వాంఛాపరులు. స్వర్గమే అత్యుత్తమము అన్న అభిప్రాయం కలవారై భోగైశ్వర్యప్రాప్తి కొరకు చేయవలసిన అనేక క్రియావిశేషాలు చెపుతారు. వారు చెప్పిన కర్మలు జన్మలకు కారణం.

**భాష్యమ్ : 43.1 కామాత్మానః ఇతి కామాత్మానః కామస్వభావాః, కామపరాః ఇత్యర్థః స్వర్గపరాః, స్వర్గఃపరః పురుషార్థః ఏషాం తే స్వర్గపరాః స్వర్గప్రధానాః జన్మకర్మఫలప్రదాం, కర్మణః ఫలం కర్మఫలం, జన్మ ఏవ కర్మణః ఫలం జన్మ కర్మ ఫలం తత్ ప్రదదాతి ఇతి జన్మకర్మఫలప్రదా, తాం వాచమ్ – ప్రవదంతి ఇతి అనుషజ్యతే. క్రియావిశేష బహులాం, క్రియాణాం విశేషాః క్రియావిశేషాః, తే బహులా యస్యాం వాచి తాం. స్వర్గపశుపుత్రాద్యర్థాః యయా వాచా బహుల్యేన ప్రకాశ్యంతే. భోగైశ్వర్యగతిం ప్రతి, భోగశ్చ ఐశ్వర్యం చ భోగైశ్వర్యే, తయోః గతిః ప్రాప్తిః భోగైశ్వర్య– గతిః, తాం ప్రతి సాధనభూతాః యే క్రియావిశేషాః, తద్బహులాం తాం వాచం ప్రవదంతః మూఢాః సంసారే పరివర్తంతే ఇత్యభిప్రాయః తేషాం చ –**

**తె.అ.** కామాత్ములు అంటే కోరికలయందు ఆసక్తి కలవారు, భోగపరాయణులు, స్వర్గపరులు అంటే స్వర్గమే పరమపురుషార్థంగా భావించేవారు, స్వర్గమే ప్రధానం అనుకునేవారు. కర్మలకు ఫలం జన్మ. వారి మాటలు జన్మఫలం ఇచ్చేటటువంటివి. స్వర్గపశుపుత్రాదిప్రాప్తికి ఒక్కొక్కదానికి ఒక ప్రత్యేకమైన క్రియగా అనేక కర్మకలాపాలు చెపుతారు. భోగము, ఐశ్వర్యము పొందడానికి సాధనాలైన ప్రత్యేక కర్మలు అనేకం చెపుతూ ఉండే ఈ మూఢులు సంసారంలో మరణిస్తూ పుడుతూ ఉంటారు అని అభిప్రాయం.

**మూ. భోగైశ్వర్యప్రసక్తానాం తయాఽపహృతచేతసామ్ ।**
**వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ న విధీయతే ॥ 44**

**తె.అ.** భోగము, ఐశ్వర్యములకు ఆకర్షింపబడిన మనస్సు, కామం చేత వారి బుద్ధి అపహరింపబడి అంతఃకరణంలో నిశ్చయమైన బుద్ధి ఉండదు.

**భాష్యమ్ : 44.1 భోగేతి :- భోగైశ్వర్యప్రసక్తానాం - భోగః కర్తవ్యమ్ ఐశ్వర్యం చ ఇతి భోగైశ్వర్యయోః ఏవ ప్రణయవతాం తదాత్మభూతానాం, తయా క్రియావిశేషబహులయా వాచా అపహృతచేతసామ్ ఆచ్ఛాదితవివేక ప్రజ్ఞానాం వ్యవసాయాత్మికా సాంఖ్యే యోగే వా యా బుద్ధిః, సమాధౌ సమాధీయతే అస్మిన్ పురుషోపభోగాయ సర్వమ్ ఇతి సమాధిః అన్తఃకరణమ్, బుద్ధిః, తస్మిన్ సమాధౌ, న విధీయతే న భవతీత్యర్థః.**

**తె.అ.** భోగము, ఐశ్వర్యములయందు అనురాగమున్నవారికి, వాటితో తాదాత్మ్యం చెందినవారికి వివిధ కర్మకలాపాలతో కూడిన వాక్కుచేత కప్పబడిన వివేకబుద్ధి, సాంఖ్యబుద్ధి గాని, యోగబుద్ధిగాని సమాధియందు అంటే అంతఃకరణమందు నిలువదు. 'పురుషుని భోగము కొరకు సర్వము దీనియందు స్థాపింపబడినది కనుక సమాధి' అన్న వ్యుత్పత్తిని బట్టి సమాధి అంటే అంతః కరణం. ఆ అంతఃకరణమందు బుద్ధి స్థాపితం గాదు అని భావం.

**భాష్యమ్ : 45.0 యే ఏవం వివేకబుద్ధిరహితాః తేషాం కామాత్మనాం యత్ ఫలం తత్ ఆహ -**

**తె.అ.** వివేకబుద్ధి లేని వాంఛితులకు ప్రాప్తించే ఫలం చెపుతున్నాడు.

**మూ. త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున ।**
**నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్ ॥ 45**

**తె.అ.** అర్జునా, వేదాలు సంసారాన్ని గురించి మాత్రమే చెబుతున్నాయి. త్రిగుణాలకు అంటే సత్త్వ, రజ, తమో గుణాలకు అతీతుడవై సుఖదుఃఖాది ద్వంద్వాలను యోగక్షేమాలను దాటి అప్రమత్తుడవై నిత్యము శుద్ధసత్త్వమందు నిలువుము.

**భాష్యమ్ : 45.1 త్రైగుణ్య ఇతి. త్రైగుణ్యవిషయాః - త్రైగుణ్యం సంసారః విషయః ప్రకాశయితవ్యః యేషాం తే వేదాః త్రైగుణ్యవిషయాః త్వం తు నిస్త్రైగుణ్యః భవ అర్జున, నిష్కామః భవ ఇత్యర్థః నిర్ద్వంద్వః, సుఖదుఃఖహేతూ సప్రతిపక్షౌ పదార్థౌ ద్వంద్వశబ్దవాచ్యౌ, తతః నిర్గతః నిర్ద్వందః భవ. నిత్యసత్వస్థః సదా సత్వగుణాశ్రితః భవ. తథా నిర్యోగక్షేమః అనుపాత్తస్య ఉపాదానం యోగః, ఉపాత్తస్య రక్షణం క్షేమః. యోగక్షేమప్రధానస్య శ్రేయసి ప్రవృత్తిః దుష్కరా ఇతి అతః నిర్యోగక్షేమః భవ. ఆత్మవాన్ అప్రమత్తః చ భవ. ఏష తవ ఉపదేశః స్వధర్మం అనుతిష్ఠతః.**

**తె.అ.** వేదాలు త్రిగుణాలకార్యరూపమైన సంసారం గురించే చెపుతాయి. నీవు మాత్రం త్రిగుణాలను వదలి పెట్టు. అంటే కోరికలను వదలివెయ్యి. సుఖ దుఃఖ హేతువులగు శీతోష్ణములు మానావమానములు అనెడి ద్వంద్వాలను వదలిపెట్టు, అంటే సుఖదుఃఖహేతువులైన పరస్పర విరోధి పదార్థాలను వదలుము. నీవు ఎప్పుడూ సత్త్వగుణాన్ని ఆశ్రయించి ఉండు.

ప్రాప్తించనిది ప్రాప్తించడం యోగం. ప్రాప్తించిన దాని రక్షణ క్షేమం. యోగక్షేమాలు ప్రధానం అనుకున్నవానికి శ్రేయోమార్గంలో ప్రవృత్తి కలగడం కష్టం. కనుక యోగక్షేమాలను వదలిపెట్టు. ఆత్మవంతుడవుగా అంటే ఆత్మ విషయంలో అప్రమత్తుడవుగా ఉండు. స్వధర్మాన్ని అనుష్ఠించే నీకు ఉపదేశించవలసింది ఇదే.

**భాష్యమ్ : 46.0 సర్వేషు వేదోక్తేషు కర్మసు యాని ఉక్తాని అనంతాని ఫలాని తాని న అపేక్ష్యంతే చేత్, కిమర్థం తాని ఈశ్వరాయ ఇతి అనుష్ఠీయంతే ఇతి? ఉచ్యతే, శ్రుణు.**

**తె.అ.** వేదంలో చెప్పబడిన కర్మలకన్నిటికీ అనంతమైన ఫలాలు. అవేవీ అపేక్షించనివాడు ఆ కర్మలను ఈశ్వరార్పణంగా ఎందుకు అనుష్ఠిస్తాడు అంటే విను.

**మూ. యావానర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే ।**
**తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః ॥ 46**

**తె.అ.** చిన్నబావిలోని నీటితో ఎంత ప్రయోజనం గలదో, అంతటా వ్యాపించియున్న జలాశయంలోని నీళ్ళతోనూ అంతే ప్రయోజనం ఉంటుంది. వేదోక్త కర్మవల్ల బ్రాహ్మణునికి ఎంత ప్రయోజనం కలుగుతుందో పరమాత్మజ్ఞానం వల్ల అంతే ప్రయోజనం కలుగుతుంది.

**భాష్యమ్ : 46.1 యావాన్ ఇతి. యథా లోకే కూపతడాగాద్యనేకస్మిన్ ఉదపానే పరిచ్ఛిన్నోదకే యావాన్ యావత్పరిమాణః స్నానపానాదిః అర్థః ఫలం ప్రయోజనం సః సర్వః అర్థః సర్వతః సంప్లుతోదకే తావాన్ ఏవ సంపద్యతే, తత్ర అంతర్భవతి ఇత్యర్థః. ఏవం తావాన్ తావత్పరిమాణః ఏవ సంపద్యతే సర్వేషు వేదేషు వేదోక్తేషు కర్మసు యః అర్థః యత్ కర్మఫలం సః అర్థః బ్రాహ్మణస్య సంన్యాసినః పరమార్థతత్త్వం విజానతః యః అర్థః యత్ విజ్ఞానఫలం సర్వతః సంప్లుతోదకస్థానీయం తస్మిన్ తావాన్ ఏవ సంపద్యతే – తత్రైవ అంతర్భవతీత్యర్థః. 'సర్వం తత్ అభిసమేతి యత్ కించ ప్రజాః సాధు కుర్వంతి యస్తద్వేద యత్ స వేద' (ఛాం.ఉ.4.1.4) ఇతి శ్రుతేః. 'సర్వం కర్మాఖిలం' (4.33) ఇతి చ వక్ష్యతి. తస్మాత్ ప్రాక్ జ్ఞాననిష్ఠాధికార ప్రాప్తేః కర్మణి అధికృతేన కూపతడాగాద్యర్థ స్థానీయం అపి కర్మ కర్తవ్యమ్. తవ చ –**

**తె.అ.** లోకంలో బావి, చెరువు మొదలైన చిన్న జలాశయాల్లో స్నానం, పానము మొదలైన ప్రయోజనాలు ఎంతగా సమకూరుతున్నాయో అంతగాను నీటితో నిండిన మహాజలాశయంలో సమకూరుతాయి. వేదోక్తమైన సర్వకర్మలవల్ల ఎంత ప్రయోజనం కలుగుతుందో పరమార్థతత్త్వం తెలిసిన సంన్యాసికి, విజ్ఞానమనే నీరు అంతటా నిండి ఉన్నవానికి అంతే ప్రయోజనం కలుగుతుంది అని అర్థం. విజ్ఞాన ఫలంలో కర్మఫలం అంతర్భవిస్తుంది. 'జనులు ఏ సత్కర్మలు ఆచరించినా

వాటి ఫలం పరబ్రహ్మమును తెలిసిన అతనికి చెందుతాయి' (ఛాం.ఉ.4.1.4) అని శ్రుతి. 'సర్వకర్మలు నిశ్శేషంగా జ్ఞానం కలగడంతో పరిసమాప్తి చెందుతాయి.' (4.33) అని కూడా అంటాడు. కనుక జ్ఞాననిష్ఠకు అధికారం ప్రాప్తించక పూర్వం కర్మలయందు అధికారి అయినవాడు బావి, చెరువు వంటి అల్పప్రయోజనమిచ్చే కర్మలు చేస్తూ ఉండవలసిందే.

**మూ. కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన ।**
**మా కర్మఫలహేతుర్భూర్మా తే సంగోఽస్త్వకర్మణి ॥ 47**

**తె.అ.** నీకు కర్మలయందే అధికారము.కర్మ ఫలములయందెన్నటికీ వద్దు. కర్మ ఫలప్రాప్తికి కారణం కావద్దు. అట్లా అని కర్మ చేయకుండా ఉండరాదు.

**భాష్యమ్ : 47.1 కర్మణి ఇతి. కర్మణి ఏవ అధికారః, న జ్ఞాననిష్ఠాయాం తే తవ. తత్ర చ కర్మ కుర్వతః మా ఫలేషు అధికారః అస్తు, కర్మఫలతృష్ణా మా భూత్ కదాచన కస్యాంచిత్ అపి అవస్థాయాం ఇత్యర్థః. యదా కర్మఫలే తృష్ణా తే స్యాత్ తదా కర్మఫలప్రాప్తేః హేతుః స్యాః, ఏవం మా కర్మఫలహేతుర్భూః. యదా హి కర్మఫలతృష్ణాప్రయుక్తః కర్మణి ప్రవర్తతే తదా కర్మఫలస్య ఏవ జన్మనః హేతుః భవేత్. యది కర్మఫలం న ఇష్యతే, కిం కర్మణా దుఃఖరూపేణ? ఇతి మా తే తవ సంగః అస్తు అకర్మణి అకరణే ప్రీతిః మా భూత్.**

**తె.అ.** నీకు కర్మలయందే అధికారము, జ్ఞాననిష్ఠయందు కాదు. కర్మలు చేస్తూ కూడా వాటి ఫలములయందు అధికారం వద్దు. కర్మఫలమందు కోరిక ఎప్పుడూ ఏ పరిస్థితిలోను కలుగకూడదు, అని నా అభిప్రాయం. కర్మఫలమందు నీకు కోరిక ఎప్పుడు కలగుతుందో అప్పుడు నీవు కర్మఫలప్రాప్తికి కారణమవుతావు. అట్లా కావద్దు. ఎప్పుడైతే నీవు కర్మఫలంపై కోరికతో కర్మనాచరిస్తావో అపుడు జన్మకు కారణం కల్పించబడుతుంది. కర్మఫలం కోరనపుడు మరి కష్టపడి ఈ కర్మ చేయడమెందుకు అని కర్మలు ఆచరించకుండడంలో నీకు ఆసక్తి పనికిరాదు.

**భాష్యమ్ : 48.0 యది కర్మఫలప్రయుక్తేన న కర్తవ్యం కర్మ, కథం తర్హి కర్తవ్యం ఇతి? ఉచ్యతే –**

**తె.అ.** కర్మఫలంపై కోరికతో కాకపోతే కర్మ మరి ఎట్లా చేయవలె? విను –

**మూ. యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ ।**
**సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే ॥ 48**

**తె.అ.** యోగనిష్ఠయందుండి కర్మఫలాపేక్ష లేకుండా కర్మలు చెయ్యి, ఫలమునొందినను, పొందకపోయినను సమానంగా భావించు. సమత్వమే యోగం అని చెప్పబడుతుంది.

**భాష్యమ్ : 48.1 యోగస్థః ఇతి. యోగస్థః సన్ కురు కర్మాణి కేవలం ఈశ్వరార్థం, తత్రాపి 'ఈశ్వరో మే తుష్యతు' ఇతి సంగం త్యక్త్వా ధనంజయ. ఫలతృష్ణాశూన్యేన క్రియమాణే కర్మణి సత్త్వశుద్ధిజా, జ్ఞానప్రాప్తిలక్షణాసిద్ధిః, తద్విపర్యయజా అసిద్ధిః, తయోః సిద్ధ్యసిద్ధ్యోః అపి సమః తుల్యః భూత్వా కురు కర్మాణి. కోఽసౌ యోగః యత్రస్థః కురు ఇతి ఉక్తమ్? ఇదం ఏవ తత్ – సిద్ధ్యసిద్ధ్యోః సమత్వం యోగః ఉచ్యతే –**

**తె.అ.** ఈశ్వరుని ఆశ్రయించి కేవలం ఈశ్వరార్పణంగా కర్మలు చెయ్యి. ఆ చెయ్యడం కూడా ఎట్లాగంటే 'ఈశ్వరుడు నాయందు ప్రసన్నుడవుతాడు' అనే ఆశారూపమైన ఆసక్తి కూడా వదలి చెయ్యి. ఫలమందు కోరిక లేకుండా చేసే కర్మలవల్ల సత్త్వం శుద్ధి అవుతుంది. సత్త్వ శుద్ధి వల్ల జ్ఞానసిద్ధి కలుగుతుంది. ఇందుకు విపరీతమైన కర్మలవల్ల కలిగేది అసిద్ధి. ఈ సిద్ధ్యసిద్ధులను రెంటిని సమంగా భావించి కర్మలు చెయ్యి. 'ఈశ్వరార్పణ బుద్ధితో కర్మలు చెయ్యి' అన్నాడు. ఏమిటా యోగమంటే ఇదే, సిద్ధ్యసిద్ధులయందు సమత్వం.

**భాష్యమ్ : 49.0 యత్ పునః సమత్వబుద్ధియుక్తం ఈశ్వరారాధనార్థం కర్మ (ఉక్తం) ఏతస్మాత్ కర్మణః –**

**తె.అ.** సమత్వబుద్ధితో ఈశ్వరారాధనగా చేసే కర్మతో పోల్చినపుడు –

**మూ. దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనంజయ ।**
**బుద్ధౌ శరణమన్విచ్ఛ కృపణాః ఫలహేతవః ॥ 49**

**తె.అ.** సమత్వబుద్ధితో (నిష్కామబుద్ధితో) చేసిన కర్మకంటె ఫలాపేక్షతో చేసిన కర్మ నికృష్టమైనది. ఫలాపేక్షగలవారు హీనులు, కనుక సమత్వబుద్ధిని ఆశ్రయించు.

**భాష్యమ్ : 49.1 దూరేణ ఇతి. దూరేణ అతిప్రకర్షేణ హి అవరం అధమం నికృష్టం కర్మ ఫలార్థినా క్రియమాణం బుద్ధియోగాత్ సమత్వబుద్ధియుక్తాత్ కర్మణః, జన్మ మరణాదిహేతుత్వాత్. హే ధనంజయ, యతః ఏవం తతః యోగవిషయాయాం బుద్ధౌ తత్పరిపాకజాయాం వా సాంఖ్యబుద్ధౌ శరణం ఆశ్రయం అభయప్రాప్తికారణం అన్విచ్ఛ ప్రార్థయస్వ. పరమార్థజ్ఞానశరణః భవ ఇత్యర్థః యతః అవరం కర్మ కుర్వాణాః కృపణాః దీనాః ఫలహేతవః ఫలతృష్ణాప్రయుక్తాః సంతః 'యో వా ఏతదక్షరం గార్గ్యవిదిత్వాఽస్మాల్లోకాత్ప్రైతి స కృపణః' (బృ.3.8.10) ఇతి శ్రుతేః.**

**తె.అ.** నిష్కామకర్మకంటే కామ్య కర్మ, జన్మమరణాది హేతువు కావడంచేత, అత్యంత నికృష్టమైనది. కనుక నీవు యోగవిషయకబుద్ధిని, లేక దాని పరిపాకమందు కలుగు సాంఖ్యబుద్ధిని ఆశ్రయించు,

అభయప్రాప్తిని కోరుకో. అంటే పరమార్థజ్ఞానమును శరణువేడు, అని అర్థం. ఎందుకంటె ఫలాపేక్షతో తక్కువ ఫలాన్నిచ్చే కర్మలు చేసే వారిని చూసి జాలిపడాలి. 'ఓ గార్గి, ఈ అక్షరమైన బ్రహ్మమును తెలుసుకోకుండా ఈ లోకం విడిచి వెళ్ళినవాడు దీనుడు,' (బృ. 3.8.10) అని శ్రుతి.

**భాష్యమ్ : 50.0 సమత్వబుద్ధియుక్తః సన్ స్వధర్మం అనుతిష్ఠన్ యత్ ఫలం ప్రాప్నోతి తత్ శృణు –**

**తె.అ.** సమత్వబుద్ధి కలిగి స్వధర్మం అనుష్ఠించేవాడు ఏ ఫలం పొందుతాడో విను –

**మూ. బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే ।**
**తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్ ॥ 50**

**తె.అ.** సమత్వబుద్ధి కలిగినవాడు పుణ్యపాపకర్మలను రెంటినీ వదలుతాడు. కనుక యోగం కొరకు యత్నించు. యోగమంటే నేర్పుగా కర్మలు చేయడం.

**భాష్యమ్ : 50.1 బుద్ధి ఇతి. బుద్ధియుక్తః సమత్వవిషయయా బుద్ధ్యా యుక్తః బుద్ధియుక్తః సః జహాతి పరిత్యజతి ఇహ అస్మిన్ లోకే ఉభే సుకృతదుష్కృతే పుణ్యపాపే సత్త్వశుద్ధిజ్ఞానప్రాప్తిద్వారేణ యతః, తస్మాత్ సమత్వబుద్ధియోగాయ యుజ్యస్వ ఘటస్వ. యోగః హి కర్మసు కౌశలం స్వధర్మాఖ్యేషు కర్మసు వర్తమానస్య యా సిద్ధ్యసిద్ధ్యోః సమత్వబుద్ధిః ఈశ్వరార్పితచేతస్తయా తత్ కౌశలం కుశల భావః. తద్ధి కౌశలం యత్ బంధస్వభావాని అపి కర్మణి సమత్వబుద్ధ్యా స్వభావాత్ నివర్తంతే. తస్మాత్ సమత్వబుద్ధియుక్తః భవ త్వమ్. యస్మాత్.**

**తె.అ.** నిష్కామబుద్ధి కలిగినవాడు సత్త్వశుద్ధి వలన కలిగే జ్ఞానంచేత పుణ్యపాపకర్మలను రెంటినీ వదలివేసి ఈ లోకంలోనే కర్మబంధం నుండి ముక్తుడవుతాడు. కనుక యోగప్రాప్తికై యత్నించు. యోగమంటే కర్మలు చేయడంలో నేర్పు. స్వధర్మరూపమైన కర్మలు చేసేవానికి, ఆ కర్మలు ఈశ్వరార్పితంగా చేస్తున్నందువల్ల, జాయాపజయాలందు సమత్వబుద్ధి కలుగుతుంది. అదే నేర్పు. బంధం కర్మలకు స్వభావం. అయినప్పటికి సమత్వబుద్ధితో చేసినపుడు కర్మలు వాటి స్వభావం వదలుకుంటాయి. ఆవిధంగా బంధించే కర్మలు బంధించకుండా ఉండేటట్లు వాటిని ఆచరించగలగడమే కర్మలయందు నేర్పు. కనుక నీవు సమత్వబుద్ధియుక్తుడవు కమ్ము. ఎందుకంటే–

**మూ. కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః ।**
**జన్మబన్ధవినిర్ముక్తాః పదం గచ్ఛన్త్యనామయమ్ ॥ 51**

**తె.అ.** సమత్వబుద్ధిగల వివేకులు కర్మలవల్ల కలిగే ఫలాన్ని వదలి జన్మబంధం నుండి విముక్తులై దుఃఖరహితమైన మోక్షపదాన్ని పొందుతారు.

**భాష్యమ్ : 51.1 కర్మజమితి :- కర్మజం ఫలం 'త్యక్త్వా' ఇతి వ్యవహితేన సంబన్ధః ఇష్టానిష్టదేహప్రాప్తిః కర్మజం ఫలం, కర్మభ్యః జాతం, బుద్ధియుక్తాః సమత్వబుద్ధియుక్తాః, సంతః హి యస్మాత్, ఫలం త్యక్త్వా పరిత్యజ్య మనీషిణః జ్ఞానినః భూత్వా, జన్మబన్ధవినిర్ముక్తాః - జన్మైవ బన్ధః జన్మబన్ధః తేన వినిర్ముక్తాః, జీవన్తః ఏవ జన్మబన్ధవినిర్ముక్తాః సన్తః, పదం పరమం విష్ణోః మోక్షాఖ్యం, గచ్ఛన్తి, అనామయం సర్వోపద్రవరహితమిత్యర్థః.**

**తె.అ.** కర్మలవల్ల కలిగే ఫలం ఇష్టానిష్ట దేహప్రాప్తి. బుద్ధియుక్తులు అంటే సమత్వబుద్ధి గలవారు, ఫలాన్ని వదలివేసి మనీషులై అంటే జ్ఞానులై, జీవించి ఉండగానే జన్మబంధం నుండి విముక్తులై దుఃఖరహితమైన మోక్షమనే పరమవిష్ణుపదం చేరుకుంటారు.

**భాష్యమ్ : 51.2 అథవా - "బుద్ధియోగాద్ధనంజయ" ఇత్యారభ్య పరమార్థదర్శనలక్షణైవ సర్వతః సంప్లుతోదక స్థానీయా కర్మయోగజసత్త్వశుద్ధిజనితా బుద్ధిః దర్శితా, సాక్షాత్ సుకృతదుష్కృత ప్రహాణాది హేతుత్వశ్రవణాత్.**

**తె.అ.** లేదా ఇట్లా గూడా అర్థం చేసుకోవచ్చు.

(39వ శ్లోకంలో 'ఇంతవరకు నీకు సాంఖ్యాన్ని వివరించాను. ఇక యోగాన్ని వివరిస్తాను' అని 40 నుండి 48 వరకు యోగబుద్ధిని చెప్పాడు. 49 నుండి మళ్లీ సాంఖ్యాన్నే వివరిస్తున్నాడు అని కూడా అర్థం చేసుకోవచ్చు.)

'బుద్ధియోగం కంటే ఫలాపేక్షతో చేసిన కర్మ నికృష్టమైనది' (49) అన్న వాక్యం మొదలుకొని ఇంతవరకు కర్మయోగం వల్ల కలిగే సత్త్వ శుద్ధి ద్వారా ప్రాప్తించే పరమార్థదర్శనరూపమైన సాంఖ్యబుద్ధినే చెబుతున్నాడు. ఎందుకంటే ఈ బుద్ధి పుణ్యపాపాలను నాశనం చేయడానికి సాక్షాత్తు హేతువు అని అన్నారు గనుక.

**భాష్యమ్ : 52.0 యోగానుష్ఠానజనితసత్త్వశుద్ధిజా బుద్ధిః కదా ప్రాప్యతే ఇతి. ఉచ్యతే-**

**తె.అ.** యోగానుష్ఠానం చేత కలిగిన సత్త్వశుద్ధివల్ల జ్ఞానం ఎప్పుడు సంప్రాప్తిస్తుంది? విను -

**మూ. యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి ।**
**తదా గన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ ॥ 52**

**తె.అ.** నీ బుద్ధి మోహకాలుష్యాన్ని దాటినపుడు విన్నదానియందు, వినదగినదానియందు కూడా నీకు వైరాగ్యం కలుగుతుంది.

**భాష్యమ్ : 52.1 యదేతి. యస్మిన్ కాలే, తే తవ, మోహకలిలం మోహాత్మకమ్ అవివేకరూపం కాలుష్యం, యేన ఆత్మానాత్మవివేకబోధం కలుషీకృత్య విషయం ప్రత్యన్తః కరణం ప్రవర్త్యతే తత్, తవ బుద్ధిః వ్యతితరిష్యతి వ్యతిక్రమిష్యతి, అతిశుద్ధభావమ్ ఆపత్స్యతే ఇత్యర్థః. తదా తస్మిన్ కాలే, గన్తాసి, ప్రాప్స్యసి, నిర్వేదం, వైరాగ్యం, శ్రోతవ్యస్య చ శ్రుతస్య చ. తదా శ్రోతవ్యం శ్రుతం చ నిష్ఫలం ప్రతిపద్యతే (ప్రతిభాతి) ఇత్యభిప్రాయః.**

**తె.అ.** ఆత్మానాత్మ వివేకజ్ఞానాన్ని కలుషితం చేసి విషయాల వైపు అంతఃకరణాన్ని ప్రవర్తింపజేసే అవివేకరూపమైన మోహకాలుష్యాన్ని నీ బుద్ధి అతిక్రమించినప్పుడు, అంటే నీ బుద్ధి శుద్ధి చెందినపుడు, నీకు విన్నదానిపై, వినదగిన దానిపై గూడా వైరాగ్యం కలుగుతుంది. అంటే నీవు అంతవరకు విన్న విషయాలు, వినదగిన విషయాలు కూడా నిష్ఫలమైనవిగా అవుతాయి అని అభిప్రాయం.

**భాష్యమ్ : 53.0 మోహకలిలాత్యయద్వారేణ లబ్ధాత్మవివేక ప్రజ్ఞః కదా కర్మయోగజం ఫలం పరమార్థయోగమ్ అవాప్స్యామి ఇతి చేత్ శ్రుణు –**

**తె.అ.** మోహకాలుష్యాన్ని దాటి ఆత్మానాత్మవివేకం పొందిన తరువాత కర్మయోగం వల్ల కలిగే పరమార్థ యోగఫలం ఎపుడు పొందగలను అంటావా, విను –

**మూ.** **శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా ।**
**సమాధావచలా బుద్ధిస్తదా యోగమవాప్స్యసి ॥ 53**

**తె.అ.** వేదవాక్యాల చేత అనిశ్చితమైన నీ బుద్ధి సమాధి (ఆత్మ) యందు నిశ్చలమై నిలిచినపుడు నీవు యోగం (వివేకప్రజ్ఞ) పొందుతావు.

**భాష్యమ్ : 53.1 శ్రుతివిప్రతిపన్నా ఇతి. శ్రుతివిప్రతిపన్నా అనేక సాధ్యసాధన సంబంధప్రకాశన శ్రుతిభిః శ్రవణైః ప్రవృత్తినివృత్తిలక్షణైః విప్రతిపన్నా నానాప్రతిపన్నా (శ్రుతి విప్రతిపన్నా) విక్షిప్తా సతీ తే తవ బుద్ధిః యదా యస్మిన్ కాలే స్థాస్యతి స్థిరీభూతా భవిష్యతి నిశ్చలా విక్షేపచలనవర్జితా సతీ సమాధౌ – సమాధీయతే చిత్తమ్ అస్మిన్ ఇతి సమాధిః ఆత్మా, తస్మిన్ ఆత్మని ఇత్యేతత్ । (సా అపి) అచలా, తత్రాపి వికల్పవర్జితా ఇత్యేతత్. బుద్ధిః అంతఃకరణమ్. తదా తస్మిన్ కాలే యోగం అవాప్స్యసి వివేకప్రజ్ఞాం సమాధిం ప్రాప్స్యసి.**

**తె.అ.** అనేక సాధ్యసాధనాలను వాటి సంబంధాలను వివరించే వేదవాక్యాలచేత అనేక భావాలతో కలతపడిన బుద్ధి, సమాధియందు వికల్పాలులేనిదై, సంశయరహితంగా స్థిరంగా నిలిచినపుడు నీవు యోగం పొందుతావు. చిత్తం సమాధానం పొందుతుంది కనుక సమాధి, అంటే ఆత్మ. సమాధియందు అంటే ఆత్మయందు అని. యోగం అంటే వివేకప్రజ్ఞ.

**భాష్యమ్ : 54.0 ప్రశ్నబీజం ప్రతిలభ్య అర్జునః ఉవాచ లబ్ధసమాధిప్రజ్ఞస్య లక్షణబుభుత్సయా–**

**తె.అ.** ప్రశ్న వేయడానికి అవకాశం దొరికిన అర్జునుడు సమాధి స్థితిని పొందినవాని లక్షణాలు తెలుసుకోవలెనని అడుగుతున్నాడు.

**అర్జున ఉవాచ**

**మూ. స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ ।**
**స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్ ॥ 54**

అర్జునుడు అంటున్నాడు –
**తె.అ.** సమాధియందున్న స్థితప్రజ్ఞుని లక్షణాలేవి? అతడేమి మాట్లాడుతాడు? ఎట్లా కూర్చుంటాడు? ఎట్లా నడుస్తాడు (వెడతాడు)?

**భాష్యమ్ : 54.1 స్థితప్రజ్ఞస్యేతిః స్థితా ప్రతిష్ఠితా "అహమ్ అస్మి పరం బ్రహ్మ" ఇతి ప్రజ్ఞా యస్య సః స్థితప్రజ్ఞః, తస్య కా భాషా? కిం తస్య భాషణమ్, వచనం కథమ్ అసౌ పరైః భాష్యతే ఇత్యర్థః. సమాధిస్థస్య సమాధౌ స్థితస్య, కేశవ, స్థితధీః స్థితప్రజ్ఞః స్వయం వా కిం ప్రభాషేత? కిమ్ ఆసీత, వ్రజేత కిమ్? ఆసనం వ్రజనం వా తస్య కథమ్ ఇత్యర్థః. స్థితప్రజ్ఞస్య లక్షణమ్ అనేన శ్లోకేన పృచ్ఛ్యతే.**

**తె.అ.** నేను పరబ్రహ్మమును అన్న ప్రజ్ఞ స్థిరంగా ఉన్నవాడు స్థితప్రజ్ఞుడు. అటువంటి వాని భాష ఏమి? అంటే సమాధిలో ఉన్నవానిని ఇతరులు ఏ భాషతో వర్ణిస్తారు? ఆ స్థితప్రజ్ఞుడు ఎట్లా మాట్లాడుతాడు? ఎట్లా కూర్చుంటాడు? ఎట్లా నడుస్తాడు? అంటే అతడు కూర్చోడం నడవడం ఎట్లా వుంటాయి అని అర్థం. ఈ శ్లోకంలో స్థితప్రజ్ఞుని లక్షణాలను అడుగుతున్నాడు.

**భాష్యమ్ : 55.0 యః హి ఆదితః ఏవ సంన్యస్య కర్మాణి జ్ఞానయోగనిష్ఠాయాం ప్రవృత్తః యశ్చ కర్మయోగేన తయోః 'ప్రజహాతి' ఇత్యారభ్య అధ్యాయసమాప్తిపర్యన్తం స్థితప్రజ్ఞలక్షణం సాధనం చ ఉపదిశ్యతే, సర్వత్రైవ హి అధ్యాత్మశాస్త్రే కృతార్థలక్షణాని యాని తాన్యేవ సాధనాని ఉపదిశ్యన్తే యత్నసాధ్యత్వాత్. యాని యత్నసాధ్యాని సాధనాని, లక్షణాని చ భవన్తి తాని.**

**తె.అ.** స్థితప్రజ్ఞులు రెండు విధాలవారున్నారు. మొదటనే కర్మలను సంన్యసించి జ్ఞానయోగ నిష్ఠయందు ప్రవర్తించేవారు, కర్మయోగం ద్వారా జ్ఞాననిష్ఠ పొందినవారు. ఈ రెండు విధాలైన స్థితప్రజ్ఞుని లక్షణము సాధనము కూడా భగవానుడుపదేశిస్తున్నాడు, 'ప్రజహాతి' అనే శ్లోకం నుండి అధ్యాయం చివరివరకు. కృతార్థులైనవారి లక్షణాలను సాధనాలుగా అధ్యాత్మశాస్త్రంలో అంతటా ఉపదేశిస్తారు. ఎందుకంటే అవి సాధకులు ప్రయత్నించి సాధించగలిగినవి కనుక. ఏవి యత్నం చేత సాధించగలమో అవే సాధనాలూ, లక్షణాలు గూడా అవుతాయి.

**శ్రీభగవానువాచ –**

**మూ. ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్ ।**
**ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే ॥ 55**

శ్రీభగవానుడంటున్నాడు –

**తె.అ.** మనసులోని కోరికలన్నిటిని వదలివేసి తనయందు తాను సంతుష్టుడైనపుడు స్థితప్రజ్ఞుడంటారు.

**భాష్యమ్ : 55.1 ప్రజహాతీతి – ప్రజహాతి ప్రకర్షేణ జహాతి పరిత్యజతి, యదా యస్మిన్ కాలే, సర్వాన్ సమస్తాన్, కామాన్ ఇచ్ఛాభేదాన్, హే పార్థ, మనోగతాన్ మనసి ప్రవిష్టాన్ హృది ప్రవిష్టాన్. సర్వకామపరిత్యాగే తుష్టికారణాభావాత్ శరీరధారణనిమిత్తశేషే చ సతి ఉన్మత్తప్రమత్తస్యేవ ప్రవృత్తిః ప్రాప్తా ఇత్యతః ఉచ్యతే – ఆత్మని ఏవ ప్రత్యగాత్మ స్వరూపే ఏవ, ఆత్మనా స్వేన ఏవ, బాహ్యాలాభనిరపేక్షః తుష్టపరమార్థ దర్శనామృతరసలాభేన అన్యస్మాత్ అలంప్రత్యయవాన్, స్థిత ప్రజ్ఞః, స్థితా ప్రతిష్ఠితా ఆత్మానాత్మవివేకజా ప్రజ్ఞా యస్య సః విద్వాన్ తదా ఉచ్యతే. త్యక్త పుత్ర విత్తలోకైషణః, సంన్యాసీ, ఆత్మారామః ఆత్మక్రీడః స్థితప్రజ్ఞః ఇత్యర్థః. కించ –**

**తె.అ.** హృదయంలో ప్రవేశించిన సమస్తవిధములైన కామములను నిశ్శేషంగా పరిత్యజించినపుడు స్థితప్రజ్ఞుడంటారు. అయితే ఇక్కడ ఒక సందేహం కలుగవచ్చు. కోరికలన్నీ వదలివేసిన తరువాత సంతోషకారణాలేవీ మిగలవు. కానీ శరీరం కలగడానికి కారణమైన ప్రారబ్ధం మిగిలి ఉంటుంది. అప్పుడు శరీరం నిలిచి ఉండడానికి పిచ్చివానివలె తాగినవానివలె ప్రవర్తించవలసి ఉంటుంది కదా? ఇందుకు సమాధానం – బాహ్యాలాభమేదీ కోరక అంతరాత్మయందే సంతుష్టుడై పరమార్థదర్శనామృతరస లాభం చేత ఇతరమేదీ వద్దనుకునేవాడు స్థితప్రజ్ఞుడు, అంటే ఆత్మానాత్మ వివేకరూపమైన ప్రజ్ఞ కలవాడు విద్వాంసుడు. పుత్రవిత్తలోకములయందు కోర్కెలను వదలిన సంన్యాసియే ఆత్మారాముడు, ఆత్మరతుడు, స్థితప్రజ్ఞుడునని అర్థం. ఇంకా –

**మూ. దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః ।**
**వీతరాగభయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే ॥ 56**

**తె.అ.** కష్టాలు కలిగినపుడు మనసు కలతపడనివాడు, సుఖాలు ప్రాప్తించినపుడు తృష్ణారహితుడై ఉండేవాడు; రాగము, భయము, క్రోధము లేనివాడు – ఇటువంటి మునిని స్థితప్రజ్ఞుడంటారు.

**భాష్యమ్ : 56.1 దుఃఖేషు ఇతి. దుఃఖేషు ఆధ్యాత్మికాదిషు ప్రాప్తేషు అనుద్విగ్నం చ ప్రక్షుభితం దుఃఖప్రాప్తౌ మనః యస్య సోఽయం అనుద్విగ్నమనాః. తథా సుఖేషు ప్రాప్తేషు విగతా స్పృహా తృష్ణా యస్య, న అగ్నిః ఇవ ఇంధనాద్యాధానే, సుఖాని అనువివర్ధతే స విగతస్పృహః. వీతరాగభయక్రోధః రాగశ్చ భయం చ క్రోధశ్చ వీతాః విగతాః యస్మాత్ సః వీతరాగభయక్రోధః స్థితధీః స్థితప్రజ్ఞః మునిః సంన్యాసీ తదా ఉచ్యతే. కించ –**

**తె.అ.** ఆధ్యాత్మికం, ఆధిభౌతికం, ఆధిదైవతం అనే త్రివిధాలైన దుఃఖాలు ప్రాప్తించినపుడు సంక్షోభం చెందని మనసు కలవాడు, సుఖాలు ప్రాప్తించినపుడు కట్టెలు మొదలయినవి వేసినపుడు వృద్ధి చెందే అగ్నివలె కాకుండా స్పృహలేని మనసు కలవాడు; రాగము, భయము, క్రోధము వదలినవాడు – ఇటువంటి సంన్యాసిని (మునిని) స్థితప్రజ్ఞుడంటారు. ఇంకా –

**మూ. యః సర్వత్రానభిస్నేహస్తత్తత్ప్రాప్య శుభాశుభమ్ ।**
**నాభినన్దతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 57**

**తె.అ.** సకల విషయాల్లోను ఆసక్తిరహితుడు, ప్రియము, అప్రియము ప్రాప్తించినపుడు ఆనందము ద్వేషము లేనివాడు స్థితప్రజ్ఞుడు.

**భాష్యమ్ : 57.1 యః సర్వత్రేతి – యః మునిః, సర్వత్ర దేహజీవితాదిష్వపి అనభిస్నేహః అభిస్నేహవర్జితః, తత్ తత్ ప్రాప్య శుభాశుభం తత్ తత్ శుభమ్ అశుభం వా లబ్ధ్వా న అభినన్దతి, న ద్వేష్టి, శుభం ప్రాప్య న తుష్యతి న హృష్యతి అశుభం చ ప్రాప్య న ద్వేష్టి ఇత్యర్థః. తస్య ఏవం హర్షవిషాదవర్జితస్య వివేకప్రజ్ఞా ప్రతిష్ఠితా భవతి. కించ –**

**తె.అ.** దేనియందు అంటే దేహజీవితాదులయందు కూడా స్నేహం లేనివాడు, శుభం కాని అశుభం కాని ప్రాప్తించినపుడు ఆనందించడు ద్వేషించడు. అంటే శుభం ప్రాప్తించినపుడు ఆనందము అశుభం ప్రాప్తించినపుడు ద్వేషము లేనివాడు అని అర్థం. ఈ విధంగా హర్షవిషాదాలు లేనివానికి వివేకంవల్ల కలిగిన ప్రజ్ఞ స్థిరంగా ఉంటుంది. ఇంకా –

**మూ. యదా సంహరతే చాయం కూర్మోఽఙ్గానీవ సర్వశః ।**
**ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 58**

**తె.అ.** తాబేలు తన అవయవాలను అన్నివైపుల నుండి లోనికి మరల్చుకొన్నట్లు అతడు తన ఇంద్రియాలను, ఇంద్రియ విషయాలనుండి ఉపసంహరించినపుడు అతని ప్రజ్ఞ స్థిరమవుతుంది.

**భాష్యమ్ : 58.1 యదా సంహరతే ఇతి – యదా సంహరతే సమ్యక్ ఉపసంహరతే, చ, అయం జ్ఞాననిష్ఠాయాం ప్రవృత్తః యతిః కూర్మః భయాత్ స్వాని అఙ్గాని ఉపసంహరతి సర్వశః సర్వతః ఏవం జ్ఞాననిష్ఠః, ఇన్ద్రియాణి, ఇన్ద్రియార్థేభ్యః సర్వవిషయేభ్యః ఉపసంహరతే, తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ఇతి ఉక్తార్థం వాక్యమ్.**

**తె.అ.** తాబేలు తన అవయవాలను భయం చేత అన్నివైపుల నుండి లోనికి మరల్చుకొన్నట్లు, జ్ఞాననిష్ఠయందు ప్రవృత్తుడైన సంన్యాసి ఇంద్రియ విషయాలన్నిటి నుండి ఇంద్రియాలను ఉపసంహరించుకుంటాడు. అపుడు అతని ప్రజ్ఞ స్థిరమవుతుంది.

**భాష్యమ్ : 59.0 తత్ర విషయాన్ అనాహరతః ఆతురస్యాపి ఇన్ద్రియాణి నివర్తన్తే, కూర్మాఙ్గానీవ సంహ్రియన్తే, న తు తద్విషయః రాగః సః కథం సంహ్రియతే ఇతి. ఉచ్యతే –**

**తె.అ.** రోగి యొక్క ఇంద్రియాలు కూడా విషయాలవైపు వెళ్ళవు. అయినా ఆ విషయాలపై ఆసక్తి వెనుతిరగడం లేదు. ఆ ఆసక్తి ఎలా వెనక్కు లాగబడాలి అంటే, విను –

**మూ. విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః ।**
**రసవర్జం రసో–ప్యస్య పరం దృష్ట్వా నివర్తతే ॥ 59**

**తె.అ.** మితాహారం భుజించేవానికి ఇంద్రియాలు విషయాలవైపు వెళ్ళవు. కాని విషయవాంఛ దూరం కాదు. ఆ వాంఛ పరమాత్మదర్శనమైన తరువాతనే నశిస్తుంది.

**భాష్యమ్ : 59.0 విషయా ఇతి – యద్యపి – విషయోపలక్షితాని విషయశబ్దవాచ్యాని ఇన్ద్రియాణి, అథవా విషయాః ఏవ, నిరాహారస్య అనాహ్రియమాణవిషయస్య కష్టే తపసి స్థితస్య మూర్ఖస్య అపి, వినివర్తన్తే, దేహినః దేహవతః రసవర్జం – రసః రాగః విషయేషు యః తం వర్జయిత్వా రసశబ్దో రాగే ప్రసిద్ధః "స్వరసేన ప్రవృత్తః" "రసికః", "రసజ్ఞః" ఇత్యాది దర్శనాత్. సః అపి రసః రఞ్జనరూపః సూక్ష్మః అస్య యతేః పరం పరమార్థతత్త్వం బ్రహ్మ, దృష్ట్వా ఉపలభ్య "అహమేవ తత్" ఇతి వర్తమానస్య నివర్తతే నిర్బీజం విషయజ్ఞానం సంపద్యతే ఇత్యర్థః. న అసతి సమ్యగ్దర్శనే రసస్య ఉచ్ఛేదః. తస్మాత్ సమ్యగ్దర్శనాత్మికాయాః ప్రజ్ఞాయాః స్థైర్యం కర్తవ్యమ్ ఇతి అభిప్రాయః.**

**తె.అ.** విషయాలు అంటే శబ్దాది ఇంద్రియ విషయములు మూర్ఖుడైనా సరే విషయాలను గ్రహించక కష్టమైన తపస్సు చేస్తూ ఉంటే అతనికి విషయాలు దూరంగా ఉంటాయి. విషయాలపై

రసం (వాంఛ) మాత్రం దూరం కాదు. రసశబ్దం రాగమనే అర్థంలో ప్రసిద్ధం. రసం చేత ప్రవృత్తుడు రసికుడు రసజ్ఞుడు మొదలైన ప్రయోగాలు చూస్తున్నాము. రంజనరూపమైన ఆ సూక్ష్మరసం కూడా ఎప్పుడు దూరమవుతుంది అంటే, నేనే అది అని బ్రహ్మమును పరమార్థతత్త్వమును తెలిసిన తరువాత. అంటే విషయవిజ్ఞానం నిర్బీజమవుతుంది. సమ్యగ్దర్శనం కాకుండా రసం సమూలంగా లేచిరాదు. కనుక సమ్యగ్దర్శనాత్మకమైన బుద్ధిని స్థిరంచేసుకోవడం కర్తవ్యమని అభిప్రాయం.

**భాష్యమ్ : 60.0 సమ్యగ్దర్శనలక్షణప్రజ్ఞాస్థైర్యం చికీర్షతా ఆదౌ ఇంద్రియాణి స్వవశే స్థాపయితవ్యాని, యస్మాత్ తదనవస్థాపనే దోషమ్ ఆహ –**

**తె.అ.** సమ్యగ్దర్శనరూపమైన స్థిరబుద్ధిని కోరుకునేవాడు ముందు ఇంద్రియాలను తన వశంలో ఉంచుకోవాలి. అట్లా ఉంచుకోకపోవడం దోషం అంటున్నాడు.

**మూ. యతతో హ్యపి కౌన్తేయ పురుషస్య విపశ్చితః ।**
**ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః ॥ 60**

**తె.అ.** ఓ కౌన్తేయ! ఎంత విద్వాంసుడైనా, పురుషుడు ఎంత ప్రయత్నం చేస్తున్నా, ఇంద్రియాలు మేధావి మనసును కూడా బలవంతంగా విషయాల వైపుకు లాగివేస్తాయి.

**భాష్యమ్ : 60.1 యతతః ఇతి – యతతః ప్రయత్నం కుర్వతః హి యస్మాత్ కౌన్తేయ, పురుషస్య, విపశ్చితః మేధావినః 'అపీతి' వ్యవహితేన సంబన్ధః, ఇన్ద్రియాణి ప్రమాథీని ప్రమథనశీలాని విషయాభిముఖం హి పురుషం విక్షోభయన్తి ఆకులీకుర్వన్తి, ఆకులీకృత్య చ హరన్తి ప్రసభం ప్రసహ్య ప్రకాశమేవ పశ్యతః వివేకవిజ్ఞానయుక్తం మనః యతః తస్మాత్.**

**తె.అ.** ఇంద్రియాలు ప్రమథనశీలమైనవి (అంటే క్షోభ పెట్టడం కలవరపెట్టడం వాటి స్వభావం). అటువంటి ఇంద్రియాలు, సాధన చేస్తున్న మేధావి మనసును కూడా బలాత్కరించి విషయాలవైపు మళ్ళించి కలవరపెడతాయి. కేవలం వెలుగునే చూస్తున్న వివేకవిజ్ఞానవంతుడైనా (నిస్సహాయంగా) వ్యాకుల మనస్కుడై చూస్తూ ఉండవలసిందే కనుక –

**మూ. తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః ।**
**వశే హి యస్యేన్ద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 61**

**తె.అ.** ఆ ఇంద్రియాలను అన్నిటినీ వశమందుంచుకుని, సమాహితచిత్తుడై నన్నే పొందాలన్న కాంక్షతో ఉండాలి. ఇంద్రియాలు వశమైనవాని ప్రజ్ఞ స్థిరంగా ఉంటుంది.

**భాష్యమ్ : 61.1 తానీతి – తాని సర్వాణి సంయమ్య సంయమనం వశీకరణం కృత్వా, యుక్తః సమాహితః సన్, ఆసీత. మత్పరః అహం వాసుదేవః సర్వప్రత్యగాత్మా పరః యస్య సః మత్పరః, "న అన్యః అహం తస్మాత్" ఇతి ఆసీత ఇత్యర్థః ఏవమ్ ఆసీనస్య యతేః వశే హి యస్య ఇన్ద్రియాణి వర్తన్తే అభ్యాసబలాత్ తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.**

**తె.అ.** ఆ ఇంద్రియాలనన్నిటిని వశం చేసుకొని సమాహితచిత్తుడై, నన్నే పొందాలన్న తీవ్రత కలిగివుండాలి. మత్పరుడు అంటే అందరి అంతరాత్మరూపమైన వాసుదేవుడు నేనే, అతనికంటె నేను వేరుకాదు అనే అనన్యభావం కలవాడు. ఈ విధంగా కూర్చున్న సంన్యాసికి అభ్యాసబలం చేత ఇంద్రియాలు వశమై ఉంటాయి. ఇంద్రియాలు వశంలో ఉన్నవాని ప్రజ్ఞ స్థిరంగాఉంటుంది.

**భాష్యమ్ : 62.0 అథ ఇదానీం పరాభవిష్యతః సర్వానర్థమూలం ఇదం ఉచ్యతే –**

**తె.అ.** ఇంద్రియాలతోటి ఈ పోరాటంలో ఓడిపోతున్నవాని సర్వ అనర్థములకు మూలం చెపుతున్నాడు –

**మూ. ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూపజాయతే ।**
**సంగాత్సంజాయతే కామః కామాత్ క్రోధోఽభిజాయతే ॥ 62**

**తె.అ.** విషయాలను గురించి ఆలోచిస్తూ ఉన్నవాడికి వాటియందు ప్రీతి కలుగుతుంది. ప్రీతివలన కోరిక కలుగుతుంది. కోరిక వలన క్రోధం కలుగుతుంది.

**భాష్యమ్ : 62.1 ధ్యాయత ఇతి – ధ్యాయతః చిన్తయతః, విషయాన్ శబ్దాదివిషయ విశేషాన్ ఆలోచయతః, పుంసః పురుషస్య, సంగః ఆసక్తిః, ప్రీతిః, తేషు విషయేషు ఉపజాయతే ఉత్పద్యతే. సంగాత్ ప్రీతేః సంజాయతే సముత్పద్యతే, కామః తృష్ణా. కామాత్ కుతశ్చిత్ ప్రతిహతాత్, క్రోధః అభిజాయతే.**

**తె.అ.** శబ్దాది విషయ విశేషాలను గురించి ఆలోచిస్తూ ఉండేవాడికి ఆ విషయాలపై ఆసక్తి, ప్రీతి కలుగుతుంది. ఆసక్తి వలన కామం పుడుతుంది. ఏ కారణంచేతనైనా ఆ కామం విచ్ఛిన్నమైనపుడు క్రోధం కలుగుతుంది.

**మూ. క్రోధాద్భవతి సంమోహః సంమోహాత్ స్మృతివిభ్రమః ।**
**స్మృతిభ్రంశాద్ బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి ॥ 63**

**తె.అ.** క్రోధం వలన సమ్మోహం, సమ్మోహం వలన స్మృతిభ్రంశం, స్మృతిభ్రంశం వలన బుద్ధినాశం కలుగుతాయి. బుద్ధి నశించిన తరువాత వాడు నశించినట్లే.

**భాష్యమ్ : 63.1 క్రోధాత్ ఇతి. క్రోధాత్ భవతి సంమోహః అవివేకః కార్యాకార్య విషయః. క్రుద్ధః హి సంమూఢః సన్ గురుమ్ అపి ఆక్రోశతి. సంమోహాత్ స్మృతివిభ్రమః శాస్త్రాచార్యోపదేశాహిత సంస్కార జనితాయాః స్మృతేః స్యాత్ విభ్రమః భ్రంశః స్మృత్యుత్పత్తినిమిత్తప్రాప్తౌ అనుత్పత్తిః. తతః స్మృతిభ్రంశాత్ బుద్ధినాశః బుద్ధినాశః బుద్ధేః నాశః. కార్యాకార్యవిషయ వివేకాయోగ్యతా అన్తఃకరణస్య బుద్ధేః నాశః ఉచ్యతే. బుద్ధినాశాత్ ప్రణశ్యతి. తావదేవ హి పురుషః యావత్ అంతఃకరణం తదీయం కార్యాకార్యవిషయవివేకయోగ్యమ్. తదయోగ్యత్వే నష్ట ఏవ పురుషః భవతి. అతః తస్య అన్తఃకరణస్య బుద్ధేః నాశాత్ ప్రణశ్యతి. పురుషార్థాయోగ్యః భవతి ఇత్యర్థః.**

**తె.అ.** క్రోధం వలన సమ్మోహం కలుగుతుంది. ఇది చేయవచ్చు. ఇది చేయరాదు అన్న వివేకం పోతుంది. కోపం వచ్చినవాడు మూఢుడై గురువును కూడా దూషిస్తాడు. సమ్మోహం వలన స్మృతిభ్రంశం అవుతుంది. శాస్త్రము ఆచార్యులు చేసిన ఉపదేశం వల్ల కలిగిన సంస్కారం యొక్క స్మృతి కలగవలసినచోట కలుగకపోవటం స్మృతిభ్రంశం. స్మృతిభ్రంశం వల్ల బుద్ధినాశం. అంటే అంతఃకరణంలో కార్యాకార్యవిషయవివేకం లోపించడం. బుద్ధి నశించడంతో వాడు నశిస్తాడు. అంతఃకరణం కార్యాకార్యవివేకయోగ్యమైనంత వరకే పురుషుడు. ఆ యోగ్యత నశించినపుడు వాడు నశించనే నశిస్తాడు. కనుక అతని అంతఃకరణం, అంటే బుద్ధి నశించడం వల్ల పురుషార్థానికి అయోగ్యుడై వాడూ నశిస్తాడు.

**భాష్యమ్ : 64.0 సర్వానర్థస్య మూలం ఉక్తం విషయాభిధ్యానమ్. అథ ఇదానీం మోక్షకారణం ఇదం ఉచ్యతే –**

**తె.అ.** విషయచింతనే సర్వానర్థాలకు మూలమని చెప్పాడు. ఇక యిప్పుడు మోక్షకారణం చెపుతున్నాడు.

**మూ. రాగద్వేషవియుక్తైస్తు విషయానిన్ద్రియైశ్చరన్ ।**
**ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి ॥ 64**

**తె.అ.** రాగద్వేషాలు లేని ఇంద్రియాలను, మనస్సును వశంలో ఉంచుకున్నవాడూ, ఇంద్రియాలను అదుపులో ఉంచుకుని ప్రవర్తించేవాడు నిర్మలచిత్తాన్ని పొందుతాడు.

**భాష్యమ్ : 64.1 రాగద్వేష ఇతి. రాగద్వేషవియుక్తైః రాగశ్చ ద్వేషశ్చ రాగద్వేషౌ, తత్పురస్సరాః హి ఇంద్రియాణాం ప్రవృత్తిః స్వాభావికీ, తత్ర చ ముముక్షుః భవతి సః తాభ్యాం వియుక్తైః శ్రోత్రాదిభిః ఇంద్రియైః విషయాన్ అవర్జనీయాన్ చరన్ ఉపలభమానః ఆత్మవశ్యైః ఆత్మనః**

**వశ్యాని వశీకృతాని ఇన్ద్రియాణి తైః ఆత్మవశ్యైః విధేయాత్మా ఇచ్ఛాతః ఆత్మా అంతఃకరణం యస్య సః అయం ప్రసాదం అధిగచ్ఛతి. ప్రసాదః ప్రసన్నతా, స్వాస్థ్యమ్.**

**తె.అ.** రాగము ద్వేషము ఇంద్రియాలకు స్వాభావికమైన ప్రవృత్తి. ముముక్షువైనవాడు రాగము ద్వేషము లేక తన వశంలో ఉన్న శ్రోత్రాది ఇంద్రియాలతో తప్పని విషయాలయందు చరిస్తూ అంతఃకరణాన్ని అదుపులో ఉంచుకొని ప్రసాదం పొందుతాడు. ప్రసాదమంటే ప్రసన్నత, స్వాస్థ్యత. ('విధేయాత్మా' అన్నచోట ఆత్మ అంటే అంతఃకరణమని అర్థం చెప్పాడు శంకరుడు. అంటే మనసును అదుపులో ఉంచుకొని అని.)

**భాష్యమ్ : 65.0 ప్రసాదే సతి కిం స్యాత్ ఇతి? ఉచ్యతే –**

**తె.అ.** ప్రసాదం పొందితే ఏమవుతుంది? విను –

**మూ. ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే ।**
**ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే ॥ 65**

**తె.అ.** ప్రసాదం పొందితే అతనికి సర్వదుఃఖాలు నశిస్తాయి.ప్రసన్నమైన చిత్తం కలవాని బుద్ధి శీఘ్రంగా స్థిరమవుతుంది.

**భాష్యమ్ : 65.1 ప్రసాద ఇతి – ప్రసాదే సర్వదుఃఖానామ్ ఆధ్యాత్మికాదీనాం హానిః వినాశః అస్య యతేః ఉపజాయతే. కిం చ ప్రసన్నచేతసః స్వస్థాన్తఃకరణస్య హి యస్మాత్ ఆశు శీఘ్రం బుద్ధిః పర్యవతిష్ఠతే, ఆకాశమివ పరిసమన్తాత్, అవతిష్ఠతే, ఆత్మస్వరూపేణైవ నిశ్చలీభవతి ఇత్యర్థః. ఏవం ప్రసన్నచేతసః అవస్థితబుద్ధేః కృతకృత్యతా యతః తస్మాత్ రాగద్వేషవియుక్తైః ఇన్ద్రియైః శాస్త్రావిరుద్ధేషు అవర్జనీయేషు యుక్తః సమాచరేత్ ఇత్యర్థః.**

**తె.అ.** యతికి ప్రసన్నత ప్రాప్తించగానే ఆధ్యాత్మికాది దుఃఖాలన్నీ నశిస్తాయి. ఎందుకంటే ప్రసన్నచిత్తునికి, అంటే అంతఃకరణస్వాస్థ్యం కలవానికి, బుద్ధి త్వరగా స్థిరమవుతుంది. అంటే ఎటువంటి పరిస్థితిలోను చలించక ఆత్మస్వరూపంతో ఆకాశం వలె స్థిరంగా ఉంటుంది అని. ఈ విధంగా ప్రసన్నమైన చిత్తం కలవాడు అంటె బుద్ధిస్థిరమైనవాడు కృతకృత్యుడు. కనుక యోగి అయిన పురుషుడు ఇంద్రియాలను రాగద్వేషరహితం చేసుకొని, శాస్త్రవిరుద్ధం కాని తప్పని విషయాలను సేవించాలి అని వాక్యార్థం.

**భాష్యమ్ : 66.0 సా ఇయం ప్రసన్నతా స్తూయతే –**

**తె.అ.** ఆ ప్రసన్నతనే స్తుతిస్తున్నాడు.

**మూ నాస్తి బుద్ధిరయుక్తస్య న చాయుక్తస్య భావనా ।**
**న చాభావయతః శాన్తిరశాన్తస్య కుతః సుఖమ్ ॥ 66**

**తె.అ.** అయుక్తునికి బుద్ధి ఉండదు. వానికి భావన కూడా ఉండదు. భావన లేనివానికి శాంతిలేదు. శాంతి లేనివానికి సుఖమెక్కడిది?

**భాష్యమ్ : 66.1 నాస్తి ఇతి. న అస్తి న విద్యతే న భవతి ఇత్యర్థః. బుద్ధిః ఆత్మస్వరూపవిషయా అయుక్తస్య అసమాహితాంతఃకరణస్య. న చ అస్తి అయుక్తస్య భావనా ఆత్మజ్ఞానాభినివేశః. తథా న చ అస్తి అభావయతః ఆత్మజ్ఞానాభినివేశమ్ అకుర్వతః శాంతిః ఉపశమః అశాంతస్య కుతః సుఖమ్. ఇంద్రియాణాం హి విషయసేవాతృష్ణాతః నివృత్తిః యా తత్ సుఖం, న విషయవిషయా తృష్ణా. దుఃఖమ్ ఏవ హి సా. న తృష్ణాయాం సత్యాం సుఖస్య గంధమాత్రమ్ అపి ఉత్ప(పప)ద్యతే ఇత్యర్థః.**

**తె.అ.** అయుక్తునికి, అంటే మనసు ఏకాగ్రం కానివానికి, ఆత్మస్వరూప విషయమైన బుద్ధి ఉండదు. వానికి భావన అంటే ఆత్మజ్ఞానంలో అభినివేశం (ఆచరించడంలో శ్రద్ధ) కూడా ఉండదు. ఆత్మజ్ఞానసాధనలో అభినివేశం లేనివానికి శాంతి ఉండదు. శాంతిలేనివానికి సుఖమెక్కడిది? విషయసేవాతృష్ణ నుండి ఇంద్రియాలు నివృత్తం కావడమే సుఖం, విషయవిషయమైన తృష్ణకాదు. అది దుఃఖమే. తృష్ణ ఉండగా సుఖం వాసనకు కూడా దొరకదు.

**భాష్యమ్ : 67.0 అయుక్తస్య కస్మాత్ బుద్ధిః నాస్తి ఇతి? ఉచ్యతే -**

**తె.అ.** అయుక్తునికి ఎందుకు బుద్ధి కలుగదు ? విను -

**మూ. ఇన్ద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే ।**
**తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివామ్భసి ॥ 67**

**తె.అ.** ఇంద్రియాల వెంటపడే నిలకడ లేని మనసు అతని (యోగియొక్క) బుద్ధిని నీటిలో పోతున్న నావనువలె, ప్రక్కకు లాగుతుంది.

**భాష్యమ్ : 67.1 ఇన్ద్రియాణామితి - ఇన్ద్రియాణాం, హి యస్మాత్, చరతాం స్వస్వవిషయేషు ప్రవర్తమానానాం యత్ మనః, అనువిధీయతే అనుప్రవర్తతే, తత్ ఇన్ద్రియవిషయవికల్పనేన ప్రవృత్తం మనః, అస్య యతేః హరతి, ప్రజ్ఞామ్ ఆత్మానాత్మవివేకజాం నాశయతి. కథమ్? వాయుః నావమ్ ఇవ, అమ్భసి ఉదకే. జిగమిషతాం సాంయాత్రికాణాం మార్గాత్ ఉద్ధృత్య ఉన్మార్గే యథా వాయుః నావం ప్రవర్తయతి, ఏవమ్ ఆత్మవిషయాం ప్రజ్ఞాం హృత్వా మనః అన్యవిషయాం కరోతి.**

**తె.అ.** తమ తమ విషయాలయందు తగులుకొన్న ఇంద్రియాలకు విధేయంగా వాటిననుసరించి వెళ్లే మనసు, అంటే విషయాలను విభాగం చేసి గ్రహించడంలో ప్రవృత్తమైన మనసు, సంన్యాసికి ఆత్మానాత్మవివేకం వల్ల కలిగిన ప్రజ్ఞను హరిస్తుంది. ఎట్లా? నీటిలో వెడుతున్న నావను గాలి దారినుండి ప్రక్కకు లాగి అపమార్గం పట్టించినట్లు మనసు ఆత్మవిషయమైన ప్రజ్ఞను హరించి విషయాలపైపు మళ్ళిస్తుంది.

**భాష్యమ్ : 68.0 'యతతో హ్యపి' (2.60) ఇత్యుపన్యస్తస్య అర్థస్య అనేకధా ఉపపత్తిం ఉక్త్వా తం చ అర్థం ఉపపాద్య ఉపసంహరతి –**

**తె.అ.** 'సాధన చేస్తున్న మేధావి మనసును కూడా' (2.60) అన్న శ్లోకంలో ప్రతిపాదించిన అర్థాన్ని అనేక విధాలైన ఉపపత్తులతో వివరించి ఇక ఉపసంహారం చేస్తున్నాడు –

**మూ. తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః ।**
**ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 68**

**తె.అ.** కనుక అర్జునా! ఎవని ఇంద్రియాలు సర్వవిధాలైన ఇంద్రియార్థాల నుండి నిగ్రహింపబడుచున్నవో అతని ప్రజ్ఞ స్థిరమవుతుంది.

**భాష్యమ్ : 68.1 తస్మాత్ ఇతి ॥ ఇంద్రియాణాం ప్రవృత్తౌ దోషః ఉపపాదితః యస్మాత్ తస్మాత్ యస్య యతేః హే మహాబాహో! నిగృహీతాని సర్వశః సర్వప్రకారైః మానసాదిభేదైః ఇంద్రియాణి ఇంద్రియార్థేభ్యః శబ్దాదిభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.**

**తె.అ.** ఇంద్రియప్రవృత్తి దోషమని చూపబడింది. కనుక ఇంద్రియాలను సర్వవిధాలుగా అంటే మానసికాది భేదాలతో శబ్దాది ఇంద్రియ విషయాలనుండి నిగ్రహించిన యతి యొక్క ప్రజ్ఞ స్థిరంగా ఉంటుంది.

**భాష్యమ్ : 69.0 యోఽయం లౌకికః వైదికశ్చ వ్యవహారః సః ఉత్పన్నవివేకజ్ఞానస్య స్థితప్రజ్ఞస్య అవిద్యాకార్యత్వాత్ అవిద్యానివృత్తౌ నివర్తతే, అవిద్యాయాః చ విద్యావిరోధాత్ నివృత్తిః ఇత్యేతం అర్థం స్ఫుటీకుర్వన్ ఆహ –**

**తె.అ.** లౌకిక వైదిక కర్మలన్నీ చేయించేది అవిద్య. వివేకజ్ఞానం కలిగిన స్థితప్రజ్ఞుడికి అవిద్య తొలగిపోతుంది కనుక కర్మలన్నీ తొలగిపోతాయి. అవిద్య విద్యావిరోధం చేత నివృత్తి అవుతుంది అని స్పష్టం చేయడం కొరకు చెపుతున్నాడు –

**మూ. యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ ।**
**యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః ॥ 69**

**తె.అ.** సర్వప్రాణులకు రాత్రి ఏదో ఆ సమయమందు సంయమి మేలుకొని ఉంటాడు. సర్వప్రాణులు ఎప్పుడు మేలుకొని ఉంటారో అది ద్రష్ట అయిన మునికి రాత్రి.

**భాష్యమ్ : 69.1 యా నిశా ఇతి ॥ యా నిశా రాత్రిః సర్వపదార్థానాం అవివేకకరీ తమః స్వభావత్వాత్ సర్వభూతానాం సర్వేషాం భూతానామ్. కిం తత్? పరమార్థతత్త్వం స్థిత ప్రజ్ఞస్య విషయః. యథా నక్తంచరాణాం అహః ఏవ సత్ అన్యేషాం నిశా భవతి, తద్వత్ నక్తంచరస్థానీయానాం అజ్ఞా(ని)నాం సర్వభూతానాం నిశా ఇవ నిశా పరమార్థతత్త్వం. అగోచరత్వాత్ అతద్బుద్ధీనామ్. తస్యాం పరమార్థతత్త్వలక్షణాయాం అజ్ఞాననిద్రాయాః ప్రబుద్ధః జాగర్తి సంయమీ సంయమవాన్, జితేంద్రియః యోగీ ఇత్యర్థః. యస్యాం గ్రాహ్యగ్రాహక (భేద) లక్షణాయాం అవిద్యానిద్రా(శా)యాం ప్రసుప్తాని ఏవ భూతాని జాగ్రతి ఇతి ఉచ్యంతే(తే), యస్యాం నిశాయాం ప్రసుప్తా ఇవ స్వప్న దృశః, సా నిశా అవిద్యారూపత్వాత్ పరమార్థతత్త్వం పశ్యతః మునేః ఇతి.**

**తె.అ.** రాత్రికి స్వభావం చీకటి. రాత్రిపూట అన్ని వస్తువులు అలికినట్లుంటాయి. విడివిడిగా తెలియబడవు. ఎవరికీ ఏ వస్తువేదో తెలియదు. ఏమి తెలియదు? స్థితప్రజ్ఞుడు గ్రహించే పరమార్థతత్త్వం. రాత్రించరాలకు పగలైనది ఇతరులకు రాత్రి అయినట్లు, రాత్రించరాల వంటి అజ్ఞానులకు రాత్రివంటిది పరమార్థతత్త్వం, తాత్త్వికబుద్ధి లేనివానికి ఆ తత్త్వం అగోచరం కనుక. పరమార్థతత్త్వలక్షణమైన ఆ రాత్రియందు జితేంద్రియుడైన యోగి అజ్ఞాననిద్ర నుండి మేలుకుంటాడు. గ్రాహ్యగ్రాహక భేద రూపమైన అజ్ఞానంలో నిద్రిస్తూ కలగనే వారిని మేలుకుని వున్నారు అంటున్నాం. అది అవిద్యా రూపమైనది కనుక పరమార్థతత్త్వం దర్శించిన మునికి రాత్రి.

**భాష్యమ్ : 69.2 అతః కర్మాణి అవిద్యావస్థాయాం ఏవ చోద్యంతే, న విద్యావస్థాయామ్. విద్యాయాం హి సత్యాం ఉదితే సవితరి శార్వరం ఇవ తమః ప్రణాశం ఉపగచ్ఛతి అవిద్యా. ప్రాక్ విద్యోత్పత్తేః అవిద్యా ప్రమాణబుద్ధ్యా గృహ్యమాణా క్రియాకారకఫలభేదరూపా చ సతీ సర్వకర్మ- హేతుత్వం ప్రతిపద్యతే. న అప్రమాణ బుద్ధ్యా గృహ్యమాణాయాః కర్మహేతుత్వోపపత్తిః. "ప్రమాణ- భూతేన వేదేన మమ చోదితం కర్తవ్యం కర్మ", ఇతి హి కర్మణి కర్తా ప్రవర్తతే, న 'అవిద్యా మాత్రమిదం సర్వం నిశా ఇవ' ఇతి. యస్య తు పునః 'నిశేవావిద్యామాత్రమిదం సర్వం భేదజాతమ్' ఇతి జ్ఞానం తస్యాఽఽత్మజ్ఞస్య సర్వకర్మసంన్యాసే ఏవాధికార, న ప్రవృత్తౌ. తథా**

**చ దర్శయిష్యతి 'తద్బుద్ధయస్తదాత్మానః'(5.17) ఇత్యాదినా జ్ఞాననిష్ఠాయాం ఏవ తస్య అధికారమ్.**

**తె.అ.** కనుక అవిద్యావస్థయందే కర్మలు విధించబడుతున్నవి, విద్యావస్థయందు కాదు. సూర్యుడుదయించగానే రాత్రి యొక్క చీకటి నశించినట్లు విద్య కలగడంతో అవిద్య అంతరిస్తుంది. విద్య కలుగకముందు అవిద్యే ప్రమాణం. ఆ అవిద్య క్రియాకారక ఫలభేదాలతో అన్ని కర్మలకు కారణమవుతుంది. అవిద్యయందు ప్రమాణబుద్ధి తొలగినపుడు అది కర్మలు చేయించలేదు. "వేదం ప్రమాణం. ఆ వేదం నాకీ కర్మ విధిస్తున్నది అని కర్మయందు ప్రవృత్తుడవుతున్నాడు కర్త." ఇదంతా రాత్రి వంటి అవిద్య అని తెలిసినవాడు ఆ విధంగా ప్రవర్తించడం లేదు. మరి విభిన్నరూపమైన ఈ సర్వదృశ్య ప్రపంచమంతా అవిద్యామాత్రమే, రాత్రి వంటిది అని తెలిసిన ఆత్మజ్ఞానికి సర్వకర్మ సంన్యాసమే విధించబడింది. ప్రవృత్తి కాదు. ఇదేవిధంగా 'దానియందే బుద్ధి నిలిపి" (5.17) మొదలైన వాక్యాలలో జ్ఞానికి జ్ఞాననిష్ఠ యందే అధికారం అని ప్రదర్శించబోతున్నాడు.

**భాష్యమ్ : 69.3 తత్రాపి ప్రవర్తకప్రమాణాభావే ప్రవృత్త్యనుపపత్తిః ఇతి చేత్ న, స్వాత్మవిషయత్వాత్ ఆత్మవిజ్ఞానస్య. న హి ఆత్మనః స్వాత్మని ప్రవర్తకప్రమాణాపేక్షా, ఆత్మత్వాత్ ఏవ తదంతత్వాత్ చ సర్వ ప్రమాణానాం ప్రమాణత్వస్య. న హి ఆత్మ స్వరూపాధిగమే సతి పునః ప్రమాణప్రమేయవ్యవహారః సంభవతి.ప్రమాతృత్వం హి ఆత్మనః నివర్తయతి అంత్యం ప్రమాణమ్. నివర్తయత్ ఏవ చ అప్రమాణీభవతి స్వప్నకాలప్రమాణమ్ ఇవ ప్రబోధే. లోకే చ వస్త్వధిగమే ప్రవృత్తి హేతుత్వాదర్శనాత్ప్రమాణస్య. తస్మాత్ న ఆత్మవిదః కర్మణి అధికారః ఇతి సిద్ధమ్.**

**తె.అ.** ఆక్షేపం – ఆ జ్ఞాననిష్ఠయందయినా ప్రవృత్తి కలిగించడానికి ప్రమాణం లేదు. కనుక అందులో కూడా అతడు ప్రవృత్తుడు కాలేడు కదా?

సమాధానం – కాదు. ఆత్మజ్ఞానం స్వవిషయం. తన్నుతాను తెలిసికొనడానికి ఇతర ప్రవర్తక ప్రమాణమేదీ పనిలేదు. ప్రమాణాలకన్నిటికి చివరిది ఆత్మ కనుక. ఆత్మస్వరూపం తెలిసిన తరువాత ఇక ప్రమాణప్రమేయ వ్యవహారం ఉండదు. చివరిప్రమాణం ఆత్మను ప్రమాతగా కూడా మిగల్చదు. అప్పుడు ఆ చివరిప్రమాణం ప్రమాణము కాదు, మెలకువ వచ్చిన తరువాత స్వప్నకాలప్రమాణం వలె. లోకంలో కూడా చూస్తున్నాం. వస్తువు దొరికిన తరువాత ఆ వస్తువును పొందడానికి ప్రవృత్తిహేతువైన ప్రమాణం ఉండదు. కనుక ఆత్మను తెలుసుకున్నవానికి కర్మలయందు అధికారం లేదని తేలింది.

**భాష్యమ్ : 70.0 విదుషః త్యక్తైషణస్య స్థితప్రజ్ఞస్య యతేః ఏవ మోక్షప్రాప్తిః న తు అసంన్యాసినః కామకామినః ఇత్యేతమ్ అర్థం దృష్టాంతేన ప్రతిపాదయిష్యన్ ఆహ –**

**తె.అ.** కోర్కెలను వదలి స్థితప్రజ్ఞుడు, విద్వాంసుడు అయిన సంన్యాసికే మోక్షప్రాప్తి కాని కోర్కెలు కోరుకునే అసంన్యాసికి కాదు అని దృష్టాంతపూర్వకంగా ప్రతిపాదించడం కొరకు చెపుతున్నాడు–

**మూ. ఆపూర్యమాణమచలప్రతిష్ఠం సముద్రమాపః ప్రవిశన్తి యద్వత్ ।**
**తద్వత్కామా యం ప్రవిశన్తి సర్వే స శాన్తిమాప్నోతి న కామకామీ ॥ 70**

**తె.అ.** నిండుగా నిశ్చలంగా నిలిచిన సముద్రంలోకి నీరు వచ్చి చేరినట్లు కోర్కెలు ఎవనిలో చేరిపోతాయో అతడు శాంతిని పొందుతాడు, కోర్కెలు కోరుకునేవాడు కాదు.

**భాష్యమ్ : 70.1 ఆపూర్య ఇతి. ఆపూర్యమాణం అద్భిః అచలప్రతిష్ఠం అచలతయా ప్రతిష్ఠా అవస్థితిః యస్య తమ్ అచలప్రతిష్ఠం సముద్రం ఆపః సర్వతో గతాః ప్రవిశంతి స్వాత్మస్థం అవిక్రియమ్ ఏవ సంతం యద్వత్ తద్వత్కామాః విషయసంనిధౌ అపి సర్వతః ఇచ్ఛావిశేషాః యం పురుషం (మునిం), సముద్రమ్ ఇవ ఆపః, అవికుర్వంతః ప్రవిశంతి సర్వే ఆత్మని ఏవ ప్రలీయంతే న స్వాత్మవశం కుర్వంతి సః శాంతిం మోక్షం ఆప్నోతి, న ఇతరః కామకామీ కామ్యంతే ఇతి కామాః విషయాః తాన్ కామయితుం శీలం యస్య స కామకామీ, సః నైవ ప్రాప్నోతి ఇత్యర్థః. యస్మాత్ ఏవం తస్మాత్ –**

**తె.అ.** అన్నివైపులనుండి నీరు వచ్చి చేరుతున్నా సముద్రం నిండుగా నిశ్చలంగా ఉంటుంది. అందులో ఎటువంటి మార్పు ఉండదు. అదేవిధంగా విషయాలు ఎదుట ఉన్నా విషయవాంఛలు అన్నీ ఎవనిలో సముద్రంలో కలసిపోయిన నీటివలె లీనమైపోతాయో, ఏ విధమైన వికారము కలిగించలేవో, ఎవనిని వాంఛలు వివశుణ్ణి చేసి తమ వశం చేసుకోలేవో అతడు శాంతిని అంటే మోక్షాన్ని పొందుతాడు. ఇతరుడు, అంటే కోర్కెలు కోరుకునేవాడు, పొందడు. కనుక –

**మూ. విహాయ కామాన్యః సర్వాన్ పుమాంశ్చరతి నిఃస్పృహః ।**
**నిర్మమో నిరహంకారః స శాన్తిమధిగచ్ఛతి ॥ 71**

**తె.అ.** అన్ని భోగాలను వదలి దేనినీ కోరక అహంకార మమకారములు లేక సంచరించేవాడు శాంతిని పొందుతాడు.

**భాష్యమ్ : 71.1 విహాయ ఇతి. విహాయ పరిత్యజ్య కామాన్ యః సంన్యాసీ పుమాన్ సర్వాన్ అశేషతః కార్త్స్న్యేన చరతి జీవనమాత్రచేష్టాశేషః పర్యటతి ఇత్యర్థః. నిస్పృహః శరీరజీవన మాత్రేఽపి నిర్గతా స్పృహా యస్య సః నిస్పృహః సన్ నిర్మమః శరీర జీవనమాత్రాక్షిప్తపరిగ్రహేఽపి 'మమ ఇదం' ఇతి అభినివేశవర్జితః, నిరహంకారః విద్యావత్త్వాది నిమిత్తాత్మసంభావనారహితః ఇత్యేతత్. సః ఏవంభూతః స్థితప్రజ్ఞః బ్రహ్మవిత్ శాంతిం సర్వసంసారదుఃఖోపరమలక్షణాం**

**నిర్వాణాఖ్యాం అధిగచ్ఛతి ప్రాప్నోతి బ్రహ్మభూతః భవతి ఇత్యర్థః. సా ఏషా జ్ఞాననిష్ఠా స్తూయతే –**

**తె.అ.** భోగవిషయాలనన్నిటిని నిశ్శేషంగా వదలుకొని జీవనమాత్ర చేష్టలు మిగిలి సంన్యాసి పర్యటిస్తాడు. నిస్పృహుడై, ఏ కోరిక లేనివాడై అంటే శరీరం నిలిచి ఉండాలనే కోర్కె కూడా లేనివాడై, జీవనమునకు మాత్రం అవసరమైన వస్తువులయందు కూడా ఇవి నావి అన్న భావం లేనివాడు, అహంకారం లేనివాడు, విద్వత్తు మొదలైన కారణాలచేత తనను తాను గొప్పగా భావించనివాడు – ఇటువంటి స్థితప్రజ్ఞుడు బ్రహ్మవేత్త సర్వసంసార దుఃఖము తొలగి మోక్షం పొందుతాడు. బ్రహ్మమే అవుతాడు అని అర్థం. అటువంటి జ్ఞాననిష్ఠను స్తుతిస్తున్నాడు.

**మూ. ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి ॥**
**స్థిత్వాఽస్యామన్తకాలేఽపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి । 72**

**తె.అ.** అర్జునా, బ్రాహ్మీస్థితి ఇటువంటిది. ఈ స్థితిని చేరుకున్నవాడు మోహం చెందడు, మరణసమయంలోనైనా సరే ఈ స్థితిని చేరుకున్నవాడు బ్రహ్మనిర్వాణం పొందుతాడు.

**భాష్యమ్ : ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే సాంఖ్యయోగో నామ ద్వితీయః అధ్యాయః.**

**తె.అ.** ఇది వ్యాసభగవానుని శతసహస్రసంహిత అయిన శ్రీమహాభారతంలో భీష్మపర్వంలో ఉపనిషత్తులు బ్రహ్మవిద్య యోగశాస్త్రము శ్రీకృష్ణార్జునసంవాదము అయిన శ్రీమద్భగవద్గీతల యందు సాంఖ్యయోగమనే రెండవ అధ్యాయానికి తెలుగు అనువాదం సమాప్తం.

**భాష్యమ్ : 72.1 ఏషా బ్రాహ్మీ ఇతి. ఏషా యథోక్తా బ్రాహ్మీ బ్రహ్మణి భవా ఇయం స్థితిః సర్వం కర్మ సంన్యస్య బ్రహ్మ స్వరూపేణ ఏవ అవస్థానం ఇత్యేతత్. హే పార్థ! న ఏనాం స్థితిం ప్రాప్య లబ్ధ్వా విముహ్యతి మోహం ప్రాప్నోతి. స్థిత్వా అస్యాం స్థితౌ బ్రాహ్మ్యాం యథోక్తాయాం అంతకాలేఽపి అంత్యే వయస్యపి బ్రహ్మనిర్వాణం బ్రహ్మనిర్వృతిం మోక్షమ్ ఋచ్ఛతి గచ్ఛతి. కిము వక్తవ్యం బ్రహ్మచర్యాత్ ఏవ సంన్యస్య యావజ్జీవం యః బ్రహ్మణి ఏవ అవతిష్ఠతే సః బ్రహ్మనిర్వాణం ఋచ్ఛతి ఇతి?**

**తె.అ.** ఇంతవరకు బ్రాహ్మీ స్థితి గురించి చెప్పబడింది. సర్వకర్మములను సంన్యసించి బ్రహ్మస్వరూపంతో నిలిచి ఉండడమే బ్రాహ్మీస్థితి. ఈ స్థితిని చేరినవాడు మోహం చెందడు. అంత్యకాలమందైనా అంటే వార్ధక్యంలోనైనా సరే ఈ స్థితియందు నిలిచినవాడు బ్రహ్మనిర్వాణం

అంటే బ్రహ్మానందం పొందుతాడు. ఇక బ్రహ్మచర్యాశ్రమం నుండి సంన్యసించి యావజ్జీవము బ్రహ్మమందు నిలిచినవాడు బ్రహ్మానందం పొందుతాడు అని ప్రత్యేకించి చెప్పవలెనా?

**ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యగోవిందభగవత్పూజ్యపాదశిష్య శ్రీమచ్ఛంకరభగవతః కృతౌ శ్రీమద్భగవద్గీతాభాష్యే సాంఖ్యయోగో నామ ద్వితీయోఽధ్యాయః**

ఇది శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యగోవిందభగవత్పూజ్యపాదశిష్యులు శ్రీమచ్ఛంకర-భగవత్పాదులు రచించిన శ్రీమద్భగవద్గీతాభాష్యంలో సాంఖ్యయోగమనే రెండవ అధ్యాయానికి తెలుగు అనువాదం.



# తృతీయోఽధ్యాయః

# కర్మయోగః

భాష్యమ్ : **0.1** శాస్త్రస్య ప్రవృత్తినివృత్తి విషయభూతే ద్వే బుద్ధీ భగవతా నిర్దిష్టే, 'సాంఖ్యే బుద్ధిర్యోగే బుద్ధిరితి చ'. తత్ర 'ప్రజహాతి యదా కామా'ని **(2.55)** త్యారభ్య అధ్యాయపరిసమాప్తేః సాంఖ్యబుద్ధ్యాశ్రితానాం సంన్యాసం కర్తవ్యముక్త్వా తేషాం తన్నిష్ఠతయైవ చ కృతార్థతోక్తా 'ఏషా బ్రాహ్మీ స్థితి' **(2.72)** రితి, అర్జునాయ చ "కర్మణ్యేవాధికారస్తే" "మాతే సంగోఽస్త్వకర్మణీ" తి **(2.47)** కర్మైవ కర్తవ్యముక్తవాన్ యోగబుద్ధిమాశ్రిత్య, న తత ఏవ శ్రేయఃప్రాప్తిముక్తవాన్, తదేతదాలక్ష్య పర్యాకులీభూతబుద్ధిరర్జున ఉవాచ. 'కథం భక్తాయ శ్రేయోఽర్థినే యత్సాక్షా- చ్ఛ్రేయఃప్రాప్తిసాధనం సాంఖ్యబుద్ధినిష్ఠాం శ్రావయిత్వా మాం కర్మణి దృష్టానేకానర్థయుక్తే పారంపర్యేణా- ప్యనైకాంతిక శ్రేయః ప్రాప్తిఫలే నియుంజ్యాదితి యుక్తః పర్యాకులీభూత భావోఽ ర్జునస్య, తదనురూపశ్చ ప్రశ్నః 'జ్యాయసీ చేది' **(3.1)** త్యాదిః. ప్రశ్నాపాకరణం చ వాక్యం భగవతః యుక్తం యథోక్త- విభాగవిషయే శాస్త్రే.

**తె.అ.** గీతాశాస్త్రంలో ప్రవృత్తి నివృత్తి విషయకమైన రెండు బుద్ధులను చెప్పాడు, సాంఖ్యబుద్ధి, యోగబుద్ధి అని. అక్కడ 'ప్రజహాతి యదా కామాన్' (2.55) అనే శ్లోకంనుండి అధ్యాయం చివరి వరకు సాంఖ్యబుద్ధిని ఆశ్రయించిన వారికి సంన్యాసం కర్తవ్యమని చెప్పి 'ఏషా బ్రాహ్మీ స్థితిః' (2.72) అనే శ్లోకంలో వారు జ్ఞాననిష్ఠలోనే కృతార్థులౌతారు అని చెప్పాడు. కాని అర్జునుడితో మాత్రం 'నీకు కర్మలయందే అధికారం' కర్మలు చేయకుండడంలో నీకు ప్రీతి కలుగనీయకు అని యోగబుద్ధిని ఆశ్రయించి కర్మ చేయడమే కర్తవ్యమని చెప్పాడు. కాని దానివల్ల నీకు ముక్తి కలుగుతుంది అని చెప్పలేదు. అది విన్న అర్జునుడు మనసు కలతపడి అన్నాడు – 'శ్రేయస్సుకోరే భక్తులకు సాక్షాత్తు శ్రేయస్సాధనమైన సాంఖ్యబుద్ధినిష్ఠను చెప్పి, నన్నుమాత్రం కర్మలు చేయమంటావేమిటి? ఆ కర్మలలో అనేక అనర్థాలు ప్రత్యక్షంగా కనిపిస్తున్నాయి. పోనీ ముందుముందైనా వాటివల్ల శ్రేయస్సు కలుగుతుందా అంటే అదీ ఖచ్చితంగా చెప్పలేము. అర్జునుడు ఈ విధంగా కలతచెందడం న్యాయమే. ఆ కలతకు అనురూపంగా 'జ్యాయసీచేత్' (3.1) అనే ప్రశ్న వేశాడు. ఈ ప్రశ్నకు ఇక్కడ ఇచ్చిన సమాధానం కూడా ఇంతకుముందు చెప్పిన జ్ఞానకర్మ నిష్ఠల విభాగ విషయకంగా ఉంది.

**భాష్యమ్ : 0.2 కేచిత్తు అర్జునస్య ప్రశ్నార్థమన్యథా కల్పయిత్వా తత్ప్రతికూలం భగవతః ప్రతివచనం వర్ణయంతి, యథా చాత్మనా సంబంధగ్రంథే గీతార్థో నిరూపితః తత్ప్రతికూలం చేహ పునః ప్రశ్నప్రతివచనయోరర్థం నిరూపయంతి, కథం? తత్ర సంబంధగ్రంథే తావత్, సర్వేషా-మాశ్రమిణాం జ్ఞానకర్మణోస్సముచ్చయో గీతాశాస్త్రే నిశ్చితోఽర్థ ఇత్యుక్తం. పునర్విశేషితంచ యావజ్జీవం శ్రుతిచోదితాని కర్మాణి పరిత్యజ్య కేవలాదేవ జ్ఞానాన్మోక్షః ప్రాప్యత ఇత్యేతదేకాంతేనైవ ప్రతిషిద్ధమితి, ఇహత్వాశ్రమవికల్పం దర్శయతా యావజ్జీవశ్రుతిచోదితానామేవ కర్మణాం పరిత్యాగ ఉక్తః, తత్కథమీదృశం విరుద్ధమర్థమర్జునాయ బ్రూయాద్భగవాన్, శ్రోతా వా విరుద్ధమర్థం కథమవధారయేత్.**

**తె.అ.** కొందరు వ్యాఖ్యాతలు అర్జునుడి ప్రశ్నకు వేరే అర్థం కల్పించి దానికి ప్రతికూలంగా భగవానుడిచ్చిన సమాధానానికి అర్థం చెప్పారు.

అంతే కాకుండా సంబంధ గ్రంథంలో (ఉపోద్ఘాతంలో) వారు నిరూపించిన గీతార్థానికి వారే ప్రతికూలంగా ఇక్కడ ప్రశ్న ప్రతివచనాలకు అర్థం చెపుతారు. ఎట్లాగంటే, అక్కడేమో సంబంధగ్రంథంలో అన్ని ఆశ్రమాలవారికి జ్ఞానకర్మల సముచ్చయమే గీతాశాస్త్రం యొక్క నిశ్చితార్థం అని అన్నారు. మళ్ళీ ప్రత్యేకించి శ్రుతిచోదితమైన యావజ్జీవ కర్మలు వదలి కేవలం జ్ఞానంవల్లనే మోక్షం పొందుతాడు అనేది గీతాశాస్త్రం నిశ్చయంగా ప్రతిషేధిస్తుంది అని కూడా అన్నారు. ఇక్కడేమో ఆశ్రమ వికల్పం గురించి చెపుతూ ఆ శ్రుతిచోదితమైన యావజ్జీవకర్మలు వదలదగినవి అంటారు. ఇటువంటి విరుద్ధమైన మాట భగవానుడు ఎట్లా అనగలడు. ఈ విరుద్ధార్థాన్ని అర్జునుడెట్లా అర్థం చేసుకోగలడు.

**భాష్యమ్ : 0.3 తత్రైతత్స్యాత్, - గృహస్థానామేవ శ్రౌతస్మార్తకర్మపరిత్యాగేన కేవలాదేవ జ్ఞానాన్మోక్షః ప్రతిషిధ్యతే, న త్వాశ్రమాంతరాణామితి. ఏతదపి పూర్వోత్తరవిరుద్ధమేవ, కథం? సర్వాశ్రమిణాం జ్ఞానకర్మణోస్సముచ్చయో గీతాశాస్త్ర నిశ్చితోఽర్థ ఇతి ప్రతిజ్ఞాయ ఇహ కథం తద్విరుద్ధం కేవలాదేవ జ్ఞానాన్మోక్షం బ్రూయాత్ ఆశ్రమాంతరాణామ్?**

**అథ మతం, శ్రౌతకర్మాపేక్షయైతద్వచనం - 'కేవలాదేవ జ్ఞానాచ్ఛ్రౌతకర్మరహితాత్ గృహస్థానాం మోక్షః ప్రతిషిధ్యత' ఇతి ; తత్ర గృహస్థానాం విద్యమానమపి స్మార్తం కర్మావిద్యమానవదనపేక్ష్య జ్ఞానాదేవ కేవలాదిత్యుచ్యత ఇతి, ఏతదపి విరుద్ధం. కథం? గృహస్థస్యైవ స్మార్తకర్మణా సముచ్చితాత్ జ్ఞానాన్మోక్షః ప్రతిషిధ్యతే నత్వాశ్రమాంతరాణామితి కథం వివేకిభిశ్శక్యమవధారయితుం కించ యది మోక్షసాధనత్వేన స్మార్తాని కర్మాణ్యూర్ధ్వరేతసాం సముచ్చీయంతే తథా గృహస్థస్యాపీష్యతాం స్మార్తైరేవ సముచ్చయో న శ్రౌతైః.**

**తె.అ.** ఆక్షేపణ – (ఆ సంబంధ గ్రంథం యొక్క) అభిప్రాయం శ్రౌతస్మార్త కర్మలు వదలిన గృహస్థుకు మాత్రం కేవలం జ్ఞానం వల్లనే మోక్షం కలగదు. ఇతర ఆశ్రమాలవారికి కలగవచ్చు. అని.

సమాధానం – ఇది కూడా పూర్వాపర విరుద్ధంగా ఉంది. అన్ని ఆశ్రమాలవారికి జ్ఞానకర్మల సముచ్చయమే గీతాశాస్త్రంయొక్క నిశ్చయమైన అర్థం అని వాదించి, ఇక్కడ అందుకు విపరీతంగా ఇతర ఆశ్రమాలవారికి కేవలం జ్ఞానంవల్లనే మోక్షం కలగవచ్చు అని ఎట్లా అనగలరు?

ఆక్షేపణ – శ్రౌతకర్మలు చేయకుండా గృహస్థుకు కేవలం జ్ఞానంవల్లనే మోక్షం కలగదు అని అర్థమైతే? అక్కడ 'కేవలం జ్ఞానంవల్లనే మోక్షం కలగదు' అనేది గృహస్థుకు విధించబడిన స్మార్తకర్మలు చేయవలసినవే అనే విషయాన్ని ఉపేక్షించి చెప్పినమాట.

సమాధానం – ఇది కూడా విరుద్ధమే. ఎట్లాగంటే గృహస్థుకు మాత్రం కేవలం స్మార్తకర్మలతోకూడిన జ్ఞానంవల్ల మోక్షం కలగదు. (శ్రౌతకర్మలు కూడా అతడు చేయవలసిందే) ఇతరులకు కలుగుతుంది అంటే తెలివి ఉన్నవాడు ఎట్లా ఒప్పుకుంటాడు? అంతేకాదు బ్రహ్మచర్యం అవలంబించేవారికి మాత్రం కేవలం స్మార్తకర్మలతో కూడిన జ్ఞానంవల్ల మోక్షం కలుగుతుంది అన్నపుడు గృహస్థులకు కూడా స్మార్తకర్మలతోటి జ్ఞానంవలన మోక్షం కలుగుతుంది అనడం న్యాయం, శ్రౌతకర్మలతో కూడిన జ్ఞానం అని కలపవలసిన అవసరం లేదు.

**భాష్యమ్ : 0.4 అథ శ్రౌతైః స్మార్తైశ్చ గృహస్థస్యైవ సముచ్చయో మోక్షాయ, ఊర్ధ్వరేతసాం తు స్మార్తకర్మమాత్ర సముచ్చితాత్, జ్ఞానాన్మోక్ష ఇతి, తత్రైవం సతి గృహస్థస్యైవాయాసబాహుళ్యాత్, శ్రౌతం, స్మార్తం చ బహుదుఃఖరూపం కర్మ శిరస్యారోపితం స్యాత్.**

**అథ గృహస్థస్యైవ ఆయాసబాహుల్యకరణాన్మోక్షస్స్యాత్, న ఆశ్రమాంతరాణాం శ్రౌతనిత్యకర్మ రహితత్వాదితి. తదప్యసత్, సర్వోపనిషత్సు ఇతిహాసపురాణయోగశాస్త్రేషు చ జ్ఞానాంగత్వేన ముముక్షోస్సర్వకర్మ సంన్యాసవిధానాత్, ఆశ్రమవికల్పసముచ్చయవిధానాచ్చ శ్రుతిస్మృత్యోః.**

**సిద్ధః తర్హి , సర్వాశ్రమిణాం జ్ఞానకర్మణోస్సముచ్చయః న ముముక్షో స్సర్వకర్మసన్న్యాస విధానాత్, పుత్రైషణాయా విత్తైషణాయా లోకైషణయాశ్చ వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరంతి (బృ.ఉ.3.5.1) తస్మాన్న్యాసమేషాం తపసామతిరిక్తమాహుః 'న్యాస ఏవాత్యరేచయదితి, (మ.నా.ఉ.21.2;3) 'న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వమానశు' రితి చ 'బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజే' (జా బాల.ఉ.4)**

**(దిత్యాద్యాః శ్రుతయః, 'త్యజ ధర్మమధర్మం చ ఉభే సత్యానృతే త్యజ ఉభౌ సత్యానృతే త్యక్త్వా యేన త్యజసి తత్త్యజ (శాంతిపర్వ 329.40; 331.44)**

**"సంసారమేవం నిస్సారం దృష్ట్వా సారదిదృక్షయా, ప్రవ్రజంత్యకృతోద్వాహాః పరం వైరాగ్యమాశ్రితాః'(నారదపరి. ఉ.3.15) ఇతి బృహస్పతిః**

**'కర్మణా బధ్యతే జంతుర్విద్యయా చ విముచ్యతే, తస్మాత్కర్మ న కుర్వంతి యతయః పారదర్శినః' (శాంతిపర్వ 241.7) ఇతి శుకానుశాసనమ్.**

**ఇహాపి చ 'సర్వకర్మాణి మనసా సంన్యస్య' ఇత్యాది. (5.13)**

**తె.అ.** కాదు, గృహస్థుకు శ్రౌతస్మార్తకర్మలతో కలిసిన జ్ఞానం మోక్షమిస్తుంది. బ్రహ్మచారులకు కేవలం స్మార్తకర్మలతో కలిసిన జ్ఞానం మోక్షమిస్తుంది. అంటే గృహస్థునెత్తిన బహుకష్టము బహుళాయాసము అయిన శ్రౌతస్మార్తకర్మల అధికభారం పెట్టినట్లవుతుంది.

ఆక్షేపణ - అధికశ్రమతో కూడినది కనుకనే గృహస్థుకు మోక్షం లభిస్తుంది. శ్రౌతనిత్యకర్మలు చేయరు కనుక తక్కిన ఆశ్రమాలవారికి మోక్షం లేదు అని అంటే?

సమాధానం - అదీ సరికాదు. అన్ని ఉపనిషత్తులు ఇతిహాస పురాణయోగశాస్త్రాలు జ్ఞానంలో భాగంగా సర్వకర్మసంన్యాసం విధిస్తున్నాయి. శ్రుతిస్మృతులయందు ఆశ్రమవికల్పము సముచ్చయము కూడా చెప్పబడ్డాయి.

ఆక్షేపణ - అట్లాగయితే అన్ని ఆశ్రమాలవారికి జ్ఞానకర్మల సముచ్చయం చెప్పినట్లేకదా?

సమాధానం - కాదు. ఎందుకంటే ముముక్షువుకు సర్వకర్మ సంన్యాసం విధించబడింది. 'పుత్రులయందు విత్తమందు లోకమందు కోర్కెలు వదలి భిక్షాటనం చేస్తారు' (బృ. 3.5.1) 'ఈ తపములన్నిటికంటె సంన్యాసం శ్రేష్ఠమైనదని చెప్పబడింది.' (మహా.నా.ఉ.24.1) 'సంన్యాసమే శ్రేష్ఠమని చెప్పబడింది' (మహా.నా.ఉ.21.2) 'కర్మలచేగాని సంతానంచే గాని ధనంచేతగాని కాదు, త్యాగంచేత మాత్రమే అమృతత్వం పొందారు' (మహా.నా.ఉ.10.5) 'బ్రహ్మచర్యంనుండియే సంన్యసించవలెను' (జాబాల.ఉ.4) మొదలైనవి శ్రుతివాక్యాలున్నాయి. 'ధర్మం అధర్మం రెండూ వదలు, సత్యం అసత్యం రెండూ వదలు. వదలి దేనివలన వీటిని వదలినావో దానిని (అహంకారం) కూడా, (మ.భా.శాం. 329.40; 331.44) 'నిస్సారమైన సంసారాన్ని చూచి సారమును చూచుకోరికతో పరమమైన వైరాగ్య భావంతో వివాహం చేసికొనక బ్రహ్మచర్యమందే సంన్యసిస్తారు' అని బృహస్పతి. (నారదపరి. ఉ.3.15) 'జీవులు కర్మచేత బద్ధులవుతారు, జ్ఞానంచేత ముక్తులవుతారు. కనుక పారమును చూచిన యతులు కర్మచేయరు, అని శుకానుశాసనం' (మ.భా.శాం 241.7). ఈ భగవద్గీతలో కూడా 'అన్ని కర్మలను మనసుచేత సంన్యసించి' అని చెప్పబడింది.

**భాష్యమ్ : 0.5 మోక్షస్య చ అకార్యత్వాన్ముముక్షోః కర్మానర్థక్యం. నిత్యాని ప్రత్యవాయ-పరిహారార్థమనుష్ఠేయార్థానీతి చేత్, న, అసంన్యాసవిషయత్వాత్ ప్రత్యవాయప్రాప్తేః నహ్యగ్నికార్యా ద్యకరణాత్సన్న్యాసినః ప్రత్యవాయః కల్పయితుం శక్యః, యథా బ్రహ్మచారిణాం అసన్న్యాసినామపి కర్మిణామ్. న తావన్నిత్యానాం కర్మణాం అభావాదేవ భావరూపస్య ప్రత్యవాయస్యోత్పత్తిః కల్పయితుం శక్యా, 'కథమసతః సజ్జాయేత' (ఛాం.ఉ.6.2.2) ఇతి అసతస్సజ్జన్మాసంభవశ్రుతేః. యది విహితాకరణాదసంభావ్యమపి ప్రత్యవాయం బ్రూయాద్వేదః తదానర్థకరో వేదోఽ ప్రమాణమిత్యుక్తం స్యాత్; విహితస్య కరణాకరణయోః దుఃఖమాత్రఫలత్వాత్. తథా చ కారకం శాస్త్రం న జ్ఞాపకమితి అనుపపన్నార్థం కల్పితం స్యాత్. న చైతదిష్టం. తస్మాత్ న సన్న్యాసినాం కర్మాణి. అతః జ్ఞానకర్మణో- స్సముచ్చయానుపపత్తిః.**

**తె.అ.** మోక్షం అకార్యం. (ఏ క్రియకు ఫలితం కాదు) ఈ కారణం చేత కూడా ముముక్షువుకు కర్మ వ్యర్థం.

ఆక్షేపణ – పాపం కలగకుండా ఉండడంకొరకు నిత్యకర్మలు అనుష్ఠించడం ఆవశ్యకమంటే?

సమాధానం – కాదు. సంన్యాసికానివాని విషయంలో పాపప్రాప్తి. అగ్నికార్యం మొదలైనవి చేయనందున, అసంన్యాసి అయిన బ్రహ్మచారికివలె, సంన్యాసికి పాపం కలగదు. నిత్యకర్మల అభావంనుండి భావరూమైన పాపం కలుగుతుంది అని కల్పించడం శక్యం కాదు. 'అసత్తునుండి సత్తు ఎట్లా పుడుతుంది?' (ఛా.ఉ. 6.2.2) అని శ్రుతి. అసత్తునుండి సత్తు కలగడం అసంభవమని అంటున్నది. విహిత కర్మలు చేయకపోవడం వలన పాపం కలగడం అసంభవం అయినా సంభవమే అని వేదం అంటున్నది, అని వాదిస్తే అపుడు వేదం అనర్థకరము అప్రామాణికము అన్నట్టు అవుతుంది. ఎందుకంటే వేదవిహిత కర్మలు చేసినా మానినా ఫలం దుఃఖమే కనుక. అంతేకాకుండా శాస్త్రం కారకము, జ్ఞాపకం కాదు అన్న అసత్యాన్ని ఒప్పుకున్నట్టవుతుంది. అది ఎవరికీ ఇష్టం కాదు. కనుక కర్మలు సంన్యాసులకు కాదు. అందుచేత జ్ఞానకర్మల సముచ్చయవాదం నిలువదు.

**భాష్యమ్ : 0.6 'జ్యాయసీ చేదిత్యకర్మణస్తే మతా బుద్ధిః' (3.1) ఇతి అర్జునస్య ప్రశ్నానుపపత్తేశ్చ. యది హి భగవతా ద్వితీయేఽధ్యాయే జ్ఞానం కర్మ చ సముచ్చిత్య త్వయా అనుష్ఠేయ మిత్యుక్తం స్యాత్, తతోఽర్జునస్య ప్రశ్నోనుపపన్నః. 'జ్యాయసీ చేత్కర్మణస్తే మతా బుద్ధిః' ఇతి అర్జునాయ చేత్ బుద్ధికర్మణీ త్వయా అనుష్ఠేయే ఇత్యుక్తే, యా చ కర్మణః జ్యాయసీ బుద్ధిః సాఽపి ఉక్తా ఏవ ఇతి 'తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ (3.1) ఇత్యుపాలంభో వా ప్రశ్నో వా న కథంచనోపపద్యతే. న చార్జునస్యైవ జ్యాయసీ బుద్ధిః. న అనుష్ఠేయా ఇతి భగవతా ఉక్తం పూర్వమ్ ఇతి కల్పయితుం యుక్తం, యేన 'జ్యాయసీ చేత్' ఇతి ప్రశ్నః స్యాత్.**

**తె.అ.** జ్ఞానకర్మల సముచ్చయవాదం గ్రహించదగినదయితే 'కర్మలకంటే జ్ఞానం శ్రేష్ఠమైనదని నీ అభిప్రాయమైతే' (3.1) అన్న అర్జునుని ప్రశ్నకు అర్థం ఉండదు. రెండవ అధ్యాయంలో భగవానుడు అర్జునునితో నీవు జ్ఞానకర్మల రెంటిని అనుష్ఠించవలె అని చెప్పి ఉంటే అర్జునుడు 'కర్మలకంటే జ్ఞానం శ్రేష్ఠమని నీ అభిప్రాయమైతే' అని అడిగి ఉండడు. అర్జునునితో నీవు జ్ఞానకర్మలను రెంటిని అనుష్ఠించవలెనని చెప్పి ఉంటే కర్మలకంటె శ్రేష్ఠమైన జ్ఞానంకూడా అనుష్ఠించమని చెప్పినట్లే. అటువంటపుడు 'అయితే ఈ ఘోరకర్మ నన్నెందుకు చెయ్యమంటావు' (3.1) అన్న ప్రశ్న రానేరాదు. ఉపాలంభమూ సంభవం కాదు. అర్జునుడి ప్రశ్నకు అర్థం కల్పించడం కొరకు భగవానుడు (అందరికి జ్ఞానకర్మల సముచ్చయం చెప్పి) అర్జునునికి మాత్రం నీకు జ్ఞానం అనుష్ఠించదగదు (కేవలం కర్మలే అనుష్ఠించదగును) అని అన్నాడు అని కల్పించడం కూడా యుక్తం కాదు.

**భాష్యమ్ : 0.7 యది పునరేకస్య పురుషస్య జ్ఞానకర్మణోర్విరోధాద్యుగపదనుష్ఠానం న సంభవతీతి భిన్నపురుషానుష్ఠేయత్వం భగవతా పూర్వముక్తం స్యాత్, తతోఽయం ప్రశ్న ఉపపన్నః 'జ్యాయసీచే' దిత్యాదిః, అవివేకతః ప్రశ్నకల్పనాయామపి భిన్నపురుషానుష్ఠేయత్వేన జ్ఞానకర్మనిష్ఠయోః భగవతః ప్రతివచనం నోపపద్యతే, న చాజ్ఞాననిమిత్తం భగవతః ప్రతివచనం కల్ప్యం. అస్మాచ్చ భిన్నపురుషానుష్ఠేయత్వేన జ్ఞానకర్మనిష్ఠయోర్భగవతః ప్రతివచనదర్శనాత్ జ్ఞానకర్మణోః సముచ్చయాను-పపత్తిః. తస్మాత్ కేవలాదేవ జ్ఞానాన్మోక్ష ఇత్యేషోఽర్థో నిశ్చితో గీతాసు సర్వోపనిషత్సు చ.**

**తె.అ.** ఒకే పురుషుడు విరుద్ధాలైన జ్ఞానకర్మలను ఒకే సమయంలో అనుష్ఠించడం అసంభవం, అవి వేరు వేరు పురుషులు అనుష్ఠించదగినవి కాబట్టి అని భగవానుడు చెప్పి ఉంటేనే 'కర్మలకంటే జ్ఞానం శ్రేష్ఠమని నీ అభిప్రాయమైతే, అన్న అర్జునుని ప్రశ్న సంభవం. ఒకవేళ అర్జునుడు అవివేకంచేత (భగవానుని వాక్యం అర్థంచేసుకోలేక) అట్లా ప్రశ్నించాడు అనుకున్నా, భగవానుడు అవి వేరువేరు పురుషులు అనుష్ఠించదగినవి అని సమాధానం చెప్పడు. భగవానుడు కూడా అజ్ఞానం వల్లనే అట్లా సమాధానం చెప్పాడు అనడం అనుచితం. కనుక భగవంతుడు జ్ఞానకర్మలు వేరువేరు పురుషులు అనుష్ఠించదగినివి అని చెప్పడంచేత జ్ఞానకర్మల సముచ్చయం సంభవం కాదు. కనుక కేవలం జ్ఞానంవల్లనే మోక్షం అనేది గీతలోను అన్ని ఉపనిషత్తులలోను నిశ్చితార్థం.

**భాష్యమ్ : 0.8 జ్ఞానకర్మణోః 'ఏకం వద నిశ్చిత్యే' తి (3.2) చైకవిషయైవ ప్రార్థనాఽనుపపన్నా, ఉభయోస్సముచ్చయసంభవే. 'కురుకర్మైవ తస్మాత్త్వ' (4.15) మితి చ జ్ఞాననిష్ఠాఽసంభవమర్జునస్యావధారణేన దర్శయిష్యతి.**

**తె.అ.** రెంటియొక్క సముచ్చయం సంభవమైతే జ్ఞానకర్మలలో ఏదోఒకటి నిశ్చయించి చెప్పు అన్న అర్జునుని ఏక విషయ ప్రార్థనకు అర్థం లేదు. అర్జునునికి జ్ఞాననిష్ఠ అసంభవమని 'కనుక నీవు కర్మ చేయి' అని కూడా చెప్పబోతున్నాడు.

**అర్జున ఉవాచ –**

**మూ. జ్యాయసీ చేత్కర్మణస్తే మతా బుద్ధిర్జనార్దన ।**
**తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ ॥ 1**

అర్జునుడు అంటున్నాడు –

**తె.అ.** జనార్దనా! కేశవా, కర్మలకంటే జ్ఞానం శ్రేష్ఠమని నీ అభిప్రాయమైతే మరి నాకెందుకీ ఘోరకర్మ విధిస్తున్నావు?

**భాష్యమ్ : 1.1 జ్యాయసీ ఇతి. జ్యాయసీ శ్రేయసీ, చేత్ యది, కర్మణః సకాశాత్, తే తవ, మతా అభిప్రేతా, బుద్ధిః జ్ఞానమ్, హే! జనార్దన! యది బుద్ధికర్మణీ సముచ్చితే ఇష్టే తదా ఏవం శ్రేయః సాధనమ్ ఇతి 'కర్మణో జ్యాయసీ బుద్ధిః' ఇతి కర్మణః అతిరిక్తకరణం బుద్ధేః అనుపపన్నమ్ అర్జునేన కృతం స్యాత్. న హి తదేవ హి తస్మాత్ ఫలతః అతిరిక్తం స్యాత్. తథా చ, కర్మణః శ్రేయస్కరీ భగవతా ఉక్తా బుద్ధిః, అశ్రేయస్కరం చ కర్మ కురు ఇతి మాం ప్రతిపాదయతి, తత్ కిం ను కారణమ్, ఇతి భగవతః ఉపాలమ్భమ్ ఇవ కుర్వన్, తత్ కిం కస్మాత్ కర్మణి, ఘోరే క్రూరే హింసాలక్షణే, మాం నియోజయసి కేశవ ఇతి చ యత్ ఆహ తత్ చ, న ఉపపద్యతే. అథ స్మార్తేనైవ కర్మణా సముచ్చయః సర్వేషాం భగవతా ఉక్తః అర్జునేన చ అవధారితః చేత్ 'తత్ కిం కర్మణి ఘోరే మాం నియోజయసి' ఇత్యాది కథం యుక్తం వచనమ్? కించ –**

**తె.అ.** 'కర్మలతో పోల్చినపుడు జ్ఞానం శ్రేష్ఠమని నీ అభిప్రాయమైతే' (అని అర్జునుడు అంటున్నాడు) జ్ఞానకర్మల సముచ్చయం భగవానునికి సమ్మతమైతే, అర్జునుడు కర్మను జ్ఞానాన్ని వేరుచేసి వాటిలో శ్రేయస్సాధనం ఒకదానిని చెప్పమని అడగడంలోగాని కర్మలకంటే జ్ఞానం శ్రేష్ఠమని అనడంలోగాని అర్థంలేదు. ఫలమివ్వడంలో ఒక వస్తువు తనను తాను అతిశయించడం అసంభవం. (జ్ఞానకర్మలు కలిసి ఒకే అనుష్ఠానమైనపుడు ఆ ఒకటిలో దేనికంటే ఏది ఎక్కువ శ్రేయస్కరం అని అడగడంలో అర్థంలేదు.) మరి కర్మలకంటే జ్ఞానం శ్రేయస్కరమని భగవానుడు అంటూ నన్ను అశ్రేయస్కరమైన కర్మచేయమని ఆజ్ఞాపించడానికి ఏమి కారణం? అని, 'హింసా లక్షణమైన క్రూర కర్మయందు నన్నెందుకు దించుతావు' అని భగవానుని ఉపాలంభిస్తున్నట్లు అడుగుతున్నాడు. ఈ విధమైన ఉపాలంభానికి (అంటే ఎదిరించినట్లు మాట్లాడడంలో) అర్థం లేదు.

అట్లాకాక భగవానుడు స్మార్తకర్మతో కూడిన జ్ఞానమే అందరికీ విహితమని చెప్పి ఉంటే, అర్జునుడు కూడా అదే విధంగా అర్థం చేసుకునివుంటే, అతడు 'ఈ ఘోరకర్మలో నన్నెందుకు దించుతావు' అని అడగడం యుక్తియుక్తంగా లేదు. అంతే కాదు –

**మూ. వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే ।**
**తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహమాప్నుయామ్ ॥ 2**

**తె.అ.** కలబోసినట్లున్న మాటలతో నా బుద్ధిని తికమక పెడుతున్నట్టున్నావు. కనుక నాకు శ్రేయస్కరమైన ఒకే మార్గాన్ని నిశ్చయించి చెప్పు.

**భాష్యమ్ : 2.1 వ్యామిశ్రేణేతి :– వ్యామిశ్రేణేవ యద్యపి వివిక్తాభిధాయీ భగవాన్ తథాపి మమ మన్దబుద్ధేః వ్యామిశ్రమ్ ఇవ భగవద్వాక్యం ప్రతిభాతి. తేన మమ బుద్ధిం మోహయసి ఇవ. మమ బుద్ధివ్యామోహాపనయాయ హి ప్రవృత్తః త్వం తు కథం మోహయసి? అతః బ్రవీమి బుద్ధిం మోహయసీవ, మే మమ, ఇతి. త్వం తు భిన్నకర్తృకయోః జ్ఞానకర్మణోః ఏకపురుషానుష్ఠానాసంభవం యది మన్యసే తత్ర ఏవం సతి తత్ తయోః ఏకం బుద్ధిం కర్మ వా ఇదమ్ ఏవ అర్జునస్య యోగ్యం, బుద్ధిశక్త్యవస్థానురూపమ్ ఇతి నిశ్చిత్య వద బ్రూహి. యేన జ్ఞానేన కర్మణా వా అన్యతరేణ శ్రేయః అహమ్, ఆప్నుయాం ప్రాప్నుయామ్. ఇతి యదుక్తం తదపి నోపపద్యతే.**

**తె.అ.** భగవానుడు విడమరచి స్పష్టంగా చెప్పే వాడయిప్పటికీ, మందబుద్ధినైన నాకు భగవద్వాక్యం అస్పష్టంగా అనిపిస్తున్నది. నా బుద్ధిని తికమక పెడుతున్నట్టున్నది. మందబుద్ధినైన నా మోహాన్ని తొలగించబూనుకున్న నీవు ఎందుకు మోహింపజేస్తావు? (చెయ్యవు) అందుకే 'మోహింపచేస్తున్నట్టున్నావు' అంటున్నాను. భిన్నపురుషులచేత అనుష్ఠింపదగిన జ్ఞానకర్మలు ఒకే పురుషుడు అనుష్ఠించడం అసంభవమని నీవు తలచినట్లయితే ఆ రెంటిలో 'జ్ఞానమునో కర్మనో, అర్జునుని బుద్ధికి శక్తికి అవస్థకు అనురూపమైనదిది' అని ఒకదానిని నిశ్చయించి చెప్పు. దానిననుష్టించి శ్రేయస్సు పొందుతాను.

**భాష్యమ్ : 2.2 యది హి కర్మనిష్ఠాయాం గుణభూతమపి జ్ఞానం భగవతా ఉక్తం స్యాత్ తత్ కథం తయోః ఏకం వద ఇతి ఏకవిషయైవ అర్జునస్య శుశ్రూషా స్యాత్? న హి భగవతా పూర్వం ఉక్తమ్ 'అన్యతరదేవ జ్ఞానకర్మణోః వక్ష్యామి నైవ ద్వయమ్' ఇతి యేన ఉభయప్రాప్త్యసంభవమ్ ఆత్మనః మన్యమానః ఏకమేవ ప్రార్థయేత్.**

**తె.అ.** భగవానుడు కర్మనిష్ఠయందు అప్రధానమైన భాగంగానైనా జ్ఞానాన్ని చెప్పి ఉన్నట్టయితే అర్జునుడు 'ఒకదానిని చెప్పు' అని ఎట్లా ఏకవిషయంగా అడుగుతాడు? భగవంతుడు 'నేను నీకు

జ్ఞానకర్మలలో ఏదో ఒకదానిని మాత్రం చెపుతాను, రెంటిని చెప్పను' అని ముందు అని ఉండలేదే? అట్లా అనినపుడు కదా అర్జునుడు తనకు రెండూ వినే యోగ్యత లేదు కనుక ఏదో ఒకటిచెప్పు అని అడగవలసి ఉంది?

**భాష్యమ్ : 3.0 ప్రశ్నానురూపమేవ ప్రతివచనం శ్రీ భగవానువాచ –**

**తె.అ.** ప్రశ్నకు తగినట్లుగానే భగవానుడు సమాధానం చెప్పాడు.

**మూ. లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ ।**
**జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్ ॥ 3**

**తె.అ.** పూర్వం నేను ఈ లోకంలో రెండు విధాలైన అనుష్ఠానాలను ప్రకటించాను. సాంఖ్యులకు జ్ఞానయోగము, యోగులకు కర్మయోగము.

**భాష్యమ్ : 3.1 లోకేఽస్మిన్నితి :– లోకే అస్మిన్ శాస్త్రార్థానుష్ఠానాధికృతానాం త్రైవర్ణికానాం, ద్వివిధా ద్విప్రకారా, నిష్ఠా స్థితిః అనుష్ఠేయతాత్పర్యమ్, పురా పూర్వం సర్గాదౌ ప్రజాః సృష్ట్వా తాసామ్ అభ్యుదయనిఃశ్రేయసప్రాప్తిసాధనం వేదార్థసంప్రదాయమ్ ఆవిష్కుర్వతా, ప్రోక్తా, మయా సర్వజ్ఞేన ఈశ్వరేణ, హే అనఘ అపాప. తత్ర కా సా ద్వివిధానిష్ఠా ఇత్యాహ – తత్ర జ్ఞానయోగేన జ్ఞానమ్ ఏవ యోగః తేన, సాంఖ్యానామ్ ఆత్మానాత్మ విషయవివేకజ్ఞానవతాం, బ్రహ్మచర్యాశ్రమాత్ ఏవ కృతసంన్యాసానాం వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థానాం పరమహంసపరివ్రాజకానాం బ్రహ్మణ్యేవ అవస్థితానాం, నిష్ఠా ప్రోక్తా. కర్మయోగేన – కర్మైవ యోగః కర్మయోగః తేన కర్మయోగేన, యోగినాం కర్మిణాం నిష్ఠా ప్రోక్తా ఇత్యర్థః.**

**తె.అ.** ఈ లోకంలో సృష్ట్యాదియందు ప్రజలను సృష్టించి అందులో శాస్త్రానుష్ఠానయోగ్యులైన మూడు వర్ణాలవారికి అభ్యుదయనిశ్రేయససాధనమైన రెండు విధాలైన అనుష్ఠానాలను, అంటే కర్తవ్యతత్పరతను, సర్వజ్ఞుడు ఈశ్వరుడు అయిన నేను వేదార్థ సంప్రదాయాన్ని ఆవిష్కరిస్తూ చెప్పి ఉన్నాను. ఏవి ఆ రెండు అనుష్ఠానాలు అంటే విను. ఆత్మానాత్మవిషయ వివేక విజ్ఞానం కలవారు, బ్రహ్మచర్యాశ్రమం నుండి సంన్యసించినవారు, వేదార్థం సునిశ్చితంగా తెలిసినవారు, పరమహంస పరివ్రాజకులు, బ్రహ్మనిష్ఠులు అయిన సాంఖ్యులకు జ్ఞాననిష్ఠ. కర్మలు చేసేవారికి, కర్మయోగులకు, కర్మనిష్ఠ.

**భాష్యమ్ : 3.2 యది చ ఏకేన పురుషేణ ఏకస్మై పురుషార్థాయ జ్ఞానం కర్మ చ సముచ్చిత్య అనుష్ఠేయం భగవతా ఇష్టమ్, ఉక్తం వక్ష్యమాణం వా గీతాసు, వేదేషు చ ఉక్తం కథమ్ ఇహ అర్జునాయ ఉపపన్నాయ ప్రియాయ విశిష్టభిన్నపురుషకర్తృకే ఏవ జ్ఞానకర్మనిష్ఠే బ్రూయాత్?**

**యది పునః 'అర్జునః జ్ఞానం కర్మ చ ద్వయం శ్రుత్వా స్వయమేవ అనుష్ఠాస్యతి, అన్యేషాం తు భిన్నపురుషానుష్ఠేయతాం వక్ష్యామి' ఇతి మతం భగవతః కల్ప్యేత, తదా రాగద్వేషవాన్, అప్రమాణభూతః భగవాన్ కల్పితః స్యాత్. తచ్చ అయుక్తమ్. తస్మాత్ కయాపి యుక్త్యా న సముచ్చయః జ్ఞాన– కర్మణోః.**

**తె.అ.** ఒకే పురుషుడు ఒకే పురుషార్థసిద్ధికొరకు జ్ఞానకర్మలను కలిపి అనుష్ఠించవచ్చును అనేది గీతలలో చెప్పినట్లుకాని, చెప్పబోతున్నట్లుగాని, వేదాలయందు చెప్పబడినట్లుగాని భగవానుడు భావించి ఉంటే తనకు సన్నిహితుడు ప్రియశిష్యుడు అయిన అర్జునునితో జ్ఞానకర్మలు వేరువేరు పురుషులు అనుష్ఠించవలసినవి అని ఎందుకంటాడు? 'జ్ఞానకర్మల రెంటిగురించి విని అర్జునుడు తనంతట తను స్వయంగా రెండూ అనుష్ఠిస్తాడు, ఇతరులకు మాత్రం నేను జ్ఞానకర్మలు వేరువేరు పురుషులు అనుష్ఠించవలసినవిగా చెపుతాను' అనేది భగవానుని అభిప్రాయం అని కల్పించినట్లయితే భగవానునికి రాగద్వేషాలు అంటగట్టినవాళ్ళమవుతాము. ఆయన మాట అప్రామాణికం అవుతుంది. అది తగనిది. కనుక ఎటువంటి యుక్తిచేత గూడా జ్ఞానాన్ని కర్మలతో ముడిపెట్టలేము.

**భాష్యమ్ : 4.0 యత్ అర్జునేన ఉక్తం కర్మణః జ్యాయస్త్వం బుద్ధేః, తచ్చ స్థితమ్, అనిరాకరణాత్. తస్యాః చ జ్ఞాననిష్ఠాయాః సంన్యాసినామేవ అనుష్ఠేయత్వం, భిన్నపురుషానుష్ఠేయత్వవచనాత్. భగవతః ఏవమేవ అనుమతమ్ ఇతి గమ్యతే. 'మాం చ బన్ధకారణే కర్మణ్యేవ నియోజయసి' ఇతి విషణ్ణమనసమ్ అర్జునం 'కర్మ నారభే' ఇతి మన్వానమ్ ఆలక్ష్య ఆహ భగవాన్ – న కర్మణామనారమ్భాదితి. అథవా – జ్ఞానకర్మనిష్ఠయోః పరస్పరవిరోధాత్ ఏకేన పురుషేణ యుగపత్ అనుష్ఠాతుమ్ అశక్యత్వే సతి ఇతరేతరానపేక్షయోః ఏవ పురుషార్థహేతుత్వే ప్రాప్తే కర్మనిష్ఠాయాః జ్ఞాననిష్ఠాప్రాప్తిహేతుత్వేన పురుషార్థహేతుత్వం న స్వాతన్త్ర్యేణ, జ్ఞాననిష్ఠా తు కర్మనిష్ఠోపాయలబ్ధాత్మికా సతీ స్వాతన్త్ర్యేణ పురుషార్థహేతుః, అన్యానపేక్షా ఇత్యేతమ్ అర్థం ప్రదర్శయిష్యన్ ఆహ భగవాన్ –**

**తె.అ.** కర్మలకంటే జ్ఞానం శ్రేష్ఠమని అర్జునుడు అన్నమాట నిలుస్తుంది, భగవానుడు కాదనలేదు కనుక. జ్ఞాననిష్ఠ సంన్యాసులు మాత్రమే అనుష్ఠించదగినది, 'భిన్నపురుషులు అనుష్ఠించదగినవి' అని భగవానుడు అనడంచేత. భగవానునికి ఇదే సమ్మతమని తెలుస్తున్నది. 'నన్ను మాత్రం బంధకారణమైన కర్మలు చెయ్యమంటున్నావు' అని దిగులుపడి 'నేను కర్మచేయను' అని నిశ్చయించుకున్న అర్జునుణ్ణి చూసి భగవానుడు అంటున్నాడు 'కర్మలు చేయడం మానినంతమాత్రాన' (3.4) అని. లేక, జ్ఞానకర్మనిష్ఠలు పరస్పర విరుద్ధాలు, ఒకేసారి ఒకే పురుషుడు ఆ రెంటిని అనుష్ఠించడం అశక్యం అవి వేటికవి విడిగా పురుషార్థప్రాప్తి హేతువులు. జ్ఞాననిష్ఠాప్రాప్తికి

హేతువు కనుక కర్మనిష్ఠ పురుషార్థసిద్ధికి హేతువు అవుతుంది, అంతేకాని స్వతంత్రంగా కాదు. కాని కర్మనిష్ఠవల్ల కలిగే జ్ఞాననిష్ఠ మాత్రం విడిగా స్వతంత్రంగా పురుషార్థసిద్ధికి హేతువు. ఈ అర్థం ప్రదర్శింపగోరి భగవానుడంటున్నాడు.

**శ్రీ భగవానువాచ–**

**మూ. న కర్మణామనారమ్భాన్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే ।**
**న చ సంన్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి ॥ 4**

**తె.అ.** కర్మలు మానడంవలన పురుషుడు నిష్క్రియమగు ఆత్మరూపస్థితిని పొందడు. కర్మసంన్యాసమాత్రం చేత సిద్ధి పొందడు.

**భాష్యమ్ : 4.1 న కర్మణాం ఇతి. న కర్మణామ్ అనారమ్భాత్ అప్రారమ్భాత్, కర్మణాం క్రియాణాం యజ్ఞాదీనామ్ ఇహ జన్మని జన్మాన్తరే వా అనుష్ఠితానామ్ ఉపాత్తదురితక్షయహేతుత్వేన సత్త్వశుద్ధికారణానాం, తత్కారణత్వేన చ జ్ఞానోత్పత్తిద్వారేణ జ్ఞాననిష్ఠాహేతూనాం.**

**'జ్ఞానముత్పద్యతే పుంసాం క్షయాత్పాపస్య కర్మణః ।**
**యథాదర్శతలప్రఖ్యే పశ్యత్యాత్మానమాత్మని ॥' (శాం.ప.204.8)**

**ఇత్యాదిస్మరణాత్, అనారమ్భాత్ అననుష్ఠానాత్, నైష్కర్మ్యమ్ నిష్కర్మభావం కర్మశూన్యతాం, జ్ఞానయోగేన నిష్ఠా నిష్క్రియాత్మస్వరూపేణైవ అవస్థానమ్ ఇతి యావత్, పురుషః న అశ్నుతే న ప్రాప్నోతి ఇత్యర్థః.**

**తె.అ.** ఈ జన్మలోగాని మరోజన్మలోగాని చేసిన యజ్ఞాది కర్మలు చేసిన పాపాలను క్షయంచేసి సత్త్వశుద్ధిని కలిగించి తద్ద్వారా జ్ఞానం కలగడానికి కారణమవుతాయి. 'పురుషులకు పాపకర్మలు క్షయం కావడంతో జ్ఞానం కలుగుతుంది. అద్దంపై చేరిన మలినం తుడిచివేయగానే అందులో తనను తాను చూడగలిగినట్లు, ఆత్మదర్శనం అవుతుంది'. (మ.భా.శాం. 204.8) అటువంటి కర్మలు మానినంతమాత్రాన నిష్క్రియమగు ఆత్మరూప స్థితి, అంటే నిష్కర్మభావం, కర్మశూన్యత సిద్ధించదు. నిష్క్రియమైన ఆత్మస్వరూపంలో నిలిచి ఉండే స్థితి, జ్ఞాననిష్ఠ కలుగదు.

**భాష్యమ్ : 4.2 'న కర్మణామ్ అనారమ్భాత్ నైష్కర్మ్యం పురుషో అశ్నుతే', ఇతి వచనాత్ తద్విపర్యయాత్, తేషామ్ ఆరమ్భాత్ నైష్కర్మ్యమ్ అశ్నుతే ఇతి గమ్యతే. కస్మాత్ పునః కారణాత్ కర్మణామ్ అనారమ్భాత్ నైష్కర్మ్యం న అశ్నుతే ఇతి? ఉచ్యతే – కర్మారమ్భస్యైవ నైష్కర్మ్యోపాయత్వాత్. న హి ఉపాయమ్ అన్తరేణ ఉపేయప్రాప్తిః అస్తి. కర్మయోగోపాయత్వం చ నైష్కర్మ్యలక్షణస్య జ్ఞానయోగస్య, శ్రుతౌ ఇహ చ ప్రతిపాదనాత్. శ్రుతౌ తావత్ ప్రకృతస్య ఆత్మలోకస్య వేద్యస్య**

**వేదనోపాయత్వేన తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన" (బృ.ఉ. 4.4.22) ఇత్యాదినా కర్మయోగస్య జ్ఞానయోగోపాయత్వం ప్రతిపాదితమ్. ఇహాపి చ -**

**'సంన్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తుమయోగతః' (5.6)**

**'యోగినః కర్మ కుర్వన్తి సంగం త్యక్త్వాత్మశుద్ధయే' (5.11)**

**'యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్' (18.5) ఇత్యాది ప్రతిపాదయిష్యతి.**

**నను చ 'అభయం సర్వభూతేభ్యో దత్త్వా నైష్కర్మ్యమాచరేత్' (అశ్వమేధపర్వ 46.18) ఇత్యాదౌ కర్తవ్యకర్మసంన్యాసాదపి నైష్కర్మ్యప్రాప్తిం దర్శయతి. లోకే చ కర్మణామ్ అనారమ్భాత్ నైష్కర్మ్యమ్ ఇతి ప్రసిద్ధతరమ్. అతశ్చ నైష్కర్మ్యార్థినః కిం కర్మారమ్భేణ? ఇతి ప్రాప్తమ్. అత ఆహ - న చ సంన్యసనాదేవేతి. నాపి సంన్యసనాదేవ కేవలాత్ కర్మపరిత్యాగమాత్రాదేవ జ్ఞానరహితాత్ సిద్ధిం నైష్కర్మ్యలక్షణాం జ్ఞానయోగేన నిష్ఠాం, సమధిగచ్ఛతి న ప్రాప్నోతి.**

**తె.అ.** 'కర్మలు మానడం వలన పురుషుడు నిష్క్రియమగు ఆత్మరూపస్థితిని పొందడు', అన్నపుడు దానికి విపర్యయంగా కర్మలు చేయడం వల్ల నైష్కర్మ్యం సిద్ధిస్తుంది అని అర్థం కలుగవచ్చు. కర్మలు మానడంచేత నైష్కర్మ్యం ఎందుకు సిద్ధించదు అంటే, కర్మాచరణం నైష్కర్మ్యసాధనం కనుక. దారిలేకుండా గమ్యం చేరలేము. నిష్క్రియమగు ఆత్మరూపస్థితికి లక్షణమైన జ్ఞానయోగానికి కర్మయోగం ఉపాయంగా శ్రుతులు, గీత కూడా చెపుతున్నాయి. ప్రకృతి విషయమైన జ్ఞానానికి, అంటే ఆత్మలోకాన్ని తెలుసుకోడానికి, ఉపాయం చెపుతూ శ్రుతి "బ్రాహ్మణులు దీనిని యజ్ఞం చేత వేదాధ్యయనం చేత తెలుసుకోగోరుతారు" (బృ.ఉ.4.4.22) అంటూ జ్ఞానయోగానికి కర్మయోగం ఉపాయమని ప్రతిపాదిస్తున్నది. ఈ గీతలో కూడా, 'కర్మలు చేయకుండా సంన్యాసం పొందడం కష్టం' (5.6), 'యోగులు ఫలమును కోరక ఆత్మశుద్ధికొరకు కర్మ చేస్తారు' (5.11) 'యజ్ఞము, దానము, తపము, మనిషిని పావనం చేస్తాయి' (18.5) మొదలైన వాక్యాలు చెప్పబోతున్నాడు. కర్మసంన్యాసంచేత నిష్క్రియమగు ఆత్మరూపస్థితి ప్రాప్తిగూడా చెప్పారు, 'సర్వప్రాణులకు అభయమిచ్చి నిష్క్రియమగు ఆత్మరూపస్థితినాచరించదగును' (మ.భా.అశ్వ.46.18) మొదలైన వాక్యాలలో. కర్మలు మానడంచేత నిష్క్రియమగు ఆత్మరూపస్థితి అనేది లోకంలో కూడా ప్రసిద్ధం. కనుక నైష్కర్మ్యం కోరుకునేవారు కర్మలు చేయడమెందుకు అని అడగవచ్చు. అందుకు సమాధానంగా అంటున్నాడు. జ్ఞానరహితమైన కర్మపరిత్యాగమాత్రం చేత నైష్కర్మ్యలక్షణమైన జ్ఞానయోగనిష్ఠను, సిద్ధిని, పొందలేడు అని.

**భాష్యమ్ : 5.0 కస్మాత్ పునః కారణాత్ కర్మసంన్యాసమాత్రాదేవ జ్ఞానరహితాత్ సిద్ధిం నైష్కర్మ్యలక్షణాం పురుషః న అధిగచ్ఛతి? ఇతి హేత్వాకాఙ్క్షాయామ్ ఆహ-**

**తె.అ.** జ్ఞానరహితమైన కర్మసంన్యాసమాత్రం చేత నైష్కర్మ్యలక్షణమైన సిద్ధిని పొందకపోవడానికి కారణం ఏమి? కారణం తెలుసుకోవలెనన్న కోరికకు సమాధానం –

**మూ. న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్ ।**
**కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః ॥ 5**

**తె.అ.** ఎవ్వరూ క్షణం కూడా కర్మచేయకుండా ఉండలేరు. ప్రకృతిగుణాలు అందరినీ వివశులను చేసి పనులు చేయిస్తాయి.

**భాష్యమ్ : 5.1 న హీతి – న, హి యస్మాత్, క్షణమ్ అపి కాలం, జాతు కదాచిత్, కశ్చిత్ తిష్ఠతి అకర్మకృత్ సన్. కస్మాత్? కార్యతే, ప్రవర్త్యతే హి యస్మాత్, అవశః ఏవ అస్వతంత్రః ఏవ కర్మ సర్వః ప్రాణీ, ప్రకృతిజైః ప్రకృతితః జాతైః సత్త్వరజస్తమోభిః గుణైః, అజ్ఞః ఇతి వాక్యశేషః, యతో వక్ష్యతి 'గుణైర్యో న విచాల్యతే' (14.23) ఇతి. సాంఖ్యానాం పృథక్కరణాత్ (3.3) అజ్ఞానామ్ ఏవ హి కర్మయోగః, న జ్ఞానినామ్. జ్ఞానినాం తు గుణైః అచాల్యమానానాం స్వతః చలనాభావాత్ కర్మయోగః నోపపద్యతే. తథా చ వ్యాఖ్యాతం 'వేదావినాశినమ్' (2.21) ఇత్యత్ర.**

**తె.అ.** కారణమేమంటే, ఎప్పుడూ క్షణకాలమైనా ఎవడు కూడా ఏ పనీచేయకుండా ఉండలేడు. ఎందుకని? సర్వప్రాణులు ప్రకృతి గుణాలైన సత్త్వరజస్తమస్సులచేత అస్వతంత్రులై కర్మలు చేస్తూ ఉంటారు. అజ్ఞానులు అని వాక్యం పూర్తిచేసుకోవాలి. ఎందుకంటే 'గుణాలవలన చలించనివాడు' (14.23) అని చెపుతాడు. 3.3 లో సాంఖ్యులను వేరు చేయడంచేత అజ్ఞానులకే కర్మయోగం, కాని జ్ఞానులకు కాదు. గుణాలచేత చలించని జ్ఞానులకు స్వతః చలనం లేకపోవడం వలన కర్మయోగం కలగదు. 'వేదావినాశినం' (2.22) అనే శ్లోకాన్ని ఆ విధంగానే వ్యాఖ్యానించాము.

**భాష్యమ్ : 6.0 యస్తు అనాత్మజ్ఞః చోదితం కర్మ నారభతే ఇతి తత్ అసత్ ఇతి ఆహ–**

**తె.అ.** ఆత్మజ్ఞానం పొందనివాడు విహితకర్మలు మానడం దోషం అంటున్నాడు.

**మూ. కర్మేన్ద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్ ।**
**ఇన్ద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచారః స ఉచ్యతే ॥ 6**

**తె.అ.** కర్మేంద్రియాలను నిరోధించి, ఇంద్రియవిషయాలను మనసులో స్మరిస్తూ ఉండే మూఢుని మిథ్యాచారుడు అంటారు.

**భాష్యమ్ : 6.1 కర్మేన్ద్రియాణీతిః- కర్మేన్ద్రియాణి హస్తాదీని, సంయమ్య సంహృత్య, యః ఆస్తే తిష్ఠతి మనసా స్మరన్ చిన్తయన్, ఇన్ద్రియార్థాన్ విషయాన్, విమూఢాత్మా విమూఢాన్తఃకరణః మిథ్యాచారః మృషాచారః పాపాచారః సః ఉచ్యతే.**

**తె.అ.** చేయి మొదలైన కర్మేంద్రియాలను స్తంభింపచేసి ఇంద్రియవిషయాలను మాత్రం మనసులో స్మరిస్తూ ఉండే మూఢుణ్ణి కపటి, పాపాచారుడు అంటారు.

**మూ. యస్త్విన్ద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున ।**
**కర్మేన్ద్రియైః కర్మయోగమసక్తః స విశిష్యతే ॥ 7**

**తె.అ.** జ్ఞానేంద్రియాలను మనసుచేత నియమించి, ఫలం కోరకుండా, కర్మేంద్రియాలచేత కర్మయోగం అనుష్ఠించేవాడు శ్రేష్ఠుడు.

**భాష్యమ్ : 7.1 యస్త్వితి :- యస్తు పునః కర్మణి అధికృతః అజ్ఞః బుద్ధీన్ద్రియాణి మనసా నియమ్య ఆరభతే, అర్జున, కర్మేన్ద్రియైః వాక్పాణ్యాదిభిః. కిమారభతే? ఇత్యాహ - కర్మయోగమ్, అసక్తః సన్ ఫలాభిసంధివర్జితః సః విశిష్యతే ఇతరస్మాత్ మిథ్యాచారాత్.**

**తె.అ.** కర్మలయందు అధికారమున్న అజ్ఞాని బుద్ధీంద్రియాలను మనసుచేత నియమించి వాక్పాణిపాదాది కర్మేంద్రియాలచేత కర్మలు ఆచరిస్తాడు. ఫలాపేక్ష లేకుండా ఈ విధంగా కర్మలాచరించేవాడు మిథ్యాచారునికంటే శ్రేష్ఠుడు.

**భాష్యమ్ : 8.0 యతః ఏవం అతః-**

**తె.అ.** అందువలన -

**మూ. నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః ।**
**శరీరయాత్రాపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః ॥ 8**

**తె.అ.** విహిత కర్మను ఆచరించు. అకర్మకంటె కర్మశ్రేష్ఠము. కర్మ చేయకుంటే నీ శరీరయాత్ర కూడా సాగదు.

**భాష్యమ్ : 8.1 నియతమితి :- నియతం నిత్యం, యః యస్మిన్ కర్మణి అధికృతః ఫలాయ చ అశ్రుతం తత్ నియతం కర్మ తత్ కురు హే అర్జున. యతః కర్మ జ్యాయః అధికతరం ఫలతః. హి యస్మాత్, అకర్మణః అకరణాత్ అనారమ్భాత్. కథమ్? శరీరయాత్రా శరీరస్థితిః అపి చ, తే తవ, న ప్రసిద్ధ్యేత్ ప్రసిద్ధిం న గచ్ఛేత్ అకర్మణః అకరణాత్. అతః దృష్టః కర్మాకర్మణోః విశేషః లోకే.**

**తె.అ.** నియతకర్మ అంటే శాస్త్రోపదిష్టమైన నిత్యకర్మ. ఆ కర్మ ఏఫలం కొరకూ చెప్పింది కాదు. కర్మలయందు అధికారమున్నవాడు ఆ నిత్యకర్మ మానక చేయాలి. అర్జునా, ఆ కర్మ నీవు చేయి. ఎందుకంటె కర్మలు మానడం కంటె కర్మలు చేయడంవల్ల శ్రేష్ఠమైన ఫలం కలుగుతుంది. ఎట్లా? కర్మ చేయకపోతే నీకు శరీరం కొనసాగించడం కూడా సాధ్యంకాదు. కర్మ చేయడం మానడంలో ఉన్న ఈ భేదాన్ని లోకంలో చూస్తున్నాం.

**భాష్యమ్ : 9.0 యచ్చ మన్యసే బంధార్థత్వాత్ కర్మ న కర్తవ్యం ఇతి తత్ అపి అసత్. కథమ్?**

**తె.అ.** కర్మ బంధకారణం, కనుక కర్మచేయరాదు అని నీవు అనుకోడం కూడా తప్పు. ఎట్లా అంటే –

**మూ. యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబన్ధనః ।**
**తదర్థం కర్మ కౌన్తేయ ముక్తసంగః సమాచర ॥ 9**

**తె.అ.** భగవంతుని కొరకు అనుష్ఠింపబడని కర్మలు ఈ లోకానికి బంధాలు. భగవదర్థం ముక్తసంగుడవై కర్మనాచరించు.

**భాష్యమ్ : 9.1 యజ్ఞార్థాదితి :– 'యజ్ఞో వై విష్ణుః' (తై.సం.1.7.4) ఇతి శ్రుతేః యజ్ఞః ఈశ్వరః తదర్థం యత్ క్రియతే తత్ యజ్ఞార్థం కర్మ. తస్మాత్ కర్మణః అన్యత్ర అన్యేన కర్మణా లోకః అయమ్ అధికృతః కర్మకృత్ కర్మబన్ధనః కర్మ బన్ధనం యస్య సః అయం కర్మబన్ధనః లోకః , న తు యజ్ఞార్థాత్. అతః తదర్థం యజ్ఞార్థం, కర్మ కౌన్తేయ, ముక్తసంగః కర్మఫలసంగవర్జితః సన్, సమాచర నిర్వర్తయ.**

**తె.అ.** 'యజ్ఞమే విష్ణువు' (తై.సం 1.7.4) అని శ్రుతి. భగవంతునికై చేసే కర్మ యజ్ఞార్థమైన కర్మ. భగవదర్థం కాని కర్మ ఈ లోకానికి, అంటే కర్మాధికారం కలిగినవారికి, బంధనం అవుతుంది. భగవదార్థం చేసిన కర్మ బంధనం కాదు. కనుక కర్మఫలమందు ఆసక్తి వదలి ఈశ్వరార్థమై కర్మనాచరించు.

**భాష్యమ్ : 10.0 ఇతశ్చాధికృతేన కర్మ కర్తవ్యమ్**

**తె.అ.** కర్మలయందు అధికారి అయినవానికి మరోకారణంగా కూడా కర్మ కర్తవ్యం –

**మూ. సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః ।**
**అనేన ప్రసవిష్యధ్వమేష వోఽస్త్విష్టకామధుక్ ॥ 10**

**తె.అ.** పూర్వం ప్రజాపతి ప్రజలను సృష్టించినపుడే యజ్ఞాన్ని సృష్టించి వారితో అన్నాడు, 'దీనివలన మీరు వృద్ధి పొందండి. ఇది మీకు కామధేనువగుగాక', అని.

**భాష్యమ్ : 10.1 సహేతి :- సహయజ్ఞాః యజ్ఞసహితాః, ప్రజాః త్రయో వర్ణాః, తాః, సృష్ట్వా ఉత్పాద్య, పురా పూర్వం సర్గాదౌ, ఉవాచ ఉక్తవాన్, ప్రజాపతిః ప్రజానాం స్రష్టా, అనేన యజ్ఞేన, ప్రసవిష్యధ్వం ప్రసవః వృద్ధిః ఉత్పత్తిః తాం కురుధ్వమ్. ఏషః యజ్ఞః, వః యుష్మాకమ్, అస్తు భవతు, ఇష్టకామధుక్ ఇష్టాన్ అభిప్రేతాన్ కామఫలవిశేషాన్ దోగ్ధి ఇతి ఇష్టకామధుక్.**

**తె.అ.** ప్రజలను పుట్టించువాడు ప్రజాపతి. పూర్వం అంటే సృష్ట్యాదియందు ప్రజాపతి మూడు వర్ణాలవారిని ప్రజలను యజ్ఞంతోపాటుగా సృష్టించి అన్నాడు 'ఈ యజ్ఞం వల్ల మీరు వృద్ధిపొందండి. ఈ యజ్ఞం మీకిష్టమైన ఫలవిశేషాలను ఇచ్చుగాక, అంటే మీకు కామధేనువు, అని'. ఎట్లా?

**మూ. దేవాన్ భావయతాऽనేన తే దేవా భావయన్తు వః ।**
**పరస్పరం భావయన్తః శ్రేయః పరమవాప్స్యథ ॥ 11**

**తె.అ.** ఈ యజ్ఞంచేత మీరు దేవతలను పోషించండి. ఆ దేవతలు మిమ్ము పోషించగలరు. పరస్పరం పుష్టి కలిగించుకుని పరమశ్రేయస్సును పొందండి.

**భాష్యమ్ : 11.1 దేవానితి. దేవాన్, ఇంద్రాదీన్, భావయత వర్ధయత అనేన యజ్ఞేన. తే దేవాః వర్ధితాః భావయంతు వృష్ట్యాదినా ఆప్యాయయంతు వః యుష్మాన్, ఏవం పరస్పరం అన్యోన్యం భావయంతః శ్రేయః పరం మోక్షలక్షణం జ్ఞానప్రాప్తిక్రమేణావాప్స్యథ. స్వర్గం వా పరం శ్రేయః అవాప్స్యథ. కించ -**

**తె.అ.** ఈ యజ్ఞంచేత ఇంద్రాది దేవతలను ప్రీతినొందించండి. ఆ దేవతలు మిమ్ము వర్షాదులచేత పోషించగలరు. ఈ విధంగా అన్యోన్యం పోషించుకుని క్రమంగా జ్ఞానంపొంది మోక్షలక్షణమైన పరమశ్రేయస్సును పొందుతారు, లేక స్వర్గమును పొందుతారు. అంతేకాదు -

**మూ. ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యన్తే యజ్ఞభావితాః ।**
**తైర్దత్తానప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః ॥ 12**

**తె.అ.** యజ్ఞం చేత సంభావింపబడిన దేవతలు మీకు కోరిన భోగాలను అన్నీ యిస్తారు. వారిచ్చిన వాటిని వారితో పంచుకొనకుండా అనుభవించేవాడు దొంగయే.

**భాష్యమ్ : 12.1 ఇష్టాన్ భోగానితి :- ఇష్టాన్ అభిప్రేతాన్, భోగాన్ హి,వః యుష్మభ్యం, దేవాః దాస్యన్తే వితరిష్యన్తి, స్త్రీపశుపుత్రాదీన్, యజ్ఞభావితాః యజ్ఞైః వర్ధితాః తోషితాః ఇత్యర్థః తైః దేవైః**

**దత్తాన్ భోగాన్ అప్రదాయ అదత్త్వా, ఆనృణ్యమ్ అకృత్వా ఇత్యర్థః. ఏభ్యః దేవేభ్యః, యః, భుంక్తే స్వదేహేన్ద్రియాణ్యేవ తర్పయతి, స్తేనః ఏవ తస్కరః ఏవ, సః దేవాదిస్వాపహారీ. యే పునః.**

**తె.అ.** యజ్ఞంచేత సంతుష్టులయిన దేవతలు మీరు కోరిన స్త్రీపశుపుత్రాది భోగాలను మీకిస్తారు. ఆ దేవతలిచ్చిన భోగాలను వారికివ్వకుండా, అంటే వారి ఋణం తీర్చకుండా తన దేహేంద్రియాలను తృప్తిపరచేవాడు దేవధనాన్ని అపహరించిన దొంగయే. అట్లా కానివారు –

**మూ. యజ్ఞశిష్టాశినః సన్తో ముచ్యన్తే సర్వకిల్బిషైః ।**
**భుఞ్జతే తే త్వఘం పాపా యే పచన్త్యాత్మకారణాత్ ॥ 13**

**తె.అ.** యజ్ఞశేషం భుజించేవారు సత్పురుషులు సర్వపాపములనుండి ముక్తులవుతారు. తమకొరకు మాత్రమే వండుకొని తినేవారు పాపులు, పాపమే అనుభవిస్తారు.

**భాష్యమ్ : 13.1 యజ్ఞేతి :– దేవయజ్ఞాదీన్ నిర్వర్త్య తచ్ఛిష్టమ్ అశనమ్ అమృతాఖ్యమ్ అశితుమ్ శీలం యేషాం తే యజ్ఞశిష్టాశినః సన్తః, ముచ్యన్తే సర్వకిల్బిషైః సర్వపాపైః చుల్ల్యాదిపఞ్చ సూనాకృతైః, ప్రమాదకృతహింసాదిజనితైః చ అన్యైః, యే తు ఆత్మంభరయః భుఞ్జతే, తే తు, అఘం పాపం, స్వయమ్ అపి పాపాః యే, పచన్తి పాకం నిర్వర్తయన్తి ఆత్మకారణాత్ ఆత్మహేతోః**

**తె.అ.** దేవయజ్ఞాదులు నిర్వర్తించి అమృతమైన ఆ యజ్ఞశేషం భుజించేవారు యజ్ఞశిష్టాశినులు. అటువంటి సత్పురుషులు చుల్యాది పంచసూన రూపమైనవి, ప్రమాదవశాత్తు చేసిన హింసలవలన కలిగినవీ ఐన అన్ని పాపాలనుండి ముక్తులవుతారు. తమ పొట్ట నింపుకోవడంకొరకు వండుకునేవారు స్వయంగా పాపులు, పాపమే అనుభవిస్తారు.

**భాష్యమ్ : 14. ఇతశ్చాధికృతేన కర్మ కర్తవ్యం, జగచ్చక్రప్రవృత్తి హేతుర్హి కర్మ, కథమిత్యుచ్యతే–**

**తె.అ.** జగచ్చక్రం తిరుగుతూ ఉండడానికి కారణం కర్మ. ఆ కారణంగా కూడా కర్మలకు అధికారి అయినవాడు కర్మ చేయవలె. ఎట్లా అంటే –

**మూ. అన్నాద్భవన్తి భూతాని పర్జన్యాదన్నసంభవః ।**
**యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః ॥ 14**

**తె.అ.** ప్రాణులు అన్నంనుండి పుడుతున్నారు. అన్నం వర్షం వలన కలుగుతున్నది. వర్షం యజ్ఞం వలన కలుగుతున్నది. యజ్ఞం కర్మనుండి పుడుతున్నది.

**భాష్యమ్ : 14.1 అన్నాద్భవన్తీతి :– అన్నాత్ భుక్తాత్ లోహితరేతఃపరిణతాత్ ప్రత్యక్షం భవన్తి జాయన్తే, భూతాని, పర్జన్యాత్ వృష్టేః అన్నస్య సంభవః అన్నసంభవః. యజ్ఞాత్ భవతి పర్జన్యః.**

**"అగ్నౌప్రాస్తాహుతిః సమ్యగాదిత్యముపతిష్ఠతే - ఆదిత్యాజ్జాయతే వృష్టిః వృష్టేరన్నం తతః ప్రజాః" (మను 3.76) ఇతి స్మృతేః. యజ్ఞః అపూర్వమ్, స చ యజ్ఞః కర్మసముద్భవః, ఋత్విగ్యజమా-నయోశ్చ వ్యాపారః కర్మ, తతః సముద్భవః యస్య యజ్ఞస్య అపూర్వస్య సః యజ్ఞః కర్మ - సముద్భవః.**

**తె.అ.** తిన్న అన్నం రక్తవీర్యాలుగా మారి ప్రాణులు పుట్టడం ప్రత్యక్షమే. వర్షం వలన అన్నం పుడుతున్నది. వర్షం యజ్ఞం వలన కలుగుతున్నది. 'విధి పూర్వకంగా అగ్నియందు ఆహుతి చేసినది సూర్యునియందు నిలుస్తుంది. సూర్యుని వలన వర్షం కలుగుతున్నది, వర్షం వలన అన్నం, దాని నుండి ప్రజ' (మను. 3.7.6) అని స్మృతి. యజ్ఞం అపూర్వం. (ఇక్కడ యజ్ఞం అంటే యజమాని ఋత్విక్కుల కర్మవల్ల కలిగే అపూర్వఫలం అని అర్థం.) ఆ యజ్ఞం కర్మవల్ల కలుగుతున్నది. ఋత్విక్కు యజమానుల వ్యాపారం కర్మ. అటువంటి కర్మనుండి పుట్టు అపూర్వయజ్ఞం కర్మ సముద్భవం.

**భాష్యమ్ : 15.0 తచ్చైవంవిధం కర్మ కుతో జాతమిత్యాహ -**

**తె.అ.** ఈ విధమైన కర్మ ఎక్కడనుండి పుడుతున్నది?

**మూ. కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్ ।**
**తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్ ॥ 15**

**తె.అ.** కర్మ వేదరూప బ్రహ్మమునుండి పుడుతున్నది. వేదం అక్షరంనుండి పుడుతున్నది. కనుక సర్వగతమైన వేదం యజ్ఞమందు నిత్యము నిలిచి ఉంటుంది.

**భాష్యమ్ : 15.1 కర్మేతి :- కర్మ బ్రహోద్భవం బ్రహ్మ వేదః, సః ఉద్భవః కారణం ప్రకాశకః యస్య తత్ కర్మ బ్రహ్మోద్భవం, విద్ధి జానీహి. బ్రహ్మ పునః వేదాఖ్యమ్ అక్షరసముద్భవమ్, అక్షరం బ్రహ్మ పరమాత్మా సముద్భవః యస్య తత్ అక్షరసముద్భవం, బ్రహ్మ వేదః ఇత్యర్థః. యస్మాత్ సాక్షాత్ పరమాత్మాఖ్యాత్ అక్షరాత్ పురుషనిఃశ్వాసవత్ సముద్భూతం బ్రహ్మ తస్మాత్ సర్వార్థ ప్రకాశకత్వాత్ సర్వగతమ్. సర్వగతమ్ అపి సత్ నిత్యం సదా యజ్ఞవిధిప్రధానత్వాత్ యజ్ఞే ప్రతిష్ఠితమ్.**

**తె.అ.** బ్రహ్మమంటే వేదం. కర్మ వేదంనుండి పుడుతున్నది. అంటే కర్మను వేదం ప్రకటిస్తున్నది, అని తెలుసుకో. మరి ఆ వేదరూపమైన బ్రహ్మము అక్షర పరబ్రహ్మంనుండి పుడుతున్నది. సాక్షాత్తు పరమాత్మ అనే అక్షర పురుషుని నిశ్వాసంవలె వెలువడినది కనుక, సర్వార్థప్రకాశకం కనుక, వేదం సర్వగతం. సర్వగతమై కూడా సర్వదా యజ్ఞమందే ప్రతిష్ఠితమై ఉంటుంది, వేదంలో ప్రధానవిషయం యజ్ఞవిధానం కనుక.

**మూ. ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః ।**
**అఘాయురిన్ద్రియారామః మోఘం పార్థ స జీవతి ॥ 16**

**తె.అ.** ఈ విధంగా ప్రవర్తించే చక్రాన్ని అనువర్తించనివాడు ఇంద్రియ లోలుడైన పాపజీవనుడు. అటువంటివాడు జీవించడం వ్యర్థం.

**భాష్యమ్ : 16.1 ఏవమితి :- ఏవమ్ ఇత్థమ్ ఈశ్వరేణ వేదయజ్ఞపూర్వకం జగచ్చక్రం ప్రవర్తితం నానువర్తయతి, ఇహ లోకే, యః కర్మణ్యధికృతః సన్, అఘాయుః అఘం పాపమ్ ఆయుః జీవనం యస్య సః అఘాయుః, పాపజీవనః ఇతి యావత్ ఇన్ద్రియారామః ఇన్ద్రియైః ఆరామః ఆరమణమ్ ఆక్రీడా విషయేషు యస్య సః ఇన్ద్రియారామః మోఘం వృథా, హే పార్థ సః జీవతి.**

**తె.అ.** ఈ విధంగా ఈశ్వరునిచేత ప్రవర్తితమైన వేదయజ్ఞపూర్వకమైన జగచ్చక్రమును కర్మలయందు అధికారము గలవాడు అనుసరించి ఈ లోకంలో ఎవడు ప్రవర్తించడో వాడు ఇంద్రియ విషయలోలుడు, పాపజీవనుడు. వాడు జీవించడం వృథా.

**భాష్యమ్ : 16.2 తస్మాత్ అజ్ఞేన అధికృతేన కర్తవ్యమేవ కర్మేతి ప్రకరణార్థః (3.4-16) ప్రాక్ ఆత్మజ్ఞాననిష్ఠాయోగ్యతాప్రాప్తేస్తాదర్థ్యేన కర్మయోగానుష్ఠానమధికృతేన అనాత్మజ్ఞేన కర్తవ్యమిత్యేతత్ 'న కర్మణామనారంభా' దిత్యతఆరభ్య 'శరీరయాత్రాఽపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః' (3.8) ఇత్యేవ-మంతేన ప్రతిపాద్య 'యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర' (3.9) ఇత్యాదినా 'మోఘం పార్థ స జీవతి' (3.16) ఇత్యేవమంతేన గ్రంథేన ప్రాసంగికమధికృతస్యానాత్మవిదః కర్మానుష్ఠానే బహు కారణముక్తం తదకరణే చ దోషసంకీర్తనం కృతమ్.**

**తె.అ.** కనుక కర్మలయందు అధికారంగల అజ్ఞాని కర్మ చేయవలసినదే అని ప్రకరణార్థం. (3.4-16) ఆత్మజ్ఞాన నిష్ఠ ప్రాప్తించకపూర్వం దానికొరకు ఆత్మజ్ఞానికాని అధికారికి కర్తవ్యమేనని 'న కర్మణామనారంభాత్'(3.4) అనే శ్లోకం నుండి 'శరీరయాత్రాపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః' (3.8) వరకు ప్రతిపాదించి, 'యజ్ఞార్థాత్ కర్మణోఽన్యత్ర' (3.9) నుండి 'మోఘం పార్థ స జీవతి'(3.16) వరకు ఆత్మవేత్త కాని కర్మాధికారికి కర్మానుష్ఠానకారణాలనేకం ప్రాసంగికంగా చెప్పాడు. కర్మచేయకపోవడం వలన దోషం కూడా స్పష్టం చేశాడు.

**భాష్యమ్ : 17.0 ఏవం స్థితే కిమ్ ఏవం ప్రవర్తితం చక్రం సర్వేణ అనువర్తనీయమ్? ఆహోస్విత్ పూర్వోక్త కర్మయోగానుష్ఠానోపాయప్రాప్యామ్, అనాత్మవిదా, జ్ఞానయోగేనైవ నిష్ఠామ్, ఆత్మవిద్భిః సాంఖ్యైః అనుష్ఠేయామ్ అప్రాప్తేన ఏవ? ఇత్యేవమర్థమ్ అర్జునస్య ప్రశ్నమ్ ఆశంక్య, స్వయమేవ వా శాస్త్రార్థస్య వివేకప్రతిపత్త్యర్థమ్ 'ఏతం వై తమాత్మానం విదిత్వా నివృత్తమిథ్యాజ్ఞానాః సన్తః బ్రాహ్మణాః మిథ్యాజ్ఞానవద్భిః అవశ్యం కర్తవ్యేభ్యః పుత్రైషణాదిభ్యో వ్యుత్థాయ అథ భిక్షాచర్యం**

**శరీరస్థితిమాత్రప్రయుక్తం చరన్తి, న తేషామ్ ఆత్మజ్ఞాననిష్ఠావ్యతిరేకేణ అన్యత్ కార్యమ్ అస్తి, ఇత్యేవం శ్రుత్యర్థమ్ ఇహ గీతాశాస్త్రే ప్రతిపిపాదయిషితమ్ ఆవిష్కుర్వన్ ఆహ భగవాన్ –**

**తె.అ.** ఈ సందర్భంలో ఒక సందేహం కలగవచ్చు. ఈ విధంగా ప్రవర్తితమైన చక్రాన్ని అందరూ అనుసరించవలసిందేనా? లేక, వెనుకచెప్పిన కర్మయోగానుష్ఠానం వలన పొందదగి ఆత్మవేత్తలైన జ్ఞానులచేత మాత్రమే అనుష్ఠించదగిన జ్ఞాననిష్ఠ ప్రాప్తించని అనాత్మవేత్తలు మాత్రమేనా? అని అర్జునుడు ప్రశ్నించవచ్చునని, శాస్త్రం సరిగా అర్థం కావడంకోసం భగవానుడు స్వయంగా వివరిస్తున్నాడు గీతలో ప్రతిపాదించదలచిన శ్రుత్యర్థాన్ని – 'ఈ ఆత్మను తెలిసికొని మిథ్యాజ్ఞానం తొలగిన సద్బ్రాహ్మణులు మిథ్యాజ్ఞానం తొలగనివారు పుత్రాదులయందు కోర్కెలుగలవారు చేయదగిన కర్మలు వదలి, కేవలం శరీరం నిలవడానికి మాత్రమే భిక్షాటనం చేస్తారు.' (బృ.ఉ.3.5.1 అర్థానువాదమాత్రం) అని.

**మూ. యస్త్వాత్మరతిరేవ స్యాదాత్మతృప్తశ్చ మానవః ।**
**ఆత్మన్యేవ చ సంతుష్టస్తస్య కార్యం న విద్యతే ॥ 17**

**తె.అ.** ఆత్మయందు రమించేవాడు, ఆత్మతో తృప్తి పడేవాడు, ఆత్మయందు సంతోషించేవాడు చేయదగిన కార్యమేదీ లేదు.

**భాష్యమ్ : 17.1 యస్తు ఇతి :– యస్తు సాంఖ్యః ఆత్మజ్ఞాననిష్ఠః ఆత్మరతిః ఆత్మన్యేవ రతిః న విషయేషు యస్య సః ఆత్మరతిః ఏవ స్యాత్ భవేత్, ఆత్మతృప్తః చ ఆత్మనైవ తృప్తః న అన్నరసాదినా, సః మానవః మనుష్యః సంన్యాసీ, ఆత్మని ఏవ చ సంతుష్టః, సంతోషః హి బాహ్యార్థలాభే సర్వస్వ భవతి, తమ్ అనపేక్ష్య ఆత్మని ఏవ చ సంతుష్టః. సంతోషః హి బాహ్యార్థలాభే సర్వస్య భవతి, తమ్ అనపేక్ష్య ఆత్మని ఏవ చ సంతుష్టః, సర్వతః వీతతృష్ణః ఇత్యేతత్. యః ఈదృశః ఆత్మవిత్ తస్య కార్యం కరణీయం న విద్యతే, నాస్తి ఇత్యర్థః. కించ –**

**తె.అ.** విషయాలయందు కాక ఆత్మయందే రమించేవాడు ఆత్మరతుడు, ఆత్మజ్ఞాననిష్ఠకలిగిన సాంఖ్యుడు. అన్నరసాదుల చేతగాక ఆత్మచేతనే తృప్తిచెందువాడు ఆత్మతృప్తుడు. అటువంటి మానవుడు ఆత్మయందే సంతోషిస్తాడు. అందరూ బాహ్యార్థలాభం కలిగినపుడు మాత్రమే సంతోషిస్తారు. అటువంటి లాభంతో పనిలేక ఆత్మయందే సంతోషించేవాడు సంన్యాసి అన్నిటా కోర్కెలు విడిచినవాడు. ఈ విధమైన ఆత్మవేత్తకు చేయదగినదేదీ లేదు. ఎందుకంటే –

**మూ. నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన ।**
**న చాస్య సర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః ॥ 18**

**తె.అ.** అతనికి కర్మచేయడం వలనగాని, మానడంవలనగాని ఏ ప్రయోజనమూ లేదు. ఎవ్వరినీ ఆశ్రయించి సాధించదగిన ప్రయోజనమూ లేదు.

**భాష్యమ్ : 18.1 నైవేతి :- నైవ తస్య పరమాత్మరతేః కృతేన కర్మణా అర్థః ప్రయోజనమ్ అస్తి. అస్తు తర్హి అకృతేన అకరణేన ప్రత్యవాయాఖ్యః అనర్థః? న అకృతేన ఇహ లోకే కశ్చన కశ్చిదపి ప్రత్యవాయప్రాప్తిరూపః ఆత్మహానిలక్షణో వా నైవాస్తి. న చ అస్య సర్వభూతేషు బ్రహ్మాదిస్థావరాన్తేషు భూతేషు కశ్చిత్ అర్థవ్యపాశ్రయః, ప్రయోజననిమిత్తక్రియాసాధ్యః, వ్యపాశ్రయః వ్యపాశ్రయణమ్. కంచిద్ భూతవిశేషమ్ ఆశ్రిత్య న సాధ్యః కశ్చిత్ అర్థః అస్తి, యేన తదర్థా క్రియా అనుష్ఠేయా స్యాత్.**

**తె.అ.** అ పరమాత్మరతునికి కర్మ చేయడంవలన ఏ ప్రయోజనమూ లేదు. చేయకపోవడం వలన పాపం అనర్థం కలుగుతుందా? ఈ లోకంలో ఆత్మహానిలక్షణమైన పాపం కలగదు. ఇతడు సర్వభూతములయందు బ్రహ్మ మొదలుకుని బండవరకు దేనినీ ఆశ్రయించవలసిన పనిలేదు. సాధించదలచిన ప్రయోజనమేదీ లేనపుడు దానికొరకు చేయదగిన క్రియకూడా ఉండదు.

**భాష్యమ్ : 18.2 న త్వమేతస్మిన్ సర్వతః సంప్లుతోదకస్థానీయే సమ్యగ్దర్శనే వర్తసే. యత ఏవం -**

**తె.అ.** నీవు మాత్రం అంతటా నిండిఉన్న జలాశయం వంటి (2.46) సమ్యగ్దర్శనమనే పైన చెప్పిన స్థితిని చేరుకోలేదు. కనుక -

**మూ. తస్మాదసక్తః సతతం కార్యం కర్మ సమాచర ।**
**అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః ॥ 19**

**తె.అ.** కనుక చేయవలసిన కర్మను ఆసక్తి లేకుండా ఎప్పుడూ చేస్తూ ఉండు. ఆసక్తి లేకుండా కర్మను ఆచరించడం వలన పురుషుడు మోక్షం పొందుతాడు.

**భాష్యమ్ : 19.1 తస్మాదితి :- తస్మాత్ అసక్తః సంగవర్జితః, సతతం సర్వదా, కార్యం కర్తవ్యం నిత్యం, కర్మ, సమాచర నిర్వర్తయ. అసక్తః హి యస్మాత్ సమాచరన్ ఈశ్వరార్థం కర్మ కుర్వన్ పరం మోక్షమ్ ఆప్నోతి పూరుషః, సత్త్వశుద్ధిద్వారేణ ఇత్యర్థః, యస్మాచ్చ-**

**తె.అ.** కనుక అసక్తుడవై, అంటే ఆసక్తి విడిచి, ఎప్పుడూ చేయదగిన నిత్యకర్మ నిర్వర్తించు. అసక్తుడవై ఈశ్వరార్థం కర్మచేస్తూ సత్త్వశుద్ధిద్వారా పురుషుడు మోక్షం పొందుతాడు అని అర్థం. మరో కారణం కూడా ఉంది.

**మూ. కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయః ।**
**లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి ॥ 20**

**తె.అ.** జనకుడు మొదలైనవారు నిష్కామ కర్మలవల్లనే మోక్షం పొందారు. లోకకల్యాణం కొరకైనా నీవు కర్మలాచరించదగును.

**భాష్యమ్ : 20.1 కర్మణైవేతి :– కర్మణైవ హి యస్మాత్ పూర్వే క్షత్రియాః విద్వాంసః, సంసిద్ధిం మోక్షం, గన్తుమ్, ఆస్థితాః ప్రవృత్తాః. కే? జనకాదయః జనకాశ్వపతిప్రభృతయః యది తే ప్రాప్తసమ్యగ్దర్శనాః, తత్ లోకసంగ్రహార్థం ప్రారబ్ధకర్మత్వాత్ కర్మణా సహైవ, అసంన్యస్యైవ కర్మ, సంసిద్ధిమ్ ఆస్థితాః ఇత్యర్థః, అథ అప్రాప్తసమ్యగ్ దర్శనాః జనకాదయః తదా కర్మణా, సత్త్వసంశుద్ధి సాధనభూతేన క్రమేణ సంసిద్ధిమ్ ఆస్థితాః ఇతి వ్యాఖ్యేయః శ్లోకః.**

**తె.అ.** విద్వాంసులైన క్షత్రియులు పూర్వం కర్మలవల్లనే మోక్షసాధన చేశారు. ఎవరు వారు? జనకుడు అశ్వపతి మొదలైనవారు. వారు సమ్యగ్దర్శనం పొందినవారు అని అనుకుంటే, లోకకల్యాణం కొరకు ప్రారంభించిన కర్మలు, వాటివలన సమ్యగ్దర్శనం కలిగిన తరువాత కూడా, మానక కర్మలు కొనసాగిస్తూనే మోక్షం పొందారు అని అర్థం చెప్పుకోవలె. లేక, జనకాదులు సమ్యగ్దర్శనం పొందినవారు కారు అనుకుంటే, అపుడు వారు సత్త్వశుద్ధికొరకు కర్మలాచరించి క్రమంగా మోక్షం పొందారు అని శ్లోకాన్ని వ్యాఖ్యానించవలెను.

**భాష్యమ్ : 20.2 అథ మన్యసే పూర్వైః అపి జనకాదిభిః అపి అజానద్భిః ఏవ కర్తవ్యం కర్మ కృతం, తావతా న అవశ్యమ్ అన్యేన కర్తవ్యం సమగ్దర్శనవతా కృతార్థేన ఇతి? తథాపి ప్రారబ్ధకర్మాయత్తః త్వం లోకసంగ్రహమ్ ఏవ అపి, లోకస్య ఉన్మార్గప్రవృత్తినివారణం లోకసంగ్రహః, తమ్ ఏవ అపి ప్రయోజనం సంపశ్యన్ కర్తుమ్ అర్హసి.**

**తె.అ.** పూర్వం కూడా అజ్ఞానులైనవారే కర్తవ్యమైన కర్మ చేశారు. కనుక సమ్యగ్దర్శనం కలవారు కృతార్థులు అట్లా చేయవలసిన పనిలేదు అని నీవు అనుకోవచ్చు. అప్పుడు కూడా నీవు ప్రారబ్ధవశాత్తు చేయవలసిన కర్మ లోకసంగ్రహం కొరకైనా చేయదగును. తప్పుత్రోవను పోవలెననే ప్రవృత్తిని నివారించడమే లోకసంగ్రహం. ఆ ప్రయోజనం చూసి అయినా నీవు కర్మనాచరించు.

**భాష్యమ్ : 21.1 లోకసంగ్రహః కిమర్థం కర్తవ్య ఇత్యుచ్యతే –**

**తె.అ.** లోకసంగ్రహం ఎందుకు చేయవలె? చెప్పబడుతున్నది.

**మూ. యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః ।**
**స యత్ ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే ॥ 21**

**తె.అ.** శ్రేష్ఠుడు ఏది ఆచరిస్తాడో ఇతరులు దానినే అనుసరిస్తారు. అతడు ఆచరించేదే లోకానికి ప్రమాణం. దానినే లోకం అనుసరిస్తుంది.

**భాష్యమ్ : 21.1 యద్యదితి :- యద్యత్ కర్మ ఆచరతి కరోతి శ్రేష్ఠః ప్రధానః తత్తదేవ కర్మ ఆచరతి, ఇతరః అన్యః జనః తదనుగతః. కిం చ సః శ్రేష్ఠః, యత్ ప్రమాణం కురుతే, లౌకికం వైదికం వా, లోకః తత్ అనువర్తతే తదేవ ప్రమాణీకరోతీత్యర్థః.**

**తె.అ.** శ్రేష్ఠుడు, ప్రముఖుడు ఏ ఏ కర్మ ఆచరిస్తాడో ఇతరులు అదే కర్మ అనుసరించి ఆచరిస్తారు. అతడు లౌకికంగానీ, వైదికంగానీ, ఏ ప్రమాణం నిలుపుతాడో లోకం దానినే ప్రామాణికంగా గ్రహిస్తుంది.

**భాష్యమ్ : 22.0 యది అత్ర లోకసంగ్రహకర్తవ్యతాయాం తే విప్రతిపత్తిః, తర్హి మాం కిం న పశ్యసి?**

**తె.అ.** లోకసంగ్రహం చేయవలసిన కర్తవ్యం నాకులేదు అని నీవు అనేటట్లయితే నన్ను చూడరాదా?

**మూ. న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన ।**
**నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి ॥ 22**

**తె.అ.** అర్జునా! మూడులోకాలలో కూడా నాకు కర్తవ్యమేదీ లేదు. నేను పొందనిదిగానీ, పొందదగినదిగాని లేదు. అయినా నేను కర్మలు ఆచరిస్తూనే ఉన్నాను.

**భాష్యమ్ : 22.1 న ఇతి :- మే మమ, పార్థ, నాస్తి న విద్యతే కర్తవ్యం త్రిషు అపి లోకేషు, కించన కించిదపి. కస్మాత్? న, అనవాప్తమ్ అప్రాప్తమ్, అవాప్తవ్యం ప్రాపణీయం, తథాపి వర్తే ఏవ చ కర్మణి అహమ్ –**

**తె.అ.** అర్జునా, మూడు లోకాలలో కూడా నాకు కర్తవ్యమేదీ లేదు. ఎందుకని? పొందనిది పొందదగినది ఏదీ లేదు. అయినా నేను కర్మలు ఆచరిస్తూనే ఉన్నాను.

**మూ. యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతన్ద్రితః ।**
**మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః ॥ 23**

**తె.అ.** ఎప్పుడు గాని నేను అలసిపోకుండా, కర్మలు ఆచరిస్తూ ఉండకపోతే మనుష్యులు సర్వవిధాలా నా మార్గాన్నే అనుసరిస్తారు.

**భాష్యమ్ : 23.1 యది ఇతి. యది పునః న వర్తేయ, జాతు కదాచిత్, కర్మణి, అతన్ద్రితః అనలసః సన్, మమ, శ్రేష్ఠస్య సతః, వర్త్మ మార్గమ్, అనువర్తన్తే, మనుష్యాః హే పార్థ సర్వశః సర్వప్రకారైః.**

**తె.అ.** ఎప్పుడుగాని నేను అలసిపోవడం అనేది లేకుండా కర్మలాచరిస్తూ ఉండకపోతే శ్రేష్ఠుడనైన నా మార్గాన్ని అన్నివిధాలా మనుష్యులు అనుసరిస్తారు.

**భాష్యమ్ : 24.0 తథా చ కో దోష ఇత్యత్రాహ –**

**తె.అ.** అనుసరిస్తే ఏమిటి దోషం? అంటే, చెపుతున్నాడు –

**మూ. ఉత్సీదేయురిమే లోకా న కుర్యాం కర్మ చేదహమ్ ।**
**సంకరస్య చ కర్తా స్యాముపహన్యామిమాః ప్రజాః ॥ 24**

**తె.అ.** నేను కర్మనాచరించకపోతే ఈ లోకాలు నశిస్తాయి. నేను సంకరం చేసినవాణ్ణవుతాను. ఈ ప్రజలను నాశనం చేసినవాణ్ణి అవుతాను.

**భాష్యమ్ : 24.1 ఉత్సీదేయురితి. ఉత్సీదేయుః వినశ్యేయుః, ఇమే సర్వే లోకాః, లోకస్థితినిమిత్తస్య కర్మణః అభావాత్, న కుర్యాం కర్మ చేత్ అహమ్. కిం చ సంకరస్య చ కర్తా స్యామ్. తేన కారణేన ఉపహన్యామ్ ఇమాః, ప్రజాః. ప్రజానామ్ అనుగ్రహాయ ప్రవృత్తః. తత్ ఉపహతిమ్ ఉపహననం, కుర్యామ్ ఇత్యర్థః. మమ ఈశ్వరస్య అననురూపమ్ ఆపద్యేత.**

**తె.అ.** నేను కర్మ చేయకపోతే ఈ లోకాలన్నీ, లోకం నిలవడానికి చేయవలసిన కర్మ చేయకపోవడంవలన నశిస్తాయి. అంతేకాక సంకరంచేసినవాణ్ణి అవుతాను. ఆ కారణంగా ఈ ప్రజలను నాశనం చేసినవాణ్ణి అవుతాను. ప్రజలను అనుగ్రహించవలసిన నేను వారిని హతం చేసినవాణ్ణి అవుతాను. అది ఈశ్వరుడనైన నేను చేయదగినది కాదు.

**భాష్యమ్ : 25.0 యది పునః అహమివ త్వం కృతార్థబుద్ధిః ఆత్మవిత్ అన్యో వా, తస్యాపి ఆత్మనః కర్తవ్యాభావేఽపి పరానుగ్రహః ఏవ కర్తవ్యః ఇతి –**

**తె.అ.** నీవు కానీ మరొకడుకాని నా వలె కృతార్థుడనని అనుకున్నా, అతనికి తనకొరకు కర్తవ్యమేదీ లేకపోయినప్పటికి ఇతరులను అనుగ్రహించడంకొరకు కర్మ చేయవలె –

**మూ. సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత ।**
**కుర్యాద్విద్వాంస్తథాఽసక్తశ్చికీర్షుర్లోకసంగ్రహమ్ ॥ 25**

**తె.అ.** అజ్ఞాని ఆసక్తితో కర్మలాచరించినట్లే; జ్ఞాని అసక్తుడై లోకోపకార నిమిత్తం కర్మలాచరించవలెను.

**భాష్యమ్ : 25.1 సక్తాః ఇతి: – సక్తాః, కర్మణి "అస్య కర్మఫలం మమ భవిష్యతి" ఇతి కేచిత్ అవిద్వాంసః యథా కుర్వన్తి, భారత, కుర్యాత్, విద్వాన్ ఆత్మవిత్, తథా, అసక్తః సన్. తద్వత్ కిమర్థం కరోతి. తత్ శృణు. చికీర్షుః కర్తుమ్ ఇచ్ఛుః, లోకసంగ్రహమ్.**

**తె.అ.** ఈ కర్మ చేస్తే నాకీ ఫలం కలుగుతుంది అని ఫలాపేక్షతో అజ్ఞానులు కర్మలాచరించినట్లే; ఆత్మవేత్త అయిన జ్ఞాని అసక్తుడై ఆచరించవలె. అట్లా ఎందుకు చేయవలె? అంటే, విను – లోకసంగ్రహం చేసే కోరికతో.

**భాష్యమ్ : 26.0 ఏవం లోకసంగ్రహం చికీర్షోః న మమ ఆత్మవిదః కర్తవ్యమ్ అస్తి, అన్యస్య వా లోకసంగ్రహం ముక్త్వా. తతః తస్య ఆత్మవిదః ఇదమ్ ఉపదిశ్యతే–**

**తె.అ.** లోకానికి మేలు చేయగోరే ఆత్మవేత్తకు, నాకుగాని, మరొకరికిగాని, లోకసంగ్రహం తప్ప కర్తవ్యమేదీ లేదు. అటువంటి ఆత్మవేత్తకు ఈ ఉపదేశం –

**మూ. న బుద్ధిభేదం జనయేదజ్ఞానాం కర్మసంగినామ్ ।**
**జోషయేత్సర్వకర్మాణి విద్వాన్ యుక్తః సమాచరన్ ॥ 26**

**తె.అ.** కర్మలయందు ఆసక్తికలిగిన అజ్ఞానుల బుద్ధిని చలింపజేయరాదు. విద్వాంసుడు అన్ని కర్మలను శ్రద్ధతో ఆచరించి, ఇతరులచేత ఆచరింపజేయాలి.

**భాష్యమ్ : 26.1 నేతి :– బుద్ధేః భేదః బుద్ధిభేదః, 'మయా ఇదం కర్తవ్యమ్, భోక్తవ్యం చ అస్య కర్మణః ఫలమ్' ఇతి నిశ్చితరూపాయాః బుద్ధేః భేదనం చాలనం బుద్ధిభేదః తం న జనయేత్, న ఉత్పాదయేత్, అజ్ఞానామ్ అవివేకినామ్, కర్మసంగినాం కర్మణి ఆసక్తానాం ఆసంగవతామ్. కిం ను కుర్యాత్? జోషయేత్ కారయేత్, సర్వకర్మాణి విద్వాన్ స్వయం తదేవ అవిదుషాం కర్మ, యుక్తః అభియుక్తః, సమాచరన్.**

**తె.అ.** 'ఇది నా కర్తవ్యము, ఈ కర్మ ఫలం నేను అనుభవించవలె' అనే నిశ్చయరూపమైన బుద్ధి చలించడమే బుద్ధి భేదం. ఫలాపేక్షతో కర్మలాచరించే అవివేకులకు అటువంటి బుద్ధి భేదం కలిగించరాదు. అయితే ఏం చెయ్యవలె? స్వయంగా శ్రద్ధతో కర్మలాచరిస్తూ వారిచేత చేయించవలెను.

**భాష్యమ్ : 27.0 అవిద్వాన్కథం అజ్ఞః కర్మసు సజ్జత ఇత్యాహ –**

**తె.అ.** అవిద్వాంసుడు అయిన అజ్ఞాని కర్మలయందు ఎట్లా తగులుకుంటున్నాడు? చెపుతున్నాడు–

**మూ. ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః ।**
**అహంకారవిమూఢాత్మా కర్తాఽహమితి మన్యతే ॥ 27**

**తె.అ.** కర్మలన్నీ ప్రకృతిగుణాలచేత చేయబడుతున్నాయి. అహంకారంచేత మూఢుడైనవాడు తనే చేస్తున్నాను అని అనుకుంటాడు.

**భాష్యమ్ : 27.1 ప్రకృతేః ఇతి :– ప్రకృతిః ప్రధానం సత్త్వరజస్తమసాం గుణానాం సామ్యావస్థా, తస్యాః ప్రకృతేః గుణైః వికారైః కార్యకరణరూపైః క్రియమాణాని కర్మాణి, లౌకికాని శాస్త్రీయాణి చ, సర్వశః సర్వప్రకారైః అహంకారవిమూఢాత్మా, కార్యకరణసంఘాతాత్మప్రత్యయః అహంకారః తేన వివిధం నానావిధం, మూఢః ఆత్మా అన్తఃకరణం యస్య సః అయం కార్యకరణధర్మా, కార్యకరణాభి–మానీ, అవిద్యయా కర్మాణి ఆత్మని మన్యమానః, తత్తత్కర్మణామ్ అహం కర్తా ఇతి మన్యతే.**

**తె.అ.** ప్రకృతి అంటే ప్రధానం, సత్త్వరజస్తమోగుణాల సమస్థితి. ఈ ప్రకృతిగుణాలు కార్యకరణ రూపంగా మారుతాయి. ఇవే లౌకిక శాస్త్రీయ కర్మలన్నీ అన్ని విధాలుగా చేస్తాయి. కార్యకరణ సమూహమే నేను అనుకోవడం అహంకారం. ఆ అహంకారంచేత అంతఃకరణం అనేక విధాలుగా మోహం చెందినవాడు అహంకార విమూఢాత్ముడు. అటువంటి మూఢుడు అవిద్యవలన కార్యకరణములు నేను అనుకునేవాడు ఆ యా కర్మలు నేను చేస్తున్నాను, అంటే ఆత్మ కర్త, అని అనుకుంటాడు.

**భాష్యమ్ : 28.0 యః పునర్విద్వాన్ –**

**తె.అ.** మరి విద్వాంసుడు –

**మూ. తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మవిభాగయోః ।**
**గుణా గుణేషు వర్తన్తే ఇతి మత్వా న సజ్జతే ॥ 28**

**తె.అ.** ఓ మహాబాహూ! గుణకర్మ విభాగం యొక్క తత్త్వం తెలిసినవాడు గుణాలు గుణాలయందు ప్రవర్తిస్తున్నాయి అని వాటియందు ఆసక్తి చూపడు.

**భాష్యమ్ : 28.1 తత్త్వవిదితి :– తత్త్వవిత్ తు, మహాబాహో, కస్య తత్త్వవిత్? గుణకర్మవిభాగయోః గుణవిభాగస్య కర్మవిభాగస్య చ తత్త్వవిదిత్యర్థః. గుణాః కరణాత్మకాః, గుణేషు విషయాత్మకేషు వర్తన్తే. న ఆత్మా ఇతి మత్వా, న సజ్జతే సక్తిం న కరోతి.**

**తె.అ.** గుణవిభాగ కర్మవిభాగతత్త్వం తెలిసినవాడు గుణవిభాగం, కర్మవిభాగం యొక్క తత్త్వం తెలిసినవాడు. ఇంద్రియరూపాలైన గుణాలు విషయరూపాలైన గుణాలయందు ప్రవర్తిస్తున్నాయి. కాని ఆత్మ ప్రవర్తించడం లేదు.

**మూ. ప్రకృతేర్గుణసంమూఢాః సజ్జన్తే గుణకర్మసు ।**
**తానకృత్స్నవిదో మన్దాన్ కృత్స్నవిన్న విచాలయేత్ ॥ 29**

**తె.అ.** ప్రకృతిగుణాలచేత సమ్మోహితులైనవారు గుణకర్మలయందు ఆసక్తులవుతారు, సర్వము తెలిసినవాడు అలాంటి మందబుద్ధులను చలింపజేయకూడదు.

**భాష్యమ్ : 29.1 ప్రకృతేరితి :– ప్రకృతేః గుణైః సమ్యక్ మూఢాః మోహితాః సన్తః సజ్జన్తే. గుణానాం కర్మసు, వయం కర్మ కుర్మః ఫలాయ ఇతి. తాన్ కర్మసంగినః, అకృత్స్నవిదః కర్మఫలమాత్రదర్శినః. మన్దాన్ మన్దప్రజ్ఞాన్, కృత్స్నవిత్ ఆత్మవిత్ స్వయం, న విచాలయేత్, బుద్ధిభేదకరణమేవ చాలనం, తత్ న కుర్యాత్ ఇత్యర్థః.**

**తె.అ.** ప్రకృతియొక్క గుణాలచేత మిక్కిలి మోహింపబడినవారైన 'ఫలంకోసం కర్మ చేస్తున్నాం' అనే తలపుతో గుణాల కర్మలయందు సక్తులవుతారో, అట్టి కర్మాసక్తులైన, కర్మఫలమును మాత్రమే చూచేవారైన మందబుద్ధులను ఆత్మవేత్తయై ఉన్నవాడు, చలింపచేయకూడదు. బుద్ధి భేదం కలిగించడమే చలింపచేయడం. అట్లా చేయకూడదు.

**భాష్యమ్ : 30.0 కథం పునః కర్మణ్యధికృతేనాజ్ఞేన ముముక్షుణా కర్మ కర్తవ్యమితి, ఉచ్యతే–**

**తె.అ.** మరి కర్మలయందు అధికారం కలవాడు, అజ్ఞాని, మోక్షం కోరుకునేవాడు కర్మ ఏ విధంగా చెయ్యవలె? అంటే –

**మూ. మయి సర్వాణి కర్మాణి సంన్యస్యాధ్యాత్మచేతసా ।**
**నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః ॥ 30**

**తె.అ.** కర్మలన్నీ అధ్యాత్మబుద్ధితో నాకే సమర్పించి, ఆశ మమకారం వదలుకొని నిశ్చింతగా శోకరహితుడవై యుద్ధం చెయ్యి.

**భాష్యమ్ : 30.1 మయీతి :– మయి వాసుదేవే పరమేశ్వరే సర్వజ్ఞే సర్వాత్మని, సర్వాణి కర్మాణి, సంన్యస్య నిక్షిప్య, అధ్యాత్మచేతసా వివేకబుద్ధ్యా, 'అహం కర్తా ఈశ్వరాయ భృత్యవత్ కరోమి' ఇత్యనయా బుద్ధ్యా, కిం చ, నిరాశీః, త్యక్తాశీః నిర్మమః మమభావః చ నిర్గతః యస్య తవ సః త్వం నిర్మమః భూత్వా, యుధ్యస్వ, విగతజ్వరః విగతసంతాపః, విగతశోకః సన్ ఇత్యర్థః.**

**తె.అ.** వాసుదేవుడు, పరమేశ్వరుడు, సర్వజ్ఞుడు, సర్వాత్మ అయిన నాయందు అన్ని కర్మలు 'ప్రభుసేవ చేయు భృత్యునివలె ఈశ్వరార్పణముగా కర్మ చేయుచున్నాను' అను వివేకబుద్ధితో సమర్పించి ఆశను విడిచి, నాది అను బుద్ధిని వదలి సంతాపరహితుడవై నిశ్చింతగా యుద్ధం చెయ్యి.

**భాష్యమ్ : 31.0 యదేతత్ మమ మతం 'కర్మ కర్తవ్యమి' తి సప్రమాణముక్తం తత్తథా-**

**తె.అ.** కర్మ కర్తవ్యమని సప్రమాణంగా నేను చెప్పినది యథార్థము.

**మూ. యే మే మతమిదం నిత్యమనుతిష్ఠన్తి మానవాః ।**
**శ్రద్ధావన్తోఽనసూయన్తో ముచ్యన్తే తేఽపి కర్మభిః ॥ 31**

**తె.అ.** ఈ నా మతాన్ని అసూయలేకుండా శ్రద్ధతో నిత్యము అనుసరించేవారు కూడా కర్మలనుండి ముక్తులవుతారు.

**భాష్యమ్ : 31.1 యే ఇతి :- యే, మే మదీయమ్ ఇదం మతమ్, నిత్యం అనుతిష్ఠన్తి అనువర్తన్తే, మానవాః మనుష్యాః, శ్రద్ధావన్తః శ్రద్ధధానాః, అనసూయన్తః అసూయాం మయి పరమ గురౌ వాసుదేవే అకుర్వన్తః, ముచ్యన్తే, తే అపి ఏవంభూతాః కర్మభిః ధర్మాధర్మాఖ్యైః.**

**తె.అ.** పరమగురువును వాసుదేవుడను అయిన నాయందు అసూయలేక శ్రద్ధతో ఈ నా మతం నిత్యము అనుసరించి ప్రవర్తించేవారు కూడా పుణ్యపాపకర్మలనుండి ముక్తులవుతారు.

**మూ. యే త్వేతదభ్యసూయన్తః నానుతిష్ఠన్తి మే మతమ్ ।**
**సర్వజ్ఞానవిమూఢాంస్తాన్ విద్ధి నష్టానచేతసః ॥ 32**

**తె.అ.** నా మతాన్ని నిందించేవారు, అనుసరించి ప్రవర్తించనివారు, ఏ జ్ఞానము లేని మూఢులు, వారి అవివేకంవల్ల వారు నశిస్తారని తెలుసుకో.

**భాష్యమ్ : 32.1 యే త్వితి :- యే తు తద్విపరీతాః, ఏతత్ మే మమ మతమ్ అభ్యసూయన్తః, నిందంతః న అనుతిష్ఠన్తి నానువర్తన్తే మే మతం, సర్వేషు జ్ఞానేషు వివిధం మూఢాః తే సర్వజ్ఞానవిమూఢాః, తాన్, విద్ధి, జానీహి నష్టాన్ నాశం గతాన్, అచేతసః అవివేకినః**

**తె.అ.** పై శ్లోకంలో చెప్పినవారికి విపరీతమైనవారు, నా మతాన్ని నిందించేవారు, అనువర్తించనివారు అన్ని విధాలుగా సమ్మోహం చెందినవారు. అవివేకంవల్ల నష్టమైనవారు అని తెలుసుకో.

**భాష్యమ్ : 33.0 కస్మాత్ పునః కారణాత్ త్వదీయం మతం న అనుతిష్ఠన్తి పరధర్మాన్ అనుతిష్ఠన్తి? స్వధర్మం చ న అనువర్తన్తే? త్వత్ప్రతికూలాః కథం న బిభ్యతి త్వచ్ఛాసనాతిక్రమదోషాత్? తత్రాహ-**

**తె.అ.** మరి ఏ కారణంచేత వారు నీ మతం అనుసరించక స్వధర్మాచరణం మాని పరధర్మాన్ని అనుష్ఠిస్తున్నారు? నీ శాసనం అతిక్రమించడమనే దోషం చేయడానికి వారు ఎందుకు భయపడరు? అంటే చెపుతున్నాడు –

**మూ. సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేః జ్ఞానవానపి ।**
**ప్రకృతిం యాన్తి భూతాని నిగ్రహః కిం కరిష్యతి ॥ 33**

**తె.అ.** జ్ఞానం కలవాడు కూడా తన స్వభావాన్ని అనుసరించి ప్రవర్తిస్తాడు. ప్రాణులు తమ తమ స్వభావాన్నే అనుసరిస్తాయి. నిగ్రహం ఏం చేస్తుంది?

**భాష్యమ్ : 33.1 సదృశమితి :– సదృశమ్ అనురూపమ్ చేష్టతే, చేష్టతాం కరోతి. కస్యాః స్వస్యాః స్వకీయాయాః ప్రకృతేః. ప్రకృతిః నామ పూర్వకృతధర్మాఽధర్మాది సంస్కారాః వర్తమానజన్మాదౌ అభివ్యక్తాః, సా ప్రకృతిః, తస్యాః సదృశమేవ సర్వః జన్తుః జ్ఞానవాన్ అపి, చేష్టతే. కిం పునః మూర్ఖః? తస్మాత్ ప్రకృతిం యాన్తి భూతాని, నిగ్రహః నిషేధరూపః కిం కరిష్యతి, మమ వా అన్యస్య వా దుర్నిగ్రహా ప్రకృతిః ఇతి వాక్యశేషః.**

**తె.అ.** ఈ జన్మలో మరుజన్మలలో అభివ్యక్తమయ్యే పూర్వకృత పుణ్యపాపకర్మల సంస్కారాలే ప్రకృతి. స్వకీయ ప్రకృతికి అనురూపంగానే సర్వ ప్రాణులు ప్రవర్తిస్తాయి. 'జ్ఞానం కలవాడు కూడా' అంటే ఇక మూర్ఖుని మాట చెప్ప పనిలేదు. కనుక ప్రాణులన్నీ ప్రకృతిని అనుసరిస్తాయి. నేనుగాని, మరొకరుగాని నిషేధించినంత మాత్రాన ఏమవుతుంది? ప్రకృతిని నిగ్రహించడం కష్టం.

**భాష్యమ్ : 34.0 యది సర్వః జన్తుః ఆత్మనః ప్రకృతిసదృశమేవ చేష్టతే – న చ ప్రకృతిశూన్యః కశ్చిదస్తి – తతః పురుషకారస్య విషయానుపపత్తేః శాస్త్రానర్థక్యప్రాప్తౌ ఇదమ్ ఉచ్యతే –**

**తె.అ.** సర్వప్రాణులు తమ స్వభావానురూపంగా ప్రవర్తిస్తే – స్వభావం లేనిదంటూ ఏదీ ఉండదు – పురుషప్రయత్నం పనిచేయదు, శాస్త్రమూ వ్యర్థం కదా? అంటే, అందుకు సమాధానం–

**మూ. ఇన్ద్రియస్యేన్ద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ ।**
**తయోర్న వశమాగచ్ఛేత్తౌ హ్యస్య పరిపన్థినౌ ॥ 34**

**తె.అ.** ఇంద్రియాలకు ఇంద్రియవిషయాలయందు రాగద్వేషాలుంటాయి. వాటికి వశం కాకూడదు. పురుషుడికి అవే శత్రువులు.

**భాష్యమ్ : 34.1 ఇన్ద్రియస్యేతి : – ఇన్ద్రియస్య అర్థే సర్వేన్ద్రియాణామ్ అర్థే శబ్దాదివిషయే, ఇష్టే రాగః అనిష్టే ద్వేషః ఇత్యేవం ప్రతీన్ద్రియార్థం రాగద్వేషౌ అవశ్యంభావినౌ, తత్ర అయం పురుషకారస్య**

**శాస్త్రార్థస్య చ విషయః ఉచ్యతే, శాస్త్రార్థే ప్రవృత్తః పూర్వమేవ రాగద్వేషయోః వశం న ఆగచ్ఛేత్. యా హి పురుషస్య ప్రకృతిః సా రాగద్వేషపురఃసరైవ. స్వకార్యే పురుషం ప్రవర్తయతి. తదా స్వధర్మపరిత్యాగః పరధర్మానుష్ఠానం చ భవతి. యదా పునః రాగద్వేషౌ తత్ప్రతిపక్షేణ నియమయతి తదా శాస్త్రదృష్టిః ఏవ పురుషః భవతి న ప్రకృతివశః. తస్మాత్ తయోః రాగద్వేషయోః వశం న ఆగచ్ఛేత్. యతః తౌ హి అస్య పురుషస్య పరిపన్థినౌ శ్రేయోమార్గస్య విఘ్నకర్తారౌ తస్కరౌ ఇవ పథి ఇత్యర్థః.**

**తె.అ.** అన్ని యింద్రియాలకు శబ్దాది ఇంద్రియార్థాలయందు రాగము ద్వేషము తప్పక ఉంటాయి. అటువంటపుడు పురుషకారము శాస్త్రోపదేశము, వీటి అవసరం చెపుతున్నాడు. శాస్త్రానుసారంగా ప్రవర్తించేవాడు మొదటనే రాగద్వేషాలకు వశం కాకుండా ఉండవలె. స్వభావం పురుషుని రాగంతోనో, ద్వేషంతోనో మాత్రమే పనులు చేయిస్తుంది. స్వధర్మ పరిత్యాగము, పరధర్మానుష్ఠానము అప్పుడే జరుగుతుంది. అట్లా కాకుండా రాగద్వేషాలను వాటి విరోధులచేత నియమిస్తే శాస్త్రదృష్టి కలుగుతుంది, ప్రకృతి వశం కాదు. కనుక రాగద్వేషాలకు వశం కాకూడదు. ఎందుకంటే అవి పురుషుని శ్రేయోమార్గంలో విఘ్నం కలిగించేవి. అవి అతని దారికాచే దొంగలు.

**భాష్యమ్ : 35.0 తత్ర రాగద్వేషప్రయుక్తః మన్యతే శాస్త్రార్థమప్యన్యథా 'పరధర్మోపి ధర్మత్వాదనుష్ఠేయ ఏవే'తి తదసత్ –**

**తె.అ.** రాగద్వేషప్రయుక్తుడు శాస్త్రార్థానికి వేరే అర్థం కల్పించి, పరధర్మం కూడా ధర్మమే కనుక అనుష్ఠించదగిందే అనవచ్చు. అది తప్పు.

**మూ. శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్ ।**
**స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥ 35**

**తె.అ.** బాగా అనుష్ఠించిన పరధర్మముకంటె గుణహీనమైన స్వధర్మమే శ్రేష్ఠము. స్వధర్మాచరణంలో ప్రాణం పోయినా మేలే. పరధర్మాచరణం భయంకరం.

**భాష్యమ్ : 35.1 శ్రేయానితి :– శ్రేయాన్ ప్రశస్యతరః స్వః ధర్మః స్వధర్మః, విగుణః అపి విగతగుణః అపి అనుష్ఠీయమానః, పరధర్మాత్ స్వనుష్ఠితాత్ సాద్గుణ్యేన సంపాదితాదపి, స్వధర్మే స్థితస్య నిధనం మరణమపి శ్రేయః పరధర్మే స్థితస్య జీవితాత్. కస్మాత్? పరధర్మః భయావహః నరకాదిలక్షణం భయమ్ ఆవహతి యతః.**

**తె.అ.** సద్గుణాలలో అనుష్ఠించిన పరధర్మం కంటె గుణహీనమైనా స్వధర్మం మేలు, పరధర్మం ఆచరిస్తూజీవించడం కన్న స్వధర్మంలో నిలిచి చనిపోవడం మేలు. ఎందుకని? పరధర్మం భయావహం, నరకాదిభయాలు కలిగిస్తుంది.

**భాష్యమ్ : 36.0 యద్యపి అనర్థమూలమ్ 'ధ్యాయతో విషయాన్ పుంసః' (2.62) 'రాగద్వేషౌహ్యస్య పరిపన్థినౌ'(3.34) ఇతి చ ఉక్తమ్, విక్షిప్తమ్ అనవధారితం చ తదుక్తమ్ తత్ సంక్షిప్తం నిశ్చితం చ ఇదమ్ ఏవ ఇతి జ్ఞాతుమ్ ఇచ్ఛన్ అర్జునః ఉవాచ, 'జ్ఞాతే హి తస్మిన్ తదుచ్ఛేదాయ యత్నం కుర్యామ్' ఇతి.**

**తె.అ.** 'ధ్యాయతో విషయాన్ పుంసః', 'రాగద్వేషౌహ్యస్య పరిపంథినౌ' అనే శ్లోకాలలో అనర్థానికి మూలం చెప్పినప్పటికీ, అది అనిశ్చితంగానూ అనేక సందర్భాలలోను చెప్పబడింది. అదేమిటో నిశ్చయంగా సంక్షేపంగా తెలుసుకోవడం కొరకు తెలుసుకొని ఆ అనర్థాన్ని తొలగించే ప్రయత్నం చేస్తాను అని అర్జునుడు అడుగుతున్నాడు.

**అర్జున ఉవాచ –**

**మూ. అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః ।**
**అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః ॥ 36**

అర్జునుడంటున్నాడు.

**తె.అ.** ఇష్టం కాకపోయినా పురుషుడు పాపం చేస్తున్నాడు. బలవంతంగా అతనిచేత పాపం చేయించేది ఏది?

**భాష్యమ్ : 36.1 అథేతి :– అథ కేన హేతుభూతేన ప్రయుక్తః సన్, రాజ్ఞేవ భృత్యః, అయం పాపం కర్మ, చరతి ఆచరతి, పురుషః, స్వయమ్ అనిచ్ఛన్ అపి, హే వార్ష్ణేయ వృష్ణికుల ప్రసూత, బలాదివ నియోజితః, రాజ్ఞా ఇవ ఇతి ఉక్తః దృష్టాన్తః.**

**తె.అ.** మరి తనకిష్టం కాకపోయినా ఏ కారణంగా పురుషుడు పాపమాచరిస్తున్నాడు, రాజాజ్ఞను సేవకునివలె, బలవంతంగా నియోగించబడినవానివలె?

**భాష్యమ్ : 37.0 శృణు త్వం,తం వైరిణం సర్వానర్థకరం, యం త్వం పృచ్ఛసి –**

**తె.అ.** అన్ని అనర్థాలు కలిగించే ఆ శత్రువులెవరో విను అని –

**శ్రీభగవానువాచ–**

**మూ. కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః ।**
**మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్ ॥ 37**

శ్రీ భగవానుడు అంటున్నాడు –

**తె.అ.** రజోగుణం వల్ల కలిగే కామమిది. అదే క్రోధం గూడా. అది మహా పాపి. దానికి ఆకలి ఎక్కువ. అదే ఈ సందర్భంలో శత్రువని తెలుసుకో.

**భాష్యమ్ : 37.1 'ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసః శ్రియః, వైరాగ్యస్యాథ మోక్షస్య షణ్ణాం భగ ఇతీరణా' (విష్ణు.పు. 6.5.74) 'ఐశ్వర్యాదిషట్కం యస్మిన్ వాసుదేవే నిత్యమ్ అప్రతిబద్ధత్వేన సామస్త్యేన చ వర్తతే', 'ఉత్పత్తిం ప్రలయం చైవ భూతానామాగతిం గతిమ్, వేత్తి విద్యామవిద్యాం చ స వాచ్యో భగవానితి' (విష్ణు.పు.6.5.78). ఉత్పత్త్యాది విషయం చ విజ్ఞానం యస్య సః వాసుదేవః వాచ్యః భగవాన్ ఇతి.**

**తె.అ.** (ఆచార్యులు ముందు 'భగవానుడు' అన్న శబ్దానికి అర్థం చెపుతున్నాడు) 'సంపూర్ణ ఐశ్వర్యము, వీర్యము, యశస్సు, లక్ష్మి, వైరాగ్యము, మోక్షము ఈ ఆరింటికి భగమని పేరు' (విష్ణు.పు. 6.5.74). ఈ ఆరు ఏ ప్రతిబంధము లేక సంపూర్ణంగా వాసుదేవునియందు నిత్యము ఉంటాయి. 'ఉత్పత్తి, ప్రలయము, ప్రాణుల పుట్టుక, చావులు, విద్య, అవిద్య, తెలిసినవాడు భగవానుడనబడును' (విష్ణు.పు. 6.5.78) అని చెప్పినట్లు ఉత్పత్తి మొదలైన విషయ విజ్ఞానం ఉన్న వాసుదేవుడు భగవానుడు అని పిలువబడుతున్నాడు.

**భాష్యమ్ : 37.2 కామ ఇతి :- కామః ఏషః సర్వలోకశత్రుః, యన్నిమిత్తా సర్వానర్థప్రాప్తిః ప్రాణినామ్. సః ఏషః కామః ప్రతిహతః కేనచిత్ క్రోధత్వేన పరిణమతే. అతః క్రోధః అపి ఏష ఏవ. రజోగుణసముద్భవః రజః చ తత్ గుణశ్చ సః రజోగుణః, సముద్భవః యస్య సః కామః రజోగుణసముద్భవః, రజోగుణస్య వా సముద్భవః కామః హి ఉద్భూతః రజః ప్రవర్తయన్ పురుషం ప్రవర్తయతి. 'తృష్ణయా హి అహం కారితః' ఇతి దుఃఖితానాం రజఃకార్యే సేవాదౌ ప్రవృత్తానాం ప్రలాపః శ్రూయతే. మహాశనః మహత్ అశనమ్ అస్య ఇతి మహాశనః. అతః ఏవ మహాపాప్మా. కామేన హి ప్రేరితః జన్తుః పాపం కరోతి. అతః విద్ధి ఏనం కామమ్ ఇహ సంసారే వైరిణమ్.**

**తె.అ.** ప్రాణుల అనర్థాలన్నిటికి కారణము, లోకానికంతటికి శత్రువు ఈ కామము. ఈ కామానికి ఏదైనా అడ్డు తగిలితే అదే క్రోధంగా మారుతుంది. కనుక క్రోధం కూడా ఇదే. ఇది రజోగుణంవల్ల కలుగుతుంది. లేక రజోగుణం దీనివల్ల కలుగుతుంది అని కూడా చెప్పవచ్చు. ఎందుకంటె కామం కలిగిన తరువాత అది రజస్సును ప్రేరేపించి పురుషుని ప్రవర్తింపజేస్తుంది. 'తృష్ణ కారణంగానే నేను పనులు చేయవలసి వస్తున్నది' అని రజస్సువల్ల బానిసలై కష్టంలో విలపించడం వింటున్నాం. మహాశనుడు అంటే ఎక్కువ భుజించేవాడు. కనుకనే మహాపాపి. కామమే ప్రాణులను ప్రేరేపించి పాపం చేయిస్తుంది. కనుక ఈ సంసారంలో ఈ కామమే శత్రువని తెలుసుకో.

**భాష్యమ్ : 38.0 కామం యిహ సంసారే కథం వైరీతి దృష్టాంతైః ప్రత్యాయయతి.**

**తె.అ.** ఎట్లా శత్రువు? దృష్టాంతాలతో తెలియచెపుతున్నాడు.

**మూ. ధూమేనావ్రియతే వహ్నిర్యథాఽఽదర్శో మలేన చ ।**
**యథోల్బేనావృతో గర్భస్తథా తేనేదమావృతమ్ ॥ 38**

**తె.అ.** పొగచేత నిప్పు, మురికిచేత అద్దము, మావిచేత గర్భము కప్పబడినట్లు కామం చేత (జ్ఞానం) ఇది కప్పబడి ఉంటుంది.

**భాష్యమ్ : 38.1 ధూమేనేతి :– ధూమేన సహజేన ఆవ్రియతే వహ్నిః ప్రకాశాత్మకః అప్రకాశాత్మకేన, యథా వా ఆదర్శః మలేన చ, యథా ఉల్బేన గర్భవేష్టనేన జరాయుణా, ఆవృతః ఆచ్ఛాదితః, గర్భః తథా తేన ఇదమ్ ఆవృతమ్.**

**తె.అ.** వెలుగునిచ్చే నిప్పుతో చీకటిని కలిగించే పొగకూడా పుట్టి దానిని కప్పుతుంది. మురికిచేత అద్దము, మావిచేత గర్భం కప్పబడుతున్నాయి. అదే విధంగా కామంచేత ఇది (జ్ఞానం) కప్పబడి ఉంటుంది.

**భాష్యమ్ : 39.0 కిం పునస్తదిదం శబ్దవాచ్యం యత్కామేనావృతం ఇత్యుచ్యతే –**

**తె.అ.** కామం చేత కప్పబడినది 'ఇది' అని చెప్పబడినదేది? చెపుతున్నాడు –

**మూ. ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా ।**
**కామరూపేణ కౌన్తేయ దుష్పూరేణానలేన చ ॥ 39**

**తె.అ.** తీరని ఆరని (దాహం వంటి) కామం జ్ఞానాన్ని కప్పి ఉంటుంది. అది జ్ఞానికి నిత్య శత్రువు.

**భాష్యమ్ : 39.1 ఆవృతమితి :– ఆవృతమ్ ఏతేన జ్ఞానం, జ్ఞానినః నిత్యవైరిణా. జ్ఞానీ హి జానాతి 'అనేన అహమ్ అనర్థే ప్రయుక్తః' ఇతి పూర్వమేవ, దుఃఖీ చ భవతి నిత్యమేవ, అతః అసౌ జ్ఞానినః నిత్యవైరీ న తు మూర్ఖస్య. స హి కామం తృష్ణాకాలే మిత్రమివ పశ్యన్ తత్కార్యే దుఃఖే ప్రాప్తే జానాతి తృష్ణయా అహం దుఃఖిత్వమ్ ఆపాదితః ఇతి, న పూర్వమేవ. అతః జ్ఞానినః ఏవ నిత్యవైరీ. కిం రూపేణ? కామరూపేణ కామః ఇచ్ఛేవ రూపమ్ అస్యేతి కామరూపః, తేన కామరూపేణ. దుష్పూరేణ దుఃఖేన పూరణమ్ అస్య ఇతి దుష్పూరః, తేన. అనలేన, న అస్య అలం పర్యాప్తిః, విద్యతే ఇతి అనలః తేన.**

**తె.అ.** జ్ఞానికి నిత్యశత్రువైన దీనిచేత జ్ఞానం కప్పబడి ఉంటుంది. 'ఇది నన్ను అనర్థంలోకి తోసింది' అని ముందే తెలుసుకుంటాడు జ్ఞాని. కనుకనే నిత్యం దుఃఖిస్తూ ఉంటాడు. అందుకనే

ఇది జ్ఞానికి నిత్య శత్రువు. మూర్ఖుడికి కాదు. మూర్ఖుడు తృష్ణ కలిగినపుడు కామాన్ని మిత్రంగా భావించి దాని ఫలితంగా దుఃఖం ప్రాప్తించినపుడు 'తృష్ణవల్ల నాకీ కష్టం' అని అప్పుడు తెలుసుకుంటాడు. మొదటనే తెలుసుకోడు. కనుకనే జ్ఞానికి మాత్రమే నిత్యశత్రువు. ఏ రూపంలో? కామమే దాని రూపం. ఆ కామం అనలం, అంటే ఇక చాలు అనదు. దానిది తీరని దాహం.

**భాష్యమ్ : 40.0 కిమధిష్ఠానః పునః కామః జ్ఞానస్య ఆవరణత్వేన వైరీ సర్వస్య లోకస్య ఇతి అపేక్షాయామ్ ఆహ. జ్ఞాతే హి శత్రోః అధిష్ఠానే సుఖేన శత్రునిబర్హణం కర్తుం శక్యతే ఇతి-**

**తె.అ.** జ్ఞానాన్ని కప్పి లోకమంతటికి శత్రువైన కామానికి అధిష్ఠానమేది? శత్రువుయొక్క స్థావరం తెలిస్తే అతన్ని నిర్మూలించడం సులభం. కనుక చెపుతున్నాడు -

**మూ. ఇన్ద్రియాణి మనో బుద్ధిరస్యాధిష్ఠానముచ్యతే ।**
**ఏతైర్విమోహయత్యేష జ్ఞానమావృత్య దేహినమ్ ॥ 40**

**తె.అ.** ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి ఈ కామానికి అధిష్ఠానమంటారు. వీటిచేత జ్ఞానాన్ని కప్పి మానవుణ్ణి మోహింపచేస్తుంది.

**భాష్యమ్ : 40.1 ఇన్ద్రియాణీతి :- ఇన్ద్రియాణి, మనః బుద్ధిః చ అస్య కామస్య, అధిష్ఠానమ్ ఆశ్రయః ఉచ్యతే. ఏతైః ఇన్ద్రియాదిభిః ఆశ్రయైః, విమోహయతి వివిధం, మోహయతి, ఏషః కామః జ్ఞానమ్, ఆవృత్య ఆచ్ఛాద్య, దేహినం శరీరిణమ్. యతః ఏవమ్.**

**తె.అ.** ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి ఈ కామానికి ఆశ్రయం. ఆశ్రయాలైన ఈ ఇంద్రియాదులచేత ఈ కామం మనిషి యొక్క జ్ఞానాన్ని కప్పివేసి నానా విధాలుగా మోహింపచేస్తుంది. కనుక -

**మూ. తస్మాత్త్వమిన్ద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ ।**
**పాప్మానం ప్రజహిహ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్ ॥ 41**

**తె.అ.** ఓ భరతవంశశ్రేష్ఠా! నీవు మొదట ఇంద్రియాలను అదుపులో ఉంచి జ్ఞానవిజ్ఞాననాశకమైన ఈ పాపిష్ఠికామాన్ని విడిచిపెట్టు.

**భాష్యమ్ : 41.1 తస్మాదితి :- తస్మాత్, త్వమ్, ఇన్ద్రియాణి, ఆదౌ పూర్వం, నియమ్య వశీకృత్య, భరతర్షభ, పాప్మానం పాపాచారం, కామం, ప్రజహిహి పరిత్యజ. ఏనం వైరిణం, జ్ఞానవిజ్ఞాననాశనమ్ జ్ఞానం శాస్త్రతః ఆచార్యతః చ ఆత్మాదీనామ్ అవబోధః. విజ్ఞానం విశేషతః తదర్థానుభవః, తయోః జ్ఞానవిజ్ఞానయోః శ్రేయఃప్రాప్తిహేత్వోః నాశనం, ప్రజహిహి ఆత్మనః పరిత్యజ ఇత్యర్థః.**

**తె.అ.** అందువలన, ఓ అర్జునా! నీవు ముందుగా ఇంద్రియాలను వశపరచుకుని పాపాచారమయమైన కామాన్ని విడిచిపెట్టు. శాస్త్రంద్వారా, ఆచార్యునిద్వారా ఆత్మాదులను తెలుసుకోవడం జ్ఞానం. దానిని విశేషంగా అనుభవంలోకి తెచ్చుకోవడం విజ్ఞానం. శ్రేయః ప్రాప్తికి హేతువులైన ఈ జ్ఞాన విజ్ఞానాలను రెండింటినీ నశింపచేసే శత్రువైన, మనం మాట్లాడుకుంటున్న ప్రస్తుత విషయమైన కామాన్ని విడిచిపెట్టు. నీ నుండి దానిని దూరం చేయి.

**భాష్యమ్ : 42.0 ఇంద్రియాణ్యాదౌ నియమ్య కామం శత్రుం జహిహీత్యుక్తం. తత్ర కిమాశ్రయః కామం జహ్యాదిత్యుచ్యతే –**

**తె.అ.** మొదట ఇంద్రియాలను నియమించి శత్రువు అయిన కామాన్ని త్యజించు అని చెప్పాడు. అయితే దేని ఆసరా చూచుకుని దీనిని త్యజించవలె? విను –

**మూ. ఇన్ద్రియాణి పరాణ్యాహురిన్ద్రియేభ్యః పరం మనః ।**
**మనసస్తు పరా బుద్ధిర్యో బుద్ధేః పరతస్తు సః ॥ 42**

**తె.అ.** ఇంద్రియాలు శ్రేష్ఠమంటారు. ఇంద్రియాలకంటె మనస్సు శ్రేష్ఠమైంది. మనసుకంటె బుద్ధి శ్రేష్ఠం. బుద్ధి కంటె శ్రేష్ఠమైనది అది.

**భాష్యమ్ : 42.1 ఇన్ద్రియాణీతి :– ఇన్ద్రియాణి శ్రోత్రాదీని పఞ్చ దేహం స్థూలం బాహ్యం పరిచ్ఛిన్నం చ అపేక్ష్య. సౌక్ష్మ్యాన్తరస్థితవ్యాపిత్వాది అపేక్షయా, పరాణి ప్రకృష్టాని ఆహుః పణ్డితాః. తథా ఇన్ద్రియేభ్యః పరం మనః సంకల్ప వికల్పాత్మకమ్. తథా మనసః తుః పరా బుద్ధిః నిశ్చయాత్మికా. తథా – యః సర్వదృశ్యేభ్యః బుద్ధ్యన్తేభ్యః అభ్యన్తరః యం దేహినమ్ ఇన్ద్రియాదిభిః ఆశ్రయైః యుక్తః కామః జ్ఞానావరణద్వారేణ మోహయతి ఇతి ఉక్తం సః బుద్ధేః, ద్రష్టా పరః ఆత్మా.**

**తె.అ.** బాహ్యము పరిచ్ఛిన్నము అయిన స్థూలదేహం కంటె శ్రోత్రాది జ్ఞానేంద్రియాలు అయిదు శ్రేష్ఠమైనవి అని పండితులంటారు. ఎందుకంటె అవి సూక్ష్మమైనవి, లోపలివి, వ్యాప్తి కలిగినవి కనుక, సంకల్ప వికల్పాత్మకమైన మనసు ఇంద్రియాలకంటె శ్రేష్ఠమైనది. నిశ్చయాత్మికయైన బుద్ధి, మనసుకంటె శ్రేష్ఠమైనది. బుద్ధి పర్యంతము సమస్త దృశ్య పదార్థాలకు అంతర్యమైనది దేహి. ఇంద్రియాలను ఆశ్రయించి కామం ఈ దేహి యొక్క జ్ఞానాన్ని కప్పివేసి మోహింపజేస్తుంది. బుద్ధిని కూడా కనిపెట్టి ఉండే ఆ ఆత్మ అన్నిటికంటే శ్రేష్ఠమైనది.

**మూ. ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా ।**
**జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్ ॥ 43**

**తె.అ.** మహాబాహు!ఈ విధంగా బుద్ధికంటె శ్రేష్ఠమైన ఆత్మను తెలుసుకుని ఆత్మచేతనే ఆత్మను నియమించి పట్టుకొన శక్యంకాని కామరూప శత్రువును సంహరించు.

**ఇతి శ్రీ మహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా - సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జునసంవాదే కర్మయోగో నామ తృతీయోఽధ్యాయః.**

ఇది వ్యాసభగవానుని శతసహస్రసంహిత అయిన శ్రీమహాభారతంలో భీష్మపర్వంలో ఉపనిషత్తులు బ్రహ్మవిద్య యోగశాస్త్రం శ్రీకృష్ణార్జున సంవాదం అయిన భగవద్గీతలయందు కర్మయోగం అనే మూడవ అధ్యాయానికి తెలుగు అనువాదం.

**భాష్యమ్ : 43.1 ఏవమితి :- ఏవం బుద్ధేః పరమ్ ఆత్మానం, బుద్ధ్వా జ్ఞాత్వా, సంస్తభ్య సమ్యక్ స్తంభనం కృత్వా, ఆత్మానం స్వేన ఏవ ఆత్మనా సంస్కృతేన మనసా సమ్యక్ సమాధాయ ఇత్యర్థః. జహి ఏనం శత్రుం, హే మహాబాహో, కామరూపం, దురాసదమ్ దుఃఖేన, ఆసదః ఆసాదనం ప్రాప్తిః, యస్య తం దురాసదమ్, దుర్విజ్ఞేయానేకవిశేషమ్ ఇతి.**

**తె.అ.** ఈ విధంగా బుద్ధికంటే శ్రేష్ఠమైన ఆత్మను తెలుసుకొని సంస్కృతమైన మనసుతో ఆత్మను సమాధియందు నిలిపి కామరూప శత్రువును నిర్మూలించు. ఆ శత్రువును జయించడం సులభం కాదు. ఎందుకంటే అది కామరూపి. అది ఏ రూపంలో ఉంటుందో తెలుసుకోవడమే కష్టం.

**ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యగోవిన్దభగవత్పూజ్యపాదశిష్యశ్రీమచ్ఛంకరభగవతః కృతౌ శ్రీమద్భగవద్గీతా భాష్యే కర్మయోగో నామ తృతీయోఽధ్యాయః.**

ఇది శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య గోవిందభగవత్పూజ్యపాదశిష్యులు శ్రీమత్ శంకరభగవత్పాదులు రచించిన శ్రీమద్భగవద్గీతాభాష్యంలో కర్మయోగం అనే మూడవ అధ్యాయానికి తెలుగు అనువాదం.



# చతుర్థోఽధ్యాయః

# జ్ఞానకర్మ సంన్యాసయోగః

**భాష్యమ్ : 0.1 యః అయం యోగః అధ్యాయద్వయేన ఉక్తః జ్ఞాననిష్ఠాలక్షణః ససంన్యాసః కర్మయోగోపాయః, యస్మిన్ వేదార్థః పరిసమాప్తః ప్రవృత్తిలక్షణః, నివృత్తిలక్షణశ్చ గీతాసు చ సర్వాసు అయమేవ యోగః వివక్షితః భగవతా. అతః పరిసమాప్తం వేదార్థం మన్వానః తం వంశకథనేన స్తౌతి శ్రీ భగవాన్ –**

**తె.అ.** వెనుకటి రెండు అధ్యాయాలలో కర్మయోగంద్వారా సాధించగలిగిన సంన్యాసపూర్వకమైన జ్ఞాననిష్ఠాలక్షణమైన యోగం చెప్పబడింది. ప్రవృత్తి నివృత్తి లక్షణమైన వేదార్థం అందులో పరిసమాప్తం అయింది. భగవద్గీతలో కూడా భగవానుడు చెప్పదలచినది ఈ యోగమే. వేదార్థం పరిసమాప్తమయింది అని భావించిన భగవానుడు దాని వంశపారంపర్యం చెప్పి స్తుతిస్తున్నాడు.

**శ్రీ భగవాన్ ఉవాచ –**

**మూ. ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహమవ్యయమ్ ।**
**వివస్వాన్మనవే ప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్ ॥ 1**

శ్రీ భగవానుడు అంటున్నాడు.

**తె.అ.** నాశరహితమైన ఈ కర్మయోగాన్ని నేను వివస్వతునికి చెప్పాను. వివస్వతుడు మనువుకు మనువు ఇక్ష్వాకువుకు చెప్పారు.

**భాష్యమ్ : 1.1 ఇమమితి. ఇమమ్ అధ్యాయద్వయేన ఉక్తం యోగం వివస్వతే ఆదిత్యాయ, సర్గాదౌ, ప్రోక్తవాన్ అహం జగత్పరిపాలయితౄణాం క్షత్రియాణాం బలాధానాయ. తేన యోగబలేన హి యుక్తాః సమర్థాః భవన్తి బ్రహ్మ పరిరక్షితుమ్. బ్రహ్మక్షత్రే పరిపాలయితుమ్ అలమ్. అవ్యయమ్ అవ్యయఫలత్వాత్. న హి అస్య యోగస్య సమ్యగ్దర్శననిష్ఠాలక్షణస్య మోక్షాఖ్యం ఫలం వ్యేతి. స చ వివస్వాన్ మనవే ప్రాహ. మనుః ఇక్ష్వాకవే స్వపుత్రాయ ఆదిరాజాయ అబ్రవీత్.**

**తె.అ.** వెనుకటి రెండు అధ్యాయాలలో చెప్పిన యోగం సృష్టి మొదలైనపుడు జగత్తును పరిపాలించే క్షత్రియులకు బలం కలగడానికి సూర్యునికి నేను చెప్పాను. ఈ యోగబలంచేత వారు బ్రాహ్మణులను పరిరక్షించగల సమర్థులైనారు. ప్రపంచాన్ని పరిపాలించడానికి బ్రాహ్మణ

క్షత్రియులు చాలుదురు. ఈ యోగఫలం క్షయం కాదు కనుక ఇది అవ్యయం. సమ్యగ్దర్శన నిష్ఠాలక్షణఫలమైన ఈ యోగానికి అవ్యయమైన మోక్షమే ఫలం. ఈ యోగం సూర్యుడు మనువుకు చెప్పాడు. మనువు తన కుమారుడైన తొలిరాజు ఇక్ష్వాకువుకు దానిని చెప్పాడు.

**మూ. ఏవం పరమ్పరాప్రాప్తమిమం రాజర్షయో విదుః ।**
**స కాలేనేహ మహతా యోగో నష్టః పరంతప ।** **2**

**తె.అ.** ఈ విధంగా పరంపరాప్రాప్తమైన ఈ యోగం రాజర్షులకు తెలిసి ఉండినది. చాలాకాలం గడచిన కారణంగా ఈ యోగం నష్టమైంది.

**భాష్యమ్ : 2.1 ఏవమితి : ఏవం క్షత్రియ పరమ్పరాప్రాప్తమ్ ఇమం, రాజర్షయః, రాజానః చ తే ఋషయః చ ఇతి తే రాజర్షయః, విదుః ఇమం యోగమ్. సః యోగః కాలేన ఇహ మహతా దీర్ఘేణ, నష్టః విచ్ఛిన్న సంప్రదాయః సంవృత్తః, హే పరంతప, ఆత్మనః విపక్షభూతాః పరాః ఉచ్యన్తే, తాన్ శౌర్యతేజోగభస్తిభిః భానుః ఇవ తాపయతి ఇతి పరంతపః, శత్రుతాపన ఇత్యర్థః.**

**తె.అ.** ఈ విధంగా క్షత్రియ పరంపరతో ప్రాప్తించిన ఈ యోగం ఋషులైన రాజులకు తెలిసి ఉండేది. ఆ యోగం చాలాకాలం గడచిన కారణంగా ఈ లోకంలో సంప్రదాయం విచ్ఛిన్నమై నష్టమైంది. పరులు అంటే శత్రువులు. పరులను తపింపజేసేవాడు పరంతపుడు అర్జునుడు అని అర్థం.

**భాష్యమ్ : 3.0 దుర్బలాన్ అజితేన్ద్రియాన్ ప్రాప్య నష్టం యోగమ్ ఇమమ్ ఉపలభ్య, లోకం చ అపురుషార్థసంబన్ధినమ్ –**

**తె.అ.** ఇంద్రియవశులైన దుర్బలుల చేతిలో పడి ఈ యోగం నష్టమవడము లోకంలో పురుషార్థాలు మరుగున పడడము చూసి –

**మూ. స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః ।**
**భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేతదుత్తమమ్ ॥** **3**

**తె.అ.** పురాతనమైన ఆ యోగమే భక్తుడవని, నాకు సఖుడవని ఇప్పుడు నీకు నేను చెప్పాను. ఈ యోగజ్ఞానం రహస్యము, ఉత్తమము అయినది.

**భాష్యమ్ : 3.1 స ఏవాయమ్ ఇతి : సః ఏవ అయం మయా, తే తుభ్యమ్, అద్య ఇదానీమ్, యోగః ప్రోక్తః పురాతనః, భక్తః అసి, మే సఖా చ అసి ఇతి. రహస్యం యస్మాత్ హి ఏతత్ ఉత్తమం యోగజ్ఞానమ్ ఇత్యర్థః.**

**తె.అ.** పురాతనమైన ఆ యోగమే ఇప్పుడు నీకు నేను చెప్పాను, భక్తుడవని నాకు సఖుడవని. ఈ యోగజ్ఞానం రహస్యమైనది, కనుక ఉత్తమమైనది. (అర్జునుడు తనకు సఖుడు అనడం కేవలం మాటవరసకే. 'సుహృదం సర్వభూతానాం' (5.29) అని చెప్పుకున్నాడు భగవానుడు)

**భాష్యమ్ : 4.0 భగవతా విప్రతిషిద్ధమ్ ఉక్తమ్ ఇతి మా భూత్ కస్య చిత్ బుద్ధిః ఇతి పరిహారార్థం చోద్యమ్ ఇవ కుర్వన్ –**

**తె.అ.** భగవానుడు అసంగతమైన విషయం చెబుతున్నాడు అని ఎవరైనా అనుకోవచ్చునని ఏమిటీ చోద్యం అన్నట్లు –

**అర్జున ఉవాచ –**

**మూ. అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః ।**
**కథమేతద్విజానీయాం త్వమాదౌ ప్రోక్తవానితి ॥ 4**

అర్జునుడు అడుగుతున్నాడు.

**తె.అ.** సూర్యుడు ముందు పుట్టాడు. తరువాత తమరు. 'నేను మొదట సూర్యునికి చెప్పాను' అంటున్నారు. ఎట్లా అర్థం చేసుకోను?

**భాష్యమ్ : 4.1 అపరమితి : అపరమ్ అర్వాక్ వసుదేవగృహే భవతః జన్మ. పరం పూర్వం సర్గాదౌ, జన్మ ఉత్పత్తిః, వివస్వతః ఆదిత్యస్య. తత్ కథమ్ ఏతత్ విజానీయామ్ అవిరుద్ధార్థతయా, యః త్వమ్ ఏవ ఆదౌ ప్రోక్తవాన్ ఇమం యోగం సః ఏవ త్వమ్ ఇదానీం మహ్యం ప్రోక్తవాన్ అసి ఇతి.**

**తె.అ.** వసుదేవుని ఇంటిలో మీ జన్మ తరువాతకాలంలో జరిగింది. సూర్యుని జన్మ అంతకు పూర్వం సృష్టి మొదట. ఈ యోగం మొదట మీరే చెప్పారని ఇప్పుడు నాకు చెప్పింది అదే యోగమని ఎట్లా అర్థం చేసుకోను? ఇది విరుద్ధంగా లేదా?

**భాష్యమ్ : 5.0 యా వాసుదేవే అనీశ్వరాసర్వజ్ఞాశఙ్కా మూర్ఖాణాం తాం పరిహరన్ శ్రీ భగవానువాచ, యదర్థః హి అర్జునస్య ప్రశ్నః–**

**తె.అ.** వాసుదేవుడు ఈశ్వరుడు సర్వజ్ఞుడు కాదు అనే మూర్ఖుల అనుమానం తొలగించడానికి భగవానుడు అంటున్నాడు. నిజానికి అర్జునుడి ప్రశ్నకు ప్రయోజనం అదే.

**శ్రీ భగవానువాచ –**

**మూ. బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున ।**
**తాన్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప ॥ 5**

శ్రీ భగవానుడంటున్నాడు –

**తె.అ.** పరంతపా! నాకూ నీకూ కూడా అనేకజన్మలు గడిచాయి. అవన్నీ నాకు తెలుసు. నీకు తెలియవు.

**భాష్యమ్ : 5.1 బహూనీతి : బహూని, మే మమ, వ్యతీతాని అతిక్రాన్తాని, జన్మాని తవ చ హే అర్జున. తాని అహం, వేద జానే, సర్వాణి, న త్వం, వేత్థ న జానీషే, ధర్మాధర్మాది-ప్రతిబద్ధజ్ఞానశక్తిత్వాత్. అహం పునః నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావత్వాత్ అనావరణజ్ఞానశక్తిః ఇతి వేద, అహం, హే పరంతప.**

**తె.అ.** అర్జునా నాకు అనేక జన్మలు గడిచాయి. అట్లాగే నీకూ. అవన్నీ నాకు తెలుసు. నీకు తెలియవు. ఎందుకంటే తెలుసుకునే నీశక్తి పుణ్యపాపాదులచేత ప్రతిబద్ధమై (అడ్డుకొనబడి) ఉంటుంది కనుక. మరి నేను నిత్యశుద్ధబుద్ధముక్త స్వభావం గలవాడిని. నా జ్ఞానశక్తిని ఏదీ కప్పిలేదు, కనుక నాకు తెలుసు.

**భాష్యమ్ : 6.0 కథం తర్హి తవ నిత్యేశ్వరస్య ధర్మాధర్మాభావేఽపి జన్మ ఇతి ఉచ్యతే –**

**తె.అ.** ఏ పుణ్యము పాపము ఎరుగని శాశ్వతునకు ఈశ్వరునకు మీకు జన్మ ఎట్లా కలిగింది? అంటే విను–

**మూ. అజోఽపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపి సన్ ।**
**ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా ॥ 6**

**తె.అ.** నాకు పుట్టుక లేదు. మార్పు లేదు. ప్రాణులందరికీ ప్రభువును పరమాత్మను. అయినా నా ప్రకృతిని వశం చేసుకుని నా మాయచేత పుడుతున్నాను.

**భాష్యమ్ : 6.1 అజోఽపీతి : అజః అపి జన్మరహితః అపి సన్, తథా, అవ్యయాత్మా అక్షీణజ్ఞానశక్తిస్వభావః అపి సన్, తథా, భూతానాం బ్రహ్మాదిస్తమ్బపర్యన్తానామ్, ఈశ్వరః ఈశనశీలః అపి సన్, ప్రకృతిం స్వాం మమ వైష్ణవీం మాయాం త్రిగుణాత్మికాం, యస్యాః వశే సర్వం జగత్ వర్తతే, యయా మోహితం జగత్ సత్ స్వమ్ ఆత్మానం వాసుదేవం న జానాతి తాం ప్రకృతిం స్వామ్, అధిష్ఠాయ వశీకృత్య, సంభవామి దేహవాన్ ఇవ భవామి, జాతః ఇవ, ఆత్మమాయయా ఆత్మనః మాయయా, న పరమార్థతః లోకవత్.**

**తె.అ.** నాకు పుట్టుకలేదు. నా జ్ఞానశక్తికి క్షయం లేదు. అంటే ప్రకృతికి వశమై జ్ఞానం కోలుపోను. ప్రకృతిని 'తెలిసిన' వాడిని. బ్రహ్మ మొదలు గడ్డిపోచవరకు సమస్త సృష్టికి నేను ప్రభువును. అయినా ఏ ప్రకృతికి వశమై ఈ సర్వజగత్తు నడుస్తుందో, ఏ ప్రకృతిచేత సమ్మోహితమై

ఈ లోకం తన ఆత్మను, వాసుదేవుని, తెలియడంలేదో ఆ నా వైష్ణవమాయను వశీకరించుకుని దేహం ధరించి నా మాయచేత పుట్టినట్లు కనిపిస్తాను. అంతేగాని లోకంలో అందరిలాగా వాస్తవంగా కాదు.

**భాష్యమ్ : 7.0 తచ్చ జన్మ కదా, కిమర్థం చ ఇతి? ఉచ్యతే –**

**తె.అ.** ఆ పుట్టడం ఎప్పుడు? ఎందుకు? అంటే, విను–

**మూ. యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।**
**అభ్యుత్థానమధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్ ॥ 7**

**తె.అ.** ఎప్పుడెప్పుడు ధర్మం హీనమై అధర్మం, అభివృద్ధి చెందుతుందో అప్పుడు నన్ను నేను సృష్టించుకుంటాను.

**భాష్యమ్ : 7.1 యదేతి : యదా యదా హి ధర్మస్య, గ్లానిః హానిః వర్ణాశ్రమాది లక్షణస్య ప్రాణినామ్ అభ్యుదయనిఃశ్రేయససాధనస్య, భవతి, భారత, అభ్యుత్థానమ్ ఉద్భవః అధర్మస్య తదా ఆత్మానం సృజామి అహం మాయయా. కిమర్థం?**

**తె.అ.** వర్ణాశ్రమాది లక్షణము ప్రాణులకు అభ్యుదయ (అభివృద్ధికి) నిశ్శ్రేయస (మోక్షమునకు) సాధనము అయిన ధర్మం ఎప్పుడెప్పుడు హీనమై అధర్మం అభివృద్ధి చెందుతుందో అప్పుడు నన్ను నేను మాయచేత సృష్టించుకుంటాను. ఎందుకు?

**మూ. పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।**
**ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥ 8**

**తె.అ.** పాప కర్మలు చేసేవారిని నిర్మూలించి, సాధువులను కాపాడి ధర్మం నిలపడంకోసం ప్రతియుగంలో పుడుతున్నాను.

**భాష్యమ్ : 8.1 పరిత్రాణాయేతి : పరిత్రాణాయ పరిరక్షణాయ, సాధూనాం సన్మార్గస్థానాం, వినాశాయ చ దుష్కృతాం పాపకారిణాం, కించ ధర్మ సంస్థాపనార్థాయ ధర్మస్య సమ్యక్స్థాపనం ధర్మ సంస్థాపనం తదర్థం సంభవామి, యుగే యుగే ప్రతియుగమ్.**

**తె.అ.** సన్మార్గంలో నడిచేవారిని పరిరక్షించి, పాపకర్ములను నాశనం చేసి ధర్మం నిలపడానికి ప్రతియుగంలో నేను పుడుతున్నాను.

**మూ. జన్మ కర్మ చ మే దివ్యమేవం యో వేత్తి తత్త్వతః ।**
**త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున ॥ 9**

**తె.అ.** దివ్యమైన నా జన్మకర్మల తత్త్వం తెలిసినవాడు మళ్ళీ పుట్టడు. దేహం విడిచి నన్ను చేరుకుంటాడు.

**భాష్యమ్ : 9.1 జన్మేతి :– జన్మ మాయారూపం, కర్మ చ సాధుపరిత్రాణాది, మే మమ, దివ్యమ్ అప్రాకృతమ్ ఐశ్వరమ్, ఏవం యథోక్తం, యః వేత్తి తత్త్వతః తత్త్వేన యథావత్, త్యక్త్వా దేహమ్ ఇమం, పునః జన్మ పునః ఉత్పత్తిం న ఏతి న ప్రాప్నోతి. మామ్ ఏతి ఆగచ్ఛతి – సః ముచ్యతే, హే అర్జున.**

**తె.అ.** మాయారూపమైన నా పుట్టుక, సాధురక్షణ మొదలైన నా పనులు లోకసామాన్యమైనవి కావు. ఈశ్వరలక్షణమైనవి. నేను చెప్పిన విధంగా ఈ తత్త్వం తెలుసుకున్నవాడు దేహం విడిచి పునర్జన్మ పొందదు. నన్ను చేరుకుంటాడు, అంటే అతడు ముక్తుడు.

**భాష్యమ్ : 10.0 నైషః మోక్షమార్గః ఇదానీం ప్రవృత్తః, కిం తర్హి? పూర్వమపి –**

**తె.అ.** ఈ మోక్షమార్గం ఇప్పటిది కాదు, పూర్వం కూడా ఉండింది.

**మూ. వీతరాగభయక్రోధా మన్మయా మాముపాశ్రితాః ।**
**బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః ॥ 10**

**తె.అ.** రాగము, భయము, క్రోధము విడిచి నన్నే తమ స్వరూపంగా భావిస్తూ నన్నాశ్రయించి జ్ఞానతపస్సులో పవిత్రులైన వారెందరో నన్ను చేరుకున్నారు.

**భాష్యమ్ : 10.1 వీతరాగేతి :– వీతరాగభయక్రోధా : రాగశ్చ భయం చ క్రోధః చ వీతాః విగతాః యేభ్యః తే వీతరాగభయక్రోధాః, మన్మయాః బ్రహ్మవిదః ఈశ్వరాభేదదర్శినః, మామేవ చ పరమేశ్వరమ్ ఉపాశ్రితాః, కేవలజ్ఞాననిష్ఠాః ఇత్యర్థః. బహవః అనేకే, జ్ఞానతపసా జ్ఞానమేవ చ పరమాత్మ విషయం తపః తేన జ్ఞానతపసా, పూతాః పరాం శుద్ధిం గతాః సన్తః మద్భావమ్ ఈశ్వరభావం మోక్షమ్ ఆగతాః సమనుప్రాప్తాః. ఇతర తపోనిరపేక్షజ్ఞాననిష్ఠాః ఇత్యస్య లింగం 'జ్ఞానతపసా' ఇతి విశేషణమ్.**

**తె.అ.** రాగము, భయము, క్రోధము విడిచి మన్మయులై అంటే బ్రహ్మవేత్తలై ఈశ్వరునకు తమకు భేదం చూడని వారై పరమేశ్వరుడనైన నన్నాశ్రయించి అంటే కేవల జ్ఞాననిష్ఠులై పరమాత్మ విషయకమైన జ్ఞానతపస్సుచేత పరమశుద్ధిని పొందినవారెందరో మహానుభావులు మోక్షం పొందారు. జ్ఞానతపస్సుచేత అనే విశేషణం ఇతర తపస్సులు వీరికి అక్కరలేదు అని సూచిస్తున్నది. (కలుషాలను కాల్చి, కరగించి, తొలగించి, శుద్ధిచేసే తాపమే తపం).

**భాష్యమ్ : 11.0 "తవ తర్హి రాగద్వేషౌ స్తః, యేన కేభ్యశ్చిదేవ ఆత్మభావం ప్రయచ్ఛసి న సర్వేభ్యః ఇతి?" ఉచ్యతే –**

**తె.అ.** ఆత్మభావం మీరు కొందరికేగాని అందరికీ ఇవ్వడం లేదు. కనుక మీకు రాగద్వేషాలున్నట్లే గదా? అంటే, సమాధానం –

**మూ. యే యథా మాం ప్రపద్యన్తే తాంస్తథైవ భజామ్యహమ్ ।**
**మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః ॥ 11**

**తె.అ.** నన్ను ఎవరు ఏ ఫలం కోరి సేవిస్తే, వారిని ఆ ఫలంతో అనుగ్రహిస్తున్నాను. మానవులు అన్నివిధాలా నా మార్గాన్నే అనుసరిస్తారు.

**భాష్యమ్ : 11.1 యే యథేతి :– యే యథా యేన ప్రకారేణ, యేన ప్రయోజనేన, యత్ఫలార్థితయా మాం ప్రపద్యన్తే తాన్, తథైవ తత్ఫలదానేన, భజామి అనుగృహ్ణామి, అహమ్ ఇత్యేతత్. తేషాం మోక్షం ప్రతి అనర్థిత్వాత్. న హి ఏకస్య ముముక్షుత్వం ఫలార్థిత్వం చ యుగపత్ సంభవతి. అతః యే యత్ ఫలార్థినః తాన్ తత్ ఫలప్రదానేన, యే యథోక్తకారిణః తు అఫలార్థినః ముముక్షవః చ తాన్ జ్ఞానప్రదానేన, యే జ్ఞానినః సంన్యాసినః ముముక్షవః చ తాన్ మోక్షప్రదానేన, తథా ఆర్తాన్ ఆర్తిహరణేన ఇత్యేవం యథా ప్రపద్యన్తే యే తాన్ తథైవ భజామి ఇత్యర్థః. న పునః రాగద్వేషనిమిత్తం మోహనిమిత్తం వా కంచిత్ భజామి. సర్వథాపి సర్వావస్థస్య మమ ఈశ్వరస్య, వర్త్మ మార్గమ్, అనువర్తన్తే మనుష్యాః యత్ఫలార్థితయా యస్మిన్ కర్మణి అధికృతాః యే ప్రవర్తంతే తే మనుష్యాః అత్ర ఉచ్యన్తే – హే పార్థ, సర్వశః సర్వప్రకారైః**

**తె.అ.** ఎవరు ఏ ప్రకారంగా ప్రయోజనం, ఫలంకోరి సేవిస్తే వారిని అదే ప్రకారం కోరిన ఫలమిచ్చి అనుగ్రహిస్తున్నాను, వారు మోక్షం కోరడం లేదు కనుక. ఎవడైనా మోక్షము ఫలము రెండూ ఒకేసారి కోరడం జరగదు కదా. కనుక ఎవరు ఏ ఫలం కోరితే వారికి ఆ ఫలం ఇస్తున్నాను. ఏ ఫలమూ కోరని జ్ఞానాధికారం కల ముముక్షువులకు జ్ఞానం ఇస్తున్నాను. మోక్షం కోరి సంన్యసించిన జ్ఞానులకు ముక్తినిస్తున్నాను. ఆర్తుల ఆర్తిని తొలగిస్తున్నాను. ఈ విధంగా ఎవరు ఏ విధంగా చేరితే వారిని అదేవిధంగా అనుగ్రహిస్తున్నాను, అని అర్థం. అంతేకాని నాకు ఎవరిమీద రాగద్వేషాలు లేవు, మోహములేదు. సర్వావస్థలయందు ఉన్న ఈశ్వరుడనైన నా మార్గాన్నే మానవులు అన్ని విధాలుగా అనుసరిస్తున్నారు. ఏ ఫలంకోరి, అధికారం ఉన్న ఏ కర్మలయందు ఎవరు ప్రవర్తిస్తున్నారో ఆ మానవుల గురించి ఇక్కడ చెపుతున్నాడు.

**భాష్యమ్ : 12.0 యది తవ ఈశ్వరస్య రాగాదిదోషాభావాత్ సర్వప్రాణిషు అనుజిఘృక్షాయాం తుల్యాయాం, సర్వఫలప్రదానసమర్థే చ త్వయి సతి 'వాసుదేవః సర్వమ్' (7.19) ఇతి జ్ఞానేనైవ ముముక్షవః సన్తః కస్మాత్ త్వామేవ సర్వే న ప్రతిపద్యన్తే ఇతి? శృణు తత్ర కారణమ్ –**

**తె.అ.** ఈశ్వరుడవైన నీకు రాగము మొదలైన దోషాలు లేవు. సర్వప్రాణులయందు నీకు కారుణ్యం సమానం. ఏ ఫలమైనా ఇవ్వగల సమర్థుడవు. మరి ముముక్షువులందరు వాసుదేవుడే సర్వమునని తెలిసి ఎందుకు నిన్నే చేరడానికి ప్రయత్నించరు? అంటే అందుకు కారణం విను –

**మూ. కాంక్షన్తః కర్మణాం సిద్ధిం యజన్త ఇహ దేవతాః ।**
**క్షిప్రం హి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా ॥ 12**

**తె.అ.** ఈ లోకంలో అందరూ తమ కర్మలు ఫలించవలెనని కోరికతో దేవతలను ఉపాసిస్తారు. మానవలోకంలో కర్మలు శీఘ్రమే ఫలిస్తాయి.

**భాష్యమ్ : 12.1 కాంక్షన్తః ఇతి – కాంక్షన్తః అభీప్సన్తః కర్మణాం సిద్ధిం ఫలనిష్పత్తిం యజన్తే, ఇహ అస్మిన్ లోకే, దేవతాః ఇన్ద్రాగ్న్యాద్యాః 'అథయోఽన్యాం దేవతాముపాస్తేఽ సావన్యోఽ హమస్మీతి న స వేద యథా పశురేవం స దేవానామ్' (బృ.ఉ.1.4.10) ఇతి శ్రుతేః. తేషాం హి భిన్నదేవతాయాజినాం ఫలాకాంక్షిణాం, క్షిప్రం శీఘ్రం, హి యస్మాత్, మానుషే లోకే, మనుష్యలోకే హి శాస్త్రాధికారః 'క్షిప్రం హి మానుషే లోకే' ఇతి విశేషణాత్ అన్యేష్వపి కర్మఫలసిద్ధిం దర్శయతి భగవాన్. మానుషే లోకే వర్ణాశ్రమాదికర్మాధికారః ఇతి విశేషః. తేషాం వర్ణాశ్రమాద్యధికారిణామ్ కర్మణాం ఫలసిద్ధిః భవతి. కర్మజా కర్మణో జాతా.**

**తె.అ.** తమ కర్మలు ఫలించవలెనని కోరుకుంటూ ఈ లోకంలో ఇంద్రుడు అగ్ని మొదలైన దేవతలను జనులు ఉపాసిస్తారు. 'అతడు వేరు నేను వేరు అని అన్యుని దేవతగా ఉపాసించేవాడు అజ్ఞాని; అతడు దేవతలకు యజ్ఞపశువు వంటివాడు' (బృ.ఉ.1.4.10) అని శ్రుతి. అన్యదేవతలను ఫలంకోరి ఉపాసించేవారికి మనుష్యలోకంలో ఫలం శీఘ్రంగా కలుగుతుంది. శాస్త్రాధికారం మనుష్యలోకంలోనే. 'మనుష్యలోకంలో శీఘ్రంగా' అని విశేషించడం చేత ఇతర లోకాలలో కూడా కర్మఫలసిద్ధి కలదని భగవానుడు సూచిస్తున్నాడు. మనుష్యలోకంలోని విశేషం వర్ణాశ్రమాది కర్మాధికారం. తమ వర్ణాశ్రమాలకు యోగ్యమైన కర్మలు ఫలసిద్ధిని పొందుతాయి.

**భాష్యమ్ : 13.0 మానుషే ఏవ లోకే వర్ణాశ్రమాది కర్మాధికారః న అన్యేషు లోకేషు ఇతి నియమః కిం నిమిత్తః ఇతి? అథవా – వర్ణాశ్రమాది ప్రవిభాగోపేతాః మనుష్యాః మమ వర్త్మ అనువర్తన్తే సర్వశః ఇతి ఉక్తమ్. కస్మాత్ పునః కారణాత్ నియమేన తవైవ వర్త్మ అనువర్తన్తే న అన్యస్య ఇతి? ఉచ్యతే –**

**తె.అ.** వర్ణాశ్రమాది కర్మాధికారం మనుష్యలోకంలో మాత్రమే, ఇతర లోకాలలో లేదు అన్న నియమం ఎందుకు? లేక, వర్ణాశ్రమాలలో విభాగింపబడిన మనుషులు అన్ని విధాలా నా మార్గమే అనుసరిస్తున్నారు అని అన్నావు. నీ మార్గమే వారెందుకు అనుసరిస్తున్నారు? మరొక మార్గమెందుకు అనుసరించరు? అంటే విను –

**మూ. చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః ।**
**తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తారమవ్యయమ్ ॥ 13**

**తె.అ.** వారి వారి గుణాన్ని, కర్మనుబట్టి నాలుగు వర్ణాలు నేను సృష్టించాను. ఈ వర్ణవ్యవస్థకు నేను కర్తను, అవ్యయమైన అకర్తను కూడా అని తెలుసుకో.

**భాష్యమ్ : 13.1 చాతుర్వర్ణ్యమితి – చాతుర్వర్ణ్యం చత్వారః ఏవ వర్ణాః చాతుర్వర్ణ్యమ్, మయా ఈశ్వరేణ, సృష్టమ్ ఉత్పాదితమ్ 'బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్' (ఋ.సం.10.90.12, తై.ఆ.3.12.13) ఇత్యాది శ్రుతేః. గుణకర్మవిభాగశః గుణవిభాగశః కర్మవిభాగశః చ. గుణాః సత్త్వరజస్తమాంసి. తత్ర సాత్త్వికస్య సత్త్వప్రధానస్య బ్రాహ్మణస్య 'శమః దమః తపః' (18.42) ఇత్యాదీని కర్మాణి. సత్త్వోపసర్జన రజః ప్రధానస్య క్షత్రియస్య 'శౌర్యతేజః' ప్రభృతీని కర్మాణి (18.43) తమఉపసర్జనరజః ప్రధానస్య వైశ్యస్య 'కృష్యాదీని' కర్మాణి (18.44) రజఉపసర్జనతమః ప్రధానస్య శూద్రస్య శుశ్రూషైవ కర్మ (18.44) ఇత్యేవం గుణకర్మవిభాగశః చాతుర్వర్ణ్యం మయా సృష్టమ్ ఇత్యర్థః. తచ్చేదం చాతుర్వర్ణ్యం న అన్యేషు లోకేషు, అతో 'మానుషే లోకే' ఇతి విశేషణమ్. హన్త తర్హి చాతుర్వర్ణ్యస్య సర్గాదేః కర్మణః కర్మణః కర్తృత్వాత్ తత్ఫలేన యుజ్యసే, అతః న త్వం నిత్యముక్తః, నిత్యేశ్వరః ఇతి? ఉచ్యతే – యద్యపి మాయాసంవ్యవహారేణ తస్య కర్మణః కర్తారమ్ అపి సన్తం మాం పరమార్థతః విద్ధి అకర్తారమ్, అతః ఏవ అవ్యయమ్ అసంసారిణం చ మాం విద్ధి.**

**తె.అ.** గుణాలననుసరించి, కర్మలననుసరించి, నాలుగు వర్ణాలు, ఈశ్వరుడనైన నాచేత సృష్టించబడ్డాయి. 'బ్రాహ్మణుడు అతని ముఖమాయెను'. (ఋ.సం. 10.90.12, తై.ఆ. 3.12.13 మొదలైన శ్రుతులు) సత్త్వరజస్తమస్సులు గుణాలు. అందులో బ్రాహ్మణుని కర్మలు సత్త్వప్రధానమైన శమము, దమము, తపము. సత్త్వమును మించిన రజోగుణ ప్రధానమైన క్షత్రియుని కర్మలు శౌర్యము, తేజము మొదలైనవి. వ్యవసాయం వంటి వైశ్యుని కర్మలయందు తమస్సును మించిన రజస్సు ప్రధానం. శూద్రుని కర్మ అయిన సేవయందు రజస్సును మించిన తమస్సు ప్రధానం. ఈ విధంగా గుణాలు కర్మలననుసరించి నాలుగు వర్ణాల వ్యవస్థ నాచే సృష్టించబడింది అని అర్థం. కనుక ఈ చాతుర్వర్ణ్యము మనుష్యలోకంలోనే, తక్కిన లోకాలలో లేదు, అని ప్రత్యేకించి

చెప్పడం. మరి, మొట్టమొదటి కర్మ అయిన చాతుర్వర్ణ్య సృష్టికి నీవే కర్తవు కనుక ఆ కర్మఫలం నిన్నంటుకుంటుంది. కనుక నీవు నిత్యముక్తుడవు కాదు నిత్యేశ్వరుడవూ కాదు, అంటే సమాధానం – మాయా వ్యవహారంచేత నేను కర్తనయినప్పటికీ పరమార్థ దృష్టిలో నేను అకర్తను అని తెలుసుకో. కనుకనే నేను అవ్యయుడను, అసంసారిని అని తెలుసుకో.

**భాష్యమ్ : 14.0 యేషాం తు కర్మణాం కర్తారం మాం మన్యసే, పరమార్థతః తేషామ్ అకర్తైవ అహం, యతః –**

**తె.అ.** ఏ కర్మలకు నేను కర్తనని నీవనుకుంటున్నావో వాస్తవంలో నేను వాటికి కర్తను కాను. ఎందుకంటే –

**మా. న మాం కర్మాణి లిమ్పన్తి న మే కర్మఫలే స్పృహా ।**
**ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న స బధ్యతే ॥ 14**

**తె.అ.** కర్మలు నన్నంటుకోవు. కర్మఫలం పై నాకు కోర్కెలేదు. ఈ విధంగా నన్ను తెలుసుకొన్నవాడు కర్మలచేత బద్ధుడు కాడు.

**భాష్యమ్ : 14.1 నేతి – న, మాం, తాని కర్మాణి, లిమ్పన్తి దేహాద్యారమ్భకత్వేన, అహంకారాభావాత్. న చ, తేషాం కర్మణాం, ఫలేషు, మే, స్పృహా తృష్ణా. యేషాం తు సంసారిణామ్ 'అహం కర్తా' ఇత్యభిమానః, కర్మసు స్పృహా తత్ఫలేషు చ, తాన్ కర్మాణి లిమ్పన్తీతి యుక్తమ్. తదభావాత్ న మాం కర్మాణి లిమ్పన్తి. ఇత్యేవం యః అన్యోఽపి మామ్ ఆత్మత్వేన అభిజానాతి, న అహం కర్తా న మే కర్మఫలే స్పృహా ఇతి, సః కర్మభిః న బధ్యతే. తస్యాపి న దేహాద్యారమ్భకాణి కర్మాణి భవన్తి ఇత్యర్థః.**

**తె.అ.** అహంకారం లేదు కనుక ఆ కర్మలు నన్నంటుకోవు, నాకు వాటివల్ల దేహాదులు కలుగవు. ఆ కర్మలకు నేను ఫలం కూడా కోరను. కర్మలయందు నేను కర్తను అన్న అభిమానము వాటి ఫలంపై కోర్కె ఉన్న సంసారులను ఆ కర్మలు అంటుకోవడం న్యాయం. ఆ రెండూ లేని నన్ను కర్మలు అంటుకోవు. నేను కాక మరొకడైనా సరే నన్ను తన ఆత్మగా తెలుసుకున్నవాడు, నేను కర్తను గాను నాకు కర్మఫలంపై కోర్కెలేదు అని తెలిసినవాడు కర్మలచేత బద్ధుడు కాడు. అతనికి కూడా కర్మలు, దేహాదులు కలగడానికి కారణం కావు అని అర్థం.

**భాష్యమ్ : 15.0 నాహం కర్తా, న మే కర్మఫలే స్పృహా ఇతి–**

**తె.అ.** నేను కర్తను కాను కర్మఫలం పై నాకు కోర్కెలేదు అని –

**మూ. ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః ।**
**కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్ ॥ 15**

**తె.అ.** పూర్వం కూడా ముముక్షువులు ఈ విధంగా తెలుసుకుని కర్మ చేశారు. కనుక వెనుకటివారు చేసినట్లే నీవు కర్మనే చేయి.

**భాష్యమ్ : 15.1 ఏవమితి. ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైః అపి అతిక్రాన్తైః ముముక్షుభిః. కురు తేన కర్మైవ త్వం, న తూష్ణీమ్ ఆసనం, న సంన్యాసః కర్తవ్యః తస్మాత్ త్వం, పూర్వైరపి అనుష్ఠితత్వాత్. యది అనాత్మజ్ఞస్త్వం తదా ఆత్మశుద్ధ్యర్థం, తత్త్వవిత్ చేత్ లోకసంగ్రహార్థం, పూర్వైః జనకాదిభిః, పూర్వతరం కృతం, న అధునాతనం, కృతమ్ అనుష్ఠితమ్.**

**తె.అ.** మోక్షకాములైన పూర్వులు ఈ విధంగా (ఏ విధంగా? కర్తను భోక్తను కానని తెలిసి. ముందు సాధనలో, తరువాత జ్ఞానాభివ్యక్తిలో) తెలుసుకుని కర్మ చేశారు. కనుక నీవు కర్మనే చేయి. ఊరకే కూర్చోవడంగాని, సంన్యాసంగాని నీకు కర్తవ్యంగాదు. పూర్వులు కూడా అనుష్ఠించారు. జనకుడు మొదలైన పూర్వులు చేసినట్లు కర్మచేయి, ఈనాడు చేయబడుతున్న విధంగా కాదు. ఆత్మజ్ఞానివి కాకుంటే ఆత్మశుద్ధి కొరకు కర్మచేయి; జ్ఞానివైతే లోకకల్యాణం కొరకు చేయి.

**భాష్యమ్ : 16.0 తత్ర కర్మ చేత్ కర్తవ్యం త్వద్వచనాదేవ కరోమి అహమ్, కిం విశేషితేన 'పూర్వైః పూర్వతరం కృతమ్' ఇతి? ఉచ్యతే – యస్మాత్ మహత్ వైషమ్యం కర్మణి, కథమ్?–**

**తె.అ.** కర్మ చేయవలసినదే అంటే నీ మాట చాలు, నేను చేస్తాను. పూర్వులు చేసినట్లు అని చెప్పడం ఎందుకు? అంటే, కర్మ విషయంలో పెద్ద వైషమ్యం ఉంది కనుక. ఎట్లా–

**మూ. కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః ।**
**తత్తే కర్మ ప్రవక్ష్యామి యద్ జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ ॥ 16**

**తె.అ.** ఏది కర్మ ఏది అకర్మ అనే విషయంలో మేధావులు కూడా భ్రమపడుతున్నారు. కనుక కర్మ అంటే ఏమిటో నేను నీకు వివరిస్తాను. అది తెలుసుకుని నీవు అశుభం నుండి ముక్తుడవవుతావు.

**భాష్యమ్ : 16.1 కిం కర్మేతి :– కిం కర్మ కిం చ అకర్మ ఇతి, కవయః మేధావినః అపి అత్ర అస్మిన్ కర్మాది విషయే, మోహితాః మోహం గతాః. తత్ అతః తే తుభ్యమ్, అహం కర్మ అకర్మ చ ప్రవక్ష్యామి. యద్ జ్ఞాత్వా విదిత్వా కర్మాది మోక్ష్యసే అశుభాత్ సంసారాత్.**

**తె.అ.** ఏది కర్మ ఏది అకర్మ అనే విషయంలో మేధావులు కూడా భ్రమపడుతున్నారు. కనుక నీకు నేను కర్మను అకర్మను వివరిస్తాను. అది తెలుసుకుని నీవు అశుభం నుండి అంటే సంసారం నుండి ముక్తుడవవుతావు.

**భాష్యమ్ : 17.0 న చ ఏతత్ త్వయా మన్తవ్యమ్ - కర్మ నామ దేహాది చేష్టా. లోకప్రసిద్ధమ్, అకర్మ తదక్రియా తూష్ణీమ్ ఆసనం, కిం తత్ర బోద్ధవ్యమ్ ఇతి. కస్మాత్? ఉచ్యతే-**

**తె.అ.** దేహాదుల చేష్టలు కర్మ అనీ అవి లేకుండా ఊరకే ఉండడం అకర్మ అని లోకంలో అందరికి తెలిసిందే. అందులో తెలుసుకునేది ఏముంది? అని నీవనుకొనరాదు. ఎందుకంటే, విను-

**మూ. కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః ।**
**అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః ॥ 17**

**తె.అ.** కర్మ వికర్మ అకర్మ- వీటితత్త్వం తెలుసుకోవలె. కర్మ తత్త్వం తెలుసుకోడం చాలా కష్టం.

**భాష్యమ్ : 17.1 కర్మణః ఇతి - కర్మణః శాస్త్రవిహితస్య హి యస్మాత్, అపి అస్తి బోద్ధవ్యం, బోద్ధవ్యం చ అస్తి ఏవ, వికర్మణః ప్రతిషిద్ధస్య, తథా అకర్మణశ్చ తూష్ణీంభావస్య బోద్ధవ్యమ్ అస్తి ఇతి త్రిష్వపి అధ్యాహారః కర్తవ్యః. యస్మాత్ గహనా విషమా దుర్జ్ఞేయా కర్మణః ఇతి ఉపలక్షణార్థం కర్మాదీనాం కర్మాకర్మవికర్మణాం, గతిః యాథాత్మ్యమ్ తత్త్వమిత్యర్థః**

**తె.అ.** శాస్త్ర విహితమైనది కర్మ. శాస్త్రం ప్రతిషేధించింది వికర్మ. ఏదీ చేయకుండా ఊరకే ఉండడం అకర్మ. ఈ మూటి యథార్థస్వరూపాన్ని తెలుసుకోవాలి. 'కర్మణోగతిః' అన్నచోట కర్మ అంటే కర్మ వికర్మ అకర్మ అని అర్థం చేసుకోవాలి. 'గతి' అంటే యథార్థస్వరూపం.

**భాష్యమ్ : 18.0 కిం పునః తత్త్వం కర్మాదేః యత్ బోద్ధవ్యం వక్ష్యామి ఇతి ప్రతిజ్ఞాతం ? ఉచ్యతే-**

**తె.అ.** భగవానుడు 'చెపుతాను, తెలుసుకోవలసినది' అని అన్న కర్మతత్త్వం ఏది? అంటే, చెపుతున్నాడు -

**మూ. కర్మణ్యకర్మ యః పశ్యేదకర్మణి చ కర్మ యః ।**
**స బుద్ధిమాన్ మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్ ॥ 18**

**తె.అ.** కర్మయందు అకర్మను; అకర్మయందు కర్మను చూచేవాడు బుద్ధిగలవాడు. అట్టివాడే యోగి. అతడే సమస్త కర్మలు చేసినవాడు.

**భాష్యమ్ : 18.1 కర్మణీతి :– కర్మణి – కర్మ క్రియతే ఇతి, వ్యాపారమాత్రమ్. తస్మిన్ కర్మణి అకర్మ కర్మాభావం, యః పశ్యేత్, అకర్మణి చ కర్మాభావే – కర్తృతన్త్రత్వాత్ ప్రవృత్తి నివృత్త్యోః వస్తు అప్రాప్యైవ హి సర్వ ఏవ క్రియాకారకాది వ్యవహారః అవిద్యాభూమౌ ఏవ – కర్మ యః పశ్యేత్ పశ్యతి, సః బుద్ధిమాన్ మనుష్యేషు, సః యుక్తః యోగీ, కృత్స్న కర్మకృత్ సమస్త కర్మకృత్ చ సః ఇతి స్తూయతే కర్మాకర్మణోః ఇతరేతరదర్శీ.**

**తె.అ.** కర్మ అంటే చేసే పని, చేష్ట. అకర్మ అంటే ఆ చేష్ట ఏదీ లేకపోవడం. ప్రవృత్తి నివృత్తులు కర్తృతంత్రం కనుక క్రియాకారకాది వ్యవహారమంతా వస్తువు ప్రాప్తించని అవిద్యాభూమి–యందే. ఈ విధంగా కర్మయందు అకర్మను, కర్మ లేకపోవడాన్ని; అకర్మయందు కర్మను చూచేవాడు బుద్ధిగలవాడు యోగి సమస్త కర్మలు చేసినవాడు అని కర్మాకర్మలయందు ఒకదానిలో మరొకటి చూచేవానిని స్తుతిస్తున్నాడు.

**భాష్యమ్ : 18.2 నను, కిమిదం విరుద్ధమ్ ఉచ్యతే 'కర్మణి అకర్మ యః పశ్యేత్' ఇతి 'అకర్మణి చ కర్మ' ఇతి? న హి కర్మ అకర్మ స్యాత్ అకర్మ వా కర్మ? తత్ర విరుద్ధం కథం పశ్యేత్ ద్రష్టా? నను అకర్మైవ పరమార్థతః సత్ కర్మవత్ అవభాసతే మూఢదృష్టేః లోకస్య, తథా కర్మైవ అకర్మవత్. తత్ర యథాభూతదర్శనార్థమాహ భగవాన్ 'కర్మణ్యకర్మ యః పశ్యేత్' ఇత్యాది. అతో న విరుద్ధమ్. బుద్ధిమత్త్వాద్యుపపత్తేశ్చ. 'బోద్ధవ్యమ్' ఇతి చ యథాభూతదర్శనమ్ ఉచ్యతే. న చ విపరీతజ్ఞానాత్ అశుభాత్ మోక్షణం స్యాత్. 'యద్ జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్' ఇతి చ ఉక్తమ్. తస్మాత్ కర్మాకర్మణీ విపర్యయేణ గృహీతే ప్రాణిభిః, తద్విపర్యయగ్రహణనివృత్త్యర్థం భగవతో వచనం 'కర్మణ్యకర్మయః' ఇత్యాది.**

**తె.అ.** ఆక్షేపణ : 'కర్మయందు అకర్మ చూచేవాడు' అని, 'అకర్మయందు కర్మ' అనీ, ఈ విరుద్ధమైన వాక్యానికి అర్థమేమిటి? కర్మ అకర్మ కాలేదు, అకర్మ కర్మ కాలేదు కదా? అటువంటపుడు విరుద్ధంగా ఎట్లా చూస్తాడు చూచేవాడు?

సమాధానం – వాస్తవంలో అకర్మ అయినది కర్మగా, అట్లాగే కర్మ అకర్మగా లోకంలో మూఢదృష్టికి కనిపిస్తున్నది గదా? ఆ కారణంగా ఉన్నదానిని చూడడం కొరకు కర్మయందు అకర్మ అన్న వాక్యం అన్నాడు భగవానుడు. కనుక అది విరుద్ధం కాదు. 'బుద్ధి గలవాడు' అన్నమాట కూడా అప్పుడే సార్థకమవుతుంది. 'తెలుసుకోవలసినది' (4.7) అని అన్నది ఉన్నదానిని ఉన్నట్లు చూడడం గురించే. 'దేనిని తెలుసుకొని అశుభం నుండి ముక్తుడవవుతావో' (4.16) అన్నాడు. విపరీత జ్ఞానంవల్ల అశుభం నుండి ముక్తి కలుగదు కదా? కనుక లోకులు కర్మను అకర్మను విపరీతంగా చూస్తున్నారని ఆ విపరీత దృష్టిని తొలగించడం కొరకు భగవానుడు కర్మయందు అకర్మ అంటున్నాడు.

**భాష్యమ్ : 18.3 న చ అత్ర కర్మాధికరణమ్ అకర్మ అస్తి కుణ్డే బదరాణీవ, నాపి అకర్మాధికరణం కర్మ అస్తి, కర్మాభావత్వాత్ అకర్మణః. అతః విపరీతగృహీతే ఏవ కర్మాకర్మణీ లౌకికైః యథా మృగతృష్ణికాయామ్ ఉదకం, శుక్తికాయాం వా రజతమ్.**

**తె.అ.** ఇక్కడ కుండలో రేగుపండ్లున్నట్టు కర్మకు ఆధారమైన అకర్మ లేదు. అకర్మకు ఆధారంగా కర్మ కూడా లేదు, అకర్మ అంటే కర్మ లేకపోవడం కనుక. ఎండమావిలో నీటివలె ముత్యపుచిప్పలో వెండివలె లోకులు కర్మను అకర్మను విపరీతంగా చూస్తున్నారు.

**భాష్యమ్ : 18.4 నను కర్మ కర్మైవ సర్వేషామ్, న క్వచిద్వ్యభిచరతి? తత్ న, నౌస్థస్య నావి గచ్ఛన్త్యాం తటస్థేషు అగతిషు నగేషు ప్రతికూలగతిదర్శనాత్, దూరేషు చక్షుషః అసంనికృష్టేషు గచ్ఛత్సు గత్యభావదర్శనాత్. ఏవమ్ ఇహాపి అకర్మణి 'అహం కరోమి' ఇతి కర్మ దర్శనం, కర్మణి చ అకర్మదర్శనం విపరీత దర్శనమ్, యేన తన్నిరాకరణార్థముచ్యతే 'కర్మణ్యకర్మ యః పశ్యేత్' ఇత్యాది.**

**తె.అ.** ఆక్షేపణ – కర్మ అందరికీ కర్మే కదా? ఎప్పుడూ కూడా కర్మే కదా?

సమాధానం – కాదు. నావలో కూర్చున్నవానికి, నావ వెళుతూ ఉన్నప్పుడు ఒడ్డున కదలకుండా ఉన్న చెట్లు ప్రతికూలదిశలో కదిలిపోతున్నట్లు, కదులుతూన్న దూరపు వస్తువులు (నక్షత్రాదులు) కదలనట్లు కనిపిస్తాయి. అదేవిధంగా ఇక్కడ కూడా అకర్మయందు (నిష్క్రియమైన ఆత్మయందు) నేను చేస్తున్నాను అని కర్మను చూడడం, కర్మయందు (నేను చేయడంలేదు అనే భావరూపమైన కర్మయందు) అకర్మను చూడడం విపరీతదర్శనం. దాన్ని తొలగించడం కొరకు భగవానుడు 'కర్మయందు అకర్మను' అన్న వాక్యం చెప్పాడు.

**భాష్యమ్ : 18.5 తత్ ఏతత్ ఉక్తప్రతివచనమ్ అపి అసకృత్ అత్యన్తవిపరీతదర్శనభావితతయా మోముహ్యమానః లోకః శ్రుతమపి అసకృత్ తత్త్వం విస్మృత్య, మిథ్యాప్రసంగమ్ అవతార్య అవతార్య చోదయతి ఇతి పునః పునః ఉత్తరమ్ ఆహ భగవాన్, దుర్విజ్ఞేయత్వం చ ఆలక్ష్య వస్తునః. 'అవ్యక్తోఽయమచిన్త్యోఽయమ్' (2.20), 'న జాయతే మ్రియతే' (2.25) ఇత్యాదినా ఆత్మని కర్మాభావః శ్రుతిస్మృతిన్యాయప్రసిద్ధః ఉక్తః వక్ష్యమాణః చ. తస్మిన్ ఆత్మని కర్మాభావే అకర్మణి కర్మవిపరీతదర్శనమ్ అత్యన్తనిరూఢమ్, యతః 'కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్రమోహితాః' (4.16) దేహాద్యాశ్రయం చ కర్మ ఆత్మని అధ్యారోప్య 'అహం కర్తా, మమ ఏతత్ కర్మ, మయా అస్య కర్మణః ఫలం భోక్తవ్యమ్' ఇతి చ, తథా 'అహం తూష్ణీం భవామి యేన అహం నిరాయాసః అకర్మా సుఖీ స్యామ్' ఇతి కార్యకరణాశ్రయం వ్యాపారోపరమం, తత్కృతం చ సుఖిత్వమ్ ఆత్మని అధ్యారోప్య 'న కరోమి కించిత్, తూష్ణీమ్ సుఖం ఆసే' ఇతి అభిమన్యతే**

**లోకః, తత్ర ఇదం లోకస్య విపరీతదర్శనాపనయనాయ ఆహ భగవాన్ 'కర్మణ్యకర్మ యః పశ్యేత్' ఇత్యాది.**

**తె.అ.** ఈ విషయం ఎన్నోసార్లు స్పష్టం చేసిందే అయినా, విపరీత దర్శనానికి అలవాటుపడిన మూఢులు ఎన్నిసార్లు విన్నా తత్త్వం ఎప్పటికప్పుడు మరచి మళ్ళీ మళ్ళీ మిథ్యాప్రసంగం చేస్తుంటారు. కనుక భగవానుడు చెప్పిందే మళ్ళీ మళ్ళీ చెపుతుంటాడు, ఆత్మతత్త్వం అర్థం చేసుకోవడంలోని కష్టం తెలుసుకొని. శ్రుతిస్మృతి న్యాయప్రసిద్ధమైన ఆత్మయందు కర్మలేదని 'అవ్యక్తోయమచిన్త్యోయమ్' 'న జాయతే మ్రియతే' (2.20, 25) మొదలైన శ్లోకాల్లో చెప్పాడు, ముందు చెప్పబోతున్నాడు కూడా. ఆ నిష్క్రియమైన ఆత్మయందు కర్మను చూడడమనే విపరీతం అత్యంత స్వాభావికం. అందుకనే 'ఏది కర్మ ఏది కర్మకాదు అనే విషయంలో పండితులు కూడా మూఢులు' (4.16) అన్నాడు. దేహాదులను ఆశ్రయించిన కర్మను ఆత్మయందు ఆరోపించి "నేను కర్తను, ఇది నాకు కర్తవ్యము, ఈ కర్మఫలం నేను అనుభవిస్తాను" అనీ, "నేను ఊరకనే ఉంటాను, నాకు ఆయాసం లేదు, ఏమీ చేయకుండా సుఖంగా ఉన్నాను" అని దేహేంద్రియ వ్యాపారం ఆపి అందువల్ల కలిగే సుఖాన్ని ఆత్మయందు ఆరోపించి "నేనేమీ చేయడం లేదు, ఊరకే సుఖంగా ఉన్నాను" అని లోకం అనుకుంటుంది. ఈ విపరీత దర్శనం తొలగించడం కొరకు భగవానుడు 'కర్మయందు అకర్మ' అనే వాక్యం చెప్పాడు.

**భాష్యమ్ : 18.6 అత్ర చ కర్మ కర్మైవ సత్ కార్యకరణాశ్రయం కర్మరహితే అవిక్రియే ఆత్మని సర్వైః అధ్యస్తమ్, యతః పణ్డితోఽపి 'అహం కరోమి' ఇతి మన్యతే. అతః ఆత్మ సమవేతతయా సర్వలోకప్రసిద్ధే కర్మణి, నదీకూలస్థేష్వివ వృక్షేషు గతిః ప్రాతిలోమ్యేన, అకర్మ కర్మాభావం యథాభూతం, గత్యభావమివ వృక్షేషు, యః పశ్యేత్, అకర్మణి చ కార్యకరణ వ్యాపారోపరమే, కర్మవత్ ఆత్మన్యధ్యారోపితే, 'తూష్ణీమ్ అకుర్వన్ సుఖమ్ ఆసే' ఇతి అహంకారాభిసంధి హేతుత్వాత్, తస్మిన్ అకర్మణి చ కర్మ యః పశ్యేత్, యః ఏవం కర్మాకర్మ విభాగజ్ఞః సః బుద్ధిమాన్ పణ్డితః మనుష్యేషు, సః యుక్తః యోగీ, కృత్స్నకర్మకృచ్చ, సః అశుభాత్ మోక్షితః కృతకృత్యో భవతి ఇత్యర్థః.**

**తె.అ.** దేహేంద్రియాల ఆశ్రయంతో జరిగే కర్మ కర్మే. కాని కర్మ చేయని ఆత్మయందు ఆ కర్మను ఆరోపిస్తున్నది లోకం. పండితుడు కూడా నేను (ఆత్మ) చేస్తున్నాను అనుకుంటాడు. నదిగట్టున ప్రతికూలంగా కదలిపోతున్నట్లు కనిపించే చెట్లు నిజంగా కదలడం లేదని తెలుసుకున్నట్లు, లోకమంతా ఆత్మకు అంటగడుతున్న కర్మ నిజంగా ఆత్మచేయడం లేదని తెలుసుకోవడం కర్మలో అకర్మను చూడడం. అదేవిధంగా దేహేంద్రియాల పని ఆపి నేను ఏమీ చేయడంలేదు సుఖంగా

ఉన్నాను అనుకొని ఆ అకర్మను కూడా కర్మను వలె ఆత్మయందు ఆరోపిస్తున్నారు. అహంకారంతో కూడింది కనుక ఆ అకర్మ కూడా కర్మే. ఈ విధంగా కర్మలో అకర్మను, అకర్మలో కర్మను చూచేవాడు కర్మను అకర్మను వేరు చేసి తెలుసుకున్నవాడు పండితుడు, యోగి సమస్త కర్మలు చేసినవాడు. అతడు అశుభం నుండి ముక్తుడు.

**భాష్యమ్ : 18.7 అయం శ్లోకః అన్యథా వ్యాఖ్యాతః కైశ్చిత్. కథమ్? నిత్యానాం కిల కర్మణామ్ ఈశ్వరార్థత్వేన అనుష్ఠీయమానానాం తత్ఫలాభావాత్ అకర్మాణి తాని ఉచ్యన్తే గౌణ్యా, వృత్త్యా. తేషాం చ అకరణం అకర్మ, తచ్చ ప్రత్యవాయఫలత్వాత్ కర్మ ఉచ్యతే గౌణ్యా వృత్త్యా. తత్ర నిత్యే కర్మణి అకర్మ యః పశ్యేత్ ఫలాభావాత్, యథా ధేనుః అపి గౌః అగౌః ఉచ్యతే క్షీరాఖ్యం ఫలం న ప్రయచ్ఛతి ఇతి, తద్వత్. తథా నిత్యాకరణే తు అకర్మణి కర్మ యః పశ్యేత్ నరకాదిప్రత్యవాయఫలం ప్రయచ్ఛతి ఇతి.**

**తె.అ.** కొందరీ శ్లోకాన్ని మరోవిధంగా వ్యాఖ్యానించారు. ఎట్లా? ఈశ్వరార్పణంగా అనుష్ఠించే నిత్యకర్మలు ఫలమివ్వవు కనుక వాటిని గౌణార్థంలో (అముఖ్యార్థంలో) అకర్మలు అనవచ్చు. వాటిని అనుష్ఠించకపోవడం అకర్మ. ఆ అకర్మ ప్రత్యవాయఫలం ఇచ్చేదికనుక దానిని గౌణార్థంలో కర్మ అనవచ్చు. నిత్యకర్మలు ఫలమివ్వవు కనుక వాటియందు అకర్మను చూచేవాడు, పాలివ్వని ఆవును ఆవు అయినప్పటికీ ('ఇది ఆవు కాదు') (అగౌః) అన్నట్లు; అట్లాగే నిత్యకర్మలు చేయకపోవడం అనే అకర్మ, నరకాది ప్రత్యవాయ ఫలమిచ్చేది కనుక, దానిని కర్మగా చూచేవాడు అని (వ్యాఖ్యానించారు).

**భాష్యమ్ : 18.8 నైతత్ యుక్తం వ్యాఖ్యానమ్, ఏవం జ్ఞానాత్ అశుభాత్ మోక్షానుపపత్తేః, 'యద్ జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్' ఇతి భగవతా ఉక్తం వచనం బాధ్యేత. కథమ్? నిత్యానామ్ అనుష్ఠానాత్ అశుభాత్ స్యాన్నామ మోక్షణం, న తు తేషాం ఫలాభావజ్ఞానాత్. న హి నిత్యానాం ఫలాభావజ్ఞానం అశుభముక్తిఫలత్వేన చోదితం, నిత్యకర్మజ్ఞానం వా. న చ భగవతా ఇహైవ ఉక్తమ్. ఏతేన అకర్మణి కర్మదర్శనం ప్రత్యుక్తమ్. న హి అకర్మణి 'కర్మేతి' దర్శనం కర్తవ్యతయా ఇహ చోద్యతే, నిత్యస్య తు కర్తవ్యతామాత్రమ్. న చ 'అకరణాత్ నిత్యస్య ప్రత్యవాయో భవతి' ఇతి విజ్ఞానాత్ కించిత్ ఫలం స్యాత్. నాపి నిత్యాకరణం జ్ఞేయత్వేన చోదితమ్. నాపి 'కర్మ అకర్మ' ఇతి మిథ్యాదర్శనాత్ అశుభాత్ మోక్షణమ్, బుద్ధిమత్త్వమ్, యుక్తతా, కృత్స్నకర్మకృత్త్వాది చ ఫలమ్ ఉపపద్యతే, స్తుతిర్వా. మిథ్యాజ్ఞానమేవ హి సాక్షాత్ అశుభస్వరూపం, కుతః అన్యస్మాత్ అశుభాత్ మోక్షణమ్? న హి తమః తమసః నివర్తకం భవతి.**

**తె.అ.** ఈ వ్యాఖ్యానం సరికాదు. ఈ విధమైన జ్ఞానంవల్ల భగవానుడు (4.26 లో) చెప్పినట్లు అశుభం నుండి విముక్తి కలగదు కనుక. ఎట్లా? నిత్యకర్మల అనుష్ఠానంవల్ల అశుభం నుండి ముక్తి కలగవచ్చును గాని, ఆ కర్మలకు ఫలం లేదు అన్న జ్ఞానంవల్ల ముక్తి కలగదు. నిత్యకర్మలకు ఫలం లేదని తెలుసుకోవడంవల్ల గాని, నిత్యకర్మలను తెలుసుకోవడం వల్లగాని అశుభం నుండి ముక్తి పొందవచ్చునన్న విధి లేదు. భగవానుడు కూడా గీతలో ఆ మాట అనలేదు. కనుక అకర్మయందు కర్మదర్శనం అన్న ఈ వ్యాఖ్యానం నిలువదు. నిత్యకర్మలు కర్తవ్యమని మాత్రమే విధించబడింది గాని, అకర్మయందు కర్మదర్శనం (నిత్యకర్మలు చేయకపోవడమనే అకర్మయందు ప్రత్యవాయ ఫలమనే కర్మను దర్శించడం) కర్తవ్యమన్న విధిలేదు. నిత్యకర్మలు చేయకపోవడం వల్ల పాపం కలుగుతుందన్న జ్ఞానంవల్ల ఏమీ ఫలం లేదు. నిత్యకర్మలను చేయకపోవడం తెలుసుకోదగిన విషయంగా కూడా విధించబడలేదు. కర్మను అకర్మ అని తప్పుగా చూడడంవల్ల అశుభం నుండి ముక్తి, వివేకము, యోగము, కృతకృత్యత మొదలైన ఫలం కలగదు. అట్లా తప్పుగా చూడడాన్ని పొగడడంలో అర్థమూ లేదు. మిథ్యాజ్ఞానమే స్వయంగా అశుభస్వరూపం. మరో అశుభం నుండి అది ముక్తిని ఎట్లా ఇవ్వగలుగుతుంది? చీకటి చీకటిని తొలగించలేదు కదా.

**భాష్యమ్ : 18.9 నను కర్మణి యత్ అకర్మదర్శనమ్ అకర్మణి వా కర్మదర్శనం న తత్ మిథ్యాజ్ఞానమ్, కిం తర్హి? గౌణం ఫలభావాభావనిమిత్తమ్ – న, కర్మాకర్మ విజ్ఞానాదపి గౌణాత్ ఫలాశ్రవణాత్. నాపి శ్రుతహాన్యశ్రుతకల్పనాయాం కశ్చిద్విశేషోఽ పలభ్యతే. స్వశబ్దేనాపి శక్యం వక్తుం 'నిత్యకర్మణాం ఫలం నాస్తి. అకరణాచ్చ తేషాం నరకపాతః స్యాత్' ఇతి. తత్ర వ్యాజేన పరవ్యామోహరూపేణ 'కర్మణ్యకర్మ యః పశ్యేత్' ఇత్యాదినా కిమ్? తత్రైవం వ్యాచక్షాణేన భగవతోక్తం వాక్యం లోకవ్యామోహార్థమ్ ఇతి వ్యక్తం కల్పితం స్యాత్. న చ ఏతత్ ఛద్మరూపేణ వాక్యేన రక్షణీయం వస్తుః నాపి శబ్దాన్తరేణ పునః పునః ఉచ్యమానం సుబోధం స్యాత్ ఇత్యేవం వక్తుం యుక్తమ్. 'కర్మణ్యేవాధికారస్తే' (2.47) ఇత్యత్ర హి స్ఫుటతరః ఉక్తః అర్థః న పునః వక్తవ్యః భవతి. సర్వత్ర చ ప్రశస్తం బోద్ధవ్యం చ కర్తవ్యమేవ, న నిష్ప్రయోజనం బోద్ధవ్యమ్ ఇత్యుచ్యతే. న చ మిథ్యాజ్ఞానం బోద్ధవ్యం భవతి, తత్ప్రత్యుపస్థాపితం వా వస్త్వా భాసమ్.**

**తె.అ.** ఆక్షేపణ– కర్మయందు అకర్మను చూడడంగాని, అకర్మయందు కర్మను చూడడంగాని మిథ్యాజ్ఞానం కాదు – ఫలం ఉండడం లేకపోవడం అన్న గౌణార్థంలో గ్రహించవలె.

సమాధానం–కాదు. గౌణార్థంలో కర్మాకర్మలను తెలుసుకోవడం వల్ల ఫలం ఉందని వినలేదు కనుక. విన్నదాన్ని వదలి, విననిదాన్ని కల్పించడం వల్ల ప్రయోజనమేమీ లేదు. 'నిత్యకర్మలకు

ఫలం లేదు, అవి చేయకపోవడం వల్ల నరకంలో పడతారు' అని సూటిగా చెప్పవచ్చు గదా, డొంక తిరుగుడుగా ఇతరులను తికమక పెట్టే విధంగా 'కర్మయందకర్మను' అనడమెందుకు? ఈ విధంగా వ్యాఖ్యానించేవారు భగవానుడు లోకాన్ని తికమకపెట్టేందుకే ఈ వాక్యం చెప్పాడు అని అనుకోవలసి వస్తుంది. మారుమాటలతో మరుగుపరచి కాపాడవలసిన వస్తువు కాదిది. వేరువేరు మాటలతో చెప్పిన విషయాన్నే మళ్ళీ చెప్పడం చేత విషయం బాగా అర్థం అవుతుంది అని ఈ విధంగా చెప్పాడు అనడానికి కూడా లేదు. 'కర్మణ్యేవాధికారః' (2.47) అనేచోట సుస్పష్టంగా చెప్పిన విషయం మళ్ళీ చెప్పవలసిన అవసరం లేదు. ఎవరైనా కర్తవ్యాన్ని పొగడుతారు, తెలుసుకోవలసినది అంటారు. నిష్ప్రయోజనమైన దానిని తెలుసుకోదగింది అని ఎవరూ అనరు. మిథ్యాజ్ఞానం తెలుసుకోవలసిన విషయం కాదు. ఆ జ్ఞానం వల్ల మనం తెలుసుకునే వస్తువు కూడా తెలుసుకోదగింది కాదు. అది నిజానికి వస్తువు కాదు, వస్తువు వలె కనిపించేది మాత్రమే కనుక.

**భాష్యమ్ : 18.10 నాపి నిత్యానామ్ అకరణాత్ అభావాత్ ప్రత్యవాయభావోత్పత్తిః, 'నాసతో విద్యతే భావః' (2.16) ఇతి, 'కథమసతః సజ్జాయేత' (ఛాం.ఉ.6.2.2) ఇతి చ దర్శితమ్ అసతః సజ్జన్మప్రతిషేధాత్. అసతః సదుత్పత్తిం బ్రువతా అసదేవ సద్ భవేత్ సచ్చ అసద్భవేత్ ఇతి ఉక్తం స్యాత్. తచ్చ అయుక్తమ్, సర్వప్రమాణవిరోధాత్. న చ నిష్ఫలం విదధ్యాత్ కర్మ శాస్త్రమ్, దుఃఖస్వరూపత్వాత్, దుఃఖస్య చ బుద్ధిపూర్వకతయా, కార్యత్వానుపపత్తేః. తదకరణే చ నరకపాతాభ్యుపగమాత్ అనర్థాయైవ ఉభయథాపి కరణే అకరణే చ శాస్త్రం నిష్ఫలం కల్పితం స్యాత్. స్వాభ్యుపగమవిరోధశ్చ – 'నిత్యం నిష్ఫలం కర్మే'తి అభ్యుపగమ్య 'మోక్షఫలాయ' ఇతి బ్రువతః. తస్మాత్ యథాశ్రుత ఏవ అర్థః 'కర్మణ్యకర్మ' ఇత్యాదేః. తథా చ వ్యాఖ్యాతః అస్మాభిః శ్లోకః.**

**తె.అ.** నిత్యకర్మలు చేయకపోవడమనే అభావం నుండి పాపమనే భావం కలుగదు. 'నాసతో విద్యతే భావః' (2.16) అని 'కథం అసతః సజ్జాయేత' (ఛాం.ఉ.6.2.2) అని అసత్తు నుండి సత్తు పుట్టడం జరగదని చెప్పబడింది. అసత్తు నుండి సత్తు పుడుతుంది అంటే అసత్తు సత్తు అవుతుందని; సత్తు అసత్తు అవుతుందని అన్నట్లే. ఇది అన్యాయం, అన్ని ప్రమాణాలకు విరుద్ధం. శాస్త్రం నిష్ఫలమైన కర్మను విధించదు. ఎందుకంటే అటువంటి కర్మలో కష్టం తప్ప మరేమీ ఉండదు కనుక. కావాలని కష్టాన్ని ఎవడూ కొని తెచ్చుకోడు. చేస్తే కష్టం తప్ప మరేమీ లేదు. చేయకపోతే నరకంలో పడతావు అంటున్నారు. అంటే రెండు విధాలుగా, చేసినా చేయకపోయినా అనర్థమే. అటువంటి కర్మను విధించేది కనుక శాస్త్రం నిష్ఫలం అన్నట్టు అవుతుంది. ఈ

విధంగా వ్యాఖ్యానించేవారు వారి మాటను వారే ఖండిస్తున్నారు కూడా. 'నిత్యకర్మ నిష్ఫలము' అని చెప్పి మళ్ళీ 'దానివల్ల మోక్షం కలుగుతుంది' అంటున్నారు. కనుక 'కర్మయందు అకర్మను' అనే వాక్యానికి విన్నదే ఉన్న అర్థం. మేము ఈ శ్లోకాన్ని అదేవిధంగా వ్యాఖ్యానించాము.

**భాష్యమ్ : 19.0 తదేతత్ కర్మణి అకర్మాది దర్శనం స్తూయతే–**

**తె.అ.** కర్మయందు అకర్మను చూడడాన్ని స్తుతిస్తున్నాడు.

**మూ. యస్య సర్వే సమారమ్భాః కామసంకల్పవర్జితాః ।**
**జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పణ్డితం బుధాః ॥ 19**

**తె.అ.** కామము, సంకల్పము లేకుండా చేయబూనిన పనులన్నీ జ్ఞానాగ్నిలో కాలిపోతాయి. (కాలిపోయిన కర్మ బీజం నుండి ఏ శరీరము పుట్టదు. సంసారము మొలకెత్తదు) ఆ విధంగా కర్మలు చేసేవాణ్ణి పండితుడని విద్వాంసులు అంటారు.

**భాష్యమ్ : 19.1 యస్యేతి – యస్య యథోక్తదర్శినః, సర్వే యావన్తః సమారమ్భాః సర్వాణి, కర్మాణి, సమారభ్యన్తే ఇతి సమారమ్భాః, కామసంకల్పవర్జితాః కామైః తత్కారణైః చ సంకల్పైః వర్జితాః, ముధైవ చేష్టామాత్రాః అనుష్ఠీయన్తే, ప్రవృత్తేన చేత్ లోకసంగ్రహార్థం, నివృత్తేన చేత్ జీవనమాత్రార్థం, తం జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం, కర్మాదౌ అకర్మాదిదర్శనం జ్ఞానం, తదేవ అగ్నిః, తేన జ్ఞానాగ్నినా దగ్ధాని శుభాశుభలక్షణాని కర్మాణి యస్య తమ్, ఆహుః పరమార్థతః, పణ్డితం, బుధాః బ్రహ్మవిదః.**

**తె.అ.** సమారంభములు అంటే చేయబూనినవి కర్మలు అని అర్థం. వెనుకటి శ్లోకంలో చెప్పిన విధంగా చూడగలవాడు (అంటే కర్మ యందు అకర్మను చూడగలవాడు) ఏ కర్మ చేసినా ఇది కావలెననే కోరిక గాని ఇది సిద్ధించవలెననే సంకల్పము ఉండవు. అతడు చేసేవన్నీ స్వప్రయోజనం లేని చేష్టలు మాత్రమే. ప్రవృత్తుడైతే లోకకల్యాణం కొరకు చేస్తాడు, నివృత్తుడైతే జీవనమాత్రం కొరకు. కర్మాదుల యందు అకర్మాదులను చూడడం జ్ఞానం. అదే అగ్ని. ఎవని ఆ జ్ఞానాగ్నిలో శుభాశుభకర్మలు కాలిపోతాయో అతనిని బ్రహ్మవేత్తలు నిజమైన పండితుడు అంటారు.

**భాష్యమ్ : 20.0 యస్తు కర్మాదౌ అకర్మాదిదర్శీ సః అకర్మాదిదర్శనాత్ ఏవ నిష్కర్మా సంన్యాసీ జీవనమాత్రార్థ చేష్టః సన్ కర్మణి న ప్రవర్తతే. యద్యపి ప్రాక్ వివేకతః ప్రవృత్తః. యః తు ప్రారబ్ధకర్మా సన్ ఉత్తరకాలమ్ ఉత్పన్నాత్మసమ్యగ్ దర్శనః స్యాత్ సః సర్వకర్మణి ప్రయోజనమ్ అపశ్యన్ ససాధనం కర్మ పరిత్యజత్యేవ. సః కుతశ్చిత్ నిమిత్తాత్ కర్మ పరిత్యాగాసంభవే సతి కర్మణి తత్ఫలే చ సంగరహితతయా, స్వప్రయోజనాభావాత్ లోకసంగ్రహార్థం పూర్వవత్ కర్మణి**

**ప్రవృత్తః అపి నైవ కించిత్ కరోతి, జ్ఞానాగ్నిదగ్ధకర్మత్వాత్, తదీయం కర్మ అకర్మైవ సంపద్యతే ఇత్యేతమ్ అర్థం దర్శయన్ ఆహ–**

**తె.అ.** కర్మయందు అకర్మను; అకర్మయందు కర్మను చూచేవాడు అకర్మాది దర్శనమాత్రం చేత కర్మరహితుడు సంన్యాసి. జ్ఞానం కలుగక ముందు కర్మలయందు ప్రవృత్తుడై ఉండినా, జ్ఞానం కలిగిన తరువాత జీవించి ఉండడానికి మాత్రమే తప్ప ఎటువంటి కర్మలు చేయడంలో ప్రవృత్తి లేనివాడు. కర్మలు ప్రారంభించిన తరువాత ఆత్మ సమ్యగ్దర్శనం కలిగితే, కర్మలన్నీ నిష్ప్రయోజనమని తెలుసుకుని కర్మను, కర్మసాధనాలను వదలివేస్తాడు. ఏ కారణం చేతనైనా కర్మను వదలకపోయినా, చేసే కర్మలో దాని ఫలంలో స్వప్రయోజనం లేదు కనుక ఆసక్తి లేకుండా లోకకల్యాణం కొరకు పూర్వం వలెనే కర్మ చేస్తూ ఉన్నా నిజానికి అతడేమీ చేయడంలేదు. జ్ఞానాగ్నిలో దగ్ధం కావడంచేత అతని కర్మ అకర్మే అవుతుంది. ఈ అర్థాన్ని చూపడానికి భగవానుడు అంటున్నాడు –

**మూ. త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః ।**
**కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః ॥ 20**

**తె.అ.** కర్మఫలం పై కోర్కె లేక నిత్యతృప్తుడై, నిరాశ్రయుడైనవాడు కర్మలయందు ప్రవృత్తుడైనప్పటికి అతడు ఏమీ చేయనివాడే.

**భాష్యమ్ : 20.1 త్యక్త్వేతి : త్యక్త్వా కర్మసు అభిమానం ఫలాసంగం చ యథోక్తేన జ్ఞానేన, నిత్యతృప్తః నిరాకాంక్షః విషయేషు ఇత్యర్థః – నిరాశ్రయః ఆశ్రయరహితః ఆశ్రయః నామ యత్ ఆశ్రిత్య పురుషార్థం సిసాధయిషతి. దృష్టాదృష్టేష్టఫలసాధనాశ్రయరహితః ఇత్యర్థః. విదుషా క్రియమాణం కర్మ పరమార్థతః అకర్మైవ, తస్య నిష్క్రియాత్మదర్శనసంపన్నత్వాత్. తేన ఏవంభూతేన ప్రయోజనాభావాత్ ససాధనం కర్మపరిత్యక్తవ్యమ్ ఏవ ఇతి ప్రాప్తే తతః నిర్గమాసంభవాత్, లోకసంగ్రహచికీర్షయా, శిష్టవిగర్హణాపరిజిహీర్షయా వా పూర్వవత్ కర్మణి అభిప్రవృత్తః అపి నిష్క్రియాత్మ దర్శనసంపన్నత్వాత్ నైవ కించిత్ కరోతి సః.**

**తె.అ.** కర్మలయందు అభిమానము కర్మఫలంపై ఆసక్తి లేకుండా, వెనుకచెప్పిన జ్ఞానం చేత నిత్యతృప్తుడై, అంటే ఏ వస్తువుపై కూడా కాంక్ష లేనివాడై, నిరాశ్రయుడై అంటే ఈ లోకంలో గాని, పరలోకంలోగాని కోరిన ఫలాన్ని సాధించడం కొరకు దేనినీ ఎవరినీ ఆశ్రయించనివాడై, తెలిసినవాడు చేసే కర్మ నిజానికి అకర్మే, ఆత్మ ఏదీ చేయదు (నేనేదీ చేయడం లేదు) అని తెలిసినవాడు కనుక. అటువంటివాడు స్వప్రయోజనమేమీ లేదు కనుక కర్మనూ, సాధనాలనూ కూడా వదలివేయాలి. కాని కర్మలనుండి బయటపడే దారిలేక లోకకళ్యాణం కొరకో, శిష్టులచేత

నిందపడకుండా ఉండటం కొరకో పూర్వంవలెనే కర్మలు చేస్తూ ఉండేవాడు కూడా నేనేమీ చెయ్యడం లేదు అని తెలిసినవాడు కనుక ఏమీ చెయ్యనివాడే.

**భాష్యమ్ : 21.0 యః పునః పూర్వోక్త విపరీతః ప్రాగేవ కర్మారమ్భాత్ బ్రహ్మణి సర్వాన్తరే ప్రత్యగాత్మ నిష్క్రియే సంజాతాత్మదర్శనః సః దృష్టాదృష్టేష్టవిషయాశీర్వివర్జితతయా దృష్టాదృష్టార్థే కర్మణి ప్రయోజనమ్ అపశ్యన్ ససాధనం కర్మ సంన్యస్య శరీరయాత్రామాత్రచేష్టః యతిః జ్ఞాననిష్ఠః ముచ్యతే ఇత్యేతమ్ అర్థం దర్శయితుమ్ ఆహ–**

**తె.అ.** ఈ విధంగా కాక, కర్మలు ప్రారంభించకపూర్వమే 'సర్వాంతర్యామి అయిన నిష్క్రియ బ్రహ్మము నేనే' అని తెలుసుకున్న సంన్యాసి జ్ఞాననిష్ఠుడై ఉంటాడు. కనిపించే ఈ లోకంలో గాని కనిపించని పరలోకాలలో గాని అతనికి ఏ వస్తువుపైగాని ఆశలేదు. కనుక వాటి కొరకు చేసే కర్మలు అతనికి నిష్ప్రయోజనంగా కనిపిస్తాయి. కనుక కర్మలను వాటి సాధనాలను వదలివేసి శరీరయాత్రకు మాత్రం అవసరమైన పనులు చేసుకుంటూ ముక్తుడౌతాడు అనే అర్థంతో చెపుతున్నాడు–

**మూ. నిరాశీర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః।**
**శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥ 21**

**తె.అ.** ఏ కోరికలు లేకుండా, మనస్సును దేహేంద్రియాలను వశంలో ఉంచుకొని, తనదంటూ ఏదీ లేకుండా వదలివేసి కేవలం శరీరకర్మ మాత్రమే చేస్తూ ఉండేవాడు కూడా పాపం పొందదు.

**భాష్యమ్ : 21.1 నిరితి :– నిరాశీః నిర్గతాః ఆశిషః యస్మాత్ సః నిరాశీః, యత చిత్తాత్మా చిత్తమ్ అన్తఃకరణమ్, ఆత్మా బాహ్యః కార్యకరణసంఘాతః, తౌ, ఉభౌ అపి యతౌ సంయతౌ యేన సః, యతచిత్తాత్మా, త్యక్తసర్వపరిగ్రహః – త్యక్తః సర్వః పరిగ్రహః యేన సః త్యక్త సర్వః పరిగ్రహః శారీరమ్ శరీరస్థితిమాత్రప్రయోజనమ్, కేవలమ్, తత్రాపి అభిమానవర్జితమ్, కర్మ కుర్వన్ న ఆప్నోతి న ప్రాప్నోతి కిల్బిషమ్ పాపం అనిష్టరూపం ధర్మం చ. ధర్మోఽపి ముముక్షోః కిల్బిషమేవ, బన్ధాపాదకత్వాత్, తస్మాత్ తాభ్యాం ముక్తః భవతి సంసారముక్తః భవతీత్యర్థః.**

**తె.అ.** ఎవనిని ఆశలు వదలి వెళ్ళినవో ఆతడు నిరాశి. చిత్తమంటే అంతఃకరణం. ఆత్మ అంటే (ఇక్కడ) బాహ్యమైన దేహేంద్రియాల కూడిక. అంతఃకరణాన్ని ఆత్మను నియమించినవాడు యతచిత్తాత్ముడు. తనకున్న వస్తువులనన్నిటినీ వదలివేసినవాడు త్యక్త సర్వపరిగ్రహుడు. అటువంటివాడు శరీరం నిలిచి ఉండడానికిమాత్రం అవసరమైన పనులు చేసుకుంటూ, అది కూడా అభిమానం లేకుండా, ఉండేవాడు అనిష్టరూపమైన పాపంగాని పుణ్యంగాని పొందడు.

మోక్షం కోరుకునేవానికి  పుణ్యం కూడా అనిష్టమే, బంధం కలిగిస్తుంది కనుక. పుణ్యపాపాల నుండి ముక్తుడు అంటే సంసారం నుండి ముక్తుడు అని అర్థం.

**భాష్యమ్ : 21.2 (కించ) 'శారీరం కేవలం కర్మ' ఇత్యత్ర కిం శరీర నిర్వర్త్యం శారీరం కర్మ అభిప్రేతమ్? ఆహోస్విత్ శరీరస్థితిమాత్రప్రయోజనం శారీరం కర్మ ఇతి? కిం చాతః యది శరీర నిర్వర్త్యం శారీరం కర్మ, యది వా శరీర స్థితిమాత్రప్రయోజనం శారీరమ్ ఇతి? ఉచ్యతే- యదా శరీర నిర్వర్త్ యం కర్మ శారీరం అభిప్రేతం స్యాత్ తదా దృష్టాదృష్టప్రయోజనం కర్మ ప్రతిషిద్ధమపి శరీరేణ కుర్వన్ న ఆప్నోతి కిల్బిషమ్ ఇతి బ్రువతః విరుద్ధాభిధానం ప్రసజ్యేత. శాస్త్రీయం చ కర్మ దృష్టాదృష్ట ప్రయోజనం శరీరేణ కుర్వన్ ఇతి విశేషణాత్ కేవల శబ్ద ప్రయోగాచ్చ వాఙ్మనసనిర్వర్త్యం కర్మ విధిప్రతిషేధవిషయం ధర్మాధర్మశబ్దవాచ్యం కుర్వన్ నాప్నోతి కిల్బిషమ్ ఇత్యపి బ్రువతః అప్రాప్త ప్రతిషేధప్రసంగః 'శారీరం కర్మ కుర్వన్' ఇతి విశేషణాత్ కేవలశబ్దప్రయోగాత్ చ వాఙ్మనసాభ్యాం నిర్వర్త్య కర్మ విధిప్రతిషేధవిషయం ధర్మాధర్మశబ్దవాచ్యం కుర్వన్ ప్రాప్నోతి కిల్బిషం ఇత్యుక్తం స్యాత్. తత్రాపి వాఙ్మనసాభ్యాం విహితానుష్ఠాన పక్షే కిల్బిష ప్రాప్తివచనం విరుద్ధమ్ ఆపద్యేత. ప్రతిషిద్ధ సేవాపక్షేఽపి భూతార్థానువాదమాత్రం అనర్థకం స్యాత్. యదా తు శరీరస్థితిమాత్రప్రయోజనం శారీరం కర్మ అభిప్రేతం భవేత్, తదా దృష్టాదృష్టప్రయోజనం కర్మ విధిప్రతిషేధగమ్యం శరీర వాఙ్మనో నిర్వర్త్యమ్ అన్యత్ అకుర్వన్ తైరేవ శరీరాదిభిః శరీరస్థితిమాత్రప్రయోజనం కేవలశబ్ద- ప్రయోగాత్ 'అహం కరోమి' ఇతి అభిమాన వర్జితః శరీరాది చేష్టామాత్రం లోకదృష్ట్యా కుర్వన్ న ఆప్నోతి కిల్బిషమ్. ఏవంభూతస్య పాపశబ్దవాచ్య కిల్బిషప్రాప్త్యసంభవాత్, కిల్బిషం సంసారం న ప్రాప్నోతి, జ్ఞానాగ్నిదగ్ధసర్వకర్మత్వాత్, అప్రతిబన్ధేన ముచ్యతే ఏవ ఇతి పూర్వోక్త సమ్యగ్దర్శనఫలానువాదః ఏవ ఏషః. ఏవం 'శారీరం కేవలం కర్మ' ఇత్యస్య అర్థపరిగ్రహే నిరవద్యం భవతి.**

**తె.అ.** 'శారీరం కేవలం కర్మ' అంటే ఏమిటి? శరీరం నిర్వర్తించే కర్మ అని అర్థమా? శరీరం నిలిచి ఉండడానికి మాత్రమే అవసరమైన కర్మ అని అర్థమా? అంటే చెపుతున్నాడు. శరీరం నిర్వర్తించే కర్మ శారీరమని అర్థం చెపితే, కనిపించే ఈ లోకంలో గాని కనిపించని మరో లోకంలోగాని ప్రయోజనం కొరకు చేసే ప్రతిషిద్ధ కర్మవల్ల కూడా పాపం కలగదు అని భగవానుడు అన్నాడు అనే విరుద్ధార్థం వస్తుంది. శాస్త్రం విధించిన కర్మ ఇహంలోగాని పరంలోగాని ఏదో ప్రయోజనం కొరకు, శరీరం చేత నిర్వర్తించినపుడు పాపం లేదు అని చెప్పడం అనవసరం, పాపమని ఎవరూ అనడం లేదు కనుక. 'శరీర కర్మ చేసి' అనడం చేత, మళ్ళీ 'కేవలం' అనే విశేషణం వాడడం చేత, (శరీరం నిర్వర్తించే కర్మ అని అర్థం చెప్పేటట్లయితే) శరీరంతో కాక

మాటతో మనస్సుతో నిర్వర్తించే కర్మ, శాస్త్రం విధించింది గాని ప్రతిషేధించింది గాని ధర్మం కాని అధర్మం కాని, చేయడం వల్ల పాపం కలుగుతుంది అన్న అర్థం వస్తుంది. అంటే శాస్త్రం విధించిన కర్మ కూడా శరీరంతో కాక మనోవాక్కుల చేత నిర్వర్తించినపుడు పాపం కలుగుతుంది అన్న విరుద్ధార్థం వస్తుంది. ఇక శాస్త్రం ప్రతిషేధించిన కర్మ విషయంలో పాపం కలుగుతుంది అని చెప్పవలసిన పనిలేదు, అది అనవసర ప్రసంగం. అట్లా కాకుండా, శరీరస్థితిమాత్ర ప్రయోజనమైన కర్మ అని అర్థం చెప్పుకుంటే సరిపోతుంది. ఇహంలోగాని పరంలోగాని ఏదో ప్రయోజనం కొరకు మరి ఏ ఇతర కర్మను మనసుతోగాని, వాక్కుతోగాని, శరీరంతోగాని చేయక, శరీరం నిలిచి ఉండడానికి మాత్రం చేయవలసిన మనోవాక్కాయ కర్మలు చేసేవాడు పాపం పొందడు అని అర్థమవుతుంది. 'కేవలం' అంటే 'నేను చేస్తున్నాను' అన్న అభిమానం లేకుండా అని అర్థం. అటువంటివాడు చేసే శరీరాది చేష్టలు లోకదృష్టికి పనులు చేయడంగా కనిపిస్తాయి. అటువంటివాని దగ్గరకు కూడా పాపం రాలేదు. కిల్బిషం (పాపం) అంటే సంసారం. అతడు మళ్ళీ సంసారంలో పడడు. అతని కర్మలన్నీ జ్ఞానాగ్నిలో కాలిపోతాయి. అన్నిబంధాలు విడిపోయి అతడు ముక్తుడవుతాడు అని అర్థం. వెనుక చెప్పిన సమ్యగ్దర్శన ఫలమే ఇక్కడా చెపుతున్నాడు. 'శారీరం కేవలం కర్మ' అనేదానికి ఈ విధంగా అర్థం చెప్పుకోవడం వల్ల వైరుధ్యాలన్నీ తొలగిపోతాయి.

**భాష్యమ్ : 22.0 త్యక్తసర్వపరిగ్రహస్య యతేః అన్నాదేః శరీరస్థితిహేతోః పరిగ్రహస్య అభావాత్ యాచనాదినా శరీరస్థితికర్తవ్యతాయాం ప్రాప్తాయాం – 'అయాచితమసంక్లుప్తముపపన్నం యదృచ్ఛయా' (బౌ.ధ.సూ.21.8.12, అనుగీతా, 45.19) ఇత్యాదినా వచనేన అనుజ్ఞాతం యతేః శరీరస్థితిహేతోః అన్నాదేః ప్రాప్తిద్వారమ్ ఆవిష్కుర్వన్ ఆహ–**

**తె.అ.** తనదంటూ ఏదీ లేకుండా అన్నీ వదులుకున్న సన్న్యాసికి శరీరం నిలుపుకోవడానికి కావలసిన అన్నం మొదలైనవి ఉండవు. కనుక యాచన చేసి శరీరం నిలుపుకోవడం అతనికి కర్తవ్యం. ఈ విధమైన మార్గం, అన్నం మొదలైన వాటికొరకు, అతనికి అనుమతించారు. 'అడుగకుండా అనుకోకుండా వచ్చినది' (అనుగీత 45.19) వంటి వాక్యాలున్నాయి. అదే చెపుతున్నాడు భగవానుడు ఈ శ్లోకంలో –

**మూ. యదృచ్ఛాలాభసంతుష్టో ద్వన్ద్వాతీతో విమత్సరః ।**
**సమః సిద్ధావసిద్ధౌ చ కృత్వాఽపి న నిబధ్యతే ॥ 22**

**తె.అ.** కోరకుండా దొరికినదానితో సంతుష్టుడు, ద్వంద్వాలకు అతీతుడు, మాత్సర్యం లేనివాడు, సిద్ధి అసిద్ధులయందు సముడు – ఇటువంటివాడు కర్మలు చేసినా అవి అతనిని బంధించవు.

**భాష్యమ్ : 22.1 యదృచ్ఛా ఇతి. యదృచ్ఛాలాభసంతుష్టః అప్రార్థితోపనతః లాభః యదృచ్ఛాలాభః తేన సంతుష్టః సంజాతాలంప్రత్యయః ద్వంద్వాతీతః ద్వంద్వైః శీతోష్ణాదిభిః హన్యమానోఽపి అవిషణ్ణచిత్తః ద్వంద్వాతీతః ఉచ్యతే. విమత్సరః విగతమత్సరః నిర్వైరబుద్ధిః సమః తుల్యః యదృచ్ఛాలాభస్య సిద్ధౌ అసిద్ధౌ చ. యః ఏవంభూతో యతిః అన్నాదేః శరీరస్థితిహేతోః లాభాలాభయోః సమః హర్షవిషాదవర్జితః కర్మాదౌ అకర్మాదిదర్శీ యథాభూతాత్మదర్శననిష్ఠః సన్ శరీరస్థితిమాత్రప్రయోజనే భిక్షాటనాదికర్మణి శరీరాదినిర్వర్త్యే 'నైవ కించిత్ కరోమ్యహమ్', 'గుణా గుణేషు వర్తంతే' ఇత్యేవం సదా సంపరిచక్షాణః ఆత్మనః కర్తృత్వాభావం పశ్యన్ నైవ కించిత్ భిక్షాటనాదికం కర్మ కరోతి, లోకవ్యవహారసామాన్యదర్శనేన తు లౌకికైః ఆరోపితకర్తృత్వే భిక్షాటనాదౌ కర్మణి కర్తా భవతి. స్వానుభవేన తు శాస్త్రప్రమాణజనితేన అకర్తా ఏవ. సః ఏవం పరాధ్యారోపిత కర్తృత్వః శరీరస్థితిమాత్రప్రయోజనం భిక్షాటనాదికం కర్మ కృత్వా అపి న నిబధ్యతే బంధహేతోః కర్మణః సహేతుకస్య జ్ఞానాగ్నినా దగ్ధత్వాత్ ఇతి ఉక్తానువాదః ఏవ ఏషః.**

**తె.అ.** యదృచ్ఛాలాభము అంటే కోరకుండా దొరికినది అని. సంతుష్టుడు అంటే ఇది చాలు అనుకునేవాడు. శీతోష్ణాదులు పీడిస్తున్నా లెక్కచెయ్యనివాడు ద్వంద్వాతీతుడు. విమత్సరుడు అంటే వైరబుద్ధి లేనివాడు. సిద్ధ్యసిద్ధుల యందు సముడు అంటే కోరకుండా ఏది దొరికినా దొరకకపోయినా సమానంగా భావించేవాడు. ఇటువంటి సంన్యాసి శరీరం నిలిచి ఉండడానికి అవసరమయిన అన్నాదులు దొరికినా, దొరకకపోయినా హర్షము విషాదము చెందదు. కర్మయందు అకర్మను చూస్తాడు. ఆత్మను ఉన్నదున్నట్లు చూస్తాడు. శరీరం నిలిచి ఉండడానికి మాత్రం శరీరాదులు నిర్వర్తించే భిక్షాటనాది కర్మలు చేస్తూ కూడా 'నేనేమీ చేయడంలేదు' (5.8) 'గుణాలు గుణాలయందు ప్రవర్తిస్తున్నాయి'. (3.28) అనే భావంతో ఉంటాడు ఎప్పుడూ. లోకం దృష్టిలో అతడు భిక్షాటనం చేస్తున్నాడు. కాని తాను అకర్త అని శాస్త్రప్రమాణం ద్వారా స్వానుభవంతో తెలిసిన అతడు భిక్షాటనాది కర్మలేవీ చేయడంలేదు. శరీరస్థితి మాత్ర ప్రయోజనమైన భిక్షాటనాది కర్మలు, అతడు చేస్తున్నాడు అని లోకం అనుకుంటున్నవి, చేస్తూ కూడా వాటిచేత అతడు బద్ధుడు కాడు. ఎందుకు కాడు అంటే బంధకారణమైన కర్మ జ్ఞానాగ్నిలో దాని కారణాలతో సహా కాలిపోయింది కనుక. ఇది వెనుక (4.19, 21లలో) చెప్పిందే.

**భాష్యమ్ : 23.0 'త్యక్త్వా కర్మఫలాసంగమ్' (4.20) ఇత్యనేన శ్లోకేన యః ప్రారబ్ధకర్మా సన్ యదా నిష్క్రియ బ్రహ్మాత్మదర్శనసంపన్నః స్యాత్ తదా తస్య ఆత్మనః కర్తృకర్మప్రయోజనాభావదర్శినః కర్మపరిత్యాగే ప్రాప్తే కుతశ్చిన్నిమిత్తాత్ తదసంభవే సతి పూర్వవత్, తస్మిన్ కర్మణి అభిప్రవృత్తః అపి 'నైవ కించిత్కరోతి సః' (4.20) ఇతి కర్మాభావః ప్రదర్శితః. యస్యైవం కర్మాభావః దర్శితః తస్యైవ.**

**తె.అ.** 'కర్మఫలమందు ఆసక్తిని విడిచి' (4.20) అనే శ్లోకంలో, కర్మలు ప్రారంభించి చేస్తూ ఉండగా నిష్క్రియ బ్రహ్మము తానేనని తెలిసినా, తనకు కర్మలవల్ల ఎటువంటి ప్రయోజనం లేనందున కర్మలు వదలి వేయవలసిన వాడైనా ఏదో కారణం చేత ఆపక పూర్వంవలెనే ఆ కర్మలు చేస్తూ ఉన్నా 'ఏమీ చేయడంలేదు' (4-20) అని అతనికి కర్మ లేకపోవడం చెప్పాడు. అటువంటి కర్మ రహితుని గురించి-

**మూ. గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః ।**
**యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే ॥ 23**

**తె.అ.** ఆసక్తి లేనివాడై, ముక్తుడై జ్ఞానమందే నిలిచిన మనసుగలవాడై కర్మను యజ్ఞంగా భావించి ఆచరించే వాని కర్మలు ఫలసహితంగా సంపూర్ణంగా కరిగిపోతాయి.

**భాష్యమ్ : 23.1 గతసంగస్య ఇతి. గతసంగస్య సర్వతః నివృత్తాసక్తేః ముక్తస్య నివృత్త ధర్మాధర్మాదిబన్ధనస్య, జ్ఞానావస్థిత చేతసః జ్ఞానే ఏవ అవస్థితం చేతః యస్య సః అయం జ్ఞానావస్థితచేతాః తస్య, యజ్ఞాయ యజ్ఞనివృత్త్యర్థమ్ ఆచరతః నివర్తయతః కర్మ, సమగ్రం సహ అగ్రేణ ఫలేన వర్తతే ఇతి సమగ్రం కర్మ, తత్ సమగ్రం ప్రవిలీయతే వినశ్యతి ఇత్యర్థః.**

**తె.అ.** దేనిమీదా ఆసక్తిలేనివాడు గతసంగుడు. ముక్తుడు అనగా పుణ్యపాపబంధాలు లేనివాడు. అటువంటివాడు, జ్ఞానమందే మనసు నిలిపి యజ్ఞం కొరకు (విష్ణుప్రీతిగా) చేసే కర్మ సమగ్రంగా నశిస్తుంది. అగ్రం అంటే ఫలం. సమగ్రం అంటే ఫలంతో సహా అని అర్థం.

**భాష్యమ్ : 24.0 కస్మాత్ పునః కారణాత్ క్రియమాణం కర్మ స్వకార్యారమ్భమ్ అకుర్వన్ సమగ్రం ప్రవిలీయతే ఇతి? ఉచ్యతే, యతః -**

**తె.అ.** చేసిన కర్మ ఏ కారణంచేత ఫలించక సమగ్రంగా లయమవుతుంది? అంటే, విను

**మూ. బ్రహ్మార్పణం బ్రహ్మ హవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్ ।**
**బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మసమాధినా ॥ 24**

**తె.అ.** అర్పణం బ్రహ్మము. హవిస్సు బ్రహ్మము. బ్రహ్మాగ్నియందు హోమము చేయువాడు బ్రహ్మము. బ్రహ్మకర్మ సమాధియందున్న యజమాని పొందు ఫలము బ్రహ్మము.

**భాష్యమ్ : 24.1 బ్రహ్మేతి : బ్రహ్మ అర్పణమ్ - యేన కరణేన బ్రహ్మవిత్ హవిః అగ్నౌ అర్పయతి తత్ బ్రహ్మైవ ఇతి పశ్యతి. తస్య ఆత్మవ్యతిరేకేణాభావం పశ్యతి, యథా శుక్తికాయాం రజతాభావం పశ్యతి. తత్ ఉచ్యతే బ్రహ్మార్పణమ్ ఇతి. యథా యత్ రజతం తత్ శుక్తికా ఏవ**

**ఇతి. 'బ్రహ్మ అర్పణమ్' ఇతి అసమస్తే పదే. యదర్పణబుద్ధ్యా గృహ్యతే లోకే తదస్య బ్రహ్మవిదః బ్రహ్మైవ ఇత్యర్థః. బ్రహ్మ హవిః - తథా యత్ హవిర్బుద్ధ్యా గృహ్యమాణం తత్ బ్రహ్మైవ అస్య. తథా బ్రహ్మాగ్నౌ ఇతి సమస్తం పదమ్. అగ్నిః అపి బ్రహ్మ ఏవ, యత్ర హూయతే బ్రహ్మణా కర్త్రా, బ్రహ్మైవ కర్తా ఇత్యర్థః యత్ తేన హుతం హవనక్రియా తత్ బ్రహ్మ ఏవ. యత్ తేన గన్తవ్యం ఫలం తదపి బ్రహ్మైవ. బ్రహ్మకర్మసమాధినా - బ్రహ్మైవ కర్మ బ్రహ్మకర్మ. తస్మిన్ సమాధిః యస్య సః బ్రహ్మకర్మసమాధిః, తేన బ్రహ్మకర్మసమాధినా బ్రహ్మ ఏవ గన్తవ్యమ్.**

**తె.అ.** ఏ సాధనం (అర్పణం) చేత అగ్నియందు అర్పిస్తాడో దానిని బ్రహ్మవేత్త బ్రహ్మంగానే చూస్తాడు. ఆత్మ తప్ప మరేదీ అందులో అతనికి కన్పించదు, ముత్యపు చిప్పలో వెండి కనిపించనట్లు. వెండిగా కనిపిస్తున్నది వాస్తవంలో ముత్యపుచిప్ప మాత్రమే అయినట్లు యజ్ఞసాధనంగా కనిపించేది నిజానికి బ్రహ్మమే. బ్రహ్మ, అర్పణం అనేవి సమాసం చెయ్యని పదాలు. సాధనమని దేన్ని లోకం అనుకుంటుందో అది బ్రహ్మవేత్తకు బ్రహ్మమే అని అర్థం. అట్లాగే, అందరూ హవిస్సు అనుకుంటున్నది అతనికి బ్రహ్మమే. బ్రహ్మాగ్ని అనేది సమాసం. అగ్ని కూడా బ్రహ్మమే. అందులో హోమం చేసేవాడు కూడా, కర్తకూడా, బ్రహ్మమే, అని అర్థం. హోమం చేయడమనే హవనక్రియ కూడా బ్రహ్మమే. అతడు పొందే ఫలం కూడా బ్రహ్మమే. బ్రహ్మకర్మసమాధిః అంటే బ్రహ్మకర్మయందు సమాధి, ఏకాగ్రత కలవాడు. అతడు చేరుకునేది బ్రహ్మమునే.

**భాష్యమ్ : 24.2 ఏవం లోకసంగ్రహచికీర్షుణాపి క్రియమాణం కర్మ పరమార్థతః అకర్మ, బ్రహ్మబుద్ధ్యుపమృదితత్వాత్. నివృత్తకర్మణోఽపి సర్వకర్మసంన్యాసినః సమ్యగ్దర్శనస్తుత్యర్థం యజ్ఞత్వసంపాదనం జ్ఞానస్య సుతరాముపపద్యతే - యత్ అర్పణాది అధియజ్ఞే ప్రసిద్ధం తత్ అస్య అధ్యాత్మం బ్రహ్మైవ పరమార్థదర్శినః ఇతి. అన్యథా సర్వస్య బ్రహ్మత్వే అర్పణాదీనామేవ విశేషతః బ్రహ్మత్వాభిధానమ్ అనర్థకం స్యాత్. తస్మాత్ బ్రహ్మైవ ఇదం సర్వమ్ ఇతి జానతః విదుషః కర్మాభావః, కారకబుద్ధ్యభావాచ్చ. న హి కారకబుద్ధిరహితం యజ్ఞాఖ్యం కర్మ దృష్టం. సర్వం ఏవ అగ్నిహోత్రాదికం కర్మ శబ్దసమర్పితదేవతావిశేష సంప్రదానాదికారకబుద్ధిమత్ కర్త్రభిమానఫలాభిసంధిమత్ చ దృష్టమ్, న ఉపమృదితక్రియాకారకఫలభేదబుద్ధిమత్ కర్తృత్వాభిమాన ఫలాభిసంధిరహితం వా.**

**తె.అ.** లోకసంగ్రహంకోరి చేసేవాని కర్మ కూడా పరమార్థంలో అకర్మే, బ్రహ్మజ్ఞానం ఆ కర్మను కడిగి వేస్తుంది కనుక. ఈ విధంగా అర్థం చెప్పుకున్నప్పుడు జ్ఞానాన్ని యజ్ఞంగా భావించడం కర్మలను వదలివేసిన సంన్యాసి విషయంలో చాలా చక్కగా సరిపోతుంది. అది సమ్యగ్దర్శనాన్ని స్తుతించడమే. యజ్ఞ సంబంధమైన అర్పణాదులు ఆత్మసంబంధంగా పరమార్థదర్శికి బ్రహ్మంగానే

కనిపిస్తాయి అని. లేకపోతే, అన్నీ బ్రహ్మమే అయినపుడు అర్పణాదులను మాత్రమే ప్రత్యేకించి బ్రహ్మమని చెప్పడంలో అర్థం లేదు. కనుక అంతా బ్రహ్మమే అని తెలిసిన విద్వాంసునకు కర్మలేదు, యజ్ఞ సాధనాలు లేవు. ఇది యజ్ఞసాధనం అన్న జ్ఞానం లేనపుడు యజ్ఞమనే కర్మ ఎట్లా ఉంటుంది? వేదంలో చెప్పబడిన ఏదో దైవం (ఇంద్రుడో వరుణుడో); ఆ దైవానికి సమర్పించే వస్తువులు మొదలైన వాటియందు కారకబుద్ధి; నేను చేస్తున్నాను అన్న అభిమానము; నాకీ ఫలం కలుగుతుందన్న ఆసక్తి – ఇవన్నీ ఉన్నప్పుడే అగ్నిహోత్రాదిక కర్మలన్నీ జరగడం లోకంలో చూస్తున్నాం. క్రియ కారకము ఫలము అనే భేదదృష్టి తుడిచివేయబడిన తరువాత, నేను చేస్తున్నాను అనే అభిమానం నాకీ ఫలం కలుగుతుంది అనే కోరిక లేనపుడు కర్మ జరగదు.

**భాష్యమ్ : 24.3 ఇదం తు బ్రహ్మ బుద్ధ్యుపమృదితార్పణాదికారకక్రియాఫలభేదబుద్ధికర్మ. అతః అకర్మైవ తత్. తథా చ దర్శితమ్ – 'కర్మణ్యకర్మ యః పశ్యేత్' (4.18) 'కర్మణ్యభిప్రవృత్తోపి నైవ కించిత్ కరోతి సః' (4.20), 'గుణా గుణేషు వర్తన్తే' (6.28) 'నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్' (5.8) ఇత్యాదిభిః. తథా చ దర్శయన్ తత్ర తత్ర క్రియాకారక ఫలభేదబుద్ధ్యుపమర్దనం కరోతి. దృష్టా చ కామ్యాగ్నిహోత్రాదౌ కామోపమర్దేన కామ్యాగ్నిహోత్రాదిహానిః. తథా మతిపూర్వకా–మతిపూర్వకాదీనాం కర్మణాం కార్యవిశేషస్య ఆరమ్భకత్వం దృష్టమ్. తథా ఇహాపి బ్రహ్మ బుద్ధ్యుపమృది–తార్పణాదికారకక్రియా ఫలభేదబుద్ధేః. బాహ్యచేష్టామాత్రేణ కర్మ అపి విదుషః అకర్మ సంపద్యతే. అతః ఉక్తం 'సమగ్రం ప్రవిలీయతే' (4.23) ఇతి.**

**తె.అ.** ఇక్కడ చెపుతున్నది అర్పణాది కారకక్రియాఫల సంబంధమైన భేదబుద్ధి బ్రహ్మబుద్ధిచేత తుడిచి వేయబడిన స్థితిలో చేసే కర్మ. కనుక అది అకర్మే. 'కర్మయందకర్మను చూసేవాడు' (4.18), 'కర్మలు చేస్తూ కూడా ఏమీ చెయ్యడంలేదు' (4.20), 'గుణాలు గుణాలయందు ప్రవర్తిస్తున్నాయి' (6.28), 'నేనేమీ చెయ్యడంలేదు అని తత్త్వం తెలిసిన యోగి అనుకుంటాడు' (5.8), మొదలైన వాక్యాలలో ఇదే చెప్పాడు. భగవానుడు ఈ విధమైన వాక్యాలతో అనేక సందర్భాలలో క్రియాకారక ఫలభేద బుద్ధిని తొలగిస్తూ ఉంటాడు. కోరి చేసే అగ్నిహోత్రాదులలో కోరిక రాలిపోయిన తరువాత అవి కామ్యాగ్ని హోత్రాదులు కావని మనం చూస్తున్నాం. అట్లాగే బుద్ధిపూర్వకంగా చేసే పనులకు, అనుకోకుండా చేసే పనులకు ఫలితం వేరుగా ఉండడం కూడా మనం చూస్తున్నాం. అదే విధంగా ఇక్కడ కూడా క్రియా కారక ఫలసంబంధమైన భేదబుద్ధిని బ్రహ్మబుద్ధిచేత తుడిచివేసిన విద్వాంసుడు చేసే బాహ్యచేష్టలు కర్మలయినా అకర్మే అవుతాయి. కనుకనే 'సమగ్రంగా లయమవుతాయి' (4.23) అన్నాడు.

**భాష్యమ్ : 24.4 అత్ర కేచిదాహుః- యత్ బ్రహ్మ తత్ అర్పణాదీని. బ్రహ్మైవ కిల అర్పణాదినా పఞ్చవిధేన కారకాత్మనా వ్యవస్థితం సత్ తదేవ కర్మ కరోతి. తత్ర న అర్పణాదిబుద్ధిః నివర్త్యతే, కిం తు అర్పణాదిషు బ్రహ్మబుద్ధిః ఆధీయతే, యథా ప్రతిమాదౌ విష్ణ్వాదిబుద్ధిః యథా వా నామాదౌ బ్రహ్మబుద్ధిః ఏవమితి. (ఛాం ఉ. 7.1.5)**

**తె.అ.** ఈ సందర్భంలో కొందరిట్లా అంటారు - ఏది బ్రహ్మమో అదే అర్పణాదులు. అంటే బ్రహ్మమే అర్పణాదులైన అయిదు విధాల కారకాల రూపంలో ఉండి కర్మ చేస్తూ ఉంటాడు. అక్కడ ఇవి అర్పణాదులన్న బుద్ధి తొలగిపోదు, కాని అర్పణాదులయందు బ్రహ్మబుద్ధి నిలుపబడుతుంది, ప్రతిమాదులయందు విష్ణువు మొదలైన దేవతలను భావించినట్లు, నామాదులయందు బ్రహ్మబుద్ధిని నిలిపినట్లు. (ఛాం. ఉ. 7.1.5).

**భాష్యమ్ : 24.5 సత్యమ్ ఏవమ్ అపి స్యాత్ యది జ్ఞానయజ్ఞస్తుత్యర్థం ప్రకరణం న స్యాత్. అత్ర తు సమ్యగ్దర్శనం జ్ఞానయజ్ఞశబ్దితమ్, అనేకాన్ యజ్ఞశబ్దితాన్ క్రియావిశేషాన్ ఉపన్యస్య 'శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః' (4.33) ఇతి జ్ఞానం స్తౌతి. అత్ర చ సమర్థమ్ ఇదం వచనం 'బ్రహ్మార్పణమ్' ఇత్యాది జ్ఞానస్య యజ్ఞత్వ సంపాదనే ఇత్యుక్తమ్. యే తు అర్పణాదిషు, ప్రతిమాయాం విష్ణుదృష్టివత్, బ్రహ్మదృష్టిః క్షిప్యతే నామాదిషు ఇవ చ ఇతి బ్రువతే న తేషాం బ్రహ్మవిద్యా ఉక్తా ఇహ వివక్షితా స్యాత్, అర్పణాదివిషయత్వాత్ జ్ఞానస్య.**

**తె.అ.** నిజమే, ఇది జ్ఞానయజ్ఞాన్ని స్తుతించే సందర్భం కాకుంటే అట్లా కూడా అనుకోవచ్చు. కాని ఇక్కడ యజ్ఞమని చెప్పబడే అనేక క్రియలను గురించి చెపుతూ 'ద్రవ్యంతో చేసే యజ్ఞం కంటే జ్ఞానయజ్ఞం మేలైనది'(4.33) అని జ్ఞానయజ్ఞం పేరుతో సమ్యగ్దర్శనాన్ని స్తుతిస్తున్నాడు. బ్రహ్మార్పణం అన్నమాట జ్ఞానానికి యజ్ఞరూపం కల్పించగలదని చెప్పాము. కాని విగ్రహంలో విష్ణుదృష్టివలె నామంలో బ్రహ్మదృష్టివలె అర్పణాదులందు కూడా అనేవారికి ఇది బ్రహ్మవిద్యాప్రకరణం కాదు. జ్ఞానమంటే వారికి అర్పణాదుల విషయమే.

**భాష్యమ్ : 24.6 న చ దృష్టిసంపాదనజ్ఞానేన మోక్షఫలం ప్రాప్యతే - 'బ్రహ్మైవ తేన గన్తవ్యమ్' ఇతి చ ఉచ్యతే. విరుద్ధం చ సమ్యగ్దర్శనం అన్తరేణ మోక్షఫలం ప్రాప్యతే ఇతి. ప్రకృతవిరోధశ్చ. సమ్యగ్దర్శనం చ ప్రకృతం 'కర్మణ్యకర్మ యః పశ్యేత్' (4.18) ఇత్యత్ర. అన్తే చ సమ్యగ్దర్శనం, తస్యైవ ఉపసంహారాత్. 'శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః' (4.33), 'జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తిమ్' (4.39) ఇత్యాదినా సమ్యగ్ దర్శనస్తుతిమేవ కుర్వన్ ఉపక్షీణః అధ్యాయః - తత్ర అకస్మాత్ అర్పణాదౌ బ్రహ్మదృష్టిః అప్రకరణే, ప్రతిమాయామ్ ఇవ విష్ణుదృష్టిః, ఉచ్యతే ఇతి అనుపపన్నమ్, తస్మాత్ యథావ్యాఖ్యాతార్థః ఏవ అయం శ్లోకః.**

**తె.అ.** దృష్టి సంపాదన (దృష్టి పొందడంవలన) జ్ఞానంచేత మోక్షఫలం ప్రాప్తించదు. (విగ్రహాన్ని విష్ణువన్నంత మాత్రాన సాధనాలను బ్రహ్మమనుకున్నంత మాత్రాన మోక్షం ప్రాప్తించదు అని.) 'అతడు పొందే ఫలంకూడా బ్రహ్మమే' అని చెప్పాడు కూడా. సమ్యగ్దర్శనం కాక మరో విధంగా మోక్షం కలగడమనేది విరుద్ధం. 'కర్మయందకర్మను చూచేవాడు' (4.18) అని మొదలు పెట్టి సమ్యగ్దర్శనంతో ముగిస్తూవున్న ప్రస్తుత సందర్భానికి కూడా వారు చెప్పే దృష్టి సంపాదనమన్న అర్థం విరుద్ధం. 'ద్రవ్యంతో చేసే యజ్ఞాలకంటె జ్ఞానయజ్ఞం మేలైనది' (4.33) 'జ్ఞానం పొంది పరమశాంతిని' (4.39) వంటి వాక్యాలతో సమ్యగ్దర్శన స్తుతితో అధ్యాయం ముగుస్తుంది. ఈ సందర్భంలో అకస్మాత్తుగా అసందర్భంగా విగ్రహంలో విష్ణుదృష్టి వలె అర్పణాదుల యందు బ్రహ్మదృష్టిని చెపుతున్నాడు అనడం అతకదు. కనుక ఈ శ్లోకానికి చెప్పిందే సరి అయిన అర్థం.

**భాష్యమ్ : 25.0 తత్రాధునా సమ్యగ్దర్శనస్య యజ్ఞత్వం సంపాద్య తత్ స్తుత్యర్థమ్ అన్యేఽపి యజ్ఞా ఉపక్షిప్యన్తే దైవమేవేత్యాదినా –**

**తె.అ.** సమ్యగ్దర్శనమొక యజ్ఞమని నిరూపించి దాన్ని స్తుతించడం కొరకు ఇప్పుడు 'దైవమేవ' అనే శ్లోకం నుండి ఇతర యజ్ఞాలను కూడా చెపుతున్నాడు –

**మూ.** **దైవమేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే ।**
**బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి ॥ 25**

**తె.అ.** కొందరు యోగులు దైవయజ్ఞం చేస్తారు. మరికొందరు బ్రహ్మాగ్నియందు యజ్ఞంతో యజ్ఞాన్ని హోమం చేస్తారు.

**భాష్యమ్ : 25.1 దైవమితి. దైవమ్ ఏవ – దేవాః ఇజ్యన్తే యేన యజ్ఞేన అసౌ దైవః యజ్ఞః. తమ్ ఏవ అపరే యజ్ఞం, యోగినః కర్మిణః పర్యుపాసతే, కుర్వన్తి ఇత్యర్థః. బ్రహ్మాగ్నౌ – 'సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ' (తై.ఉ. 2.1) 'విజ్ఞానమానన్దం బ్రహ్మ' (బృ.ఉ.3.9.28) 'యత్సాక్షాద–పరోక్షాత్ బ్రహ్మ య ఆత్మా సర్వాన్తరః (బృ.ఉ. 3.4.1) ఇత్యాదివచనోక్తమ్, 'అశనాయాపిపాసాది సర్వసంసారధర్మవర్జితమ్' (బృ.ఉ. 3.5.1) 'నేతి నేతి' (బృ.ఉ.4.4.22) ఇతర నిరస్తాశేషవిశేషం బ్రహ్మశబ్దేన ఉచ్యతే. బ్రహ్మ చ తత్ అగ్నిశ్చ సః హోమాధికరణత్వవివక్షయా బ్రహ్మ అగ్నిః తస్మిన్ బ్రహ్మాగ్నౌ, అపరే అన్యే బ్రహ్మవిదః యజ్ఞమ్, యజ్ఞశబ్దవాచ్యః ఆత్మా ఆత్మనామసు యజ్ఞశబ్దస్య పాఠాత్, తమ్ ఆత్మానం యజ్ఞం, పరమార్థతః పరమేవ బ్రహ్మ సంతం బుద్ధ్యాద్యుపాధిసంయుక్తమ్, అధ్యస్త సర్వోపాధిధర్మకమ్, ఆహుతిరూపం, యజ్ఞేనైవ ఆత్మనైవ ఉక్తలక్షణేన, ఉపజుహ్వతి ప్రక్షిపన్తి, సోపాధికస్య ఆత్మనః నిరూపాధికేన పరబ్రహ్మస్వరూపేణైవ యత్ దర్శనం సః తస్మిన్ హోమః తం కుర్వన్తి బ్రహ్మాత్మైకత్వ దర్శననిష్ఠాః సంన్యాసినః ఇత్యర్థః.**

**తె.అ.** దేనిచేత దేవతలను ఉపాసిస్తారో అది దైవయజ్ఞం. కొందరు కర్మయోగులు ఈ దైవయజ్ఞం చేస్తారు. 'సత్యము జ్ఞానము అనంతము అయినది బ్రహ్మము' (తై.ఉ. 3.9.28), 'విజ్ఞానము ఆనందము అయినది బ్రహ్మము' (బృ.ఉ.3.9.28) 'సాక్షాత్తు ఎట్టఎదుట ఉన్నదే సర్వాంతర్యామియైన ఆత్మ' (బృ.ఉ. 3.4.1) వంటి వాక్యాలలో చెప్పిన బ్రహ్మము ఆకలి దప్పిక వంటి సంసారధర్మాలు లేనిది, 'ఇది కాదు ఇదికాదు' (బృ.ఉ.4.4.22) అని అన్ని విశేషణాలకు అవతలిది. బ్రహ్మము అగ్ని కూడ అయినది బ్రహ్మాగ్ని. దేనిలో హోమం చేస్తున్నామో ఆ హోమాధికరణం అగ్ని. ఆ బ్రహ్మాగ్ని యందు కొందరు బ్రహ్మవేత్తలు యజ్ఞాన్ని - ఇక్కడ యజ్ఞమంటే ఆత్మ అని అర్థం, ఆత్మకు గల పేర్లలో యజ్ఞం కూడా ఉంది కనుక - అంటే ఆత్మను ఆత్మచేత ఆహుతి చేస్తారు. నిజానికి ఈ ఆత్మ పరబ్రహ్మమే. కాని బుద్ధి మొదలైన ఉపాధులు దీనికి తగులుకొని ఉన్నాయి. వాస్తవంగా ఆత్మకులేని, ఆత్మయందారోపించిన ఉపాధులన్నీ ఆహుతి రూపంలో బ్రహ్మాగ్నియందు వేస్తారు. సోపాధికమైన ఆత్మను నిరూపాధికమైన పరబ్రహ్మ స్వరూపంగా చూడడమే దానిలో హోమం చెయ్యడం. బ్రహ్మము ఆత్మ ఒకటే అని చూచిన సంన్యాసులు చేసే యజ్ఞం అటువంటిది అని అర్థం.

**భాష్యమ్ : 26.0 సః అయం సమ్యగ్దర్శనలక్షణః యజ్ఞః దైవయజ్ఞాదిషు యజ్ఞేషు ఉపక్షిప్యతే 'బ్రహ్మార్పణమ్' (4.24) ఇత్యాది శ్లోకైః ప్రస్తుతః 'శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాద్ జ్ఞానయజ్ఞః పరంతప' (4.33) ఇత్యాదినా స్తుత్యర్థమ్ –**

**తె.అ.** 'బ్రహ్మార్పణం' (4.24) అనే శ్లోకంతో మొదలుపెట్టి చెప్పిన దైవయజ్ఞాదులలో ఈ సమ్యగ్దర్శన లక్షణమైన యజ్ఞాన్ని చేర్చడం 'ద్రవ్యయజ్ఞాలకంటె జ్ఞానయజ్ఞం మేలైనది' (4.33) అని స్తుతించడానికి –

**మూ. శ్రోత్రాదీనీన్ద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి ।**
**శబ్దాదీన్విషయానన్య ఇన్ద్రియాగ్నిషు జుహ్వతి ॥ 26**

**తె.అ.** కొందరు శ్రోత్రాది ఇంద్రియాలను నిగ్రహించడం అనే అగ్నులలో హోమం చేస్తారు; మరికొందరు శబ్దాది విషయాలను ఇంద్రియాగ్నులయందు హోమం చేస్తారు.

**భాష్యమ్ : 26.1 శ్రోత్రాదీనీతి – శ్రోత్రాదీని ఇన్ద్రియాణి, అన్యే యోగినః, సంయమాగ్నిషు, ప్రతీన్ద్రియం సంయమః భిద్యతే ఇతి బహువచనమ్, సంయమాః ఏవ అగ్నయః, తేషు జుహ్వతి ఇన్ద్రియసంయమమ్ ఏవ కుర్వన్తి ఇత్యర్థః. శబ్దాదీన్విషయానన్యే ఇన్ద్రియాగ్నిషు – ఇన్ద్రియాణ్యేవ అగ్నయః తేషు ఇన్ద్రియాగ్నిషు జుహ్వతి – శ్రోత్రాదిభిః అవిరుద్ధవిషయగ్రహణం హోమం మన్యన్తే. కించ –**

**తె.అ.** కొందరు యోగులు శ్రోత్రాది ఇంద్రియాలను సంయమాగ్నులయందు హెూమం చేస్తారు. హెూమం చెయ్యడమంటే ఇంద్రియాలను నియమించడమే. ప్రతి ఇంద్రియానికి ప్రత్యేకమైన సంయమం ఉంటుంది కనుక బహువచనం. మరికొందరు శబ్దాది విషయాలను ఇంద్రియాలనే అగ్నులయందు హెూమం చేస్తారు. అంటే శ్రోత్రాదుల ద్వారా శాస్త్రవిరుద్ధం కాని విషయాలను గ్రహించడమే హెూమంగా భావిస్తారు.

**మూ. సర్వాణీన్ద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే ।**
**ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే ॥ 27**

**తె.అ.** ఇంకా కొందరు అన్ని ఇంద్రియ కర్మలను, ప్రాణకర్మలను ఆత్మసంయమమనే జ్ఞానంతో ప్రజ్వలింపచేసిన, వెలిగించిన యోగాగ్నిలో హెూమం చేస్తారు.

**భాష్యమ్ : 27.1 సర్వాణీతి – సర్వాణి ఇన్ద్రియకర్మాణి ఇన్ద్రియాణాం కర్మాణి, తథా ప్రాణకర్మాణి ప్రాణః వాయుః ఆధ్యాత్మికః తత్కర్మాణి అకుఞ్చన ప్రసారణాదీని తాని చ, అపరే, ఆత్మ సంయమయోగాగ్నౌ – ఆత్మని సంయమః ఆత్మసంయమః స ఏవ యోగాగ్నిః, తస్మిన్ ఆత్మ సంయమయోగాగ్నౌ జుహ్వతి ప్రక్షిపన్తి, జ్ఞానదీపితే, స్నేహేనేవ ప్రదీపే వివేకవిజ్ఞానేన ఉజ్జ్వలభావమ్ ఆపాదితే జుహ్వతి ప్రవిలాపయన్తి ఇత్యర్థః.**

**తె.అ.** ఇంద్రియాలు చేసే పనులు ఇంద్రియకర్మలు. ప్రాణమంటే ఈ దేహంలోని ఆధ్యాత్మిక వాయువు. సంకోచము వ్యాకోచము వంటివి ప్రాణకర్మలు. వీటిని కొందరు యోగులు ఆత్మసంయమమనే యోగాగ్నిలో వ్రేలుస్తారు. చమురు చేత అగ్ని ప్రజ్వలించినట్లు వివేక విజ్ఞానం చేత (ధారణధ్యాన సమాధిరూప) యోగాగ్ని ఉజ్జ్వలమవుతుంది. అటువంటి ఆత్మసంయమ–యోగాగ్నిలో ప్రాణ ఇంద్రియ కర్మలను హెూమం చేస్తారు, అంటే విలీనం చేస్తారు అని అర్థం.

**మూ. ద్రవ్యయజ్ఞాస్తపోయజ్ఞా యోగయజ్ఞాస్తథాఽపరే ।**
**స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ యతయః సంశితవ్రతాః ॥ 28**

**తె.అ.** కఠినవ్రతులైన యతులు, మరి కొందరు ద్రవ్య యజ్ఞము, తపోయజ్ఞము, యోగయజ్ఞము, స్వాధ్యాయయజ్ఞము, జ్ఞానయజ్ఞము చేస్తారు.

**భాష్యమ్ : 28.1 ద్రవ్యేతి – ద్రవ్యయజ్ఞాః తీర్థేషు ద్రవ్య వినియోగం యజ్ఞబుద్ధ్యా కుర్వన్తి యే తే ద్రవ్యయజ్ఞాః. తపోయజ్ఞాః తపః యజ్ఞః యేషాం తపస్వినాం తే తపోయజ్ఞాః. యోగయజ్ఞాః – ప్రాణాయామ ప్రత్యాహారాదిలక్షణః యోగః యజ్ఞః యేషాం తే యోగయజ్ఞాః. తథా అపరే స్వాధ్యాయజ్ఞానయజ్ఞాః చ – స్వాధ్యాయః యథావిధి ఋగాద్యభ్యాసః యజ్ఞః యేషాం తే**

**స్వాధ్యాయయజ్ఞాః. జ్ఞానయజ్ఞాః – జ్ఞానం శాస్త్రార్థపరిజ్ఞానం యజ్ఞః యేషాం తే జ్ఞానయజ్ఞాః చ, యతయః యతనశీలాః సంశితవ్రతాః సమ్యక్ శితాని తనూకృతాని, తీక్ష్ణీకృతాని వ్రతాని యేషాం తే సంశితవ్రతాః.**

**తె.అ.** తీర్థములయందు ద్రవ్య (ధనం వగైరా) వినియోగం యజ్ఞబుద్ధితో చేయడం ద్రవ్య యజ్ఞం. తపస్సునే యజ్ఞంగా భావించి చేయడం తపోయజ్ఞం. ప్రాణాయామ ప్రత్యాహారాదులతోటి యోగాన్ని యజ్ఞంగా భావించి చేయడం యోగయజ్ఞం. స్వాధ్యాయమంటే యథావిధిగా ఋగాది వేదాలను అభ్యాసం చెయ్యడం. దాన్ని యజ్ఞంగా భావించి చెయ్యడం స్వాధ్యాయయజ్ఞం. జ్ఞానం అంటే ఇక్కడ శాస్త్ర పరిజ్ఞానం. దాన్ని యజ్ఞంగా భావించి చేయడం జ్ఞాన యజ్ఞం. యతులు అంటే యత్నం చేయడం స్వభావమైనవారు. సంశిత వ్రతులు అంటే తీక్షణమైన వ్రతాలు చేసేవారు.

**మూ. అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాఽపరే ।**
**ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామపరాయణాః ॥ 29**

**తె.అ.** మరికొందరు ప్రాణాయామ పరాయణులు. వారు ప్రాణాపాన గతులను నిరోధించి అపానమందు ప్రాణమును, ప్రాణమందు అపానమును హోమం చేస్తారు.

**భాష్యమ్ : 29.1 అపానే ఇతి – అపానే అపానవృత్తౌ – జుహ్వతి ప్రక్షిపన్తి. ప్రాణం ప్రాణవృత్తిం. పూరకాఖ్యం ప్రాణాయామం కుర్వన్తి ఇత్యర్థః. ప్రాణే అపానం తథా అపరే జుహ్వతి. రేచకాఖ్యం చ ప్రాణాయామం కుర్వన్తి ఇత్యేతత్. ప్రాణాపానగతీ ముఖనాసికాభ్యాం వాయోః నిర్గమనం ప్రాణస్య గతిః. తద్విపర్యయేణ అధః గమనమ్ అపానస్య గతిః ప్రాణాపానగతీ ఏతే (కే) రుద్ధ్వా నిరుధ్య ప్రాణాయామపరాయణాః ప్రాణాయామతత్పరాః కుమ్భకాఖ్యం ప్రాణాయామం కుర్వన్తి ఇత్యర్థః.**

**తె.అ.** అపాన వాయువులో ప్రాణవాయువును హోమం చేస్తారు, పూరకమనే ప్రాణాయామం చేస్తారు అని అర్థం. అట్లాగే మరికొందరు ప్రాణవాయువులో అపానవాయువును హోమం చేస్తారు. అంటే రేచకమనే ప్రాణాయామం చేస్తారు అని అర్థం. నోటినుండి ముక్కునుండి వాయువు వెలుపలికి వెళ్ళడం ప్రాణగతి. దీనికి విపరీతంగా క్రిందికి వెళ్ళడం అపానగతి. ఈ ప్రాణాపానగతులను నిరోధించి ప్రాణాయామ తత్పరులు కుంభకమనే ప్రాణాయామం చేస్తారు.

**మూ. అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి ।**
**సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః ॥ 30**

**తె.అ.** మరికొందరు ఆహారం పరిమితంగా తీసుకుంటూ ప్రాణవాయువులను వాటియందే హెూమం చేస్తారు. వీరందరూ యజ్ఞవిదులు, యజ్ఞంచేత కలుషాన్ని కడిగివేసుకున్నవారు.

**భాష్యమ్ : 30.1 అపరే ఇతి – అపరే నియతాహారాః, నియతః పరిమితః ఆహారః యేషాం తే నియతాహారాః సన్తః ప్రాణాన్ వాయుభేదాన్ ప్రాణేషు ఏవ జుహ్వతి. యస్య, యస్య వాయోః జయః క్రియతే ఇతరాన్ వాయుభేదాన్ తస్మిన్ తస్మిన్ జుహ్వతి. తే తత్ర ప్రవిష్టాః ఇవ భవన్తి. సర్వేఽపి ఏతే యజ్ఞవిదః యజ్ఞక్షపితకల్మషాః – యజ్ఞైః యథోక్తైః క్షపితః నాశితః కల్మషః యేషాం తే యజ్ఞక్షపితకల్మషాః. ఏవం యథోక్తాన్ యజ్ఞాన్ నిర్వర్త్య –**

**తె.అ.** మరికొందరు పరిమితమైన ఆహారం తీసుకుంటూ వివిధములైన వాయువులను ప్రాణములయందే హెూమం చేస్తారు. ఏఏ వాయువును జయిస్తారో దానియందు ఇతర వాయువులను హెూమం చేస్తారు, అవి దానియందు చేరి కలిసిపోయినట్లు అవుతాయి. వీరందరూ యజ్ఞం తెలిసినవారు. ఆ యజ్ఞంచేత కల్మషాన్ని కడిగి వేసుకున్నవారు. ఈ చెప్పిన యజ్ఞాలన్నీ చేసి –

**మూ. యజ్ఞశిష్టామృతభుజో యాన్తి బ్రహ్మ సనాతనమ్ ।**
**నాయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ ॥ 31**

**తె.అ.** యజ్ఞశేషమైన అమృతాన్ని భుజించి సనాతన బ్రహ్మమును చేరుతారు. యజ్ఞం చేయని వానికి ఈ లోకం లేదు. పరలోకం మాట ఎందుకు?

**భాష్యమ్ : 31.1 యజ్ఞఇతి. యజ్ఞాశిష్టామృతభుజః – యజ్ఞానాం శిష్టం యజ్ఞశిష్టమ్. యజ్ఞశిష్టం చ తత్ అమృతం చ యజ్ఞశిష్టామృతమ్. తత్ భుఞ్జతే ఇతి యజ్ఞశిష్టామృతభుజః. యథోక్తాన్ యజ్ఞాన్ కృత్వా తచ్ఛిష్టేన కాలేన యథావిధిచోదితం అన్నమ్ అమృతాఖ్యం భుఞ్జతే ఇతి యజ్ఞశిష్టామృతభుజః. యాన్తి గచ్ఛన్తి బ్రహ్మ సనాతనం చిరంతనం ముముక్షవః చేత్; కాలాతిక్రమాపేక్షయా ఇతి సామర్థ్యాత్ గమ్యతే. న అయం లోకః సర్వప్రాణిసాధారణః అపి అస్తి యథోక్తానామ్ యజ్ఞానాం ఏకః అపి యజ్ఞ యస్య నాస్తి సః అయజ్ఞః తస్య, కుతః అన్యః విశిష్టసాధనసాధ్యః, కురుసత్తమ.**

**తె.అ.** యజ్ఞం చేయగా మిగిలినది యజ్ఞశిష్టం. అది అమృతం. పైన చెప్పినవిధంగా యజ్ఞం చేసి అందుమిగిలిన అమృతమనే అన్నం శాస్త్రవిధిననుసరించి భుజించినవారు ముముక్షువులయితే సనాతన బ్రహ్మమును చేరుకుంటారు. కాలక్రమంలో అని అర్థం చేసుకోవాలి. పైన చెప్పిన యజ్ఞాలలో ఒక్కదానిని కూడా చేయనివానికి సర్వప్రాణి సాధారణమైన ఈ లోకం కూడా లేదు. విశిష్టమైన సాధనచేత సాధించదగిన పరలోకమెక్కడిది?

**మూ. ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే ।**
**కర్మజాన్ విద్ధి తాన్ సర్వానేవం జ్ఞాత్వా విమోక్ష్యసే ॥ 32**

**తె.అ.** పైన చెప్పిన బహుప్రకారాలైన యజ్ఞాలు బ్రహ్మ ముఖంలో విస్తరించి ఉన్నాయి. అవన్నీ కర్మలవల్ల కలుగుతాయి అని తెలుసుకో. ఆ విధంగా తెలుసుకుని నీవు మోక్షం పొందుతావు.

**భాష్యమ్ : 32.1 ఏవమితి. ఏవం యథోక్తాః బహువిధాః బహుప్రకారాః యజ్ఞాః వితతాః విస్తీర్ణాః బ్రహ్మణః వేదస్య ముఖే ద్వారే. వేదద్వారేణ అవగమ్యమానాః బ్రహ్మణః ముఖే వితతాః ఉచ్యన్తే. తద్యథా 'వాచి హి ప్రాణాన్ జుహుమః' (ఐ.ఆ.3.2.6) ఇత్యాదయః. కర్మజాన్ కాయికవాచిక మానసకర్మోద్భవాన్ విద్ధితాన్ సర్వాన్ అనాత్మజాన్. నిర్వ్యాపారః హి ఆత్మా. అతః ఏవం జ్ఞాత్వా విమోక్ష్యసే అశుభాత్. 'న మద్వ్యాపారాః ఏతే, నిర్వ్యాపారః అహమ్, ఉదాసీనః' ఇత్యేవం జ్ఞాత్వా అస్మాత్ సమ్యగ్దర్శనాత్, మోక్ష్యసే అశుభాత్ సంసారబన్ధనాత్ ఇత్యర్థః.**

**తె.అ.** బ్రహ్మము అంటే వేదము. బ్రహ్మముఖంలో అంటే వేదం ద్వారా పైన చెప్పిన బహుప్రకారాలైన యజ్ఞాలు విస్తరించాయి. వేదం ద్వారా మనం తెలుసుకునేవి బ్రహ్మముఖంలో విస్తరించినవి అని చెప్పబడుతున్నాయి. 'ప్రాణాలను వాక్కునందు హోమం చేస్తాము' (ఐ.ఆ.3.2.6) మొదలైన శ్రుతులున్నాయి. కాయిక వాచిక మానసకర్మల వల్ల కలిగే ఈ యజ్ఞాలన్నీ అనాత్మవల్ల కలిగేవి అని తెలుసుకో. ఆత్మ మాత్రం నిర్వ్యాపారి. కనుకనే ఈ విధంగా తెలుసుకుని అశుభం నుండి ముక్తుడవవుతావు. ఇవన్నీ నేను చేస్తున్నవి గావు నేను నిర్వ్యాపారిని నాకేమీ సంబంధం లేదు అని తెలుసుకుని ఈ సమ్యగ్దర్శనం వల్ల అశుభం నుండి అంటే సంసారబంధం నుండి ముక్తుడవవుతావు.

**భాష్యమ్ : 33.0 'బ్రహ్మార్పణమ్' ఇత్యాది శ్లోకేన సమ్యగ్దర్శనస్య యజ్ఞత్వం సంపాదితమ్, యజ్ఞాశ్చ అనేకే ఉపదిష్టాః. తైః సిద్ధపురుషార్థప్రయోజనైః జ్ఞానం స్తూయతే. కథమ్?**

**తె.అ.** 'బ్రహ్మార్పణం' (4.24) మొదలైన శ్లోకాలలో సమ్యగ్దర్శనమే యజ్ఞంగా నిరూపించబడింది. అనేక యజ్ఞాలూ ఉపదేశింపబడినవి. పురుషార్థ సిద్ధికి ఉపకరించే ఈ యజ్ఞాలద్వారా జ్ఞానాన్ని స్తుతిస్తున్నాడు.

**మూ. శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప ।**
**సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే ॥ 33**

**తె.అ.** ద్రవ్యయజ్ఞంకంటే జ్ఞానయజ్ఞం మేలైనది. అన్ని కర్మలు జ్ఞానంలో పరిసమాప్తమవుతాయి.

**భాష్యమ్ : 33.1 శ్రేయానితి – శ్రేయాన్, ద్రవ్యమయాత్ ద్రవ్య సాధనసాధ్యాత్ యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః హే పరంతప. ద్రవ్యమయో హి యజ్ఞః ఫలస్య ఆరమ్భకః, జ్ఞానయజ్ఞః న ఫలా-రమ్భకః, అతః శ్రేయాన్ ప్రశస్యతరః. కథమ్? యతః సర్వం కర్మ సమస్తమ్ అఖిలమ్ అప్రతిబద్ధం, పార్థ, జ్ఞానే మోక్షసాధనే సర్వతః సంప్లుతోదకస్థానీయే పరిసమాప్యతే, అన్తర్భవతి ఇత్యర్థః. 'యథా కృతాయ విజితాయాధరేయాః సంయన్త్యేవమేనం సర్వం తదభిసమేతి యత్కించిత్ ప్రజాః సాధు కుర్వన్తి యస్తద్వేద యత్ స వేద' (ఛాం ఉ. 4.1.4) ఇతి శ్రుతేః.**

**తె.అ.** ద్రవ్యసాధనాల చేత సాధించదగిన యజ్ఞం కంటే జ్ఞానయజ్ఞం మేలైనది. ద్రవ్యయజ్ఞం ఫలిస్తుంది. జ్ఞానయజ్ఞానికి ఫలం లేదు కనుక మేలైనది. ఎట్లా? 'అంతటా నిండి ఉన్న నీటివంటిది' (2.46) జ్ఞానం. మోక్షసాధనమైన ఆ జ్ఞానంలో సమస్త కర్మలు ఏ ప్రతిబంధము లేక పరిసమాప్తి చెందుతాయి. అంటే అందులో కలిసిపోతాయి. 'ప్రజలు చేసే ప్రతీ సాధుకృత్యమూ కూడా ఏ తత్త్వాన్ని రైక్వుడు తెలుసుకొన్నాడో అతనికి అంటే ఆ విద్వాంసునకు చేరుతుంది.' (ఛాం. ఉ. 4.1.4). (ద్యూతంలో కృతం, త్రేత, ద్వాపరం, కలి అనే నాలుగు పందాలుంటాయంటారు. కృతానికి నాలుగు, త్రేతకు మూడు, ద్వాపరానికి రెండు, కలికి ఒకటి ఆయాలు అని చెప్తారు. కృతం అనే పందెం గెలిచినవాడు దాని క్రింది మూటిని జయించినట్లే. కారణమేమంటే నాలుగు అనే సంఖ్యలో మూడు, రెండు, ఒకటి అనే చిన్న సంఖ్యలు అంతర్గతం కదా! అట్లాగే రైక్వుడి ఆత్మతత్తం తెలుసుకున్న వానిని లోకంలో అందరి పుణ్యకర్మలూ చేరుతాయి. ఆ పుణ్యకర్మలన్నీ ఆత్మతత్త్వంలో అంతర్గతాలని శ్రుతి భావం.)

**భాష్యమ్ : 34.0 తదేతత్ విశిష్టం జ్ఞానం కేన ప్రాప్యతే ఇతి? ఉచ్యతే–**

**తె.అ.** ఈ విశిష్ట జ్ఞానాన్ని పొందడమెట్లా అంటే విను–

**మూ. తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।**
**ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః ॥ 34**

**తె.అ.** (గురువును చేరి) నమస్కరించి ప్రశ్నించి సేవించి అని తెలుసుకో. తత్త్వం దర్శించిన జ్ఞానులు నీకు జ్ఞానం ఉపదేశిస్తారు.

**భాష్యమ్ : 34.1 తద్విద్ధీతి – తత్ విద్ధి విజానీహి యేన విధినా ప్రాప్యతే ఇతి. ఆచార్యాన్ అభిగమ్య, ప్రణిపాతేన ప్రకర్షేణ నీచైః పతనం ప్రణిపాతః, దీర్ఘనమస్కారః, తేన 'కథం బన్ధః?' "కథం మోక్షః? కావిద్యా? కా చ అవిద్యా?" ఇతి పరిప్రశ్నేన, సేవయా గురుశుశ్రూషయా, ఏవమాదినా. ప్రశ్రయేణ ఆవర్జితాః ఆచార్యాః, ఉపదేక్ష్యన్తి కథయిష్యన్తి తే జ్ఞానం**

**యథోక్తవిశేషణమ్, జ్ఞానినః. జ్ఞానవన్తః అపి కేచిత్ యథావత్ తత్త్వదర్శన శీలాః, అపరే న; అతః విశినష్టి తత్త్వదర్శినః ఇతి. యే సమ్యగ్దర్శినః తైః ఉపదిష్టం జ్ఞానం కార్యక్షమం భవతి, న ఇతరత్ ఇతి భగవతః మతమ్.**

**తె.అ.** దాన్ని తెలుసుకో, అంటే ఏ విధంగా జ్ఞానం పొందవచ్చునో ఆ విధానాన్ని అని. ప్రణిపాతము అంటే పూర్తిగా క్రింద పడిపోవడం. దీర్ఘనమస్కారమని అర్థం. ఆచార్యుని చేరి నమస్కరించి, బంధమెట్లా కలిగింది మోక్షమెట్లా కలుగుతుంది? విద్య అంటే ఏమిటి? అవిద్య అంటే ఏమిటి? అని ప్రశ్నించి గురువును సేవించి అని. వినయము శుశ్రూష చూసి ప్రసన్నులైన ఆచార్యులు జ్ఞానిలక్షణమైన జ్ఞానాన్ని నీకు ఉపదేశిస్తారు. జ్ఞానులలో కొందరే యథార్థతత్త్వం తెలిసినవారు. అందరూ కారు. అందుకే తత్త్వదర్శినులు అని ప్రత్యేకించి చెప్పడం. సమ్యగ్దర్శనం కలవారు ఉపదేశించిన జ్ఞానమే పనికి వస్తుంది తక్కినది కాదు అని భగవానుని అభిప్రాయం.

**భాష్యమ్ : 35.0 తథా చ సతి ఇదమ్ అపి సమర్థం వచనమ్ –**

**తె.అ.** విషయమిది కనుక చెప్పబోయే వాక్యానికి ప్రాముఖ్యం కలుగుతున్నది –

**మూ. యద్ జ్ఞాత్వా న పునర్మోహమేవం యాస్యసి పాణ్డవ ।**
**యేన భూతాన్యశేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథో మయి ॥ 35**

**తె.అ.** అర్జునా! ఏ జ్ఞానం పొందిన తరువాత నీవు మళ్ళీ మోహం చెందవో దానిచేత నీవు అన్ని భూతాలను నీ ఆత్మయందు, నా యందు చూస్తావు.

**భాష్యమ్ : 35.1 యదితి : యత్ జ్ఞాత్వా, యత్ జ్ఞానం తైః ఉపదిష్టమ్ అధిగమ్య ప్రాప్య, పునః భూయః మోహమ్, ఏవమ్ యథా ఇదానీమ్ మోహం గతః అసి, పునః ఏవం న యాస్యసి హే పాణ్డవ, కిం చ యేన జ్ఞానేన భూతాని అశేషేణ, బ్రహ్మాదీని స్తమ్బపర్యన్తాని ద్రక్ష్యసి సాక్షాత్ ఆత్మని ప్రత్యగాత్మని మత్సంస్థాని. ఇమాని భూతాని ఇతి, అథో అపి మయి వాసుదేవే పరమేశ్వరే చ ఇమాని ఇతి, క్షేత్రజ్ఞేశ్వరైకత్వం సర్వోపనిషత్ప్రసిద్ధం ద్రక్ష్యసి ఇత్యర్థః**

**తె.అ.** వారుపదేశించిన జ్ఞానాన్ని పొంది నీవు ఇప్పటివలె మోహం మళ్ళీ చెందవు. అంతేకాదు, అజ్ఞానం చేత బ్రహ్మము మొదలు గడ్డిపరక వరకు సమస్త భూతాలను నీ అంతరాత్మలో చూస్తావు, 'అవి అన్నీ నాలోనివి' అని. నాలో వాసుదేవునిలో, కూడా చూస్తావు, ఇవి పరమేశ్వరునిలోను ఉన్నాయి అని. ఉపనిషత్తులన్నీ చెప్పే క్షేత్రజ్ఞ ఈశ్వరుల ఐక్యాన్ని దర్శించగలవు అని అర్థం.

**భాష్యమ్ : 36.0 కిం చ ఏతస్య జ్ఞానస్య మాహాత్మ్యమ్**

**తె.అ.** ఈ జ్ఞానం యొక్క మాహాత్మ్యం ఇంకా విను –

**మూ. అపి చేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః ।**
**సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి ॥ 36**

**తె.అ.** నీవు పాపులలోకెల్ల పాపివైనప్పటికి జ్ఞానమనే తెప్పతో పాపమును దాటగలవు.

**భాష్యమ్ : 36.1 అపీతి – అపి చేత్ అసి, పాపేభ్యః, పాపకృద్భ్యః, సర్వేభ్యః, అతిశయేన పాపకృత్ పాపకృత్తమః, సర్వం, జ్ఞానప్లవేనైవ, జ్ఞానమ్ ఏవ ప్లవం కృత్వా, వృజినం వృజినార్ణవం పాపం, సంతరిష్యసి. ధర్మః అపి ఇహ ముముక్షోః పాపమ్ ఉచ్యతే.**

**తె.అ.** పాపకర్ములలోకెల్లా ఎక్కువ పాపం చేసినవాడివి అయినప్పటికి జ్ఞానాన్ని తెప్పగా చేసుకుని పాపమనే సముద్రాన్ని దాటగలవు. ముముక్షువుకు పుణ్యం కూడా పాపమే అంటారు.

**భాష్యమ్ : 37.0 జ్ఞానం కథం నాశయతి పాపమ్ ఇతి సదృష్టాన్తమ్ ఉచ్యతే –**

**తె.అ.** జ్ఞానం పాపాన్ని ఎట్లా నిర్మూలిస్తుంది? దృష్టాంతం చెపుతున్నాడు –

**మూ. యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున ।**
**జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్ కురుతే తథా ॥ 37**

**తె.అ.** అర్జునా! కణకణమండే నిప్పు కట్టెలను బుగ్గి చేసినట్లు జ్ఞానాగ్ని అన్ని కర్మలను భస్మం చేసివేస్తుంది.

**భాష్యమ్ : 37.1 యథేతి : యథా, ఏధాంసి కాష్ఠాని, సమిద్ధః సమ్యక్ ఇద్ధః దీప్తః, అగ్నిః, భస్మసాత్ భస్మీభావం, కురుతే అర్జున, జ్ఞానమేవ అగ్నిః జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్ కురుతే తథా, నిర్బీజీకరోతి ఇత్యర్థః, న హి సాక్షాదేవ జ్ఞానాగ్నిః కర్మాణి ఇన్ధనవత్ భస్మీకర్తుం శక్నోతి. తస్మాత్ సమ్యగ్దర్శనం సర్వకర్మణాం నిర్బీజత్వకారణమ్ ఇత్యభిప్రాయః. సామర్థ్యాత్ యేన కర్మణా శరీరం ఆరబ్ధం తత్ ప్రవృత్తఫలత్వాత్ ఉపభోగేనైవ క్షీయతే "తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యేఽథ సంపత్స్యే" (ఛాం. ఉ. 6.14.2) ఇతి శ్రుతేః. అతః యాని అప్రవృత్తఫలాని జ్ఞానోత్పత్తేః ప్రాక్ కృతాని జ్ఞానసహభావీని చ అతీతానేక జన్మకృతాని చ తాన్యేవ భస్మసాత్ కురుతే.**

**తె.అ.** కట్టెలను ఎర్రటి నిప్పు బూడిద చేసినట్లు జ్ఞానమనే అగ్ని కర్మలనన్నిటినీ భస్మం చేస్తుంది.

అంటే నిర్బీజం చేస్తుంది. జ్ఞానాగ్ని కర్మలను కట్టెలను కాల్చినట్లు సాక్షాత్తు కాల్చివేస్తుందని కాదు. సమ్యగ్దర్శనం కర్మలనన్నిటినీ నిర్బీజం చేస్తుంది అని అభిప్రాయం. ఏ కర్మవల్ల ఈ శరీరం కలిగిందో ఆ కర్మఫలం అనుభవించిన తరువాతనే క్షయమవుతుంది. 'అది వదిలేవరకే వేచి ఉండాలి, ఆ తరువాత సిద్ధి పొందుతాడు' (ఛాం.ఉ.6.14.2) అని శ్రుతి. 'అన్ని కర్మలను' అంటే – జ్ఞానం కలగక ముందు ఈ జన్మలో చేసి ఇంకా ఫలితానికి రానివి, జ్ఞానంతో చేసినవి, గడచిన అనేక జన్మల్లో చేసినవి – వీటిని మాత్రమే భస్మం చేస్తుంది అని. (ప్రారబ్ధకర్మలను కాదు).

**మూ. న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే ।**
**తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విన్దతి ॥ 38**

**తె.అ.** జ్ఞానంతో సమానమైన పవిత్రమైనది ఈ లోకంలో మరొకటి లేదు. దానిని నీవు యోగసిద్ధుడువై కాలక్రమంలో నీలోనే పొందుతావు.

**భాష్యమ్ : 38.1 న హీతి : న హి జ్ఞానేన సదృశం తుల్యం పవిత్రం పావనం శుద్ధికరమ్, ఇహ విద్యతే. తత్ జ్ఞానం స్వయమేవ యోగసంసిద్ధః యోగేన కర్మయోగేన సమాధియోగేన చ సంసిద్ధః సంస్కృతః యోగ్యతామ్ ఆపన్నః సన్ ముముక్షుః కాలేన మహతా ఆత్మని విన్దతి లభతే ఇత్యర్థః.**

**తె.అ.** జ్ఞానంతో సమానమైనది పావనం చేసేది, శుద్ధి చేసేది ఈ లోకంలో మరొకటి లేదు.ఆ జ్ఞానం ముముక్షువు స్వయంగా కర్మయోగం వల్ల, సమాధియోగంచేత యోగ్యుడై, అంటే సంస్కరింపబడి, యోగ్యతను పొంది, చాలాకాలం గడచిన తరువాత తనయందే పొందుతాడు అని అర్థం.

**భాష్యమ్ : 39.0 యేన ఏకాన్తేన జ్ఞానప్రాప్తిః భవతి సః ఉపాయః ఉపదిశ్యతే –**

**తె.అ.** ఏ విధంగా జ్ఞానం నిశ్చయంగా కలుగుతుందో ఆ ఉపాయం ఉపదేశిస్తున్నాడు –

**మూ. శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరః సంయతేన్ద్రియః ॥**
**జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తిమచిరేణాధిగచ్ఛతి ॥ 39**

**తె.అ.** శ్రద్ధ ఉన్నవాడు తత్పరుడై ఇంద్రియాలను వశంలో ఉంచుకొని జ్ఞానం పొంది త్వరలో పరమశాంతిని పొందుతాడు.

**భాష్యమ్ : 39.1 శ్రద్ధావానితి :– శ్రద్ధావాన్ శ్రద్ధాలుః లభతే జ్ఞానమ్. శ్రద్ధాలుత్వేఽపి భవతి కశ్చిత్ మన్దప్రస్థానః, అతః ఆహ – తత్పరః గురూపసదనాదౌ అభియుక్తః జ్ఞానలబ్ధ్యుపాయే**

**శ్రద్ధావాన్, తత్పరోఽపి అజితేన్ద్రియః స్యాత్ ఇత్యతః ఆహ–సంయతేన్ద్రియః, సంయతాని విషయేభ్యః నివర్తితాని యస్య ఇన్ద్రియాణి సః సంయతేన్ద్రియః. యః ఏవం భూతః శ్రద్ధావాన్ తత్పరః, సంయతేన్ద్రియశ్చ సః అవశ్యం జ్ఞానం లభతే. ప్రణిపాతాదిస్తు బాహ్యః అనైకాన్తికః అపి భవతి, మాయావిత్వాది సంభవాత్. న తు తత్ శ్రద్ధావత్త్వాదౌ, ఇత ఏకాన్తతః జ్ఞానలబ్ధ్యుపాయః.**

**తె.అ.** శ్రద్ధగలవాడు జ్ఞానం పొందుతాడు. శ్రద్ధగలవాడైనా మందగతి కావచ్చు. అందుకే అంటున్నాడు తత్పరుడు అని. గురువును చేరడం వంటి జ్ఞానం పొందగల ఉపాయంలో శ్రద్ధ గలవాడు తత్పరుడైనా ఇంద్రియాలను వశంలో ఉంచుకోనివాడు కావచ్చు. అందుకే అంటున్నాడు సంయతేంద్రియుడు అని. విషయాలనుండి ఇంద్రియాలను మరల్చినవాడు సంయతేంద్రియుడు. ఇటువంటి శ్రద్ధగలవాడు, తత్పరుడు, సంయతేంద్రియుడు తప్పక జ్ఞానం పొందుతాడు. ప్రణిపాతాదులు (వంగి నమస్కరించడం) బాహ్యమైనవి. వాటి ఫలమూ అనిశ్చితం, ఎందుకంటే ఇవి నటనకూడా కావచ్చు. శ్రద్ధ, ఇంద్రియజయం ఉన్నప్పుడు ఇటువంటివి జరుగవు. కనుక నిస్సందేహంగా అవి జ్ఞానలబ్ధికి ఉపాయం.

**భాష్యమ్ : 39.2 కిం పునః జ్ఞానలాభాత్ స్యాత్ ఇతి ఉచ్యతే – జ్ఞానం లబ్ధ్వా పరాం మోక్షాఖ్యాం శాన్తిమ్ ఉపరతిం అచిరేణ క్షిప్రమేవ అధిగచ్ఛతి. సమ్యగ్దర్శనాత్ క్షిప్రమ్ ఏవ మోక్షః భవతి ఇతి సర్వశాస్త్రన్యాయ ప్రసిద్ధః సునిశ్చితః అర్థః.**

**తె.అ.** జ్ఞానం లభించిన తరువాత ఏమవుతుంది? అంటే చెపుతున్నాడు. జ్ఞానం లభించిన తరువాత వెంటనే మోక్షమనే పరమశాంతిని పొందుతాడు. సమ్యగ్దర్శనం వల్ల శీఘ్రమే మోక్షం కలుగుతుంది అనేది అన్ని శాస్త్రాలలో సందేహం లేకుండా నిశ్చయించి చెప్పిన ప్రసిద్ధార్థం.

**భాష్యమ్ : 40.0 అత్ర సంశయః న కర్తవ్యః, పాపిష్ఠో హి సంశయః, కథమ్? ఉచ్యతే–**

**తె.అ.** ఇందులో సందేహం పనికిరాదు. సందేహం పాపిష్ఠిది. ఎట్లా అంటే –

**మూ. అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి ।**
**నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః ॥ 40**

**తె.అ.** అజ్ఞాని, అంటే శ్రద్ధలేనివాడు, మరియు సంశయాత్ముడు నాశనమైపోతాడు. సంశయాత్మునికి ఈ లోకంలేదు, పరలోకం లేదు సుఖమూ లేదు.

**భాష్యమ్ : 40.1 అజ్ఞశ్చేతి : అజ్ఞః చ అనాత్మజ్ఞః, అశ్రద్దధానః, చ, గురువాక్య శాస్త్రేషు అవిశ్వాసవాన్ చ సంశయాత్మా చ, సంశయచిత్తశ్చ వినశ్యతి. అజ్ఞాశ్రద్దధానౌ యద్యపి వినశ్యతః తథాపి న తథా యథా సంశయాత్మా. స తు పాపిష్ఠః సర్వేషామ్ – కథమ్? నాయం సాధారణః**

**అపి లోకః అస్తి. తథా న పరః లోకః. న సుఖమ్, తత్రాపి సంశయోత్పత్తేః, సంశయాత్మనః సంశయచిత్తస్య. తస్మాత్ సంశయః న కర్తవ్యః కస్మాత్.**

**తె.అ.** అజ్ఞాని, ఆత్మను తెలియనివాడు. శ్రద్ధలేనివాడు, గురువాక్యంలో, శాస్త్రంలో నమ్మకం లేనివాడు. సంశయాత్ముడు, సందేహించే చిత్తం కలవాడు. అటువంటివాడు నశిస్తాడు. అజ్ఞాని, శ్రద్ధలేనివాడు - వీరిద్దరు నశిస్తారు, కాని సంశయాత్ముని వలె కాదు. వాడు అందరిలోకి పాపిష్ఠుడు. ఎట్లా? వాడికి ఈ సాధారణ ప్రపంచమే లేదు. పరలోకము లేదు, సుఖమూ లేదు. అక్కడకూడా వాడికి సంశయమే. కనుక సంశయం పనికిరాదు. ఎందుకని -

**మూ. యోగసంన్యస్తకర్మాణం జ్ఞానసంఛిన్నసంశయమ్ ।**
**ఆత్మవన్తం న కర్మాణి నిబధ్నన్తి ధనంజయ ॥ 41**

**తె.అ.** అర్జునా! యోగం చేత సమస్త కర్మలను వదిలినవాడు, సంశయాన్ని జ్ఞానంతో ఛేదించినవాడు, అప్రమత్తంగా ఉన్నవాడు - ఇటువంటి వానిని కర్మలు బంధించవు.

**భాష్యమ్ : 41.1 యోగేతి : యోగసంన్యస్తకర్మాణమ్ - పరమార్థదర్శనలక్షణేన యోగేన సంన్యస్తాని కర్మాణి యేన పరమార్థదర్శినా ధర్మాధర్మాఖ్యాని తం యోగసంన్యస్తకర్మాణమ్. కథం యోగసంన్యస్తకర్మా ఇత్యాహ - జ్ఞానసంఛిన్నసంశయం జ్ఞానేన ఆత్మేశ్వరైకత్వదర్శనలక్షణేన సంఛిన్నః సంశయః యస్య సః జ్ఞానసంఛిన్నసంశయః, యః ఏవం యోగసంన్యస్తకర్మా తమ్, ఆత్మవన్తమ్ అప్రమత్తం, గుణచేష్టారూపేణ దృష్టాని కర్మాణి న నిబధ్నన్తి అనిష్టాదిరూపం ఫలం న ఆరభన్తే, హే ధనంజయ.**

**తె.అ.** పరమార్థ దర్శనమే లక్షణమైన యోగం చేత పుణ్యపాపకర్మలను సంన్యసించిన వానిని కర్మలు బంధించవు. యోగం చేత కర్మలనెట్లా సంన్యసిస్తాడు? జ్ఞానంచేత - ఆత్మ ఈశ్వరుడు ఒకటేననే జ్ఞానం చేత - సంశయాన్ని ఛేదిస్తాడు. ఆత్మవంతుని అప్రమత్తుని గుణచేష్టారూపంలో కనిపించే కర్మలు బంధించవు, అనిష్టమైన ఫలమివ్వవు.

**భాష్యమ్ : 42.0 యస్మాత్ కర్మయోగానుష్ఠానాత్ అశుద్ధిక్షయహేతుకజ్ఞానసంఛిన్నసంశయః న నిబధ్యతే కర్మభిః జ్ఞానాగ్నిదగ్ధకర్మత్వాత్ ఏవ, యస్మాత్ చ జ్ఞానకర్మానుష్ఠానవిషయే సంశయవాన్ వినశ్యతి -**

**తె.అ.** కర్మయోగానుష్ఠానం వల్ల అశుద్ధిక్షయమై జ్ఞానం కలిగి సంశయచ్ఛేదం చేసిన వానిని కర్మలు బంధించవు, జ్ఞానాగ్నిలో దగ్ధమైనవి కనుక. ఆ కారణంగా జ్ఞానకర్మానుష్ఠాన విషయంలో సంశయం కలవాడు నశిస్తాడు.

**మూ. తస్మాదజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసినాఽఽత్మనః ।**
**ఛిత్త్వైనం సంశయం యోగమాతిష్ఠోత్తిష్ఠ భారత ॥ 42**

**తె.అ.** అర్జునా! అజ్ఞానంలో పుట్టి హృదయంలో తిష్ఠవేసిన సంశయాన్ని జ్ఞానమనే కత్తితో ఛేదించి యోగానుష్ఠానం చెయ్యి. లెమ్ము.

**ఇతి శ్రీ మహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా-సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే జ్ఞానకర్మసంన్యాసయోగో నామ చతుర్థోఽధ్యాయః.**

ఇది వ్యాసభగవానుని శతసహస్రసంహిత అయిన శ్రీమహాభారతంలో భీష్మపర్వంలో ఉపనిషత్తులు బ్రహ్మవిద్య యోగ శాస్త్రము శ్రీకృష్ణార్జున సంవాదము అయిన భగవద్గీతల యందు జ్ఞానకర్మ సన్న్యాస యోగమనే నాలుగవ అధ్యాయానికి తెలుగు అనువాదం.

**భాష్యమ్ : 42.1 తస్మాదితి : తస్మాత్ పాపిష్ఠమ్ అజ్ఞానసంభూతమ్ అజ్ఞానాత్ అవివేకతో జాతం, హృత్స్థం హృది బుద్ధౌ స్థితం, జ్ఞానాసినా – శోకమోహాదిదోషహరం సమ్యగ్దర్శనం జ్ఞానం, తదేవ అసిః ఖడ్గః తేన జ్ఞానాసినా, ఆత్మనః స్వస్య, ఆత్మ విషయత్వాత్ సంశయస్య, న హి పరస్య సంశయః అపరేణ ఛేత్తవ్యతాం ప్రాప్తః, యేన స్వస్య ఇతి విశేష్యతే. అతః ఆత్మవిషయః అపి స్వస్య ఏవ భవతి. ఛిత్త్వా ఏనం సంశయం స్వవినాశహేతుభూతం, యోగం సమ్యగ్దర్శనోపాయం కర్మానుష్ఠానమ్ ఆతిష్ఠ కుర్విత్యర్థః, ఉత్తిష్ఠ చ ఇదానీం యుద్ధాయ భారత ఇతి.**

**తె.అ.** కనుక అవివేకం వల్ల కలిగి హృదయంలో అంటే బుద్ధియందు నిలిచిన పాపిష్ఠి సంశయాన్ని జ్ఞానమనే కత్తితో ఛేదించు. శోకము, మోహము మొదలైన దోషాలను తొలగించే సమ్యగ్దర్శనం జ్ఞానం. అదే అసి అంటే కత్తి. ఆత్మజ్ఞానమనే కత్తితో అని. సంశయం ఆత్మవిషయం కనుక జ్ఞానము ఆత్మజ్ఞానమే. ఒకరి సంశయం మరొకరు ఛేదించలేరు. కనుకనే (స్వస్య) 'తన' అని ప్రత్యేకించి చెప్పడం. ఆత్మవిషయం అంటే తన విషయమనే. తనను నాశనం చెయ్యగల ఈ సంశయాన్ని ఛేదించి సమ్యగ్దర్శనం కలిగించగల కర్మానుష్ఠానం చెయ్యి అని అర్థం. అర్జునా! లేచి యుద్ధం చెయ్యి అని.

**ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య గోవిన్దభగవత్పూజ్యపాదశిష్య శ్రీమచ్ఛఙ్కరభగవతః కృతౌ శ్రీమద్భగవద్గీతాభాష్యే జ్ఞానకర్మ సంన్యాసయోగో నామ చతుర్థోఽధ్యాయః**

ఇది శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య గోవింద భగవత్పూజ్యపాదశిష్యులు శ్రీమత్ శంకరభగవత్పాదులు రచించిన శ్రీమద్భగవద్గీతా భాష్యంలో జ్ఞానకర్మ సంన్యాసయోగమనే నాల్గవ అధ్యాయానికి తెలుగు అనువాదం.



# పంచమోఽధ్యాయః

## సంన్యాసయోగః

**భాష్యమ్ : 0.1. "కర్మణ్యకర్మ యః పశ్యేత్" (4.18) ఇత్యారభ్య "స యుక్తః కృత్స్న కర్మకృత్" (4.18), "జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణమ్" (4.19), "శారీరం కేవలం కర్మ కుర్వన్" (4.21), "యదృచ్ఛాలాభసంతుష్టః" (4.22), "బ్రహ్మార్పణం బ్రహ్మ హవిః" (4.24), "కర్మజాన్ విద్ధి తాన్ సర్వాన్" (4.32), "సర్వం కర్మాఖిలం పార్థ" (4.33), "జ్ఞానాగ్నిః సర్వ కర్మాణి" (4.37), "యోగసంన్యస్తకర్మాణమ్" (4.41) ఇత్యేతైః వచనైః సర్వకర్మణాం సంన్యాసమ్ అవోచత్ భగవాన్. "ఛిత్త్వైనం సంశయం యోగమాతిష్ఠోత్తిష్ఠ" (4.42) ఇత్యనేన వచనేన యోగం చ కర్మానుష్ఠానలక్షణం అనుతిష్ఠ ఇత్యుక్తవాన్. తయోః ఉభయోశ్చ కర్మానుష్ఠానకర్మసంన్యాసయోః స్థితిగతివత్ పరస్పర విరోధాత్ ఏకేన సహ కర్తుమ్ అశక్యత్వాత్, కాలభేదేన చ అనుష్ఠానవిధానాభావాత్, అర్థాత్ ఏతయోః అన్యతరకర్తవ్యతాప్రాప్తౌ సత్యాం యత్ ప్రశస్యతరమ్ ఏతయోః కర్మానుష్ఠానకర్మసంన్యాసయోః తత్ కర్తవ్యమ్, న ఇతరత్ ఇత్యేవం మన్యమానః ప్రశస్యతర బుభుత్సయా అర్జునః ఉవాచ – 'సంన్యాసం కర్మణాం కృష్ణ' (5.1) ఇత్యాదినా.**

**తె.అ.** 'కర్మణ్యకర్మ యః పశ్యేత్' (4–18) తో మొదలుపెట్టి 'స యుక్తః కృత్స్న కర్మకృత్' (4.18) 'జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణమ్' (4.19), 'శారీరం కేవలం కర్మ కుర్వన్' (4.21), 'యదృచ్ఛాలాభ సంతుష్టః' (4.22), 'బ్రహ్మార్పణం బ్రహ్మ హవిః' (4.24), 'కర్మజాన్ విద్ధి తాన్ సర్వాన్ (4.32), 'సర్వం కర్మాఖిలం పార్థ' (4.33), 'జ్ఞానాగ్నిః సర్వ కర్మాణి' (4.37), 'యోగసంన్యస్త కర్మాణం' (4.41) అనే వాక్యాలలో సర్వకర్మలను సంన్యసించవలెనని భగవానుడు చెప్పాడు. 'ఛిత్త్వైనం సంశయం యోగమాతిష్ఠ' (4.42) అనే వాక్యంలో కర్మానుష్ఠాన లక్షణమైన యోగం అనుష్ఠించమని కూడా చెప్పాడు. కర్మానుష్ఠాన కర్మసంన్యాసాలు రెండూ స్థితి గతులవలె పరస్పర విరుద్ధాలు. ఒక్కడే రెండూ ఒకే సమయంలో అనుష్ఠించలేడు. ఇప్పుడొకటి మరొకసారి మరొకటి చెయ్యవలెనన్న విధానమూ లేదు. అంటే ఈ రెంటిలో ఏదో ఒకటి మాత్రమే చేయగలిగినప్పుడు రెంటిలో కర్మానుష్ఠాన కర్మసన్న్యాసాలలో మేలైనదే చేద్దాం. కానిది వద్దు అనుకొని మేలైనదేదో తెలుసుకొనవలెనని అర్జునుడు అడిగాడు – 'సన్న్యాసం కర్మణాం కృష్ణ' (5.1) అని.

**భాష్యమ్ : 0.2. నను చ ఆత్మవిదః జ్ఞానయోగేన నిష్ఠాం ప్రతిపాదయిష్యన్ పూర్వోదాహృతైః వచనైః భగవాన్ సర్వకర్మసంన్యాసమ్ అవోచత్, న తు అనాత్మజ్ఞస్య, అతశ్చ కర్మానుష్ఠానకర్మ**

**సంన్యాసయోః భిన్నపురుషవిషయత్వాత్ అన్యతరస్య ప్రశస్యతరత్వబుభుత్సయా అయం ప్రశ్నః అనుపపన్నః. సత్యమేవ, త్వదభిప్రాయేణ ప్రశ్నః న ఉపపద్యతే. ప్రష్టుః స్వాభిప్రాయేణ పునః ప్రశ్నః యుజ్యతే ఏవ ఇతి వదామః. కథమ్? పూర్వోదాహృతైః వచనైః భగవతా కర్మసంన్యాసస్య కర్తవ్యతయా వివక్షితత్వాత్ ప్రాధాన్యమ్, అన్తరేణ చ కర్తారం తస్య కర్తవ్యత్వాసంభవాత్. అనాత్మవిదపి కర్తా పక్షే ప్రాప్తః అనూద్యతే ఏవ, న పునః ఆత్మవిత్ కర్తృకత్వమ్ ఏవ సంన్యాసస్య వివక్షితమ్ ఇత్యేవం మన్వానస్య అర్జునస్య కర్మానుష్ఠానకర్మసంన్యాసయోః అవిద్వత్పురుషకర్తృకత్వమ్ అపి అస్తి ఇతి పూర్వోక్తేన ప్రకారేణ తయోః పరస్పర విరోధాత్ అన్యతరస్య కర్తవ్యత్వే ప్రాప్తే ప్రశస్యతరం చ కర్తవ్యమ్, న ఇతరత్ ఇతి ప్రశస్యతరవివిదిషయా ప్రశ్నః న అనుపపన్నః.**

**తె.అ.** ఆక్షేపణ – ఆత్మవేత్తకు జ్ఞానయోగనిష్ఠను ప్రతిపాదిస్తూ పైన ఉదాహరించిన వాక్యాలలో భగవానుడు సర్వకర్మసంన్యాసం చెప్పాడు, అనాత్మవేత్తకు కాదు. కనుక, కర్మానుష్ఠానము కర్మసంన్యాసము ఒకరే అనుష్ఠించేవి కావు. అటువంటప్పుడు ఆ రెంటిలో ఏది మేలు అని తెలుసుకోవలెనని ఇట్లా ప్రశ్నించడంలో అర్థం లేదు.

సమాధానం – మీ అభిప్రాయం ప్రకారం ఈ ప్రశ్నకు అర్థం లేదు. నిజమే. కాని అర్జునుని అభిప్రాయం ప్రకారం ఇట్లా ప్రశ్నించడానికి వీలున్నది అంటాం. ఎట్లా? వెనుక ఉదాహరించిన వాక్యాలలో భగవానుడు కర్మలను సన్న్యసించడం ప్రధానకర్తవ్యమని చెప్పదలచుకున్నాడు. కర్త లేకుండా కర్తవ్యం అసంభవం. అనాత్మవేత్తకూడా కర్తయే కనుక అతడు కూడా కర్మలను సంన్యసించ వచ్చునని చెప్పినట్లే. ఆత్మవేత్తను మాత్రమే సంన్యాసానికి కర్తగా చెప్పలేదు, అని అర్జునుడు అనుకున్నాడు. కర్మానుష్ఠానము, కర్మసన్న్యాసము అవిద్యావంతునికి కూడా ఉన్నవి అనుకున్న అర్జునుడు ఈ విధంగా ప్రశ్నించడం సంభవమే. వెనుక అనుకున్నట్లే అర్జునుడు కర్మానుష్ఠానము, కర్మసన్న్యాసము పరస్పర విరుద్ధాలు, రెంటిలో ఏదో ఒకదానిని మాత్రమే అనుష్ఠించగలను కనుక రెంటిలో మేలైనదే చేద్దాం అనుకొని దాన్ని తెలుసుకోవలెననే కోరికతో ఇట్లా ప్రశ్నించడం సంభవమే.

**భాష్యమ్ : 0.3 ప్రతివచన వాక్యార్థనిరూపణేనాపి ప్రష్టుః అభిప్రాయః ఏవమేవ ఇతి గమ్యతే. కథమ్? "సంన్యాసకర్మయోగౌ నిఃశ్రేయసకరౌ తయోస్తు కర్మయోగః విశిష్యతే" (5.2) ఇతి ప్రతివచనమ్. ఏతత్ నిరూప్యమ్–కిమ్ అనేన ఆత్మవిత్ కర్తృకయోః సంన్యాసకర్మయోగయోః నిఃశ్రేయసకరత్వం ప్రయోజనమ్ ఉక్త్వా తయోః ఏవ కుతశ్చిత్ విశేషాత్ కర్మసంన్యాసాత్ కర్మయోగస్య విశిష్టత్వమ్ ఉచ్యతే, ఆహోస్విత్ ఆత్మవిత్ కర్తృకయోః సంన్యాసకర్మయోగయోః తదుభయమ్ ఉచ్యతే ఇతి. కించాతః – యది ఆత్మవిత్ కర్తృకయోః కర్మ సంన్యాసకర్మయోగయోః**

**నిఃశ్రేయసకరత్వమ్, తయోస్తు కర్మసంన్యాసాత్ కర్మయోగస్య విశిష్టత్వం ఉచ్యతే, యది వా అనాత్మవిత్కర్తృకయోః సంన్యాసకర్మయోగయోః తత్ ఉభయం ఉచ్యతే ఇతి? అత్ర ఉచ్యతే - ఆత్మవిత్కర్తృకయోః సంన్యాస-కర్మయోగయోః అసంభవాత్ తయోః నిఃశ్రేయసకరత్వవచనం, తదీయాచ్చ కర్మసంన్యాసాత్ కర్మయోగస్య విశిష్టత్వాభిధానమ్ ఇత్యేతత్ ఉభయమ్ అనుపపన్నమ్. యది అనాత్మవిదః కర్మసంన్యాసః తత్ప్రతికూలశ్చ కర్మాను-ష్ఠానలక్షణః కర్మయోగః సంభవేతాం తదా తయోః నిఃశ్రేయసకరత్వోక్తిః, కర్మయోగస్య చ కర్మసంన్యాసాత్ విశిష్టత్వాభిధానమ్ ఇత్యేతత్ ఉభయమ్ ఉపపద్యేత. ఆత్మవిదస్తు సంన్యాసకర్మయోగయోః అసంభవాత్ తయోః నిః శ్రేయసకరత్వాభిధానం, కర్మసంన్యాసాచ్చ కర్మయోగః విశిష్యతే ఇతి చ అనుపపన్నమ్.**

**తె.అ.** ప్రశ్నించిన అర్జునుని అభిప్రాయం ఇదేనని భగవానుడిచ్చిన ప్రతివచనం యొక్క అర్థనిరూపణం వల్ల తెలుస్తుంది. ఎట్లా? 'సంన్యాస కర్మయోగాలు రెండూ నిశ్శ్రేయసకరమైనవే. అయినా ఆ రెంటిలో కర్మయోగమే విశిష్టము', (5.2) అని ప్రతివచనం. ఏమిటి దీనికర్థం? ఆత్మవేత్త ఆచరించే సన్న్యాసము కర్మయోగము కూడా నిశ్శ్రేయసకరములే, అయినా ఎందుకో ఒకందుకు కర్మసన్న్యాసం కంటే కర్మయోగమే మేలైనదని అని అంటున్నాడా? లేక అనాత్మవేత్త ఆచరించే సంన్యాస కర్మయోగాల గురించి ఆ రెండూ, కర్మయోగం కూడా నిశ్శ్రేయసకరమని, సంన్యాసం కంటే అది శ్రేష్ఠమని చెపుతున్నాడా?

ఆక్షేపణ- ఎట్లా అనుకుంటే ఏం? ఆత్మవేత్త ఆచరించే కర్మసంన్యాస కర్మయోగాలు రెండూ నిశ్శ్రేయసకరములేనని ఆ రెంటిలో కర్మసంన్యాసం కంటే కర్మయోగం మేలైనదని అంటే ఏమి? లేక అనాత్మవేత్త ఆచరించే కర్మసంన్యాస కర్మయోగాల గురించి చెబితే ఏమి?

సమాధానం - ఆత్మవేత్త ఒకే సమయంలో కర్మలను సంన్యసించడము అనుష్ఠించడము అసంభవమయినపుడు అవి రెండూ నిశ్శ్రేయసకరములని అనడం కాని, ఆ రెంటిలో కర్మసంన్యాసం కంటే కర్మయోగం మేలైనది అని అనడంకాని అర్థం లేనిమాట. అనాత్మవేత్త సంన్యాసము, దానికి విరుద్ధమైన కర్మయోగము కూడా ఆచరించవచ్చుననుకుంటే, అప్పుడు ఆ రెండూ నిశ్శ్రేయ-సకరములేనని, కర్మసంన్యాసం కంటే కర్మయోగం విశిష్టమని, ఈ రెండూ కూడా అనడం సంభవమే. కాని ఆత్మవేత్తకు సంన్యాసము కర్మయోగము ఒకే సమయంలో అనుష్ఠించడం అసంభవమని తెలుసు. కనుక అతనిని ఉద్దేశించి అవి రెండూ నిశ్శ్రేయసకరములనడం గాని, కర్మసంన్యాసం కంటే కర్మయోగం విశిష్టమైనది అనడం గాని రెండూ అర్థం లేని మాటలు.

**భాష్యమ్ : 0.4. అత్రాహ - కిమ్ ఆత్మవిదః సంన్యాసకర్మయోగయోః ఉభయోః అపి అసంభవః? ఆహోస్విత్ అన్యతరస్య అసంభవః? యదా చ అన్యతరస్య అసంభవః, తదా కిం కర్మసంన్యాసస్య**

**ఉత కర్మయోగస్య ఇతి. అసంభవే చ కారణం వక్తవ్యమ్ ఇతి. అత్రోచ్యతే ఆత్మవిదః నివృత్తమిథ్యాజ్ఞానత్వాత్, విపర్యయజ్ఞానమూలస్య కర్మయోగస్య అసంభవః స్యాత్, జన్మాదిసర్వవిక్రియారహితత్వేన నిష్క్రియమ్ ఆత్మానమ్ ఆత్మత్వేన యః వేత్తి తస్య ఆత్మవిదః సమ్యగ్దర్శనేన అపాస్తమిథ్యాజ్ఞానస్య నిష్క్రియాత్మస్వరూపావస్థానలక్షణం సర్వకర్మసంన్యాసమ్ ఉక్త్వా తద్విపరీతస్య మిథ్యాజ్ఞానమూలకర్తృత్వాభిమానపురస్సరస్య సక్రియాత్మ స్వరూపావస్థానరూపస్య కర్మయోగస్య ఇహ గీతాశాస్త్రే తత్ర తత్ర ఆత్మస్వరూపనిరూపణ ప్రదేశేషు సమ్యగ్ జ్ఞానమిథ్యాజ్ఞానతత్కార్యవిరోధాత్ అభావః ప్రతిపాద్యతే యస్మాత్ తస్మాత్ ఆత్మవిదః నివృత్త మిథ్యాజ్ఞానస్య విపర్యయజ్ఞానమూలః కర్మయోగః న సంభవతి ఇతి యుక్తమ్ ఉక్తం స్యాత్.**

**తె.అ.** ప్రశ్న – ఆత్మవేత్తకు సంన్యాసము, కర్మయోగము రెండూ అసంభవమా లేక ఆ రెంటిలో ఒకటి అసంభవమా? ఒకటి అసంభవమైతే కర్మసంన్యాసం అసంభవమా కర్మయోగం అసంభవమా? ఎందుకు అసంభవమో కూడా చెప్పవలె.

సమాధానం – మిథ్యాజ్ఞానం తొలగిన కారణంగా ఆత్మవేత్తకు విపరీతజ్ఞానంవల్ల కలిగే కర్మయోగం అసంభవం. పుట్టుక మొదలైన ఏ వికారములేని నిష్క్రియమైన ఆత్మ తానని తెలుసుకున్నవాడు ఆత్మవేత్త. సమ్యగ్దర్శనం చేత అతని మిథ్యాజ్ఞానం తొలగిపోతుంది. అతనికి ఆత్మస్వరూపంలో నిలచి ఉండడమనే కర్మసన్న్యాసం చెప్పి, దానికి విపరీతమైన మిథ్యాజ్ఞాన మూలకము కర్తృత్వాభిమానపూర్వకము, సక్రియాత్మస్వరూపము అయిన కర్మయోగం అతనికి అసంభవమని ఈ గీతాశాస్త్రంలో ఆత్మస్వరూపం నిరూపించే సందర్భాలలో అంతటా ప్రతిపాదించబడింది. సమ్యక్–జ్ఞానము, మిథ్యాజ్ఞానము వాటి కార్యాలు పరస్పర విరుద్ధాలు. కనుక మిథ్యాజ్ఞానం తొలగిపోయిన ఆత్మవేత్తకు విపరీతజ్ఞాన మూలకమైన కర్మయోగం అసంభవమని చెప్పడమే సరి అయింది.

**భాష్యమ్ : 0.5. కేషు కేషు పునః ఆత్మస్వరూపనిరూపణ ప్రదేశేషు ఆత్మవిదః కర్మాభావః ప్రతిపాద్యతే ఇతి? అత్రోచ్యతే "అవినాశి తు తత్" (2.17) ఇతి ప్రకృత్య "య ఏనం వేత్తి హన్తారమ్" (2.19), "వేదావినాశినం నిత్యమ్" (2.21) ఇత్యాదౌ తత్ర తత్ర ఆత్మవిదః కర్మాభావః ఉచ్యతే.**

**నను చ కర్మయోగోఽపి ఆత్మస్వరూపనిరూపణ ప్రదేశేషు తత్ర తత్ర ప్రతిపాద్యతే ఏవ, తత్ యథా "తస్మాత్ యుధ్యస్వ భారత" (2.47) 'కర్మణ్యేవాధికారస్తే' ఇత్యాదౌ అతశ్చ కథమ్ ఆత్మవిదః కర్మయోగస్య అసంభవః స్యాత్ ఇతి?**

**అత్ర ఉచ్యతే – సమ్యగ్ జ్ఞానమిథ్యా జ్ఞానతత్కార్య విధాత్, "జ్ఞానయోగేన సాంఖ్యానామ్" (3.3) ఇత్యనేన సాంఖ్యానామ్ ఆత్మతత్త్వవిదామ్ అనాత్మవిత్ కర్తృకకర్మయోగనిష్ఠాతః నిష్క్రియాత్మ–**

**స్వరూపావస్థానలక్షణాయాః జ్ఞానయోగనిష్ఠాయాః పృథక్కరణాత్ కృతకృత్యత్వేన ఆత్మతత్త్వవిదః ప్రయోజనాన్తరాభావాత్, "తస్య కార్యం న విద్యతే" (3.17) ఇతికర్తవ్యాన్తరాభావ వచనాచ్చ. "న కర్మణామనారమ్భాత్" (3.4) "సంన్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తుమయోగతః" (5.6) ఇత్యాదినా చ ఆత్మజ్ఞానాంగత్వేన కర్మయోగస్య విధానాత్, "యోగారూఢస్య తస్యైవ శమః కారణముచ్యతే" (6.3) ఇత్యనేన చ ఉత్పన్నసమ్యగ్దర్శనస్య కర్మయోగాభావవచనాత్, "శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్" (4.21) ఇతి చ శరీరస్థితికారణాతిరిక్తస్య కర్మణః నివారణాత్, "నైవ కించిత్కరోమీతి యుక్తోమన్యేత తత్త్వవిత్" (5.8) ఇత్యనేన చ శరీరస్థితిమాత్రప్రయుక్తేషు అపి దర్శన శ్రవణాదికర్మసు ఆత్మయాథాత్మ్యవిదః "నాహంకరోమి" ఇతి ప్రత్యయస్య సమాహితచేతస్తయా సదా కర్తవ్యత్వోపదేశాత్, ఆత్మతత్త్వవిదః సమ్యగ్దర్శనవిరుద్ధః మిథ్యాజ్ఞానహేతుకః కర్మయోగః స్వప్నేఽపి న సంభావయితుం శక్యతే యస్మాత్, తస్మాత్ అనాత్మ విత్కర్తృకయోః ఏవ సంన్యాసకర్మయోగయోః నిఃశ్రేయసకరత్వవచనం, తదీయాచ్చ కర్మసంన్యాసాత్ పూర్వోక్తాత్మవిత్కర్తృకసర్వకర్మసంన్యాసవిలక్షణాత్, సత్యేవ కర్తృత్వవిజ్ఞానే, కర్మైకదేశవిషయాత్, యమనియమాదిసహితత్వేన చ దురనుష్ఠేయాత్ సుకరత్వేన కర్మయోగస్య విశిష్టత్వాభిధానమ్ ఇత్యేవం ప్రతివచనవాక్యార్థనిరూపణేనాపి పూర్వోక్తః ప్రష్టుః అభిప్రాయః నిశ్చీయతే ఇతి స్థితమ్.**

**తె.అ.** ప్రశ్న – ఆత్మస్వరూపం నిరూపించే ఏ యే సందర్భాలలో ఆత్మవేత్తకు కర్మాభావం ప్రతిపాదించబడింది?

సమాధానం – 'అవినాశి తు తత్' (2.17) తో ప్రకరణం ప్రారంభించి 'య ఏనం వేత్తి హన్తారం' (2.19), 'వేదావినాశినం నిత్యం' (2.21) మొదలైన వాక్యాలలో అక్కడక్కడా ఆత్మవేత్తకు కర్మాభావం చెప్పాడు.

ప్రశ్న– ఆత్మస్వరూపాన్ని నిరూపించే సందర్భాలలో అక్కడక్కడా కర్మయోగం కూడా ప్రతిపాదించబడింది కదా, 'తస్మాత్ యుద్ధ్యస్వ భారత' (2.18), 'కర్మణ్యేవాధికారస్తే' (2.47) మొదలైన వాక్యాలలో. మరి ఆత్మవేత్తకు కర్మయోగం అసంభవమని ఎట్లా అనగలరు?

సమాధానం – సమ్యక్ జ్ఞానము మిథ్యాజ్ఞానము వాటి పరిణామాలు పరస్పర విరుద్ధాలు కనుక. ఆత్మవేత్తలైన సాంఖ్యులకు నిష్క్రియాత్మస్వరూపంలో నిలిచి ఉండడమనే జ్ఞానయోగనిష్ఠను 'జ్ఞానయోగేన సాంఖ్యానాం' (3.3) అని చెప్పి ఆత్మతత్త్వం తెలియనివాడు ఆచరించే కర్మయోగం నుండి జ్ఞానయోగాన్ని వేరుచేసి చెప్పి ఉండడంచేత. ఆత్మవేత్త కృతకృత్యుడు, అతనికి వేరే ప్రయోజనమేదీ లేదు. 'తస్య కార్యం న విద్యతే' (3.17) అని అతనికి వేరే కర్తవ్యం లేదని

చెప్పడం చేత. 'న కర్మణామనారమ్భాత్' (3.4), 'సంన్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తుమయోగత' (5.6) మొదలైన వాక్యాలలో ఆత్మజ్ఞానానికి కర్మయోగం అంగమని చెప్పడం చేత; 'యోగారూఢస్య తస్యైవ శమః కారణముచ్యతే' (6.3)లో సమ్యగ్దర్శనం కలిగినవానికి కర్మయోగం లేదని చెప్పడం చేత; 'శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషం' (4.21)లో అతనికి శరీరం నిలిచి ఉండడానికి అవసరమైనవి కాక మరే కర్మ చేయవలసిలేదనడం చేత; 'నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్' (5.8) లో శరీరస్థితి కొరకు మాత్రమే చేసే చూడడం, వినడం వంటి కర్మలలో కూడా ఆత్మతత్త్వం తెలిసినవాడు నేను చేస్తున్నాను అన్న భావం రానీయకూడదు అని ఉపదేశించడం చేత సమ్యగ్దర్శన విరుద్ధమైన మిథ్యాజ్ఞానంలో మాత్రమే సాధ్యమైన కర్మయోగం ఆత్మవేత్తకు కలలో గూడా కలగడానికి వీలులేదు. అందుచేత ఆత్మతత్త్వం తెలియనివాడు చేసే సంన్యాసకర్మయోగాల గురించే ఇక్కడ నిశ్శ్రేయసకరములని, ఆ రెంటిలో కర్మసంన్యాసం కంటే కర్మయోగం మేలని చెప్పడం. ఆత్మతత్త్వం తెలియనివాడు చేసే కర్మ సంన్యాసము, తెలిసినవాడు చేసే కర్మసంన్యాసం ఒకటి కావు. తెలియనివాడు నేను కర్తను అన్న బుద్ధిని సంన్యసించడం లేదు. కనుక అతని సంన్యాసం సంపూర్ణం కాదు కూడా. యమ నియమాదులతో అనుష్ఠించే కష్టమైన సంన్యాసం కంటె కర్మయోగం సులభం కనుక అది మేలని చెప్పాడు. ఈ విధంగా భగవానుడిచ్చిన ప్రతివచనం యొక్క అర్థం నిరూపించిన తరువాత ప్రశ్నించినవాని అభిప్రాయం ఇంతకుముందు నిశ్చయించిందేనని తేలుతుంది.

**భాష్యమ్ : 0.6. "జ్యాయసీ చేత్కర్మణస్తే" (3.1) ఇత్యత్ర జ్ఞానకర్మణోః సహ అసంభవాత్ "యచ్ఛ్రేయ ఏతయోః మే తత్ బ్రూహి" ఇత్యేవం పృష్టః అర్జునేన భగవాన్ సాంఖ్యానాం సంన్యాసినాం జ్ఞానయోగేన నిష్ఠా, పునః కర్మయోగేన యోగినాం నిష్ఠా ప్రోక్తా ఇతి నిర్ణయం చకార. "న చ సంన్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి" (3.4) ఇతి వచనాత్ జ్ఞానసహితస్య తస్య సిద్ధిసాధనత్వం ఇష్టమ్. కర్మయోగస్య చ విధానాత్ (4.42). జ్ఞానరహితస్య సంన్యాసః శ్రేయాన్? కిం వా కర్మయోగః శ్రేయాన్? ఇతి ఏతయోః ప్రశస్యతరం బుభుత్సుః.**

**తె.అ.** జ్ఞానకర్మలు రెండిటినీ ఒకే సమయంలో అనుష్ఠించడం అసంభవం కనుక ఆ రెంటిలో ఏది మేలు ('యత్ శ్రేయ ఏతయోః') అని అడిగిన అర్జునునికి భగవానుడు సంన్యాసులైన సాంఖ్యులకు జ్ఞానయోగ నిష్ఠ, యోగులకు కర్మయోగ నిష్ఠ అని నిశ్చయించి చెప్పాడు. 'న చ సంన్యసనా దేవ సిద్ధిం సమధిగచ్ఛతి' (3.4) అనే వాక్యంలో జ్ఞానసహితమైన సంన్యాసం వల్లనే సిద్ధి పొందగలరు అన్న అభిప్రాయం ప్రకటిస్తూ, మళ్ళీ కర్మయోగం కూడా విధించాడు. అయితే జ్ఞానరహితునకు సన్న్యాసం మేలా కర్మయోగం మేలా ఈ రెంటిలో ఏది మేలో తెలుసుకొనవలెనని–

**అర్జున ఉవాచ –**

**మూ. సంన్యాసం కర్మణాం కృష్ణ పునర్యోగం చ శంససి ।**
**యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్ ॥ 1**

అర్జునుడు అడుగుతున్నాడు.

**తె.అ.** కృష్ణా! కర్మలు చేయడాన్ని వదలడాన్ని కూడా పొగడుతున్నావు. ఆ రెంటిలో ఏది మేలో తేల్చి చెప్పు.

**భాష్యమ్ : సంన్యాసమితి. సంన్యాసం పరిత్యాగం, కర్మణాం శాస్త్రీయాణామ్ అనుష్ఠేయ-విశేషాణాం శంససి ప్రశంససి కథయసీత్యేతత్. పునః యోగం చ తేషామేవ అనుష్ఠానమ్, అవశ్యకర్తవ్యమ్, శంససి, అతః మే కతరత్ శ్రేయః ఇతి సంశయః – కిం కర్మానుష్ఠానం శ్రేయః కిం వా తద్ధానమ్ ఇతి, ప్రశస్యతరం చ అనుష్ఠేయమ్, అతశ్చ యత్ శ్రేయః ప్రశస్యతరమ్ ఏతయోః కర్మసంన్యాసకర్మానుష్ఠానయోః, యదనుష్ఠానాత్ శ్రేయోఽవాప్తిః మమ స్యాత్ ఇతి మన్యసే, తత్ ఏకమ్ అన్యతరత్, సహ ఏకపురుషానుష్ఠేయత్వాసంభవాత్ మే బ్రూహి, సునిశ్చితమ్ అభిప్రేతం తవ ఇతి.**

**తె.అ.** అనుష్ఠించవలసినవి అని శాస్త్రం విధించిన కర్మలను సన్న్యసించడాన్ని, అంటే వదిలివేయడాన్ని ప్రశంసిస్తున్నావు. మళ్ళీ అవే కర్మలను చేయడాన్ని అంటే యోగాన్ని అవశ్య కర్తవ్యమని పొగడుతున్నావు. రెంటిలో ఏది మేలు అనే సంశయం నాకు కలుగుతున్నది, కర్మానుష్ఠానం మేలా లేక కర్మలను వదలడం మేలా అని. మేలైనదే అనుష్ఠించవలెను. కనుక కర్మసంన్యాస కర్మయోగాలలో ఏది అనుష్ఠిస్తే నాకు మేలు కలుగుతుందని నీవు అనుకుంటావో, కారణం రెండూ ఒకటే అనుష్ఠించడం అసంభం. నీ అభిప్రాయం ప్రకారం ఆ ఒకటి ఏదో బాగా నిశ్చయించి చెప్పు అని.

**భాష్యమ్ : 2.0 సాభిప్రాయమ్ ఆచక్షాణః నిర్ణయాయ–**

**తె.అ.** నిర్ణయించి తన అభిప్రాయం చెపుతూ–

**శ్రీ భగవానువాచ –**

**మూ. సంన్యాసః కర్మయోగశ్చ నిఃశ్రేయసకరావుభౌ ।**
**తయోస్తు కర్మసంన్యాసాత్ కర్మయోగో విశిష్యతే ॥ 2**

శ్రీ భగవానుడు అంటున్నాడు.

**తె.అ.** సంన్యాసము, కర్మయోగము రెండూ మోక్షమిచ్చేవే. అయినా ఆ రెంటిలో కర్మసంన్యాసం కంటే కర్మయోగం మేలు.

**భాష్యమ్ : 2.1. సంన్యాస ఇతి. సంన్యాసః కర్మణాం పరిత్యాగః కర్మయోగః చ, తేషామ్ అనుష్ఠానమ్, తౌ ఉభౌ అపి, నిఃశ్రేయసకరౌ మోక్షం కుర్వాతే జ్ఞానోత్పత్తిహేతుత్వేన. ఉభౌ యద్యపి నిఃశ్రేయసకరౌ తథాపి, తయోః తు నిఃశ్రేయసహేత్వోః కర్మసంన్యాసాత్ కేవలాత్ కర్మయోగః విశిష్యతే ఇతి కర్మయోగం స్తౌతి.**

**తె.అ.** సంన్యాసం అంటే కర్మలను వదలివేయడం. కర్మలను ఆచరించడం కర్మయోగం. జ్ఞానం కలగడానికి కారణాలు కనుక. ఆ రెండూ నిశ్శ్రేయసం కలిగించేవే, అంటే మోక్షమిచ్చేవే రెండూ నిశ్శ్రేయసం కలిగించేవే అయినప్పటికీ కేవల సంన్యాసం కంటె కర్మయోగం విశిష్టమైంది అని కర్మయోగాన్ని స్తుతిస్తున్నాడు. (జ్ఞానసహితంగాని కర్మసంన్యాసం కంటె కర్మానుష్ఠానమే మేలని కర్మయోగాన్ని స్తుతిస్తున్నాడు.)

**భాష్యమ్ : 3.0. కస్మాత్ ఇత్యాహ –**

**తె.అ.** ఎందుకని మేలు? చెపుతున్నాడు.

**మూ. జ్ఞేయః స నిత్యసంన్యాసీ యో న ద్వేష్టి న కాఙ్క్షతి ।**
**నిర్ద్వన్ద్వో హి మహాబాహో సుఖం బన్ధాత్ ప్రముచ్యతే ॥ 3**

**తె.అ.** ఎవడు దేనినీ కోరడో, దేనినీ ద్వేషించడో అతడు నిత్యసన్న్యాసి అని తెలుసుకో. అర్జునా ఇటువంటి ద్వంద్వాలకు అతీతుడైనవాడు బంధాలనుండి అనాయాసంగా బయటపడతాడు.

**భాష్యమ్ : 3.1. జ్ఞేయ ఇతి – జ్ఞేయః జ్ఞాతవ్యః సః, కర్మయోగీ, నిత్యసంన్యాసీ ఇతి యః న ద్వేష్టి కించిత్, న కాఙ్క్షతి సుఖదుఃఖే తత్సాధనే చ, ఏవం విధః యః కర్మణి వర్తమానః అపి సః నిత్యసంన్యాసీ ఇతి జ్ఞాతవ్యః ఇత్యర్థః. నిర్ద్వన్ద్వః ద్వన్ద్వవర్జితః, హి యస్మాత్, మహాబాహో, సుఖం బన్ధాత్ అనాయాసేన ప్రముచ్యతే.**

**తె.అ.** ఎవడు దేనినీ ద్వేషించడో, కోరడో సుఖాన్నిగాని, దుఃఖాన్ని గాని వాటి సాధనాలను గాని, అట్టి కర్మయోగి నిత్యసంన్యాసి అని తెలుసుకో. ఇటువంటివాడు కర్మలు చేస్తూ ఉన్నప్పటికి అతడు నిత్యసంన్యాసి అని తెలుసుకో అని అర్థం. ద్వంద్వములు లేనివాడు అనాయాసంగా బంధాలనుండి బయటపడగలడు.

**భాష్యమ్ : 4.0. సంన్యాసకర్మయోగయోః భిన్నపురుషానుష్ఠేయయోః విరుద్ధయోః ఫలే అపి విరోధః యుక్తః, న తు ఉభయోః అపి నిఃశ్రేయసకరత్వమ్ ఏవ ఇతి ప్రాప్తే ఇదమ్ ఉచ్యతే.**

**తె.అ.** వేరు వేరు పురుషులు అనుష్ఠించదగిన సన్న్యాస కర్మయోగాలు పరస్పరం విరుద్ధాలు, వాటి ఫలాలు కూడా విరుద్ధమైనవి అయి ఉండవలె, రెంటికీ నిశ్శ్రేయసమే ఫలం కాకూడదు, అనే సంశయం కలుగుతుందని చెపుతున్నాడు–

**మూ. సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి న పణ్డితాః ।**
**ఏకమప్యాస్థితః సమ్యగుభయోర్విన్దతే ఫలమ్ ॥ 4**

**తె.అ.** సాంఖ్యము, యోగము వేరని బుద్ధిలేనివారంటారు, కాని పండితులనరు. చక్కగా ఒక్క దానిని అనుష్ఠించినా రెంటి ఫలము పొందుతాడు.

**భాష్యమ్ : 4.1. సాంఖ్యయోగావితి – సాంఖ్యయోగౌ పృథక్ విరుద్ధభిన్నఫలౌ బాలాః ప్రవదన్తి న పణ్డితాః. పణ్డితాః తు జ్ఞానినః ఏకం ఫలమ్ అవిరుద్ధమ్ ఇచ్ఛన్తి. కథమ్? ఏకమ్ అపి సాంఖ్యయోగయోః సమ్యక్ ఆస్థితః. సమ్యక్ అనుష్ఠితవానిత్యర్థః. ఉభయోః విన్దతే ఫలమ్. ఉభయోః తదేవ హి నిఃశ్రేయసం ఫలమ్ అతః న ఫలే విరోధః అస్తి.**

**తె.అ.** సాంఖ్యానికి, యోగానికి ఫలం వేరుగా విరుద్ధంగా ఉంటుందనేవారు మూర్ఖులు, పండితులు కారు. పండితులు అంటే జ్ఞానులు. రెంటికీ ఫలమొకటే, విరుద్ధ ఫలాలు కావు అంటారు. ఎట్లా? సాంఖ్యయోగాలలో ఒక్కదానిని చక్కగా అనుష్ఠించినా రెంటి ఫలము పొందుతాడు. రెంటికీ నిశ్శ్రేయసమే ఫలం. కనుక ఫలంలో విరోధం లేదు.

**భాష్యమ్ : 4.2 నను సంన్యాసకర్మయోగశబ్దేన ప్రస్తుత్య సాంఖ్యయోగయోః ఫలైకత్వం కథమ్ ఇహ అప్రకృతం బ్రవీతి? నైష దోషః – యద్యపి అర్జునేన సంన్యాసం కర్మయోగం చ కేవలమ్ అభిప్రేత్య ప్రశ్నః కృతః, భగవాన్ తు తదపరిత్యాగేనైవ, స్వాభిప్రేతం చ విశేషం సంయోజ్య శబ్దాన్తరవాచ్యతయా ప్రతివచనం దదౌ 'సాంఖ్యయోగా'వితి. తౌ ఏవ సంన్యాస కర్మయోగౌ జ్ఞానతదుపాయసమబుద్ధిత్వాది సంయుక్తౌ సాంఖ్యయోగ శబ్దవాచ్యౌ ఇతి భగవతః మతమ్. అతః న అప్రకృతప్రక్రియా.**

**తె.అ.** ఆక్షేపణ – సంన్యాస కర్మయోగాల గురించిన ప్రస్తుత సందర్భంలో అప్రస్తుతమైన 'సాంఖ్యయోగాలకు ఫలమొకటే' అనే మాట ఎట్లా అంటున్నాడు?

సమాధానం – ఇది దోషం కాదు. అర్జునుడు కేవలం సంన్యాస కర్మయోగాల గురించే అడిగినా భగవానుడు అతని అభిప్రాయాన్ని విడువకుండా తన విశేష అభిప్రాయం కూడా జోడించి సమాధానం చెప్పాడు. సాంఖ్యము యోగము అని వేరే మాటలు వాడుతూ జ్ఞానసహితమైన సంన్యాసమే సాంఖ్యము, జ్ఞానానికి ఉపాయమైన సమబుద్ధి మొదలైన వాటితో కూడిన కర్మయోగమే యోగము అని భగవానుని అభిప్రాయం. కనుక అసందర్భమేమీ లేదు.

**భాష్యమ్ : 5.0 ఏకస్యాపి సమ్యగనుష్ఠానాత్ కథమ్ ఉభయోః ఫలం విన్దతే ఇతి? ఉచ్యతే–**

**తె.అ.** ఒక్కదానిని సరిగా అనుష్ఠిస్తే రెంటి ఫలమెట్లా కలుగుతుంది? అంటే చెపుతున్నాడు.

**మూ. యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే ।**
**ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి ॥ 5**

**తె.అ.** సాంఖ్యులు పొందే స్థానాన్ని యోగులు కూడా పొందుతారు. సాంఖ్యము, యోగము ఒకటేనని తెలుసుకున్నవాడే తెలిసినవాడు.

**భాష్యమ్ : 5.1 యదితి – యత్ సాంఖ్యైః జ్ఞాననిష్ఠైః సంన్యాసిభిః, ప్రాప్యతే, స్థానం మోక్షాఖ్యం తత్, యోగైః, అపి, జ్ఞానప్రాప్త్యుపాయత్వేన ఈశ్వరే సమర్ప్య కర్మాణి ఆత్మనః ఫలమ్ అనభిసంధాయ అనుతిష్ఠన్తి యే తే యోగాః – యోగినః, తైః అపి పరమార్థజ్ఞానసంన్యాసప్రాప్తిద్వారేణ గమ్యతే ఇత్యభిప్రాయః. అతః ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి ఫలైకత్వాత్ సః పశ్యతి సమ్యక్ పశ్యతీత్యర్థః.**

**తె.అ.** సాంఖ్యులు, అంటే జ్ఞాననిష్ఠులైన సంన్యాసులు, ఏ స్థానం పొందుతారో ఆ మోక్షమనే స్థానాన్ని యోగులు కూడా పొందుతారు. తమకై ఫలాన్ని కోరక కర్మలను ఈశ్వరార్పితంగా చేయడమే యోగం. ఈ కర్మయోగం జ్ఞానప్రాప్తికి ఉపాయం. కర్మయోగులు కూడా జ్ఞానప్రాప్తి ద్వారా మోక్షం పొందుతారు అని అభిప్రాయం. రెంటికీ ఫలమొకటే కనుక సాంఖ్యము యోగము ఒకటిగా చూచేవాడు సమ్యగ్దర్శనుడు.

**భాష్యమ్ : 6.0 ఏవం తర్హి యోగాత్ సంన్యాస ఏవ విశిష్యతే, కథం తర్హి ఇదమ్ ఉక్తం "తయోస్తు కర్మ సంన్యాసాత్ కర్మయోగో విశిష్యతే" (5.2) ఇతి? శృణు తత్ర కారణమ్ – త్వయా పృష్టం కేవలం కర్మసంన్యాసం కర్మయోగం చ అభిప్రేత్య తయోః అన్యతరః కః శ్రేయాన్ ఇతి. తదనురూపం ప్రతివచనం మయా ఉక్తం కర్మసంన్యాసాత్ కర్మయోగః విశిష్యతే ఇతి జ్ఞానమ్ అనపేక్ష్య జ్ఞానాపేక్షస్తు సంన్యాసః సాంఖ్యమ్ ఇతి మయా అభిప్రేతః పరమార్థయోగః చ స ఏవ. యస్తు కర్మయోగః వైదికః సః తాదర్థ్యాత్ యోగః – సంన్యాసః ఇతి చ ఉపచర్యతే. కథం తాదర్థ్యం ఇతి? ఉచ్యతే –**

**తె.అ.** ప్రశ్న – అంటే యోగం కంటె సంన్యాసమే శ్రేష్ఠమన్నమాట. మరి 'ఆ రెంటిలో కర్మసంన్యాసం కంటె కర్మయోగం మేలు' (2) అని ఎందుకన్నారు?

సమాధానం – దానికి కారణం విను. కేవలం కర్మసంన్యాసం కర్మయోగం గురించి ఆ రెంటిలో ఏది మేలు అని అడిగావు నీవు. దానికి తగినట్లు జ్ఞానరహిత కర్మసంన్యాసం కంటే కర్మయోగం మేలు అని నేను సమాధానం చెప్పాను. జ్ఞానసహిత సంన్యాసం సాంఖ్యమని నా అభిప్రాయం. అదే నిజమైన యోగం. వైదిక కర్మయోగం జ్ఞానసాధనం కనుక మాట వరసకు దాన్ని యోగమని

సంన్యాసమని అంటారు. ఆత్మతత్త్వం తెలియనివాడు ఆచరించే కర్మయోగం యోగం కాదు. కర్మసంన్యాసం సంన్యాసం కాదు. ఆ రెండూ కర్మ మాత్రమే. అది జ్ఞాన సాధనమెట్లా అవుతుంది? అంటే, చెపుతున్నాడు.

**మూ. సంన్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తుమయోగతః ।**
**యోగయుక్తో మునిర్బ్రహ్మ నచిరేణాధిగచ్ఛతి ॥ 6**

**తె.అ.** మహాబాహూ! కర్మయోగం లేకుండా సన్న్యాసం పొందటం కష్టం. యోగసాధనంతో ముని శీఘ్రమే బ్రహ్మమును పొందుతాడు.

**భాష్యమ్ : 6.1 సంన్యాస ఇతి – సంన్యాసః తు పారమార్థికః మహాబాహో, దుఃఖమ్ ఆప్తుమ్, అయోగతః యోగేన వినా. యోగయుక్తః వైదికేన కర్మయోగేన ఈశ్వరసమర్పితరూపేణ ఫలనిరపేక్షేణ యుక్తః, మునిః – మననాత్ ఈశ్వరస్వరూపస్య మునిః, బ్రహ్మ, పరమాత్మజ్ఞాననిష్ఠాలక్షణత్వాత్ ప్రకృతః సంన్యాసః బ్రహ్మ ఉచ్యతే. “న్యాస ఇతి బ్రహ్మ, బ్రహ్మ హి పరః” (మహా.నా.ఉ. 21.2) ఇతి శ్రుతేః. బ్రహ్మ పరమార్థసంన్యాసం జ్ఞాననిష్ఠాలక్షణం, నచిరేణ క్షిప్రమేవ అధిగచ్ఛతి ప్రాప్నోతి, అతః మయా ఉక్తం ‘కర్మయోగః విశిష్యతే’ (5.2) ఇతి.**

**తె.అ.** అర్జునా! యోగసాధన లేకుండా నిజమైన సన్న్యాసం పొందడం కష్టం. ఫలం కోరకుండా ఈశ్వరార్పణంగా వైదిక కర్మ చేస్తే, ఈశ్వర స్వరూపాన్ని మననం చేసుకుంటూ ఉండే ముని, యోగి బ్రహ్మమును త్వరగా చేరుకుంటాడు. ఈ సందర్భంలో బ్రహ్మము అంటే సంన్యాసమని అర్థం, పరమాత్మ నిష్ఠా లక్షణం కలదవడం చేత, ‘సంన్యాసమంటే బ్రహ్మమే, బ్రహ్మమే పరము’ (మహా.నా.ఉ. 21.2) అని శ్రుతి. పరమార్థజ్ఞానంలో నిలిచి ఉండడమే నిజమైన సన్న్యాసం. కనుకనే నేను ‘కర్మయోగం మేలు’ (5.2) అని చెప్పాను.

**భాష్యమ్ : 7.0 యదా పునః అయం సమ్యగ్దర్శన ప్రాప్త్యుపాయత్వేన –**

**తె.అ.** సమ్యక్ జ్ఞానం కలగడం కొరకు కర్మయోగం అనుసరిస్తే –

**మూ. యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేన్ద్రియః ।**
**సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి న లిప్యతే ॥ 7**

**తె.అ.** యోగయుక్తుడవడం చేత (కర్మయోగం అభ్యసించి) అతని ఆత్మ విశుద్ధమవుతుంది. దేహము ఇంద్రియాలు వశమవుతాయి. సమస్త భూతముల ఆత్మ తానే అవుతాడు. అటువంటివాడు కర్మలాచరించినా అవి అతన్ని బంధించవు.

**భాష్యమ్ : 7.1 యోగయుక్త ఇతి. యోగేన యుక్తః యోగయుక్తః విశుద్ధాత్మా విశుద్ధసత్త్వః, విజితాత్మా విజితదేహః, జితేన్ద్రియశ్చ, సర్వ భూతాత్మభూతాత్మా సర్వేషాం బ్రహ్మాదీనాం స్తమ్బపర్యన్తానాం భూతానామ్ ఆత్మభూతః ఆత్మా ప్రత్యక్చేతనః యస్య సః సర్వభూతాత్మభూతాత్మా, సమ్యగ్దర్శీ ఇత్యర్థః. సః తత్రైవం వర్తమానః లోకసంగ్రహాయ కర్మ కుర్వన్నపి, న లిప్యతే న కర్మభిః బధ్యతే ఇత్యర్థః.**

**తె.అ.** యోగం అనుష్ఠించేవాని అంతఃకరణం విశుద్ధమవుతుంది. దేహము ఇంద్రియాలు వశమవుతాయి. బ్రహ్మ మొదలు గడ్డి పరక వరకు సమస్త భూతములలో తననే చూస్తాడు. అంటే సమ్యగ్దర్శి అవుతాడు. అటువంటి వాడు లోక సంగ్రహం కొరకు కర్మ చేస్తూ కూడా చిక్కుపడడు. కర్మలతన్ని బంధించవు అని అర్థం.

**భాష్యమ్ : 8.0. న చ అసౌ పరమార్థతః కరోతి ఇత్యతః.**

**తె.అ.** అతడు నిజంగా కర్మలు చేయడం లేదు కనుక –

**మూ. నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్ । 8**
**పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్ ॥**

**మూ. ప్రలపన్ విసృజన్ గృహ్ణన్నున్మిషన్నిమిషన్నపి ।**
**ఇన్ద్రియాణీన్ద్రియార్థేషు వర్తన్త ఇతి ధారయన్ ॥ 9**

**తె.అ.** ఆత్మతత్త్వం తెలిసిన యోగి చూస్తూ, వింటూ, తాకుతూ, వాసన చూస్తూ, తింటూ, నడుస్తూ, నిద్రిస్తూ, గాలి పీలుస్తూ, మాట్లాడుతూ, విసర్జనం చేస్తూ, గ్రహిస్తూ, కళ్ళు తెరుస్తూ, మూస్తూ ఇన్ని పనులు చూస్తూ కూడా ఆయా ఇంద్రియాలు తమ తమ విషయాలవైపు ప్రవర్తిస్తున్నాయి అని గ్రహించి నేనేమీ చేయడం లేదు అని భావించాలి.

**భాష్యమ్ : 8.9.1 నైవఇతి. నైవ కించిత్క రోమీతి యుక్తః సమాహితః సన్, మన్యేత చిన్తయేత్, తత్త్వవిత్ ఆత్మనః యాథాత్మ్యం తత్త్వం వేత్తీతి తత్త్వవిత్, పరమార్థదర్శీ ఇత్యర్థః. కదా కథం వా తత్త్వమ్ అవధారయన్ మన్యేత ఇతి ఉచ్యతే పశ్యన్నితి. మన్యేతేతి పూర్వేణ సంబన్ధః. తస్య ఏవం తత్త్వవిదః సర్వకార్యకరణచేష్టాసు కర్మసు అకర్మైవ పశ్యతః సమ్యగ్దర్శినః తస్య సర్వకర్మసంన్యాసే ఏవ అధికారః, కర్మణః అభావదర్శనాత్. న హి మృగతృష్ణికాయామ్ ఉదకబుద్ధ్యా పానాయ ప్రవృత్తః ఉదకాభావజ్ఞానేఽపి తత్రైవ పానప్రయోజనాయ ప్రవర్తతే.**

**తె.అ.** ఆత్మతత్త్వం యథార్థంగా తెలిసినవాడు తత్త్వవేత్త, పరమార్థాన్ని దర్శించిన వాడు అని అర్థం. అటువంటి యోగి నేనేమీ చేయడం లేదు అని అనుకోవాలి. ఎప్పుడు ఎట్లా తత్త్వం

తెలుసుకొని ఆ విధంగా అనుకోవాలంటే చెపుతున్నాడు చూస్తూ వింటూ ఇక ఏం చేస్తున్నా కూడా ఆవిధంగా అనుకోవలె అని.

ఈ విధంగా తత్త్వం తెలిసినవాడు అన్ని కార్యకరణ చేష్టలయందు అకర్మనే చూస్తాడు. అటువంటి సమ్యగ్దర్శికి సంన్యాసమందే అధికారం. కర్మలు లేవని చూస్తున్నాడు కనుక. ఎండమావిలో నీరు త్రాగే ప్రయత్నం చేసేవాడు అందులో నీరు లేదు అని తెలిసిన తరువాత ఆ ప్రయత్నం చెయ్యడు కదా!

**భాష్యమ్ : 10.0. యస్తు పునః అతత్త్వవిత్ ప్రవృత్తః చ కర్మయోగే –**

**తె.అ.** కాని కర్మయోగం ఆచరించే అజ్ఞాని విషయం –

**మూ. బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః ।**
**లిప్యతే న స పాపేన పద్మపత్రమివామ్భసా ॥ 10**

**తె.అ.** ఫలాపేక్ష లేకుండా ఈశ్వరార్పణంగా కర్మలను ఆచరించేవానిని పాపమంటుకోదు, తామరాకును నీరు అంటలేనట్లు.

**భాష్యమ్ : 10.1. బ్రహ్మణి ఇతి. బ్రహ్మణి ఈశ్వరే, ఆధాయ నిక్షిప్య, 'తదర్థం కర్మ కరోమి' ఇతి భృత్యః ఇవ స్వామ్యర్థమ్, సర్వాణి కర్మాణి, మోక్షేఽపి ఫలే సంగం త్యక్త్వా, కరోతి యః సర్వాణి కర్మాణి, లిప్యతే న సః పాపేన సంబధ్యతే, పద్మపత్రమ్ ఇవ, అమ్భసా ఉదకేన. కేవలం సత్త్వశుద్ధిమాత్రమ్ ఏవ ఫలం తస్య తత్కర్మణః స్యాత్.**

**తె.అ.** బ్రహ్మమందు అంటే ఈశ్వరునియందు కర్మలన్నింటిని అర్పించి, ఈశ్వరుని కొరకు కర్మ చేస్తున్నాను అని – స్వామికార్యం సేవకుడు చేసినట్లు – ఫలం, మోక్షఫలం కూడా, కోరకుండా కర్మలను చేసేవాణ్ణి పాపం అంటుకోదు – తామరాకును నీరు అంటుకోనట్లు. సత్త్వశుద్ధి మాత్రమే ఆ కర్మలకు ఫలం.

**మూ. కాయేన మనసా బుద్ధ్యా కేవలైరిన్ద్రియైరపి ।**
**యోగినః కర్మ కుర్వన్తి సంగం త్యక్త్వాఽఽత్మశుద్ధయే ॥ 11**

**తె.అ.** ఫలాపేక్షతో కాక ఆత్మశుద్ధికొరకు యోగులు కేవలం శరీరంతో, మనసుతో, బుద్ధితో, ఇంద్రియాలతో కర్మలాచరిస్తారు.

**భాష్యమ్ : 11.1. కాయేన ఇతి. కాయేన దేహేన, మనసా బుద్ధ్యా చ కేవలైః ఇంద్రియైః అపి మమత్వవర్జితైః, "ఈశ్వరాయైవ కర్మ కరోమి న మమ ఫలాయ" ఇతి మమత్వబుద్ధిశూన్యైః**

**ఇన్ద్రియైః అపి కేవలశబ్దః కాయాదిభిః అపి ప్రత్యేకం సంబధ్యతే సర్వవ్యాపారేషు మమతావర్జనాయ యోగినః కర్మిణః, కర్మ కుర్వన్తి, సంగం త్యక్త్వా ఫల విషయే, ఆత్మశుద్ధయే, సత్త్వశుద్ధయే ఇత్యర్థః, తస్మాత్ తత్రైవ తవ అధికారః ఇతి కురు కర్మైవ.**

**తె.అ.** దేహంతో, మనసుతో, బుద్ధితో కేవలం ఇంద్రియాలతో కూడా మమత్వ బుద్ధి లేకుండా అంటే ఈశ్వరుని కొరకు కర్మ చేస్తున్నాను, నా ప్రయోజనం కొరకు కాదు అనుకొని కర్మయోగులు కర్మలాచరిస్తారు. 'కేవల' శబ్దం కేవలం ఇంద్రియాలకే కాదు, దేహాదులకు కూడా ప్రతి ఒక్కదానికి సంబంధిస్తుంది. మమకారం అన్ని వ్యాపారాలలోను విడువదగినదే. కర్మయోగులు ఫల విషయంలో రాగరహితులై అంతఃకరణ శుద్ధి కొరకు కర్మ చేస్తారు అని అర్థం. కనుక నీకు కర్మ యందే అధికారం, కర్మనే చేయి అని.

**మూ. యుక్తః కర్మఫలం త్యక్త్వా శాన్తిమాప్నోతి నైష్ఠికీమ్ ।**
**అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే ॥ 12**

**తె.అ.** ఈశ్వరునిపై మనస్సు నిలిపి ఫలం కోరకుండా కర్మలు చేసే యోగి ఆ నిష్ఠ వల్ల శాంతిని పొందుతాడు. ఫలమందు ఆసక్తిగల అయోగి కామప్రేరణ చేత బద్ధుడవుతాడు.

**భాష్యమ్ : 12.1. యుక్త ఇతి. 'యుక్తః ఈశ్వరాయ కర్మాణి కరోమి న మమ ఫలాయ', ఇత్యేవం సమాహితః, సన్ కర్మఫలం, త్యక్త్వా పరిత్యజ్య, శాన్తిం మోక్షాఖ్యామ్, ఆప్నోతి, నైష్ఠికీం నిష్ఠాయాం భవాం, సత్త్వశుద్ధి జ్ఞానప్రాప్తి సర్వకర్మ సంన్యాస జ్ఞాననిష్ఠాక్రమేణ ఇతి వాక్యశేషః యః తు పునః, అయుక్తః అసమాహితః, కామకారేణ - కరణం కారః, కామస్య కారః, కామకారః, తేన కామకారేణ కామప్రేరితతయా ఇత్యర్థః, 'మమ ఫలాయ ఇదం కరోమి కర్మ' ఇత్యేవం ఫలే సక్తః నిబధ్యతే. అతః త్వం యుక్తః భవ ఇత్యర్థః.**

**తె.అ.** యోగి, 'ఈశ్వరుని కొరకు కర్మ చేస్తున్నాను నా ఫలం కొరకు కాదు' అనే సమాహిత చిత్తంతో కర్మఫలం వదలి మోక్షమనే శాంతిని పొందుతాడు. కర్మనిష్ఠవల్ల క్రమంగా సత్త్వశుద్ధి జ్ఞానప్రాప్తి, సర్వకర్మసన్న్యాసము, జ్ఞాననిష్ఠ కలుగుతాయి అని వాక్యం పూర్తి చేసుకోవాలి. మరి అయుక్తుడు, అయోగి, కామప్రేరితుడు నా ప్రయోజనం కొరకు ఈ కర్మ చేస్తున్నాను అని ఫలమందు ఆసక్తితో బద్ధుడవుతున్నాడు. కనుక నీవు యోగివి అగుము అని అర్థం.

**భాష్యమ్ : 13.0. యస్తు పరమార్థదర్శీ సః -**

**తె.అ.** మరి పరమార్థదర్శి అయినవాడు -

**మూ. సర్వకర్మాణి మనసా సంన్యస్యాస్తే సుఖం వశీ ।**
**నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్నకారయన్ ॥ 13**

**తె.అ.** మనసా కర్మలన్నిటిని సన్న్యసించి స్వవశుడై, నవద్వారపురమైన శరీరంలో ఏమీ చేయకుండా చేయించకుండా దేహి సుఖంగా ఉంటాడు.

**భాష్యమ్ : 13.1. సర్వకర్మాణి ఇతి. సర్వాణి కర్మాణి సర్వకర్మాణి, సంన్యస్య పరిత్యజ్య, నిత్యం నైమిత్తికం కామ్యం ప్రతిషిద్ధం చ తాని సర్వాణి కర్మాణి సర్వకర్మాణి, మనసా వివేకబుద్ధ్యా కర్మాదౌ అకర్మదర్శనేన సంత్యజ్య ఇత్యర్థః, ఆస్తే తిష్ఠతి సుఖం. త్యక్త వాఙ్మనఃకాయచేష్టః నిరాయాసః ప్రసన్నచిత్తః ఆత్మనః అన్యత్ర నివృత్త సర్వబాహ్య ప్రయోజనః ఇతి 'సుఖమ్ ఆస్తే' ఇత్యుచ్యతే. వశీ జితేన్ద్రియః ఇత్యర్థః. క్వ కథమ్ ఆస్తే ఇత్యాహ – నవద్వారే పురే, సప్తశీర్షణ్యాని, ఆత్మనః ఉపలబ్ధిద్వారాణి, అర్వాక్ ద్వే మూత్ర పురీషవిసర్గార్థే, తైః ద్వారైః నవద్వారం పురమ్, ఉచ్యతే, శరీరమ్, పురమివ పురం ఆత్మైకస్వామికం, తదర్థప్రయోజనైః చ ఇన్ద్రియమనోబుద్ధివిషయైః అనేకఫలవిజ్ఞానస్య ఉత్పాదకైః పౌరైః ఇవ అధిష్ఠితం, తస్మిన్ నవద్వారే పురే దేహీ సర్వం కర్మ సంన్యస్య ఆస్తే.**

**తె.అ.** అన్ని కర్మలను, నిత్య నైమిత్తిక కామ్య ప్రతిషిద్ధ కర్మలన్నిటిని, మనసా, అంటే కర్మయందు అకర్మను చూడగల వివేకబుద్ధితో, త్యజించి సుఖంగా కూర్చుని ఉంటాడు. వాక్కు మనసు దేహము చేసే పనులన్ని మానివేసి ఆయాసపడకుండా ప్రసన్నచిత్తంతో ఆత్మయందు తప్ప అన్యత్ర దేనియందు స్వప్రయోజనం లేనివాణ్ణి సుఖంగా కూర్చొని ఉన్నాడు అంటాం. వశి అంటే ఇంద్రియాలను జయించినవాడు అని అర్థం. ఎక్కడ ఎట్లా కూర్చుని ఉంటాడు అంటే చెపుతున్నాడు – నవద్వారపురంలో. బాహ్యజ్ఞానం ప్రవేశించడానికి తలలో ఉన్న ఏడుద్వారాలు మలమూత్ర విసర్జన కొరకు క్రిందివి రెండు – ఈ తొమ్మిది ద్వారాలు కలిగిన దేహాన్ని నవద్వారపురం అంటున్నాడు. ఈ పురానికి ప్రభువు ఆత్మే. ఇంద్రియ మనోబుద్ధులు వాటికి విషయాలు, వాటివల్ల కలిగే జ్ఞానం, ఆ జ్ఞానానికి పరిణామాలు – ఇవన్నీ ఆ ప్రభువును సేవించే పౌరులు. ఆ నవద్వారపురంలో దేహి సర్వకర్మలను సన్న్యసించి కూర్చుని ఉంటాడు.

**భాష్యమ్ : 13.2 కిం విశేషణేన? సర్వో హి దేహీ సంన్యాసీ అసంన్యాసీ వా దేహే ఏవ ఆస్తే. తత్ర అనర్థకం విశేషణమ్ ఇతి ఉచ్యతే. యః తు అజ్ఞః దేహీ దేహేన్ద్రియ సంఘాతమాత్రాత్మదర్శీ సః సర్వః అపి 'గేహే భూమౌ ఆసనే వా ఆసే' ఇతి మన్యతే – న హి దేహమాత్రాత్మదర్శినః గేహే ఇవ దేహే ఆసే ఇతి ప్రత్యయః సంభవతి, దేహాది సంఘాతవ్యతిరిక్తాత్మాత్మదర్శినః తు 'దేహే ఆసే' ఇతి ప్రత్యయః ఉపపద్యతే. పరకర్మణాం చ పరస్మిన్ ఆత్మని అవిద్యయా అధ్యారోపితానాం, విద్యయా వివేకజ్ఞానేన మనసా సంన్యాసః ఉపపద్యతే. ఉత్పన్నవివేకవిజ్ఞానస్య సర్వకర్మసంన్యాసినః అపి గేహే ఇవ దేహే ఏవ నవద్వారే పురే ఆసనం,**

**ప్రారబ్ధఫలకర్మసంస్కారశేషానువృత్త్యా దేహే ఏవ విశేష-జ్ఞానోత్పత్తేః. దేహే ఏవ ఆస్తే ఇతి అస్త్యేవ విశేషణఫలం. విద్వదవిద్వత్ప్రత్యయభేదాపేక్షత్వాత్.**

**తె.అ.** ఆక్షేపణ – జీవులందరూ సంన్యాసులైనా, అసంన్యాసులైనా దేహంలోనే కదా ఉంటారు? ఇక్కడ ప్రత్యేకించి చెప్పడంలో అర్థమేమిటి?

సమాధానం – దేహేంద్రియాల కలయికనే దేహం అనుకునే అజ్ఞాని అయిన దేహి 'నేను ఇంట్లో భూమిమీద కూర్చున్నాను లేక ఆసనం మీద కూర్చున్నాను' అనే అనుకుంటాడు. దేహమే ఆత్మ అనుకునేవాడు ఇంట్లో కూర్చున్నట్లే దేహంలోనూ కూర్చున్నాను అనుకోలేడు. 'గృహంలో దేహం కూర్చున్నట్లే దేహంలో నేను (ఆత్మ) కూర్చున్నాను; దేహం గృహం కాదు, నేను దేహం కాదు' అని అనుకోడు. మరి ఆత్మ దేహాదుల కంటే వేరయినది అని తెలిసినవాడు 'దేహంలో ఉంటున్నాను' అనుకోగలడు. ఒకడు చేసే పనిని మరొకడికి, ఆత్మకు, అంటగడుతుంది అవిద్య. విద్యచేత, వివేకజ్ఞానం చేత, ఆ చేయని పనిని మనసా సన్న్యసించవలెను. (తాను చేయని పనిని తాను చేయడం లేదని తెలుసుకోవడమే సంన్యాసం, చేస్తున్న పని మానడం కాదు.) జ్ఞానోదయమై అన్ని కర్మలను సన్న్యసించినవాడు కూడా ప్రారబ్ధఫలకర్మసంస్కారం మిగిలిపోయి దేహంలోనే ఉంటాడు, గృహంలో ఉన్నట్లు. అయితే అతనికి నేను దేహంలో ఉంటున్నాను అన్న విశేషజ్ఞానం కలిగింది. కనుక దేహంలో ఉంటున్నాడు అని విశేషించి చెప్పడం అందుకు. విద్వాంసుడికి, అవిద్వాంసుడికి భావంలో ఉన్న తేడా చెప్పడం.

**భాష్యమ్ : 13.3. యద్యపి కార్యకరణ కర్మాణి అవిద్యయా ఆత్మని అధ్యారోపితాని 'సంన్యస్య ఆస్తే' ఇతి ఉక్తం, తథాపి కృతసంన్యాసస్య ఆత్మసమవాయి తు కర్తృత్వం కారయితృత్వం చ స్యాత్ ఇతి ఆశంక్య ఆహ – నైవ కుర్వన్ స్వయం, న కార్య కరణాని కారయన్ క్రియాసు ప్రవర్తయన్. కిం యత్ తత్ కర్తృత్వం కారయితృత్వం చ దేహినః స్వాత్మసమవాయి సత్ సంన్యాసాత్ న భవతి, యథా గచ్ఛతః గతిః (గమనవ్యాపారపరిత్యాగే న స్యాత్ తద్వత్), కిం వా స్వతః ఏవ ఆత్మనః నాస్తి ఇతి? అత్ర ఉచ్యతే – నాస్తి ఆత్మనః స్వతః కర్తృత్వం కారయితృత్వం చ. ఉక్తం హి "అవికార్యోఽయముచ్యతే" (2.25) "శరీరస్థోఽపి కౌన్తేయ న కరోతి న లిప్యతే" (13.31) ఇతి, "ధ్యాయతీవ లేలాయతీవ" (బృ.ఉ.4.3.7) ఇతి చ శ్రుతేః. కించ**

**తె.అ.** అవిద్యచేత ఆత్మయందు ఆరోపించిన దేహేంద్రియ కర్మలను 'సంన్యసించి కూర్చుంటాడు' అని చెప్పినప్పటికీ, సంన్యసించిన వానికి కూడా తాను చేస్తున్నాను, చేయిస్తున్నాను అనే భావం స్వతస్సిద్ధంగా ఉండవచ్చుననే సందేహం కలుగకుండా 'స్వయంగా చేయక, చేయించక, అంటే దేహేంద్రియాలను క్రియలయందు ప్రవర్తింపచేయక', అన్నాడు. అయితే చేస్తున్నాను చేయిస్తున్నాను

అన్న భావం స్వతస్సిద్ధంగా తనకుండి తరువాత సంన్యాసం వల్ల తొలగిపోతుందా? కదలిపోతున్నవాని కదలిక వలె? (అంతకుముందు నడుస్తూ ఉండినవాడు ఆగిపోతే నడకలేనట్లు). లేక స్వతహాగా ఆత్మకు చేయడం, చేయించడము అనేది లేదా? అని. ఈ విషయంగా చెపుతున్నాడు – ఆత్మకు చేయడము, చేయించడము కూడా లేవు అని. 'అవికార్యోఽ యముచ్యతే' (2.25), 'శరీరస్థోఽ పి కౌన్తేయ న కరోతి న లిప్యతే' (13.31), 'ధ్యాయతీవ లేలాయతీవ' (బృ.ఉ.4.3.7) ('ధ్యానిస్తూ ఉన్నట్లు, కదులుతున్నట్లు') అని శ్రుతులున్నాయి. అంతేకాదు –

**మూ. న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః ।**
**న కర్మఫల సంయోగం స్వభావస్తు ప్రవర్తతే ॥ 14**

**తె.అ.** లోకానికి కర్తృత్వం గాని, కర్మలుగాని ఆత్మ కలిగించడం లేదు, కర్మఫలంతో సంయోగమూ కల్పించడం లేదు. స్వభావమే ప్రవర్తిస్తున్నది.

**భాష్యమ్ : 14.1. న కర్తృత్వమితి – న కర్తృత్వం, స్వతః కురు ఇతి, నాపి కర్మాణి రథఘట ప్రాసాదాదీప్సితతమాని, లోకస్య, సృజతి ఉత్పాదయతి, ప్రభుః ఆత్మా. నాపి రథాది కృతవతః తత్ఫలేన సంయోగం కర్మఫల సంయోగమ్ ఉత్పాదయతి. యది కించిదపి స్వతః న కరోతి న కారయతి చ దేహీ, కః తర్హి కుర్వన్ కారయన్ చ ప్రవర్తతే ఇతి? ఉచ్యతే, స్వభావస్తు, స్వః భావః స్వభావః అవిద్యాలక్షణా ప్రకృతిః మాయా ప్రవర్తతే, "దైవీ హ్యేషా గుణమయీ" (7.14) ఇత్యాదినా వక్ష్యమాణా, పరమార్థతస్తు –**

**తె.అ.** ప్రభువు అంటే ఆత్మ. ఆత్మ 'ఇది చేయి' అని లోకానికి కర్తృత్వం కలిగించడం లేదు. (ప్రభువు సేవకుల చేత పనులు చేయించుకున్నట్లు ఆత్మ ప్రభువు మనచేత పనులు చేయించడం లేదు.) రథఘట ప్రాసాదాది వస్తువులు కూడా, అందరూ కోరుకునేవి, ఆత్మ ఉత్పత్తి చేయడం లేదు. రథాదులను చేసేవారికీ వారు చేసే కర్మల ఫలానికీ అంటే వారు చేసే వస్తువులకూ సంయోగం కూడా ఆత్మ సృష్టించడం లేదు. దేహి ఏమి స్వయంగా చేయక చేయించకపోతే మరి ఎవరు చేస్తున్నారు? చేయిస్తున్నారు? అంటే, చెపుతున్నాడు – స్వభావము, అంటే 'దైవీ హ్యేషా గుణమయీ' (7.14) అని చెప్పబోతున్న అవిద్యాలక్షణమైన ప్రకృతి, మాయ ప్రవర్తిస్తున్నది. నిజానికి –

**మూ. నాదత్తే కస్యచిత్పాపం న చైవ సుకృతం విభుః ।**
**అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః ॥ 15**

**తె.అ.** ఆత్మకు ఎవ్వని పాపము పుణ్యము చెందదు. అజ్ఞానం చేత జ్ఞానం కప్పబడి ఉంటుంది. అందుచేత ప్రాణులు మోహం చెందుతున్నారు.

**భాష్యమ్ : 15.1.** **నాదత్తే ఇతి. నాదత్తే న చ గృహ్ణాతి భక్తస్యాపి కస్యచిత్ పాపం, న చ ఏవ ఆదత్తే సుకృతం భక్తైః ప్రయుక్తం విభుః, కిమర్థం తర్హి భక్తైః పూజాదిలక్షణం యాగదానహోమాదికం చ సుకృతం ప్రయుజ్యతే ఇతి? ఆహ - అజ్ఞానేన, ఆవృతం జ్ఞానం వివేకవిజ్ఞానం, తేన ముహ్యన్తి 'కరోమి, కారయామి, భోక్ష్యే, భోజయామి' ఇత్యేవం మోహం గచ్ఛన్తి అవివేకినః సంసారిణః జన్తవః**

**తె.అ.** (వెనుకటి శ్లోకంలోని 'ప్రభు' శబ్దానికి వలె ఇక్కడి 'విభు' శబ్దానికి కూడా 'ఆత్మ') అని అర్థం చెప్పుకోవచ్చు.) ఆత్మ ఎవ్వని పాపము, భక్తునిదైనా సరే, గ్రహించదు. భక్తులు అర్పించే పుణ్యం కూడా గ్రహించదు. అయితే భక్తులు పూజలు, యాగము, దానము, హోమము మొదలైన పుణ్యకర్మలు ఎందుకు చేస్తారు? అంటే, చెపుతున్నాడు - అజ్ఞానం చేత వివేక విజ్ఞానం ఆవరింపబడి దానిచేత నేను చేస్తున్నాను, చేయిస్తున్నాను, తింటున్నాను, తినిపిస్తున్నాను అని ఈ విధమైన మోహం చెందుతున్నారు సంసారులైన అవివేకులు.

**మూ. జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః ।**
**తేషామాదిత్యవద్ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్ ॥ 16**

**తె.అ.** ఎవరి ఆ అజ్ఞానం ఆత్మజ్ఞానం చేత నాశనం చేయబడుతుందో వారి జ్ఞానం సూర్యునివలె పరతత్త్వాన్ని ప్రకాశింపచేస్తుంది.

**భాష్యమ్ : 16.1.** **జ్ఞానేనేతి - జ్ఞానేన తు, యేన అజ్ఞానేన ఆవృతాః ముహ్యన్తి జన్తవః తత్ అజ్ఞానం యేషాం జన్తూనాం వివేకజ్ఞానేన ఆత్మవిషయేణ, నాశితమ్ ఆత్మనః భవతి, తేషాం జన్తూనామ్ ఆదిత్యవత్ యథా ఆదిత్యః సమస్తం వస్తుజాతమ్ అవభాసయతి, తద్వత్, జ్ఞానం జ్ఞేయం వస్తు సర్వం ప్రకాశయతి తత్ పరం పరమార్థతత్త్వమ్.**

**తె.అ.** ఏ అజ్ఞానం చేత ఆవరింపబడి ప్రాణులు మోహం చెందుతున్నారో ఆ అజ్ఞానం ఆత్మవిషయక వివేక జ్ఞానం చేత ఎవరికి నాశనమవుతుందో వారికి సూర్యుడు సమస్త వస్తువులను ప్రకాశింపజేసినట్లు జ్ఞానం జ్ఞేయవస్తువును అంటే పరమార్థతత్త్వాన్ని ప్రకాశింపజేస్తుంది.

**భాష్యమ్ : 17.0.** **యత్పరం పరమార్థతత్త్వం జ్ఞానప్రకాశితమ్ -**

**తె.అ.** జ్ఞానం చేత ప్రకాశింపజేయబడే ఆ పరమార్థతత్త్వం గురించే -

**మూ. తద్బుద్ధయస్తదాత్మానస్తన్నిష్ఠాస్తత్పరాయణాః ।**
**గచ్ఛన్త్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః ॥ 17**

**తె.అ.** దానియందే బుద్ధిని నిలిపి, దానినే ఆత్మగా తెలుసుకొని దానియందే నిష్ఠులై అదే పరమగమ్యమైన యతులు తమ పాపాలను జ్ఞానం చేత కడిగివేసుకని పునర్జన్మలేని స్థితిని చేరుకుంటారు.

**భాష్యమ్ : 17.1. తద్బుద్ధయ ఇతి. తస్మిన్ బ్రహ్మణి గతా బుద్ధిః యేషాం తే తద్బుద్ధయః, తదాత్మానః తదేవ పరం బ్రహ్మ ఆత్మా యేషాం తే తదాత్మానః, తన్నిష్ఠాః – నిష్ఠా అభినివేశః తాత్పర్యమ్ – సర్వాణి కర్మాణి సంన్యస్య తస్మిన్ బ్రహ్మణ్యేవ అవస్థానం యేషాం తే తన్నిష్ఠాః తత్పరాయణాః చ – తదేవ పరమ్ అయనం పరా గతిః యేషాం భవతి తే తత్పరాయణాః కేవలాత్మరతయః ఇత్యర్థః (యేషాం జ్ఞానేన నాశితమ్ ఆత్మనః అజ్ఞానం) తే గచ్ఛన్తి. ఏవంవిధాః అపునరావృత్తిమ్ అపునర్దేహసంబన్ధం, జ్ఞాననిర్ధూతకల్మషాః, యథోక్తేన జ్ఞానేన నిర్ధూతః నాశితః కల్మషః పాపాదిసంసారకారణదోషః యేషాం తే జ్ఞాననిర్ధూతకల్మషాః యతయః ఇత్యర్థః.**

**తె.అ.** దానియందు అంటే బ్రహ్మమందు బుద్ధిని నిలిపి; దానినే ఆ పరబ్రహ్మమునే తమ ఆత్మగా తెలిసికొని; నిష్ఠతో అంటే అభినివేశము తాత్పర్యము కలిగి, అంటే అన్ని కర్మలను సంన్యసించి బ్రహ్మమందే నిలిచియుండి; ఆ ఆత్మయే పరమ గమ్యమై ఆత్మయందే ఆనందమనుభవించేవారు యతులు. వారు జ్ఞానం చేత పాపాలు సంసార కారణమైన దోషాలు, కడిగివేసుకున్నవారు. వారు పునరావృత్తి లేని స్థితిని, దేహంతో తిరిగి తగులులేని స్థితిని, చేరుతారు.

**భాష్యమ్ : 18.0 యేషాం జ్ఞానేన నాశితమ్ ఆత్మనః అజ్ఞానం తే పణ్డితాః కథం తత్త్వం పశ్యన్తి ఇత్యుచ్యతే –**

**తె.అ.** తమ అజ్ఞానం జ్ఞానం చేత నాశనమైనపుడు పండితులు తత్త్వం ఎట్లా చూస్తారు?

**మూ. విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।**
**శుని చైవ శ్వపాకే చ పణ్డితాః సమదర్శినః ॥ 18**

**తె.అ.** విద్యావినయసంపన్నుడైన బ్రాహ్మణునిలో, ఆవులో, ఏనుగులో, కుక్కలో, కుక్కను వండుకొని తిను ఛండాలునిలో ఒకే తత్త్వాన్ని చూస్తారు పండితులు.

**భాష్యమ్ : 18.1. విద్యాఇతి. విద్యావినయసంపన్నే – విద్యా చ వినయశ్చ విద్యావినయౌ వినయః ఉపశమః తాభ్యాం విద్యావినయాభ్యాం సంపన్నః విద్యావినయసంపన్నః విద్వాన్ వినీతః చ యః బ్రాహ్మణః తస్మిన్ బ్రాహ్మణే గవి, హస్తిని, శుని చైవ శ్వపాకే చ పణ్డితాః సమదర్శినః – విద్యావినయసంపన్నే ఉత్తమ సంస్కారవతి బ్రాహ్మణే సాత్త్వికే, మధ్యమాయాం**

**చ రాజస్యాం గవి సంస్కారహీనాయామ్, అత్యన్తమేవ కేవలతామసే హస్త్యాదౌ చ సత్త్వాది గుణైః తజ్జైః చ సంస్కారైః తథా రాజసైః, తథా తామసైః చ సంస్కారైః అత్యన్తమేవ అసంస్పృష్టం సమమ్ ఏకమ్ అవిక్రియం తత్ బ్రహ్మ ద్రష్టుమ్ శీలం యేషాం తే పణ్డితాః సమదర్శినః.**

**తె.అ.** విద్య అంటే ఆత్మబోధ, వినయము అంటే ఉపశమము. విద్యావినయ సంపన్నుడు అంటే చదువు సంస్కారము ఉన్న సాత్త్వికుడైన ఉత్తమ బ్రాహ్మణుడు - అటువంటి బ్రాహ్మణునిలోనూ; అంత సంస్కారము లేని రాజస స్వభావం గల మధ్యమమైన ఆవులోను; కేవల తామసస్వభావం గల అధమమైన ఏనుగువంటి వాటిలోను కుక్కలోను, కుక్కను వండుకుని తిను ఛండాలునిలో ఒకే అవిక్రియ బ్రహ్మమును అంటే సత్త్వాదిగుణాలచేత వాటివల్ల కలిగే సంస్కారాల చేత, అట్లాగే రాజస తామస సంస్కారాల చేత ఎంతమాత్రము అంటరాని బ్రహ్మమును చూచే సమదర్శనులు పండితులు అని అర్థం.

**భాష్యమ్ : 19.0. నను అభోజ్యాన్నాః తే దోషవన్తః - "సమాసమాభ్యాం విషమసమే పూజాతః" (గౌ.ధ.సూ.17.20) ఇతి స్మృతేః, న తే దోషవన్తః, కథమ్?**

**తె.అ.** ఆక్షేపణ - అటువంటి దోషయుక్తులు ఇచ్చే అన్నం తినరాదు కదా? 'సమానులను అసమానులనుగాను, అసమానులను సమానులను గాను చూచువాని నుండి అన్నము గ్రహింపరాదు' (గౌ.ధ.17.20) అని శ్రుతి.

సమాధానం - వారు దోషయుక్తులు కారు. ఎట్లా?

**మూ. ఇహైవ తైర్జితః సర్గో యేషాం సామ్యే స్థితం మనః ।**
**నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః ॥ 19**

**తె.అ.** వారు ఈ జన్మలోనే జన్మను జయించినవారు. వారి మనసు సమభావంతో స్థిరంగా ఉంటుంది. అన్ని ప్రాణులయందు ఉండేది ఒకే బ్రహ్మము, దోషం లేనిది. కనుక వారు బ్రహ్మమందే నిలిచి ఉంటారు.

**భాష్యమ్ : 19.1 ఇహై వేతి. ఇహైవ జీవద్భిః ఏవ, తైః సమదర్శిభిః పణ్డితైః జితః, వశీకృతః, సర్గః జన్మ, యేషాం సామ్యే సర్వభూతేషు బ్రహ్మణి సమభావే, స్థితం నిశ్చలీభూతం, మనః అన్తఃకరణమ్. నిర్దోషమ్ - యద్యపి దోషవత్సు శ్వపాకాదిషు మూఢైః తద్దోషైః దోషవత్ ఇవ విభావ్యతే, తథాపి తద్దోషైః అసంస్పృష్టమ్ ఇతి నిర్దోషం దోషవర్జితం హి యస్మాత్, నాపి స్వగుణభేదభిన్నం, నిర్గుణత్వాత్ చైతన్యస్య. వక్ష్యతి చ భగవాన్ ఇచ్ఛాదీనాం క్షేత్రధర్మత్వమ్**

**(13.6), "అనాదిత్వాన్నిర్గుణత్వాత్" (13.31) ఇతి చ. నాపి అన్త్యవిశేషాః ఆత్మనో విభేదకాః సన్తి, ప్రతిశరీరం తేషాం సత్త్వే ప్రమాణానుపపత్తేః. అతః సమం బ్రహ్మ ఏకం చ. తస్మాత్ బ్రహ్మణి తే స్థితాః. తస్మాత్ న దోషగన్ధమాత్రమ్ అపి తాన్ స్పృశతి, దేహాది సంఘాతాత్మదర్శనాభిమానాభావాత్ తేషామ్.**

**తె.అ.** సమదర్శనులైన పండితులు జీవించి ఉండగనే జన్మను జయిస్తారు. (పునర్జన్మ కలగని స్థితిని పొందుతారు.) సర్వభూతములయందు ఒకటిగా ఉండే బ్రహ్మమందు సమభావంతో మనసును నిశ్చలం చేసుకొని ఉంటారు. కుక్కను తినునటువంటి మూఢులయందు కనిపించే దోషంచేత బ్రహ్మము దోషయుక్తంగా కనిపించినా ఆ దోషాలు బ్రహ్మమును అంటవు, బ్రహ్మము దోషరహితమైనది. స్వగుణభేదం చేత కూడా భిన్నం కానిది, చైతన్యానికి గుణాలే లేవు కనుక. కోరిక మొదలైన గుణాలు క్షేత్రానివేనని భగవానుడు ముందు చెప్పబోతున్నాడు కూడా, 'అనాదిత్వాన్నిర్గుణత్వాత్' (13.31) అని. ఆత్మలో భేదాలు కల్పించగల ఇతర విశేషాలేవీ లేవు, ప్రతి శరీరంలోని ఆత్మలో అటువంటివి ఉన్నట్లు నిరూపించలేము. కనుక బ్రహ్మము అంతటా ఒకటే, సమానము. కనుక వారు బ్రహ్మమందే నిలిచి ఉంటారు. అందుకనే వారిని దోషగంధం కూడా అంటదు, దేహాదుల కూడికే నేను అనే అభిమానం లేదు కనుక.

**భాష్యమ్ : 19.2. దేహాదిసంఘాతాత్మదర్శనాభిమానవద్విషయం తు తత్సూత్రం "సమాసమాభ్యాం విషమసమే పూజాతః" ఇతి, పూజావిషయత్వ విశేషణాత్. దృశ్యతే హి బ్రహ్మవిత్. షడఙ్గవిత్, చతుర్వేదవిత్ ఇతి పూజాదానాదౌ గుణవిశేషసంబన్ధః కారణమ్. బ్రహ్మ తు సర్వగుణదోష–సంబన్ధవర్జితమ్ ఇత్యతః "బ్రహ్మణి తే స్థితాః' ఇతి యుక్తమ్. కర్మవిషయం చ "సమాసమాభ్యామ్" ఇత్యాది. ఇదం తు సర్వకర్మసంన్యాసవిషయం ప్రస్తుతం, "సర్వకర్మాణి మనసా" ఇత్యారభ్య ఆ అధ్యాయపరిసమాప్తేః.**

**తె.అ.** 'సమానులను అసమానులనుగాను, అసమానులను సమానులనుగాను' అన్న ఆ సూత్రం దేహాదుల కలయికే ఆత్మ అనుకునే వారి విషయంలో చెప్పింది, విశేషించి పూజా విషయంలో. పూజా విషయంలో దానం స్వీకరించే విషయంలో గుణవిశేషం పాటిస్తాం. బ్రహ్మవేత్త షడంగవేత్త చతుర్వేదవేత్త అని. కాని బ్రహ్మమునకు ఏ గుణంతో దోషంతో సంబంధం లేదు. కనుక 'వారు బ్రహ్మమందే స్థిరంగా ఉంటారు' అని చెప్పాడు. 'సమానులను అసమానులనుగాను' అన్న సూత్రం కర్మ విషయంలో. 'అన్ని కర్మలను మనసా సన్న్యసించి' (5.13) నుండి అధ్యాయం చివరి వరకు ప్రస్తుత విషయం సర్వకర్మసంన్యాసం.

**భాష్యమ్ : 20.0. యస్మాత్ నిర్దోషం సమం బ్రహ్మ ఆత్మా తస్మాత్ –**

**తె.అ.** దోషం లేనిది సమమయినది అయిన బ్రహ్మమే ఆత్మ కనుక –

**మూ. న ప్రహృష్యేత్ ప్రియం ప్రాప్య నోద్విజేత్ప్రాప్య చాప్రియమ్ ।**
**స్థిరబుద్ధిరసంమూఢో బ్రహవిద్బ్రహ్మణి స్థితః ॥ 20**

**తె.అ.** ప్రియం ప్రాప్తించినపుడు హర్షం చెందరాదు. అప్రియం ప్రాప్తించినపుడు ఉద్వేగము చెందరాదు. బ్రహ్మవేత్త స్థిరబుద్ధి కలిగి మోహం చెందక బ్రహ్మమందే నిలిచి ఉంటాడు.

**భాష్యమ్ : 20.1 న ప్రహృష్యేత్ ఇతి. న ప్రహృష్యేత్ న ప్రహర్షం కుర్యాత్, ప్రియమ్ ఇష్టం, ప్రాప్య లబ్ధ్వా, న ఉద్విజేత్ ప్రాప్య ఏవ చ, అప్రియమ్ అనిష్టం లబ్ధ్వా, దేహమాత్రాత్మదర్శినాం హి ప్రియాప్రియప్రాప్తీ, హర్షవిషాదౌ, కుర్వాతే న కేవలాత్మదర్శినః తస్య ప్రియాప్రియప్రాప్త్యసంభవాత్. కించ 'సర్వభూతేషు ఏకః సమః నిర్దోషః ఆత్మా' ఇతి స్థిరా నిర్విచికిత్సా బుద్ధిః యస్య సః స్థిరబుద్ధిః అసంమూఢః సంమోహవర్జితః చ స్యాత్ యథోక్తబ్రహ్మవిత్ బ్రహ్మణి స్థితః అకర్మకృత్, సర్వకర్మసంన్యాసీ ఇత్యర్థః.**

**తె.అ.** ఇష్టమైన వస్తువు దొరికినపుడు సంతోషపడరాదు. ఇష్టంకాని వస్తువు ప్రాప్తించినపుడు బాధపడరాదు. దేహమే ఆత్మ అనుకునేవానికి మాత్రమే ప్రియము, అప్రియము ప్రాప్తిస్తాయి. హర్షవిషాదాలు కలుగుతాయి. కేవలం ఆత్మను చూచేవానికి ప్రియము అప్రియము ప్రాప్తించడం అసంభవం. అన్ని భూతములయందు సమంగా ఉండేది ఒకే ఆత్మ అనే స్థిరమై సంశయరహితమైన బుద్ధితో మోహం చెందక బ్రహ్మవేత్త బ్రహ్మమందే నిలిచి ఉంటాడు. అంటే అతడు సర్వకర్మ సన్న్యాసి అని అర్థం.

**భాష్యమ్ : 21.0. కించ బ్రహ్మణి స్థితః –**

**తె.అ.** బ్రహ్మమందు నిలిచి ఉండేవాడు ఇంకా ఎటువంటివాడు?

**మూ. బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విన్దత్యాత్మని యత్సుఖమ్ ।**
**స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే ॥ 21**

**తె.అ.** ఇంద్రియ విషయాలందు ఆసక్తి లేక బ్రహ్మసమాధియందు ఏకాగ్రమైన చిత్తం కలవాడు పొందే ఆత్మసుఖం అక్షయమైనది.

**భాష్యమ్ : 21.1 బాహ్య ఇతి బాహ్యస్పర్శేషు – బాహ్యాశ్చ తే స్పర్శాః చ బాహ్యస్పర్శాః. స్పృశ్యన్తే ఇతి స్పర్శాః శబ్దాదయః విషయాః, తేషు బాహ్యస్పర్శేషు అసక్తః ఆత్మా అన్తఃకరణం యస్య సః**

**అయమ్ అసక్తాత్మా విషయేషు ప్రీతివర్జితః సన్ విన్దతి లభతే ఆత్మని యత్ సుఖం తత్ విన్దతి ఇత్యేతత్. సః బ్రహ్మయోగయుక్తాత్మా బ్రహ్మణి యోగః, సమాధిః బ్రహ్మయోగః తేన బ్రహ్మయోగేన యుక్తః సమాహితః, తస్మిన్ వ్యాపృతః ఆత్మా, అన్తఃకరణం యస్య సః బ్రహ్మయోగయుక్తాత్మా సుఖమ్ అక్షయమ్ అశ్నుతే వ్యాప్నోతి. తస్మాత్ బాహ్యవిషయప్రీతేః క్షణికాయాః ఇన్ద్రియాణి నివర్తయేత్ ఆత్మని అక్షయసుఖార్థీ ఇత్యర్థః.**

**తె.అ.** ఇంద్రియాల ద్వారా తెలుసుకోగలిగిన విషయాలు బాహ్యస్పర్శలు. అంటే శబ్దాది విషయాలు. వాటియందు ఆసక్తి లేని అంతఃకరణం కలవాడు, బాహ్యవిషయాలయందు ప్రీతిని వదిలినవాడు, ఆత్మయందు సుఖం పొందుతాడు. బ్రహ్మయోగము అంటే బ్రహ్మసమాధి. ఆ బ్రహ్మసమాధి యందు ఏకాగ్రమైన చిత్తం కలవాడు అక్షయసుఖం పొందుతాడు. ఆత్మయందే అక్షయసుఖం కోరుకునేవాడు క్షణికమైన బాహ్యవిషయాలపై ప్రీతి నుండి ఇంద్రియాలను మళ్ళించుకోవలెనని అర్థం.

**భాష్యమ్ : 22.0. ఇతశ్చ నివర్తయేత్ –**

**తె.అ.** మరొకందుకు కూడా మళ్ళించుకోవాలి –

**మూ. యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే ।**
**ఆద్యన్తవన్తః కౌన్తేయ న తేషు రమతే బుధః ॥ 22**

**తె.అ.** ఇంద్రియ స్పర్శవల్ల కలిగే భోగాలు దుఃఖమే కలిగిస్తాయి. అవి అనిత్యం కూడా. కనుక వివేకం కలవాడు వాటియందు ప్రీతిని చూపడు.

**భాష్యమ్ : 22.1. యే హి ఇతి. యే, హి యస్మాత్, సంస్పర్శజాః విషయేన్ద్రియసంస్పర్శేభ్యః జాతాః భోగాః భుక్తయః దుఖయోనయః ఏవ తే, అవిద్యాకృతత్వాత్, దృశ్యన్తే హి ఆధ్యాత్మికాదీని దుఃఖాని తన్నిమిత్యాన్యేవ. యథా ఇహ లోకే తథా పరలోకేఽపి ఇతి గమ్యతే. ఏవశబ్దాత్. న సంసారే సుఖస్య గన్ధమాత్రమ్ అపి అస్తి ఇతి బుద్ధ్వా విషయమృగతృష్ణికాయాః ఇన్ద్రియాణి నివర్తయేత్. న కేవలం దుఃఖయోనయః ఆద్యన్తవన్తః చ, ఆదిః విషయేన్ద్రియ సంయోగః భోగానామ్, అన్తశ్చ తద్వియోగః ఏవ, అతః ఆద్యన్తవన్తః అనిత్యాః మధ్యక్షణభావిత్వాత్ ఇత్యర్థః. కౌన్తేయ, న తేషు భోగేషు రమతే బుధః, వివేకీ అవగతపరమార్థతత్త్వః అత్యన్తమూఢానామేవ హి విషయేషు రతిః దృశ్యతే యథా పశుప్రభృతీనామ్.**

**తె.అ.** ఇంద్రియాలు విషయాలయందు తగులుకొనడం వల్ల కలిగే భోగాలు, అవిద్యాకారణంగా కలిగేవి కనుక, దుఃఖమే కలిగించగలవు. ఆధ్యాత్మికాది దుఃఖాలు వాటివలననే కలుగుతుండడం

చూస్తున్నాం. 'ఏవ' శబ్దం చేత ఇహలోకంలో వలె పరలోకంలోనూ ఇవి దుఃఖకారణాలేనని అర్థమవుతుంది. సంసారంలో సుఖం యొక్క వాసనకు కూడా లేదని తెలుసుకొని విషయసుఖాలనే ఎండమావుల నుండి ఇంద్రియాలను మళ్ళించుకోవాలి. ఇవి కేవలం దుఃఖకారణాలే కాదు, అనిత్యమైనవి కూడా, వీటికి ఆద్యంతాలున్నాయి. విషయేంద్రియ సంయోగము ఆది అయితే విషయేంద్రియ వియోగభోగాలు అంతము. ఈ మొదలు తుదికి నడుమ క్షణకాలం కనిపించిపోయేవి అని అర్థం. అర్జునా, పరమార్థతత్త్వం తెలిసిన వివేకి ఆ భోగాలయందు రమించడు. అత్యంతమూఢులకు మాత్రమే పశువులు మొదలైన వాటికివలె, విషయసుఖాదుల యందు ప్రీతి ఉండడం చూస్తాం.

**భాష్యమ్ : 23.0 అయం చ శ్రేయోమార్గ ప్రతిపక్షీ కష్టతమః దోషః సర్వానర్థప్రాప్తిహేతుః దుర్నివారశ్చ ఇతి తత్పరిహారే యత్నాధిక్యం కర్తవ్యమ్ ఇత్యాహ భగవాన్–**

**తె.అ.** శ్రేయోమార్గానికి శత్రువైన ఈ దోషం అన్నిటికంటె ఎక్కువ దుఃఖకారణం. అన్ని అనర్థాలు కలగడానికి హేతువు, సులభంగా తొలగించరానిది అని, దాన్ని తొలగించడానికి ఎక్కువ యత్నం చేయవలెనని భగవానుడు అంటున్నాడు–

**మూ. శక్నోతీహైవ యః సోఢుం ప్రాక్ శరీరవిమోక్షణాత్ ।**
**కామక్రోధోద్భవం వేగం స యుక్తః స సుఖీ నరః ॥ 23**

**తె.అ.** కామక్రోధాల వల్ల కలిగే వేగాన్ని చనిపోయే చివరిక్షణం వరకు సహించగలిగినవాడు యోగి, అతడే సుఖి.

**భాష్యమ్ : 23.1 శక్నోతి ఇతి. శక్నోతి ఉత్సహతే, ఇహైవ జీవన్నేవ, యః సోఢుమ్ ప్రసహితుమ్. ప్రాక్ పూర్వమ్, శరీర విమోక్షణాత్, ఆ మరణాత్. మరణ సీమాకరణాత్ జీవతః అవశ్యంభావీ హి కామక్రోధోద్భవః వేగః, అనన్తనిమిత్తవాన్ హి సః ఇతి యావత్ మరణం తావత్ న విస్రమ్భణీయః ఇత్యర్థః. కామః – ఇన్ద్రియగోచరప్రాప్తే ఇష్టే విషయే శ్రూయమాణే స్మర్యమాణే వా అనుభూతే సుఖహేతౌ యా గర్ధిః తృష్ణా – సః కామః, క్రోధశ్చ – ఆత్మనః ప్రతికూలేషు దుఃఖహేతుషు దృశ్యమానేషు శ్రూయమాణేషు, స్మర్యమాణేషు వా యః ద్వేషః సః క్రోధః, తౌ కామక్రోధౌ ఉద్భవః యస్య వేగస్య సః కామక్రోధోద్భవః వేగః. రోమాఞ్చనప్రహృష్టనేత్రవదనాదిలిఙ్గః, అన్తఃకరణప్రక్షోభరూపః కామోద్భవః వేగః, గాత్రప్రకంపప్రస్వేదసందష్టోష్ఠపుటరక్త నేత్రాదిలిఙ్గః క్రోధోద్భవః వేగః, తం కామక్రోధోద్భవం వేగం యః ఉత్సహతే ప్రసహతే సోఢుం ప్రసహితుం సః యుక్తః యోగీ సుఖీ చ ఇహ లోకే నరః.**

**తె.అ.** కామక్రోధాలవల్ల కలిగే వేగాన్ని జీవించి ఉండగానే శరీరం విడిచే చివరిక్షణం వరకు సహించగలిగినవాడు యోగి, సుఖి. 'చనిపోయే చివరి క్షణం వరకు' అనడం అనేకవిధాలుగా కలిగే కామక్రోధోద్భవవేగం జీవించి ఉన్నంతకాలం తప్పక ఉంటుంది, చివరిక్షణం వరకు వాటిని నమ్మరాదు అని చెప్పడానికి. సుఖానుభవానికి హేతువైన ఇష్టవిషయం ఇంద్రియ గోచరమైనపుడు, ఆ విషయం విన్నప్పుడు గాని, స్మరించినప్పుడు గాని దానిపై లాలస, తృష్ణ కలుగుతుంది. అదే కామం. మనకు ప్రతికూలమై దుఃఖహేతువులైన విషయాలు చూసినపుడు, విన్నప్పుడు, స్మరించినప్పుడు కలిగే ద్వేషమే క్రోధం. ఆ కామక్రోధాలు కలిగించే వేగం – వెంట్రుకలు నిక్కబొడుచుకోవడం, ముఖంలో కళ్ళలో వికాసం మొదలైన గుర్తులవల్ల తెలిసే చిత్తక్షోభే కామం వల్ల కలిగే వేగం. శరీరం వణకడం, చెమటపోయడం, పెదవులు కొరకడం, కళ్ళు ఎఱ్ఱబడడం వంటివి క్రోధం వల్ల కలిగే వేగానికి గుర్తులు.

**భాష్యమ్ : 24.0 కథం భూతశ్చ బ్రహ్మణి స్థితః బ్రహ్మ ప్రాప్నోతి ఇత్యాహ భగవాన్ –**

**తె.అ.** బ్రహ్మమందు నిలిచిన ఎటువంటివాడు బ్రహ్మమును పొందుతాడు? అంటే, భగవంతుడు చెపుతున్నాడు –

**మూ. యోఽన్తః సుఖోఽన్తరారామస్తథాఽన్తర్జ్యోతిరేవ యః ।**
**స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి ॥ 24**

**తె.అ.** తన సుఖం తనలో, తన క్రీడ తనతో, తన వెలుగు తనలో కలిగిన యోగి బ్రహ్మమే అయి బ్రహ్మనిర్వాణం పొందుతాడు.

**భాష్యమ్ : 24.1 య ఇతి. యః అన్తః సుఖం అన్తః ఆత్మని సుఖం యస్య సః అన్తఃసుఖః, తథా అన్తః ఏవ ఆత్మని ఆరామః క్రీడా యస్య సః అన్తరారామః, తథా అన్తః ఆత్మైవ జ్యోతిః ప్రకాశః యస్య సః అన్తర్జ్యోతిః ఏవ, ఈదృశః సః యోగీ బ్రహ్మ నిర్వాణం బ్రహ్మనిర్వృతిం మోక్షమ్ ఇహ జీవన్నేవ, బ్రహ్మభూతః సన్, అధిగచ్ఛతి ప్రాప్నోతి. కించ**

**తె.అ.** ఎవనికి అంతరాత్మ యందే సుఖమో, ఎవడు అంతరాత్మయందే క్రీడిస్తాడో, ఎవనికి అంతరాత్మయే వెలుగో ఆ యోగి బ్రహ్మమే అయి బ్రహ్మమందు లీనమై మోక్షం పొందుతాడు. అంతేకాదు.

**మూ. లభన్తే బ్రహ్మనిర్వాణమృషయః క్షీణకల్మషాః ॥**
**ఛిన్నద్వైధా యతాత్మానః సర్వభూతహితే రతాః ॥ 25**

**రా.కృ.** కలుషాలను కడిగివేసుకున్న ఋషులు, సంశయాలు తొలగి ఇంద్రియాలను వశం చేసుకొని ఎవరినీ దేనినీ హింసించక మోక్షం పొందుతారు.

**భాష్యమ్ : 25.1 లభన్తే ఇతి.లభన్తే బ్రహ్మనిర్వాణం మోక్షమ్, ఋషయః సమ్యగ్దర్శినః సంన్యాసినః, క్షీణకల్మషాః క్షీణపాపాది దోషాః, ఛిన్నద్వైధాః ఛిన్న సంశయాః, యతాత్మానః సంయతేన్ద్రియాః సర్వభూతహితే రతాః సర్వేషాం భూతానాం హితే ఆనుకూల్యే రతాః అహింసకాః ఇత్యర్థః (కించ)–**

**తె.అ.** ఋషులు అంటే సమ్యగ్దర్శనం కలిగిన సంన్యాసులు, పాపము మొదలైన దోషాలను నశింపజేసుకొని, సంశయాలు ఛేదించి, ఇంద్రియాలను జయించి, సర్వభూతములయందు అనుకూలంగా చరిస్తూ అంటే అహింసకులై మోక్షం పొందుతారు. అంతేకాదు–

**మూ. కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్ ।**
**అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్ ॥ 26**

**తె.అ.** కామక్రోధాలు లేకుండా మనసును వశం చేసుకొని ఆత్మను తెలుసుకున్న యతులు జీవించి ఉన్నప్పుడు, చనిపోయిన తరువాత కూడా ముక్తులే.

**భాష్యమ్ : 26.1. కామ ఇతి. కామక్రోధవియుక్తానాం – కామశ్చ క్రోధశ్చ కామక్రోధౌ, తాభ్యాం వియుక్తానాం, యతీనాం సంన్యాసినాం, యతచేతసాం సంయతాన్తఃకరణానామ్, అభితః ఉభయతః, జీవతాం మృతానాం చ బ్రహ్మనిర్వాణం మోక్షః వర్తతే విదితాత్మనాం విదితః జ్ఞాతః ఆత్మా యేషాం తే విదితాత్మానః తేషాం విదితాత్మనాం సమ్యగ్దర్శినామ్ ఇత్యర్థః.**

**తె.అ.** కామక్రోధాలు లేని మనసును వశంలో ఉంచుకున్న సమ్యగ్దర్శనులైన సన్న్యాసులకు జీవించి ఉన్నవారికి చనిపోయినవారికి కూడా మోక్షమే కలుగుతుంది.

**భాష్యమ్ : 27.0. సమ్యగ్దర్శననిష్ఠానాం సంన్యాసినాం సద్యోముక్తిః ఉక్తా, కర్మయోగశ్చ ఈశ్వరార్పితసర్వభావేన ఈశ్వరే బ్రహ్మణి ఆధాయ క్రియమాణః సత్త్వశుద్ధిజ్ఞానప్రాప్తి సర్వకర్మసంన్యాస క్రమేణ మోక్షాయ ఇతి భగవాన్ పదే పదే అబ్రవీత్, వక్ష్యతి చ. అథ ఇదానీం ధ్యానయోగం సమ్యగ్దర్శనస్యాన్తరఙ్గం విస్తరేణ వక్ష్యామీతి తస్య సూత్రస్థానీయాన్ శ్లోకాన్ ఉపదిశతి స్మ–**

**తె.అ.** సమ్యగ్దర్శననిష్ఠులైన సంన్యాసులకు సద్యోముక్తి (తత్క్షణ మోక్షం) చెప్పబడింది. ఈశ్వరార్పణంగా అన్ని కర్మములను బ్రహ్మమందు నిలిపి చేసే కర్మయోగం కూడా క్రమంగా సత్త్వశుద్ధి జ్ఞానప్రాప్తి సర్వకర్మసంన్యాసము కలిగించి మోక్షం ఇస్తుంది అని భగవానుడు పదే

పదే చెప్పాడు, చెప్పబోతున్నాడు కూడా. ఇప్పుడు సమ్యగ్దర్శనం సాధించడానికి అంతరంగసాధనమైన ధ్యానయోగం విపులంగా చెపుతాను అని అందులో సూత్రప్రాయమైన శ్లోకాలు ఉపదేశిస్తున్నాడు.

**మూ. స్పర్శాన్ కృత్వా బహిర్బాహ్యాంశ్చక్షుశ్చైవాన్తరే భ్రువోః ।**
**ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యన్తరచారిణౌ ॥ 27**

**యతేన్ద్రియమనోబుద్ధిర్మునిర్మోక్షపరాయణః ।**
**విగతేచ్ఛాభయక్రోధో యః సదా ముక్త ఏవ సః ॥ 28**

**తె.అ.** బాహ్య విషయాలను వెలుపలనే ఉంచి చూపును కనుబొమ్మల నడుమ నిలిపి ముక్కులోపల సంచరించే ప్రాణాపాన వాయువులను సమంగా చేసి; భయము క్రోధము కామము లేక ఇంద్రియ మనోబుద్ధులను జయించి మోక్షపరాయణుడైన ముని సదాముక్తుడే.

**భాష్యమ్ : 27–28.1 స్పర్శాన్ ఇతి. స్పర్శాన్ శబ్దాదీన్, కృత్వా బహిః, బాహ్యాన్ శ్రోత్రాదిద్వారేణ అన్తః బుద్ధౌ ప్రవేశితాః శబ్దాదయః విషయాః తాన్ అచిన్తయతః శబ్దాదయః బాహ్యాః బహిః ఏవ కృతాః భవన్తి. తాన్ ఏవం బహిః కృత్వా చక్షుఃచైవ అన్తరే భ్రువోః కృత్వా ఇతి అనుషజ్యతే. తథా ప్రాణాపానౌ నాసాభ్యన్తరచారిణౌ సమౌ కృత్వా, యతేన్ద్రియ మనోబుద్ధిః – యతాని సంయతాని ఇన్ద్రియాణి మనః బుద్ధిశ్చ యస్య సః యతేన్ద్రియమనోబుద్ధిః, మననాత్ మునిః, సంన్యాసీ, మోక్షపరాయణః ఏవ పరమ్ అయనం యస్య సః అయం మోక్షపరాయణః ఏం దేహసంస్థానః మోక్షపరాయణః మునిః భవేత్, విగతేచ్ఛాభయక్రోధః, ఇచ్ఛా చ భయం చ క్రోధశ్చ ఇచ్ఛాభయక్రోధాః, తే విగతాః యస్మాత్ సః విగతేచ్ఛాభయక్రోధః, యః, ఏవం వర్తతే సదా సంన్యాసీ ముక్తః ఏవ సః, న తస్య మోక్షాయ అన్యః కర్తవ్యః అస్తి.**

**తె.అ.** బాహ్యస్పర్శలు అంటే శ్రోత్రాదుల ద్వారా వెలుపలనుండి బుద్ధిలోపల ప్రవేశించే శబ్దాది విషయాలు. వాటిని వెలుపలనే ఉంచి అంటే వాటిని గురించి చింతించక అని అర్థం. చూపును కనుబొమ్మల నడుమ నిలిపి, నాసికలోని ప్రాణాపానవాయుసంచారాన్ని సమానం చేసి ఇంద్రియ మనోబుద్ధులను నియమించి ఇచ్ఛ, భయము, క్రోధము లేక దేహంలో ఉంటూ కూడా తనకు మోక్షమే పరమగతియని అనుకునే సన్న్యాసి సదాముక్తుడే. అతనికి వేరే సాధించవలసిన ముక్తి లేదు.

**భాష్యమ్ : 29.0. ఏవం సమాహిత చిత్తేన కిం విజ్ఞేయమ్ ఇత్యుచ్యతే–**

**తె.అ.** ఈ విధమైన ఏకాగ్రచిత్తుడు తెలుసుకోదగినది ఏది? అంటే చెపుతున్నాడు–

**మూ. భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్ ।**
**సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాన్తిమృచ్ఛతి ॥ 29**

**తె.అ.** యజ్ఞతపములకు భోక్తను, సర్వలోకములకు ప్రభువును, సర్వభూతములకు మిత్రుడను అని నన్ను తెలుసుకొని శాంతి పొందుతాడు.

**ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే సంన్యాసయోగో నామ పఞ్చమోధ్యాయః**

ఇది వ్యాసభగవానుని శతసహస్ర సంహిత అయిన శ్రీమహాభారతంలో భీష్మపర్వంలో ఉపనిషత్తులు బ్రహ్మవిద్య యోగశాస్త్రము శ్రీకృష్ణార్జునసంవాదము అయిన భగవద్గీతల యందు సంన్యాసయోగం అనే అయిదవ అధ్యాయానికి తెలుగు అనువాదం.

**భాష్యమ్ : 29.1 భోక్తారం ఇతి. భోక్తారం యజ్ఞతపసాం యజ్ఞానాం తపసాం చ కర్తృరూపేణ దేవతారూపేణ చ, సర్వలోకమహేశ్వరం సర్వేషాం లోకానాం మహేశ్వరం సర్వలోకమహేశ్వరం, సుహృదం, సర్వభూతానాం సర్వప్రాణినాం, ప్రత్యుపకార నిరపేక్షతయా ఉపకారిణం సర్వభూతానాం హృదయేశయం, సర్వకర్మ ఫలాధ్యక్షం, సర్వప్రత్యయసాక్షిణం మాం నారాయణం జ్ఞాత్వా శాన్తిం సర్వసంసారోపరతిమ్ ఋచ్ఛతి ప్రాప్నోతి.**

**తె.అ.** యజ్ఞాలకు తపాలకు కూడా కర్తరూపంలో దేవతారూపంలో కూడా భోక్తను; అన్ని లోకాలకు మహాప్రభువును; అన్ని ప్రాణులకు ప్రత్యుపకారం కోరకుండా ఉపకారం చేసేవాడను; అన్ని కర్మఫలాలకు సంకల్పాలకు స్వామిని సాక్షిని. ఇటువంటి నన్ను అంటే నారాయణుని తెలిసినవాడు శాంతి పొందుతాడు. అంటే అతనికి ఇక సంసారం సాగదు, అంతటితో ఆగిపోతుంది.

**ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య గోవిన్దభగవత్పూజ్యపాదశిష్య శ్రీమచ్ఛఙ్కరభగవతః కృతౌ శ్రీభగవద్గీతాభాష్యే సంన్యాసయోగో నామ పఞ్చమోధ్యాయః.**

ఇది శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య గోవింద భగవత్పూజ్యపాద శిష్యులు శ్రీమత్ శంకర భగవత్పాదులు రచించిన శ్రీమద్భగవద్గీతాభాష్యంలో సంన్యాసయోగమనే అయిదవ అధ్యాయానికి తెలుగు అనువాదం.



# షష్ఠోఽధ్యాయః

# ధ్యానయోగః

**భాష్యమ్ : 0.1 అతీతానన్తరాధ్యాయాన్తే ధ్యానయోగస్య సమ్యగ్ దర్శనం ప్రతి అన్తరఙ్గస్య సూత్రభూతాః శ్లోకాః 'స్పర్శాన్ కృత్వా బహిః' (5.27.29) ఇత్యాదయః ఉపదిష్టాః, తేషాం వృత్తిస్థానీయః అయం షష్ఠోఽధ్యాయః ఆరభ్యతే. తత్ర ధ్యానయోగస్య బహిరఙ్గం కర్మ ఇతి, యావత్ ధ్యానయోగారోహణాసమర్థః తావత్ గృహస్థేన అధికృతేన కర్తవ్యం కర్మ ఇత్యతః తత్ స్తౌతి అనాశ్రితః ఇతి.**

**తె.అ.** వెనుకటి అధ్యాయం చివర సమ్యగ్దర్శనానికి అంతరంగ సాధనమైన ధ్యానయోగానికి సూత్రప్రాయంగా 'స్పర్శాన్ కృత్వా బహిః' (5.27) వంటి శ్లోకాలు ఉపదేశించాడు. వాటిని వివరించే ఈ ఆరవ అధ్యాయం మొదలవుతున్నది. ధ్యానయోగానికి బహిరంగ సాధనం కర్మ. ధ్యానయోగం అవలంబించడానికి సమర్థుడయ్యేవరకు కర్మలయందు అధికారం కల గృహస్థు కర్మ చేస్తూనే ఉండవలెను. కనుక ఆ కర్మను స్తుతిస్తున్నాడు, 'అనాశ్రితః' అనే శ్లోకంతో.

**భాష్యమ్ : 0.2 నను కిమర్థం ధ్యానయోగారోహణ సీమాకరణమ్ యావతా అనుష్ఠేయమేవ విహితం కర్మ యావజ్జీవమ్?– న, 'ఆరురుక్షోర్మునేర్యోగం కర్మ కారణముచ్యతే' (6.3) ఇతి విశేషణాత్, ఆరూఢస్య చ శమేన ఏవ సంబన్ధకరణాత్. ఆరురుక్షోః ఆరూఢస్య చ శమః కర్మ చ ఉభయం కర్తవ్యత్వేన అభిప్రేతం చేత్ స్యాత్ తదా 'ఆరురుక్షోః', 'ఆరూఢస్య' చ ఇతి శమకర్మ విషయభేదేన విశేషణం విభాగకరణం చ అనర్థకం స్యాత్.**

**తత్ర ఆశ్రమిణాం కశ్చిత్ యోగమ్ ఆరురుక్షుః భవతి, ఆరూఢః చ కశ్చిత్, అన్యే న ఆరురుక్షవః, న ఆరూఢాః – తాన్ పేక్ష్య 'ఆరురుక్షోః' 'ఆరూఢస్య' చ ఇతి విశేషణం విభాగకరణం చ ఉపపద్యతే ఏవ ఇతి చేత్ – న, 'తస్యైవ' ఇతి వచనాత్ పునః యోగగ్రహణాచ్చ 'యోగారూఢస్య' ఇతి; యః ఆసీత్ పూర్వం యోగమ్ ఆరురుక్షుః తస్యైవ ఆరూఢస్య శమః ఏవ కర్తవ్యః కారణం యోగఫలం ప్రతి ఉచ్యతే ఇతి. అతః న యావజ్జీవం కర్తవ్యత్వప్రాప్తిః కస్య చిదపి కర్మణః**

**తె.అ.** ఆక్షేపణ – 'ధ్యానయోగం అవలంబించేవరకు' అనే గీత ఎందుకు గీచినట్లు? విహితకర్మలు యావజ్జీవం చేయవలసినవే కదా?

సమాధానం – కాదు. 'ఆరురుక్షోర్మునేర్యోగం కర్మ కారణముచ్యతే' (3) అని ప్రత్యేకించి చెప్పడం వల్లను, ఆరూఢునికి శమంతోటి సంబంధం చెయ్యడం చేతనూ. (ఆరోహించదలచినవానికి సాధనం కర్మ. ఆరోహించినవానికి శమమే కర్తవ్యం; కర్మలు ఉపశమించడమే ఆరూఢస్థితి) ఆరోహించదలచిన వానికి, ఆరోహించినవానికి కూడా శమము కర్మము రెండూ కర్తవ్యమేనని చెప్పదలచినపుడు ఆరోహించదలచినవాడు ఆరోహించినవాడు అనీ, శమమని, కర్మ అనీ వేరువేరుగా చెప్పడంలో అర్థంలేదు.

ఆక్షేపణ – ఆశ్రమధర్మం అవలంబించేవారిలో ఒకడు యోగాన్ని ఆరోహించదలచినవాడుంటాడు, ఒకడు ఆరోహించిన వాడుంటాడు. వీరు గాక ఇతరులు కొందరుంటారు – ఆరోహించినవారు కానీ, ఆరోహించవలెననే కోరిక ఉన్నవారు గానీ కారు. వారి నుండి వేరు చేసి చెప్పడం కొరకే 'ఆరోహించినవారు, ఆరోహించదలచినవారు' అని ప్రత్యేకించి చెప్పడం. (ఇక్కడ వేరు చేసింది ఆరోహించదలచినవారిని, ఆరోహించినవారిని గాదు; ఈ ఇద్దరినీ, ఈ రెంటిలోనూ చేరనివారిని. అంటే ఆరోహించదలచినవానికి ఆరోహించిన వానికి కూడా శమము కర్మ రెండూ కర్తవ్యమే. ఎందుకంటే ఇక్కడ ఆ ఇద్దరినీ వేరుచేసి చెప్పలేదు అని ఆక్షేపం.)

సమాధానం – కాదు. 'యోగం ఆరోహించిన అతనికే' ('యోగారూఢస్య తస్యైవ' (3) అనే వాక్యంలో 'అతనికే' అనడంచేత, అంతేగాక 'యోగ' శబ్దంచేత కూడా, పూర్వం యోగం ఆరోహించదలచిన వానికే ఆరోహించిన తరువాత యోగఫలసిద్ధికై శమమే కర్తవ్యము అని చెప్పాడు. కనుక యావజ్జీవము చేయవలసిన కర్మ అంటూ ఏదీ లేదు.

**భాష్యమ్ : 0.3 యోగవిభ్రష్ట వచనాచ్చ, గృహస్థస్య చేత్ కర్మిణః యోగః విహితః షష్ఠే అధ్యాయే, సః యోగ విభ్రష్టః అపి కర్మగతిం, కర్మఫలం ప్రాప్నోతి ఇతి తస్య నాశాశంకా అనుపపన్నా స్యాత్ అవశ్యం హి కృతం కర్మ, కామ్యం నిత్యం వా మోక్షస్య నిత్యత్వాత్ అనారభ్యత్వే, స్వం ఫలం ఆరభతే ఏవ. నిత్యస్య చ కర్మణః వేద ప్రమాణావబుద్ధత్వాత్ ఫలేన భవితవ్యమ్ ఇతి అవోచామ. (4.18) – అన్యథా వేదస్య అనర్థార్థత్వ ప్రసంగాత్ ఇతి. న చ కర్మణి సతి ఉభయవిభ్రష్ట వచనమ్ అర్థవత్. కర్మణః విభ్రంశకారణానుపపత్తేః.**

**కర్మ కృతమ్ ఈశ్వరే సంన్యస్య (సంన్యస్తమ్) ఇత్యతః కర్తరి కర్మ ఫలం నారభతే ఇతి చేత్ – న, ఈశ్వరే సంన్యాసస్య అధికతర ఫలహేతుత్వోపపత్తేః**

**మోక్షాయ ఏవ ఇతి చేత్ – స్వకర్మణాం కృతానామ్ ఈశ్వరే న్యాసః మోక్షాయైవ, న ఫలాన్తరాయ యోగసహితః, యోగాచ్చ విభ్రష్టః, ఇత్యతః తం ప్రతి నాశాశఙ్కా యుక్తైవ ఇతి చేత్ – న,**

**'ఏకాకీ యత చిత్తాత్మా నిరాశీరపరిగ్రహః' (6.10), 'బ్రహ్మచారివ్రతే స్థితః' (6.14) ఇతి చ కర్మసంన్యాస-విధానాత్. న చ అత్ర ధ్యానకాలే స్త్రీ సహాయకత్వాశఙ్కా యేన ఏకాకిత్వం విధీయతే. న చ గృహస్థస్య 'నిరాశీరపరిగ్రహః' (6.10) ఇత్యాదివచనమ్ అనుకూలమ్. ఉభయవిభ్రష్ట ప్రశ్నాను-పపత్తేః చ (6.38).**

**తె.అ.** యోగవిభ్రష్ట ప్రసక్తి (38) వల్ల కూడా ఇదే స్పష్టమవుతుంది. ఆరవ అధ్యాయంలో ధ్యానయోగం విధించబడింది (కర్మలాచరించే గృహస్థుకు) అయినట్లయితే, అతడు (కర్మలాచరించే వాడు కనుక) యోగభ్రష్టుడయినప్పటికీ కర్మఫలం ఎట్లాగూ పొందుతాడు. అతడు నాశనమవుతాడు అనే శంక (అర్జునునికి కలిగినట్లు. 38) కలగడానికి వీలు లేదు. కర్మ కామ్యమైనా నిత్యమైనా తన ఫలం ఇచ్చే తీరుతుంది – మోక్షం నిత్యమయింది. ఏ కర్మకూ ఫలం కాదు. వేదప్రమాణం ద్వారా తెలుసుకున్నవి కనుక నిత్యకర్మలు తప్పక ఫలమిస్తాయని, లేకపోతే వేదం నిరర్థకమన్నట్టు అవుతుందని (4.18) చెప్పి ఉన్నాం. కర్మలు చేస్తూ ఉన్న గృహస్థును ఉభయభ్రష్టుడనడంలో అర్థం లేదు. కర్మలు విభ్రంశకారణం కాలేవు.

ఆక్షేపణ – ఈశ్వరార్పణంగా చేసిన కర్మ కనుక ఫలం లేదు అంటే?

సమాధానం – అనడానికి వీలు లేదు. ఈశ్వరార్పణంగా చేసిన కర్మ మరింత ఎక్కువగా ఫలించవలెను.

ఆక్షేపణ – మోక్షం కొరకు మాత్రమేనంటే? యోగసహితంగా ఈశ్వరునకర్పించి చేసే కర్మలు కేవలం మోక్షం కొరకే గాని మరే ఫలం కొరకు గావు. ఆ యోగం నుండి భ్రష్టుడైనాడు, కనుక అతనిని గురించి నాశనమయినాడు అన్న శంక కలగడంలో తప్పేమీ లేదు.

సమాధానం – తప్పే. 'ఏకాకీ యత చిత్తాత్మా నిరాశీరపరిగ్రహః' (10), 'బ్రహ్మచారివ్రతే స్థితః' (14) అని కర్మసంన్యాసం విధించబడి ఉండడం చేత. (ఇక్కడ విధించిన ధ్యానయోగం గృహస్థుకు కాదు అని గ్రహించవలసి ఉంది. అగ్నిహోత్రాది కర్మలు ఆచరించేటప్పుడు భార్య సహాయం అవసరం. కాని) ఏకాంతంలో చేసే ధ్యానానికి భార్య సహాయం అవసరమనే ఆశంక ఎవరికీ కలుగదు. కలిగితే కదా ఇక్కడ గృహస్థును గురించి చెపుతున్నాడు. గృహస్థుకు ఒంటరితనాన్ని ('ఏకాకీ' – 10) విధిస్తున్నాడు అని చెప్పుకోగలం. 'నిరాశీరపరిగ్రహః' (10) అనే మాటలు కూడా గృహస్థుకు అనుకూలంగా లేవు. ఉభయవిభ్రష్టప్రశ్న కలిగిన కారణంగా కూడా. (అర్జునుడికి కలిగిన శంక; యోగంలో దిగినవాడు యోగం పూర్తిగా సాధించలేక పోయినపుడు వానికి యోగఫలము లేదు. కర్మలు మానివేశాడు కనుక కర్మఫలము లేదు. ఈ విధంగా రెండు

విధాలా భ్రష్టుడవుతాడు అని, అంటే అర్జునుడు అడిగిన ప్రశ్నను బట్టి ధ్యానయోగం విధించింది గృహస్థుకు కాదు అని స్పష్టమవుతున్నది.)

**భాష్యమ్ : 0.4 'అనాశ్రితః' ఇత్యనేన కర్మిణః ఏవ సంన్యాసిత్వం యోగిత్వం చ ఉక్తం, ప్రతిషిద్ధం చ నిరగ్నేః అక్రియస్య చ సంన్యాసిత్వం యోగిత్వం ఇతి చేత్ - న, ధ్యానయోగం ప్రతి బహిరఙ్గస్య సతః కర్మణః ఫలాకాంక్షాసంన్యాస స్తుతిపరత్వాత్. న కేవలం నిరగ్నిః అక్రియః ఏవ సంన్యాసీ యోగీ చ. కిం తర్హి కర్మీ అపి - కర్మఫలాసఙ్గం సంన్యస్య కర్మయోగమ్ అనుతిష్ఠన్ సత్త్వశుద్ధ్యర్థం, 'సః సంన్యాసీ చ యోగీ చ' భవతి. (6.1) ఇతి స్తూయతే న చైకేన వాక్యేన కర్మఫలాసంగసంన్యాసస్తుతిః చతుర్థాశ్రమ ప్రతిషేధశ్చ ఉపపద్యతే. న చ ప్రసిద్ధం నిరగ్నేః అక్రియస్య పరమార్థ సంన్యాసినః శ్రుతిస్మృతి పురాణేతిహాస యోగశాస్త్ర విహితం సంన్యాసిత్వం యోగిత్వం చ ప్రతిషేధతి భగవాన్.**

**స్వవచన విరోధాచ్చ - 'సర్వ కర్మాణి మనసా సంన్యస్య... నైవ కుర్వన్ న కారయన్ ఆస్తే' (5.13), 'మౌనీ సంతుష్టో యేన కేనచిత్, అనికేతః స్థిరమతిః' (12.19), 'విహాయ కామాన్యః సర్వాన్ పుమాంశ్చరతి నిఃస్పృహః' (2.71), 'సర్వారమ్భపరిత్యాగీ' (12.16) ఇతి చ తత్ర భగవతా స్వవచనాని దర్శితాని; తైః విరుధ్యేత చతుర్థాశ్రమ ప్రతిషేధః, తస్మాత్ మునేః యోగమ్ ఆరురుక్షోః ప్రతిపన్నగార్హస్థ్యస్య అగ్నిహోత్రాది కర్మ ఫలనిరపేక్షమ్ అనుష్ఠీయమానం ధ్యానయోగారోహణ సాధనత్వం సత్త్వశుద్ధిద్వారేణ ప్రతిపద్యతు ఇతి 'సః సంన్యాసీ చ యోగీ చ' ఇతి స్తూయతే.**

**తె.అ.** ఆక్షేపణ - 'కర్మఫలాన్ని ఆశ్రయించకుండా' (అనాశ్రితః.) అనే శ్లోకంలో కర్మలు చేసేవానినే సంన్యాసి అని యోగి అని అంటున్నాడు. అగ్నిని క్రియలను వదలివేసినవాడు సన్న్యాసి కాదు, యోగి కాదు.

సమాధానం - కాదు. కర్మలు ధ్యానయోగానికి బాహ్యసాధనం. ఆ కర్మలయందు ఫలాకాంక్షను వదిలివేయడాన్ని స్తుతిస్తున్నాడు. 'అనాశ్రితః అని; కేవలం అగ్నికార్యాలు వదిలివేసినవాడే సన్న్యాసి యోగికాదు; కర్మఫలం కోరకుండా సత్త్వశుద్ధి కొరకు కర్మలు చేసేవాడు కూడా సంన్యాసి, యోగి అని స్తుతిస్తున్నాడు. ఒకే వాక్యంలో కర్మఫలంపై కోరికను సంన్యసించడాన్ని స్తుతిస్తూ చతుర్థాశ్రమాన్ని (సంన్యాసాన్ని) ప్రతిషేధించడం సాధ్యం కాదు. శ్రుతి స్మృతి పురాణ ఇతిహాస యోగశాస్త్రాలు అగ్నిని కర్మలను వదలివేసిన వాస్తవ సంన్యాసిని సంన్యాసిగా యోగిగా చెప్పడం ప్రసిద్ధం. దాన్ని ఇక్కడ భగవానుడు కాదనడం లేదు. అట్లా కాదంటే ఆయన మాటలే ఆయన

కాదన్నట్టవుతుంది. 'సర్వ కర్మాణి మనసా సంన్యస్య ... నైవకుర్వన్నకారయన్నాస్తే' (5.13), 'మౌనీ సన్తుష్టో యేన కేనచిత్ అనికేతః స్థిరమతిః' (12.19), 'విహాయ కామాన్ యః పుమాంశ్చరతి నిఃస్పృహః' (2.71), 'సర్వారంభ పరిత్యాగీ' (12.16) అని భగవానుని వాక్యాలున్నాయి. చతుర్థాశ్రమ ప్రతిషేధం వీటితో విరోధిస్తుంది. కనుక గృహస్థాశ్రమంలో ఉంటూ యోగమారోహించవలెననే కోరిక గలవాడు ఫలాపేక్ష లేకుండా అనుష్ఠించే అగ్నిహోత్రాది కర్మ ధ్యానయోగం ఆరోహించడానికి సాధనమవుతుంది అని 'అతడు సన్న్యాసి యోగి కూడా' అని స్తుతిస్తున్నాడు.

**శ్రీ భగవానువాచ –**

**మూ. అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః ।**
**స సంన్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్న చాక్రియః ॥ 1**

శ్రీ భగవానుడంటున్నాడు.

**తె.అ.** కర్మఫలం కోరకుండా చేయవలసిన కర్మలు చేసేవాడు సంన్యాసి, యోగి; అగ్నిని, కర్మలను మానినవాడు కాదు.

**భాష్యమ్ : 1.1 అనాశ్రిత ఇతి. అనాశ్రితః – న ఆశ్రితః, కిమ్? కర్మఫలం – కర్మణః ఫలం కర్మఫలం యత్ తత్ అనాశ్రితః, కర్మఫల తృష్ణారహితః ఇత్యర్థః. యో హి కర్మఫలే తృష్ణావాన్ సః కర్మఫలమ్ అతః ఆశ్రితః భవతి, అయం తు తద్విపరీతః, అతః అనాశ్రితః కర్మఫలమ్. ఏవంభూతః సన్ కార్యం కర్తవ్యం, నిత్యం కామ్యవిపరీతమ్ అగ్నిహోత్రాదికం, కర్మ కరోతి నిర్వర్తయతి, యః కశ్చిత్ ఈదృశః కర్మీ సః కర్మ్యన్తరేభ్యః విశిష్యతే ఇత్యేవమర్థమ్ ఆహ – సః సంన్యాసీ చ యోగీ చ ఇతి. సంన్యాసః పరిత్యాగః, సః యస్య అస్తి సః సంన్యాసీ చ యోగీ చ – యోగః చిత్తసమాధానం, స యస్య అస్తి సః యోగీ చ ఇత్యేవం గుణ సంపన్నః అయం మన్తవ్యః, న కేవలం నిరగ్నిః అక్రియ ఏవ సంన్యాసీ యోగీ చ – ఇతి మన్తవ్యః. నిర్గతాః అగ్నయః కర్మాఙ్గభూతాః యస్మాత్ సః నిరగ్నిః, అక్రియశ్చ అనగ్నిసాధనా అపి అవిద్యమానాః క్రియాః తపోదానాదికాః యస్య అసౌ అక్రియః.**

**తె.అ.** కర్మఫలాన్ని ఆశ్రయించకుండా, ఫలంపై తృష్ణలేకుండా చేయవలసి నిత్యకర్మలను, కామ్యములు కాని వాటిని, అంటే అగ్నిహోత్రాది కర్మలను చేసేవాడు సన్న్యాసీ యోగి కూడా. సన్న్యాసమంటే పరిత్యాగం. పరిత్యజించినవాడు సంన్యాసి. చిత్తసమాధానం కలిగినవాడు యోగి. ఇటువంటి గుణాలు కలిగినవాడే సన్న్యాసి, యోగి అని మనం అనుకోవలెను. కాని కేవలం

అగ్నిని, కర్మలను వదలినంత మాత్రాన ఎవనినీ సంన్యాసి యోగి అని అనుకోరాదు. కర్మలకు సాధనమైన అగ్నిని వదలినవాడు నిరగ్ని. అగ్నితో పనిలేని తపోదానాదిక క్రియలను వదలివేసినవాడు అక్రియుడు.

**భాష్యమ్ : 2.0 నను చ నిరగ్నేః అక్రియస్యైవ శ్రుతిస్మృతి యోగశాస్త్రేషు సంన్యాసిత్వం యోగిత్వం చ ప్రసిద్ధమ్. కథమిహ సాగ్నేః సక్రియస్య సంన్యాసిత్వం యోగిత్వం చ అప్రసిద్ధమ్ ఉచ్యతే ఇతి? - నైష దోషః, కయాచిత్ గుణవృత్త్యా ఉభయస్య సంపిపాదయిషితత్వాత్. తత్ కథమ్? కర్మఫల సంకల్ప సంన్యాసాత్ సంన్యాసిత్వం, యోగాఙ్గత్వేన చ కర్మానుష్ఠానాత్ కర్మఫలసంకల్పస్య వా చిత్తవిక్షేపహేతోః పరిత్యాగాత్ యోగిత్వం చ ఇతి గౌణమ్ ఉభయమ్; న పునః ముఖ్యం సంన్యాసిత్వం యోగిత్వం చ అభిప్రేతమ్ ఇత్యేతమ్ అర్థం దర్శయితుమాహ -**

**తె.అ.** ఆక్షేపణ - శ్రుతిస్మృతి యోగశాస్త్రాలలో అగ్నిహోత్రాది కర్మలను తపోదానాదిక క్రియలను వదలిన వానినే కదా సన్న్యాసి, యోగి అనడం ప్రసిద్ధం? మరి ఇక్కడ అగ్నిని క్రియలను వదలని వానిని సంన్యాసి యోగి అని ఎక్కడా చెప్పని మాట ఎట్లా అంటున్నాడు?

సమాధానం - ఇందులో దోషం లేదు. గౌణార్థంలో రెండూ - సన్న్యాసిత్వము యోగిత్వము చెప్పదలచి ఇట్లా అంటున్నాడు. ఎట్లా అంటే, కర్మఫల సంకల్పాన్ని త్యాగం చేయడం చేత సంన్యాసిత్వము, యోగంలో అంగంగా కర్మానుష్ఠానం చేస్తూ చిత్తాన్ని కలవరపెట్టగల కర్మఫల సంకల్పాన్ని పరిత్యజించినందున యోగిత్వము అని గౌణార్థంలో రెంటినీ గ్రహించవలెను; ముఖ్యార్థంలో సన్న్యాసిత్వము యోగిత్వమునని అభిప్రాయము కాదు. ఈ అర్థాన్ని చెపుతూ -

**మూ. యం సంన్యాసమితి ప్రాహుర్యోగం తం విద్ధి పాణ్డవ ।**
**న హ్యసంన్యస్తసంకల్పో యోగీ భవతి కశ్చన ॥ 2**

**తె.అ.** అర్జునా, సంన్యాసమని దేనిని అంటున్నారో అదే యోగమని తెలుసుకో. సంకల్పాన్ని సంన్యసించని వాడెవడూ యోగి కాలేడు.

**భాష్యమ్ : 2.1 యమితి. యం సర్వకర్మ తత్ఫలపరిత్యాగలక్షణం పరమార్థసంన్యాసమ్ సంన్యాసమ్ ఇతి ప్రాహుః శ్రుతిస్మృతివిదః, యోగం కర్మానుష్ఠానలక్షణం తం పరమార్థసంన్యాసం విద్ధి జానీహి, హే పాణ్డవ, కర్మయోగస్య ప్రవృత్తి లక్షణస్య తద్విపరీతేన నివృత్తిలక్షణేన పరమార్థసంన్యాసేన కీదృశం సామాన్యమ్ అఙ్గీకృత్య తద్భావః ఉచ్యతే ఇత్యపేక్షాయామ్ ఇదముచ్యతే. అస్తి పరమార్థసంన్యాసేన సాదృశ్యం కర్తృద్వారకం కర్మయోగస్య. యః హి పరమార్థసంన్యాసీ సః త్యక్త- సర్వకర్మ సాధనతయా సర్వకర్మతత్ఫలవిషయం సంకల్పం ప్రవృత్తి**

**హేతుకామకారణం సంన్యస్యతి. అయమపి కర్మయోగీ కర్మ కుర్వాణః ఏవ ఫలవిషయం సంకల్పం సంన్యస్యతి ఇత్యేవమ్ అర్థం దర్శయిష్యన్ ఆహ – న, హి యస్మాత్ అసంన్యస్త సంకల్పః అసంన్యస్త అపరిత్యక్తః ఫలవిషయః సంకల్పః అభిసంధిః యేన సః అసంన్యస్తసంకల్పః, కశ్చన కశ్చిదపి, కర్మీ, యోగీ సమాధానవాన్ భవతి, న సంభవతీత్యర్థః, ఫలసంకల్పస్య చిత్తవిక్షేప హేతుత్వాత్. తస్మాత్ యః కశ్చన కర్మీ సంన్యస్త ఫలసంకల్పః భవేత్, సః యోగీ సమాధానవాన్ అవిక్షిప్తచిత్తః భవేత్, చిత్తవిక్షేపహేతోః ఫలసంకల్పస్య సంన్యస్తత్వాత్ ఇత్యభిప్రాయః. ఏవం పరమార్థ సంన్యాస కర్మయోగయోః కర్తృద్వారకం సంన్యా–ససామాన్యమ్ అపేక్ష్య 'యం సంన్యాసమితి ప్రాహుర్యోగం తం విద్ధి పాణ్డవ' ఇతి కర్మయోగస్య స్తుత్యర్థం సంన్యాసత్వమ్ ఉక్తమ్.**

**తె.అ.** శ్రుతిస్మృతి తెలిసినవారు సర్వకర్మలను వాటి ఫలాన్ని త్యాగం చెయ్యడం నిజమైన సంన్యాస లక్షణమంటున్నారు. కర్మానుష్ఠానలక్షణమైన యోగం కూడా నిజమైన సంన్యాసమని తెలుసుకో. ప్రవృత్తి లక్షణమైన కర్మయోగాన్ని, దానికి విపరీతమైన నివృత్తి లక్షణమైన నిజమైన సంన్యాసాన్ని సమానంగా ఎట్లా అంగీకరించడం అనే ప్రశ్నకు సమాధానం – నిజమైన సంన్యాసానికి కర్మయోగానికి కర్త విషయంలో సాదృశ్యం ఉంది. నిజమైన సంన్యాసి సర్వకర్మసాధనాలను ఆ సాధనాలతో చేయదగిన కర్మలను ఆ కర్మఫలం గురించిన ఆలోచనలను ఆ ఆలోచనల వల్ల ఆ ఫలంపై కలిగే కోరికను సంన్యసిస్తాడు. కర్మయందు ప్రవృత్తి కలిగించేది కోరిక. ఆ కోరిక ఎప్పుడు వదలిందో కర్మలయందు ప్రవృత్తి అప్పుడే వదులుతుంది. కర్మయోగి కూడా కర్మలు చేస్తూ ఉన్నప్పటికీ ఫల విషయిక సంకల్పాన్ని సంన్యసిస్తాడు; అనే అర్థాన్ని ప్రదర్శిస్తూ అంటున్నాడు – ఫల విషయమైన సంకల్పం వదలని వాడెవడూ యోగి కాలేడు. అంటే ఫలంపై కోరిక వదలని వానికి చిత్తవిక్షేపం కలుగుతుంది, చిత్తసమాధానం లేనివాడు యోగి కాలేడు. చిత్తవిక్షేప కారణమైన ఫల సంకల్పాన్ని సంన్యసించడం చేత చిత్తవిక్షేపం తొలగి సమాధానం కలుగుతుంది. కనుక ఎవడైనా కర్మలాచరించేవాడు ఫలసంకల్పాన్ని సంన్యసించినట్లయితే అతనికి చిత్త సమాధానం ఉంటుంది. కనుక అతడు యోగి అని అభిప్రాయం. ఈ విధంగా నిజమైన సంన్యాసానికి కర్మయోగానికి కర్త విషయంలో సన్న్యాసం సమానం. దీన్ని ఉద్దేశించే 'యం సంన్యాసమితి ప్రాహుర్యోగం తం విద్ధి' అని కర్మయోగాన్ని స్తుతించడం కొరకు దాన్నీ సంన్యాసమంటున్నాడు.

**భాష్యమ్ : 3.0 ధ్యానయోగస్య ఫలనిరపేక్షః కర్మయోగః బహిరఙ్గ సాధనమ్ ఇతి తం సంన్యాసత్వేన స్తుత్వా అధునా కర్మయోగస్య ధ్యానయోగసాధనత్వం దర్శయతి –**

**తె.అ.** ఫలాపేక్షలేని కర్మయోగం ధ్యానయోగానికి బాహ్యసాధనమని దానిని సన్న్యాసమని స్తుతించి ఇక ఆ కర్మయోగం ధ్యానయోగానికి సాధనమని చూపిస్తున్నాడు.

**మూ. ఆరురుక్షోర్మునేర్యోగం కర్మ కారణముచ్యతే ।**
**యోగారూఢస్య తస్యైవ శమః కారణముచ్యతే ॥ 3**

**తె.అ.** యోగం ఆరోహించదలచిన మునికి కర్మ సాధనమవుతుంది; యోగం ఆరోహించిన వానికి శమం సాధనమవుతుంది.

**భాష్యమ్ : 3.1 ఆరురుక్షోరితి. ఆరురుక్షోః ఆరోఢుమ్ ఇచ్ఛతః – అనారూఢస్య, ధ్యానయోగే అవస్థాతుమ్ అశక్తస్యైవ ఇత్యర్థః. కస్య తస్య ఆరురుక్షోః? మునేః, కర్మఫలసంన్యాసినః ఇత్యర్థః. కిమ్ ఆరురుక్షోః? యోగం, కర్మకారణం సాధనమ్ ఉచ్యతే. యోగారూఢస్య పునః తస్యైవ, శమః ఉపశమః, సర్వకర్మభ్యః, నివృత్తిః కారణం, యోగారూఢస్య సాధనమ్ ఉచ్యతే ఇత్యర్థః. యావత్ యావత్ కర్మభ్యః ఉపరమతే, తావత్ తావత్ నిరాయాసస్య జితేన్ద్రియస్య చిత్తం సమాధీయతే. తథా సతి సః ఝటితి యోగారూఢో భవతి. తథా చ ఉక్తం వ్యాసేన –**

**'నైతాదృశం బ్రాహ్మణస్యాస్తి విత్తం యథైకతా సమతా సత్యతా చ ।**
**శీలం స్థితిర్దణ్డ నిధానమార్జవం తతస్తతశ్చోపరమః క్రియాభ్యః ॥ (శాం.ప. 175.38) ఇతి.**

**రా.కృ.** ఆరురుక్షువు అంటే ఆరోహించవలెననే కోరిక ఉన్నవాడు. ఇంకా ఆరూఢుడు కానివాడు, ఆరోహించని వాడు అంటే ధ్యానయోగంలో నిలువగల శక్తిలేనివాడు. అటువంటి మునికి ఫలాపేక్ష లేకుండా చేసే కర్మయోగం సాధనమవుతుంది. అదే మునికి, యోగం ఆరోహించినవానికి, శమము అంటే కర్మలనన్నిటినుండి నివృత్తి, ఉపశమము యోగారూఢతకు సాధనమవుతుంది. కర్మలనుండి ఎంతెంత విరమించుకుంటూ పోతాడో అంతంతగా అతడు ఆయాసరహితుడు, జితేంద్రియుడు అయి అతని చిత్తం సమాధానం చెందుతుంది. అట్లా కావడంతో అతడు త్వరగా యోగారూఢుడు అవుతాడు. ఇదే అన్నాడు వ్యాసుడు : 'ఏకత, సమత, సత్యత, శీలము, స్థితి, అహింస, ఆర్జవము, వివిధ క్రియలనుండి విరమణము – వీటితో సమానమైన ధనం బ్రాహ్మణునికి మరొకటి లేదు' (మ.భా.శాం. 175.38) అని.

**భాష్యమ్ : 4.0 అథ ఇదానీం కదా యోగారూఢః భవతి ఇతి ఉచ్యతే –**

**తె.అ.** ఇక ఇప్పుడు యోగారూఢుడు ఎప్పుడవుతాడు అనేది చెపుతున్నాడు –

**మూ. యదా హి నేంద్రియార్థేషు న కర్మస్వనుషజ్జతే ।**
**సర్వసంకల్పసంన్యాసీ యోగారూఢస్తదోచ్యతే ॥ 4**

**తె.అ.** ఇంద్రియ విషయాలయందు, కర్మలయందు కర్తవ్యబుద్ధిని విడిచి సర్వసంకల్పాలను సన్న్యసించినపుడు అతడు యోగారూఢుడు అవుతాడు.

**భాష్యమ్ : 4.1 ఇది యదా – సమాధీయమానచిత్తః యోగీ హి ఇన్ద్రియార్థేషు ఇన్ద్రియాణామ్ అర్థాః శబ్దాదయః తేషు ఇన్ద్రియార్థేషు, కర్మసు చ నిత్య నైమిత్తిక కామ్యప్రతిషిద్ధేషు, ప్రయోజనా–భావబుద్ధ్యా, న అనుషజ్జతే అనుషఙ్గం కర్తవ్యతాబుద్ధిం న కరోతి ఇత్యర్థః. సర్వసంకల్పసంన్యాసీ సర్వాన్ సంకల్పాన్ ఇహాముత్రార్థకామహేతూన్ సంన్యసితుం శీలమ్ అస్య ఇతి స సర్వసంకల్పసంన్యాసీ, యోగారూఢః, ప్రాప్తయోగః ఇత్యేతత్, తదా తస్మిన్కాలే, ఉచ్యతే. 'సర్వసంకల్పసంన్యాసీ' ఇతి వచనాత్ సర్వాంశ్చ కామాన్ సర్వాణి చ కర్మాణి సంన్యసేత్ ఇత్యర్థః. సంకల్పమూలాః హి సర్వే కామాః –**

**"సంకల్పమూలః కామో వై యజ్ఞాః సంకల్పసంభవాః" (మను.స్మృ. 2.3.)**

**"కామ జానామి తే మూలం సంకల్పాత్ కిల జాయసే" ।**
**"న త్వాం సంకల్పయిష్యామి సమూలో న భవిష్యసి" ॥ (శాం.ప. 177.25)**

**ఇత్యాదిస్మృతేః. సర్వకామపరిత్యాగే చ సర్వకర్మసంన్యాసః సిద్ధో భవతి – 'స యథాకామో భవతి – తత్క్రతుర్భవతి, యత్క్రతుర్భవతి తత్కర్మ కురుతే' (బృ.ఉ.4.4.5) ఇత్యాది శ్రుతిభ్యః', 'యద్యత్ హి కురుతే జన్తుః తత్తత్కామస్య చేష్టితమ్' (మమ.స్మృ.2.4) ఇత్యాది స్మృతిభ్యశ్చ. న్యాయాచ్చ – న హి సర్వసంకల్ప సంన్యాసే కశ్చిత్ స్పన్దితుమ్ అపి శక్తః. తస్మాత్ 'సర్వసంకల్ప సంన్యాసీ' ఇతి వచనాత్ సర్వాన్ కామాన్ సర్వాణి కర్మాణి చ త్యాజయతి భగవాన్.**

**తె.అ.** ఎప్పుడు చిత్త సమాధానం చేసుకున్న యోగి శబ్దాదులైన ఇంద్రియ విషయాలయందు నిత్య నైమిత్తిక కామ్య ప్రతిషేధ కర్మలయందు తనకేమీ ప్రయోజనం లేదని తెలుసుకొని వాటియందు కర్తవ్యతాబుద్ధి లేనివాడవుతాడో అప్పుడతనిని యోగారూఢుడు అంటారు. అప్పుడతడు సర్వసంకల్పసంన్యాసి, ఇహపరకామ కారణాలన్నిటిని పరిత్యజించినవాడు. సర్వసంకల్పసంన్యాసి అనడంచేత సర్వకామములు సర్వకర్మలు కూడా సంన్యసించవలెనని అర్థం. సర్వకామములు సంకల్పం వల్ల కలిగేవే – కామానికి మూలకారణం సంకల్పం. యజ్ఞాలన్నీ సంకల్పం నుండి పుట్టినవే. (మను.స్మృ. – 2.3) 'ఓ కామమా, నీ మూలం నాకు తెలుసు, నీవు సంకల్పం నుండే పుడుతున్నావు. నిన్ను నేను సంకల్పించను. కనుక నీవు నన్ను చేరలేవు'. (మ.భా.శా. 177.25) వంటి స్మృతివాక్యాలున్నాయి. కోరికలనన్నిటిని పరిత్యజించడం వల్లనే సర్వకర్మసన్న్యాసం సిద్ధిస్తుంది. 'అతడు ఎటువంటి కోరిక కలిగితే అటువంటి సంకల్పం చేస్తాడు, ఏది సంకల్పిస్తే దానికి అనుకూలమైన కర్మ చేస్తాడు', (బృ.ఉ.4.4.5) వంటి శ్రుతివాక్యాలు, 'ఏ కర్మ చేసినా కోరికవల్ల చేసే చేష్ట మాత్రమే', (మను.స్మృ. 2.4) వంటి స్మృతివాక్యాలు ఇందుకు ప్రమాణం.

ఏ సంకల్పము లేనివాడు కదలను కూడా లేడు అనేది తెలిసిందే. కనుక సర్వసంకల్పసన్న్యాసి అనడంచేత భగవానుడు సర్వకామములను సర్వకర్మలను కూడా త్యాగం చేయిస్తున్నాడు.

**భాష్యమ్ : 5.0 యదా ఏవం యోగారూఢః తదా తేన ఆత్మా ఆత్మనా ఉద్ధృతః భవతి సంసారాత్ అనర్థజాతాత్, అతః –**

**తె.అ.** ఎప్పుడు యోగారూఢుడవుతాడో అప్పుడతడు అనర్థసమూహమైన సంసారం నుండి తనను తాను ఉద్ధరించుకుంటాడు. కనుక –

**మూ. ఉద్ధరేదాత్మనాఽఽత్మానం నాఽఽత్మానమవసాదయేత్ ।**
**ఆత్మైవహ్యాత్మనో బన్ధురాత్మైవ రిపురాత్మనః ॥ 5**

**తె.అ.** మనిషి తనను తాను ఉద్ధరించుకోవలెను. తనను తాను క్రిందికి త్రోసుకోరాదు. తనకు తానే బంధువు. తనకు తానే శత్రువు.

**భాష్యమ్ : 5.1 ఉద్ధరేదితి :– ఉద్ధరేత్, సంసార సాగరే నిమగ్నమ్, ఆత్మనా, ఆత్మానం, తతః ఉత్ ఊర్ధ్వం హరేత్ ఉద్ధరేత్, యోగరూఢతామాపాదయేత్ ఇత్యర్థః. న ఆత్మానమ్, అవసాదయేత్, న అధః నయేత్, న అధః గమయేత్. ఆత్మా ఏవ, హి యస్మాత్, ఆత్మనః బన్ధుః, న హి అన్యః కశ్చిత్ బన్ధుః యః సంసారముక్తయే భవతి. బన్ధుః అపి తావత్ మోక్షం ప్రతి ప్రతికూలః ఏవ, స్నేహాది బన్ధనాయతనత్వాత్. తస్మాత్ యుక్తమ్ అవధారణమ్ 'ఆత్మైవ హ్యాత్మనో బన్ధుః' ఇతి. ఆత్మైవ రిపుః శత్రుః. యః అన్యః అపకారీ బాహ్యః శత్రుః సః అపి ఆత్మప్రయుక్తః ఏవ ఇతి యుక్తమ్ ఏవ అవధారణమ్. 'ఆత్మైవ రిపుః ఆత్మనః' ఇతి.**

**తె.అ.** సంసారసాగరంలో మునిగినవాడు తనకు తానే పైకి రావాలి, యోగారూఢతను పొందవలెను. తన్నుతాను క్రిందికి తోయరాదు. ఎందుకంటే తనకు తానే బంధువు. సంసారంనుండి విడిపించగల బంధువు వేరొకడు లేడు. ప్రేమాది బంధాలకు ఆశ్రయులైన బంధువులు కూడా మోక్షవిషయంలో ప్రతికూలురు. కనుక 'తనకు తానే బంధువు' అనడం సరిగానే ఉంది. అట్లాగే తనకు తానే శత్రువు అనడం కూడా సరియైనదే. అపకారియైన బాహ్యశత్రువు కూడా తనచేతనే ప్రయోగింపబడినవాడు అయి ఉంటాడు.

**భాష్యమ్ : 6.0 ఆత్మైవ బంధుః ఆత్మైవ రిపుః, ఆత్మనః ఇత్యుక్తమ్. తత్ర కిం లక్షణః ఆత్మా ఆత్మనః బంధుః, కిం లక్షణః వా ఆత్మా ఆత్మనః రిపుః ఇతి ఉచ్యతే –**

**తె.అ.** ఆత్మకు ఆత్మే బంధువు, శత్రువు అని చెప్పాడు. ఇప్పుడు ఆత్మ బంధువు లక్షణమేది ఆత్మశత్రువు లక్షణమేది చెపుతున్నాడు.

**మూ. బన్ధురాత్మాఽఽత్మనస్తస్య యేనాత్మైవాత్మనా జితః ।**
**అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్ ॥ 6**

**తె.అ.** ఆత్మచేత ఆత్మను జయించినవానికి ఆత్మ బంధువు. ఆత్మను జయించనివానికి, అనాత్మకు, ఆత్మ శత్రువు వలె ప్రవర్తిస్తుంది.

**భాష్యమ్ : 6.1 బన్ధురితి. బన్ధుః ఆత్మా ఆత్మనః తస్య – తస్య ఆత్మనః సః ఆత్మా బన్ధుః యేన ఆత్మనా ఆత్మైవ జితః. ఆత్మా కార్యకారణ సంఘాతః యేన వశీకృతః, జితేన్ద్రియః ఇత్యర్థః. అనాత్మనః తు అజితాత్మనః తు, శత్రుత్వే శత్రుభావే, వర్తేత ఆత్మైవ శత్రువత్, యథా అనాత్మా శత్రుః ఆత్మనః అపకారీ, తథా ఆత్మా ఆత్మనః అపకారే వర్తేత ఇత్యర్థః.**

**తె.అ.** కార్యకారణసంఘాతమైన శరీరరూప ఆత్మను వశం చేసుకున్నవాడు జితేంద్రియుడు. వానికి ఆత్మబంధువు. అనాత్మకు, అజితేంద్రియునకు ఆత్మ శత్రువు వలె అపకారం చేస్తుంది. (శరీరము దాని అంగాలు, ఇంద్రియ సమూహం. దీనిని వశంలో ఉంచుకున్నవానికి చిత్తాన్ని ఆత్మయందు నిలపడం సులభం. ఈ విధంగా అతని ఆత్మ (శరీరం) అతనికి ఆధ్యాత్మిక సాధనలో బంధువు. వశంలో లేని ఆత్మ (శరీరం) ఆ సాధనలో శత్రువు.

**మూ. జితాత్మనః ప్రశాన్తస్య పరమాత్మా సమాహితః ।**
**శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానాపమానయోః ॥ 7**

**తె.అ.** ఆత్మను జయించి ప్రశాంతుడైనవానికి పరమాత్మ అనుభవమునందే ఉండును. అతనికి శీతోష్ణాలు, సుఖదుఃఖాలు, మానావమానాలు సమానము.

**భాష్యమ్ : 7.1 జితాత్మన ఇతి :– జితాత్మనః – కార్యకరణసంఘాతః ఆత్మా జితః యేన సః జితాత్మా తస్య జితాత్మనః, ప్రశాన్తస్య ప్రసన్నాన్తః కరణస్య సతః సంన్యాసినః, పరమాత్మా సమాహితః సాక్షాత్ ఆత్మభావేన వర్తతే ఇత్యర్థః. కించ శీతోష్ణసుఖదుఃఖేషు, తథా మానే అపమానే చ మానాపమానయోః పూజాపరిభవయోః సమః స్యాత్.**

**తె.అ.** కార్యకరణసంఘాతరూపమైన తనను తాను జయించినవాడు జితాత్ముడు. ప్రశాంతుడు అంటే ప్రసన్నమైన అంతఃకరణము కలవాడు సంన్యాసి. అటువంటివానికి పరమాత్మ సమాహితమవుతుంది అంటే ఆత్మభావన అనుభవమునందు ఉండును. (తన ఆత్మనే పరమాత్మగా తెలుసుకుంటాడు). అంతేకాదు శీతోష్ణ సుఖదుఃఖాలయందు, మానావమానాలయందు అంటే పూజా తిరస్కారాలయందు సమబుద్ధి కలిగి ఉంటాడు.

**మూ. జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేన్ద్రియః ।**
**యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాఞ్చనః ॥ 8**

**తె.అ.** జ్ఞానవిజ్ఞానాలతో తృప్తి చెందినవాడు కూటస్థుడు. ఇంద్రియములను జయించిన వానిని యుక్తుడు అంటారు. అటువంటి యోగి మట్టిని, రాతిని, బంగారాన్ని ఒకటిగా చూస్తాడు.

**భాష్యమ్ : 8.1 జ్ఞానేతి : – జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా – జ్ఞానం శాస్త్రోక్తపదార్థానాం పరిజ్ఞానం, విజ్ఞానం తు శాస్త్రతః జ్ఞాతానాం తథైవ స్వానుభవకరణం, తాభ్యాం జ్ఞానవిజ్ఞానాభ్యాం, తృప్తః సంజాతాలంప్రత్యయః ఆత్మా అన్తఃకరణం యస్య సః జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థః అప్రకమ్ప్యః భవతి ఇత్యర్థః, విజితేన్ద్రియః చ. యః ఈదృశః, యుక్తః సమాహితః ఇతి సః ఉచ్యతే కథ్యతే సః యోగీ. సమలోష్టాశ్మకాఞ్చనః లోష్టాశ్మకాఞ్చనాని సమాని యస్య సః సమలోష్టాశ్మకాఞ్చనః. కించ–**

**తె.అ.** శాస్త్ర విషయపరిజ్ఞానం జ్ఞానం. శాస్త్రం ద్వారా తెలుసుకున్న విషయాన్ని స్వానుభవం చేసుకోవడం విజ్ఞానం. ఈ జ్ఞానవిజ్ఞానాలతో తృప్తి చెందినవాడు అంటే జ్ఞానము, విజ్ఞానము చాలును అని అనుకునేవాడు కూటస్థుడు అంటే చలించనివాడు. ఇంద్రియాలను జయించినవాడు విజితేంద్రియుడు. ఇటువంటి వానిని యుక్తుడు అంటారు. ఆ యోగి మట్టిని, రాతిని, బంగారాన్ని సమానంగా చూస్తాడు. ఇంకా –

**మూ. సుహృన్మిత్రార్యుదాసీనమధ్యస్థద్వేష్యబన్ధుషు ।**
**సాధుష్వపి చ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే ॥ 9**

**తె.అ.** ప్రతిఫలం ఆశించక ఉపకారంచేయువాడు, మిత్రుడు, శత్రువు, ఉదాసీనుడు, మధ్యస్థుడు ద్వేషింపదగినవాడు, బంధువు, సాధువు, పాపి – వీరియందు సమబుద్ధి కలవాడు శ్రేష్ఠుడు అగుచున్నాడు.

**భాష్యమ్ : 9.1 సుహృదిత్యాది శ్లోకార్ధమ్ ఏకం పదమ్. సుహృత్ ఇతి ప్రత్యుపకారమ్ అనపేక్ష్య ఉపకర్తా. మిత్రం స్నేహవాన్. అరిః శత్రుః ఉదాసీనః న కస్యచిత్ పక్షం భజతే. మధ్యస్థః యః విరుద్ధయోః ఉభయోః హితైషీ, ద్వేష్యః ఆత్మనః అప్రియః బన్ధుః సంబన్ధీ. ఇత్యేతేషు, సాధుషు శాస్త్రానువర్తిషు, అపి చ, పాపేషు ప్రతిషిద్ధకారిషు సర్వేషు ఏతేషు సమబుద్ధిః 'కః కర్తా, కిం కర్మ (కః కింకర్మా) ఇతి అవ్యాపృతబుద్ధిః ఇత్యర్థః. విశిష్యతే, విముచ్యతే ఇతి వా పాఠాన్తరమ్. యోగారూఢానామ్ సర్వేషాం అయమ్ ఉత్తమః ఇత్యర్థః.**

**తె.అ.** 'సుహృత్'తో మొదలైన శ్లోకంలోని సగము ఒకటే పదము. ప్రత్యుపకారం ఆశించకుండా ఉపకారం చేసేవాడు సుహృదుడు. స్నేహం కలవాడు మిత్రుడు. అరి అంటే శత్రువు. విరోధులిద్దరి మేలు కోరేవాడు మధ్యస్థుడు. తనకు అప్రియుడు ద్వేషింపదగినవాడు. కుటుంబంలోని వాడు బంధువు. శాస్త్రానుసారం ప్రవర్తించేవారు సాధువులు, శాస్త్రం ప్రతిషేధించిన పనులు చేసేవారు పాపులు. వీరందరినీ కూడా సమబుద్ధితో చూచేవాడు శ్రేష్ఠుడు. వీరిందరి విషయంలో ఎవరు ఏం చేస్తున్నారని అతడు ఆలోచించడు. అతడు విశిష్టుడు, విముక్తుడు అనే పాఠం కూడా ఉంది. యోగారూఢులందరిలో అతడు ఉత్తముడు అని అర్థం.

**భాష్యమ్ : 10.0 అతః ఏవమ్ ఉత్తమఫలప్రాప్తయే –**

**తె.అ.** కనుక ఉత్తమ ఫలం పొందాలంటే –

**మూ. యోగీ యుఞ్జీత సతతమాత్మానం రహసి స్థితః ।**
**ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః ॥ 10**

**తె.అ.** ఏకాకియై, రహస్యస్థలంలో ఉంటూ దేహాన్ని మనసును వశం చేసుకొని దేనిమీద ఆశలేకుండా దేనినీ పరిగ్రహించకుండా మనసును ఏకాగ్రం చేసుకుని యోగి ఎప్పుడూ ధ్యానం చేసుకుంటూ ఉండవలెను.

**భాష్యమ్ : 10.1 యోగీతి. యోగీ ధ్యాయీ, యుఞ్జీత సమాదధ్యాత్, సతతం సర్వదా, ఆత్మానమ్ అన్తఃకరణమ్, రహసి ఏకాన్తే గిరి గుహాదౌ స్థితః సన్, ఏకాకీ అసహాయః, 'రహసి స్థితః ఏకాకీ చ' ఇతి విశేషణాత్ సంన్యాసం కృత్వా ఇత్యర్థః. యత చిత్తాత్మా – చిత్తమ్ అన్తఃకరణం ఆత్మా దేహశ్చ సంయతౌ యస్య సః యతచిత్తాత్మా, నిరాశీః వీతతృష్ణః అపరిగ్రహః చ పరిగ్రహరహితః ఇత్యర్థః సంన్యాసిత్వేఽపి త్యక్తసర్వపరిగ్రహః సన్ యుఞ్జీత ఇత్యర్థః.**

**తె.అ.** కొండగుహ వంటి ఏకాంతస్థలంలో ఉంటూ ఏకాకియై ఎవరి సహాయము లేక మనసును దేహాన్ని వశం చేసుకొని ఆశను విడిచి దేనినీ పరిగ్రహించక మనసును ఏకాగ్రం చేసుకుని యోగి సర్వదా ధ్యానం చేసుకుంటూ ఉండవలెను. 'ఏకాంతస్థలంలో ఉంటూ', 'ఏకాకియై' అనడం చేత, 'సంన్యసించి', అని అర్థం చేసుకోవలెను. అపరిగ్రహం సంన్యాసి లక్షణం. నిజంగా సంన్యసించినవానికి తనదంటూ ఏమీ ఉండకూడదు.

**భాష్యమ్ : 11.0 అథ ఇదానీం యోగం యుంజానస్య ఆసనాహార విహారాదీనాం యోగసాధనత్వేన నియమః వక్తవ్యః, ప్రాప్తయోగస్య లక్షణం తత్ఫలాది చ ఇత్యతః ఆరభ్యతే. తత్ర ఆసనమేవ తావత్ ప్రథమమ్ ఉచ్యతే.**

**తె.అ.** ఇక ఎప్పుడూ యోగం అవలంబించేవానికి ఆసన ఆహార విహారాదుల విషయంలో నియమాలు చెప్పవలసి ఉన్నవి. ఇవి యోగానికి సాధనాలు. అంతేగాక యోగం ప్రాప్తించినవాని లక్షణము యోగఫలము కూడా చెప్పవలెనని ప్రారంభిస్తున్నాడు. ముందుగా ఆసనం గురించి-

**మూ. శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః ।**
**నాత్యుచ్ఛ్రితం నాతినీచం చైలాజినకుశోత్తరమ్ ॥ 11**

**తె.అ.** శుభ్రమైన ప్రదేశంలో ఎక్కువ ఎత్తు పల్లము కానిచోట తన ఆసనాన్ని కదలకుండా నిలిపి దానిపై దర్భలు, మృగచర్మము, వస్త్రము పరచి -

**భాష్యమ్ : 11.1 శుచౌ ఇతి. శుచౌ శుద్ధే, వివిక్తే స్వభావతః సంస్కారతః వా, దేశే స్థానే, ప్రతిష్ఠాప్య, స్థిరమ్ అచలమ్, ఆసనమ్ ఆత్మనః, ఆసనం, నాత్యుచ్ఛ్రితమ్, న అతీవ ఉచ్ఛ్రితమ్ నాపి అతినీచం, తచ్చ చైలాజినకుశోత్తరమ్ - చైలమ్ అజినం కుశాశ్చ ఉత్తరే యస్మిన్ ఆసనే తత్ ఆసనం చైలాజినకుశోత్తరమ్, పాఠక్రమాత్ విపరీతః అత్ర క్రమః చైలాదీనామ్.**

**తె.అ.** శుభ్రంగా ఉన్న ప్రదేశంలో లేక శుభ్రంచేసిన ప్రదేశంలో తన ఆసనాన్ని మరీ ఎత్తు మరీ పల్లముగాని చోట కదలకుండా నిలిపి దానిపై దర్భ, మృగచర్మము వస్త్రము పరచి, - 'చైలాజిన కుశోత్తరం' అనే క్రమాన్ని త్రిప్పి చదువుకోవలెను, కుశ అజినము, చైలము అని.

**భాష్యమ్ : 12.0** ప్రతిష్ఠాప్య కిమ్?

**తె.అ.** ఆసనాన్ని స్థిరంగా నిలిపి ఏం చెయ్యవలెను?

**మూ. తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేన్ద్రియ క్రియః ।**
**ఉపవిశ్యాసనే యుఞ్జ్యాద్యోగమాత్మవిశుద్ధయే ॥ 12**

**తె.అ.** ఆ ఆసనం పై కూర్చుని మనసును ఏకాగ్రం చేసి మనసును, ఇంద్రియాలను వశంలో ఉంచుకుని ఆత్మ శుద్ధికొరకు యోగసాధన చేయవలెను.

**భాష్యమ్ : 12.1 తత్ర ఇతి. తత్ర తస్మిన్ ఆసనే ఉపవిశ్య యోగం యుఞ్జ్యాత్కథమ్? సర్వ విషయేభ్యః ఉపసంహృత్య ఏకాగ్రం మనః కృత్వా. యతచిత్తేన్ద్రియక్రియః - చిత్తం చ ఇన్ద్రియాణి చ చిత్తేన్ద్రియాణి, తేషాం క్రియాః సంయతాః యస్య సః యతచిత్తేన్ద్రియ క్రియః, సః కిమర్థం యోగం యుఞ్జ్యాత్ ఇత్యాహ - ఆత్మవిశుద్ధయే - అన్తఃకరణస్య విశుద్ధ్యర్థమ్ ఇత్యేతత్.**

**తె.అ.** ఆ ఆసనం మీద కూర్చుని యోగసాధన చేయవలెను, ఎట్లా? మనసును అన్ని విషయాలనుండి మరల్చి ఏకాగ్రం చేసి చిత్తాన్ని, ఇంద్రియ వ్యాపారాన్ని జయించి అంటే

వశంలో ఉంచుకుని యోగసాధన చేయవలెను. ఎందుకొరకు? ఆత్మవిశుద్ధి కొరకు అంటే అంతఃకరణం శుద్ధి కావడం కొరకు.

**భాష్యమ్ : 13.0 బాహ్యమ్ ఆసనమ్ ఉక్తమ్, అధునా శరీరధారణం కథమ్ ఇత్యుచ్యతే.**

**తె.అ.** బాహ్యమైన ఆసనం గురించి చెప్పాడు. ఇప్పుడు శరీరాన్ని ఎట్లా ఉంచవలెను అనేది చెపుతున్నాడు.

**మూ. సమం కాయశిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః ।**
**సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్ ॥ 13**

**తె.అ.** దేహాన్ని శిరస్సును కంఠాన్ని సమంగా కదలకుండా ఉంచి స్థిరభావంతో తన ముక్కుకొనను చూస్తూ దిక్కులు చూడకుండా –

**భాష్యమ్ : 13.1 సమమితి. సమం కాయశిరోగ్రీవమ్ – కాయశ్చ శిరశ్చ గ్రీవా చ కాయశిరోగ్రీవమ్, తత్ సమం ధారయన్, అచలం చ, సమం ధారయతః చలనం సంభవతిః అతః విశినష్టి అచలమ్ ఇతి. స్థిరః, స్థిరః భూత్వా ఇత్యర్థః, స్వం నాసికాగ్రం సంప్రేక్ష్య సమ్యక్ ప్రేక్షణం దర్శనం కృత్వా ఇవ ఇతి; ఇవ శబ్దః లుప్తః ద్రష్టవ్యః, న హి స్వనాసికాగ్ర సంప్రేక్షణమ్ ఇహ విధిత్సితం, కిం తర్హి? చక్షుషోః దృష్టి సంనిపాతః; స చ అన్తః కరణసమాధానాపేక్షః వివక్షితః. స్వనాసికాగ్ర సంప్రేక్షణమ్ ఏవ చేత్ వివక్షితం మనః తత్రైవ సమాధీయేత న ఆత్మని – ఆత్మని హి మనసః సమాధానం వక్ష్యతి. 'ఆత్మసంస్థం మనః కృత్వా' (6.25) ఇతి. తస్మాత్ ఇవశబ్దలోపేన అక్ష్ణోః దృష్టి సంనిపాతః ఏవ సంప్రేక్ష్య ఇత్యుచ్యతే. దిశః చ అనవలోకయన్, దిశాం చ అవలోకనమ్ అన్తరా అకుర్వన్ ఇత్యేతత్. కించ –**

**తె.అ.** దేహాన్ని శిరసును కంఠాన్ని సమంగా కదలకుండా ఉంచి, సమంగా ఉంచినా చలనం కలగవచ్చు కనుక 'కదలకుండా' అనడం, స్థిరుడై తన ముక్కుకొనను సూటిగా చూస్తూ – ఇక్కడ 'చూస్తూ' అన్నమాట ప్రక్కన 'వలె' (ఇవ) లోపించింది అని గ్రహించవలెను. ('చూస్తూ' కాదు 'చూస్తున్నట్లు') ముక్కుకొనను చూస్తూ కూర్చోమని విధించడం అభిమతం కాదు. మరేమిటి? 'చూపును నిలిపి' (విషయాలవైపు చూపు మరలకుండా) అని. అది కూడా అంతఃకరణ సమాధానం కొరకు చెప్పాడు. అంతేగాని ముక్కుకొనను చూస్తూ ఉండమని చెప్పదలిస్తే మనసు ముక్కుకొననే ధ్యానిస్తుంది, ఆత్మను కాదు. 'ఆత్మసంస్థం మనః కృత్వా' అని ముందు చెప్పబోతున్నాడు. కనుక 'వలె' అనే పదం లోపించి ఉండడం చేత 'చూస్తూ' అంటే చూపును నిలుపు అని అర్థం. మధ్యమధ్య దిక్కులు చూడకుండా అని – ఇంకా –

**మూ. ప్రశాన్తాత్మా విగతభీర్బ్రహ్మచారివ్రతే స్థితః ।**
**మనః సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః ॥ 14**

**తె.అ.** అంతఃకరణం ప్రశాంతమై, నిర్భయుడై బ్రహ్మచర్య వ్రతాన్ని అవలంబిస్తూ మనసును నియమించి నాయందు చిత్తముంచి నాయందు భక్తి కలిగి కూర్చుండవలెను.

**భాష్యమ్ : 14.1 ప్రశాన్తాత్మేతి. ప్రశాన్తాత్మా – ప్రకర్షేణ శాన్తః ఆత్మా అన్తఃకరణం యస్య సః అయం ప్రశాన్తాత్మా, విగతభీః విగతభయః బ్రహ్మచారివ్రతే స్థితః బ్రహ్మచారిణః వ్రతం బ్రహ్మచర్యం గురు శుశ్రూషా భిక్షాన్నభుక్త్యాది, తస్మిన్ స్థితః తదనుష్ఠాతా భవేత్ ఇత్యర్థః. కిం చ మనః సంయమ్య, మనసః వృత్తీః ఉపసంహృత్య ఇత్యేతత్, మచ్చిత్తః మయి పరమేశ్వరే చిత్తం యస్య సః అయం మచ్చిత్తః, యుక్తః సమాహితః సన్, ఆసీత్ ఉపవిశేత్. మత్పరః అహం పరః యస్య సః అయం మత్పరః భవతి కశ్చిద్రాగీ స్త్రీ చిత్తః, న తు స్త్రియమేవ పరత్వేన గృహ్ణాతి, కిం తర్హి? రాజానం మహాదేవం వా, అయం తు మచ్చిత్తః మత్పరశ్చ.**

**తె.అ.** అంతఃకరణం ప్రశాంతమై నిర్భయుడై, గురుసేవ, భిక్షాభోజనం మొదలైన బ్రహ్మచర్య నియమాలు పాటిస్తూ ఉండవలెను. అంతేగాక మనో వ్యాపారాలను ఉపసంహరించి పరమేశ్వరుడనైన నాయందు చిత్తముంచి నాకంటె శ్రేష్ఠమైనది మరొకటి లేదని నమ్ముతూ ఏకాగ్రంగా కూర్చోవలెను. 'నాయందు చిత్తముంచి', అని 'నేనే శ్రేష్ఠమని భావించి' అని కూడా అనడం ఎందుకంటే, స్త్రీని ప్రేమించేవానికి స్త్రీయందే చిత్తం ఉంటుంది. కాని స్త్రీయే అందరికంటే శ్రేష్ఠము అనుకోడు. రాజు శ్రేష్ఠుడు లేక మహాదేవుడు శ్రేష్ఠుడు అనుకుంటాడు. (రాగికి చిత్తమొకచోట భక్తి మరొకచోట) కాని యోగికి నాయందే చిత్తము నాయందే భక్తి.

**భాష్యమ్ : 15.0 అథ ఇదానీం యోగఫలమ్ ఉచ్యతే –**

**తె.అ.** ఇక ఇప్పుడు యోగఫలం చెపుతున్నాడు –

**మూ. యుఞ్జన్నేవం సదాఽఽత్మానం యోగీ నియతమానసః ।**

**శాన్తిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి ॥ 15**

**తె.అ.** మనసును నియమించుకొని, సదా ఆత్మ సమాధానం చేసుకుంటూ యోగి నాలో చేరి నా అధీనమై మోక్షమనే పరమశాంతిని పొందుతాడు.

**భాష్యమ్ : 15.1 యుఞ్జన్ ఇతి. యుఞ్జన్ సమాధానం కుర్వన్, ఏవం యథోక్తేన విధానేన, సదా ఆత్మానం సర్వదా యోగీ నియతమానసః, నియతం సంయతం మానసం మనః యస్య సః**

**అయం నియత మానసః శాన్తిమ్ ఉపరతిం, నిర్వాణపరమామ్ నిర్వాణం మోక్షః, తత్ పరమా నిష్ఠా యస్యాః శాన్తేః సా నిర్వాణ పరమా, తాం నిర్వాణ పరమాం, మత్సంస్థాం మదధీనామ్ అధిగచ్ఛతి ప్రాప్నోతి.**

**తె.అ.** వెనుక చెప్పిన ప్రకారం తనను ఎల్లప్పుడు సమాధానం చేసుకుంటూ మనసును నియమించి, యోగి క్షేమం పొందుతాడు. శాంతికి పరమస్థితి మోక్షం. ('పరమమైన శాంతిని మోక్షం అంటారు.) అది నా అధీనంలోనిది. (భగవంతుని అధీనమయిపోవడమే శాంతి మోక్షము.) ఆ శాంతిని యోగి పొందుతాడు.

**భాష్యమ్ : 16.0 ఇదానీం యోగినః ఆహారాది నియమః ఉచ్యతే –**

**తె.అ.** ఇప్పుడు యోగికి ఆహార నియమాలు చెపుతున్నాడు.

**మూ. నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాన్తమనశ్నతః।**
**న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున ॥ 16**

**తె.అ.** అధికంగా తిండి తినేవానికి, తగినంత తిననివానికి, అతిగా నిద్రించేవానికి అమితంగా మేలుకునే వానికి యోగం సిద్ధించదు.

**భాష్యమ్ : 16.1** న ఇతి. **నాత్యశ్నతః ఆత్మసంమితమ్ అన్నపరిమాణమ్ అతీత్య అశ్నతః** న **యోగఃఅస్తి, న చ ఏకాన్తమ్ అనశ్నతః యోగః అస్తి. 'యదు హ వా ఆత్మసంమితమన్నం తదవతి, తన్న హినస్తి, యద్భూయో హినస్తి, తద్యత్కనీయోఽన్నం న తదవతి' (శత.బ్రాహ.9.2.1.2) ఇతి శ్రుతేః. తస్మాద్యోగీ న ఆత్మసంమితాత్ అన్నాత్ అధికం న్యూనం వా అశ్నీయాత్. అథవా యోగినః యోగశాస్త్రే పరిపఠితాత్ అన్నపరిమాణాత్ అతిమాత్రమ్ అశ్నతః యోగః నాస్తి.**

**ఉక్తం హి –**

**'అర్ధం సవ్యఞ్జనాన్నస్య తృతీయముదకస్య తు, వాయోః సంచరణార్థం తు చతుర్థమవశేషయేత్'.**

**ఇత్యాదిపరిమాణమ్, తథా – న చాతిస్వప్నశీలస్య యోగః భవతి, నైవ చ అతిమాత్రం జాగ్రతః యోగః భవతి చ అర్జున.**

**తె.అ.** తనకు అవసరమైన అన్నపరిమాణం కంటె ఎక్కువ తినేవానికి యోగం సిద్ధించదు. అసలు తిననివానికి సిద్ధించదు. 'తనకు సరిపడునంత ఆహారం కాపాడుతుంది, హాని చెయ్యదు. అంతకంటె ఎక్కువ తింటే బాధిస్తుంది. తక్కువ తింటే కాపాడదు' (శత. బ్రాహ. 9. 2. 1. 2) అని

శ్రుతి. కనుక యోగి తనకు సరిపడినదానికంటె ఎక్కువగాని తక్కువగాని తినరాదు. లేక యోగశాస్త్ర గ్రంథాలలో చెప్పిన అన్న పరిమాణంకంటె ఎక్కువ తినేవానికి యోగం సిద్ధించదు. 'కడుపు సగం వరకు అన్నశాకాలతో, మూడవ పావుభాగం నీటితో నింపి నాలుగవ పావుభాగం వాయు సంచారానికి వదలవలె', అని ఎంత తినవలెనో చెప్పారు. అదేవిధంగా అతిగా నిద్రించేవానికి అతిగా మేలుకునేవానికి కూడా యోగం సిద్ధించదు.

**భాష్యమ్ : 17.0 కథం పునః యోగః భవతి ఇత్యుచ్యతే –**

**తె.అ.** అయితే యోగమెట్లా సిద్ధిస్తుంది?

**మూ. యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు ।**
**యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా ॥ 17**

**తె.అ.** తగిన విధంగా ఆహార విహారాలను, తగు విధంగా చేసే పనులను, తగిన విధంగా నిద్రించేవానికి, మేల్కొనేవానికి యోగం సిద్ధిస్తుంది.

**భాష్యమ్ : 17.1 యుక్త ఇతి. యుక్తాహార విహారస్య – ఆహ్రియతే ఇతి ఆహారః అన్నమ్, విహరణం విహారః పాదక్రమః, తౌ యుక్తౌ నియత పరిమాణౌ యస్య, సః యుక్తాహార విహారః తస్య; తథా యుక్తచేష్టస్య – యుక్తా నియతా చేష్టా యస్య కర్మసు, తస్య; తథా, యుక్తస్వప్నావబోధస్య – యుక్తౌ స్వప్నశ్చ అవబోధశ్చ తౌ నియతకాలౌ యస్య తస్య; యుక్తాహారవిహారస్య యుక్త చేష్టస్య కర్మసు, యుక్త స్వప్నావబోధస్య యోగినః యోగః భవతి, దుఃఖహా – దుఃఖాని సర్వాణి హన్తీతి దుఃఖహా సర్వ సంసార దుఃఖక్షయకృత్ యోగః భవతీత్యర్థః.**

**తె.అ.** లోపలికి తీసుకునేది ఆహారం, అన్నం. విహారమంటే తిరగడం. ఈ రెండూ నియమిత పరిమాణంలో చేస్తూ, పనులు తగుమాత్రం చేస్తూ నియమితకాలంలో నిద్రపోతూ మేలుకొంటూ ఉండే యోగికి యోగం సిద్ధిస్తుంది. సర్వసంసార దుఃఖాలను క్షయం చేస్తుంది.

**భాష్యమ్ : 18.0 అథ అధునా కదా యుక్తః భవతి ఇత్యుచ్యతే –**

**తె.అ.** ఇక ఇప్పుడు యుక్తుడెప్పుడవుతాడు అంటే చెపుతున్నాడు –

**మూ. యదా వినియతం చిత్తమాత్మన్యేవావతిష్ఠతే ।**
**నిఃస్పృహః సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా ॥ 18**

**తె.అ.** చక్కగా నియమించబడిన చిత్తం సర్వ విషయాలయందు కోర్కె విడిచి ఆత్మయందే నిలిచి ఉన్నప్పుడు అతనిని యుక్తుడంటారు.

**భాష్యమ్ : 18.1 యదా ఇతి. యదా వినియతం చిత్తం విశేషేణ నియతం సంయతమ్ ఏకాగ్రతామ్ ఆపన్నం చిత్తం హిత్వా బాహ్యార్థచిన్తామ్ ఆత్మన్యేవ కేవలే అవతిష్ఠతే, స్వాత్మని స్థితిం లభతే ఇత్యర్థః. నిఃస్పృహః సర్వకామేభ్యః – నిర్గతా దృష్టాదృష్ట విషయేభ్యః స్పృహా తృష్ణా యస్య యోగినః సః యుక్తః సమాహితః ఇతి ఉచ్యతే, తదా తస్మిన్ కాలే.**

**తె.అ.** విశేషంగా నియమించబడిన ఏకాగ్రతను పొందిన చిత్తం బాహ్యవిషయాలపై చింతను విడిచి కేవలం ఆత్మయందే నిలిచినపుడు ఇహపరలోక విషయాలన్నిటిపై తృష్ణ వదలినప్పుడు, ఆ యోగిని యుక్తుడు, ఏకాగ్రతను పొందినవాడు అంటారు.

**భాష్యమ్ : 19.0 తస్య యోగినః సమాహితం యచ్చిత్తం తస్య ఉపమా ఉచ్యతే –**

**తె.అ.** యోగి యొక్క ఏకాగ్రమైన చిత్తానికి ఉపమానం చెపుతున్నాడు.

**మూ. యథా దీపో నివాతస్థో నేఙ్గతే సోపమా స్మృతా ।**
**యోగినో యతచిత్తస్య యుఞ్జతో యోగమాత్మనః ॥ 19**

**తె.అ.** చిత్తాన్ని నియమించి యోగం అవలంబిస్తున్నవానిని, గాలిలేనిచోట కదలని దీపంతో పోల్చారు.

**భాష్యమ్ : 19.1 యథా ఇతి. యథా, దీపః ప్రదీపః, నివాతస్థః నివాతే వాతవర్జితే దేశే స్థితః, న ఇంగతే న చలతి, సా ఉపమా ఉపమీయతే అనయా ఇతి ఉపమా, యోగజ్ఞైః చిత్త ప్రచారదర్శిభిః, స్మృతా చిన్తితా, యోగినః యతచిత్తస్య సంయతాన్తః కరణస్య, యుఞ్జతః యోగమ్ అనుతిష్ఠతః, ఆత్మనః సమాధిమ్ అనుతిష్ఠతః ఇత్యర్థః.**

**తె.అ.** గాలి లేనిచోట దీపం కదలదు. చిత్తపు పోకడలు తెలిసిన యోగులు, చిత్తాన్ని నియమించి, యోగానుష్ఠానం చేస్తూ ఆత్మ సమాధియందు నిలచిన యోగిని అటువంటి దీపంతో పోల్చారు.

**భాష్యమ్ : 20.0 ఏవం యోగాభ్యాసబలాత్ ఏకాగ్రీభూతం నివాతప్రదీపకల్పం సత్ –**

**తె.అ.** ఈవిధంగా యోగాభ్యాసబలంచేత గాలిలేనిచోట దీపంవలె చిత్తం ఏకాగ్రమవుతుంది.

**మూ. యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా ।**
**యత్ర చైవాత్మనాఽఽత్మానం పశ్యన్నాత్మని తుష్యతి ॥ 20**

**తె.అ.** యోగాభ్యాసం, చిత్తాన్ని విషయాలవైపు వెళ్ళకుండా ఆపుతుంది. అప్పుడు ఆత్మతో ఆత్మను చూసుకుని ఆత్మయందే సంతోషం పొందుతాడు.

**భాష్యమ్ : 20.1 యత్ర ఇతి. యత్ర యస్మిన్ కాలే ఉపరమతే, చిత్తమ్, ఉపరతిం గచ్ఛతి, నిరుద్ధం సర్వతః నివారితప్రచారం, యోగసేవయా యోగానుష్ఠానేన, యత్రచైవ యస్మిన్ చ కాలే, ఆత్మనా సమాధిపరిశుద్ధేన అన్తఃకరణేన, ఆత్మానం పరం చైతన్యం జ్యోతిః స్వరూపం, పశ్యన్ ఉపలభమానః, స్వే ఏవ ఆత్మని, తుష్యతి తుష్టిం భజతే. కించ**

**తె.అ.** యోగానుష్ఠానంవల్ల చిత్తప్రచారం అన్నివైపుల ఆపివేయబడుతుంది. అప్పుడు సమాధిచేత పరిశుద్ధమైన అంతఃకరణంచేత జ్యోతి స్వరూపమైన పరమ చైతన్యాన్ని చూసి ఆత్మయందే సంతోషం పొందుతాడు. ఇంకా –

**మూ. సుఖమాత్యన్తికం యత్తద్బుద్ధిగ్రాహ్యమతీన్ద్రియమ్ ।**
**వేత్తి యత్ర న చైవాయం స్థితశ్చలతి తత్త్వతః ॥ 21**

**తె.అ.** ఇంద్రియాలకు అందని, బుద్ధిచేతనే గ్రహించగలిగిన అనంతసుఖం తెలిసిన తరువాత యోగి తత్త్వం నుండి కదలడు.

**భాష్యమ్ : 21.1 సుఖమితి. సుఖమ్ ఆత్యన్తికమ్ అత్యన్తమ్ ఏవ భవతి ఇతి ఆత్యన్తికమ్, అనన్తమ్ ఇత్యర్థః. యత్, తత్, బుద్ధిగ్రాహ్యం బుద్ధ్యైవ ఇన్ద్రియ నిరపేక్షయా గృహ్యతే ఇతి బుద్ధిగ్రాహ్యమ్, అతీన్ద్రియమ్ ఇన్ద్రియ గోచరాతీతమ్, అవిషయజనితమ్ ఇత్యర్థః, వేత్తి తత్ ఈదృశం సుఖమ్ అనుభవతి, యత్ర యస్మిన్ కాలే, న చ, ఏవ, అయం విద్వాన్ ఆత్మస్వరూపే స్థితః, తస్మాత్, నైవ చలతి తత్త్వతః, తత్త్వస్వరూపాత్ న ప్రచ్యవతే ఇత్యర్థః. కించ–**

**తె.అ.** ఆత్యంతికమైన సుఖం అంటే అనంతమైన సుఖం. ఇది ఇంద్రియాల వలన కలిగే విషయసుఖం కాదు, బుద్ధిద్వారా కలిగేది. అందుకనే అతీంద్రియసుఖం. ఈ సుఖం అనుభవించిన యోగి తత్త్వస్వరూపం నుండి చలించడు. అతనికి చ్యుతి లేదు. (అతడు అచ్యుతుడు)

**మూ. యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః ।**
**యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాఽపి విచాల్యతే ॥ 22**

**తె.అ.** దేనిని పొందిన తరువాత పొందదగినది మరొకటి లేదని అనుకుంటాడో, దేనియందు నిలిచి ఎంత గొప్ప దుఃఖంలో కూడా చలించడో,

**భాష్యమ్ : 22.1 య మితి. యం లబ్ధ్వా – యమ్ ఆత్మలాభం, లబ్ధ్వా ప్రాప్య, చ, అపరమ్ అన్యత్, లాభాన్తరం తతః అధికమ్ అస్తీతి న మన్యతే చిన్తయతి కిం చ యస్మిన్ ఆత్మతత్త్వే, స్థితః, దుఃఖేన శస్త్రనిపాతాది లక్షణేన గురుణా మహతాపి న విచాల్యతే.**

**తె.అ.** ఏ ఆత్మలాభం పొంది, దానికంటే అధికంగా పొందదగిన లాభం మరొకటి ఉన్నదని అనుకోడో, ఏ ఆత్మ తత్త్వంలో నిలిచి ఎటువంటి గొప్ప దుఃఖంలోనూ, ఆయుధం వంటి వాటివల్ల కలిగే బాధలోనూ చలించడో–

**భాష్యమ్ : 23.0 'యత్రోపరమతే' (6.20) ఇత్యారభ్య యావద్భిః విశేషణైః విశిష్టః ఆత్మావస్థా విశేషః యోగః ఉక్తః –**

**తె.అ.** 'యత్రోపరమతే' (20) నుండి ఇంతవరకు అన్ని విశేషణాలతో విశిష్టమైన ఆత్మావస్థ అనే యోగం చెప్పబడింది.

**మూ. తం విద్యాద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్ ।**
**స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా ॥ 23**

**తె.అ.** దుఃఖంలో కలిగిన సంయోగం వియోగం కావడానికే యోగమని పేరు. ఆ యోగాన్ని తెలుసుకోవలెను. నిశ్చయంతో ఉద్వేగంలేని మనసుతో ఆ యోగాన్ని సాధన చేయవలెను.

**భాష్యమ్ : 23.1 తమితి. తం విద్యాత్ విజానీయాత్, దుఃఖసంయోగవియోగం, దుఃఖైః సంయోగః దుఃఖసంయోగః, తేన వియోగః దుఃఖసంయోగవియోగః, తం దుఃఖసంయోగవియోగం, యోగః ఇత్యేవ సంజ్ఞితం విపరీత లక్షణేన విద్యాత్ విజానీయాత్ ఇత్యర్థః. యోగఫలమ్ ఉపసంహృత్య పునః అన్వారమ్భేణ యోగస్య కర్తవ్యతా ఉచ్యతే నిశ్చయాఽనిర్వేదయోః యోగసాధనత్వ విధానార్థం. సః యథోక్తఫలః యోగః నిశ్చయేన అధ్యవసాయేన యోక్తవ్యః అనిర్విణ్ణచేతసా, న నిర్విణ్ణమ్ అనిర్విణ్ణమ్, అనిర్విణ్ణం కిం తత్? చేతః తేన, నిర్వేద రహితేన చేతసా చిత్తేన ఇత్యర్థః. కించ–**

**తె.అ.** దుఃఖంతో సంయోగం దుఃఖ సంయోగం. దాన్ని వదిలించుకోవడమే దుఃఖ సంయోగ వియోగం. దానికే యోగమని పేరు. దానిని సంయోగ వియోగమనే విపరీత లక్షణంచేత తెలుసుకోవలెను. యోగఫలం గురించి చెపుతున్న విషయాన్ని ముగిస్తూ యోగసాధన చేయవలెనని మళ్ళీ చెపుతున్నాడు, నిశ్చయము, అనిర్వేదము యోగసాధనాలుగా విధిస్తూ, పై చెప్పిన ఫలమిచ్చే యోగాన్ని నిశ్చయంతో, విసుగుదల, నిరుత్సాహములేని మనసుతో సాధన చేయవలెను అని. ఇంకా –

**మూ. సంకల్పప్రభవాన్ కామాంస్త్యక్త్వా సర్వానశేషతః ।**
**మనసైవేన్ద్రియగ్రామం వినియమ్య సమన్తతః ॥ 24**

**తె.అ.** సంకల్పం నుండి పుట్టే కోరికలనన్నిటిని నిశ్శేషంగా వదలిపెట్టి ఇంద్రియ సముదాయాన్ని అన్నివైపుల మనసుచేత నియమించి–

**భాష్యమ్ : 24.1 సంకల్ప ఇతి. సంకల్ప ప్రభవాన్ – సంకల్పః ప్రభవః యేషాం కామానాం తే సంకల్ప ప్రభవాః కామాః, తాన్, త్యక్త్వా పరిత్యజ్య, సర్వాన్ అశేషణ నిర్లేపేన, కిం చ – మనసైవ వివేకయుక్తేన, ఇన్ద్రియగ్రామమ్ ఇన్ద్రియ సముదాయం వినియమ్య నియమనం కృత్వా సమన్తతః సమన్తాత్.**

**తె.అ.** సంకల్పం వల్ల కలిగిన కోరికలనన్నిటినీ నిశ్శేషంగా వాసన కూడా మిగలకుండా పరిత్యజించి వివేకం కలిగిన మనసుతో ఇంద్రియ సముదాయాన్ని అన్నివైపులనుండి నియమించి–

**మూ. శనైః శనైరుపరమేద్బుద్ధ్యా ధృతిగృహీతయా ।**
**ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చిన్తయేత్ ॥ 25**

**తె.అ.** బుద్ధిధైర్యంతో నెమ్మది నెమ్మదిగా ఉపరతిని పొందవలెను. మనసును ఆత్మయందు నిలిపి మరి దేనిని గురించి చింతించరాదు.

**భాష్యమ్ : 25.1 శనైరితి. శనైః శనైః, న సహసా, ఉపరమేత్ ఉపరతిం కుర్యాత్, కయా? బుద్ధ్యా, కిం విశిష్టయా? ధృతి గృహీతయా–ధృత్యా ధైర్యేణ గృహీతయా ధృతి గృహీతయా, ధైర్యేణ యుక్తయా ఇత్యర్థః. ఆత్మసంస్థమ్ ఆత్మని సంస్థితమ్, "ఆత్మైవ సర్వం, న తతః అన్యత్ కించిత్ అస్తి" ఇత్యేవమ్ ఆత్మసంస్థం, మనః కృత్వా న కించిదపి చిన్తయేత్. ఏష యోగస్య పరమః విధిః.**

**తె.అ.** నెమ్మది నెమ్మదిగా, హఠాత్తుగా కాదు, ఉపరతిని పొందవలెను. (విషయవస్తువుల నుండి వెనుకకు మరలడమే ఉపరతి. ఎండమావిలో నీరువలె సంసారంలో సారం ఇంకిపోయినపుడు ఉపరతి.) దేని సాయం చేత? బుద్ధిచేత. ఎటువంటి బుద్ధిచేత? ధైర్యంతో కూడిన బుద్ధిచేత. మనసును ఆత్మయందు నిలిపి, 'ఆత్మయే సర్వము దానికంటె వేరొకటి ఏదీ లేదు' అని మరి దేనిని గూర్చి చింతించరాదు. ఇది యోగంలో పరమవిధి.

**భాష్యమ్ : 26.0 తత్రైవమ్ ఆత్మసంస్థం మనః కర్తుం ప్రవృత్తః యోగీ–**

**తె.అ.** ఈ విధంగా మనసును ఆత్మయందు నిలుపవలెనని ప్రయత్నించే యోగి–

**మూ. యతో యతో నిశ్చరతి మనశ్చఞ్చలమస్థిరమ్ ।**
**తతస్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేత్ ॥ 26**

**తె.అ.** చంచలము, అస్థిరము అయిన మనసు ఏ యే విషయాలవైపు పరుగిడుతుందో, ఆయా విషయాలనుంచి దానిని మళ్ళించి మళ్ళీ ఆత్మయందు స్థిరంగా ఉండేటట్లు చూడాలి.

**భాష్యమ్ : 26.1 యతో ఇతి. యతః యతః యస్మాత్ యస్మాత్ నిమిత్తాత్ శబ్దాదేః, నిశ్చరతి నిర్గచ్ఛతి, స్వాభావిక దోషాత్, మనః, చఞ్చలమ్ అత్యర్థం చలమ్, అత ఏవ అస్థిరం, తతః తతః తస్మాత్ తస్మాత్ శబ్దాదేః నిమిత్తాత్, నియమ్య, తత్తత్ నిమిత్తం యాథాత్మ్యనిరూపణేన ఆభాసీకృత్య వైరాగ్యభావనయా చ, ఏతత్ మనః ఆత్మన్యేవ వశం నయేత్ ఆత్మవశ్యతామ్ ఆపాదయేత్. ఏవం యోగాభ్యాసబలాత్ యోగినః ఆత్మన్యేవ ప్రశామ్యతి మనః.**

**తె.అ.** స్వాభావిక దోషంచేత మనసు చంచలము, కనుక అస్థిరము. అది శబ్దాది విషయాలవైపు ఎటువెడితే అటునుండి నియమించి, ఆ యా విషయాల అసలు స్వరూపం నిరూపించి, అవి కేవలం ఆభాస మాత్రమేనని యథార్థంలో లేవని చూపి వైరాగ్యభావనచేత మనసును ఆత్మవశం చేయవలెను. ఈ విధంగా యోగాభ్యాస బలం చేత యోగి మనసు ఆత్మయందే శాంతిని పొందుతుంది.

**మూ. ప్రశాన్తమనసం హ్యేనం యోగినం సుఖముత్తమమ్ ।**
**ఉపైతి శాన్తరజసం బ్రహ్మభూతమకల్మషమ్ ॥ 27**

**తె.అ.** మనుస్సులోని మోహములన్నీ తొలగిపోయి, ప్రశాంతమైన మనసుగల యోగి బ్రహ్మమే అయి ఉత్తమ సుఖం పొందుతాడు.

**భాష్యమ్ : 27.1 ప్రశాన్త ఇతి. ప్రశాన్తమనసం ప్రకర్షేణ శాన్తం మనః యస్య సః ప్రశాన్త-మనాః, తం ప్రశాన్తమనసమ్, హి ఏనం యోగినం, సుఖమ్, ఉత్తమం నిరతిశయమ్, ఉపైతి ఉపగచ్ఛతి. శాన్తరజసం ప్రక్షీణమోహాది క్లేశరజసమ్ ఇత్యర్థః. బ్రహ్మభూతం జీవన్ముక్తం, "బ్రహ్మైవ సర్వమ్" ఇత్యేవం నిశ్చయవన్తం బ్రహ్మ భూతమ్, అకల్మషం అధర్మాదివర్జితమ్.**

**తె.అ.** ప్రశాంతమైన మనసుగల యోగి నిరతిశయసుఖం పొందుతాడు. అతనికి మోహాది క్లేశాలను కలిగించే రజస్సు క్షయమవుతుంది. అతడు బ్రహ్మమే అన్న భావన కలిగి జీవన్ముక్తుడు అవుతాడు. 'అంతా బ్రహ్మమే' అనే నిశ్చయం కలవాడు బ్రహ్మభూతుడు. అతడు కల్మషంలేనివాడు, పాపరహితుడు.

**మూ. యుఞ్జన్నేవం సదాஉஉత్మానం యోగీ విగతకల్మషః ।**
**సుఖేన బ్రహ్మసంస్పర్శమత్యన్తం సుఖమశ్నుతే ॥ 28**

**తె.అ.** ఈ విధంగా పాపరహితుడైన యోగి ఎల్లప్పుడు ఆత్మను ఏకాగ్రం చేస్తూ అనాయాసంగా బ్రహ్మ సంస్పర్శమనే నిరతిశయ సుఖాన్ని పొందుతాడు.

**భాష్యమ్ : 28.1 యుఞ్జన్నితి. యుఞ్జన్ ఏవం యథోక్తేన క్రమేణ, యోగీ, యోగాన్తరాయవర్జితః సదా సర్వదా ఆత్మానం, విగతకల్మషః చ విగతపాపః, సుఖేన అనాయాసేన, బ్రహ్మసంస్పర్శం బ్రహ్మణా పరేణ సంస్పర్శః యస్య తత్ బ్రహ్మసంస్పర్శం, సుఖమ్, అత్యన్తమ్ అన్తమ్ అతీత్య వర్తతే ఇతి అత్యన్తమ్, ఉత్కృష్టం, నిరతిశయమ్, సుఖం అశ్నుతే వ్యాప్నోతి.**

**తె.అ.** పైన చెప్పిన ప్రకారం ఆత్మయందు స్థిరుడై యోగ సాధనలో అంతరాయమేమీ లేక పాపాలు తొలగి అనాయాసంగా అత్యంత బ్రహ్మసంస్పర్శసుఖం పొందుతాడు. అంతమును దాటినది అత్యంతము. అంటే ఉత్కృష్టము. నిరతిశయమునైనది.

**భాష్యమ్ : 29.0 ఇదానీం యోగస్య యత్ఫలం బ్రహ్మైకత్వదర్శనం సర్వసంసారవిచ్ఛేదకారణం తత్ ప్రదర్శ్యతే.**

**తె.అ.** ఇప్పుడు సర్వసంసార విచ్ఛేద కారణమైన బ్రహ్మైకత్వ దర్శనమనే యోగఫలం ప్రదర్శిస్తున్నాడు -

**మూ. సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని ।**
**ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥ 29**

**తె.అ.** అన్నిటా సమదృష్టి కల యోగి సర్వభూతములయందున్న తనను, తనయందు సర్వభూతములను చూస్తాడు.

**భాష్యమ్ : 29.1 సర్వ ఇతి. సర్వభూతస్థం సర్వేషు భూతేషు స్థితం స్వమ్ ఆత్మానమ్, సర్వభూతాని చ ఆత్మని బ్రహ్మాదీని స్తమ్బపర్యన్తాని చ సర్వభూతాని ఆత్మని ఏకతాం గతాని ఈక్షతే పశ్యతి, యోగయుక్తాత్మా సమాహితాన్తఃకరణః, సన్ సర్వత్ర సమదర్శనః సర్వేషు బ్రహ్మాదిస్థావరాన్తేషు విషమేషు సర్వభూతేషు, సమం నిర్విశేషం బ్రహ్మాత్మైకత్వ విషయం దర్శనం జ్ఞానం యస్య సః సర్వత్ర సమదర్శనః.**

**తె.అ.** సర్వభూతములయందు ఉన్న తనను, తనయందు ఏకత్వం పొందిన బ్రహ్మ మొదలు గడ్డిపరకవరకు సర్వభూతములను చూస్తాడు. యోగయుక్తాత్ముడు అంటే చిత్తాన్ని ఏకాగ్రం చేసినవాడు. అన్నిటా సమదృష్టి గలవాడు అంటే బ్రహ్మ మొదలు గడ్డిపరక వరకు నానావిధాలైన భూతములన్నిటి యందు విశేషమేమీ చూడక ఒకే బ్రహ్మమును చూడగలవాడు, బ్రహ్మము ఆత్మ ఒకటే అనే జ్ఞానం కలిగినవాడు, సమదర్శనుడు.

**భాష్యమ్ : 30.0 ఏతస్యైవ ఆత్మైకత్వదర్శనస్య ఫలమ్ ఉచ్యతే –**

**తె.అ.** ఆత్మ ఒక్కటే అని దర్శించడం వల్ల ఫలం చెపుతున్నాడు –

**మూ. యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి ।**
**తస్యాఽహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి ॥ 30**

**తె.అ.** అన్నిటా నన్ను, నాయందు అన్నిటిని చూచేవానికి నేను లేకపోవడమన్నది లేదు, నాకతడు లేకపోవడమన్నది లేదు.

**భాష్యమ్ : 30.1 య ఇతి. యః మాం పశ్యతి వాసుదేవం, సర్వస్య ఆత్మానం, సర్వత్ర సర్వేషు భూతేషు, సర్వం చ బ్రహ్మాది భూతజాతం మయి సర్వాత్మని పశ్యతి తస్య ఏవమ్ ఆత్మైకత్వ–దర్శినః, అహమ్ ఈశ్వరః, న ప్రణశ్యామి న పరోక్షతాం గమిష్యామి. స చ మే న ప్రణశ్యతి, స చ విద్వాన్ మమ వాసుదేవస్య న ప్రణశ్యతి న పరోక్షీభవతి, తస్య చ మమ చ ఏకాత్మత్వాత్. స్వాత్మా హి నామ ఆత్మనః ప్రకాశః ఏవ (ప్రియః) భవతి, యస్మాచ్చ అహమేవ సర్వాత్మైకత్వదర్శీ ఇత్యేతత్.**

**తె.అ.** అన్నిటికి ఆత్మనైన నన్ను వాసుదేవుని సమస్తభూతములయందు దర్శించినవానికి, బ్రహ్మ మొదలు సర్వప్రాణి సముదాయాన్ని సర్వాత్మయైన నా యందు చూచేవానికి, అంటే ఆత్మైకత్వం దర్శించినవానికి నేను అంటే ఈశ్వరుడను ఎప్పుడూ నశించను, కనిపించకుండా ఉండను. అతడు కూడా నాకు నశించడు, ఆ విద్వాంసుడు వాసుదేవుడైన నాకు దూరం కాడు. అతనిది నాది ఒకటే ఆత్మ కనుక – తన ఆత్మే కదా తనకు ప్రియమైనది! (ప్రియమైనదానిని ఎవడు దూరం చేసుకుంటాడు?)

**భాష్యమ్ : 31.0 పూర్వ శ్లోకార్థం సమ్యగ్దర్శనమనూద్య తత్ఫలం మోక్షః అభిధీయతే–**

**తె.అ.** వెనుకటి శ్లోకంలో చెప్పిన సమ్యగ్దర్శనాన్ని అంటే అందరి ఆత్మలను ఒకటిగా చూచేది నేనే అన్న అర్థాన్ని మళ్ళీ చెపుతూ దానికి ఫలమైన మోక్షం చెపుతున్నాడు –

**మూ. సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః ।**
**సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే ॥ 31**

**తె.అ.** అంతటా అన్నిటా ఉన్నదొకటే ఆత్మ అన్న భావంలో నిలిచి సర్వభూతములయందున్న నన్ను కొలిచే యోగి ఏ విధంగా ప్రవర్తించినా నా యందే ఉంటాడు.

**భాష్యమ్ : 31.1 సర్వ ఇతి. సర్వథా సర్వప్రకారైః వర్తమానః అపి సమ్యగ్దర్శీ యోగీ మయి వైష్ణవే పరమే పదే, వర్తతే, నిత్యముక్తః ఏవ సః న మోక్షం ప్రతి కేనచిత్ ప్రతిబధ్యతే ఇత్యర్థః.**

**తె.అ.** సర్వవిధాలా ప్రవర్తించినప్పటికి సమ్యగ్దర్శియైన యోగి నాయందు అంటే పరమ వైష్ణవపదమందు ఉంటాడు. అతడు నిత్యముక్తుడు. అతని మోక్షానికి ఏదీ అడ్డురాదు అని అర్థం.

**భాష్యమ్ : 32.0 కిం చాన్యత్ –**

**తె.అ.** అంతేకాదు –

**మూ. ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున ।**
**సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః ॥ 32**

**తె.అ.** అర్జునా! సమస్త ప్రాణుల సుఖదుఃఖాలు, తన సుఖదుఃఖాలుగా భావించేవాడు పరమయోగి.

**భాష్యమ్ : 32.1 ఆత్మౌపమ్యేనేతి. ఆత్మౌపమ్యేన – ఆత్మా స్వయమ్ ఏవ ఉపమీయతే (అనయా) ఇతి ఉపమా. తస్యాః ఉపమాయాః భావః ఔపమ్యమ్. తేన ఆత్మౌపమ్యేన, సర్వత్ర సర్వభూతేషు, సమం తుల్యమ్, పశ్యతి యః అర్జున, సః చ కిం సమం పశ్యతీతి? ఉచ్యతే – యథా మమ సుఖమ్ ఇష్టం తథా సర్వప్రాణినాం సుఖమ్ అనుకూలమ్. వాశబ్దః చార్థే. యది వా యచ్చ దుఃఖం మమ ప్రతికూలమ్ అనిష్టం యథా, తథా సర్వప్రాణినాం దుఃఖం అనిష్టం ప్రతికూలమ్. ఇత్యేవమ్, ఆత్మౌపమ్యేన సుఖదుఃఖే అనుకూల ప్రతికూలే తుల్యతయా సర్వభూతేషు సమం పశ్యతి, న కస్యచిత్ ప్రతికూలమ్ ఆచరతి అహింసకః ఇత్యర్థః. యః ఏవమ్ అహింసకః సమ్యగ్దర్శననిష్ఠః సః యోగీ పరమః ఉత్కృష్టః, మతః, అభిప్రేతః సర్వయోగినాం మధ్యే.**

**తె.అ.** సర్వభూతముల సుఖము దుఃఖములు తనవిగా భావించేవాడు సర్వభూతములను సమంగా చూచేవాడు పరమయోగి. సమంగా ఏం చేస్తాడు? నాకిష్టమైనది సర్వప్రాణులకు సుఖము, అనుకూలము; నాకు కష్టము, ప్రతికూలము అయినది సర్వప్రాణులకు కష్టము, అనిష్టము, ప్రతికూలము అని; తనకు వలెనే అందరికీ అనుకూల ప్రతికూలాలు అవి సర్వప్రాణులకు సమానము అని తెలిసి, అహింసకుడు ఎవనికీ ప్రతికూలముగా ఏదీ చేయడు అని అర్థం. ఈ విధమైన సమ్యగ్దర్శన నిష్ఠ కలిగిన అహింసకుడు యోగులందరిలో శ్రేష్ఠుడు.

**భాష్యమ్ : 33.0. ఏతస్య యథోక్తస్య సమ్యగ్దర్శన లక్షణస్య యోగస్య దుఃఖసంపాద్యతాం ఆలక్ష్య శుశ్రూషుః (ధ్రువమ్) తత్ ప్రాప్త్యుపాయమ్ అర్జునః ఉవాచ,**

**తె.అ.** ఈ విధమైన సమ్యగ్దర్శనయోగం ఎంత కష్టసాధ్యమైనదో గుర్తించి, దాన్ని పొందే ఉపాయం తెలుసుకోవలెనని అర్జునుడు అంటున్నాడు –

**అర్జున ఉవాచ –**

**మూ. యోఽయం యోగస్త్వయా ప్రోక్తః సామ్యేన మధుసూదన ।**
**ఏతస్యాహం న పశ్యామి చఞ్చలత్వాత్ స్థితిం స్థిరామ్ ॥ 33**

అర్జునుడంటున్నాడు–

**తె.అ.** మధుసూధనా! నీవు చెప్పిన ఈ సమ్యగ్దర్శనమైన యోగాన్ని, దాని యొక్క స్థిరస్థితిని మనోచాంచల్యం కారణాన నేను చూడలేకపోతున్నాను.

**భాష్యమ్ : 33.1 యోఽయమితి. యః అయం యోగః త్వయా ప్రోక్తః సామ్యేన సమత్వేన, హే! మధుసూదన ! ఏతస్య యోగస్య, అహం, న పశ్యామి న ఉపలభే చఞ్చలత్వాత్ మనసః, కిమ్? స్థిరామ్ అచలాం, స్థితిమ్.**

**తె.అ.** మధుసూదనా! నీవు చెప్పిన ఈ సామ్యయోగం యొక్క అచలస్థితిని మనసు చంచలం కావడంచేత నేను తెలియలేకున్నాను.

**భాష్యమ్ : 34.0 ప్రసిద్ధం ఏతత్–**

**తె.అ.** ఇది అందరికీ తెలిసినదే.

**మూ. చఞ్చలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్ ।**
**తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్ ॥ 34**

**తె.అ.** కృష్ణా! మనసు నిజంగా చంచలమైనది, క్షోభపెట్టేది, బలమైనది, దృఢమైనది. దాన్ని నిగ్రహించడం వాయువును నిగ్రహించడం వంటిది, చాలా కష్టసాధ్యమని నాకనిపిస్తుంది.

**భాష్యమ్ : 34.1 చఞ్చలమితి – చఞ్చలం హి మనః 'కృష్ణే'తి కృషతేః విలేఖనార్థస్య రూపమ్, భక్తజనపాపాది దోషాకర్షణాత్ కృష్ణః. తస్య సంబుద్ధిః హే కృష్ణ. హి యస్మాత్ మనః చంచలం న కేవలమ్ అత్యర్థం చఞ్చలం, ప్రమాథి చ ప్రమథనశీలం, ప్రమథ్నాతి శరీరమ్ ఇన్ద్రియాణి చ విక్షిపతి, సత్ పరవశీ కరోతి. కిం చ బలవత్, న కేన చిత్ నియన్తుం శక్యమ్. దుర్నివారత్వాత్ కిం చ దృఢం తన్తునాగవత్ అచ్ఛేద్యం, తస్య ఏవంభూతస్య మనసః, అహం, నిగ్రహం నిరోధం, మన్యే, వాయోరివ – యథా వాయోః దుష్కరః నిరోధః తతోఽపి మనసః దుష్కరం మన్యే ఇత్యభిప్రాయః**

**తె.అ.** కృష్ణా–కృష్ణ అనే శబ్దం కృష్ ధాతువునుండి వచ్చింది. 'కోసివేయుట' అని దానికర్థం. భక్తజనుల పాపాది దోషాలను నివృత్తి చేస్తాడు. కనుక ఆయనకు కృష్ణుడు అనిపేరు. కనుక కృష్ణా అనే సంబోధన. మనసు చంచలమైనది. కేవలం అతి చంచలమే కాదు ప్రమథనశీలమైనది కూడా. శరీరాన్ని ఇంద్రియాలను కలవరపరచి పరవశం చేస్తుంది. అంతేకాదు బలమైనది, దేనిచేత నియమించశక్యం గానిది, నివారించడం కష్టసాధ్యం కనుక. ఇంకా, దృఢమైనది, తంతునాగం (సముద్రంలో సంచరించే త్రాడు వలె ఉండే అతి బలం కల ఒక జంతువు. దీనికి వరుణపాశం అని కూడా పేరు.) వలె ఛేదింపరానిది. ఇటువంటి మనసును నిగ్రహించడం, నిరోధించడం గాలిని నిరోధించడం వంటిది. గాలిని నిరోధించడం దుష్కరం. అంతకంటే కూడా దుష్కరం మనసును నిరోధించడం అని నాకనిపిస్తుంది. ఇది నా అభిప్రాయం.

**భాష్యమ్ : 35.0 శ్రీ భగవానువాచ – ఏవం ఏతత్ యథా బ్రవీషి–**

**తె.అ.** అవును, అది నీవు చెప్పినటువంటిదేనని – శ్రీ భగవానుడు అంటున్నాడు.

**శ్రీభగవానువాచ–**

**మూ. అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్ ।**
**అభ్యాసేన తు కౌన్తేయ వైరాగ్యేణ చ గృహ్యతే ॥ 35**

శ్రీ భగవానుడంటున్నాడు.

**తె.అ.** వీరుడా! నిస్సంశయంగా మనసు చంచలం. దాన్ని నిగ్రహించడం కష్టం. కానీ అర్జునా దాన్ని అభ్యాస వైరాగ్యాలచేత నిగ్రహించవచ్చు.

**భాష్యమ్ : 35.1 అసంశయమితి. అసంశయం నాస్తి సంశయః మనః దుర్నిగ్రహం చలమ్ ఇత్యత్ర. హే, మహాబాహో! కింతు, అభ్యాసేన తు అభ్యాసో నామ చిత్తభూమౌ కస్యాం చిత్ సమాన ప్రత్యయా వృత్తిః చిత్తస్య. వైరాగ్యం నామ దృష్టాదృష్ట భోగేషు దోషదర్శనాభ్యాసాత్ వైతృష్ణ్యం, తేన చ వైరాగ్యేణ గృహ్యతే విక్షేపరూపః ప్రచారః చిత్తస్య. ఏవం తత్ మనః గృహ్యతే నిగృహ్యతే, నిరుధ్యతే ఇత్యర్థః.**

**తె.అ.** ఓ వీరుడా! మనసు నిగ్రహించడం కష్టమన్నదానిలో సందేహం లేదు. అయినప్పటికీ అభ్యాసం చేత వైరాగ్యంచేత, ఆ మనసును నిగ్రహించవచ్చు, అంటే నిరోధించవచ్చు. అభ్యాసం అంటే ఏదో ఒక ధ్యానవిషయ వస్తువునందు ఒకే భావాన్ని మరల మరల ఆవృత్తి చేయడం. వైరాగ్యమంటే ఇహపర లోక భోగాలయందు గల దోషాలను తెలుసుకోవడం అభ్యాసం చేసినందువల్ల కలిగే వైతృష్ణ్యం, తృష్ణ తొలగిపోవడం, కోరిక రాలిపోవడం. ఈ విధంగా, అభ్యాస వైరాగ్యాలచేత, మనసును వశంలోకి తెచ్చుకోవచ్చు.

**భాష్యమ్ : 36.0 యః పునః అసంయతాత్మా, తేన –**

**తె.అ.** ఇక ఆత్మసంయమం లేనివాని విషయం –

**మూ. అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః ।**
**వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః ॥ 36**

**తె.అ.** ఆత్మసంయమనం లేనివానికి యోగం ప్రాప్తించడం కష్టమని నా అభిప్రాయం. మనసును వశం చేసుకున్నవాడు మాత్రం యత్నిస్తే ఉపాయంతో దాన్ని పొందగలడు.

**భాష్యమ్ : 36.1 అసంయతాత్మనా ఇతి. అసంయతాత్మనా అభ్యాస వైరాగ్యాభ్యామ్ అసంయతః ఆత్మా అన్తఃకరణం యస్య సః అయమ్ అసంయతాత్మా, తేన అసంయతాత్మనా యోగః దుష్ప్రాపః దుఃఖేన ప్రాప్యతే ఇతి మే మతిః. యః తు పునః వశ్యాత్మా అభ్యాస వైరాగ్యాభ్యాం వశ్యత్వమ్ ఆపాదితః ఆత్మా మనః యస్య సః అయం వశ్యాత్మా. తేన వశ్యాత్మనా తు యతతా భయోఽపి ప్రయత్నం కుర్వతా, శక్యః అవాప్తుం యోగః, ఉపాయతః యథోక్తాత్ ఉపాయాత్.**

**తె.అ.** అభ్యాస వైరాగ్యాలచేత అంతఃకరణాన్ని నియమించని వానికి, యోగం ప్రాప్తించడం కష్టమని నా అభిప్రాయం. అభ్యాస వైరాగ్యాల చేత మనసును వశం చేసుకున్నవానికి మాత్రం, వదలక యత్నించినట్లయితే ఇప్పుడు చెప్పిన మార్గంలో యోగం ప్రాప్తించడం సాధ్యమే.

**భాష్యమ్ : 37.0 తత్ర యోగాభ్యాసాఙ్గీకరణేన ఇహలోక పరలోకప్రాప్తినిమిత్తాని కర్మాణి సంన్యస్తాని యోగసిద్ధి ఫలం చ మోక్షసాధనం సమ్యగ్దర్శనం న ప్రాప్తమ్ ఇతి, యోగీ యోగమార్గాత్ మరణకాలే చలితచిత్తః ఇతి తస్య నాశమ్ ఆశఙ్క్య –**

**తె.అ.** మరి, ఒకడు యోగాభ్యాసాన్ని స్వీకరించి ఇహపరలోక ప్రాప్తి నిమిత్తమైన కర్మలన్ని వదలివేశాడు; యోగసిద్ధికి ఫలము, మోక్షసాధనము అయిన సమ్యగ్దర్శనము కలుగలేదు; అటువంటి యోగి చిత్తం మరణకాలంలో యోగం నుండి చలించి అతడు నాశనమవుతాడు అనే సందేహం కలిగి – అర్జునుడు అడుగుతున్నాడు.

**అర్జున ఉవాచ –**

**మూ. అయతిః శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః ।**
**అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి ॥ 37**

**అర్జునుడు అడుగుతున్నాడు –**

**తె.అ.** కృష్ణా! శ్రద్ధ ఉండి కూడా ప్రయత్నలోపం చేత యోగంనుండి మనసు చలించి యోగసిద్ధి పొందని వాని గతి ఏమి?

**భాష్యమ్ : 37.1 అయతిరితి. అయతిః అప్రయత్నవాన్ యోగమార్గే, శ్రద్ధయా ఆస్తిక్యబుద్ధ్యా చ ఉపేతః, యోగాత్ అన్తకాలేఽపి చలితం మానసం మనః యస్య సః చలితమానసః భ్రష్టస్మృతిః సః అప్రాప్య యోగసంసిద్ధిం యోగఫలం సమ్యగ్దర్శనం కాం గతిం హే కృష్ణ గచ్ఛతి?**

**తె.అ.** అయతి అంటే యోగంలో తగినంత యత్నం చేయనివాడు. శ్రద్ధ అంటే ఆస్తిక్య బుద్ధి. శ్రద్ధ ఉండికూడా యత్నలోపంచేత అంత్యకాలంలో మనసు చలించి భ్రష్టుడై యోగసిద్ధిని పొందలేక అంటే యోగఫలమైన సమ్యగ్దర్శనం పొందలేనివాడు ఏమవుతాడు?

**మూ. కచ్చిన్నోభయవిభ్రష్టశ్ఛిన్నాభ్రమివ నశ్యతి ।**
**అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి ॥ 38**

**తె.అ.** అతడు ఉభయభ్రష్టుడై బ్రహ్మపథంలో దారితప్పి నిలువనీడలేక చెల్లాచెదరైన మబ్బువలె నాశనం కాడా?

**భాష్యమ్ : 38.1 కచ్చిత్ ఇతి– కచ్చిత్ కిమ్, న ఉభయవిభ్రష్టః కర్మమార్గాత్ యోగమార్గాచ్చ విభ్రష్టః సన్, ఛిన్నాభ్రమ్ ఇవ, నశ్యతి, కిం వా న నశ్యతి, అప్రతిష్ఠః నిరాశ్రయః హే మహాబాహో! విమూఢః సన్, బ్రహ్మణః పథి బ్రహ్మ ప్రాప్తి మార్గే.**

**తె.అ.** ఉభయవిభ్రష్టుడు అంటే కర్మమార్గంలో యోగమార్గంలోను భ్రష్టుడు, రెంటికి చెడినవాడు, చెల్లాచెదురైన మబ్బువలె నాశనం కాడా? అప్రతిష్ఠుడు అంటే నిరాశ్రయుడు నిలువ నీడలేనివాడు బ్రహ్మపథంలో విమూఢుడు, బ్రహ్మమును చేరుకునే మార్గంలో దిక్కుతోచనివాడు.

**మూ. ఏతన్మే సంశయం కృష్ణ ఛేత్తుమర్హస్యశేషతః ।**
**త్వదన్యః సంశయస్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే ॥ 39**

**తె.అ.** కృష్ణా! ఈ నా సంశయాన్ని పూర్తిగా తొలగించు. నీవు తప్ప ఈ సంశయాన్ని తొలగించగలవాడు మరొకడు లేదు.

**భాష్యమ్ : 39.1 ఏతదితి :– ఏతత్ మే మమ సంశయం, కృష్ణ, ఛేత్తుమ్ అపనేతుమ్, అర్హసి, అశేషతః, త్వదన్యః, త్వత్తః అన్యః ఋషిః దేవః వా, ఛేత్తా నాశయితా సంశయస్య అస్య న హి యస్మాత్, ఉపపద్యతే న సంభవతి. అతః త్వమేవ ఛేత్తుమ్ అర్హసి ఇత్యర్థః.**

**తె.అ.** కృష్ణా, యీ నా సంశయాన్ని పూర్తిగా ఛేదించవలెను, తొలగించవలెను. నీవు తప్ప మరొకడు ఋషిగాని దేవతగాని ఈ సంశయాన్ని నిర్మూలించగలవాడు లేడు కనుక నీవే దీన్ని తొలగించవలెను, అని అర్థం.

**శ్రీ భగవానువాచ –**

**మూ. పార్థ నైవేహ నాముత్ర వినాశస్తస్య విద్యతే ।**
**న హి కల్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి ॥ 40**

శ్రీ భగవానుడు అంటున్నాడు

**తె.అ.** అర్జునా! ఈ లోకంలోగాని, పరలోకంలోగాని అతనికి నాశనం లేదు. శుభకార్యం చేసేవాడు దుర్గతిని పొందడు.

**భాష్యమ్ : 40.1 పార్థేతి – హే పార్థ! న ఏవ, ఇహ లోకే, న అముత్ర పరస్మిన్ వా లోకే, వినాశః తస్య విద్యతే నాస్తి. నాశః నామ పూర్వస్మాత్ హీనజన్మప్రాప్తిః. సః తస్య యోగభ్రష్టస్య నాస్తి. న హి యస్మాత్, కల్యాణకృత్ శుభకృత్, కశ్చిత్, దుర్గతిం కుత్సితాం గతిం, హే తాత! తనోత్యాత్మానం పుత్రరూపేణ ఇతి పితా తాతః ఉచ్యతే, పితైవ పుత్రః ఇతి పుత్రోఽపి తాతః ఉచ్యతే; శిష్యోఽపి పుత్రవత్ ఇతి అపుత్రోఽపి తాతః ఉచ్యతే. యతః న గచ్ఛతి.**

**తె.అ.** అర్జునా, ఈ లోకంలోగాని, పరలోకంలోగాని అతనికి వినాశం లేదు. నాశము అంటే మునుపటి కంటే హీనజన్మ కలగడం. యోగభ్రష్టుడికి అది లేదు. ఎందుకంటే కల్యాణకరమైన కర్మ అంటే శుభం కలిగించే కర్మ చేసేవానికి దుర్గతి, హీనమైన గతి కలుగదు. 'తాత' (అని సంబోధన) అంటే తండ్రి అని అర్థం. తండ్రి పుత్రరూపంలో పుడతాడు కనుక పుత్రుని తాత అంటారు. తండ్రియే తన కొడుకని, కొడుకుని తండ్రి అని పిలుస్తారు. శిష్యుడు కూడా కొడుకువంటివాడే కనుక కొడుకు కాకపోయినా అతనిని కూడా తండ్రి అని పిలుస్తారు.

**భాష్యమ్ : 41.0 కిం తు అస్య భవతి?**

**తె.అ.** మరి అతడు ఏమవుతాడు అంటే, –

**మూ. ప్రాప్య పుణ్యకృతాం లోకానుషిత్వా శాశ్వతీః సమాః ।**
**శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే ॥ 41**

**తె.అ.** పుణ్యలోకాలను చేరి అనేక సంవత్సరాలు అక్కడ వాసం చేసి యోగభ్రష్టుడు, శుచులు శ్రీమంతులు అయినవారి ఇంట పుడతాడు.

**భాష్యమ్ : 41.1 ప్రాప్య ఇతి. యోగమార్గే ప్రవృత్తః సంన్యాసీ, సామర్థ్యాత్, ప్రాప్య గత్వా, పుణ్యకృతామ్ అశ్వమేధాది యాజినాం లోకాన్, తత్ర చ, ఉషిత్వా వాసమ్ అనుభూయ, శాశ్వతీః నిత్యాః సమాః సంవత్సరాన్, తద్భోగక్షయే శుచీనామ్ యథోక్తకారిణాం శ్రీమతాం విభూతిమతాం గేహే గృహే యోగభ్రష్టః అభిజాయతే.**

**తె.అ.** యోగమార్గంలో ప్రవర్తించే యోగభ్రష్టుడైన సన్న్యాసి అశ్వమేధాది యాగాలు చేసినవారు వెళ్ళే పుణ్యలోకాలను చేరి అనేక సంవత్సరాలు అక్కడ వాసం చేసి భోగక్షయమైన తరువాత ఇంతకుముందు చెప్పిన వేదకర్మలాచరించే శుచులు శ్రీమంతులు అయినవారి ఇంట పుడతాడు. (సామర్థ్యాన్ని బట్టి అంటే ప్రస్తుత సందర్భాన్ని బట్టి ఇక్కడ అర్జునుని ప్రశ్న, కర్మలను వదలిన సన్న్యాసి గురించి అని గ్రహించవలెను. కర్మలాచరిస్తూ ఉండే గృహస్థును గురించి ఇటువంటి సందేహం కలగడానికి వీలులేదు. అతడు కర్మలాచరిస్తూనే ఉన్నాడు, చేస్తున్న కర్మలకు ఫలం తప్పక లభిస్తుంది కనుక అతడు రెంటికి చెడడమన్నది ఉండదు)

**మూ. అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్ ।**
**ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్ ॥ 42**

**తె.అ.** లేక ధీమతులైన యోగుల కుటుంబంలోనే పుడతాడు. లోకంలో ఇటువంటి జన్మ చాలా దుర్లభం.

**భాష్యమ్ : 42.1 అథవేతి - అథవా శ్రీమతాం కులాత్ అన్యస్మిన్ యోగినామేవ దరిద్రాణాం కులే భవతి జాయతే, ధీమతాం బుద్ధిమతామ్. ఏతత్ హి జన్మ, యత్ దరిద్రాణాం యోగినాం కులే, దుర్లభతరం దుఃఖలభ్యతరం, పూర్వమ్ అపేక్ష్య, లోకే జన్మ యత్ ఈదృశం యథోక్త విశేషణే కులే.**

**తె.అ.** అట్లా కాకుంటే - శ్రీమంతుల కుటుంబంలో కాకపోతే -దరిద్రులైన యోగులు బుద్ధిమంతులు అయిన (వశిష్ఠుడు అగస్త్యుడు వంటి) వారి కుటుంబంలోనే పుడుతాడు. దరిద్రులైన యోగుల కుటుంబంలో పుట్టడం వెనుకచెప్పిన జన్మకంటే లోకంలో చాలా అరుదైనది.

**భాష్యమ్ : 43.0 యస్మాత్ చ -**

ఆ కారణంగా కూడా -

**మూ. తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదేహికమ్ ।**
**యతతే చ తతో భూయః సంసిద్ధౌ కురునన్దన ॥ 43**

**తె.అ.** అక్కడ అతడు పూర్వజన్మ స్మృతి గలిగి పూర్వం కంటే ఎక్కువగా సిద్ధికొరకు యత్నం చేస్తాడు.

**భాష్యమ్ : 43.1 తత్ర ఇతి. తత్ర యోగినాం కులే తం, బుద్ధిసంయోగం బుద్ధ్యా సంయోగం బుద్ధిసంయోగం, లభతే పౌర్వదేహికం పూర్వస్మిన్ దేహే భవం పౌర్వదేహికం. యతతే చ ప్రయత్నం కరోతి, చ తతః తస్మాత్ పూర్వకృతాత్ సంస్కారాత్ భూయః బహుతరం, సంసిద్ధౌ సంసిద్ధి నిమిత్తం హే కురునన్దన!**

**తె.అ.** అక్కడ యోగుల కుటుంబంలో పూర్వదేహంలో కలిగిన బుద్ధితో, సంయోగం లభిస్తుంది. పూర్వం చేసుకున్న సంస్కారం చేత మరింత ఎక్కువగా సంసిద్ధికొరకు ప్రయత్నం చేస్తాడు.

**భాష్యమ్ : 44.0 కథం పూర్వదేహ బుద్ధిసంయోగః ఇతి? తత్ ఉచ్యతే–**

**తె.అ.** పూర్వదేహబుద్ధి ఇతనికి ఎట్లా కలుగుతుంది? అంటే–

**మూ. పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః ।**
**జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే ॥ 44**

**తె.అ.** పూర్వాభ్యాసబలం చేతనే, అవశుడైనప్పటికి, అతడు ఈడ్చుకొని పోబడుచున్నాడు. యోగం తెలుసుకోవలెననే కోరిక కలవాడు సైతము శబ్దబ్రహ్మాన్ని దాటిపోతున్నాడు.

**భాష్యమ్ : 44.1 పూర్వాభ్యాసేన ఇతి. యః పూర్వజన్మని కృతః అభ్యాసః సః పూర్వా–భ్యాసః, తేనైవ బలవతా హ్రియతే, సంసిద్ధౌ హి యస్మాత్, అవశః అపి, సః యోగభ్రష్టః; తేన కృతం చేత్ యోగాభ్యాసజాత్ సంస్కారాత్ బలవత్తరమ్ ధర్మాదిలక్షణం కర్మ, తదా యోగాభ్యాసజనితేన సంస్కారేణాహ్రియతే; అధర్మశ్చేద్బలవత్తరః కృతః, తేన యోగజః అపి సంస్కారః అభిభూయతే ఏవ, తత్ క్షయే తు యోగజః సంస్కారః స్వయమేవ కార్యమ్ ఆరభతే. న దీర్ఘకాలస్థస్యాపి వినాశః తస్య అస్తి ఇత్యర్థః. అతః జిజ్ఞాసుః అపి యోగస్య స్వరూపం జ్ఞాతుమ్ ఇచ్ఛన్ యోగమార్గే ప్రవృత్తః – సంన్యాసీ యోగభ్రష్టః, సామర్థ్యాత్, సః అపి, శబ్దబ్రహ్మ వేదోక్తకర్మానుష్ఠానఫలమ్ అతివర్తతే, అతిక్రామతి అపాకరిష్యతి, కిముత బుద్ధ్వా యః యోగం తన్నిష్ఠః అభ్యాసం కుర్యాత్.**

**తె.అ.** పూర్వజన్మలో చేసుకున్న అభ్యాసం పూర్వాభ్యాసం. పరవశుడైనప్పటికీ యోగభ్రష్టుడు ఆ పూర్వాభ్యాస బలం చేత సంసిద్ధివైపు నడిపించబడుతున్నాడు. యోగాభ్యాస సంస్కారం కంటె బలవత్తరమైన పాపకర్మలు చేయనట్లయితే యోగాభ్యాసం వల్ల కలిగిన సంస్కారం చేత నడిపించబడుతాడు. చేసిన పాపకర్మల బలం ఎక్కువయితే యోగం వల్ల కలిగిన సంస్కారం

అణగి ఉంటుంది. ఆ పాపకర్మల బలం క్షయం కాగానే యోగ సంస్కారం తన పని ప్రారంభిస్తుంది. ఎంత దీర్ఘకాలం అణగి ఉండినా అది నశించిపోదు. యోగస్వరూపం తెలుసుకోవలెననే కోరికతో యోగాభ్యాసం చేస్తూ యోగభ్రష్టుడైన సంన్యాసి కూడా – ఇక్కడ సందర్భాన్నిబట్టి 'సంన్యాసి' అని గ్రహించవలె – శబ్దబ్రహ్మాన్ని అతిక్రమిస్తున్నాడు. శబ్దబ్రహ్మము అంటే వేదోక్త కర్మానుష్ఠాన ఫలము. తెలుసుకోవలెననే కోరిక గలవాడే శబ్దబ్రహ్మాన్ని అతిక్రమించినపుడు, తెలిసి యోగనిష్ఠుడై అభ్యాసం చేసేవాని విషయం చెప్పవలసిందేముంది?

**భాష్యమ్ : 45.0 కుతశ్చ యోగిత్వం శ్రేయః ఇతి?**

**తె.అ.** యోగి లక్షణం ఎందుకు శ్రేష్ఠమైంది?

**మూ. ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః ।**
**అనేకజన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్ ॥ 45**

**తె.అ.** యోగి అధిక ప్రయత్నంతో అనేక జన్మల సంసిద్ధితో పాపాలను శుద్ధిచేసుకుని పరమగతిని పొందుతాడు.

**భాష్యమ్ : 45.1 ప్రయత్నాదితి. ప్రయత్నాత్ యతమానః అధికతరం యతమానః ఇత్యర్థః. తత్ర 'యోగీ' విద్వాన్ సంశుద్ధకిల్బిషః విశుద్ధ కిల్బిషః సంశుద్ధపాపః అనేక జన్మసంసిద్ధః అనేకేషు జన్మసు కించిత్ కించిత్ సంస్కారజాతమ్ ఉపచిత్య తేన ఉపచితేన అనేకజన్మకృతేన, సంసిద్ధః అనేక జన్మ సంసిద్ధః తతః లబ్ధ సమ్యగ్దర్శనః సన్ యాతి, పరాం ప్రకృష్టాం గతిమ్.**

**తె.అ.** ప్రయత్నంతో యత్నం చేసేవాడు అంటే అధికయత్నం చేసేవాడు అని అర్థం. ఆ యోగి విద్వాంసుడు అనేక జన్మలలో కొద్దికొద్దిగా సంస్కారం పోగుచేసుకుని ఆ విధంగా పోగయిన సంస్కారం చేత పాపాలను శుద్ధి చేసుకుని సమ్యగ్దర్శనం కలిగి పరమగతిని పొందుతాడు.

**భాష్యమ్ : 46.0 యస్మాత్ ఏవం తస్మాత్ –**

**తె.అ.** ఈ కారణంగా–

**మూ. తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః ।**
**కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున ॥ 46**

**తె.అ.** తపస్వుల కంటె, జ్ఞానులకంటె, కర్మిష్ఠుల కంటె, యోగి శ్రేష్ఠుడు అని అంటారు. కనుక, అర్జునా, నీవు యోగివి కమ్ము!

**భాష్యమ్ : 46.1 తపస్విభ్య ఇతి. తపస్విభ్యః అధికః యోగీ, జ్ఞానిభ్యః అపి, జ్ఞానమ్ అత్ర శాస్త్రార్థపాణ్డిత్యం, తద్వద్భ్యోఽపి మతః జ్ఞాతః, అధికః శ్రేష్ఠః ఇతి. కర్మిభ్యః, అగ్నిహోత్రాది కర్మ, తద్వద్భ్యః అధికః యోగీ విశిష్టః. యస్మాత్ తస్మాత్ యోగీ భవ అర్జున.**

**తె.అ.** తపస్వుల కంటె జ్ఞానులకంటె యోగి అధికుడు. ఇక్కడ జ్ఞానమంటే శాస్త్రపాండిత్యమని అర్థం. శాస్త్రపాండిత్యం కలవాని కంటె యోగి శ్రేష్ఠుడు అని అంటారు. అగ్నిహోత్రాది కర్మలు చేసేవారు కర్మిష్ఠులు. వారికంటె యోగి విశిష్టుడు. కనుక అర్జునా నీవు యోగివి కమ్ము!

**మూ. యోగినామపి సర్వేషాం మద్గతేనాన్తరాత్మనా ।**
**శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః ॥ 47**

**తె.అ.** యోగులలో కూడా నాయందు మనసు నిలిపి నన్నే శ్రద్ధతో సేవించేవాడు, అందరిలోకి శ్రేష్ఠుడైన యోగి అని నేననుకుంటాను.

**ఇతి శ్రీ మహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా-సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే ధ్యానయోగో నామ షష్ఠోఽధ్యాయః**

ఇది వ్యాసభగవానుని శతసహస్ర సంహిత అయిన శ్రీమహాభారతంలో భీష్మపర్వంలో ఉపనిషత్తులు బ్రహ్మవిద్య యోగశాస్త్రము శ్రీకృష్ణార్జున సంవాదము అయిన భగవద్గీతలయందు ధ్యానయోగమనే ఆరవ అధ్యాయానికి తెలుగు అనువాదం.

**భాష్యమ్ : 47.1 యోగినామితి - యోగినామపి సర్వేషాం రుద్రాదిత్యాది ధ్యానపరాణాం మధ్యే, మద్గతేన - మయి వాసుదేవే సమాహితేన, అన్తరాత్మనా, అన్తఃకరణేన, శ్రద్ధావాన్ శ్రద్దధానః సన్ భజతే సేవతే యః మాం, సః మే మమ యుక్తతమః అతిశయేన యుక్తః మతః అభిప్రేతః ఇతి.**

**తె.అ.** (దేవతలను ధ్యానించేవారు యోగులు) రుద్రుడు ఆదిత్యుడు మొదలైనవారిని ధ్యానించే యోగులలో కూడా, వాసుదేవుడనైన నా యందు మనసు నిలిపి శ్రద్ధతో నన్ను సేవించేవాడు, చాలా శ్రేష్ఠుడైన యోగి అని నా అభిప్రాయం.

**ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యగోవిన్దభగవత్పూజ్యపాదశిష్య శ్రీమచ్ఛంకరభగవతః కృతౌ శ్రీమద్భవద్గీతాభాష్యే ధ్యానయోగో నామ షష్ఠోఽధ్యాయః.**

ఇది శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య గోవిందభగవత్పూజ్యపాదశిష్యులు, శ్రీమత్ శంకరభగవత్పాదులు రచించిన శ్రీమద్భగవద్గీతాభాష్యంలో ధ్యానయోగమనే ఆరవ అధ్యాయానికి తెలుగు అనువాదం.



# సప్తమోఽధ్యాయః

# జ్ఞానవిజ్ఞాన యోగః

**భాష్యమ్ : 0.1 'యోగినామపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా. శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః' (6.47) ఇతి ప్రశ్నబీజం ఉపన్యస్య స్వయమేవ "ఈదృశం మదీయం తత్త్వం, ఏవం మద్గతాంతరాత్మా స్యాత్" ఇత్యేతత్ వివక్షుః శ్రీభగవాన్ ఉవాచ–**

**తె.అ.** 'యోగులలో కూడా నాయందు మనసు నిలిపి నన్నే శ్రద్ధతో సేవించేవాడు అందరిలోకి శ్రేష్ఠుడు అని నేను అనుకుంటాను' (6.47) అనే శ్లోకంలో ప్రశ్నకు బీజం వేసి తానే నా తత్త్వం ఇటువంటిది, నాయందు మనసు నిలిపినవాడు ఈ విధంగా ఉంటాడు అని చెప్పదలచి శ్రీ భగవానుడు అంటున్నాడు.

**మూ. మయ్యాసక్తమనాః పార్థ యోగం యుఞ్జన్ మదాశ్రయః ।**
**అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు ॥ 1**

**తె.అ.** పార్థా! నాయందు ఆసక్తి గలిగిన మనసుతో నన్ను ఆశ్రయించి యోగసాధన చేస్తూ సమగ్రంగా, సంశయరహితంగా నన్నేవిధంగా తెలుసుకోగలవో అది చెపుతాను విను.

**భాష్యమ్ : 1.1. మయ్యాసక్తమనా ఇతి. మయి వక్ష్యమాణ విశేషణే పరమేశ్వరే ఆసక్తం మనో యస్య స మయ్యాసక్తమనాః, హే పార్థ! యోగం యుంజన్ మనః సమాధానం కుర్వన్ మదాశ్రయః అహమేవ పరమేశ్వరః ఆశ్రయః యస్య స మదాశ్రయః. యో హి కశ్చిత్ పురుషార్థేన కేనచిత్, అర్థీ భవతి స తత్సాధనం కర్మ అగ్నిహోత్రాది తపః దానం వా కించిత్ ఆశ్రయం ప్రతిపద్యతే, అయం తు యోగీ మామేవ ఆశ్రయం ప్రతిపద్యతే, హిత్వా అన్యత్ సాధనాంతరం మయ్యేవ ఆసక్తమనాః భవతి. యః త్వం ఏవంభూతః సన్ అసంశయం సమగ్రం సమస్త విభూతి బలశక్త్యైశ్వర్యాది గుణసంపన్నం మాం యథా యేన ప్రకారేణ జ్ఞాస్యసి సంశయమంతరేణ "ఏవమేవ భగవాన్" ఇతి తత్ శృణు ఉచ్యమానం మయా.**

**తె.అ.** ముందు చెప్పబోయే విశేషణాలు గలిగిన పరమేశ్వరుడనైన నాయందు ఆసక్తి కలిగిన మనసుతో పరమేశ్వరుడనైన నన్నే ఆశ్రయించి యోగసాధన అంటే మనస్సును ఏకాగ్రం చేస్తూ నీవు విభూతి బలము శక్తి ఐశ్వర్యము మొదలైన గుణాలతో సంపన్నుడనయిన నన్ను సంశయం

లేకుండా భగవానుడు ఇటువంటివాడే అని తెలుసుకోగల విధానం చెపుతాను విను. ఎవడైనా ఏదో పురుషార్థం కొరకు అర్థి అయి దానికి సాధనమైన కర్మను అగ్నిహోత్రమో, తపమో, దానమో దేనినో ఆశ్రయిస్తాడు. కానీ ఈ యోగి ఇతర సాధనాలన్నిటిని వదలి నన్నే ఆశ్రయించి నాయందు ఆసక్తిగల మనసుతో ఉంటాడు అని 'నన్నే ఆశ్రయించి' అని చెపుతున్నాడు.

**భాష్యమ్ : 2.0. తచ్చ మద్విషయమ్–**

**తె.అ.** నన్ను గురించిన జ్ఞానం –

**మూ. జ్ఞానం తేఽహం సవిజ్ఞానమిదం వక్ష్యామ్యశేషతః ।**
**యద్ జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్ జ్ఞాతవ్యమవశిష్యతే ॥ 2**

**తె.అ.** నేను నీకు జ్ఞానము విజ్ఞానము నిశ్శేషంగా చెపుతాను. అది తెలుసుకున్న తరువాత ఇక తెలుసుకోవలసినది మరేదీ ఉండదు.

**భాష్యమ్ : 2.1. జ్ఞానం ఇతి. జ్ఞానం తే తుభ్యం అహం సవిజ్ఞానం విజ్ఞానసహితం స్వానుభవయుక్తం ఇదం వక్ష్యామి కథయిష్యామి అశేషతః కార్త్స్న్యేన. తత్ జ్ఞానం వివక్షితం స్తౌతి శ్రోతుః అభిముఖీకరణాయ– యత్ జ్ఞాత్వా యత్ జ్ఞానం జ్ఞాత్వా న ఇహ భూయః పునః అన్యత్ జ్ఞాతవ్యం పురుషార్థసాధనం అవశిష్యతే న అవశిష్టం భవతి – ఇతి మత్తత్త్వజ్ఞో యః, స సర్వజ్ఞో భవతీత్యర్థః. అతో విశిష్టఫలత్వాత్ దుర్లభతరం జ్ఞానమ్.**

**తె.అ.** నేను నీకు జ్ఞానం విజ్ఞానసహితంగా అంటే స్వానుభవంతో కలిపి సంపూర్ణంగా చెపుతాను. వినేవానికి శ్రద్ధ కలగడం కొరకు ఆ జ్ఞానాన్ని స్తుతిస్తున్నాడు. ఆ జ్ఞానాన్ని తెలుసుకున్న తరువాత తెలుసుకోదగిన పురుషార్థ సాధనం ఏదీ మిగిలి ఉండదు. నా తత్త్వం తెలుసుకున్నవాడు సర్వజ్ఞుడు. కనుకనే అతనికి తెలుసుకోవలసినదేదీ మిగిలి ఉండదు. కనుక ఇటువంటి విశేషఫలం ఇచ్చే జ్ఞానం దుర్లభం.

**భాష్యమ్ : 3.0. కథం ఇతి? ఉచ్యతే –**

**తె. అ.** ఏ విధంగా దుర్లభం అంటే చెపుతున్నాడు –

**మూ. మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే ।**
**యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥ 3**

**తె.అ.** వేలమంది మనుష్యులలో సిద్ధికొరకు ప్రయత్నం చేసేవాడు ఒక్కడుంటాడు. ప్రయత్నం చేసే సిద్ధులలో కూడా నన్ను యథార్థంగా తెలుసుకున్నవాడు ఎవడో ఒక్కడుంటాడు.

**భాష్యమ్ : 3.1. మనుష్యాణాం ఇతి. మనుష్యాణాం మధ్యే సహస్రేషు అనేకేషు కశ్చిత్ యతతి ప్రయత్నం కరోతి సిద్ధయే సిద్ధ్యర్థమ్. తేషాం యతతామ్ అపి సిద్ధానాం – సిద్ధాః ఏవ హి తే యే మోక్షాయ యతంతే, తేషాం – కశ్చిత్ ఏవ హి మాం వేత్తి తత్త్వతః యథావత్.**

**తె.అ.** అనేకవేలమంది మనుష్యులలో సిద్ధికొరకు ప్రయత్నం చేసేవాడు ఎవడో ఒక్కడుంటాడు. ఆ ప్రయత్నం చేసే సిద్ధులలో కూడా వారు మోక్షం కొరకు యత్నం చేసే వారయినప్పటికీ వారిలో నన్ను యథార్థంగా తెలుసుకున్నవాడు ఒక్కడుంటాడు.

**భాష్యమ్ : 4.0. శ్రోతారం ప్రరోచనేన అభిముఖీకృత్యాహ –**

**తె.అ.** వినేవానిని ఈ విధంగా అభిముఖం చేసుకుని చెపుతున్నాడు–

**మూ. భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ ।**
**అహఙ్కార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా ॥ 4**

**తె.అ.** భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మనసు, బుద్ధి, అహంకారము, అని ఎనిమిది విధాలుగా నా ప్రకృతి వివిధంగా ఉంది.

**భాష్యమ్ : 4.1. భూమిః ఇతి. 'భూమిః' ఇతి పృథివీ తన్మాత్రం ఉచ్యతే. న స్థూలా, 'భిన్నా ప్రకృతిరష్టధా' ఇతి వచనాత్. తథా అబాదయోఽపి తన్మాత్రాణ్యేవ ఉచ్యంతే – ఆపః, అనలః, వాయుః, ఖమ్. మనః ఇతి మనసః కారణం అహంకారో గృహ్యతే. బుద్ధిః ఇతి అహంకారకారణమ్ మహత్తత్త్వమ్. అహంకారః ఇతి అవిద్యా సంయుక్తం అవ్యక్తమ్. యథా విషసంయుక్తం అన్నం విషమ్ ఇతి ఉచ్యతే, ఏవం అహంకారవాసనావత్ అవ్యక్తం మూలకారణం అహంకారః ఇత్యుచ్యతే, ప్రవర్తకత్వాత్ అహంకారస్య. అహంకారః ఏవ హి సర్వస్య ప్రవృత్తిబీజం దృష్టం లోకే. ఇతీయం యథోక్తా ప్రకృతిః మే మమ ఐశ్వరీ మాయాశక్తిః అష్టధా భిన్నా భేదం ఆగతా.**

**తె.అ.** 'భూమి' అని పృథివీ తన్మాత్రను చెపుతున్నాడు. స్థూలపృథివిని కాదు, ఎనిమిది విధాలుగా భిన్నమైన ప్రకృతి అనడం చేత. అట్లాగే జలము మొదలైన వాటి తన్మాత్రలనే చెప్పాడు. భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మనసు, బుద్ధి, అహంకారము అని నా ప్రకృతి, అంటే ఈశ్వరుని మాయాశక్తి, ఎనిమిది విధాలైన భేదంతో ఉంది. ఇక్కడ మనసు అంటే మనసుకు కారణమైన అహంకారమని గ్రహించవలెను. బుద్ధి అంటే అహంకార కారణమైన మహత్తత్త్వం. అహంకారమంటే అవిద్యాయుక్తమైన అవ్యక్తం, విషం కలిసిన అన్నాన్ని విషమన్నట్లు అహంకారంతో

వాసనలతో కలిసిన మూలకారణమైన అవ్యక్తాన్ని అహంకారమంటున్నాడు, అది అహంకారాన్ని ప్రవర్తింపజేస్తుంది కనుక. అహంకారమే అందరిలో ప్రవృత్తికి బీజమనేది లోకంలో చూస్తున్నాం.

**మూ. అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్ ।**
**జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్ ॥ 5**

**తె.అ.** ఇది అపరా ప్రకృతి. దీనికంటె వేరుగా నా పరాప్రకృతిని తెలుసుకో. అదే ఈ జగత్తును ధరించేది. అదే ఈ జగత్తుకు జీవం.

**భాష్యమ్ : 5.1. అపరా ఇతి. అపరా న పరా నికృష్టా అశుద్ధా అనర్థకరీ సంసార బంధనాత్మికా ఇయమ్. ఇతః అస్యాః యథోక్తాయాః తు అన్యాం విశుద్ధాం ప్రకృతిం మమ ఆత్మభూతాం విద్ధి మే పరాం ప్రకృష్టాం జీవభూతాం క్షేత్రజ్ఞలక్షణాం ప్రాణధారణనిమిత్తభూతాం హే మహాబాహో యయా ప్రకృత్యా ఇదం ధార్యతే జగత్ అంతః ప్రవిష్టయా.**

**తె.అ.** 'అపరా' అంటే పరము కానిది, నికృష్టము, అశుద్ధము, అనర్థకరము, సంసారబంధనము అయినది. దీనికంటే వేరుగా శ్రేష్ఠమైన శుద్ధప్రకృతి ఉంది. అదే పరాప్రకృతి, నా ఆత్మరూపం, దానిని తెలుసుకో. అది ప్రాణధారణానికి కారణం, క్షేత్రజ్ఞ లక్షణం. ఈ జగత్తును ప్రవేశించి ధరించేది అదే.

**మూ. ఏతద్యోనీని భూతాని సర్వాణీత్యుపధారయ ।**
**అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయస్తథా ॥ 6**

**తె.అ.** ఈ నా పరాపర ప్రకృతులు సమస్త భూతములకు మూలము అని తెలుసుకో, సమస్త జగత్తుకు ఉత్పత్తి స్థానము, లయస్థానమూ నేనే.

**భాష్యమ్ : 6.1. ఏతత్ ఇతి. ఏతద్యోనీని ఏతే పరాపరే క్షేత్రక్షేత్రజ్ఞ లక్షణే ప్రకృతీ యోనిః యేషాం భూతానాం తాని ఏతద్యోనీని భూతాని సర్వాణి ఇతి ఏవం ఉపధారయ జానీహి. యస్మాత్ మమ ప్రకృతీ యోనిః కారణం సర్వభూతానాం, అతః అహం కృత్స్నస్య సమస్తస్య జగతః ప్రభవః ఉత్పత్తిః, ప్రలయః వినాశః తథా. ప్రకృతిద్వయద్వారేణ అహం సర్వజ్ఞః ఈశ్వరః జగతః కారణం ఇత్యర్థః. యస్మాత్ ఏవం తస్మాత్–**

**తె.అ.** సమస్త భూతములకు, క్షేత్రక్షేత్రజ్ఞ లక్షణాలు కలిగిన ఈ పరాపర ప్రకృతులు సంభవ స్థానాలు అని తెలుసుకో. సర్వభూతములకు నా ప్రకృతియే కారణం కనుక నేను సమస్త జగత్తుకు ఉత్పత్తి, వినాశము కూడా. ఈ రెండు ప్రకృతుల ద్వారా సర్వజ్ఞుడను, ఈశ్వరుడనైన నేను జగత్తుకు కారణము అని అర్థం. అందుచేత–

**మూ. మత్తః పరతరం నాన్యత్కించిదస్తి ధనంజయ ।**
**మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ ॥ 7**

**తె.అ.** ఓ ధనంజయ! నాకంటే వేరుగా మరొకటి ఏదీ లేదు. ఈ సమస్త జగత్తు దారంలో మణులవలె నాలో ఇమిడి ఉన్నది.

**భాష్యమ్ : 7.1. మత్తః ఇతి. మత్తః పరమేశ్వరాత్ పరతరం అన్యత్ కారణాంతరం కించిత్ న అస్తి న విద్యతే, అహమేవ జగత్కారణం ఇత్యర్థః, హే ధనంజయ, యస్మాత్ ఏవం తస్మాత్ మయి పరమేశ్వరే సర్వాణి భూతాని సర్వం ఇదం జగత్ ప్రోతం అనుస్యూతం అనుగతం (అనువిద్ధం) గ్రథితం ఇత్యర్థః, దీర్ఘతంతుషు పటవత్, సూత్రే చ మణిగణాః ఇవ.**

**తె.అ.** పరమేశ్వరుడనైన నాకంటె వేరుగా మరొక కారణమేదీ లేదు, నేనే జగత్కారణము అని అర్థం. కనుక పరమేశ్వరుడనైన నాయందు సర్వభూతములు, సమస్త జగత్తు దారపు పోగులలో గుడ్డవలె దారంలో మణులవలె ఇమిడి ఉన్నాయి, కూర్చబడ్డాయి, కలిసి ఉన్నాయి, అంటుకుని ఉన్నాయి అని అర్థం.

**భాష్యమ్ :8.0. కేన కేన ధర్మేణ విశిష్టే త్వయి సర్వమిదం ప్రోతం ఇత్యుచ్యతే?–**

**తె.అ.** ఏ యే గుణాలచేత విశిష్టుడవైన నీయందు ఈ సర్వము కూర్చబడి ఉన్నవి, అంటే చెపుతున్నాడు–

**మూ. రసోఽహమప్సు కౌన్తేయ ప్రభాఽస్మి శశిసూర్యయోః ।**
**ప్రణవః సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు ॥ 8**

**తె.అ.** నీటియందు సారము, సూర్యచంద్రుల యందు కాంతి, సర్వవేదాలయందు ఓంకారము, ఆకాశమందు శబ్దము నరులయందు పౌరుషము నేను.

**భాష్యమ్ : 8.1. రసః ఇతి. రసః అహం అపాం యః సారః సః రసః, తస్మిన్ రసభూతే మయి ఆపః ప్రోతాః ఇత్యర్థః. ఏవం సర్వత్ర. యథా అహం అప్సు రసః, ఏవం ప్రభా అస్మి శశిసూర్యయోః.ప్రణవః ఓంకారః సర్వవేదేషు, తస్మిన్ ప్రణవభూతే మయి సర్వే వేదాః ప్రోతాః. తథా ఖే ఆకాశే శబ్దః సారభూతః, తస్మిన్ మయి ఖం ప్రోతమ్. తథా పౌరుషం పురుషస్య భావః పౌరుషం – యతః పుంబుద్ధిః – నృషు తస్మిన్ మయి పురుషాః ప్రోతాః–**

**తె.అ.** నీటియొక్క సారం రసం. ఆ రసరూపమైన నాయందు నీరు కలిసి యున్నది. అన్నిటియందు ఇదేవిధంగా అని అర్థం చేసుకోవలెను. నీటియందు నేను రుచిని ఎట్లో అదేవిధంగా

సూర్యచంద్రాదులయందు కాంతిని, సర్వవేదాల యందు ఓంకారమును, ప్రణవ స్వరూపుడనైన నాయందు సర్వవేదాలు కూర్చబడి ఉన్నాయి. అట్లాగే ఆకాశంలో దానికి సారభూతమైన శబ్దాన్ని నేను. అంటే శబ్దరూపుడనైన నాయందు ఆకాశము నిండియున్నది. పురుషుని గుణం పౌరుషం. అది ఉన్నవానిని పురుషుడు అంటున్నాం. ఆ పౌరుషరూపమైన నాయందు పురుషులు కూర్చబడి ఉన్నారు.

**మూ. పుణ్యో గన్ధః పృథివ్యాం చ తేజశ్చాస్మి విభావసౌ ।**
**జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు ॥ 9**

**తె.అ.** పృథివియందు సుగంధము, అగ్నియందు తేజము, సర్వభూతములయందు జీవము, తాపసులయందు తపము నేను.

**భాష్యమ్ : 9.1. పుణ్యః ఇతి – పుణ్యః సురభిః గంధః పృథివ్యాం చ అహమ్, తస్మిన్ మయి గంధభూతే పృథివీ ప్రోతా. పుణ్యత్వం గంధస్య స్వభావతః ఏవ పృథివ్యాం దర్శితం అబాదిషు రసాదేః పుణ్యత్వోపలక్షణార్థమ్. అపుణ్యత్వం తు గంధాదీనాం అవిద్యాధర్మాద్యపేక్షం సంసారిణాం భూతవిశేషసంసర్గనిమిత్తం భవతి. తేజః దీప్తిః చ అస్మి విభావసౌ అగ్నౌ. తథా జీవనం సర్వభూతేషు, యేన జీవంతి సర్వాణి భూతాని తత్ జీవనమ్. తపః చ అస్మి తపస్విషు, తస్మిన్ తపసి మయి తపస్వినః ప్రోతాః–**

**తె.అ.** పృథివి యందు పుణ్యగంధము అంటే సుగంధము నేను. గంధభూతమైన నాయందు పృథివి కూర్చబడి ఉన్నది. స్వభావ సిద్ధంగానే పృథివిలో ఉన్నట్లు చెప్పబడిన గంధం యొక్క పుణ్యత్వం రసాదుల పుణ్యత్వానికి ఉపలక్షణంగా చెప్పవచ్చు. గంధాదులలో అపుణ్యత్వం (చెడ్డతనం) కలగడానికి సంసారుల అవిద్య, అధర్మం మొదలైనవాటిని పట్టి భూత విశేషాల సంబంధం కారణం. అగ్నియందు దీప్తిని నేను. సర్వభూతములయందు జీవమును నేను. దేనివలన సర్వభూతములు జీవిస్తున్నాయో ఆ జీవము నేను. తాపసులయందు తపము నేను. తపోరూపమైన నాయందు తాపసులు కూర్చబడి ఉన్నారు.

**మూ. బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్ ।**
**బుద్ధిర్బుద్ధిమతామస్మి తేజస్తేజస్వినామహమ్ ॥ 10**

**తె.అ.** సర్వభూతములకు సనాతన బీజము నేనని తెలుసుకో. బుద్ధిమంతులలో బుద్ధి, తేజస్వులయందు తేజము నేను.

**భాష్యమ్ : 10.1. బీజం ఇతి. బీజం ప్రరోహకారణం మాం విద్ధి సర్వభూతానాం హే పార్థ సనాతనం చిరంతనమ్. కించ – బుద్ధిః వివేకశక్తిః అంతఃకరణస్య బుద్ధిమతాం వివేకశక్తిమతాం అస్మి, తేజః ప్రాగల్భ్యం తద్వతాం తేజస్వినాం అహమ్.**

**తె.అ.** మొలకెత్తడానికి కారణం బీజం. సర్వభూతములు పుట్టడానికి సనాతన బీజం నేనని తెలుసుకో. అంతఃకరణం యొక్క వివేకశక్తి బుద్ధి. బుద్ధిమంతులయందు అంటే వివేకశక్తి గల వారియందు బుద్ధి నేను. తేజస్వులయందు తేజము ప్రాగల్భ్యము నేను.

**మూ. బలం బలవతామస్మి చాహం కామరాగవివర్జితమ్ ।**
**ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ ॥ 11**

**తె.అ.** బలవంతులయొక్క ఆశ, అనురాగంలేని బలం నేను, ప్రాణులయందు ధర్మవిరుద్ధం కాని కోరిక నేను.

**భాష్యమ్ : 11.1. బలం ఇతి. బలం సామర్థ్యం ఓజః బలవతాం అహం, తత్ చ బలం కామరాగ వివర్జితం, కామశ్చ రాగశ్చ కామరాగౌ – కామః తృష్ణా అసన్నికృష్టేషు విషయేషు, రాగః రంజనా ప్రాప్తేషు విషయేషు – తాభ్యాం కామరాగాభ్యాం వివర్జితం దేహాదిధారణమాత్రార్థం బలం సత్త్వం అహం అస్మి, న తు సంసారిణాం తృష్ణారాగ కారణమ్. కించ – ధర్మావిరుద్ధః ధర్మేణ శాస్త్రార్థేన అవిరుద్ధః యః ప్రాణిషు భూతేషు కామః, యథా దేహధారణమాత్రాద్యర్థః అశనపానాది విషయః, సః కామః అస్మి హే భరతర్షభ! కించ–**

**తె.అ.** బలవంతుల బలం ఓజస్సు, సామర్థ్యం నేను. ఆ బలం కామము, రాగము లేనిది. పొందని విషయాలయందు తృష్ణ కామం; పొందిన విషయాలయందు తృష్ణ రాగం. ఈ రెండూ లేని, దేహధారణ మాత్ర ప్రయోజనమైన బలం, సంసారుల తృష్ణారాగకారణమైన బలం కాదు. ప్రాణులయందు శాస్త్రవిరుద్ధం కాని కోరిక, దేహధారణమాత్రమైన ఆహార పాన విషయాలయందు కోరిక నేను. ఇంకా –

**మూ. యే చైవ సాత్త్వికా భావా రాజసాస్తామసాశ్చ యే ।**
**మత్త ఏవేతి తాన్విద్ధి న త్వహం తేషు తే మయి ॥ 12**

**తె.అ.** సాత్త్విక, రాజస, తామస భావాలు నావల్లనే కలుగుతున్నాయి. నేను వాటిలో లేను, అవి నాయందున్నాయి.

**భాష్యమ్ : 12.1.** **యే ఇతి. యే చ ఏవ సాత్త్వికాః సత్త్వనిర్వృత్తాః భావాః పదార్థాః, రాజసాః రజోనిర్వృత్తాః, తామసాః తమో నిర్వృత్తాశ్చ, యే కేచిత్ ప్రాణినాం స్వకర్మవశాత్ జాయంతే భావాః తాన్ మత్తః ఏవ జాయమానాన్ ఇతి ఏవం విద్ధి సర్వాన్ సమస్తాన్ ఏవ. యద్యపి తే మత్తః జాయంతే తథాపి న తు అహం తేషు తదధీనః తద్వశః, యథా సంసారిణః. తే పునః మయి మద్వశాః మదధీనాః.**

**తె.అ.** సత్త్వం వల్ల కలిగే పదార్థాలు సాత్త్వికభావాలు. రజస్సువల్ల కలిగేవి రాజసాలు. తమస్సువల్ల కలిగేవి తామసాలు. ప్రాణులకు వారి కర్మవశం చేత కలిగే ఈ సాత్త్విక రాజస తామస భావాలన్నీ నా వల్లనే కలుగుతున్నాయి అని తెలుసుకో. నావల్ల కలిగినప్పటికీ నేను వాటియందు లేను, సంసారులవలె నేను వాటి వశంలో అధీనంలో లేను. అవి నాయందు నా వశమై, నా అధీనంలో ఉంటాయి.

**భాష్యమ్ : 13.0.** **ఏవంభూతమపి పరమేశ్వరం నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావం సర్వభూతాత్మానం నిర్గుణం సంసారదోషబీజప్రదాహకారణం మాం నాభిజానాతి జగత్ ఇతి అనుక్రోశం దర్శయతి భగవాన్. తచ్చ కిం నిమిత్తం జగతః అజ్ఞానమితి? ఉచ్యతే –**

**అ.అ.** ఇటువంటి నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావుడను, సర్వభూతాలయందు ఆత్మను, నిర్గుణుడను, సంసారదోషబీజాన్ని దహించగలవాడను, పరమేశ్వరుడనైన నన్ను లోకం తెలుసుకోవడం లేదు అని భగవానుడు బాధపడుతూ లోకుల ఆ అజ్ఞానానికి కారణం చెపుతున్నాడు–

**మూ. త్రిభిర్గుణమయైర్భావైరేభిః సర్వమిదం జగత్ ।**
**మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయమ్ ॥ 13**

**తె.అ.** ఈ త్రిగుణమయ భావాల చేత సమస్త జగత్తు మోహం చెందుతున్నది. వీటి అవతల వున్న నాశరహితుని, నన్ను తెలుసుకోవడం లేదు.

**భాష్యమ్ : 13.1.** **త్రిభిః ఇతి. త్రిభిః గుణమయైః గుణవికారైః రాగద్వేషమోహాది ప్రకారైః భావైః పదార్థైః ఏభిః యథోక్తైః ఇదం ప్రాణిజాతం జగత్ మోహితం అవివేకితాం ఆపాదితం సత్ న అభిజానాతి మాం ఏభ్యః యథోక్తేభ్యః గుణేభ్యః పరం వ్యతిరిక్తం విలక్షణం చ అవ్యయం వ్యయరహితం జన్మాదిసర్వభావవికారవర్జితం ఇత్యర్థః.**

**తె.అ.** పైన చెప్పిన ఈ మూడుగుణాల వికారాలచేత అంటే రాగ, ద్వేష, మోహాది, నానావిధ పదార్థాల చేత సమస్త ప్రాణికోటి మోహం చెందుతున్నది. వివేకం కోల్పోతున్నది. కనుక ఈ

గుణాలకు వ్యతిరేకంగా విలక్షణంగా ఉన్న నన్ను, జన్మ మొదలైన సర్వభావ వికార రహితుడను, అవ్యయుడను అయిన నన్ను లోకం తెలుసుకోవడం లేదు.

**భాష్యమ్ :14.0. కథం పునః దైవీం ఏతాం త్రిగుణాత్మికాం వైష్ణవీం మాయాం అతిక్రామంతి ఇతి? ఉచ్యతే–**

**తె.అ.** మరి త్రిగుణాత్మకయైన ఈ దివ్య వైష్ణవీ మాయను ఏవిధంగా దాటగలరు అంటే చెపుతున్నాడు.

**మూ. దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।**
**మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే ॥ 14**

**తె.అ.** త్రిగుణాత్మికయైన ఈ నా దివ్యమాయ దాటశక్యం కానిది. నన్ను శరణుజొచ్చిన వారు మాత్రమే ఈ మాయను దాటగలరు.

**భాష్యమ్ : 14.1. దైవీ ఇతి. దైవీ దేవస్య మమ ఈశ్వరస్య విష్ణోః స్వభావభూతా హి యస్మాత్ ఏషా యథోక్తా గుణమయీ మమ మాయా దురత్యయా దుఃఖేన అత్యయః అతిక్రమణం యస్యాః సా దురత్యయా. తత్ర ఏవం సతి సర్వధర్మాన్ పరిత్యజ్య మాం ఏవ మాయావినం స్వాత్మభూతం సర్వాత్మనా యే ప్రపద్యంతే తే మాయాం ఏతాం సర్వభూతమోహినీం తరంతి అతిక్రామంతి, తే సంసార బంధనాత్ ముచ్యంతే ఇత్యర్థః.**

**తె.అ.** ఈశ్వరుడను విష్ణువును అయిన నా ఈ త్రిగుణాత్మికయైన మాయ స్వభావము తెలుసుకుని, దీనిని దాటడం కష్టం. కనుక అన్ని ధర్మాలను విడిచి తమ ఆత్మ అయిన మాయావిని (మాయను వశంలో ఉంచుకొన్న) నన్ను సర్వాత్మభావంతో శరణుజొచ్చిన వారు మాత్రమే సర్వప్రాణులను సమ్మోహింపజేసే ఈ మాయను అతిక్రమిస్తారు. అంటే సంసారబంధం నుండి ముక్తులవుతారు అని అర్థం.

**భాష్యమ్ : 15.0 యది త్వాం ప్రపన్నాః మాయాం ఏతాం తరంతి, కస్మాత్ త్వామ్ ఏవ సర్వే న ప్రపద్యంతే ఇతి? ఉచ్యతే–**

**తె.అ.** నిన్ను శరణుజొచ్చిన వారే ఈ మాయను తరించగలిగితే నిన్నే ఎందుకు అందరూ శరణు పొందరు, అంటే చెపుతున్నాడు.

**మూ. న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యన్తే నరాధమాః ।**
**మాయయాఽపహృతజ్ఞానా ఆసురం భావమాశ్రితాః ॥ 15**

**తె.అ.** మాయ చేత తమ జ్ఞానం అపహరింపబడి, మూఢులై, పాపులైన నరులలో అధములు రాక్షస భావమాశ్రయించి నన్ను శరణు చెందరు.

**భాష్యమ్ : 15.1. న మాం ఇతి. న మాం పరమేశ్వరం నారాయణం దుష్కృతినః పాపకారిణః మూఢాః ప్రపద్యంతే నరాధమాః నరాణాం మధ్యే అధమాః నికృష్టాః తే చ మాయయా అపహృతజ్ఞానాః సంముషితజ్ఞానాః ఆసురం భావం హింసానృతాదిలక్షణం ఆశ్రితాః**

**తె.అ.** నికృష్టులైన నరులు తమ జ్ఞానము మాయచేత అపహరింపబడి మూఢులై పాపులై హింస, అనృతము మొదలైన లక్షణాలు కలిగిన రాక్షసభావాన్ని ఆశ్రయించి పరమేశ్వరుడనైన నన్ను శరణు చెందడం లేదు.

**భాష్యమ్: 16.0. యే పునః నరోత్తమాః పుణ్యకర్మాణః**

**తె.అ.** పుణ్యకర్మలు చేసిన నరోత్తముల విషయం -

**మూ. చతుర్విధా భజన్తే మాం జనాః సుకృతినోఽర్జున ।**
**ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ ॥ 16**

**తె.అ.** ఓ అర్జునా! పుణ్యం చేసుకున్నవారు నాలుగు విధాలవారు నన్ను సేవిస్తున్నారు. ఓ భరతశ్రేష్ఠా! వారు కష్టాలలో ఉన్నవాడు, తత్త్వం తెలిసికొనదలచినవాడు, ధనం కోరేవాడు, జ్ఞానవంతుడు.

**భాష్యమ్ : 16.1. చతుర్విధా ఇతి. చతుర్విధాః చతుః ప్రకారాః భజంతే సేవంతే మాం జనాః సుకృతినః పుణ్యకర్మాణః. హే అర్జున, ఆర్తః ఆర్తిపరిగృహీతః తస్కరవ్యాఘ్రరోగాదినా అభిభూతః ఆపన్నః, జిజ్ఞాసుః భగవత్తత్త్వం జ్ఞాతుం ఇచ్ఛంతి యః. అర్థార్థీ ధనకామః, జ్ఞానీ విష్ణోః తత్త్వవిత్, చ హే భరతవర్షభ.**

**తె.అ.** ఆర్తుడు అంటే దొంగ పెద్దపులి రోగం వంటి ఆపదలచేత చిక్కినవాడు. భగవత్తత్త్వం తెలుసుకోవలెనని కోరికగలవాడు జిజ్ఞాసువు. ధనం కోరేవాడు అర్థార్థి. విష్ణుతత్త్వం తెలిసినవాడు జ్ఞాని. ఈ నాలుగు ప్రకారాల పుణ్యాత్ములు నన్ను సేవిస్తున్నారు. ఓ భరతశ్రేష్ఠా!

**మూ. తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే ।**
**ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమహం స చ మమ ప్రియః ॥ 17**

**తె.అ.** వారిలో ఒక్క పరమాత్మునియందే భక్తిగల జ్ఞానవంతుడు, నిత్యమూ ఆత్మయందు

ఏకాగ్రచిత్తంతో ఉండే జ్ఞాని విశిష్టుడు. జ్ఞానికి అత్యంత ప్రియుడను నేను. అతడు నాకు ప్రియుడు.

**భాష్యమ్ : 17.1. తేషాం ఇతి. తేషాం చతుర్ణాం మధ్యే జ్ఞానీ తత్త్వవిత్ తత్త్వవిత్త్వాత్ నిత్యయుక్తః భవతి ఏకభక్తిశ్చ, అన్యస్య భజనీయస్య అదర్శనాత్, అతః సః ఏకభక్తిః విశిష్యతే విశేషం ఆధిక్యం ఆపద్యతే, అతిరిచ్యతే ఇత్యర్థః (18.55 భాష్యే). ప్రియః హి యస్మాత్ అహం ఆత్మా జ్ఞానినః, అతః తస్య అహం అత్యర్థం ప్రియః, ప్రసిద్ధం హి లోకే 'ఆత్మా ప్రియః భవతి' ఇతి. తస్మాత్ జ్ఞానినః ఆత్మత్వాత్ వాసుదేవః ప్రియః భవతీత్యర్థః. స చ జ్ఞానీ మమ వాసుదేవస్య ఆత్మా ఏవ ఇతి మమ అత్యర్థం ప్రియః.**

**తె.అ.** ఆ నలుగురిలో జ్ఞాని అధికుడు, తత్త్వం తెలిసినవాడు కనుక నిత్యము యోగంలో ఉంటాడు. భజించదగింది మరొకటి కనిపించడం లేదు కనుక. అతడు ఏకభక్తి కలవాడు. జ్ఞానియొక్క ఆత్మను నేను. కనుక అతనికి నేను అత్యంత ప్రియుడను. ఆత్మ ప్రియమైనది అనేది లోకంలో ప్రసిద్ధం. (ఆత్మయందు అంటె తనయందు తనకు ప్రీతి లోకప్రసిద్ధం) జ్ఞానికి ఆత్మ కావడం చేత వాసుదేవుడు ప్రియుడవుతున్నాడు అని అర్థం. వాసుదేవుడనైననాకు ఆ జ్ఞాని ఆత్మ. కనుక నాకు అతడు అత్యంత ప్రియుడు.

**భాష్యమ్ : 18.0. న తర్హి ఆర్తాదయః త్రయః వాసుదేవస్య ప్రియాః? న, కిం తర్హి?**

**తె.అ.** మరి ఆర్తుడు మొదలైన తక్కిన ముగ్గురు వాసుదేవునికి ప్రియులు కారా? కాకపోలేదు, కాని–

**మూ. ఉదారాః సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్ ।**
**ఆస్థితః స హి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్ ॥ 18**

**తె.అ.** వీరందరూ ఉదారులే. కాని జ్ఞానిని మాత్రం నా ఆత్మగానే భావిస్తాను. అతడు ఏకాగ్రతతో ఉత్తమోత్తమమైన గతిని అంటే నన్ను పొందడానికి ప్రయత్నిస్తున్నాడు.

**భాష్యమ్ : 18.1. ఉదారాః ఇతి. ఉదారాః ఉత్కృష్టాః సర్వ ఏవ ఏతే, త్రయోఽపి మమ ప్రియాః ఏవేత్యర్థః న హి కశ్చిత్ మద్భక్తః మమ వాసుదేవస్య అప్రియః భవతి. జ్ఞానీ తు అత్యర్థం ప్రియః భవతీతి విశేషః. తత్ కస్మాత్ ఇతి? అతః ఆహ– జ్ఞానీ తు ఆత్మా ఏవ, న అన్యః మత్తః ఇతి మే మమ మతం నిశ్చయః. ఆస్థితః ఆరోఢుం ప్రవృత్తః సః జ్ఞానీ హి యస్మాత్ "అహమేవ భగవాన్ వాసుదేవః న అన్యః అస్మి" ఇత్యేవం యుక్తాత్మా సమాహితచిత్తః సన్ మామ్ ఏవ పరం బ్రహ్మ గంతవ్యం అనుత్తమాం గతిం గంతుం ప్రవృత్తః ఇత్యర్థః.**

**తె.అ.** వీరందరూ ఉత్కృష్టులే, తక్కిన ముగ్గురు కూడా నాకు ప్రియులే. నా భక్తుడెవడూ నాకు (అంటే వాసుదేవునికి) అప్రియుడు కాడు. జ్ఞాని అధికప్రియుడు, అదీ విశేషం. అది ఎందుకని అంటే చెపుతున్నాడు, జ్ఞాని ఆత్మయే, నాకంటె అన్యుడు కాడు అని నా నిశ్చితమతం. యోగం ఆరోహించుటకు, ప్రవృత్తుడైనవాడు నేనే, భగవానుడయిన వాసుదేవుడను, అన్యుడను కాను అని చిత్తాన్ని ఏకాగ్రం చేసి పరమప్రాప్తవ్యమైన, పరబ్రహ్మమైన, నన్ను చేరడానికి సాధన చేస్తూ ఉంటాడు.

**భాష్యమ్ : 19.0. జ్ఞానీ పునరపి స్తూయతే–**

**తె.అ.** జ్ఞానిని మళ్ళీ స్తుతిస్తున్నాడు–

**మూ. బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్మాం ప్రపద్యతే ।**
**వాసుదేవః సర్వమితి స మహాత్మా సుదుర్లభః ॥ 19**

**తె.అ.** అనేక జన్మలు ముగిసిన తరువాత జ్ఞానవంతుడు 'సర్వము వాసుదేవుడే' అనే భావంతో నన్ను చేరుతున్నాడు. అటువంటి మహాత్ముడు దొరకడం చాలా అరుదు.

**భాష్యమ్ : 19.1. బహూనాం ఇతి. బహూనాం జన్మనాం జ్ఞానార్థసంస్కారాశ్రయాణాం అంతే సమాప్తౌ జ్ఞానవాన్ ప్రాప్తపరిపాకజ్ఞానః మాం వాసుదేవ ప్రత్యగాత్మానం ప్రత్యక్షతః ప్రపద్యతే – కథమ్? వాసుదేవః సర్వం ఇతి. య ఏవం సర్వాత్మానం మాం నారాయణం ప్రతిపద్యతే, సః మహాత్మా, న తత్సమః అన్యః అస్తి, అధికః వా. అతః సుదుర్లభః, మనుష్యాణాం సహస్రేషు (7.3) ఇతి హి ఉక్తమ్.**

**తె.అ.** జ్ఞానం కొరకు అవసరమైన సంస్కారాలను సంపాదించడం కోసం అనేక జన్మలెత్తి చివర పరిపక్వజ్ఞానం కలిగి ప్రత్యగాత్మయైన వాసుదేవుణ్ణి అయిన నన్ను ప్రత్యక్షంగా తెలుసుకుంటాడు. ఎట్లా? సర్వమూ వాసుదేవుడేనని. సర్వాత్మ అయిన నన్ను ఈ విధంగా చేరినవాడు మహాత్ముడు. అతనితో సమానుడు కాని అతనికంటె అధికుడు గాని లేడు. కనుక చాలా దుర్లభుడు. వేలమంది మనుష్యులలో ఒకడు కూడా ఉండడు.

**భాష్యమ్: 20.0 ఆత్మైవ సర్వః వాసుదేవః ఇత్యేవం అప్రతిపత్తౌ కారణం ఉచ్యతే–**

**తె.అ.** ఈ సర్వజగత్తూ ఆత్మరూపమైన వాసుదేవుడే అని ఈవిధంగా తెలుసుకోలేక పోవడానికి కారణం చెపుతున్నాడు–

**మూ. కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యన్తేఽన్యదేవతాః ।**
**తం తం నియమమాస్థాయ ప్రకృత్యా నియతాః స్వయా ॥ 20**

**తె.అ.** ఆయా కోర్కెల చేత వారు జ్ఞానాన్ని కోల్పోయి అన్యదేవతలను వారి వారి నియమాలను అనుసరించి ఆశ్రయిస్తున్నారు. వారి స్వభావమే వారి నియంత.

**భాష్యమ్ : 20.1. కామైః ఇతి. కామైః తైః తైః పుత్రపశుస్వర్గాది విషయైః హృతజ్ఞానాః అపహృతవివేకవిజ్ఞానాః ప్రపద్యంతే అన్యదేవతాః ప్రాప్నువంతి వాసుదేవాత్ ఆత్మనః అన్యాః దేవతాః, తం తం నియమం దేవతారాధనే ప్రసిద్ధః యః యః నియమః తం తం ఆస్థాయ ఆశ్రిత్య ప్రకృత్యా స్వభావేన జన్మాంతరార్జిత సంస్కారవిశేషేణ నియతాః నియమితాః స్వయా ఆత్మీయయా.**

**తె.అ.** పుత్రులు, పశువులు, స్వర్గము మొదలైనవాటిపై కోర్కెలచేత వివేకాన్ని కోల్పోయినవారు ఆత్మరూపమైన వాసుదేవుని నన్ను కాక ఇతర దేవతలను చేరుతున్నారు. ఆయా దేవతల ఆరాధనతో ప్రసిద్ధమైన ఏయే నియమాలున్నాయో వాటిని పాటిస్తున్నారు. అనేక జన్మల సంస్కారమే వారి స్వభావం. ఆ స్వభావమే వారిని నియమిస్తుంది.

**భాష్యమ్ : 21.0. తేషాం చ కామినామ్–**

**తె.అ.** ఆ కోర్కెలు గలవారికి–

**మూ. యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయాఽర్చితుమిచ్ఛతి ।**
**తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్ ॥ 21**

**తె.అ.** ఏ యే భక్తులు ఏయే దేవతారూపాలను శ్రద్ధతో అర్చించకోరుతున్నారో వారి వారికి అచలమైన ఆ శ్రద్ధను నేను స్థిరం చేస్తున్నాను.

**భాష్యమ్ : 21.1. యో యః ఇతి. యః యః కామీ యాం యాం దేవతాతనుం శ్రద్ధయా సంయుక్తః భక్తః చ సన్ అర్చితుం పూజయితుం ఇచ్ఛతి, తస్య తస్య కామినః అచలాం స్థిరాం శ్రద్ధాం తామ్ ఏవ విదధామి స్థిరీకరోమి (యయైవ పూర్వం ప్రవృత్తః). స్వభావతః యః యః యాం యాం దేవతాతనుం శ్రద్ధయా అర్చితుం ఇచ్ఛతి–**

**తె.అ.** కోర్కెలు గలవాడు ఎవడెవడు ఏయే దేవతామూర్తిని శ్రద్ధతో భక్తితో పూజించగోరుతాడో అతనికి అదే శ్రద్ధను నేను స్థిరం చేస్తాను. స్వభావం చేత పూర్వమే ఏ శ్రద్ధతో ఏ దేవతామూర్తిని అర్చించగోరుతాడో అదే శ్రద్ధను అని అర్థం.

**మూ. స తయా శ్రద్ధయా యుక్తస్తస్యారాధనమీహతే ।**
**లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్ ॥ 22**

**తె.అ.** ఆ శ్రద్ధతో అతడు ఆ దేవతను ఆరాధిస్తాడు. ఆ దేవత నుంచి తనకు ఇష్టమైన కోరికలను పొందుతాడు. వాస్తవానికి ఆ కోరికలు నేను తీర్చినవే.

**భాష్యమ్ : 22.1. స తయా ఇతి. సః తయా మద్విహితయా శ్రద్ధయా యుక్తః సన్ తస్యాః దేవతాతన్వాఃరాధనం ఆరాధనం ఈహతే చేష్టతే. లభతే చ తతః తస్యాః ఆరాధితాయాః దేవతాతన్వాః కామాన్ ఈప్సితాన్ మయా ఏవ పరమేశ్వరేణ సర్వజ్ఞేన కర్మఫలవిభాగజ్ఞతయా విహితాన్ నిర్మితాన్, తాన్ హి యస్మాత్ తే భగవతా విహితాః కామాః తస్మాత్ తాన్ అవశ్యం లభతే ఇత్యర్థః. 'హితాన్' ఇతి పదచ్ఛేదే హితత్త్వం కామానాం ఉపచరితం కల్ప్యమ్, న హి కామాః హితాః కస్యచిత్.**

**తె.అ.** నా చేత విధింపబడిన శ్రద్ధతో ఆ దేవతామూర్తిని ఆరాధించడంలో తత్పరుడై ఉంటాడు. ఆరాధింపబడిన ఆ దేవతకై పరమేశ్వరుడను సర్వజ్ఞుడను కర్మఫలవిభాగం తెలిసినవాడను అయిన నాచేత నిర్ణయింపబడిన, కోరిన కోర్కెలను పొందుతాడు. 'హితాన్' అని పదచ్ఛేదం చేసేటట్లయితే కామములకు హితత్త్వం ఔపచారికంగా చెప్పుకోవాలి. ఎందుకంటే కామం ఎవరికి హితం కాదు కనుక. ('విహితాన్ హి తాన్' అని 'విహితాన్ హితాన్' అని రెండు విధాలుగా పదచ్ఛేదం చేయవచ్చు.)

**భాష్యమ్ : 23.0. యస్మాత్ అంతవత్సాధనవ్యాపారాః అవివేకినః కామినశ్చతే, అతః-**

**తె.అ.** కోర్కెలు కోరుకునే అవివేకులు చేసే సాధన అల్పమైనది. కనుక-

**మూ. అన్తవత్తు ఫలం తేషాం తద్భవత్యల్పమేధసామ్ ।**
**దేవాన్ దేవయజో యాన్తి మద్భక్తా యాన్తి మామపి ॥ 23**

**తె.అ.** ఆ అల్పబుద్ధులకు ఫలం కూడా అల్పమైనది. దేవతలను ఉపాసించేవారు దేవతలను పొందుతారు. నా భక్తులు నన్ను చేరుతారు.

**భాష్యమ్ : 23.1. అంతవత్ ఇతి. అంతవత్ వినాశి తు ఫలం తేషాం తత్ భవతి అల్పమేధసాం అల్పప్రజ్ఞానామ్. దేవాన్ దేవయజః యాంతి దేవాన్ యజంతే ఇతి దేవయజః, తే దేవాన్ యాంతి, మద్భక్తాః యాంతి మాం అపి. ఏవం సమానే అపి ఆయాసే మామ్ ఏవ న ప్రపద్యంతే అనంతఫలాయ, అహో ఖలు కష్టతరం వర్తతే, ఇత్యనుక్రోశం దర్శయతి భగవాన్.**

**తె.అ.** అల్పబుద్ధులకు లభించే ఫలం అంతమయేది, నశించేది. దేవతలను ఆరాధించేవారు దేవతలను చేరుకుంటారు. నా భక్తులు నన్ను చేరుతారు. ఈవిధంగా ఆయాసం సమానమే అయినా నన్ను ఆశ్రయించి అనంత ఫలం పొందరు. ఆహా, ఎంత దయనీయము! అని బాధను వ్యక్తం చేస్తున్నాడు భగవానుడు.

**భాష్యమ్ : 24.0. కిం నిమిత్తం ఏవ న ప్రపద్యంతే ఇతి? ఉచ్యతే–**

**తె.అ.** నన్నే ఎందుకు ఆశ్రయించరు? అంటే చెపుతున్నాడు–

**మూ. అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యన్తే మామబుద్ధయః ।**
**పరం భావమజానన్తో మమావ్యయమనుత్తమమ్ ॥ 24**

**తె.అ.** అవ్యయము, ఉత్తమోత్తమము అయిన నా తత్త్వం తెలియని అవివేకులు అవ్యక్తమయిన నన్ను వ్యక్తి అనుకుంటారు.

**భాష్యమ్ : 24.1. అవ్యక్తం ఇతి. అవ్యక్తం అప్రకాశం వ్యక్తిం ఆపన్నం ప్రకాశం గతం ఇదానీం మన్యంతే మాం నిత్యప్రసిద్ధం ఈశ్వరం అపి సంతం అబుద్ధయః అవివేకినః పరంభావం పరమాత్మస్వరూపం అజానంతః అవివేకినః మమ అవ్యయం వ్యయరహితం అనుత్తమం నిరతిశయం, మదీయం భావం అజానంతః మన్యంతే ఇత్యర్థః.**

**తె.అ.** అవ్యయము, నిరతిశయము అయిన నా తత్త్వమును అంటే పరమాత్మ స్వరూపమును తెలియని అవివేకులు అవ్యక్తమైన నన్ను వ్యక్తిత్వము పొందినవానిగా భావిస్తున్నారు. నేను నిత్యప్రసిద్ధుడను ఈశ్వరుడను అని తెలియదు.

**భాష్యమ్: 25.0 తదజ్ఞానం కిం నిమిత్తం ఇతి? ఉచ్యతే–**

**తె.అ.** ఆక్షేపణ– తెలుసుకోలేకపోవడానికి కారణమేమిటి?

**మూ. నాహం ప్రకాశః సర్వస్య యోగమాయాసమావృతః ।**
**మూఢోఽయం నాభిజానాతి లోకో మామజమవ్యయమ్ ॥ 25**

**తె.అ.** యోగమాయచేత కప్పబడిన నేను అందరికీ కనిపించను. పుట్టుక మార్పులేని నన్ను ఈ మూఢలోకులు నాశరహితునిగా ఎఱుగుట లేదు.

**భాష్యమ్ : 25.1. నాహం ఇతి. న అహం ప్రకాశః సర్వస్య లోకస్య, కేషాంచిత్ ఏవ మద్భక్తానాం ప్రకాశః అహం ఇత్యభిప్రాయః. యోగమాయాసమావృతః యోగః గుణానాం యుక్తిః ఘటనం, సైవ మాయా యోగమాయా – అథవా, భగవతః చిత్తసమాధానయోగః, తత్కృతా మాయా**

**యోగమాయా తయా యోగమాయయా సమావృతః, సంచ్ఛన్నః ఇత్యర్థః. అత ఏవ మూఢః లోకః అయం న అభిజానాతి మాం అజం అవ్యయమ్.**

**తె.అ.** లోకంలోని అందరికీ నేను కనిపించను. నా భక్తులకు మాత్రం కొందరికి కనిపిస్తాను అని అర్థం. యోగం అంటే ప్రకృతి గుణాల కలయిక. ఈ కలయికే మాయ. లేక, భగవంతుని చిత్త సమాధానం యోగం. దానిచేత కప్పబడిన మాయ యోగమాయ. ఆ యోగమాయ చేత కప్పబడి ఉన్నాను. కనుక పుట్టుకలేని, మార్పు చెందని నన్ను మూఢలోకం తెలుసుకోడం లేదు.

**భాష్యమ్ : 26.0. యయా యోగమాయయా సమావృతం మాం లోకః నాభిజానాతి, న అసౌ యోగమాయా మదీయా సతీ మమ ఈశ్వరస్య మాయావినః జ్ఞానం ప్రతిబధ్నాతి యథా అన్యస్యాపి మాయావినః మాయాజ్ఞానం తద్వత్. యతః ఏవం అతః-**

**తె.అ.** ఏ యోగమాయ చేత కప్పబడి ఉన్న నన్ను లోకం తెలుసుకోలేకపోతున్నదో ఆ మాయ నాది కనుక నా జ్ఞానాన్ని అంటే మాయావి అయిన ఈశ్వరుని జ్ఞానాన్ని అడ్డగించలేదు, మరొక మాయావి మాయ అయినా వాని జ్ఞానానికి అడ్డురానట్లే. (మాయావి తన మాయ చేత ఇతరులను మాయ చేస్తున్నాడు. తాను మాయలో పడడం లేదు. తెలివిగానే ఉంటున్నాడు) కనుక-

**మూ. వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున ।**
**భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన ॥ 26**

**తె.అ.** గతంలో, వర్తమానంలో, భవిష్యత్తులోని ప్రాణులందరూ నాకు తెలుసు. నేను మాత్రం ఎవరికీ తెలియను.

**భాష్యమ్ : 16.1. వేద ఇతి. అహం తు వేద జానే సమతీతాని సమతిక్రాంతాని భూతాని, తథా వర్తమానాని చ అర్జున భవిష్యాణి చ భూతాని వేద అహం, మాం తు వేద న కశ్చన మద్భక్తం మచ్ఛరణం ఏకం ముక్త్వా, మత్తత్త్వ వేదనాభావాదేవ న మాం భజతే.**

**తె.అ.** గతించిన వారిని, వర్తమానంలోని వారిని, భవిష్యత్తులో కలుగబోయే వారిని నేనెరుగుదును. నన్ను మాత్రం ఎవడూ ఎరుగడు. నా శరణాగతుడైన నా భక్తుడు తప్ప. నా తత్త్వం తెలియకపోవడం చేత నన్ను సేవించడం లేదు.

**భాష్యమ్ : 27.0. కేన పునః మత్తత్త్వ వేదనప్రతిబంధనే ప్రతిబద్ధాని సంతి జాయమానాని సర్వభూతాని మాం న విదంతి ఇత్యపేక్షాయాం ఇదం ఆహ-**

**తె.అ.** నీ తత్త్వం తెలుసుకోడంలో అడ్డు వచ్చేది ఏది? దేనిచేత అడ్డగింపబడి పుట్టిన ప్రాణులందరూ నిన్ను తెలుసుకోడం లేదు?

**మూ. ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వన్ద్వమోహేన భారత ।**
**సర్వభూతాని సంమోహం సర్గే యాన్తి పరంతప ॥ 27**

**తె.అ.** ఇచ్ఛాద్వేషాలనే ద్వంద్వాలవల్ల కలిగే మోహం చేత సర్వప్రాణులు పుట్టుకతోనే మూఢులై పుడుతున్నారు.

**భాష్యమ్ : 27.1. ఇచ్ఛా ఇతి. ఇచ్ఛాద్వేషసముత్థేన ఇచ్ఛా చ ద్వేషశ్చ ఇచ్ఛాద్వేషౌ తాభ్యాం సముత్తిష్ఠతీతి ఇచ్ఛాద్వేషసముత్థః. కేనేతి విశేషాపేక్షాయాం ఇదం ఆహ- ద్వంద్వమోహేన ఇతి. ద్వంద్వనిమిత్తః మోహః ద్వంద్వమోహః తేన. తౌ ఏవ ఇచ్ఛాద్వేషౌ శీతోష్ణవత్ పరస్పరవిరుద్ధౌ సుఖదుఃఖతద్ధేతు విషయౌ యథాకాలం సర్వభూతైః సంబధ్యమానౌ ద్వంద్వశబ్దేన అభిధీయేతే. తత్ర యదా ఇచ్ఛాద్వేషౌ సుఖదుఃఖతద్ధేతుసంప్రాప్తౌ లబ్ధాత్మకౌ భవతః, తదా తౌ సర్వభూతానాం ప్రజ్ఞాయాః స్వవశాపాదనద్వారేణ పరమార్థతత్త్వవిషయజ్ఞానోత్పత్తి ప్రతిబంధకారణం మోహం జనయతః. న హి ఇచ్ఛాద్వేషదోషపరవశీకృతచిత్తస్య యథాభూతార్థవిషయజ్ఞానం ఉత్పద్యతే బహిరపి, కిము వక్తవ్యం తాభ్యాం ఆవిష్టబుద్ధేః సంమూఢస్య ప్రత్యగాత్మని బహుప్రతిబంధే జ్ఞానం నోత్పద్యతే ఇతి. అతః తేన ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వంద్వమోహేన, భారత భరతాన్వయజ, సర్వభూతాని సంమోహితాని సంతి సంమోహం సంమూఢతాం సర్గే జన్మని ఉత్పత్తికాలే ఇత్యేతత్ యాంతి గచ్ఛంతి హే పరంతప. మోహవశాని ఏవ సర్వభూతాని జాయమానాని జాయంతే ఇత్యభిప్రాయః. యతః ఏవం అతః తేన ద్వంద్వమోహేన ప్రతిబద్ధప్రజ్ఞానాని సర్వభూతాని సంమోహితాని మాం ఆత్మభూతం న జానంతి, అతః ఏవం ఆత్మభావేన మాం న భజంతే.**

**తె.అ.** ఇచ్ఛాద్వేషాలవల్ల కలిగినది ద్వంద్వమోహం. శీతోష్ణాలవలె పరస్పరం విరుద్ధాలైన సుఖదుఃఖాలు వాటికి కారణాలు. వీటియందు కాలానికి తగినట్లు ప్రాణులకు కలిగే ఇచ్ఛాద్వేషాలే ద్వంద్వాలు. (కాలానికి తగినట్లు అంటే శీతం ఒక కాలంలో సుఖంగాను వేరొక కాలంలో దుఃఖంగాను ఉండవచ్చు) సుఖదుఃఖాలు వాటి కారణాలు సంప్రాప్తించినపుడు ఇచ్ఛాద్వేషాలు కలిగి అవి సర్వప్రాణుల వివేకాన్ని స్వాధీనం చేసుకుని పరమార్థ తత్త్వవిషయమైన జ్ఞానం కలగడానికి అడ్డువచ్చే మోహాన్ని పుట్టిస్తున్నాయి. ఇచ్ఛాద్వేషాలు అనే దోషానికి చిత్తం వశమైన వారికి బయటివిషయాల యథార్థజ్ఞానమే కలగదు. అటువంటప్పుడు ఆ ఇచ్ఛాద్వేషాలు ఆవేశించిన మూఢులకు ఎన్నో ప్రతిబంధాలున్న అంతరాత్మ విషయంలో జ్ఞానం కలగదు అని చెప్పవలసినపని ఏముంది? కనుక ఆ ఇచ్ఛాద్వేషాలవల్ల కలిగే ద్వంద్వమోహం చేత సర్వప్రాణులు పుట్టుకతోనే

సమ్మోహం చెందుతున్నారు. పుట్టే జీవులందరూ మోహవశమయ్యే పుడుతున్నారు అని అభిప్రాయం. కనుక ద్వంద్వమోహంచేత వివేకం అడ్డగింపబడి ప్రాణులందరూ సమ్మోహం చెంది ఆత్మ అయిన నన్ను తెలుసుకోవడం లేదు. కనుకనే నన్ను ఆత్మభావంతో సేవించడం లేదు.

**భాష్యమ్ : 28.0. కే పునః అనేన ద్వంద్వ మోహేన నిర్ముక్తాః సంతః త్వాం విదిత్వా యథాశాస్త్రం ఆత్మభావేన భజంతే ఇత్యపేక్షితం అర్థం దర్శయితుం ఆహ.**

**తె.అ.** మరి ఈ ద్వంద్వమోహం నుండి బయటపడి నిన్ను తెలుసుకుని శాస్త్రం చెప్పిన విధంగా ఆత్మభావంతో నిన్ను సేవించేవారెవరు? అంటే చెపుతున్నాడు.

**మూ. యేషాం త్వన్తగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్ ।**
**తే ద్వన్ద్వమోహనిర్ముక్తా భజన్తే మాం దృఢవ్రతాః ॥ 28**

**తె.అ.** పుణ్యకర్మలు చేసుకున్నవారి పాపం క్షయమై వారు ద్వంద్వ మోహం నుండి బయటపడి దృఢవ్రతులై నన్ను సేవిస్తారు.

**భాష్యమ్ : 28.1. యేషాం ఇతి. యేషాం తు పునః అంతగతం సమాప్తప్రాయం క్షీణం పాపం జనానాం పుణ్యకర్మణాం పుణ్యం కర్మ యేషాం సత్త్వశుద్ధికారణం విద్యతే తే పుణ్యకర్మాణః తేషాం పుణ్యకర్మణాం తే ద్వంద్వమోహనిర్ముక్తాః యథోక్తేన ద్వంద్వమోహేన నిర్ముక్తాః భజంతే మాం పరమాత్మానం దృఢవ్రతాః. 'ఏవమేవ పరమార్థతత్త్వం, నాన్యథా' ఇత్యేవం సర్వపరిత్యాగవ్రతేన నిశ్చితవిజ్ఞానాః దృఢవ్రతాః ఉచ్యంతే.**

**తె.అ.** సత్త్వశుద్ధి కలిగించే పుణ్యకర్మలు చేసుకున్న జనులకు పాపం క్షయమై చివరలో వారు ద్వంద్వమోహం నుండి బయటపడి పరమార్థతత్త్వం ఇటువంటిదే మరొకవిధంకాదు అనే నిశ్చయవిజ్ఞానంతో దృఢవ్రతులై పరమాత్మ అయిన నన్ను సేవిస్తారు.

**భాష్యమ్ : 29.0. తే కిమర్థం భజంతే ఇతి? ఉచ్యతే.**

**తె.అ.** వారెందుకు సేవిస్తారు? అంటే–

**మూ. జరామరణమోక్షాయ మామాశ్రిత్య యతన్తి యే ।**
**తే బ్రహ్మ తద్విదుః కృత్స్నమధ్యాత్మం కర్మ చాఖిలమ్ ॥ 29**

**తె.అ.** ముసలితనం నుండి, చావునుండి ముక్తిపొందగోరి నన్ను ఆశ్రయించి ప్రయత్నం చేసేవారు ఆ బ్రహ్మమును, సమస్త అధ్యాత్మమును, అఖిలకర్మలను తెలుసుకుంటారు.

**భాష్యమ్ : 29.1. జరా ఇతి. జరామరణమోక్షాయ జరామరణయోః మోక్షార్థం మాం పరమేశ్వరం ఆశ్రిత్య మత్సమాహితచిత్తాః సంతః యతంతి ప్రయతంతే యే, తే యత్ బ్రహ్మ పరం తత్ విదుః కృత్స్నం సమస్తం, అధ్యాత్మం ప్రత్యగాత్మవిషయం వస్తు తత్ విదుః, కర్మ చ అఖిలం సమస్తం విదుః.**

**తె.అ.** ముసలితనం నుండి, చావునుండి ముక్తికొరకు పరమేశ్వరుని నన్నాశ్రయించి ప్రయత్నించేవారు పరబ్రహ్మమును, అంతరాత్మ విషయమైన వస్తువు యొక్క పూర్తి స్వరూపాన్ని మరియు సమస్త కర్మలను తెలుసుకుంటారు.

**మూ. సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞం చ యే విదుః ।**
**ప్రయాణకాలేఽపి చ మాం తే విదుర్యుక్తచేతసః ॥ 30**

**తె.అ.** అధిభూత, అధిదైవ, అధియజ్ఞ సహితంగా నన్ను తెలుసుకున్నవారు మరణసమయంలో కూడా చిత్తం చలించక నన్ను తెలిసేవుంటారు.

**ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే జ్ఞానవిజ్ఞానయోగో నామ సప్తమోఽధ్యాయః**

**తె.అ.** ఇది వ్యాసభగవానుని శతసహస్రసంహిత అయిన శ్రీమహాభారతంలో భీష్మపర్వంలో ఉపనిషత్తులు బ్రహ్మవిద్య యోగశాస్త్రము శ్రీకృష్ణార్జున సంవాదము అయిన భగవద్గీతల యందు జ్ఞానవిజ్ఞానయోగం అనే ఏడవ అధ్యాయానికి తెలుగు అనువాదం.

**భాష్యమ్ : 30.1. సాధి ఇతి సాధిభూతాధిదైవం అధిభూతం చ అధిదైవం చ అధిభూతాధిదైవం సహ అధిభూతాధిదైవేన వర్తతే ఇతి సాధిభూతాధిదైవం చ మాం యే విదుః, సాధియజ్ఞం చ సహ అధియజ్ఞేన సాధియజ్ఞం యే విదుః, ప్రయాణకాలే మరణకాలే అపి చ మాం తే విదుః. యుక్తచేతసః సమాహితచిత్తాః ఇతి.**

**తె.అ.** అధిభూత అధిదైవములతో సహా, అధియజ్ఞం తోను, నన్ను తెలుసుకున్నవారు మరణకాలంలో కూడా చిత్తం ఏకాగ్రమై నా యందే మనస్సు నిలిపి నన్ను తెలిసికొంటారు (అన్ని భూతాలలో అన్ని దైవాలలో అన్ని యజ్ఞాలలో ఉన్న నన్ను తెలుసుకున్నవారు అని)

**ఇతి శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్యగోవిందభగవత్పూజ్యపాదశిష్య శ్రీమచ్ఛంకరభగవతః కృతౌ, శ్రీమద్భగవద్గీతాభాష్యే జ్ఞానవిజ్ఞానయోగో నామ సప్తమోఽధ్యాయః**

ఇది శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య గోవింద భగవత్పూజ్యపాదశిష్యులు, శ్రీమత్ శంకర భగవత్పాదులు రచించిన శ్రీమద్భవద్గీతా భాష్యంలో జ్ఞానవిజ్ఞానయోగం అనే ఏడవ అధ్యాయానికి తెలుగు అనువాదం.



# అష్టమోఽధ్యాయః

# ధారణాయోగః

**భాష్యమ్ : 0.1 'తే బ్రహ్మ తద్విదుః కృత్స్నమ్' (7.29) ఇత్యాదినా భగవతా అర్జునస్య ప్రశ్నబీజాని ఉపదిష్టాని అతః తత్ప్రశ్నార్థం అర్జునః ఉవాచ.**

తె.అ. 'తే బ్రహ్మ తద్విదుః కృత్స్నమ్' (7.29)లో భగవానుడు అన్నమాటలు అర్జునునిలో ప్రశ్నలు రేకెత్తించినాయి. కనుక అర్జునుడు ఆ ప్రశ్నలు అడుగుతున్నాడు.

**అర్జున ఉవాచ –**

**మూ. కిం తద్ బ్రహ్మ కిమధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ ।**
**అధిభూతం చ కిం ప్రోక్తం అధిదైవం కిముచ్యతే ॥ 1**

అర్జునుడు అంటున్నాడు.

**తె.అ.** ఆ బ్రహ్మమేది? అధ్యాత్మమేది? కర్మ ఏది? అధిభూతం అంటే ఏమిటి? అధిదైవమని దేన్ని అంటారు?

**మూ. అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మిన్మధుసూదన ।**
**ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః ॥ 2**

**తె.అ.** ఈ దేహంలో యజ్ఞం చేసేవాడెవడు? ఎట్లా చేస్తాడు? మరణ సమయంలో నియతాత్ములు నిన్ను ఎట్లా తెలిసి ఉంటారు?

**భాష్యమ్ : 3.0. ఏషాం ప్రశ్నానాం యథాక్రమం నిర్ణయాయ శ్రీ భగవాన్ ఉవాచ.**

**తె.అ.** ఈ ప్రశ్నలకు అదే వరుసలో సమాధానం చెపుతూ శ్రీ భగవానుడంటున్నాడు.

**శ్రీ భగవానువాచ –**

**మూ. అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మముచ్యతే ।**
**భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః ॥ 3**

శ్రీ భగవానుడు అంటున్నాడు.

**తె.అ.** వినాశరహితమైన తత్త్వము బ్రహ్మము. స్వభావాన్ని అధ్యాత్మమంటారు. భూతసృష్టికి కారణమైన విసర్గమునకే కర్మమని పేరు.

**భాష్యమ్ : అక్షరం ఇతి. అక్షరం న క్షరతీతి అక్షరం పరమాత్మా 'ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి' (బృ.ఉ. 3.8.9) ఇతి శ్రుతేః. ఓంకారస్య చ 'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ' (8.13) ఇతి పరేణ విశేషణాత్ అగ్రహణమ్. పరమమ్ ఇతి నిరతిశయే బ్రహ్మణి అక్షరే ఉపపన్నతరం విశేషణమ్. తస్యైవ పరస్య బ్రహ్మణః ప్రతిదేహం ప్రత్యగాత్మభావః స్వభావః, స్వః భావః స్వభావః అధ్యాత్మం ఉచ్యతే. ఆత్మానం దేహం అధికృత్య ప్రత్యగాత్మతయా ప్రవృత్తం పరమార్థబ్రహ్మావసానం వస్తు స్వభావః అధ్యాత్మం ఉచ్యతే – అధ్యాత్మశబ్దేన అభిధీయతే. భూతభవోద్భవకరః భూతానాం భావః భూతభావః తస్య ఉద్భవః భూతభావోద్భవః తం కరోతి ఇతి భూతభావోద్భవకరః, భూతవస్తూత్పత్తికరః ఇత్యర్థః. విసర్గః విసర్జనం దేవతోద్దేశేన చరుపురోడాశాదేః ద్రవ్యస్య పరిత్యాగః, స ఏష విసర్గలక్షణః యజ్ఞః కర్మసంజ్ఞితః కర్మశబ్దితః ఇత్యేతత్. ఏతస్మాత్ హి బీజభూతాత్ వృష్ట్యాదిక్రమేణ స్థావరజంగమాని భూతాని ఉద్భవంతి.**

**తె.అ.** అక్షరం అంటే క్షరం కానిది, నాశము లేనిది అది "ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి" (బృ.ఉ.3.8.9) ఓ గార్గీ! ఆ అక్షరం యొక్క శాసనం ప్రకారమే సర్వప్రపంచమూ ఉన్నది – ఇది శ్రుతి వాక్యం. ఇక్కడ 'అక్షర' శబ్దానికి 'పరమ' అనే విశేషణం నిరతిశయమైన అక్షర బ్రహ్మానికే ఎక్కువగా సరిపోతుంది. ఆ పరబ్రహ్మం ప్రతిదేహంలోను అంతరాత్మభావంతో ఉండడమే స్వభావం. ఆ స్వభావాన్నే అధ్యాత్మ మంటారు. ఆత్మను అంటే దేహాన్ని ఆశ్రయించి అంతరాత్మరూపంతో ఉండే వస్తువు. ఈ అంతరాత్మయే చివరకు పరమార్థబ్రహ్మంగా పర్యవసిస్తుంది. అంతరాత్మభావమే స్వభావం. దానినే అధ్యాత్మమంటారు. అధ్యాత్మశబ్దానికి అదే అర్థం. ప్రాణుల ఉత్పత్తికి కారణమైన కర్మమే విసర్గం – అంటే దేవతలనుద్దేశించి చరుపురోడాశ వంటి హవనయోగ్యమైన ద్రవ్యాలు విసర్జన చెయ్యడం, యజ్ఞంలో త్యాగం చెయ్యడం. ఈ బీజరూపమైన యజ్ఞం వల్లనే వర్షం మొదలైనవి కలిగి క్రమంగా స్థావరజంగమభూతములు పుడుతున్నాయి.

**మూ. అధిభూతం క్షరో భావః పురుషశ్చాధిదైవతమ్ ।**
**అధియజ్ఞోఽహమేవాత్ర దేహే దేహభృతాం వర ॥ 4**

**తె.అ.** క్షరమైనది అధిభూతం. పురుషుడు అధిదైవం. ఈ దేహంలో అధియజ్ఞాన్ని నేనే.

**భాష్యమ్ : అధిభూతం ఇతి. అధిభూతం ప్రాణిజాతం అధి (కృత్య) భవతీతి. కోఽసౌ? క్షరః క్షరతీతి క్షరః వినాశీ, యత్ కించిత్ జనిమత్ వస్తు ఇత్యర్థః, పురుషః పూర్ణః అనేన సర్వమ్ ఇతి, పురి శయనాత్ వా పురుషః ఆదిత్యాంతర్గతః హిరణ్యగర్భః, సర్వప్రాణికరణానాం అనుగ్రాహకః, సః అధిదైవతమ్. అధియజ్ఞః సర్వయజ్ఞాభిమానినీ విష్ణ్వాఖ్యా దేవతా, 'యజ్ఞో వై విష్ణుః' (తై.సం. 1.7.4) ఇతి శ్రుతేః, స హి విష్ణుః అహమ్ ఏవ, అత్ర అస్మిన్ దేహే యః యజ్ఞః తస్య అహం**

**అధియజ్ఞః, యజ్ఞః హి దేహనిర్వర్త్యత్వేన దేహసమవాయీ ఇతి దేహాధికరణః భవతి, దేహభృతాం వర.**

**తె.అ.** ప్రాణికోటిని ఆశ్రయించి ఉంటుంది కనుక దానికి అధిభూతమని పేరు. ఏది అది? క్షరం, క్షయమయేది, నశించేది కనుక. పుట్టే ప్రతివస్తువు అని అర్థం. సర్వము ఇతనిచేత పూర్ణమై ఉన్నది అని పురుషుడు. లేక శరీరరూప పురంలో శయనించువాడు కనుక పురుషుడు. సూర్యునిలో ఉండి సమస్త ప్రాణుల ఇంద్రియాదికరణాలను అనుగ్రహించే హిరణ్యగర్భుడు అధిదైవం. యజ్ఞాలన్నిటికీ అధిపతి అయిన విష్ణువు అని పేరుగల దేవత అధియజ్ఞం. 'యజ్ఞమే కదా విష్ణువు' (తై.సం. 1.7.4) అని శ్రుతి. దేహం ధరించినవారిలో శ్రేష్ఠుడైన అర్జునా, ఈ దేహంలోని యజ్ఞానికి అధిపతి అయిన విష్ణురూప అధియజ్ఞాన్ని నేనే. యజ్ఞం దేహం చేతనే నిర్వర్తింపబడుతుంది కనుక యజ్ఞునికి దేహంతో నిత్యసంబంధం ఉంది. కనుక అతడు దేహాన్ని ఆశ్రయించి ఉంటాడు అని.

**మూ. అంతకాలే చ మామేవ స్మరన్ ముక్త్వా కలేవరమ్ ।**
**యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః ॥ 5**

**తె.అ.** మరి, మరణ సమయంలో నన్నే స్మరిస్తూ శరీరం విడిచివెళ్ళేవాడు నన్ను చేరుకుంటాడు. ఇందులో సందేహం లేదు.

**భాష్యమ్ : 5.1 అంతకాలే ఇతి. అంతకాలే మరణకాలే చ మామ్ ఏవ పరమేశ్వరం విష్ణుం స్మరన్ ముక్త్వా పరిత్యజ్య కలేవరం శరీరం యః ప్రయాతి గచ్ఛతి, సః మద్భావం వైష్ణవం తత్త్వం యాతి. న అస్తి న విద్యతే అత్ర అస్మిన్ అర్థే సంశయః, యాతి వా న వా ఇతి.**

**తె.అ.** మరణసమయంలో పరమేశ్వరుడు విష్ణువు అయిన నన్నే స్మరిస్తూ శరీరాన్ని విడిచి వెళ్ళేవాడు నన్ను అంటే వైష్ణవతత్త్వాన్ని పొందుతాడు. ఈ విషయంలో పొందుతాడా పొందడా అన్న సందేహం లేదు.

**భాష్యమ్ : 6.0.** న మద్విషయః ఏవ అయం నియమః కిం తర్హి –

**తె.అ.** ఈ నియమం కేవలం నా విషయంలో మాత్రమే కాదు –

**మూ. యం యం వాఽపి స్మరన్ భావం త్యజత్యంతే కలేవరమ్ ।**
**తం తమేవైతి కౌంతేయ సదా తద్భావ భావితః ॥ 6**

**తె.అ.** సదా ఏ దేవతను తలచుకుంటూ ఉంటాడో మరణసమయంలో అదే దేవతను స్మరిస్తాడు. మరణసమయంలో ఏ దేవతను స్మరిస్తూ శరీరం విడుస్తాడో అతడు ఆ దేవతనే చేరుకుంటాడు.

**భాష్యమ్ : 6.1 యం ఇతి. యం యం వా౽పి యం యం భావం దేవతావిశేషం స్మరన్ చింతయన్ త్యజతి పరిత్యజతి అంతే అంతకాలే ప్రాణవియోగకాలే కలేబరం శరీరం తం తమ్ ఏవ స్మృతం భావం ఏవ ఏతి న అన్యం కౌంతేయ! సదా సర్వదా తద్భావభావితః తస్మిన్ భావః సః భావితః స్మర్యమాణతయా అభ్యస్తః యేన సః తద్భావభావితః సన్.**

**తె.అ.** ప్రాణంపోయే సమయంలో ఏ దేవతను తలచుకుంటూ శరీరాన్ని విడుస్తాడో అతడు తలచిన ఆ దేవతనే పొందుతాడు, మరొకరిని కాదు. ఉపాసించే ఆ దేవతలయందు భావన తద్భావం. ఆ భావన నిరంతరస్మరణ చేత అభ్యాసమవుతుంది. (అభ్యాసం అయింది కనుకనే అంత్యకాలంలో అదే తలపుకు వస్తుంది).

**భాష్యమ్ : 7.0. యస్మాత్ ఏవం అంత్యా భావనా దేహాంతరప్రాప్తౌ కారణమ్.**

**తె.అ.** అంత్యకాలంలోని భావన దేహాంతరప్రాప్తికి కారణమౌతుంది.

**మూ. తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ ।**
**మయ్యర్పితమనోబుద్ధిర్మామేవైష్యస్యసంశయః ॥ 7**

**తె.అ.** కనుక అన్నివేళలా నన్ను స్మరిస్తూ ఉండు. యుద్ధం కూడా చేయి. మనసు, బుద్ధి నాకు అర్పించి నిస్సంశయంగా నన్నే చేరుకుంటావు.

**భాష్యమ్ : 7.1. తస్మాత్ ఇతి. తస్మాత్ సర్వేషు కాలేషు మాం అనుస్మర. యథాశాస్త్రమ్ యుధ్య చ యుద్ధం చ స్వధర్మం కురు. మయి వాసుదేవే అర్పితే మనోబుద్ధీ యస్య తవ సః త్వం మయి అర్పితమనోబుద్ధిః సన్ మామ్ ఏవ యథాస్మృతం ఏష్యసి ఆగమిష్యసి, అసంశయః న సంశయః అత్ర విద్యతే. కించ.**

**తె.అ.** (అభ్యాసమై అంత్యకాలంలో అదే స్మరణకు రావడం కొరకు. అంత్యకాలం ఎప్పుడైనా రావచ్చు కూడా) కనుక అన్నివేళలా నన్ను స్మరిస్తూ ఉండు. శాస్త్రం నీకు విధించిన నీ స్వధర్మమైన యుద్ధం కూడా చేయి. వాసుదేవుడనైన నా యందు మనోబుద్ధులర్పించి నన్ను స్మరించినవిధంగా నన్నే చేరుకుంటావు. ఇందులో సందేహం లేదు. ఇంకా –

**మూ. అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా ।**
**పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్ ॥ 8**

**తె.అ.** అభ్యాసయోగం చేత ఇతర విషయాలవైపు పోని చిత్తంతో, పరమ దివ్యపురుషుని ధ్యానిస్తూ యోగి అతనినే చేరుకుంటాడు.

**భాష్యమ్ : 8.1. అభ్యాస ఇతి. అభ్యాసయోగయుక్తేన – మయి చిత్తసమర్పణవిషయభూతే ఏకస్మిన్ తుల్యప్రత్యయావృత్తిలక్షణః విలక్షణప్రత్యయానంతరితః అభ్యాసః, స చాసౌ యోగః తేన యుక్తం తత్రైవ వ్యాపృతం యోగినః చేతః, తేన చేతసా నాన్యగామినా న అన్యత్ర విషయాంతరే గంతుం శీలం అస్యేతి నాన్యగామి తేన నాన్యగామినా, పరమం నిరతిశయం పురుషం దివ్యం దివి సూర్యమండలే భవం యాతి గచ్ఛతి హే పార్థ! అనుచింతయన్ శాస్త్రాచార్యోపదేశం అనుధ్యాయన్ ఇత్యేతత్.**

**తె.అ.** చిత్త సమర్పణకు ఏకవిషయమైన నన్ను, మరొక తలపు మధ్యలో అడ్డురాకుండా, మళ్ళీ మళ్ళీ తలుస్తూ ఉండటమే అభ్యాసం. అదే యోగం. యోగి చిత్తం అందులో లగ్నమై ఉంటుంది. ఇతర విషయాలవైపు వెళ్ళని అటువంటి చిత్తంతో శాస్త్రము, ఆచార్యులు ఉపదేశించిన విషయాన్ని ధ్యానిస్తూ (యోగి) సూర్యమండలంలో ఉండే పరమపురుషుని చేరుకుంటాడు.

**భాష్యమ్. 9.0. కిం విశిష్టం చ పురుషం యాతి ఇతి? ఉచ్యతే**

**తె.అ.** అతడు చేరుకొనే ఆ పురుషుని విశేషణాలేవి?

**మూ. కవిం పురాణమనుశాసితారమణోరణీయాం సమనుస్మరేద్యః ।**
**సర్వస్య ధాతారమచిన్త్యరూపమాదిత్యవర్ణం తమసః పరస్తాత్ ॥ 9**

**తె.అ.** కవి, పురాతనుడు, అనుశాసనం చేసేవాడు, అణువుకంటె సూక్ష్మమైనవాడు, అందరికి విధాత, అచింత్య రూపుడు, ఆదిత్యవర్ణుడు, తమస్సుకు అవతలివాడు అయిన ఆ పురుషుని స్మరించేవాడు అతనిని పొందుతాడు.

**భాష్యమ్ : 9.1 కవిం ఇతి. కవిం క్రాంతదర్శినం సర్వజ్ఞం, పురాణం చిరంతనం, అనుశాసితారం సర్వస్య జగతః ప్రశాసితారం, అణోః సూక్ష్మాత్ అపి అణీయాంసం సూక్ష్మతరం అనుస్మరేత్ అనుచింతయేత్ యః కశ్చిత్, సర్వస్య కర్మఫలజాతస్య ధాతారం విధాతారం విచిత్రతయా ప్రాణిభ్యః విభక్తారం, (విభజ్య ధాతారం) అచింత్యరూపం న అస్య రూపం నియతం విద్యమానమ్ అపి కేనచిత్ చింతయితుం శక్యతే ఇతి అచింత్యరూపః తం ఆదిత్యవర్ణమ్ ఆదిత్యస్య ఇవ నిత్యచైతన్యప్రకాశః వర్ణః యస్య తం ఆదిత్యవర్ణమ్ తమసః పరస్తాత్ అజ్ఞానలక్షణాత్ మోహాంధకారాత్ పరం తం 'అనుచింతయన్ యాతి' ఇతి పూర్వేణ సంబంధః. కించ –**

**తె.అ.** కవి కంటే క్రాంతదర్శి. సర్వజ్ఞుడు. పురాతనుడు, చిరంతనుడు, అనుశాసనం చేసేవాడు, సర్వజగత్తును శాసించేవాడు. సూక్ష్మమైన అణువుకంటె సూక్ష్మమైనవాడు. అందరికీ విధాత. అందరి కర్మఫలాలన్నిటిని ఎవరికెంత చెందదగునో అంత విభజించి ఇచ్చేవాడు. అచింత్యరూపుడు,

అతని రూపం ఎప్పుడూ ఉన్నదే అయినా ఎవరికీ చింతించరానిది ఊహించరానిది. ఆదిత్యవర్ణుడు, సూర్యునికాంతివలె నిత్యచైతన్య ప్రకాశం కలవాడు. చీకటికి అవతలివాడు, అజ్ఞానలక్షణమనే మోహాంధకారానికి అవతలివాడు. అటువంటి వానిని 'ధ్యానిస్తూ చేరుకుంటాడు' అని పూర్వశ్లోకంతో కలిపి అన్వయించుకోవాలి. ఇంకా –

**మూ. ప్రయాణకాలే మనసాఽచలేన భక్త్యా యుక్తో యోగబలేన చైవ ।**
**భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్ స తం పరం పురుషముపైతి దివ్యమ్ ॥ 10**

**తె.అ.** మరణసమయంలో చలించని మనసుతో, భక్తితో, యోగబలంతో భ్రూమధ్యంలో ప్రాణశక్తిని జాగ్రత్తతో నిలిపి అతడు ఆ దివ్యపురుషుని చేరుకుంటాడు.

**భాష్యమ్ : 10.1. ప్రయాణ ఇతి. ప్రయాణకాలే మరణకాలే మనసా అచలేన చలనవర్జితేన భక్త్యా యుక్తః భజనం భక్తిః తయా యుక్తః యోగబలేన చ ఏవ యోగస్య బలం యోగబలం సమాధిజసంస్కార ప్రచయజనితచిత్తస్థైర్యలక్షణం యోగబలం తేన చ యుక్తః ఇత్యర్థః పూర్వం హృదయపుండరీకే వశీకృత్య చిత్తం తతః ఊర్ధ్వగామిన్యా నాడ్యా భూమిజయక్రమేణ భ్రువోః మధ్యే ప్రాణం ఆవేశ్య స్థాపయిత్వా సమ్యక్ అప్రమత్తః సన్, సః ఏవం విద్వాన్ యోగీ 'కవిం పురాణమ్' (8.9) ఇత్యాది లక్షణం తం పరం (పరతరం) పురుషం ఉపైతి ప్రతిపద్యతే దివ్యం ద్యోతనాత్మకమ్.**

**తె.అ.** మరణసమయంలో భక్తిచేత, యోగబలంచేత కూడా నిశ్చలమైన మనసుతో – భక్తి అంటే భజనం, సేవించడం. సమాధిలో కలిగే సంస్కారసమూహంచేత కలిగే చిత్తస్థైర్యమే యోగబలం. ముందుగా చిత్తాన్ని హృదయ పద్మంలో వశీకరించుకుని, తరువాత పైకివెళ్ళే నాడిద్వారా చిత్తభూమిని క్రమంగా ఒక్కొక్కదానిని జయించుకుంటూ భ్రూమధ్యంలో ప్రాణాన్ని ప్రవేశింపజేసి, నిలిపి జాగ్రత్తతో నుండి ఆ విద్వాంసుడైన యోగి 'కవిం పురాణం' (9) అని చెప్పిన లక్షణాలు గల పరమ దివ్యపురుషుని పొందుతాడు.

**భాష్యమ్ : పునరపి వక్ష్యమాణేన ఉపాయేన ప్రతిపిప్సితస్య బ్రహ్మణః వేదవిద్వదనాది విశేషణ విశేష్యస్య అభిధానం కరోతి భగవాన్ –**

**తె.అ.** మళ్ళీ భగవానుడు బ్రహ్మమును తెలుసుకోడానికి మార్గం చెప్పబోతూ, వేదవిదులచేత నిర్ణయింపబడిన ఆ బ్రహ్మమును ప్రతిపాదిస్తున్నాడు.

**మూ. యదక్షరం వేదవిదో వదంతి విశంతి యద్యతయో వీతరాగాః ।**
**యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే ॥ 11**

**తె.అ.** వేదవిదులు అక్షరమని దేనినంటారో విరాగులైన యతులు దేనియందు ప్రవేశిస్తున్నారో దేనిని కోరుకొని బ్రహ్మచర్యం అవలంబిస్తున్నారో ఆ పదాన్ని నీకు సంగ్రహంగా చెపుతాను.

**భాష్యమ్ : యత్ ఇతి. యత్ అక్షరం న క్షరతీతి అక్షరం అవినాశి వేదవిదః వేదార్థజ్ఞాః వదంతి, 'ఏతద్వై తదక్షరం గార్గి బ్రాహ్మణా అభివదంతి' ఇతి శ్రుతేః, సర్వవిశేషనివర్తకత్వేన అభివదంతి 'అస్థూలమనణు' (బృ.ఉ.3.8.8) ఇత్యాది. కించ విశంతి ప్రవిశంతి సమ్యగ్దర్శనప్రాప్తౌ సత్యాం యత్ యతయః యతనశీలాః సంన్యాసినః వీతరాగాః వీతః విగతః రాగః యేభ్యః తే వీతరాగాః. యత్ చ అక్షరం ఇచ్ఛంతః – 'జ్ఞాతుం' ఇతి వాక్యశేషః – బ్రహ్మచర్యం గురౌ చరంతి ఆచరంతి, తత్ తే పదం తత్ అక్షరాఖ్యం పదం పదనీయం తే తుభ్యం సంగ్రహేణ సంగ్రహః సంక్షేపః తేన సంక్షేపేణ ప్రవక్ష్యే కథయిష్యామి.**

**తె.అ.** వేదార్థం తెలిసినవారు దేనిని అక్షరం, నాశనంలేనిది అంటారో దానిని 'ఓ గార్గి, బ్రాహ్మణులు ఈ అక్షరాన్నే అభివర్ణిస్తారు', (బృ.ఉ. 3.8.8.) అని శ్రుతి. 'స్థూలం కాదు సూక్ష్మం కాదు' (బృ.ఉ. 3.8.8) అని విశేషణాలన్నిటినీ నివారిస్తూ ఆ బ్రహ్మమును వర్ణిస్తున్నారు. యతనశీలురు యతులు. రాగం రాలిపోయినవారు వీతరాగులు, విరాగులు, సంన్యాసులు, సమ్యగ్దర్శనం కలిగిన తరువాత విరాగులైన యతులు దేనియందు ప్రవేశిస్తారో, అక్షరమైన దేనిని తెలిసికొనగోరి గురువువద్ద బ్రహ్మచర్యం అవలంబిస్తారో, ఆ అక్షరమనబడే పదాన్ని, గమ్యస్థానాన్ని సంక్షేపంగా నీకు చెపుతాను.

**భాష్యమ్ : 12.0 'స యోహ వై తద్భగవన్ మనుష్యేషు ప్రాణయాంతమోంకార మభిధ్యాయీత కతమం వావ స తేన లోకం జయతీతి. తస్మై స హోవాచ ఏతద్వై సత్యకామ పరం చాపరం చ బ్రహ్మ యదోంకారః' ఇత్యుపక్రమ్య 'యః పునరేతం త్రిమాత్రేణోమిత్యేతేనైవాక్షరేణ పరం పురుష మభిధ్యాయీత... స సామభిరున్నీయతే బ్రహ్మలోకమ్ (ప్ర.ఉ.5.1.2.5) ఇత్యాదినా వచనేన 'అన్యత్ర ధర్మాదన్యత్రాధర్మాత్' ఇతి చ ఉపక్రమ్య 'సర్వే వేదా యత్పదమామనంతి. తపాంసి సర్వాణి చ యద్వదంతి. యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి. తత్తే పదం సంగ్రహేణ బ్రవీమ్యోమిత్యేత్'. (కఠ.ఉ.2.14.15) ఇత్యాదిభిశ్చ వచనైః పరస్య బ్రహ్మణః వాచకరూపేణ, ప్రతిమావత్ ప్రతీకరూపేణ వా, పరబ్రహ్మప్రతిపత్తిసాధనత్వేన మందమధ్యమబుద్ధీనాం వివక్షితస్య ఓంకారస్య ఉపాసనం కాలాంతరే ముక్తిఫలం ఉక్తం యత్, తదేవ ఇహాపి 'కవిం పురాణమనుశాసితారం', 'యదక్షరం వేదవిదో వదంతి' ఇతి చ ఉపన్యస్తస్య పరస్య బ్రహ్మణః పూర్వోక్తరూపేణ ప్రతిపత్త్యుపాయభూతస్య ఓంకారస్య కాలాంతరముక్తిఫలం ఉపాసనం యోగధారణాసహితం వక్తవ్యం ప్రసక్తానుప్రసక్తం చ యత్కించిత్, ఇత్యేవమర్థః ఉత్తరః గ్రంథః ఆరభ్యతే.**

**తె.అ.** 'ఓ భగవాన్, మరణపర్యంతము ఓంకారాన్ని ధ్యానిస్తూ ఉండే మనుష్యుడు ఆ సాధన వల్ల ఏ లోకాన్ని జయిస్తాడు' (అని సత్యకాముడు అడిగిన ప్రశ్నకు పిప్పలాద ఋషి) అతనితో అన్నాడు : 'సత్యకామా, ఈ ఓంకారమే నిస్సందేహంగా పరబ్రహ్మము, అపరబ్రహ్మము కూడా' అని ప్రారంభించి 'ఈ త్రిమాత్రల ఓం అనే అక్షరంతో పరమ పురుషుని ఎవడు ధ్యానిస్తాడో' (ప్ర.ఉ.5.1.2.5) మొదలైన వాక్యాలలో; 'ధర్మం కంటె వేరయినది అధర్మం కంటె వేరయినది' అని ప్రారంభిస్తూ 'వేదాలన్నీ ఏ పదాన్ని ఘోషిస్తున్నాయో, తపములన్నీ దేన్ని తెలుపుతున్నాయో, దేన్ని కోరి బ్రహ్మచర్యం పాటిస్తున్నారో, ఆ పదాన్ని సంగ్రహంగా నీకు నేను చెపుతాను – ఓం అనేదే అది' (క.ఉ. 1.2.14.15) మొదలైన వాక్యాలలో కూడా; పరబ్రహ్మమునకు వాచకరూపంగా ప్రతిమవలె ప్రతీక రూపంగా కూడా పరబ్రహ్మమును పొందడానికి సాధనంగా మంద మధ్యబుద్ధులకు చెప్పబడిన ఓంకారోపాసన కాలాంతరంలో ముక్తిఫలం ఇస్తుందని చెప్పబడింది'. అదే ఇక్కడ కూడా 'కవిం పురాణమనుశాసితారమ్' (9) 'యదక్షరం వేదవిదో వదన్తి' (11) అని ప్రతిపాదించిన పరబ్రహ్మమును పొందడానికి పూర్వం చెప్పినట్లు సాధనంగా కాలాంతరంలో ముక్తిఫలమిచ్చే ఓంకారోపాసనను యోగధారణాసహితంగా చెప్పవలసి ఉంది; ప్రసక్తాను ప్రసక్తంగా చెప్పవలసినవి కూడా చెప్పడం కొరకు తరువాతి గ్రంథాన్ని ఆరంభిస్తున్నాడు –

**మూ. సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ ।**
**మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణామ్ ॥ 12**

**తె.అ.** సర్వద్వారాలను నియమించి మనసును హృదయంలో కట్టివేసి శిరస్సునందు ప్రాణం నిలిపి యోగధారణకు ప్రవృత్తుడై,

**భాష్యమ్ : 12.1 సర్వ ఇతి. సర్వద్వారాణి సర్వాణి చ తాని ద్వారాణి చ సర్వద్వారాణి ఉపలబ్ధౌ, తాని సర్వాణి సంయమ్య సంయమనం కృత్వా మనః హృది హృదయపుండరీకే నిరుధ్య నిరోధం కృత్వా నిష్ప్రచారం ఆపాద్య, తత్ర వశీకృతేన మనసా హృదయాత్ ఊర్ధ్వగామిన్యా నాడ్యా ఊర్ధ్వం ఆరుహ్య మూర్ధ్ని ఆధాయ ఆత్మనః ప్రాణం ఆస్థితః ప్రవృత్తః యోగధారణం ధారయితుమ్. తత్రైవ చ ధారయన్ –**

**తె.అ.** విషయాలను వేటిద్వారా గ్రహిస్తామో ఆ ద్వారాలను అంటే ఇంద్రియాలనన్నిటిని సంయమనం చేసి, మనసును హృదయకమలంలో నిరోధించి, నిష్ప్రచారం చేసి కదలకుండా కట్టివేసి వశం చేసుకున్న మనసుతో, హృదయం నుండి పైకివెళ్ళే నాడిద్వారా పైకివెళ్ళి తన ప్రాణాన్ని మూర్ధ్నంలో స్థాపించి యోగధారణకు ప్రవృత్తుడై, అక్కడనే ప్రాణం స్థిరంగా ఉంచి,

**మూ. ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్ ।**
**యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిమ్ ॥ 13**

**తె.అ.** బ్రహ్మమును చెప్పే ఏకాక్షరమైన ఓంకారమును ఉచ్చరిస్తూ నన్ను స్మరిస్తూ దేహం విడిచి వెళ్ళేవాడు పరమగతిని పొందుతాడు.

**భాష్యమ్ : 13.1 ఓమ్ ఇతి. ఓం ఇతి ఏకాక్షరం బ్రహ్మ బ్రహ్మణః అభిధానభూతం ఓంకారం వ్యాహరన్ ఉచ్చారయన్, తదర్థభూతం మాం ఈశ్వరం అనుస్మరన్ అనుచింతయన్ యః ప్రయాతి మ్రియతే సః త్యజన్ పరిత్యజన్ దేహం శరీరం 'త్యజన్ దేహం' ఇతి ప్రయాణవిశేషణార్థం, దేహత్యాగేన ప్రయాణం ఆత్మనః న స్వరూపనాశేన ఇత్యర్థః సః ఏవం త్యజన్ యాతి గచ్ఛతి పరమాం ప్రకృష్టాం గతిమ్.**

**తె.అ.** బ్రహ్మమునకు వాచకము ఓంకారము. ఆ ఏకాక్షరమైన ఓంకారాన్ని ఉచ్చరిస్తూ దానికి అర్థమైన నన్ను ఈశ్వరుని స్మరిస్తూ ఎవడు మరణిస్తాడో అతడు దేహాన్ని విడిచి పరమగతిని పొందుతాడు. 'దేహాన్ని విడిచి' అనడం ప్రయాణాన్ని విశేషించడానికి. అంటే ఆత్మప్రయాణం దేహత్యాగమే కాని స్వరూపనాశనం కాదు అని. ఇంకా –

**మూ. అనన్యచేతాః సతతం యో మాం స్మరతి నిత్యశః ।**
**తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః ॥ 14**

**తె.అ.** ఇతర విషయాలపై మనసుపోనీక నిత్యము నిరంతము నన్ను స్మరించే యోగికి నేను సులభుడను.

**భాష్యమ్ : 14.1 అనన్యచేతాః ఇతి. అనన్యచేతాః న అన్యవిషయే చేతః యస్య సః అయం అనన్యచేతాః యోగీ సతతం సర్వదా యః మాం పరమేశ్వరం స్మరతి నిత్యశః 'సతతం' ఇతి నైరంతర్యం ఉచ్యతే, 'నిత్యశః' ఇతి దీర్ఘకాలం ఉచ్యతే'. న షణ్మాసం సంవత్సరం వా కిం తర్హి? యావజ్జీవం నైరంతర్యేణ యః మాం స్మరతి ఇత్యర్థః. తస్య యోగినః అహం సులభః సుఖేన లభ్యః హే పార్థ, నిత్యయుక్తస్య సదా సమాహితచిత్తస్య యోగినః. యతః ఏవం, అతః అనన్యచేతాః సన్ మయి సదా సమాహితః భవేత్.**

**తె.అ.** మరొకవిషయంపై మనసుపోనీక ఎల్లపుడు ఏకాగ్రమైన చిత్తంతో సతతము, నిత్యము పరమేశ్వరుని నన్ను స్మరించే యోగికి నేను సులభంగా అందుతాను. 'సతతము' అనే పదం నైరంతర్యాన్ని చూపుతుంది. (అంతరాయం లేకుండా అని) 'నిత్యము' అనేది దీర్ఘకాలాన్ని చెపుతుంది. ఆరునెలలో సంవత్సరమోకాదు యావజ్జీవము నిరంతరాయంగా నన్ను స్మరించేవాడు అని అర్థం. కనుక మరొక విషయంపై మనసుపోనీక నాయందు సదా ఏకాగ్రచిత్తంతో ఉండవలెను.

**భాష్యమ్ : 15.0 తవ సౌలభ్యేన కిం స్యాత్ ఇతి? ఉచ్యతే, శృణు తత్ మమ సౌలభ్యేన యత్ భవతి.**

**తె.అ.** నీవు సులభుడవైనందువలన ఏం ప్రయోజనం? అంటే చెపుతాను. విను నా సౌలభ్యము వలన ఏమి జరుగునో -

**మూ. మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయమశాశ్వతమ్ ।**
**నాప్నువంతి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః ॥ 15**

**తె.అ.** నన్నుచేరి మహాత్ములు పరమమైన సంసిద్ధిని పొంది దుఃఖనిలయము, అశాశ్వతము అయిన జన్మను మళ్ళీ ఎత్తరు.

**భాష్యమ్ : 15.1 మాం ఉపేత్య ఇతి. మాం ఈశ్వరం ఉపేత్య మద్భావం ఆపద్య పునర్జన్మ పునరుత్పత్తిం న ఆప్నువంతి న ప్రాప్నువంతి. కిం విశిష్టం పునర్జన్మ న ప్రాప్నువంతి ఇతి? తద్విశేషణం ఆహ - దుఃఖాలయం దుఃఖానాం ఆధ్యాత్మికాదీనాం ఆలయం ఆశ్రయం, ఆలీయంతే యస్మిన్ దుఃఖాని ఇతి దుఃఖాలయం జన్మ. న కేవలం దుఃఖాలయం అశాశ్వతం అనవస్థితస్వరూపం చ. నాప్నువంతి ఈదృశం పునర్జన్మ మహాత్మానః యతయః సంసిద్ధిం మోక్షాఖ్యాం పరమాం ప్రకృష్టాం గతాః ప్రాప్తాః. యే పునః మాం న ప్రాప్నువంతి తే పునః ఆవర్తంతే.**

**తె.అ.** ఈశ్వరుడైన నన్నుచేరి నా భావమును పొంది (నాలో లీనమై) పునర్జన్మ పొందరు. వారు పొందని ఆ పునర్జన్మ ఎటువంటిది? దాని లక్షణం చెపుతున్నాడు. ఆధ్యాత్మికాది దుఃఖాలకు ఆశ్రయమైనది. దుఃఖాలు లీనమై ఉంటాయి కనుక జన్మ దుఃఖాలయం. దుఃఖాలయమే కాదు అశాశ్వతం కూడా. స్థిరమైన స్వరూపం లేనిది. మహాత్ములైన యతులు పరమశ్రేష్ఠమైన మోక్షమనే సంసిద్ధిని పొంది ఇటువంటి పునర్జన్మను పొందరు. మరి, నన్ను పొందనివారు మళ్ళీ పుడుతారు.

**భాష్యమ్ : 16.0 కిం పునః త్వత్తః అన్యత్ ప్రాప్తాః పునః ఆవర్తంతే ఇతి? ఉచ్యతే -**

**తె.అ.** మరి నిన్ను కాక వేరొకపదం పొందినవారు తిరిగి వస్తారా (మళ్ళీ పుడతారా) అంటే -

**మూ. ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున ।**
**మాముపేత్య తు కౌంతేయ పునర్జన్మ న విద్యతే ॥ 16**

**తె.అ.** లోకాలన్నీ బ్రహ్మలోకంతో సహా మళ్ళీ తిరిగిరావడం ఉన్నవే. కాని నన్ను చేరితే మళ్ళీ జన్మ ఉండదు.

**భాష్యమ్ : 16.1 ఆబ్రహ్మభువనాత్ ఇతి. ఆబ్రహ్మభువనాత్ భవంతి అస్మిన్ భూతాని ఇతి భువనం. బ్రహ్మణో భువనం బ్రహ్మభువనం, బ్రహ్మలోకః ఇత్యర్థః, ఆబ్రహ్మభువనాత్ సహ**

**బ్రహ్మభువనేన లోకాః సర్వే పునరావర్తినః పునరావర్తస్వభావాః హే అర్జున, మాం ఏకం ఉపేత్య తు కౌంతేయ పునర్జన్మ పునరుత్పత్తిః న విద్యతే.**

**తె.అ.** భూతములు దీనిలో పుట్టును, కనుక భువనము. బ్రహ్మభువనము అంటే బ్రహ్మలోకం. బ్రహ్మలోకంతో సహా లోకాలన్నీ పునరావర్తనస్వభావం కలవి. (ఆ లోకాలకు వెళ్ళినవాడు మళ్ళీ పుట్టక తప్పదు) ఒక్క నన్ను చేరితే మాత్రం మళ్ళీ జన్మ ఉండదు.

**భాష్యమ్ : 17.0 బ్రహ్మలోకసహితాః లోకాః కస్మాత్ పునరావర్తినః? కాలపరిచ్ఛిన్నత్వాత్. కథమ్?**

**తె.అ.** లోకాలు, బ్రహ్మలోకంతో సహా, ఎందుకు పునరావర్తమవుతాయి అంటే కాలపరిమితి చేత. ఎట్లా?

**మూ. సహస్రయుగపర్యన్తమహర్యద్బ్రహ్మణో విదుః ।**
**రాత్రిం యుగసహస్రాంతాం తేఽహోరాత్రవిదో జనాః ॥ 17**

**తె.అ.** అహోరాత్రాలు తెలిసినవారు వేయియుగాలు బ్రహ్మకు ఒక పగలని, రాత్రికూడా వేయియుగాలని అంటారు.

**భాష్యమ్ : సహస్ర ఇతి. సహస్రయుగ పర్యంతం సహస్రాణి యుగాని పర్యంతం పర్యవసానం యస్య అహ్నః తత్ అహః సహస్రయుగపర్యంతం బ్రహ్మణః ప్రజాపతేః విరాజః విదుః, రాత్రిం అపి యుగసహస్రాంతాం అహః పరిమాణాం ఏవ. కే విదురితి? ఆహ – తే అహోరాత్రవిదః కాలసంఖ్యావిదః జనాః ఇత్యర్థః. యతః ఏవం కాలపరిచ్ఛిన్నాః తే, అతః పునరావర్తినః లోకాః.**

**తె.అ.** వేయి యుగాల కాలం బ్రహ్మకు – అంటే ప్రజాపతి లేక విరాట్టుకు – ఒక పగలు. రాత్రికూడా పగలంతే పరిమాణం గలది, అంటే వేయియుగాలు అని తెలిసినవారెవరు? అహోరాత్ర విదులు, కాలసంఖ్య తెలిసినవారు. ఈ విధంగా కాలపరిమితిగలవి కనుక లోకాలు పునరావర్త మవుతాయి.

**భాష్యమ్ : 18.0 ప్రజాపతేః అహని యత్ భవతి రాత్రౌ చ, తత్ ఉచ్యతే.**

**తె.అ.** ప్రజాపతికి పగలైనదానిలో రాత్రిలో ఏం జరుగుతుందో చెపుతున్నాడు.

**మూ. అవ్యక్తాద్ వ్యక్తయః సర్వాః ప్రభవంత్యహరాగమే ।**
**రాత్ర్యాగమే ప్రలీయంతే తత్రైవావ్యక్తసంజ్ఞకే ॥ 18**

**తె.అ.** పగలు రాగానే అవ్యక్తం నుండి సమస్తప్రాణులూ పుడుతున్నాయి. రాత్రి రాగానే అదే అవ్యక్తంలో లయమవుతున్నారు.

**భాష్యమ్ : 18.1 అవ్యక్తాత్ ఇతి. అవ్యక్తాత్ అవ్యక్తం ప్రజాపతేః స్వాపావస్థా, తస్మాత్ అవ్యక్తాత్ వ్యక్తయః వ్యజ్యంతే ఇతి వ్యక్తయః స్థావరజంగమలక్షణాః, సర్వాః ప్రజాః ప్రభవంతి అభివ్యజ్యంతే, అహ్నః ఆగమః అహరాగమః తస్మిన్ అహరాగమే కాలే బ్రహ్మణః ప్రబోధకాలే. తథా రాత్ర్యాగమే బ్రహ్మణః స్వాపకాలే ప్రలీయంతే సర్వాః వ్యక్తయః తత్ర ఏవ పూర్వోక్తే అవ్యక్త సంజ్ఞకే.**

**తె.అ.** బ్రహ్మయొక్క నిద్రావస్థ అవ్యక్తం. ఆ అవ్యక్తం నుండి స్థావరజంగమ లక్షణమైన జీవులందరూ వ్యక్తమవుతున్నారు, పుడుతున్నారు. (ఎప్పుడు?) తెలవారుతుండగా బ్రహ్మమేల్కొనేవేళ. అట్లాగే రాత్రి అవుతూనే బ్రహ్మనిదురించేవేళ, జీవులూ పూర్వం చెప్పిన అదే అవ్యక్తమనే దానిలో లయమవుతున్నారు.

**భాష్యమ్ : 19.0 అకృతాభ్యాగమకృతవిప్రణాశదోషపరిహారార్థం, బంధమోక్షశాస్త్ర ప్రవృత్తిసాఫల్య ప్రదర్శనార్థం, అవిద్యాదిక్లేశమూలకర్మాశయవశాచ్చ అవశః భూతగ్రామః భూత్వా భూత్వా ప్రలీయతే ఇత్యతః సంసారే వైరాగ్యదర్శనార్థం చ ఇదమ్ ఆహ.**

**తె.అ.** చేయని కర్మ ఫలించడం, చేసిన కర్మకు ఫలం లేకపోవడం అనే దోషాన్ని పరిహరించడం కొరకు, బంధమోక్షాలను తెలిపే శాస్త్రప్రవృత్తి సాఫల్యం ప్రదర్శించడం కొరకు అవిద్యాది పంచక్లేశాల మూలంగా అవశమైన ప్రాణికోటి మళ్ళీమళ్ళీ పుట్టి లయమవుతూ ఉన్నదని చెపుతూ సంసారమందు వైరాగ్యం ప్రదర్శించడానికి ఇది చెపుతున్నాడు -

**మూ. భూతగ్రామః స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే ।**
**రాత్ర్యాగమేఽవశః పార్థ ప్రభవత్యహరాగమే ॥ 19**

**తె.అ.** ఆ భూతసముదాయమే ఇది. మళ్ళీ మళ్ళీ పుడుతుంది. మరణిస్తూ ఉన్నది. రాత్రి అవుతూనే లయమవుతూ, పగలు ప్రారంభం కాగానే మళ్ళీ పుడుతూ ఉన్నది. అది అస్వతంత్రమైనది.

**భాష్యమ్ : 19.1 భూతగ్రామః ఇతి. భూతగ్రామః స్థావరజంగమలక్షణః యః పూర్వస్మిన్ కల్పే ఆసీత్ స ఏవ అయం నాన్యః భూత్వా భూత్వా అహరాగమే, ప్రలీయతే పునః పునః రాత్ర్యాగమే అహ్నః క్షయే అవశః అస్వతంత్రః ఏవ, హే పార్థ! ప్రభవతి జాయతే అవశః ఏవ అహరాగమే.**

**తె.అ.** పూర్వకల్పంలో ఉండిన స్థావరజంగమలక్షణమైన ఆ భూతసముదాయమే ఇది, వేరు కాదు. పగలవుతూనే పుడుతూ రాత్రి రాగానే లయమవుతూ ఉన్నది. ఈ విధంగా ఈ భూత సముదాయం అవశమై అస్వతంత్రమై మళ్ళీ మళ్ళీ పుడుతూ గిడుతూ ఉన్నది.

**భాష్యమ్ : 20.0 యత్ ఉపన్యస్తం అక్షరం తస్య ప్రాప్త్యుపాయో నిర్దిష్టః 'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ' (8.13) ఇత్యాదినా. అథ ఇదానీం అక్షరస్యైవ స్వరూపనిర్దిదిక్షయా ఇదం ఉచ్యతే, అనేన యోగమార్గేణ ఇదం గంతవ్యం ఇతి.**

**తె.అ.** అక్షరం గురించి చెప్పి, దాన్ని పొందటానికి ఉపాయం 'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ' (13) మొదలైన వాక్యాలలో నిర్దేశించాడు. ఇక ఇప్పుడు ఆ అక్షరస్వరూపాన్ని నిర్దేశించే కోరికతో ఇది చెపుతున్నాడు, ఈ యోగమార్గం చేత దానిని పొందగలరు అని –

**మూ. పరస్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తాత్సనాతనః ।**
**యః స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి ॥ 20**

**తె.అ.** కాని ఆ అవ్యక్తమైన బ్రహ్మదేవుని కంటే మరొక అవ్యక్తం ఉంది. అది సనాతనమైంది. సర్వ భూతములు నశించిన తరువాత కూడా అది నశించదు.

**భాష్యమ్ : 20.1 పరః ఇతి. పరః వ్యతిరిక్తః భిన్నః – కుతః? తస్మాత్ పూర్వోక్తాత్. 'తు' శబ్దః అక్షరస్య వివక్షితస్య అవ్యక్తాత్ వైలక్షణ్యవిశేషణార్థః. భావః అక్షరాఖ్యం పరం బ్రహ్మ. వ్యతిరిక్తత్వే సత్యపి సాలక్షణ్యప్రసంగోఽస్తీతి తద్వినివృత్త్యర్థం ఆహ – అన్యః ఇతి. అన్యః విలక్షణః. స చ అవ్యక్తః అనింద్రియగోచరః 'పరస్తస్మాత్' ఇత్యుక్తం, కస్మాత్ పునః పరః? పూర్వోక్తాత్ భూతగ్రామ–బీజభూతాత్ అవిద్యాలక్షణాత్ అవ్యక్తాత్ అన్యః విలక్షణః భావః ఇత్యభిప్రాయః. సనాతనః చిరంతనః యః సః భావః సర్వేషు భూతేషు బ్రహ్మాదిషు నశ్యత్సు న వినశ్యతి.**

**తె.అ.** పరము అంటే వ్యతిరిక్తము, భిన్నము దేనికంటె? వెనుక చెప్పిన దానికంటె. 'కాని' శబ్దం చెప్పబోయే అక్షరం వెనుకచెప్పిన అవ్యక్తం కంటె విలక్షణమైనది అనడానికి. భావం అంటే అక్షరమనే పరబ్రహ్మము. వ్యతిరిక్తమయినా ఒకే లక్షణం కలవి కావచ్చు అనే అనుమానాన్ని తొలగించడం కొరకు 'మరొక' అంటున్నాడు, విలక్షణమైనది అని. ఆ అవ్యక్తం ఇంద్రియాలకు గోచరం కానిది. 'అది కాక మరొకటి' అని అన్నాడు. ఏది కాక? వెనుక చెప్పిన భూత సముదాయానికి బీజభూతమైన అవిద్యాలక్షణమైన అవ్యక్తం కాక వేరొక లక్షణం కలిగిన భావము అని అభిప్రాయం. సనాతనము చిరంతనము అయిన ఆ భావం బ్రహ్మాదిసర్వభూతములు నశించినా నశించనిది.

**మూ. అవ్యక్తోఽక్షర ఇత్యుక్తస్తమాహుః పరమాం గతిమ్ ।**
**యం ప్రాప్య న నివర్తంతే తద్ధామ పరమం మమ ॥ 21**

**తె.అ.** అవ్యక్తము అక్షరము అని చెప్పబడిన దానినే పరమగతి అని అంటారు. ఆ గతి పొందినవారు తిరిగి రారు. అదే నా పరమపదం.

**భాష్యమ్ : 21.1 అవ్యక్తః ఇతి. యోఽసౌ అవ్యక్తః అక్షరః ఇత్యుక్తః తం ఏవ అక్షరసంజ్ఞకం అవ్యక్తం భావం ఆహుః పరమాం ప్రకృష్టాం గతిమ్. యం పరం భావం ప్రాప్య గత్వా న నివర్తంతే సంసారాయ, తత్ ధామ స్థానం పరమం ప్రకృష్టం మమ, 'విష్ణోః పరమం పదమ్' (నృ.పు.5.10) ఇత్యర్థః.**

**తె.అ.** అక్షరము అవ్యక్తము అని దేనిని అన్నారో ఆ అక్షరమనే పేరుగల అవ్యక్తభావమే పరమశ్రేష్ఠమైన గతి అని అంటారు. ఏ భావాన్ని పొంది మళ్ళీ సంసారంలోకి రారో అది నా పరమశ్రేష్ఠస్థానం, విష్ణువుయొక్క పరమపదం.

**భాష్యమ్ : 22.0 తల్లబ్ధేః ఉపాయః ఉచ్యతే -**

**తె.అ.** ఆ పరమధామం చేరుకునే ఉపాయం చెపుతున్నాడు -

**మూ. పురుషః స పరః పార్థ భక్త్యా లభ్యస్త్వనన్యయా ।**
**యస్యాంతఃస్థాని భూతాని యేన సర్వమిదం తతమ్ ॥ 22**

**తె.అ.** భూతములన్నీ ఎవనిలోపల ఉన్నాయో, ఈ సర్వము ఎవని చేత వ్యాపించి ఉన్నదో ఆ పరమపురుషుడు అనన్యమైన భక్తిచేత పొందదగినవాడు.

**భాష్యమ్ : 22.1 పురుషః ఇతి. పురుషః పురి శయనాత్ పూర్ణత్వాద్వా, సః పరః పార్థః, పరః నిరతిశయః, యస్మాత్ పురుషాత్ న పరం కించిత్. సః భక్త్యా లభ్యస్తు జ్ఞానలక్షణయా అనన్యయా ఆత్మవిషయయా (7.17) యస్య పురుషస్య అంతఃస్థాని మధ్యస్థాని భూతాని కార్యభూతాని, కార్యం హి కారణస్య అంతర్వర్తి భవతి. యేన పురుషేణ సర్వ ఇదం జగత్ తతం వ్యాప్తమ్ ఆకాశేనేవ ఘటాది.**

**తె.అ.** శరీరమనే పురంలో శయనించేవాడు కనుక పురుషుడు. లేక, పరిపూర్ణుడు కనుక. అతనికంటె శ్రేష్ఠమైనది మరొకటి లేదు కనుక పరమపురుషుడు, నిరతిశయుడు. కార్యరూపభూతములన్నీ అతనిలోపల ఉంటాయి. ఎందుకంటే కార్యం కారణం లోపల ఇమిడి ఉంటుంది కనుక. ఈ జగత్తంతా అతనిచేత, ఘటాదులు ఆకాశంచేత నిండి ఉన్నట్లు, వ్యాప్తమై ఉన్నది. అటువంటి ఆ పరమపురుషుడు అనన్యభక్తిచేత లభిస్తాడు. ఆ భక్తికి లక్షణం ఆత్మవిషయక జ్ఞానం.

**భాష్యమ్ : 23.0 ప్రకృతానాం యోగినాం ప్రణవావేశితబ్రహ్మబుద్ధీనాం కాలాంతరముక్తి-భాజాం బ్రహ్మప్రతిపత్తయే ఉత్తరో మార్గో వక్తవ్యః ఇతి 'యత్ర కాలే' ఇత్యాది వివక్షితార్థసమర్పణార్థం ఉచ్యతే ఆవృత్తిమార్గోపన్యాసః ఇతరమార్గస్తుత్యర్థః -**

**తె.అ.** ప్రణవంలో బ్రహ్మబుద్ధిని ఆవేశింపజేసినవారు, కాలాంతరంలో ముక్తిపొందబోయేవారు అయిన యోగులగురించి ఇక్కడ చెప్పుకుంటున్నాం. ఆ యోగులు బ్రహ్మమును పొందడానికి తదుపరి మార్గం చెప్పవలసి ఉంది. ఆ చెప్పదలచినదానిని చెప్పడం కొరకు 'యత్ర కాలే' అని ముందు శ్లోకాలు చెపుతున్నాడు. పునరావర్తి మార్గాన్ని చెప్పి ఇతర మార్గాన్ని స్తుతించడానికి –

**మూ. యత్ర కాలే త్వనావృత్తిమావృత్తిం చైవ యోగినః ।**
**ప్రయాతా యాన్తి తం కాలం వక్ష్యామి భరతర్షభ ॥ 23**

**తె.అ.** భరతశ్రేష్ఠా! ఏ కాలంలో చనిపోయిన యోగులు మళ్ళీ పుడుతారో, ఏ కాలంలో చనిపోయిన యోగులు మళ్ళీ పుట్టరో ఆ కాలం గురించి చెపుతాను.

**భాష్యమ్ : 23.1 యత్ర ఇతి. యత్ర కాలే ప్రయాతాః ఇతి వ్యవహితేన సంబంధః. యత్ర యస్మిన్ కాలే తు అనావృత్తిం అపునర్జన్మ ఆవృత్తిం తద్విపరీతాం చైవ. 'యోగినః' ఇతి యోగినః కర్మిణశ్చ ఉచ్యంతే, కర్మిణస్తు గుణతః 'కర్మయోగేన యోగినామ్' (3.3) ఇతి విశేషణాత్ – యోగినః యత్ర కాలే ప్రయాతాః మృతాః యోగినః అనావృత్తిం యాంతి, యత్ర కాలే చ ప్రయాతాః ఆవృత్తిం యాంతి, తం కాలం వక్ష్యామి భరతర్షభ.**

**తె.అ.** 'యత్ర కాలే' (ఏ కాలంలో) అనేదాన్ని రెండవపాదంలో ఉన్న 'ప్రయాతాః' (చని పోయినవారు)తో కలిపి అన్వయించుకోవాలి. అనావృత్తి అంటే పునర్జన్మలేనిది. ఆవృత్తి అంటే దానికి విపరీతం, అంటే పునర్జన్మ కలది. యోగులు అంటే కర్మయోగులు కూడా. కర్మలు చేసేవారు గుణంచేత యోగులు, 'కర్మయోగేన యోగినామ్' (3.3) అని విశేషించి యోగులను చెప్పినందుచేత. ఏ కాలంలో చనిపోయిన యోగులకు పునర్జన్మలేదో ఏ కాలంలో చనిపోయిన యోగులకు పునర్జన్మ ఉందో ఆ కాలం చెపుతాను. ఓ భరతర్షభా –

**భాష్యమ్ : 24.0 తం కాలం ఆహ –**

**తె.అ.** ఆ కాలాన్ని చెపుతున్నాడు –

**మూ. అగ్నిర్జ్యోతిరహః శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్ ।**
**తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః ॥ 24**

**తె.అ.** అగ్ని, జ్యోతి, పగలు, శుక్లపక్షం, ఉత్తరాయణంలోని ఆరునెలలు – ఈ కాలంలో మరణించిన బ్రహ్మవిదులు బ్రహ్మమును చేరుకుంటారు.

**భాష్యమ్ : 24.1 అగ్నిః ఇతి. అగ్నిః కాలాభిమానినీ దేవతా. తథా – జ్యోతిః అపి దైవతైవ కాలాభిమానినీ. అథవా అగ్నిజ్యోతిషీ యథాశ్రుతే ఏవ దేవతే. భూయసా తు నిర్దేశో 'యత్ర**

**కాలే' 'తం కాలం' ఇతి, ఆమ్రవనవత్. తథా అహః దేవతా అహరభిమానినీ, శుక్లః శుక్లపక్షదేవతా, షణ్మాసా ఉత్తరాయణం, తత్రాపి దేవతా ఏవ మార్గభూతా ఇతి స్థితః అన్యత్ర (బ్ర.సూ.భాష్యే.4.3.4) అయం న్యాయః. తత్ర తస్మిన్ మార్గే ప్రయాతాః మృతాః గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదః బ్రహ్మోపాసకాః బ్రహ్మోపాసన పరాః జనాః. 'క్రమేణ' ఇతి వాక్యశేషః, న హి సద్యోముక్తిభాజాం సమ్యగ్దర్శన నిష్ఠానాం గతిః ఆగతిర్వా క్వచిత్ అస్తి. 'న తస్య ప్రాణాః ఉత్క్రామంతి' (బృ.ఉ.4.4.6) ఇతి శ్రుతేః. బ్రహ్మసంలీన ప్రాణాః ఏవ తే బ్రహ్మమయాః బ్రహ్మభూతాః ఏవ తే.**

**తె.అ.** అగ్ని కాలాభిమానియైన దేవత. అట్లాగే జ్యోతికూడా కాలాభిమానియైన దేవతయే. లేక అగ్నిజ్యోతిస్సులు మనం చెప్పుకునే వైదిక దేవతలే అనుకోవచ్చు. 'ఏ కాలంలో' అని 'ఆ కాలాన్ని' అని అనడం ఆధిక్యాన్ని బట్టి, (మామిడిచెట్లు ఎక్కువగా ఉన్న తోటను) మామిడితోట అన్నట్లు. (అగ్ని జ్యోతిస్సులు వైదిక దేవతలని గ్రహించినపుడు 'ఏ కాలంలో' (యత్రకాలే) 'ఆ కాలాన్ని' (తం కాలం) అని కాలశబ్ద ప్రయోగం చేయడం ఎందుకంటే ఇక్కడ చెప్పిన అయిదు దేవతలలో ముగ్గురు – పగలు శుక్లము ఉత్తరాయణము – కాలవాచకాలు కనుక కాలమానశబ్దాల ఆధిక్యాన్ని బట్టి అగ్నిజ్యోతిస్సులు కాలమానంలో కలిపి చెప్పబడ్డారు). అట్లాగే పగలు అంటే పగటిని అభిమానించే దేవత. శుక్లం శుక్లపక్షదేవత. ఆరునెలల ఉత్తరాయణం కూడా దారిగా మారిన దేవత. వేరేచోట కూడా (బ్ర.సూ.భా. 4.3.4) ఇదేవిధంగా అర్థం చెప్పబడింది. ఈ మార్గంలో ప్రయాణించినవారు, చనిపోయిన బ్రహ్మవిదులు బ్రహ్మోపాసకులు బ్రహ్మోపాసనాపరులు బ్రహ్మమునే చేరుకుంటారు. 'క్రమేణ' అని వాక్యం పూర్తిచేసుకోవాలి. సమ్యగ్దర్శనంలో నిష్ఠగలవారు సద్యోముక్తికి అంటే తక్షణముక్తికి పాత్రులు. వీరికి గతి ఆగతి, వెళ్ళడం రావడం అంటూ ఏదీ ఉండదు. 'అతని ప్రాణాలు బయటికి వెళ్ళవు, (బృ.ఉ.4.4.6) అని శ్రుతి. వారి ప్రాణాలు బ్రహ్మంలో లీనమైపోయినవి, వారు బ్రహ్మమే అయినారు.

**మూ. ధూమో రాత్రిస్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనమ్ ।**
**తత్ర చాంద్రమసం జ్యోతిర్యోగీ ప్రాప్య నివర్తతే ॥ 25**

**తె.అ.** ధూమము, రాత్రి, కృష్ణపక్షము, దక్షిణాయనంలోని ఆరునెలలు – ఈ కాలంలో చనిపోయినవారు చంద్రజ్యోతిని చేరి తిరిగివస్తారు.

**భాష్యమ్ : 25.1 ధూమః ఇతి. ధూమః రాత్రిః ధూమాభిమానినీ రాత్ర్యభిమానినీ చ దేవతా. తథా కృష్ణః కృష్ణపక్షదేవతా. షణ్మాసా దక్షిణాయానం ఇతి చ పూర్వవత్ దేవతా ఏవ. తత్ర చంద్రమసి భవం చాంద్రమసం జ్యోతిః ఫలం ఇష్టాదికారీ యోగీ కర్మీ ప్రాప్య భుక్త్వా తత్‌క్షయాత్ ఇహ పునః నివర్తతే.**

**తె.అ.** ధూమాన్ని రాత్రిని అభిమానించే దేవతలు ధూమము రాత్రి. అట్లాగే కృష్ణపక్షదేవత కృష్ణం. దక్షిణాయనంలోని ఆరునెలలు కూడా వెనుకటి వలెనే దేవతయే. ఇష్టాది కర్మలు చేసే కర్మయోగి ఈ కాలంలో చనిపోయి చాంద్రమసజ్యోతిని చేరి కర్మఫలాన్ని అనుభవించి అది క్షయమైన తరువాత తిరిగి ఇక్కడకు వస్తాడు.

**మూ. శుక్లకృష్ణే గతీ హ్యేతే జగతః శాశ్వతే మతే ।**
**ఏకయా యాత్యనావృత్తిమన్యయాఽఽవర్తతే పునః ॥ 26**

**తె.అ.** ఈ శుక్ల, కృష్ణగతులు జగత్తుకు శాశ్వతమైనవి. ఒకటి తిరిగి రాని గతి. రెండవదారిన వెళ్ళినవాడు మళ్ళీ వస్తాడు.

**భాష్యమ్ : 26.1 శుక్ల ఇతి. శుక్లకృష్ణే శుక్లా చ కృష్ణా చ శుక్లకృష్ణే, జ్ఞానప్రకాశకత్వాత్ శుక్లా, తదభావాత్ కృష్ణా, ఏతే శుక్లకృష్ణే హి గతీ – జగతః ఇతి అధికృతానాం జ్ఞానకర్మణోః, న జగతః సర్వస్య ఏవ ఏతే గతీ సంభవతః శాశ్వతే నిత్యే, సంసారస్య నిత్యత్వాత్, మతే అభిప్రేతే. తత్ర ఏకయా శుక్లయా యాతి అనావృత్తిం, అన్యయా ఇతరయా ఆవర్తతే పునః భూయః.**

**తె.అ.** శుక్లకృష్ణములు – జ్ఞానప్రకాశం కలది కనుక శుక్లము, వెలుగు, అది లేదు కనుక కృష్ణము, చీకటి ఇవి శుక్లకృష్ణగతులు. జగత్తుకు అంటే జ్ఞానకర్మలయందు అధికారం కలవారికి అని. అంతేకాని సర్వజగత్తుకూ ఈ గతులు సంభవం కావు. సంసారం నిత్యం కనుక ఈ గతులు శాశ్వతం అని అభిప్రాయం. ఇందులో శుక్ల మార్గంలో వెళ్ళినవాడు తిరిగిరాడు. రెండవమార్గంలో, కృష్ణమార్గంలో వెళ్ళినవాడు తిరిగివస్తాడు.

**మూ. నైతే సృతీ పార్థ జానన్ యోగీ ముహ్యతి కశ్చన ।**
**తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున ॥ 27**

**తె.అ.** ఈ దారులు రెండూ తెలిసిన యోగి ఎన్నడూ మోహం చెందడు. కనుక అన్నివేళలా యోగంలో ఏకాగ్రతతో ఉండుము.

**భాష్యమ్ : 27.1 నైతే ఇతి. న ఏతే యథోక్తే సృతీ మార్గౌ పార్థ! జానన్ 'సంసారాయ ఏకా, అన్యా మోక్షాయ చ' ఇతి, యోగీ న ముహ్యతి కశ్చన కశ్చిదపి, తస్మాత్ సర్వేషు కాలేషు యోగయుక్తః సమాహితః భవ అర్జున, శ్రుణు తస్య యోగస్య మాహాత్మ్యమ్ –**

**తె.అ.** ఇప్పుడు చెప్పిన ఈ రెండుమార్గాలు తెలిసి, ఒకటి సంసారంలోనికి మరొకటి మోక్షానికి అని, యోగి ఎన్నడు మోహం చెందడు. కనుక అన్నివేళలా యోగయుక్తుడవై ఏకాగ్రతతో ఉండుము. ఆ యోగమాహాత్మ్యం విను –

**మూ. వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్ ।**
**అత్యేతి తత్సర్వమిదం విదిత్వా యోగీ పరం స్థానముపైతి చాద్యమ్ ॥ 28**

**తె.అ.** ఈ మార్గాలు తెలిసిన యోగి వేదయజ్ఞ తపోదానాలకు ఏ పుణ్యఫలం చెప్పబడిందో దానినంతటినీ మించిన పుణ్యఫలాన్ని ఆదినుంచీ ఉన్న ఉత్తమపదాన్ని పొందుతాడు.

**ఇతి శ్రీ మహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా - సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం - యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే ధారణాయోగో అక్షరపరబ్రహ్మయోగః నామ అష్టమోఽధ్యాయః.**

**తె.అ.** ఇది వ్యాసభగవానుని శతసహస్రసంహిత అయిన శ్రీమహాభారతంలో భీష్మపర్వంలో ఉపనిషత్తులు బ్రహ్మవిద్య యోగశాస్త్రము శ్రీకృష్ణార్జున సంవాదము అయిన భగవద్గీతలయందు ధారణాయోగం అక్షరపరబ్రహ్మయోగం అనే ఎనిమిదవ అధ్యాయానికి తెలుగు అనువాదం.

**భాష్యమ్ : 28.1. వేదేష్వితి. వేదేషు సమ్యగధీతేషు యజ్ఞేషు చ సాద్గుణ్యేన అనుష్ఠితేషు తపఃసు చ సుతప్తేషు దానేషు చ సమ్యగ్దత్తేషు, ఏతేషు యత్ పుణ్యఫలం ప్రదిష్టం శాస్త్రేణ, అత్యేతి అతీత్య గచ్ఛతి తత్ సర్వం ఫలజాతమ్, ఇదం విదిత్వా సప్తప్రశ్ననిర్ణయద్వారేణ ఉక్తం అర్థం సమ్యక్ అవధార్య అనుష్ఠాయ యోగీ, పరం ఉత్కృష్టం ఐశ్వర్యం స్థానం ఉపైతి చ ప్రతిపద్యతే ఆద్యం ఆదౌ భవం, కారణం బ్రహ్మ ఇత్యర్థః.**

**తె.అ.** చక్కగా వేదాధ్యయనం చేసినందుకు, యజ్ఞాలు ఏ లోపాలు లేకుండా అనుష్ఠించినందుకు, తపాలు బాగా చేసినందుకు ఇవ్వవలసిన దానాలు ఇచ్చినందుకు శాస్త్రం ఏ పుణ్యఫలం చెప్పిందో ఆ సమస్త ఫలసమూహాన్ని మించిన ఫలం యోగి పొందుతాడు. అర్జునుడడిగిన ఏడు ప్రశ్నలకు సమాధానంగా చెప్పిన దీనిని చక్కగా తెలుసుకొని అనుష్ఠించిన యోగి పరమోత్కృష్టమైన ఈశ్వరపదాన్ని పొందుతాడు. ఆద్యమైన, ఆదికారణమైన, బ్రహ్మమును పొందుతాడు.

**ఇతి శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్యగోవిందభగవత్పూజ్యపాదశిష్య శ్రీమచ్ఛంకరభగవతః కృతౌ శ్రీమద్భగవద్గీతాభాష్యే ధారణాయోగో అక్షరపరబ్రహ్మయోగః నామ అష్టమోఽధ్యాయః.**

ఇది శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య గోవింద భగవత్పూజ్యపాదశిష్యులు శ్రీమత్ శంకర భగవత్పాదులు రచించిన శ్రీమద్భవద్గీతా భాష్యంలో ధారణాయోగం అక్షరపరబ్రహ్మయోగం అనే ఎనిమిదవ అధ్యాయానికి తెలుగు అనువాదం.



# నవమో౽ధ్యాయః

# రాజవిద్యా రాజగుహ్యాయోగః

**భాష్యమ్ : 0.1 అష్టమే నాడీద్వారేణ ధారణాయోగః సగుణః ఉక్తః తస్య ఫలం అగ్న్యర్చిరాది-క్రమేణ కాలాంతరే బ్రహ్మప్రాప్తిలక్షణం ఏవ అనావృత్తిరూపం నిర్దిష్టమ్. తత్ర "అనేనైవ ప్రకారేణ మోక్షప్రాప్తిః ఫలం అధిగమ్యతే, న అన్యథా" ఇతి తదాశంకావ్యావివర్తయిషయా శ్రీభగవాన్ ఉవాచ-**

**తె.అ.** ఎనిమిదవ అధ్యాయంలో సుషుమ్నా నాడిద్వారా ధారణాయోగం, దాని గుణాలు చెప్పాడు. దాని ఫలం కూడా చెప్పాడు, అగ్ని వెలుగు మొదలైన క్రమంలో కాలాంతరంలో బ్రహ్మప్రాప్తి లక్షణమైన పునర్జన్మరాహిత్యం అని. మోక్షప్రాప్తి ఈ ప్రకారంగా మాత్రమే సాధ్యము మరొక విధంగా కాదు అనే ఆశంకను తొలగించదలచిన శ్రీభగవానుడు అంటున్నాడు.

**మూ. ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే ।**
**జ్ఞానం విజ్ఞానసహితం యద్ జ్ఞాత్వా మోక్ష్యసే౽శుభాత్ ॥ 1**

**తె.అ.** అసూయలేని నీకు ఇక అతిరహస్యమైన ఈ జ్ఞానం విజ్ఞానంతో సహా చెపుతాను. అది తెలుసుకుని అశుభం నుండి విముక్తుడవవుతావు.

**భాష్యమ్ : 1.1 ఇదం ఇతి. ఇదం బ్రహ్మజ్ఞానం, వక్ష్యమాణం, ఉక్తం చ పూర్వేషు అధ్యాయేషు. తత్ బుద్ధౌ సన్నిధీకృత్య 'ఇదం' ఇత్యాహ. 'తు' శబ్దో విశేషనిర్ధారణార్థః – ఇదమేవ తు సమ్యక్ జ్ఞానం సాక్షాత్ మోక్షప్రాప్తిసాధనం 'వాసుదేవః సర్వమితి' (7.19) 'ఆత్మైవేదం సర్వం' (ఛాం.ఉ. 7.25.2) 'ఏకమేవాద్వితీయం' (ఛాం.ఉ.6.2.1) ఇత్యాది శ్రుతిస్మృతిభ్యః, నాన్యత్, 'అథ తే యే౽న్యథా౽తో విదుః అన్యరాజానః తే క్షయ్యలోకా భవంతి' (ఛాం.ఉ.7.25.2) ఇత్యాది శ్రుతిభ్యశ్చ. తే తుభ్యం గుహ్యతమం గోప్యతమం ప్రవక్ష్యామి కథయిష్యామి అనసూయవే అసూయారహితాయ. కిం తత్? జ్ఞానం – కిం విశిష్టం? విజ్ఞానసహితం అనుభవయుక్తం, యత్ జ్ఞానం జ్ఞాత్వా ప్రాప్య మోక్ష్యసే అశుభాత్ సంసారబంధనాత్.**

**తె.అ.** 'ఈ జ్ఞానం' ముందు చెప్పబోతున్న, వెనుకటి అధ్యాయాల్లో చెప్పిన బ్రహ్మజ్ఞానం. దాన్ని మనసులో పెట్టుకుని 'ఈ' అని అంటున్నాడు. 'ఇక' (తు) శబ్దం విశేష నిర్ధారణార్థం – ఇదే సరి

అయిన జ్ఞానం, సాక్షాత్తు మోక్షప్రాప్తి సాధనం, 'వాసుదేవుడే సర్వము అని' (7.19) 'ఈ సర్వము ఆత్మయే' (ఛాం.ఉ.7.25.2) 'ఉన్నదొకటే, రెండవది లేదు' (ఛాం.ఉ.6.2.1) మొదలైన శ్రుతివాక్యాలు చెప్పినట్లు ; తక్కినది సరి అయిన జ్ఞానం కాదు, 'మరొక విధమైన జ్ఞానం కలవారి రాజులు వేరు, వారి లోకాలు క్షయమవుతాయి' (ఛాం.ఉ.7.25.2.) మొదలైన శ్రుతివాక్యాలు చెప్పినట్లు. అసూయలేని నీకు అతి రహస్యమైనది చెపుతాను. ఏమిటది? జ్ఞానం. ఎటువంటిది? విజ్ఞాన సహితమైనది, అనుభవంతో కలిసినది. ఏది తెలుసుకుని దేనిని పొంది అశుభం నుండి సంసార బంధనం నుండి నీవు ముక్తుడవవుతావో ఆ జ్ఞానం. తెలుసుకోవడమే పొందడం. అదే ముక్తి.

**మూ. రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిదముత్తమమ్ ।**
**ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్ ॥ 2**

**తె.అ.** ఈ రాజవిద్య పవిత్రము ఉత్తమము రహస్యములలోకెల్ల అతిరహస్యమైనది, ప్రత్యక్షముగా తెలియదగినది, ధర్మసహితము, నాశనములేనిది మరియు అనుష్ఠించుటకు సులభమైనది.

**భాష్యమ్ : 2.1 రాజవిద్యా ఇతి. రాజవిద్యా విద్యానాం రాజా, దీప్త్యతిశయవత్త్వాత్, దీప్యతే హి ఇయం అతిశయేన బ్రహ్మవిద్యా సర్వవిద్యానామ్. తథా రాజగుహ్యం గుహ్యానాం రాజా. పవిత్రం పావనం ఇదం ఉత్తమం, సర్వేషాం పావనానాం శుద్ధికారణం ఇదం బ్రహ్మజ్ఞానం ఉత్కృష్టతమమ్. అనేక జన్మసహస్రసంచితం అపి ధర్మాధర్మాది సమూలం కర్మ క్షణమాత్రాత్ ఏవ భస్మీకరోతి ఇత్యతః కిం తస్య పావనత్వం వక్తవ్యమ్. కించ - ప్రత్యక్షావగమం ప్రత్యక్షేణ సుఖాదేః ఇవ అవగమః యస్య తత్ ప్రత్యక్షావగమమ్. అనేకగుణవతోఽపి ధర్మవిరుద్ధత్వం దృష్టం, న తథా ఆత్మజ్ఞానం ధర్మవిరోధి, కింతు ధర్మ్యం ధర్మాత్ అనపేతమ్. ఏవమపి స్యాత్ దుఃఖసంపాద్యం ఇత్యత ఆహ - సుసుఖం కర్తుం యథా రత్నవివేకవిజ్ఞానమ్. తత్ర అల్పాయాసానాం అన్యేషాం కర్మణాం సుఖసంపాద్యానాం అల్పఫలత్వం, దుష్కరాణాం చ మహాఫలత్వం దృష్టమితి, ఇదం తు సుఖసంపాద్యత్వాత్ ఫలక్షయాత్ వ్యేతి ఇతి ప్రాప్తే ఆహ - అవ్యయం ఇతి. న అస్య ఫలతః కర్మవత్ వ్యయః అస్తీతి అవ్యయమ్. అతః శ్రద్ధేయం ఆత్మజ్ఞానమ్.**

**తె.అ.** విద్యలకు రాజు రాజవిద్య, అతిశయమైన దీప్తి కలది కనుక ('రాజృ దీప్తౌ' అని ధాతుపాఠం); బ్రహ్మవిద్య సమస్తవిద్యలలో అతిశయంగా ప్రకాశించేది కదా. అట్లాగే రహస్య విద్యలకన్నిటికి రాజు కనుక రాజగుహ్యం. పవిత్రమంటె పావనం, శుద్ధికారణం. పావనమైన అన్నిటిలోకి ఉత్తమమైనది బ్రహ్మజ్ఞానం. ఎన్నో వేల జన్మలలో పోగు చేసుకున్న పుణ్యపాపకర్మల-నన్నిటినీ సమూలంగా (వేరు మిగలకుండా అని, వేరు లేనపుడు మొలకెత్తడం ఫలించడం అన్న

ప్రశ్న లేదు.) క్షణమాత్రంలో బూడిద చేసివేసే బ్రహ్మజ్ఞానం యొక్క పావనగుణం చెప్పవలసిన పనిలేదు. అంతేకాదు, ప్రత్యక్షంగా సుఖాదుల వలె, తెలిసేది. ఎన్ని గుణాలున్నా కొన్ని ధర్మవిరుద్ధంగా ఉండడం చూస్తుంటాం. ఆత్మజ్ఞానం అట్లా ధర్మవిరుద్ధం కాదు, ధర్మమయం. ఇటువంటిదే, అయినా సాధించడం కష్టం కావచ్చు అనేదానికి చెపుతున్నాడు, సుఖంగా, సులభంగా సాధించవచ్చును, రత్నవివేకవిజ్ఞానం వలె అని. ఎక్కువ ఆయాసపడకుండా సుఖంగా సాధించే ఇతర కర్మలకు ఫలం కూడా అల్పంగానే ఉంటుంది, కష్టంతో సాధించిన కర్మలకు ఫలం ఎక్కువగా ఉంటుంది. ఇది మనం చూస్తూనే ఉన్నాం. ఈ బ్రహ్మజ్ఞానం కూడా సుఖసాధ్యం కనుక ఫలక్షయమై అది నశిస్తుంది అనే శంకకు సమాధానంగా 'అవ్యయం' అంటున్నాడు. దీని ఫలం కర్మఫలం వలె వ్యయం కానిది, ఎన్నటికి క్షయం కానిది. కనుక ఆత్మజ్ఞానంలో శ్రద్ధ కలిగి ఉండాలి.

**మూ. అశ్రద్ధధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప ।**
**అప్రాప్య మాం నివర్తన్తే మృత్యుసంసారవర్త్మని ॥ 3**

**తె.అ.** ఈ ఆత్మజ్ఞాన ధర్మంలో శ్రద్ధలేనివారు, నన్ను పొందలేక మృత్యుసంసారమార్గంలో తిరిగి వెళ్ళుతారు.

**భాష్యమ్ : 3.1 అశ్రద్ధధానాః ఇతి. అశ్రద్ధధానాః శ్రద్ధావిరహితాః ఆత్మజ్ఞానస్య ధర్మస్య అస్య స్వరూపే తత్ఫలే చ నాస్తికాః పాపకారిణః అసురాణాం ఉపనిషదం దేహమాత్రాత్మదర్శనమేవ ప్రతిపన్నాః, అసుతృపః పాపాః పురుషాః అశ్రద్ధధానాః పరంతప! అప్రాప్య మాం పరమేశ్వరం – మత్ప్రాప్తౌ నైవ ఆశంకా ఇతి మత్ప్రాప్తిమార్గసాధనభేదభక్తి మాత్రమపి అప్రాప్య ఇత్యర్థః – నివర్తంతే నిశ్చయేన వర్తంతే – క్వ? మృత్యుసంసారవర్త్మని మృత్యుయుక్తః సంసారః మృత్యుసంసార, తస్య వర్త్మ నరకతిర్యగాదిప్రాప్తిమార్గః తస్మిన్నేవ వర్తతే ఇత్యర్థః.**

**తె.అ.** ఈ ఆత్మజ్ఞాన ధర్మస్వరూపంలోను, దాని ఫలంలోను శ్రద్ధలేనివారు నాస్తికులు పాపకర్ములు అసురోపనిషత్తులను ఆశ్రయించి దేహమే ఆత్మ అనుకునేవారు ఇంద్రియలోలురు పరమేశ్వరుడనైన నన్ను చేరలేక మృత్యుసంసారమార్గంలోకి తప్పక తిరిగి వెళ్ళుతారు. నన్ను చేరలేరు అన్న విషయంలో సందేహం కూడా లేదు; నన్ను చేరే మార్గమనే సాధనరూపభక్తిని కూడా పొందలేరు అని అర్థం. మృత్యువుతో కూడిన సంసారం మృత్యు సంసారం. దాని మార్గం నరకము పశుపక్ష్యాది జన్మము మొదలైనది. ఆ మార్గంలో తిరుగుతూ ఉంటారు.

**భాష్యమ్: 4.0. స్తుత్యా అర్జునం అభిముఖీకృత్య ఆహ –**

**తె.అ.** ఈ విధమైన స్తుతిచేత అర్జునుణ్ణి అభిముఖం చేసుకుని అంటున్నాడు.

**మూ. మయా తతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా ।**
**మత్స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః ॥ 4**

**తె.అ.** ఈ సర్వజగత్తు అవ్యక్తమూర్తినైన నాచేత వ్యాప్తమై ఉన్నది. సర్వభూతాలు నాయందుంటున్నాయి. కాని నేను వాటియందు లేను.

**భాష్యమ్ : 4.1 మయా ఇతి. మయా మమ యః పరోభావః తేన తతం వ్యాప్తమ్ సర్వం ఇదం జగత్ అవ్యక్తమూర్తినా న వ్యక్తా మూర్తిః స్వరూపం యస్య మమ సః అహం అవ్యక్తమూర్తిః తేన మయా అవ్యక్తమూర్తినా, కరణాగోచర స్వరూపేణ ఇత్యర్థః. తస్మిన్ మయి అవ్యక్తమూర్తౌ స్థితాని మత్స్థాని, సర్వభూతాని బ్రహ్మాదీని స్తంబపర్యంతాని. న హి నిరాత్మకం కించిత్ భూతం వ్యవహారాయ అవకల్పతే. అతః మత్స్థాని మయా ఆత్మనా ఆత్మవత్త్వేన స్థితాని, అతః మయి స్థితాని ఇతి ఉచ్యంతే. తేషాం భూతానాం అహమేవ ఆత్మా ఇత్యతః తేషు స్థితః, మూర్తవత్ సంశ్లేషాభావేన ఆకాశస్యాపి అంతరతమో హి అహమ్. న హి అసంసర్గి వస్తు క్వచిత్ ఆధేయభావేన అవస్థితం భవతి.**

**తె.అ.** నాచేత, నా పరమభావం చేత, ఈ సర్వజగత్తు వ్యాప్తమై ఉన్నది. నా మూర్తి, అంటే స్వరూపం, వ్యక్తం కానిది. మూర్తికి ముందున్న అమూర్తస్థితి, అవ్యక్తమూర్తి. అటువంటి అవ్యక్తమూర్తి చేత ఇంద్రియగోచరం కాని స్వరూపం చేత వ్యాప్తమై ఉన్నది అని అర్థం. ఆ నా అవ్యక్తమూర్తిలో బ్రహ్మ మొదలు గడ్డిపరక వరకు సమస్త భూతములు ఉంటున్నాయి. ఆత్మలేని ఏ భూతము వ్యవహారంలో ఉన్నట్టు కాదు. నేను వాటి ఆత్మగా అవి ఉంటున్నాయి. కనుకనే నాలో ఉంటున్నాయి అనడం. ఆ భూతములకు ఆత్మ నేనే కనుక మూఢబుద్ధులకు నేను వాటిలో ఉన్నట్లు కనిపిస్తాను. కనుకనే అంటున్నాను నేను వాటిలో లేను అని. సాకారవస్తువులవలె నాకు సంశ్లేషం లేదు. (ఒక వస్తువు ఇంకొక వస్తువుతో కలిసి ఉండడం సంశ్లేషం) కనుకనే నేను ఆకాశంలో కూడా వ్యాపించి ఉన్నాను. సంసర్గం లేని వస్తువేదీ ఆధేయభావంతో ఉండదనేది ప్రసిద్ధమే.

**భాష్యమ్ : 5.0 అత ఏవ అసంసర్గిత్వాత్ మమ –**

**తె.అ.** నాకు దేనితోను సంసర్గం లేకపోవడం చేత –

**మూ. న చ మత్స్థాని భూతాని పశ్య మే యోగమైశ్వరమ్ ।**
**భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూతభావనః ॥ 5**

**తె.అ.** భూతములు నాలోనూ లేవు, చూడు మరి నా ఈశ్వరయోగం! నా ఆత్మ భూతములను సృష్టిస్తుంది, భరిస్తుంది. కాని వాటిలో ఉండదు.

**భాష్యమ్ : 5.1 న చ ఇతి. న చ మత్స్థాని భూతాని బ్రహ్మాదీని, పశ్య మే యోగం యుక్తిం ఘటనం మే మమ ఐశ్వరం ఈశ్వరస్యేమం ఐశ్వరం యోగం, ఆత్మనో యాథాత్మ్యం ఇత్యర్థః. తథా చ శ్రుతిః అసంసర్గిత్వాత్ అసంగతాం దర్శయతి – 'అసంగో న హి సజ్జతే' (బృ.ఉ.3.9.26) ఇదం చ ఆశ్చర్యం అన్యత్ పశ్య – భూతభృత్, అసంగోఽపి సన్ భూతాని బిభర్తి, న చ భూతస్థః యథోక్తేన న్యాయేన దర్శితత్వాత్ భూతస్థత్వానుపపత్తేః. కథం తు పునః ఉచ్యతే "అసౌ మమ ఆత్మా" ఇతి? విభజ్య దేహాదిసంఘాతం, తస్మిన్ అహంకారం అధ్యారోప్య, లోకబుద్ధిం అనుసరన్ వ్యపదిశతి 'మమ ఆత్మా' ఇతి, న పునః ఆత్మనః ఆత్మా అన్యః ఇతి లోకవత్ అజానన్. తథా భూతభావనః భూతాని భావయతి–ఉత్పాదయతి–వర్ధయతి ఇతి భూతభావనః.**

**తె.అ.** బ్రహ్మాది భూతములు నాలో లేవు. నా యొక్క ఈ యోగాన్ని, యుక్తిని ఘటనను చూడుము. ఆత్మయొక్క యథార్థతత్త్వం అని అర్థం. 'సంగం లేని ఆత్మ దేనికీ అంటుకోదు' అని శ్రుతి కూడా సంగం లేని ఆత్మయొక్క నిర్లిప్తతను చెపుతున్నది. మరొక ఆశ్చర్యం ఇది చూడు – సంగరహితమై కూడా నా ఆత్మ భూతములను భరిస్తుంది, అయినా వాటిలో ఉండదు, ఇంతకుముందు చెప్పిన న్యాయం ప్రకారం పరమాత్మ భూతములలో ఉండడం అసంభవం. మరి 'ఇది నా ఆత్మ' అని అనడమెందుకు? దేహాది సంఘాతాన్ని ఆత్మనుండి వేరు చేసి, దానియందు అహంకారాన్ని ఆరోపించి, లోకబుద్ధిని అనుసరించి 'నా ఆత్మ' అంటున్నాడు. అంతేకాని ఆత్మ తనకంటే వేరు అని లోకులవలె అజ్ఞానంతో కాదు. ఈ ఆత్మ భూతములను సృష్టిస్తుంది, వృద్ధి చేస్తుంది.

**భాష్యమ్ : 6.0 యథోక్తేన శ్లోకద్వయేన ఉక్తం అర్థం దృష్టాంతేన ఉపపాదయన్ ఆహ–**

**తె.అ.** పై రెండు శ్లోకాలలో చెప్పిన విషయాన్నే సోదాహరణంగా వివరిస్తూ అంటున్నాడు–

**మూ. యథాఽఽకాశస్థితో నిత్యం వాయుః సర్వత్రగో మహాన్ ।**
**తథా సర్వాణి భూతాని మత్స్థానీత్యుపధారయ ॥ 6**

**తె.అ.** మహావాయువు అంతటా తిరుగుతూ ఉన్నా, నిత్యము ఆకాశంలో ఉన్నట్లే సమస్త భూతాలూ నాలో ఉంటున్నాయి అని తెలుసుకో.

**భాష్యమ్ : 6.1 యథేతి. యథా లోకే ఆకాశస్థితః ఆకాశే స్థితో నిత్యం సదా వాయుః సర్వత్ర గచ్ఛతీతి సర్వత్రగో మహాన్ పరిమాణతః, తథా ఆకాశవత్ సర్వగతే మయి అసంశ్లేషేవ స్థితాని ఇత్యేవముపధారయ విజానీహి.**

**తె.అ.** లోకంలో వాయువు – మహా అనే పదం పరిమాణాన్ని చెపుతుంది – నిత్యము ఆకాశంలో ఉంటూ అంతటా తిరుగుతూ ఉంటుంది. అట్లాగే సమస్త భూతములు ఆకాశం వలె అంతటా

ఉన్న నాయందు ఉంటున్నాయి. అయినా నాతో వాటికి ఎటువంటి సంబంధం లేదు.

**భాష్యమ్ : 7.0 ఏవం వాయురాకాశ ఇవ మయి స్థితాని సర్వభూతాని స్థితికాలే, తాని**

**తె.అ.** ఈ విధంగా స్థితికాలంలో ఆకాశంలో వాయువువలె నాలో ఉంటూ వున్న భూతములు –

**మూ. సర్వభూతాని కౌన్తేయ ప్రకృతిం యాన్తి మామికామ్ ।**
**కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్ ॥ 7**

**తె.అ.** ప్రళయకాలంలో భూతములన్నీ నా ప్రకృతిని చేరుకుంటాయి. కల్పాదియందు మళ్ళీ వాటినన్నిటినీ సృష్టిస్తున్నాను.

**భాష్యమ్ : 7.1 సర్వేతి. సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం త్రిగుణాత్మికాం అపరాం నికృష్టాం యాంతి మామికాం మదీయాం, కల్పక్షయే ప్రళయకాలే, పునర్భూయస్తాని భూతాని ఉత్పత్తికాలే కల్పాదౌ విసృజామి ఉత్పాదయామ్యహం. పూర్వవత్.**

**తె.అ.** కల్పక్షయంలో అంటే ప్రళయకాలంలో భూతములన్నీ త్రిగుణాత్మికయైన నా అపరాప్రకృతిని చేరుకుంటాయి. మళ్ళీ ఆ భూతములను ఉత్పత్తికాలంలో అంటే కల్పారంభంలో పూర్వంవలె సృష్టిస్తాను.

**భాష్యమ్ : 8.0 ఏవమవిద్యాలక్షణామ్ –**

**తె.అ.** ఈ విధంగా అవిద్యాలక్షణమైన –

**మూ. ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః ।**
**భూతగ్రామమిమం కృత్స్నమవశం ప్రకృతేర్వశాత్ ॥ 8**

**తె.అ.** స్వీయప్రకృతిని నేను వశీకరించుకుని, తమ స్వభావానికి లోనై అవశమైన ఈ సమస్త భూతసముదాయాన్ని మళ్ళీమళ్ళీ పుట్టిస్తున్నాను.

**భాష్యమ్ : 8.1 ప్రకృతిమితి. ప్రకృతిం స్వాం స్వీయామవష్టభ్య వశీకృత్య విసృజామి పునః పునః, ప్రకృతితో జాతం భూతగ్రామం భూతసముదాయం ఇమం వర్తమానం, కృత్స్నం సమస్తం, అవశం అస్వతంత్రం అవిద్యాదిదోషైః పరవశీకృతం, ప్రకృతేర్వశాత్, స్వభావవశాత్–**

**తె.అ.** స్వీయ ప్రకృతిని వశం చేసుకొని, స్వభావ వశం చేత అవిద్య మొదలైన దోషాలకు పరవశమై అస్వతంత్రమై ఉన్న, ప్రకృతి నుండి పుట్టిన ఈ సమస్త భూతసముదాయాన్ని నేను మళ్ళీ మళ్ళీ పుట్టిస్తున్నాను.

**భాష్యమ్ : 9.0 తర్హి తస్య తే పరమేశ్వరస్య భూతగ్రామమిమం విషమం విదధతః, తన్నిమిత్తాభ్యాం ధర్మాధర్మాభ్యాం సంబంధస్స్యాదితి, ఇదమాహ భగవాన్ –**

**తె.అ.** ప్రాణికోటిని విషమంగా సృష్టించిన పరమేశ్వరుడవైన నీకు ఆ వైషమ్యనిమిత్తమైన ధర్మాధర్మాలతో సంబంధం ఉండవలె కదా? అంటే భగవానుడు సమాధానంగా అంటున్నాడు–

**మూ. న చ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ ।**
**ఉదాసీనవదాసీనమసక్తం తేషు కర్మసు ॥ 9**

**తె.అ.** ఆ కర్మలు నన్ను బంధించవు. ఆ కర్మలయందు నాకు ఆసక్తి లేదు. వాటి విషయంలో నేను ఉదాసీనంగా ఉంటాను.

**భాష్యమ్ : నేతి. న చ మామీశ్వరం తాని భూతగ్రామస్య విషమసర్గనిమిత్తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ. తత్ర కర్మణామ్ అసంబంధిత్వే కారణమహ – ఉదాసీనవత్ ఆసీనం యథా ఉదాసీనః ఉపేక్షకః కశ్చిత్ తద్వాదాసీనం, ఆత్మనోఽ విక్రియత్వాత్ అసక్తం ఫలాసంగరహితమ్ అభిమానవర్జితమ్, 'అహం కరోమి' ఇతి తేషు కర్మసు. అతోఽ న్యస్యాపి కర్తృత్వాభిమానాభావః ఫలాసంగాభావశ్చాసంబంధ కారణం అన్యథా కర్మభిర్బధ్యతే మూఢః కోశకారవదిత్యభిప్రాయః.**

**తె.అ.** ప్రాణికోటియొక్క విషమసృష్టికి కారణమైన కర్మలు ఈశ్వరుడనైన నన్ను బంధించవు. (సృష్టిలోని వైషమ్యం అంటె అసమానత. దానికి కారణం ఆయా ప్రాణులు చేసుకున్న పుణ్యాపాప కర్మలు. ఆ కర్మలతో నాకు సంబంధం లేదు). ఆ కర్మలతో సంబంధం లేకపోవడానికి కారణం చెపుతున్నాడు – ఉదాసీనునివలె ఉపేక్షాభావంతో ఉంటాను కనుక. ఆత్మ అవిక్రియం కనుక కర్మఫలమందు ఆసక్తి, ఆ కర్మలు చేస్తున్నది నేను అన్న అభిమానము లేవు నాకు. నాలాగే ఇతరుల విషయంలో కూడా, కర్తృత్వాభిమానము ఫలాసక్తి లేనపుడు కర్మలు వారిని బంధించవు, అట్లా కానపుడు మూఢుడు సాలెపురుగువలె కర్మలలో చిక్కుకుంటాడు అని దీనినిబట్టి అర్థం చేసుకోవాలి.

**భాష్యమ్ : 10.0 తత్ర "భూతగ్రామమిమం విసృజామి", "ఉదాసీనవదాసీనమ్" ఇతి చ విరుద్ధముచ్యతే ఇతి తత్పరిహారార్థమాహ –**

**తె.అ.** 'ఈ ప్రాణికోటిని నేను సృష్టిస్తున్నాను' అని మళ్ళీ 'ఉదాసీనునివలె ఉంటాను' అనడం విరుద్ధం కాదా? అనే శంకను తొలగించడానికి అంటున్నాడు.

**మూ. మయాఽ ధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరమ్ ।**
**హేతునాఽ నేన కౌంతేయ జగద్విపరివర్తతే ॥ 10**

**తె.అ.** నా ఆధ్యక్షతలో ప్రకృతి చరాచర జగత్తును సృష్టిస్తున్నది. ఆ కారణంగా జగత్తు పరిభ్రమిస్తూ ఉన్నది.

**భాష్యమ్ : 10.1 మయేతి. మయా అధ్యక్షేణ సర్వతో దృశిమాత్రస్వరూపేణావిక్రియాత్మ నాధ్యక్షేణ మయా, మమ మాయా త్రిగుణాత్మికాఽవిద్యాలక్షణా ప్రకృతిః సూయతే ఉత్పాదయతి స చరాచరం జగత్ – తథా చ మంత్రవర్ణః 'ఏకో దేవ స్సర్వభూతేషు గూఢస్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా, కర్మాధ్యక్షస్సర్వభూతాధివాసస్సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చే'తి (శ్వే.ఉ.6.11) హేతునా నిమిత్తేనానేన అధ్యక్షత్వేన, కౌంతేయ, జగత్సచరాచరం వ్యక్తావ్యక్తాత్మకం విపరివర్తతే సర్వావస్థాసు. దృశికర్మత్వాపత్తినిమిత్తా హి జగతస్సర్వా ప్రవృత్తిః 'అహమిదం భోక్ష్యే' 'పశ్యామీదం', 'శృణోమీదం' 'సుఖమనుభవామి దుఃఖమనుభవామి' 'తదర్థమిదం కరిష్యే', 'ఇదం జ్ఞాస్యామి' ఇత్యాద్యా అవగతినిష్ఠా అవగత్యవసానైవ, 'యో అస్యాధ్యక్షః పరమే వ్యోమన్' (తై.బ్రా.2.8.9) ఇత్యాదయశ్చ మంత్రాః ఏతమర్థం దర్శయంతి. తతశ్చైకస్య దేవస్య సర్వాధ్యక్ష భూతచైతన్యమాత్రస్య పరమార్థతః సర్వభోగా నభిసంబంధినః అన్యస్య చేతనాంతరస్యాభావే భోక్తురన్యస్య అభావాత్. కిం నిమిత్తా ఇయం సృష్టిరిత్యత్ర ప్రశ్న ప్రతివచనే అనుపపన్నే. 'కో అద్ధా వేద క ఇహ ప్రవోచత్. కుత ఆజాతా కుత ఇయం విసృష్టిః' ఇత్యాది మంత్రవర్ణేభ్యః. దర్శితం చ భగవతా – 'అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః' ఇతి.**

**తె.అ.** అన్ని విషయాలయందు సాక్షిమాత్రస్వరూపంతో ఉన్న వికారరహిత ఆత్మ అయిన నా ఆధ్యక్షతలో త్రిగుణాత్మకము అవిద్యాలక్షణము అయిన నా మాయ, ప్రకృతి, చరాచర జగత్తును సృష్టిస్తుంది. 'ఒకే దేవుడు సర్వభూతములయందు దాగియున్నాడు. అతడు సర్వవ్యాపి, సర్వ భూతాంతరాత్ముడు, కర్మాధ్యక్షుడు, సర్వభూతాధివాసుడు, సాక్షి, చేతనుడు, కేవలుడు, నిర్గుణుడు' అని మంత్రం (శ్వే.ఉ.6.11) కూడా అంటున్నది. నేను అధ్యక్షుణ్ణి అయిన కారణంగా అర్జునా, చరాచరసహితమైన, వ్యక్తావ్యక్తాత్మకమైన జగత్తు అన్ని అవస్థలలో పరిభ్రమిస్తూ ఉంది. లోకంలో అన్ని ప్రవృత్తులు – నేను ఇది తింటాను, చూస్తున్నాను, వింటున్నాను, ఈ సుఖం అనుభవిస్తున్నాను, దుఃఖం అనుభవిస్తున్నాను, అందుకోసం ఇది చేస్తాను – మొదలైనవన్నీ సాక్షి చైతన్య విషయాలు. జ్ఞానాన్ని అనుసరించేవి జ్ఞానంలో పర్యవసించేవే. 'ఈ జగత్తుకు అధ్యక్షుడు పరమాకాశంలో' (తై.బ్రాహ్మ.2.8.9) మొదలైన మంత్రాలు ఈ అర్థాన్ని చెపుతున్నాయి. అంతటికీ అధ్యక్షుడై చైతన్యమాత్రుడైన దేవుడొకడే. అతడు వాస్తవంలో సమస్తభోగాలతో సంబంధం లేనివాడు. అతడు కాక మరొక చైతన్యం లేదు కనుక మరొక భోక్త లేడు. మరి ఈ సృష్టి ఎవరి కొరకు? ఈ విధమైన ప్రశ్నకు గాని, సమాధానానికి గాని అవకాశం లేదు. 'ఇది తెలిసిన వాడెవడు?

ఈ విషయం ఎవడు చెప్పగలడు? ఈ సృష్టి ఎక్కడినుండి? ఎందుకోసం?' (తై.బ్రాహ్మ. 2.8.9) మొదలైన మంత్రాలు ఇదే అంటున్నాయి. 'అజ్ఞానం జ్ఞానాన్ని కప్పి ఉంది. అందుకే ప్రాణులు మోహం చెందుతున్నారు' (5.15) అని భగవానుడు కూడా అన్నాడు.

**భాష్యమ్ : ఏవం మాం నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావం సర్వజ్ఞం సర్వజంతూనామాత్మానమపి సంతమ్.**

**తె.అ.** నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావుడను, సమస్త ప్రాణులకు ఆత్మను అయిన ఇటువంటి నన్ను–

**మూ. అవజానంతి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్ ।**
**పరం భావమజానంతో మమ భూతమహేశ్వరమ్ ॥ 11**

**తె.అ.** సమస్త భూతములకు మహేశ్వరుడనైన నా పరమాత్మతత్త్వం తెలియని మూఢులు మానుషశరీరంతో వ్యవహరించే నన్ను అనాదరం చేస్తున్నారు.

**భాష్యమ్ : 11.1 అవజానంతీతి. అవజానంతి అవజ్ఞాం పరిభవం కుర్వంతి మాం, మూఢాః అవివేకినః మానుషీం మనుష్యసంబంధినీం తనుం దేహమాశ్రితం, మనుష్యదేహేన వ్యవహరంతమిత్యేతత్, పరం ప్రకృష్టం భావం, పరమాత్మతత్త్వం ఆకాశకల్పం ఆకాశాదప్యంతరతమమజానంతో మమ భూతమహేశ్వరం సర్వభూతానాం మహాంతమీశ్వరం స్వాత్మానం. తతశ్చ మమ అవజ్ఞాభావనేనాఽఽహతాః తే వరాకాః కథమ్ –**

**తె.అ.** మనుష్యశరీరం ధరించి మనుష్యదేహంతో వ్యవహరిస్తున్న నన్ను, అవివేకులు అనాదరం చేస్తున్నారు. సమస్తభూతకోటికి మహేశ్వరుడనైన నా పరమాత్మతత్త్వం వారికి తెలియదు. నాయందు అనాదర భావంతో హతులైన దురదృష్టవంతులు. ఎట్లా?

**మూ. మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః ।**
**రాక్షసీమాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః ॥ 12**

**తె.అ.** వారి ఆశలు, వారి కర్మలు, వారి జ్ఞానం వృథా. వారు మతిలేనివారు. మోహకారకమైన రాక్షసప్రకృతిని ఆశ్రయించినవారు.

**భాష్యమ్ : 12.1 మోఘేతి. మోఘాశాః వృథా ఆశాః ఆశిషో యేషాం తే మోఘాశాః, తథా మోఘ కర్మాణః యాని చాగ్నిహోత్రాదీని తైరనుష్ఠీయమానాని కర్మాణి తాని చ తేషాం భగవత్పరిభవాత్, స్వాత్మభూతస్య చాజ్ఞానాత్, మోఘాన్యేవ నిష్ఫలాని కర్మాణి భవంతీతి మోఘకర్మాణః, తథా మోఘజ్ఞానాః మోఘం నిష్ఫలం జ్ఞానం యేషాం తే మోఘజ్ఞానాః జ్ఞానమపి**

**తేషాం నిష్ఫలమేవ స్యాత్, విచేతసః విగతవివేకాశ్చ తే భవంతి ఇత్యభిప్రాయః. కించ, తే భవంతి రాక్షసీం రక్షసాం ప్రకృతిం స్వభావం ఆసురీం అసురాణాం చ ప్రకృతిం మోహినీం మోహకరీం దేహాత్మవాదినీం శ్రితాః ఆశ్రితాః ఛింది, భింది, ఖాద, పరస్వమపహర, ఇత్యేవం వదనశీలాః క్రూరకర్మాణో భవంతీత్యర్థః 'అసుర్యా నామ తే లోకాః' (ఈ.ఉ.3) ఇతి శ్రుతేః.**

**తె.అ.** వారి ఆశలు వృథా. వారు అనుష్ఠించే అగ్నిహోత్రాది కర్మలు వృథా. ఎందుకంటె తమ ఆత్మ అయిన భగవంతుని తెలుసుకొనలేక ఆయనను అనాదరం చేస్తున్నారు. వారు చేసే కర్మలు నిష్ఫలం. వారి జ్ఞానం కూడా నిష్ఫలమే. వారు మతిలేనివారు, అంటే వివేకం లేనివారు. వారు రాక్షస స్వభావాన్ని ఆశ్రయిస్తారు. దేహమే నేను అనే మోహం కలిగించే స్వభావం అది. 'నరుకు, నాశనం చేయి, త్రాగు, తిను, అవతలవాడిది కాజేయి' అంటూ వారు క్రూరకర్మలు చేసేవారవుతారు. "అవి ఆసుర లోకాలు" (ఈ.ఉ.3.) అని శ్రుతి.

**భాష్యమ్ : 13.0 యే పునః శ్రద్దధానాః భగవద్భక్తిలక్షణే మోక్షమార్గే ప్రవృత్తాః –**

**తె.అ.** భగవద్భక్తిలక్షణమైన మోక్షమార్గంలో నడిచే శ్రద్ధావంతుల గురించి –

**మూ. మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతిమాశ్రితాః ।**
**భజంత్యనన్యమనసో జ్ఞాత్వా భూతాదిమవ్యయమ్ ॥ 13**

**తె.అ.** పార్థా! దైవీ ప్రకృతిని ఆశ్రయించిన మహాత్ములు మాత్రం నన్ను నాశరహితునిగానూ, సృష్టికర్తనుగానూ ఎరిగి అనన్యమనస్కులై సేవిస్తారు.

**భాష్యమ్ : 13.1 మహాత్మానః అక్షుద్రచిత్తాః మామీశ్వరం పార్థ దైవానాం ప్రకృతిం శమదమదయాశ్రద్ధాదిలక్షణాం ఆశ్రితాస్సంతో భజంతి అనన్యమనసః అనన్యచిత్తాః జ్ఞాత్వా భూతాదిం భూతానాం వియదాదీనాం ప్రాణినాం చ ఆదిం కారణమవ్యయమ్. కథమ్?**

**తె.అ.** అర్జునా, మహాత్ములు మాత్రం ఈశ్వరుడనైన నన్ను సేవిస్తారు. క్షుద్రబుద్ధులు కానివారు మహాత్ములు. వారు శమదమదయాది లక్షణమైన దైవీప్రకృతిని ఆశ్రయిస్తారు. వారి మనసు మరొక విషయంపై పోదు. నేను భూతసృష్టికి, ఆకాశాది భూతములకు, ప్రాణులకు కూడా ఆదికారణమని అవ్యయబీజమని వారెరుగుదురు. ఎట్లా?

**మూ. సతతం కీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః ।**
**నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే ॥ 14**

**తె.అ.** సతతము నన్ను కీర్తిస్తూ దృఢవ్రతులై ప్రయత్నం చేస్తూ, నమస్కరిస్తూ నిత్యయుక్తులై నన్ను భక్తితో ఉపాసిస్తారు.

**భాష్యమ్ : 14.1 సతతం సర్వదా భగవంతం బ్రహ్మస్వరూపం మాం కీర్తయంతః, యతంతశ్చ ఇంద్రియోపసంహార శమదమదయాऽహింసాదిలక్షణైః ధర్మైః ప్రయతంతశ్చ, దృఢవ్రతాః దృఢం స్థిరమచాల్యం వ్రతం యేషాం తే దృఢవ్రతాః నమస్యంతశ్చ మాం హృదయేశయం ఆత్మానం భక్త్యా నిత్యయుక్తాస్సంతః, ఉపాసతే సేవంతే.**

**తె.అ.** బ్రహ్మస్వరూపమైన భగవంతుని నన్ను అన్నివేళలా కీర్తిస్తూ, ఇంద్రియాలను విషయాల నుండి ఉపసంహరించడం, శమము, దమము, దయ, అహింస మొదలైన లక్షణాలు గలిగిన గుణాలచేత దృఢవ్రతులై యత్నం చేస్తూ, నమస్కారం చేస్తూ హృదయంలో ఉండే ఆత్మను నన్ను నిత్యయుక్తులై భక్తితో ఉపాసిస్తారు.

**భాష్యమ్ : 15.0 తే కేన కేన ప్రకారేణ ఉపాసతే ఇత్యుచ్యతే –**

**తె.అ.** వారు ఏ యే విధాలుగా ఉపాసిస్తారు? అంటే చెపుతున్నాడు –

**మూ. జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజంతో మాముపాసతే ।**
**ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్ ॥ 15**

**తె.అ.** కొందరు ఏకత్వ జ్ఞానయజ్ఞం చేత, కొందరు ద్వైతభావంతో, మరికొందరు విశ్వతోముఖమై వివిధంగా ఉన్న నన్ను బహువిధాలుగా ఉపాసిస్తున్నారు.

**భాష్యమ్ : 15.1 జ్ఞానయజ్ఞేన జ్ఞానమేవ భగవద్విషయం యజ్ఞః తేన జ్ఞానయజ్ఞేన, యజంతః పూజయంతః మామీశ్వరం చాప్యన్యే అన్యాముపాసనాం పరిత్యజ్య ఉపాసతే. తచ్చ జ్ఞానమ్ – ఏకత్వేన 'ఏకమేవ పరం బ్రహ్మ' ఇతి పరమార్థదర్శనేన యజంతః ఉపాసతే. కేచిచ్చ పృథక్త్వేన 'ఆదిత్యచంద్రాదిభేదేన స ఏవ భగవాన్ విష్ణురవస్థితః' ఇతి ఉపాసతే. 'కేచిత్ బహుధా అవస్థితః స ఏవ భగవాన్ విశ్వతోముఖః సర్వతోముఖః విశ్వరూపః' ఇతి తం విశ్వరూపం సర్వతోముఖం బహుధా బహుప్రకారేణోపాసతే.**

**తె.అ.** కొందరు నన్ను జ్ఞానయజ్ఞం చేత ఉపాసిస్తున్నారు. ఎటువంటిది ఆ జ్ఞానం? పరబ్రహ్మము ఒకటే అనే సమ్యగ్దర్శనం ఆ జ్ఞానం. భగవంతుని గురించిన అటువంటి ఏకత్వజ్ఞానమే యజ్ఞం. ఆ జ్ఞానయజ్ఞంతో నన్ను కొందరు ఉపాసిస్తున్నారు. కొందరు పృథగ్భావంతో, సూర్యుడు చంద్రుడు మొదలైన భిన్న రూపాలతో ఉన్నవాడు ఆ విష్ణుభగవానుడే అని ఆ రూపాలను ఉపాసిస్తున్నారు. మరికొందరు ఆ భగవానుడే సర్వతోముఖంగా విశ్వరూపంతో బహువిధాలుగా ఉన్నాడు అని ఆ విశ్వరూపుని, విశ్వతోముఖుని బహుధా ఉపాసిస్తున్నారు.

**భాష్యమ్ : 16.0 యది బహుభిః ప్రకారైః ఉపాసతే, కథం త్వామేవోపాసతే ఇతి అత ఆహ–**

**తె.అ.** అనేక విధాలుగా ఉపాసిస్తున్నపుడు నిన్నే ఉపాసించినట్లు ఎట్లా అవుతుంది? అంటే చెపుతున్నాడు –

**మూ. అహం క్రతురహం యజ్ఞః స్వధాఽహమహమౌషధమ్ ।**
**మంత్రోఽహమహమేవాజ్యమహమగ్నిరహం హుతమ్ ॥ 16**

**తె.అ.** క్రతువు నేను, యజ్ఞం నేను, స్వధా నేను, ఔషధం నేను, మంత్రం నేను, ఆజ్యం నేను, అగ్ని నేను, హుతం నేను.

**భాష్యమ్ : 16.1 అహం క్రతుః శ్రౌతకర్మ భేదః అహమేవ. అహం యజ్ఞః స్మార్తః, కించ స్వధా అన్నమహం, పితృభ్యో యద్దీయతే. అహమౌషధం సర్వప్రాణిభిర్యదద్యతే తదౌషధశబ్దశబ్దితం వ్రీహియవాదిసాధారణం. అథవా స్వధేతి సర్వప్రాణిసాధారణమన్నమ్, ఔషధమితి వ్యాధ్యుపశమనార్థం భేషజం. మంత్రోఽహం, యేన పితృభ్యో దేవతాభ్యశ్చ హవిర్దీయతే. అహమేవాజ్యం హవిశ్చ. అహమగ్నిః, యస్మిన్ హూయతే హవిః సోఽగ్నిరహం. అహం హుతం హవనకర్మ చ. కించ –**

**తె.అ.** శ్రౌతకర్మ అయిన క్రతువును నేనే. స్మార్తకర్మ అయిన యజ్ఞాన్ని నేనే. పితరులకిచ్చే అన్నం స్వధా, అదీ నేనే. సర్వప్రాణులు తినే వరి, గోధుమ మొదలైన వాటిని ఔషధమంటారు. అదీ నేనే. లేక, స్వధా అంటే సర్వప్రాణులు తినే అన్నం, ఔషధమంటే వ్యాధి ఉపశమించడానికి తినే మందు. పితరులకు దేవతలకు హవిస్సు ఇచ్చేటపుడు చెప్పే మంత్రం నేనే. ఆజ్యం, హవిస్సు నేనే. హవిస్సు ఎందులో హోమం చేస్తారో ఆ అగ్నిని నేనే. హుతం అంటే హవన కర్మ, అదీ నేనే. అంతేకాదు –

**మూ. పితాఽహమస్య జగతో మాతా ధాతా పితామహః ।**
**వేద్యం పవిత్రమోంకార ఋక్సామ యజురేవ చ ॥ 17**

**తె.అ.** ఈ జగత్తుకు తండ్రిని, తల్లిని, విధాతను, తాతను నేను. తెలుసుకోదగిన పవిత్ర విషయాన్ని నేను. ఓంకారము, ఋక్కు, సామము, యజుస్సు నేనే.

**భాష్యమ్ : 17.1 పితా జనయితా అహమస్య జగతః, మాతా జనయిత్రీ, ధాతా కర్మఫలస్య ప్రాణిభ్యో విధాతా, పితామహః పితుః పితా, వేద్యం వేదితవ్యం, పవిత్రం పావనం ఓంకారః, ఋక్సామ యజురేవచ. కించ –**

**తె.అ.** ఈ జగత్తుకు తండ్రిని, తల్లిని నేను. ప్రాణులకు కర్మఫలం విధించే విధాతను. తండ్రికి తండ్రిని. తెలుసుకోదగిన పావన వస్తువును. ఓంకారము, ఋగ్వేదం, సామవేదం, యజుర్వేదం కూడా నేనే. అంతేకాదు –

**మూ. గతిర్భర్తా ప్రభుః సాక్షీ నివాసశ్శరణం సుహృత్ ।**
**ప్రభవః ప్రలయః స్థానం నిధానం బీజమవ్యయమ్ ॥ 18**

**తె.అ.** గతి, భర్త, ప్రభువు, సాక్షి, నివాసము, శరణము, మిత్రము, సృష్టి స్థితి లయ కారకుడను, ఆధార స్థానమును, నాశరహిత బీజమును నేను.

**భాష్యమ్ : 18.1 గతిః కర్మఫలం, భర్తా పోష్టా, ప్రభుః స్వామీ, సాక్షీ ప్రాణినాం కృతాకృతస్య, నివాసః యస్మిన్ ప్రాణినో నివసంతి, శరణమార్తానాం ప్రపన్నానామార్తిహరః, సుహృత్ ప్రత్యుపకార నపేక్షస్సన్ ఉపకారీ, ప్రభవః, ఉత్పత్తిర్జగతః, ప్రలయః ప్రలీయతే అస్మిన్నితి తథా స్థానం తిష్ఠత్యస్మిన్నితి, నిధానం నిక్షేపః కాలాంతరోపభోగ్యం ప్రాణినాం, బీజం ప్రరోహకారణం ప్రరోహధర్మిణాం, అవ్యయం యావత్సంసారభావిత్వాదవ్యయం, న హ్యబీజం కించిత్ప్రరోహతి, నిత్యం చ ప్రరోహదర్శనాత్ బీజసంతతిః న వ్యేతి ఇతి గమ్యతే.**

**తె.అ.** గతి అంటే కర్మఫలం. భర్త పోషించువాడు. ప్రభువు స్వామి. ప్రాణులు ఏం చేశారు, ఏం చేయలేదు అన్నదానికి సాక్షి. ప్రాణులుండే నివాసం. కష్టంలో శరణుజొచ్చినవారి కష్టం తొలగించేవాడు. మిత్రుడు, ప్రత్యుపకారం కోరకుండా మేలు చేసేవాడు. ప్రభవం, జగత్తుకు పుట్టుక. ప్రలయం, దేనియందు జగత్తు లీనమవుతుందో అది. దేనిలోపల జగత్తుంటుందో అది స్థానం. నిధానం అంటే నిక్షేపం, ప్రాణులు కాలాంతరంలో అనుభవించగలిగింది. మొలకెత్తే లక్షణం కలవన్నీ మొలకెత్తడానికి బీజం. సంసారమున్నంతకాలం నశించనిది కనుక అది అవ్యయబీజం. విత్తనం లేనిదేదీ మొలకెత్తదు. మొలకెత్తడం ఎప్పుడూ ఉంటూ ఉన్నదే, చూస్తూనే ఉన్నాం. కనుక బీజసంతతి అయిపోవడమన్నది లేదు. అంతేకాదు –

**మూ. తపామ్యహమహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామి చ ।**
**అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహమర్జున ॥ 19**

**తె.అ.** నేను ఎండను కలిగిస్తున్నాను. నేను వర్షాన్ని గ్రహించి వదులుతున్నాను. అమృతాన్ని నేను మృత్యువును నేను. అర్జునా, సత్తును అసత్తును కూడా నేను.

**భాష్యమ్ : 19.1 తపామ్యహం ఆదిత్యో భూత్వా కైశ్చిత్ రశ్మిభిః ఉల్బణైః. అహం వర్షం కైశ్చిద్రశ్మిభిః ఉత్సృజామి, ఉత్సృజ్య పునః నిగృహ్ణామి కైశ్చిద్రశ్మిభిరష్టభిర్మాసైః, పునరుత్సృజామి ప్రావృషి. అమృతం చైవ దేవానాం, మృత్యుశ్చ మర్త్యానాం, సత్ యస్య యత్సంబంధితయా విద్యమానం తత్, తద్విపరీతమసచ్చ ఏవమహం అర్జున న పునరత్యంతమేవాసద్భగవాన్ స్వయం. కార్యకారణే వా సదసతీ.**

**తె.అ.** సూర్యుడినై కొన్ని తీవ్రకిరణాల చేత ఎండను కలిగిస్తున్నాను. కొన్ని కిరణాల చేత వర్షం వదులుతున్నాను. అంటే నీటిని విడుస్తున్నాను. వదలి, మళ్ళీ ఎనిమిది నెలలపాటు ఆపి కొన్ని కారణాల చేత మళ్ళీ వర్షాకాలంలో వదులుతున్నాను. దేవతల అమృతము (మరణాభావం) మర్త్యుల మృత్యువు నేనే. సత్తు అంటే మరొక వస్తువుతో సంబంధం కలిగివుండడం. అట్లా లేకపోవడం అసత్తు. ఆ రెండూ నేనే, అర్జునా. అయితే భగవంతుడు స్వయము అత్యంతము అసత్తు కాదు. కార్యము కారణము (సత్) రెండూ నేనే కనుక. కార్యరూపమైన అసత్ జగత్తు కూడా నేనే కనుక.

**భాష్యమ్ : 19.2 యే పూర్వోక్తైర్నివృత్తిప్రకారైః ఏకత్వపృథక్త్వాది విజ్ఞానైర్యజ్ఞైర్మాం పూజయంతః ఉపాసతే జ్ఞానవిదః, తే యథావిజ్ఞానం మామేవ ప్రాప్నువంతి యే పునరజ్ఞాః కామకామాః –**

**తె.అ.** పూర్వం చెప్పిన నివృత్తిమార్గంలో ఏకత్వజ్ఞానంతో గాని పృథగ్భావంతోగాని యజ్ఞాలచే నన్ను ఉపాసించేవారు జ్ఞానవేత్తలు, వారు వారి జ్ఞానానికి అనుగుణంగా నన్నే చేరుతున్నారు. మరి కామకాములైన అజ్ఞానులు –

**మూ. త్రైవిద్యా మాం సోమపాః పూతపాపాః యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే ।**
**తే పుణ్యమాసాద్య సురేంద్రలోక మశ్నంతి దివ్యాన్ దివి దేవభోగాన్ ॥ 20**

**తె.అ.** మూడు వేదాలు తెలిసినవారు, సోమపానం చేసి పాపాలు కడిగివేసుకున్నవారు, యజ్ఞాలచేత నన్ను సేవించి స్వర్గగతిని కోరుకొంటారు. వారు పుణ్యం చేసుకుని ఇంద్రలోకం చేరి అక్కడ దేవభోగాలు అనుభవిస్తారు.

**భాష్యమ్ : 20.1 త్రైవిద్యాః ఋగ్యజుస్సామవిదః మాం వస్వాది దేవరూపిణం సోమపాః సోమం పిబంతీతి సోమపాః, తేనైవ సోమపానేన పూతపాపాః శుద్ధకిల్బిషాః, యజ్ఞై రగ్నిష్టోమాదిభి రిష్ట్వా పూజయిత్వా, స్వర్గతిమ్ స్వర్గగమనం స్వరేవ గతిః స్వర్గతిః తాం, ప్రార్థయంతే, తే చ పుణ్యం పుణ్యఫలమాసాద్య సంప్రాప్య సురేంద్రలోకం శతక్రతోః స్థానం అశ్నంతి భుంజతే దివ్యాన్ దివి భవాన్ అప్రాకృతాన్ దేవభోగాన్ దేవానాం భోగః దేవభోగః తాన్.**

**తె.అ.** ఋగ్యజుస్సామమనే మూడు వేదాలు తెలిసినవారు. వారు సోమపానం చేసి, ఆ సోమపానం చేతనే పాపాలు కడిగివేసుకుని శుద్ధులైనవారు. అగ్నిష్టోమాది యజ్ఞాలచేత నన్ను పూజించి స్వర్గగమనం కావలెనని ప్రార్థిస్తారు. వారు పుణ్యఫలం పొంది నూరు యజ్ఞాలు చేసిన ఇంద్రుని పదవిని పొందుతారు. దేవలోకంలో దేవతలనుభవించే దివ్యసుఖాలు అనుభవిస్తారు.

**మూ. తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి ।**
**ఏవం త్రయీధర్మమనుప్రపన్నా గతాగతం కామకామా లభన్తే ॥ 21**

**తె.అ.** వారు ఆ విశాలమైన స్వర్గలోకాన్ని అనుభవించి, పుణ్యం క్షీణించగానే మర్త్యలోకం ప్రవేశిస్తున్నారు. ఈ విధంగా కోర్కెలు కోరుకుని వేదత్రయంలో చెప్పిన ధర్మాన్ని ఆశ్రయించినవారు పోతూ వస్తూ ఉంటారు.

**భాష్యమ్ : 21.1 తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం విస్తీర్ణం క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి ఆవిశంతి. ఏవం యథోక్తేన ప్రకారేణ, త్రయీధర్మం కేవలం వైదికం కర్మ అనుప్రపన్నాః గతాగతం గతం చ ఆగతం చ గతాగతం గమనాగమనం కామకామాః కామాన్ కామయంతే ఇతి కామకామాః లభంతే గతాగతమేవ, న తు స్వాతంత్ర్యం క్వచిల్లభంతే ఇత్యర్థః.**

**తె.అ.** ఆ విశాలమైన స్వర్గలోకాన్ని అనుభవించి పుణ్యం క్షీణించగానే మర్త్యలోకం ప్రవేశిస్తున్నారు. ఈ విధంగా వెనుక చెప్పినట్లు కేవలం వైదికకర్మను ఆశ్రయించి కోర్కెలు కోరుకునేవారు పోతూ వస్తూ ఉంటారు. వారు ఎన్నటికి స్వాతంత్ర్యం పొందలేరు.

**భాష్యమ్ : 22.0 యే పునర్నిష్కామాస్సమ్యగ్దర్శినః –**

**తె.అ.** మరి నిష్కాములైన సమ్యగ్దర్శనులు –

**మూ. అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే ।**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥ 22**

**తె.అ.** అనన్యభావంతో నన్ను గురించి చింతిస్తూ నిత్యయుక్తులై నన్ను ఉపాసించేవారి యోగక్షేమాలు నేను చూస్తాను.

**భాష్యమ్ : 22.1 అనన్యాః అపృథగ్భూతాః పరం దేవం నారాయణం ఆత్మత్వేన గతాస్సంతశ్చింతయంతో మాం యే జనాః సంన్యాసినః పర్యుపాసతే, తేషాం పరమార్థదర్శినాం నిత్యాభియుక్తానాం, సతతాభియోగినాం యోగక్షేమం యోగః అప్రాప్తస్య ప్రాపణం, క్షేమః తద్రక్షణం, తదుభయం వహామి ప్రాపయామ్యహం, జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్ 'స చ మే ప్రియః' (7.17.18) యస్మాత్ తస్మాత్ తే మమాత్మభూతాః ప్రియాశ్చ ఇతి. నను అన్యేషామపి భక్తానాం యోగక్షేమం వహత్యేవ భగవాన్. సత్యం వహత్యేవ, కిం త్వం విశేషః – అన్యే యే భక్తాస్తే ఆత్మార్థం స్వయమపి యోగక్షేమం ఈహంతే, అనన్యదర్శినస్తు నాత్మార్థం యోగక్షేమమీహంతే, న హి తే జీవితే మరణే వా ఆత్మనో గృధ్నిం కుర్వంతి, కేవలమేవ భగవచ్ఛరణాః తే, అతః భగవానేవ యోగక్షేమం వహతీతి.**

**తె.అ.** అనన్యులు అంటే పరమాత్మ కంటె అన్యులు కానివారు, పరమదేవుడైన నారాయణుని ఆత్మస్వరూపంగా తెలిసినవారు. ఎప్పుడూ యోగంలో ఉంటూ నన్ను ఉపాసించే ఆ పరమార్థ

దర్శనులైన సన్న్యాసుల యోగక్షేమాలు నేను వహిస్తున్నాను. లేనిది పొందడం యోగం. ఉన్నది కాపాడడం క్షేమం. 'జ్ఞానిని నా ఆత్మగానే భావిస్తాను', అతడు నాకు ప్రియుడు కూడా, కనుక వారు నాకు ఆత్మరూపులు, ప్రియమైనవారు కూడా అని. తక్కిన భక్తుల యోగక్షేమాలు కూడా చూసేది భగవానుడే కదా? నిజమే, ఆయనే చూస్తాడు. కాని అందులో తేడా వుంది. ఇతర భక్తులు తమ కొరకు తామే యోగక్షేమాలు కోరుతారు. అనన్యదర్శులు తమ కొరకు యోగక్షేమాలు కోరరు. జీవితంలో కాని, మరణంలోకాని వారు తమకొరకు ఏదీ కోరరు. కేవలం భగవంతుణ్ణే శరణు పొందుతారు. కనుక భగవానుడే వారి యోగక్షేమాలు చూస్తాడు అని.

**భాష్యమ్ : 23.0 నను అన్యా అపి దేవతాః త్వమేవ చేత్, తద్భక్తాశ్చ త్వామేవ భజంతే సత్యం ఏవం –**

**తె.అ.** తక్కిన దేవతలు కూడా నీవే, వారి భక్తులు కూడా నిన్నే పూజిస్తున్నారు కదా అంటే, నిజమే –

**మూ. యేఽప్యన్యదేవతాభక్తా యజంతే శ్రద్ధయాఽన్వితాః ।**
**తేఽపి మామేవ కౌంతేయ యజంత్యవిధిపూర్వకమ్ ॥ 23**

**తె.అ.** అర్జునా! శ్రద్ధతో ఇతర దేవతలను ఉపాసించే భక్తులు కూడా నన్నే ఉపాసిస్తున్నారు. అది వారికి తెలియదు.

**భాష్యమ్ : 23.1 యేఽపి అన్యదేవతాభక్తాః అన్యాసు దేవతాసు భక్తాః అన్యదేవతాభక్తాః సంతః యజంతే పూజయంతి శ్రద్ధయా ఆస్తిక్యబుద్ధ్యా, అన్వితాః అనుగతాః, తేఽపి మామేవ కౌంతేయ యజంతి అవిధిపూర్వకం, అవిధిః అజ్ఞానం తత్పూర్వకం యజంతే ఇత్యర్థః.**

**తె.అ.** ఇతరదేవతలయందు భక్తిగలవారు కూడా, ఆస్తిక్యబుద్ధితో కూడినవారై పూజించేవారు, అజ్ఞానంలో – అంటే నన్నే పూజిస్తున్నారని కూడా నన్నే ఉపాసిస్తున్నారు అని అర్థం.

**భాష్యమ్ : 24.0 కస్మాత్ తే అవిధిపూర్వకం యజంతే ఇత్యుచ్యతే, యస్మాత్ –**

**తె.అ.** వారి ఉపాసన అజ్ఞానపూర్వకం ఎందుకు అవుతుంది అంటే –

**మూ. అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ ।**
**న తు మామభిజానంతి తత్త్వేనాతశ్చ్యవన్తి తే ॥ 24**

**తె.అ.** అన్ని యజ్ఞాలకు భోక్తను ప్రభువును నేను. నన్ను యథార్థంగా వారు తెలుసుకోవడం లేదు. కనుకనే పతనమవుతున్నారు.

**భాష్యమ్ : 24.1 అహిం హి సర్వయజ్ఞానాం శ్రౌతానాం స్మార్తానాం చ సర్వేషాం దేవతాత్మత్వేన భోక్తా చ ప్రభురేవ చ. మత్స్వామికో యజ్ఞః, 'అధియజ్ఞోఽహమేవాత్ర' (8.4) ఇతి హ్యుక్తం తథా న తు మామభిజానంతి తత్త్వేన యథావత్. అతశ్చ అవిధిపూర్వకమిష్ట్వా యాగఫలాత్ చ్యవంతి ప్రచ్యవంతే తే.**

**తె.అ.** శ్రౌతస్మార్తయజ్ఞాలన్నిటికి దేవతారూపంలో భోక్తను ప్రభువును నేను. యజ్ఞానికి స్వామిని నేనే. 'అధియజ్ఞాన్ని నేనే' అని కూడా చెప్పి ఉన్నాను. అయినా నా యథార్థతత్త్వం వారికి తెలియదు. కనుక అజ్ఞాన పూర్వకంగా యజ్ఞం చేసి యాగఫలం నుంచి పతనమవుతున్నారు.

**భాష్యమ్ : 25.0 యేఽప్యన్యదేవతాభక్తిమత్త్వేనావిధిపూర్వకం యజంతే తేషామపి యాగఫల మవశ్యంభావి. కథం?**

**తె.అ.** అన్యదేవతలయందు భక్తితో అజ్ఞానపూర్వకంగా ఉపాసించేవారికి కూడా యాగఫలం తప్పక లభిస్తుంది. ఎట్లా? –

**మూ. యాన్తి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాన్తి పితృవ్రతాః ।**
**భూతాని యాన్తి భూతేజ్యాః యాన్తి మద్యాజినోఽపి మామ్ ॥ 25**

**తె.అ.** దేవవ్రతులు దేవతలను ; పితృవ్రతులు పితరులను ; భూతములను ఉపాసించేవారు భూతములను పొందుతారు. నన్ను ఉపాసించేవారు నన్నే చేరుతారు.

**భాష్యమ్ : 25.1 యాంతి గచ్ఛంతి దేవవ్రతాః దేవేషు వ్రతం నియమో భక్తిశ్చ యేషాం తే దేవవ్రతాః దేవాన్. యాంతి పితౄన్ అగ్నిష్వాత్తాదీన్ యాంతి పితృవ్రతాః శ్రాద్ధాదిక్రియాపరాః పితృభక్తాః. భూతాని వినాయక మాతృగణ చతుర్భగిన్యాదీని యాంతి భూతేజ్యాః భూతానాం పూజకాః. యాంతి మద్యాజినః మద్యజనశీలాః వైష్ణవాః మామేవ యాన్తి, సమానేఽప్యాయాసే మామేవ న భజంతే అజ్ఞానాత్, తేన తే అల్పఫలభాజః భవంతి ఇత్యర్థః.**

**తె.అ.** దేవతలయందు నియమము, భక్తిగలవారు దేవవ్రతులు. వారు దేవతలను చేరుకుంటారు. శ్రాద్ధము మొదలైన కర్మలు ఆచరించడంలో పరాయణులైన పితృభక్తులు అగ్నిష్వాత్తాది పితరులను చేరుకుంటారు. భూతాలను పూజించేవారు వినాయకుడు (విఘ్నేశ్వరుడు, పార్వతీతనయుడుకాదు. ఒక గణానికి చెందిన నాయకుడు) మాతృకాగణము చతుర్భగిని వంటి భూతాలను చేరుకుంటారు. నన్ను పూజించే వైష్ణవులు నన్నే చేరుకుంటారు. ఆయాసం సమానమే అయినప్పటికి అజ్ఞానంచేత నన్ను సేవించడం లేదు. కనుక వారు అల్పఫలమే పొందుతున్నారు.

**భాష్యమ్ : 26.0 న కేవలం మద్భక్తానామనావృత్తిలక్షణమనంతఫలం, సుఖారాధనశ్చాహం, కథం?**

**తె.అ.** నా భక్తులకు కేవలం అపునరావృత్తిరూపమైన అనంతఫలం లభించడమే కాదు, నన్ను ఆరాధించడం సులభం కూడా –

**మూ. పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।**
**తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః ॥ 26**

**తె.అ.** శుద్ధమైన బుద్ధిగలవాడు నాకు భక్తితో అర్పించే పత్రమైనా పుష్పమైనా ఫలమైనా జలమైనా నేను గ్రహిస్తున్నాను.

**భాష్యమ్ : 26.1 పత్రం పుష్పం ఫలం తోయముదకం యః మే మహ్యం భక్త్యా ప్రయచ్ఛతి, తదహం పత్రాది ఉపహృతం భక్తిపూర్వకం ప్రాపితం భక్త్యుపహృతం, అశ్నామి గృహ్ణామి, ప్రయతాత్మనః శుద్ధబుద్ధేః. యత ఏవం అతః –**

**తె.అ.** నాకు భక్తిపూర్వకంగా ఎవడు ఆకుగానీ, పువ్వుగానీ, పండుగాని, నీరుగాని సమర్పిస్తాడో, శుద్ధమైన అంతఃకరణగల అతడు భక్తితో సమర్పించిన దానిని నేను గ్రహిస్తాను. కనుక –

**మూ. యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్ ।**
**యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్ ॥ 27**

**తె.అ.** అర్జునా, నీవు ఏది చేసినా ఏదితిన్నా, ఏ హోమం చేసినా, ఏది దానం చేసినా, ఏ తపం చేసినా అవన్నీ నాకు అర్పించు –

**భాష్యమ్ : 27.1 యత్కరోషి, స్వతః ప్రాప్తం, యదశ్నాసి, యచ్చ జుహోషి హవనం నిర్వర్తయసి శ్రౌతం స్మార్తం వా, యద్దదాసి ప్రయచ్ఛసి బ్రాహ్మణాదిభ్యః హిరణ్యాన్నాజ్యాది, యత్తపస్యసి తపః చరసి, కౌంతేయ, తత్కురుష్వ మదర్పణం మత్సమర్పణమ్.**

**తె.అ.** అర్జునా, స్వతఃప్రాప్తమైన కర్మ నీవు ఏది చేసినా, ఏది తిన్నా, శ్రౌతస్మార్త హవనమేది చేసినా, ఏ తపమాచరించినా అవి నాకు సమర్పణంగా చేయి.

**భాష్యమ్ : 28.0 ఏవం కుర్వతస్తవ యద్భవతి, తచ్ఛృణు –**

**తె.అ.** ఈ విధంగా చేస్తే నీకు ఏమవుతుందో విను –

**మూ. శుభాశుభఫలైరేవం మోక్ష్యసే కర్మబంధనైః ।**
**సంన్యాసయోగయుక్తాత్మా విముక్తో మాముపైష్యసి ॥ 28**

**తె.అ.** ఈ విధంగా చేసి నీవు కర్మబంధం నుండి వాటి శుభాశుభఫలాలనుండి ముక్తుడవవుతావు. సన్న్యాసయోగయుక్తమైన మనసుతో నీవు ముక్తుడవై నన్ను చేరుకుంటావు.

**భాష్యమ్ : 28.1 శుభాశుభఫలైః శుభాశుభే ఇష్టానిష్టే ఫలే యేషాం తాని శుభాశుభఫలాని కర్మాణి తైః శుభాశుభఫలైః కర్మబంధనైః కర్మాణ్యేవ బంధనాని కర్మబంధనాని తైః కర్మబంధనైః ఏవం మదర్పణం కుర్వన్ మోక్ష్యసే. సోఽయం సంన్యాసయోగో నామ, సంన్యాసశ్చ అసౌ మత్సమర్పణతయా కర్మత్వాద్యోగశ్చ అసౌ ఇతి, తేన సంన్యాసయోగేన యుక్తః ఆత్మా అన్తః కరణం యస్య తవ సః త్వం సంన్యాసయోగయుక్తాత్మా సన్, విముక్తో కర్మబంధనైః జీవన్నేవ పతితే చాస్మిన్ శరీరే మాముపైష్యసి ఆగమిష్యసి.**

**తె.అ.** శుభాశుభఫలాలు అంటే ఇష్టానిష్టఫలాలు. ఆ ఫలాలనిచ్చే కర్మలే బంధనాలు. నాకు అర్పించి చేసినట్లయితే కర్మలు నిన్ను బంధించవు. కర్మబంధనాలనుండి నీవు ముక్తుడవవుతావు. దీన్నే సంన్యాసయోగమంటారు. నాకు సమర్పించడంచేత సంన్యాసము, కర్మ కనుక యోగము. ఇటువంటి సంన్యాసయోగంతో కూడిన అంతఃకరణం కలవాడు సంన్యాసయోగయుక్తాత్ముడు. అటువంటివాడు జీవించి ఉండగానే కర్మబంధనాలనుండి ముక్తుడై ఈ శరీరం రాలిపోగానే నన్ను చేరుకుంటాడు.

**భాష్యమ్ : 29.0 రాగద్వేషవాన్ తర్హి భగవాన్, యతో భక్తాన్ అనుగృహ్ణాతి, నేతరానితి. తన్న.**

**తె.అ.** అట్లా అయితే భగవానుడికి రాగద్వేషాలున్నట్లే కదా? ఎందుకంటే ఆయన భక్తులను మాత్రమే అనుగ్రహిస్తున్నాడు, తక్కినవారిని కాదు అంటే, అట్లా కాదు –

**మూ. సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః ।**
**యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాఽప్యహమ్ ॥ 29**

**తె.అ.** సర్వభూతములయందు నేను సమభావంతో ఉంటాను. నాకు ఎవరియందు ద్వేషం లేదు. నాకు ఎవడూ ఇష్టుడు కాడు. నన్ను భక్తితో సేవించేవారు మాత్రం నాలో ఉంటారు, నేను వారిలో.

**భాష్యమ్ : 29.1 సమః తుల్యః అహం సర్వభూతేషు, న మే ద్వేష్యోఽస్తి న ప్రియః అగ్నివదహం దూరస్థానాం యథాగ్నిః శీతం నాపనయతి, సమీపముపసర్పతామపనయతి, తథాహం భక్తాననుగృహ్ణామి, నేతరాన్, యే భజంతి తు మామీశ్వరం భక్త్యా, మయి తే స్వభావత ఏవ, న మమ రాగనిమిత్తం వర్తంతే. తేషు చాప్యహం స్వభావత ఏవ వర్తే, నేతరేషు, నైతావతా తేషు ద్వేషో మమ.**

**తె.అ.** నేను సర్వప్రాణులయందు సమభావంతో ఉంటాను. నాకు ద్వేషించవలసినవాడు లేడు, ప్రియమైన వాడూ లేడు. నేను అగ్నివంటి వాణ్ణి – దూరంగా ఉన్నవానికి అగ్ని చలి పోగొట్టదు, దగ్గరికి వచ్చేవానికి పోగొడుతుంది. అట్లాగే నేను భక్తులను అనుగ్రహిస్తున్నాను, ఇతరులను కాదు. ఈశ్వరుడనైన నన్ను భక్తితో సేవించేవారు స్వభావంచేతనే నాలో ఉంటున్నారు, నాకు వారియందు గల అనురాగం వల్ల కాదు. వారిలో కూడా నేను స్వభావంచేతనే ఉంటున్నాను, ఇతరులయందు ఉండడంలేదు. అంటే వారియందు నాకు ద్వేషంలేదు అని.

**భాష్యమ్ : 30.0 శృణు మద్భక్తేర్మాహాత్మ్యమ్ –**

**తె.అ.** నా భక్తి మాహాత్మ్యం విను –

**మూ. అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్ ।**
**సాధురేవ స మన్తవ్యః సమ్యగ్వ్యవసితో హి సః ॥ 30**

**తె.అ.** నన్ను అనన్యభక్తితో సేవించేవాడు ఎంత దురాచారవంతుడైనా అతనిని సాధువుగానే భావించాలి. అతడు సరి అయిన నిశ్చయంతో ఉన్నవాడు.

**భాష్యమ్ : 30.1 అపి చేత్ యద్యపి సుదురాచారః సుష్ఠు దురాచారః అతీవ కుత్సితాచారోఽపి, భజతే మామనన్యభాక్. అనన్యభక్తిస్సన్, సాధురేవ సమ్యగ్వృత్త ఏవ సః మంతవ్యః, జ్ఞాతవ్యః, సమ్యక్ యథావత్ వ్యవసితో హి సః, యస్మాత్సాధునిశ్చయస్సః.**

**తె.అ.** చాలా దురాచారవంతుడైనప్పటికి అనన్యభక్తితో నన్ను సేవించేవాడు సాధువే. సద్వర్తనుడే అని భావించవలెను. ఎందుకంటె అతనిది సాధునిశ్చయం.

**భాష్యమ్ : 31.0 ఉత్సృజ్య బాహ్యం దురాచారతాం అంతస్సమ్యగ్వ్యవసాయసామర్థ్యాత్–**

**తె.అ.** మనసులోని మంచి నిశ్చయం యొక్క బలంతో బాహ్య దురాచారాన్ని వదిలివేసి–

**మూ. క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి ।**
**కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి ॥ 31**

**తె.అ.** శీఘ్రమే, అంటే భక్తి కలిగిన వెంటనే, అతడు ధర్మాత్ముడై శాశ్వత శాంతిని పొందుతాడు. అర్జునా, నా భక్తుడు నశించడని తెలుసుకో.

**భాష్యమ్ : 31.1 క్షిప్రం శీఘ్రం భవతి ధర్మాత్మా ధర్మచిత్తః ఏవ. శశ్వన్నిత్యం శాంతిం చ ఉపశమం నిగచ్ఛతి, ప్రాప్నోతి. శృణు పరమార్థం, హే కౌంతేయ ప్రతిజానీహి నిశ్చితాం**

**ప్రతిజ్ఞాం కురు, న మే మమ భక్తః మయి సమర్పితాంతరాత్మా మద్భక్తః న ప్రణశ్యతి ఇతి. కించ–**

**తె.అ.** శీఘ్రమే అతడు ధర్మాత్ముడవుతాడు. అంటే అతని చిత్తం ధర్మంతో నిండిపోతుంది. అతడు ఎప్పుడూ శాంతితో ఉంటాడు. అర్జునా, ఈ పరమార్థం విను – నా యందు మనసును అర్పించిన నా భక్తుడు నశించడు అని గట్టిగా నమ్ము. అంతేకాదు.

**మూ. మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః ।**
**స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాంతి పరాం గతిమ్ ॥ 32**

**తె.అ.** నన్నాశ్రయించిన పాపజన్ములు కూడా, స్త్రీలు, వైశ్యులు, శూద్రులు, ఉత్తమగతిని పొందుతారు.

**భాష్యమ్ : 32.1 మాం హి యస్మాత్ పార్థ వ్యపాశ్రిత్య మమాశ్రయత్వేన గృహీత్వా యేఽపి స్యుః భవేయుః పాపయోనయః పాపయోనిః యేషాం తే పాపయోనయః పాపజన్మానః కే తే ఇతి, ఆహ స్త్రియః వైశ్యాః తథా శూద్రాః తేఽపి యాంతి గచ్ఛంతి పరాం ప్రకృష్టాం గతిమ్.**

**తె.అ.** నన్ను ఆశ్రయించి పాపజన్ములు కూడా – వారెవరంటే స్త్రీలు, వైశ్యులు, శూద్రులు (దృఢమైన దేహాభిమానం, లోభం, సంసారశోకం గలవారు) ఉత్తమగతిని పొందుతారు.

**మూ. కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయస్తథా ।**
**అనిత్యమసుఖం లోకమిమం ప్రాప్య భజస్వ మామ్ ॥ 33**

**తె.అ.** మరి పుణ్యజన్ములైన బ్రాహ్మణులమాట, భక్తులైన రాజర్షుల విషయం చెప్పవలసిన దేముంది? అనిత్యము అసుఖము అయిన ఈ లోకం చేరిన నీవు నన్ను సేవించు.

**భాష్యమ్ : 33.1 కిం పునః బ్రాహ్మణాః పుణ్యాః పుణ్యయోనయః భక్తా రాజర్షయః తథా రాజానశ్చ తే ఋషయశ్చ రాజర్షయః. యతః ఏవమ్ అతః అనిత్యం క్షణభంగురం అసుఖం చ సుఖవర్జితమిమం లోకం మనుష్యలోకం ప్రాప్య పురుషార్థసాధనం దుర్లభం మనుష్యత్వం లబ్ధ్వా భజస్వ సేవస్వ మామ్. కథమ్?**

**తె.అ.** పుణ్యజన్ములైన బ్రాహ్మణులు, భక్తులైన రాజర్షులు (రాజులు ఋషులు కూడా అయినవారు రాజర్షులు) వీరి మాట చెప్పవలసినదేముంది. కనుక క్షణభంగురమై సుఖంలేని ఈ మనుష్యలోకం చేరి, అంటే పురుషార్థ సాధనమైన దుర్లభ మానవజన్మ పొందిన నీవు నన్ను సేవించు. (దుర్లభమైన మానవజన్మ పొందిన నీవు దానిని పురుషార్థసాధనంగా సద్వినియోగం చేసుకో) ఎట్లా? –

**మూ. మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।**
**మామేవైష్యసి యుక్త్వైవమాత్మానం మత్పరాయణః ॥ 34**

**తె.అ.** నీ మనసు నా యందు నిలుపు. నా భక్తుడవు కమ్ము. నన్ను భజించు, నాకు నమస్కరించు, నాయందు తత్పరభావంతో చిత్తాన్ని సమాధానం చేసుకుని నన్నే చేరుకుంటావు.

**ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా – సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే రాజవిద్యా రాజగుహ్యయోగో నామ నవమోఽధ్యాయః.**

ఇది వ్యాసభగవానుని శతసహస్రసంహిత అయిన శ్రీ మహాభారతంలో భీష్మపర్వంలో ఉపనిషత్తులు బ్రహ్మవిద్య యోగశాస్త్రము శ్రీకృష్ణార్జునసంవాదము అయిన భగవద్గీతలయందు రాజవిద్యారాజగుహ్యయోగం అనే తొమ్మిదవ అధ్యాయానికి తెలుగు అనువాదం.

**భాష్యమ్ : 34.1 మన్మనా యితి. మయి వాసుదేవే మనః యస్య తవ స త్వం మన్మనాః భవ. తథా మద్భక్తః భవ. మద్యాజీ మద్యజనశీలః భవ. మాం ఏవ నమస్కురు. మాం ఏవ ఈశ్వరం ఏష్యసి ఆగమిష్యసి యుక్త్వా సమాధాయ చిత్తం, ఏవం ఆత్మానం మాం – అహం హి సర్వేషాం భూతానాం ఆత్మా, పరా చ గతిః, పరం అయనమ్. తం మాం ఏవం భూతం ఏష్యసి యితి అతీతేన సంబంధః మత్పరాయణః సన్ ఇత్యర్థః.**

**తె.అ.** నాయందు అంటే వాసుదేవుని యందు మనసు నిలుపుకో. నా భక్తుడవు కమ్ము! నన్ను పూజించు. నాకే నమస్కరించు. చిత్తాన్ని సమాధానం చేసుకొని నన్నే, ఈశ్వరునే, చేరుకుంటావు. ఎందుకంటే నేనే సర్వభూతములకు ఆత్మను, పరమగతిని కూడా.

**ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య గోవిందభగవత్పూజ్యపాదశిష్య శ్రీమచ్ఛంకరభగవతః కృతౌ శ్రీమద్భగవద్గీతాభాష్యే రాజవిద్యా –రాజగుహ్యయోగో నామ నవమోఽధ్యాయః.**

ఇది శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య గోవిందభగవత్పూజ్యపాద శిష్యులు శ్రీమత్ శంకరభగవత్పాదులు రచించిన శ్రీమద్భగవద్గీతా భాష్యంలో రాజవిద్యా రాజగుహ్యయోగం అనే తొమ్మిదవ అధ్యాయానికి తెలుగు అనువాదం.



# దశమోఽధ్యాయః

# విభూతియోగః

**భాష్యమ్ : 1.0 సప్తమే అధ్యాయే భగవతః తత్త్వం విభూతయశ్చ ప్రకాశితాః, నవమే చ. అథ ఇదానీం యేషు యేషు భావేషు చిన్త్యః భగవాన్ తే తే భావాః వక్తవ్యాః. తత్త్వం చ భగవతః వక్తవ్యమ్ ఉక్తమపి, దుర్విజ్ఞేయత్వాత్ ఇత్యతః.**

**తె.అ.** ఏడవ అధ్యాయంలో, తొమ్మిదవ అధ్యాయంలో కూడా భగవంతుని తత్త్వము విభూతులు కూడా వర్ణించబడ్డాయి. ఇక ఇప్పుడు ఏయే భావాలయందు భగవంతుని ధ్యానించదగునో ఆయా భావాలు చెప్పవలసి ఉంది. భగవంతుని తత్త్వం కూడా ఇంతకుముందు చెప్పిందే అయినా చెప్పవలసి ఉంది, సులభంగా తెలియలేని విషయం కనుక. అందుకని –

**శ్రీ భగవానువాచ**

**మూ. భూయ ఏవ మహాబాహో శృణు మే పరమం వచః ।**
**యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా ॥ 1**

శ్రీభగవానుడు అంటున్నాడు.

**తె.అ.** వీరుడా, మళ్ళీ ఒకసారి శ్రేష్ఠమైన నా మాటను విను. నీ మేలు కోరి నీ కిష్టమైనదానిని చెపుతున్నాను.

**భాష్యమ్ : 1.1 భూయః ఇతి – భూయః ఏవ పునః, హే మహాబాహో, శృణు, మే మదీయం పరమం ప్రకృష్టం నిరతిశయవస్తునః ప్రకాశకం, వచః వాక్యం, యత్ పరమం, తే తుభ్యం, ప్రీయమాణాయ, మద్వచనాత్ ప్రీయసే త్వమ్ అతీవ అమృతమివ పిబన్, తతః వక్ష్యామి హితకామ్యయా హితేచ్ఛయా.**

**తె.అ.** నిరతిశయ వస్తువును ప్రకాశింపజేసే ఉత్తమమైన నా మాటను మళ్ళీ విను. నా మాటకు నీవు అమృతం త్రాగినట్లు ప్రీతి చెందుతావు. కనుక నీ ప్రీతికొరకు నీ హితం కోరి చెపుతున్నాను.

**భాష్యమ్ : కిమర్థం అహం వక్ష్యామి ఇతి? అతః ఆహ –**

**తె.అ.** ఎందుకు చెపుతున్నాను అంటే –

**మూ. న మే విదుః సురగణాః ప్రభవం న మహర్షయః ।**
**అహమాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః ॥ 2**

**తె.అ.** దేవతలు మహర్షులకు నా ప్రభవం తెలియదు. ఎందుకంటే దేవతలకు మహర్షులకు కారణమైనవాడను నేను.

**భాష్యమ్ : 2.1 న మే విదుః న జానన్తి సురగణాః బ్రహ్మాదయః, కిం తే న విదుః? మమ ప్రభవం ప్రభావం ప్రభుశక్త్యతిశయమ్, అథవా ప్రభవం ప్రభవనమ్ ఉత్పత్తిం, నాపి మహర్షయః భృగ్వాదయః విదుః. కస్మాత్ తే న విదుః. కస్మాత్ తే న విదుః. ఇతి ఉచ్యతే – అహమ్ ఆదిః కారణం హి యస్మాత్ దేవానాం మహర్షీణాం చ సర్వశః సర్వప్రకారైః –**

**తె.అ.** బ్రహ్మాదులైన సురగణాలకు భృగువు మొదలైన మహర్షులకు తెలియదు. ఏం తెలియదు? నా ప్రభవం. అంటే ప్రభావం, అతిశయమైన ప్రభుశక్తి, లేక ప్రభవం అంటే ఉత్పత్తి, పుట్టుక. ఎందుకని వారికి తెలియదు? అంటే, చెపుతున్నాడు. దేవతలకు మహర్షులకు అన్ని విధాలా ఆది, కారణం నేను కనుక. అంతేకాదు –

**మూ. యో మామజమనాదిం చ వేత్తి లోకమహేశ్వరమ్ ।**
**అసమ్మూఢః స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే ॥ 3**

**తె.అ.** నన్ను పుట్టుకలేనివానిగా, ఆది లేనివానిగా, లోకాలకు మహాప్రభువునుగా తెలుసుకున్న, వాడు మోహం చెందనివాడు. అతడు అన్ని పాపాలనుండి ముక్తి పొందుతాడు.

**భాష్యమ్ : 3.1 యః మామ్ అజమ్ అనాదిం చ, యస్మాత్ అహమ్ ఆదిః దేవానాం మహర్షీణాం, న మమ అన్యః ఆదిః విద్యతే, అతః అహమ్ అజః అనాదిః చ, అనాదిత్వమ్ అజత్వే హేతుః, తం మామ్ అజమ్ అనాదిం చ యః వేత్తి విజానాతి లోకమహేశ్వరం లోకానాం మహాన్తమ్ ఈశ్వరం (తురీయమ్ అజ్ఞానతత్కార్యవర్జితమ్) అసంమూఢః సంమోహవర్జితః సః మర్త్యేషు మనుష్యేషు సర్వపాపైః సర్వైః పాపైః మతిపూర్వామతిపూర్వకృతైః ప్రముచ్యతే ప్రమోక్ష్యతే.**

**తె.అ.** దేవతలకు మహర్షులకు ఆది, మూలకారణం, నేను కనుక నాకు మరొక కారణం లేదు. నాకు ఆదిలేదు కనుక పుట్టుక కూడా లేదు. పుట్టుకలేని నన్ను లోకాలకు మహాప్రభువునుగా అజ్ఞానము (అది కల్పించే జాగ్రత్ స్వప్న సుషుప్తులనే మూడు అవస్థలు) లేని తురీయునిగా తెలుసుకున్నవాడు సమ్మోహం వదలినవాడు. అతడు తెలిసి తెలియక చేసిన అన్ని పాపాలనుండి ముక్తుడవుతాడు.

**భాష్యమ్ : ఇతశ్చ అహం మహేశ్వరః లోకానామ్ –**

**తె.అ.** ఇందువల్ల కూడా నేను లోకాలకు ప్రభువును –

**మూ. బుద్ధిర్జ్ఞానమసమ్మోహః క్షమా సత్యం దమః శమః ।**
**సుఖం దుఃఖం భవోఽభావో భయం చాభయమేవ చ ॥ 4**

**తె.అ.** బుద్ధి, జ్ఞానం, మోహరాహిత్యం, క్షమ, సత్యం, దమం, శమం, సుఖం, దుఃఖం, భావం, అభావం, భయం, అభయం.

**భాష్యమ్ : 4.1 బుద్ధిః అన్తఃకరణస్య సూక్ష్మాద్యర్థావబోధనసామర్థ్యమ్. తద్వన్తం బుద్ధిమానితి హి వదన్తి. జ్ఞానమ్ ఆత్మాదిపదార్థానామ్ అవబోధః. అసంమోహః ప్రత్యుత్పన్నేషు బోద్ధవ్యేషు వివేకపూర్వికా ప్రవృత్తిః. క్షమా ఆక్రుష్టస్య తాడితస్య వా అవికృతచిత్తతా. సత్యం యథాదృష్టస్య యథాశ్రుతస్య వా ఆత్మానుభవస్య పరబుద్ధి సంక్రాన్తయే తథైవ ఉచ్చార్యమాణా వాక్ సత్యమ్ ఉచ్యతే. దమః బాహ్యేన్ద్రియోపశమః. శమః అన్తఃకరణస్య ఉపశమః. సుఖమ్ ఆహ్లాదః. దుఃఖం సంతాపః. భవః ఉద్భవః. అభావః తద్విపర్యయః. భయం చ త్రాసః అభయమ్ ఏవ చ తద్విపరీతమ్.**

**తె.అ.** బుద్ధి అంటే సూక్ష్మవిషయాలను అర్థం చేసుకోగల అంతఃకరణసామర్థ్యం. అది ఉన్నవాణ్ణే బుద్ధిమంతుడంటారు. జ్ఞానమంటే ఆత్మవంటి పదాల అర్థం తెలుసుకోవడం. అసమ్మోహం అంటే తెలుసుకోవలసివచ్చిన విషయాలయందు వివేకంతో ప్రవర్తించడం. క్షమ అంటే తిట్టినా కొట్టినా వికారం చెందని చిత్తంతో ఉండడం. సత్యమంటే చూచింది చూచినట్లు విన్నది విన్నట్లు తన అనుభవాన్ని ఇతరులకు చెప్పేమాట. దమ అంటే బాహ్యేంద్రియాల ఉపశమం. శమమంటే అంతఃకరణం ఉపశమించడం. సుఖమంటే ఆహ్లాదము; దుఃఖమంటే సంతాపము. భవమంటే ఉద్భవము, పుట్టుక, అభావమంటే అందుకు విపరీతము.

**మూ. అహింసా సమతా తుష్టిస్తపో దానం యశోఽయశః ।**
**భవన్తి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః ॥ 5**

**తె.అ.** అహింస, సమత, సంతృప్తి, తపము, దానము, కీర్తి, అపకీర్తి, – ఈ భావాలన్నీ ప్రాణులకు అనేక విధాలుగా నావల్లనే కలుగుతున్నాయి.

**భాష్యమ్ : 5.1 అహింసేతి – అహింసా అపీడా ప్రాణినామ్. సమతా సమచిత్తతా. తుష్టిః సంతోషః పర్యాప్తబుద్ధిః లాభేషు. తపః ఇన్ద్రియసంయమపూర్వకం శరీరపీడనమ్. దానం యథాశక్తి**

**సంవిభాగః. యశః ధర్మనిమిత్తా కీర్తిః. అయశస్తు అధర్మనిమిత్తా అకీర్తిః. భవన్తి భావాః యథోక్తాః బుద్ధ్యాదయః, భూతానాం ప్రాణినాం, మత్త ఏవ ఈశ్వరాత్, పృథగ్విధాః నానావిధాః స్వకర్మాను రూపేణ. కించ –**

**తె.అ.** అహింస అంటే ప్రాణులను పీడించకుండడం. సమత అంటే సమచిత్తత. తుష్టి అంటే సంతోషం, దొరికినది చాలునన్న తృప్తి. తపమంటే ఇంద్రియాలను అదుపులో ఉంచడమనే శరీరపీడనం. దానమంటే యథాశక్తి ఇతరులతో పంచుకోవడం. ధర్మంవల్ల కలిగే కీర్తి యశస్సు అధర్మంవల్ల కలిగే అపకీర్తి అయశస్సు. ఇవన్నీ ప్రాణులకు వారు చేసుకున్న కర్మలకు అనురూపంగా అనేకవిధాలుగా నా వల్లనే అంటే ఈశ్వరుని వల్లనే కలుగుతున్నాయి. అంతేకాదు –

**మూ. మహర్షయః సప్త పూర్వే చత్వారో మనవస్తథా ।**
**మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః ॥ 6**

**తె.అ.** సప్తమహర్షులు, పూర్వపు నలుగురు మనువులు నా ప్రభావము కలిగినవారు. వారు నా మానసపుత్రులు. ఈ ప్రజలు వారి సంతతియే.

**భాష్యమ్ : 6.1 మహర్షయః సప్త భృగ్వాదయః, పూర్వే అతీతకాలసంబన్ధినః, చత్వారః మనవః తథా సావర్ణాః ఇతి ప్రసిద్ధాః. తే చ, మద్భావాః మద్గతభావనాః, వైష్ణవేన సామర్థ్యేన ఉపేతాః మానసాః మనసైవ ఉత్పాదితాః మయా జాతాః ఉత్పన్నాః, యేషాం మనూనాం మహర్షీణాం చ సృష్టిః లోకే ఇమాః స్థావరజఙ్గమలక్షణాః ప్రజాః.**

**తె.అ.** భృగువు మొదలైన సప్తమహర్షులు, వారికంటె పూర్వులైన నలుగురు (సనకాదులు), సావర్ణులని ప్రసిద్ధులైన మనువులు, వీరు నన్ను భావన చేసి వైష్ణవసామర్థ్యం పొందారు. వీరు నా మనసుచేత ఉత్పత్తి చేయబడినవారు. లోకంలోని స్థావరజంగమ లక్షణమైన ఈ ప్రజ ఆ మనువుల, మహర్షుల సృష్టి.

**మూ. ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః ।**
**సోఽవికమ్పేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః ॥ 7**

**తె.అ.** ఈ నా విభూతిని యుక్తిని యథార్థంగా తెలుసుకున్నవాడు చలించని యోగంతో ఉంటాడు. ఇందులో సందేహం లేదు.

**భాష్యమ్ : 7.1 ఏతామితి – ఏతాం యథోక్తాం, విభూతిం విస్తారం, యోగం చ యుక్తిం చ ఆత్మనః ఘటనమ్, అథవా యోగైశ్వర్య సామర్థ్యం, సర్వజ్ఞత్వం యోగజం యోగః ఇత్యుచ్యతే.**

**మమ మదీయం, యః వేత్తి తత్త్వతః తత్త్వేన, యథావత్ ఇత్యేతత్. సః, అవికమ్పేన అప్రవిచలితేన, యోగేన సమ్యగ్దర్శన స్థైర్యలక్షణేన, యుజ్యతే సంబధ్యతే. న అత్ర సంశయః న అస్మిన్ అర్థే సంశయః అస్తి.**

**తె.అ.** ఇప్పుడు చెప్పిన నా విస్తృతిని, యుక్తిని అంటే ఘటనను తెలిసినవాడు. లేక యోగం అంటే యోగం వల్ల కలిగే ఈశ్వరశక్తి సర్వజ్ఞత్వమునని చెప్పుకోవచ్చు. వీటిని యథార్థంగా తెలుసుకున్న వాడు చలించని యోగంతో అంటే సమ్యగ్దర్శనంవల్ల కలిగే స్థైర్యంతో ఉంటాడు. ఈ విషయంలో సందేహం లేదు.

**భాష్యమ్ : 8.0 కీదృశేన అవికమ్పేన యోగేన యుజ్యతే ఇతి? ఉచ్యతే –**

**తె.అ.** ఎటువంటి చలించని యోగంతో యుక్తుడు అంటే –

**మూ. అహం సర్వస్య ప్రభవః మత్తస్సర్వం ప్రవర్తతే ।**
**ఇతి మత్వా భజంతే మాం బుధా భావసమన్వితాః ॥ 8**

**తె.అ.** సర్వజగత్తు నావల్ల పుడుతున్నది, ప్రవర్తిస్తున్నది అని తెలిసి భక్తిభావముతో విజ్ఞులు నన్ను సేవిస్తారు.

**భాష్యమ్ : 8.1 అహం పరం బ్రహ్మ వాసుదేవాఖ్యం, సర్వస్య జగతః ప్రభవః ఉత్పత్తిః. మత్తః ఏవ స్థితినాశక్రియాఫలోపభోగలక్షణం విక్రియారూపం సర్వం జగత్ ప్రవర్తతే ఇత్యేవం మత్వా, భజన్తే, సేవన్తే, మాం, బుధాః అవగతపరమార్థతత్త్వాః భావసమన్వితాః భావః భావనా, పరమార్థతత్త్వా భినివేశః, తేన సమన్వితాః సంయుక్తా ఇత్యర్థః. కించ –**

**తె.అ.** నేను వాసుదేవుడనబడే పరబ్రహ్మమును! సర్వజగత్తుకు ఉత్పత్తి స్థానమును. స్థితినాశ–క్రియాఫలోపభోగలక్షణమైన మార్పులు చెందే ఈ సర్వజగత్తు నావల్లనే ప్రవర్తిస్తున్నది, అని అనుకొని పరమార్థతత్త్వంలో ఆసక్తిగలవారు, పరమార్థం తెలిసినవారు నన్ను సేవిస్తారు. అంతేకాదు –

**మూ. మచ్చిత్తా మద్గతప్రాణా బోధయన్తః పరస్పరమ్ ।**
**కథయన్తశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ ॥ 9**

**తె.అ.** నాయందు చిత్తముంచి ప్రాణాలు నాకర్పించి నాగురించి ఒకరికొకరు తెలియజెప్పుకుంటూ నిత్యము నా గురించే చెప్పుకుంటూ ఉండేవారు సంతోషంగా ఆనందంగా కూడా ఉంటారు.

**భాష్యమ్ : 9.1 మచ్చిత్తా ఇతి - మయి చిత్తం యేషాం తే మచ్చిత్తాః, మద్గతప్రాణాః మాం గతాః ప్రాప్తాః చక్షురాదయః ప్రాణాః యేషాం తే మద్గతప్రాణాః, మయి ఉపసంహృతకరణాః ఇత్యర్థః. అథవా - మద్గతప్రాణాః మద్గతజీవనాః ఇత్యేతత్. బోధయన్తః అవగమయన్తః, పరస్పరమ్ అన్యోన్యం, కథయన్తః జ్ఞానబలవీర్యాదిధర్మైః విశిష్టం మాం, తుష్యన్తి చ పరితోషమ్ ఉపయాన్తి, రమన్తి చ రతిం ప్రాప్నువన్తి ప్రియసంగత్యేవ.**

**తె.అ.** నాయందు చిత్తముంచి కన్ను కాలు మొదలైన కరణాలను నాయందు ఉపసంహరించి లేక మద్గతప్రాణులు అంటే జీవితం నాకు అంకితం చేసినవారు అనికూడా చెప్పుకోవచ్చు - ఒకరికొకరు భగవద్విషయాలు తెలియజెప్పుకుంటూ జ్ఞానము, బలము, వీర్యము మొదలైన నా విశిష్ట గుణాలను ముచ్చటించుకుంటారు. ఇష్టవస్తువు లభించడం చేత కలిగే సంతోషాన్ని, ఆనందాన్ని పొందుతారు.

**భాష్యమ్ : 10.0 యే యథోక్తైః ప్రకారైః భజన్తే యాం భక్తాః సన్తః-**

**తె.అ.** వెనుక చెప్పిన విధంగా నన్ను సేవించే భక్తులెవరైతే ఉన్నారో -

**మూ. తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।**
**దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తి తే ॥ 10**

**తె.అ.** సతతయుక్తులై ప్రేమతో నన్ను సేవించేవారికి నన్ను చేరుకునే సాధనమైన ఆ బుద్ధియోగం ఇస్తున్నాను.

**భాష్యమ్ : 10.1 తేషాం సతతయుక్తానాం నిత్యాభియుక్తానాం, నివృత్తసర్వబాహ్యైషణానాం, భజతాం సేవమానానాం, కిమ్ అర్థిత్వాదినా కారణేన? న ఇత్యాహ - ప్రీతిపూర్వకమ్ - ప్రీతిః స్నేహః, తత్పూర్వకం మాం భజతామ్ ఇత్యర్థః, దదామి ప్రయచ్ఛామి, బుద్ధియోగం - బుద్ధిః సమ్యగ్దర్శనం మత్తత్త్వవిషయం, తేన యోగః బుద్ధియోగః, తం బుద్ధియోగమ్ యేన బుద్ధియోగేన సమ్యగ్దర్శనలక్షణేన, మాం పరమేశ్వరమ్ ఆత్మభూతమ్, ఆత్మత్వేన, ఉపయాన్తి ప్రతిపద్యన్తే. కే? తే యే మచ్చిత్తత్వాదిప్రకారైః మాం భజన్తే.**

**తె.అ.** నిత్యము నాలో లీనమై బాహ్యవిషయాలన్నిటిపై కోర్కెలు విడిచి దేనినో కోరి కాక ప్రేమతో నన్ను సేవించేవారికి సమ్యగ్దర్శన లక్షణమైన బుద్ధియోగం ఇస్తున్నాను. ఆ బుద్ధియోగం చేత వారు ఆత్మనైన పరమేశ్వరుని నన్ను చేరుకుంటారు. ఎవరు వారు? నా యందు చిత్తముంచి నన్ను సేవించేవారు.

**భాష్యమ్ : 11.0 కిమర్థం కస్య వా త్వత్ప్రాప్తి ప్రతిబన్ధహేతోః నాశకం బుద్ధియోగం తేషాం త్వద్భక్తానాం దదాసి? ఇత్యపేక్షాయామ్ ఆహ.**

**తె.అ.** ఎందుకు, నిన్ను చేరుకోవడంలో అడ్డుగా ఉన్న దేనిని తొలగించడం కొరకు, నీ భక్తులకు బుద్ధియోగాన్నిస్తున్నావు? అంటే చెపుతున్నాడు –

**మూ. తేషామేవానుకమ్పార్థమహమజ్ఞానజం తమః।**
**నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥ 11**

**తె.అ.** వారియందు దయచేతనే వారి ఆత్మయందే ఉన్న నేను అజ్ఞానంనుండి పుట్టిన చీకటిని వెలిగే జ్ఞానదీపం చేత నశింపజేస్తున్నాను.

**భాష్యమ్ : 11.1 తేషామేవ కథం నామ శ్రేయః స్యాత్ ఇతి అనుకమ్పార్థం దయాహేతోః, అహమ్ అజ్ఞానజం అవివేకతః జాతం మిథ్యాప్రత్యయలక్షణం మోహాన్ధకారం తమః నాశయామి, ఆత్మభావస్థః ఆత్మనః భావః అన్తఃకరణాశయః తస్మిన్నేవ స్థితః సన్, జ్ఞానదీపేన వివేక ప్రత్యయరూపేణ భక్తిప్రసాదస్నేహాభిషిక్తేన మద్భావనాభినివేశవాతేరితేన బ్రహ్మచర్యాదిసాధనసంస్కార వత్ప్రజ్ఞావర్తినా, విరక్తాన్తఃకరణాధారేణ విషయవ్యావృత్తచిత్తరాగద్వేషా కలుషితనివాతాపవరకస్థేన, నిత్యప్రవృత్తైగ్ర్యధ్యానజనితసమ్యగ్దర్శనభాస్వతా జ్ఞానదీపేనేత్యర్థః.**

**తె.అ.** వారియందు దయచేతనే, వీరికేవిధంగా మేలు కలుగుతుంది అని, అవివేకంవల్ల కలిగే మోహమనే చీకటిని నేను జ్ఞానదీపం చేత నశింపజేస్తున్నాను. మోహం యొక్క లక్షణం మిథ్యాప్రత్యయం. (వస్తువుయొక్క ఉన్న రూపు కనిపించనీయదు కనుకనే మోహమనేది చీకటి.) వారి అంతఃకరణమందే ఉండి వివేకప్రత్యయరూపజ్ఞానదీపం చేత మోహాంధకారాన్ని తొలగిస్తున్నాను. ఈ దీపం భక్తి ప్రసాదమనే నూనెతో వెలుగుతుంది. నన్ను ధ్యానించడంలో గల ప్రీతి అనే గాలిచేత ప్రేరితమయింది. బ్రహ్మచర్యాది సాధనలవల్ల సంస్కరింపబడిన బుద్ధి దీపపువత్తి. విరాగి మనసు ప్రమిద. విషయాలనుండి మరలి రాగద్వేషాలనే గాలులు బాధించని మనసు మూత. నిరంతరం చేసే ఏకాగ్రధ్యానం వల్ల కలిగే సమ్యగ్దర్శనం వెలుగు.

**భాష్యమ్ : 12.0 యథోక్తాం భగవతః విభూతిం యోగం చ శ్రుత్వా అర్జున ఆహ –**

**తె.అ.** భగవంతుని విభూతిని యోగాన్ని గురించి చెప్పినది విని అర్జునుడు అంటున్నాడు.

**అర్జున ఉవాచ -**

**మూ. పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్ ।**
**పురుషం శాశ్వతం దివ్యమాదిదేవమజం విభుమ్ ॥ 12**

అర్జునుడు అంటున్నాడు -

**తె.అ.** నీవు పరబ్రహ్మవు. పరంధాముడవు. పరమ పావనుడవు. శాశ్వతమైన దివ్యపురుషుడవని, ఆదిదేవుడవని, అజుడవని, విభువని;

**భాష్యమ్ : 12.1 పరం బ్రహ్మ పరమాత్మా, పరం ధామ పరం తేజః, పవిత్రం పావనం పరమం ప్రకృష్టం భవాన్. పురుషం శాశ్వతం నిత్యం, దివ్యం దివి భవమ్, ఆదిదేవం సర్వదేవానామ్ ఆదౌ భవం దేవం, అజం, విభుం విభవనశీలమ్ ఈదృశమ్**

**తె.అ.** నీవు పరమాత్మ, పరమతేజము, పరమ పావనము. నిత్యమైన దివ్యపురుషుడవని దేవతలందరిలో మొదటివాడవని, అజుడవని, వ్యాపకుడవని ఈ విధంగా -

**మూ. ఆహుస్త్వామృషయః సర్వే దేవర్షిర్నారదస్తథా ।**
**అసితో దేవలో వ్యాసః స్వయం చైవ బ్రవీషి మే ॥ 13**

**తె.అ.** ఋషులందరూ, దేవర్షినారదుడు, ఇంకా అసితుడు, దేవలుడు, వ్యాసుడు నిన్ను అంటున్నారు. స్వయంగా నీవు కూడా నాకు చెపుతున్నావు.

**భాష్యమ్ : 13.1 ఆహుః కథయన్తి, త్వామ్ ఋషయః వసిష్ఠాదయః, సర్వే, దేవర్షిః నారదః తథా అసితః దేవలః అపి ఏవమ్ ఆహ వ్యాసః చ స్వయం చైవ త్వం చ బ్రవీషి మే.**

**తె.అ.** వసిష్ఠాదులైన ఋషులందరు దేవర్షి నారదుడు ఇంకా అసితుడు దేవలుడు వ్యాసుడు నిన్ను గురించి (వెనుకటి శ్లోకంలో చెప్పిన విధంగా) అంటున్నారు. స్వయంగా నీవుకూడా నాకు చెపుతున్నావు.

**మూ. సర్వమేతదృతం మన్యే యన్మాం వదసి కేశవ ।**
**న హి తే భగవన్ వ్యక్తిం విదుర్దేవా న దానవాః ॥ 14**

**తె.అ.** కేశవా, నీవు చెప్పినదంతా నిజమని నమ్ముతున్నాను. భగవాన్, నీ పుట్టుక దేవతలకు గాని దానవులకు గాని తెలియదు.

**భాష్యమ్ : 14.1 సర్వమితి – సర్వమేతత్ యథా ఉక్తమ్ ఋషిభిః, త్వయా చ ఏతత్, ఋతం సత్యమేవ, మన్యే యత్ మాం ప్రతి వదసి భాషసే, హే కేశవ. న హి, తే తవ, భగవన్, వ్యక్తిం ప్రభవం, విదుః దేవాః, న దానవాః.**

**తె.అ.** ఋషులు నీవూ కూడా చెప్పినది ఇదంతా సత్యమని నమ్ముతున్నాను. దేవతలు దానవులు కూడా నీ పుట్టుక తెలియరు కదా.

**భాష్యమ్ : 15.0 యతః త్వం దేవాదీనాం ఆదిః, అతః –**

**తె.అ.** దేవాదులకు నీవు మూలం కనుక –

**మూ. స్వయమేవాత్మనాఽఽత్మానం వేత్థ త్వం పురుషోత్తమ ।**
**భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే ॥ 15**

**తె.అ.** పురుషోత్తమా, సమస్తప్రాణులను సృష్టించువాడా, సకల జీవులకు నియామకుడా! ఓ దేవదేవా, జగత్పతీ, నీవు మాత్రమే ఆత్మచేత ఆత్మను స్వయంగా తెలిసినవాడవు.

**భాష్యమ్ : 15.1 స్వయమేవ ఆత్మనా ఆత్మానం వేత్థ జానాసి త్వం, నిరతిశయజ్ఞానైశ్వర్యబలాది శక్తిమన్తమ్, ఈశ్వరం, పురుషోత్తమ, భూతాని భావయతీతి భూతభావనః, హే భూతభావన, భూతేశ భూతానామ్ ఈశః, హే దేవదేవ, జగత్పతే.**

**తె.అ.** సమస్త భూతములను సృజించేవాడా! సకలజీవులకు నియామకుడా! ఓ దేవదేవా! జగత్పతీ! నీ ఆత్మచేత నీవే తెలియదగినవాడవు. నిరతిశయమైన జ్ఞానము, ఐశ్వర్యము, బలము మొదలైనవి కలిగిన ఈశ్వరుడవుగా ఎరుగుదువు.

**మూ. వక్తుమర్హస్యశేషేణ దివ్యా హ్యాత్మవిభూతయః ।**
**యాభిర్విభూతిభిర్లోకానిమాంస్త్వం వ్యాప్య తిష్ఠసి ॥ 16**

**తె.అ.** ఏ దివ్యశక్తులచేత నీవు ఈ లోకాలన్నిట వ్యాపించి ఉన్నావో ఆ నీ దివ్యశక్తులను సంపూర్ణంగా చెప్పుము.

**భాష్యమ్ : 16.1 వక్తుమితి – వక్తుం కథయితుమ్, అర్హసి అశేషేణ, దివ్యాః హి ఆత్మ విభూతయః ఆత్మనః విభూతయః యాః తాః వక్తుమ్ అర్హసి. యాభిః విభూతిభిః ఆత్మనః మాహాత్మ్యవిస్తరైః ఇమాన్ లోకాన్, త్వం వ్యాప్య తిష్ఠసి.**

**తె.అ.** ఏ విభూతుల చేత, విస్తృతమైన నీ మాహాత్మ్యం చేత ఈ లోకాలన్నిట నీవు వ్యాపించి ఉన్నావో ఆ ఆత్మవిభూతులను సంపూర్ణంగా చెప్పుము.

**మూ. కథం విద్యామహం యోగింస్త్వాం సదా పరిచిన్తయన్ ।**
**కేషు కేషు చ భావేషు చిన్త్యోఽసి భగవన్ మయా ॥ 17**

**తె.అ.** ఓ యోగీ, నిన్ను సదా ధ్యానిస్తూ నిన్నేవిధంగా తెలుసుకోగలను? ఓ భగవాన్, ఏ యే వస్తువులందు నిన్ను నేను ధ్యానించదగును?

**భాష్యమ్ : 17.1 కథం ఇతి. కథం విద్యాం విజానీయాం అహం హే యోగిన్! త్వాం సదా పరిచిన్తయన్. కేషు కేషు చ భావేషు వస్తుషు చిన్త్యః అసి ధ్యేయః అసి భగవన్! మయా**

**తె.అ.** ఓ యోగీ, నిన్ను సదా ధ్యానిస్తూ ఏ విధంగా తెలుసుకోగలను? ఏ యే వస్తువులందు నిన్ను నేను ధ్యానించదగును?

**మూ. విస్తరేణాత్మనో యోగం విభూతిం చ జనార్దన ।**
**భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽ మృతమ్ ॥ 18**

**తె.అ.** జనార్దనా, నీ ఆత్మ విభూతియోగము మళ్ళీ విపులంగా చెప్పుము. ఎందుకనగా నీ అమృతవాక్యాలు వింటూన్న నాకు ఎంత విన్నా తృప్తి లేదు.

**భాష్యమ్ : 18.0 విస్తరేణేతి - విస్తరేణ ఆత్మనః యోగం యోగైశ్వర్యశక్తివిశేషం, విభూతిం చ, విస్తరం ధ్యేయపదార్థానాం, హే జనార్దన! అర్దతే గతికర్మణః రూపమ్. అసురాణాం దేవప్రతిపక్ష భూతానాం జనానాం నరకాదిగమయితృత్వాత్ జనార్దన అభ్యుదయ నిః శ్రేయసపురుషార్థప్రయోజనం సర్వైః జనైః యాచ్యతే ఇతి వా. భూయః పూర్వమ్ ఉక్తమ్ అపి కథయ. తృప్తిః హి పరితోషః యస్మాత్ నాస్తి మే మమ శృణ్వతః త్వన్ముఖనిఃసృతవాక్యామృతమ్.**

**తె.అ.** జనార్దన శబ్దం అర్ద్ ధాతువు నుండి ఏర్పడింది. అర్ద్ అంటే 'పంపుట' అని అర్థం. దేవతలకు శత్రుజనులైన అసురులను నరకాది లోకాలకు పంపేవాడు కనుక జనార్దనుడు. లేక సర్వజనులు ఆయనను అభ్యుదయ నిశ్శ్రేయస పురుషార్థ ప్రయోజనాన్ని యాచిస్తారు కనుక జనార్దనుడు (అర్ద్ అంటే యాచన అనే అర్థం కూడా ఉంది. 'అర్ద్ గతౌ యాచనే చ' అని ధాతుపాఠం) యోగమంటే యోగంవల్ల కలిగే ఈశ్వరశక్తి. విభూతి అంటే ధ్యానించదగిన పదార్థాల విస్తృతి. ఓ జనార్దనా! నీ విభూతియోగం పూర్వం చెప్పిందే అయినా మళ్ళీ విపులంగా చెప్పు. ఎందుకంటే నీ నోటినుండి వెలువడే వాక్యామృతం వింటూ ఉన్న నాకు తృప్తి లేదు.

**శ్రీ భగవానువాచ**

**మూ. హన్త తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః ।**
**ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నాస్త్యన్తో విస్తరస్య మే ॥ 19**

**తె.అ.** శ్రీ భగవానుడు అంటున్నాడు.
అర్జునా! ఇప్పుడు నీకు ప్రధానమైన నా దివ్యవిభూతులు చెపుతాను. నా విస్తృతికి అంతులేదు కదా.

**భాష్యమ్ : 19.1 హన్త తే ఇతి – హన్త ఇదానీం తే తవ దివ్యాః దివిభవాః, ఆత్మవిభూతయః ఆత్మనః మమ విభూతయః యాః తాః కథయిష్యామి ఇత్యేతత్. ప్రాధాన్యతః యత్ర యత్ర ప్రధానా యా యా విభూతిః తాం తాం ప్రధానాం ప్రాధాన్యతః కథయిష్యామి అహం కురుశ్రేష్ఠ. అశేషతస్తు వర్షశతేనాపి న శక్యాః వక్తుం, యతః నాస్తి అన్తః విస్తరస్య మే మమ విభూతీనామ్ ఇత్యర్థః.**

**తె.అ.** అయితే నీకు నా దివ్యవిభూతులు చెపుతాను. ప్రధానమైన విభూతులేవి ఉన్నాయో ప్రాధాన్యాన్ని బట్టి వాటిని నీకు చెపుతాను. ఒక్కటీ విడువకుండా చెప్పాలంటే నూరేండ్లు కూడా చాలవు. నా విభూతుల విస్తృతికి అంతులేదు.

**భాష్యమ్ : 20.0 తత్ర ప్రథమమేవ తావత్ శృణు –**

**తె.అ.** మొదట ఇది విను.

**మూ. అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః ।**
**అహమాదిశ్చ మధ్యం చ భూతానామన్త ఏవ చ ॥ 20**

**తె.అ.** గుడాకేశా, సర్వభూతముల హృదంతరంలో ఉండే ఆత్మను నేను. ప్రాణుల ఆది–మధ్యాంతాలు కూడా నేను.

**భాష్యమ్ : 20.1 అహమ్, ఆత్మా ప్రత్యగాత్మా, గుడాకేశ – గుడాకా నిద్రా, తస్యాః ఈశః గుడాకేశః జితనిద్రః ఇత్యర్థః. ఘనకేశః ఇతి వా. సర్వేషాం భూతానామ్, ఆశయే అన్తః హృది స్థితః అహమ్ ఆత్మా ప్రత్యగాత్మా నిత్యం ధ్యేయః. తదశక్తేన చ ఉత్తరేషు భావేషు చిన్త్యః అహం. యస్మాత్ అహమేవ ఆదిః భూతానాం కారణం, తథా మధ్యం చ స్థితిః, అన్తః ప్రలయః చ.**

**తె.అ.** 'గుడాకా' అంటే నిద్ర. గుడాకేశుడు అంటే నిద్రను జయించినవాడు అని అర్థం. ఘనమైన కేశములు కలవాడు గుడాకేశుడు అని కూడా అర్థం. సమస్త ప్రాణుల హృదంతరంలో ఉండి

నిత్యము ధ్యానించబడదగిన ప్రత్యగాత్మను నేను. అక్కడ నన్ను ధ్యానించలేనివాడు నేను చెప్పబోయే పదార్థాలయందు నన్ను ధ్యానించవచ్చు. ఎందుకంటే సర్వభూతములకు కారణము స్థితి, ప్రళయము నేను.

**భాష్యమ్ : 21.0 ఏవం చ ధ్యేయః అహమ్ -**

**తె.అ.** నన్ను ఈ విధంగా కూడా ధ్యానించవచ్చు -

**మూ. ఆదిత్యానామహం విష్ణుర్జ్యోతిషాం రవిరంశుమాన్ ।**
**మరీచిర్మరుతామస్మి నక్షత్రాణామహం శశీ ॥ 21**

**తె.అ.** నేను ఆదిత్యులలో విష్ణువును, జ్యోతులలో సూర్యుణ్ణి, మరుత్తులలో మరీచిని, నక్షత్రాలలో చంద్రుణ్ణి.

**భాష్యమ్ : 21.1 ఆదిత్యానాం ద్వాదశానాం విష్ణుః నామ ఆదిత్యః అహమ్, జ్యోతిషాం రవిః ప్రకాశయితౄణామ్ అంశుమాన్ రశ్మిమాన్. మరీచిః నామ మరుతాం మరుద్దేవతాభేదానామ్ అస్మి. నక్షత్రాణామ్ అహం, శశీ చన్ద్రమాః.**

**తె.అ.** నేను ద్వాదశాదిత్యులలో విష్ణువనే పేరుగల ఆదిత్యుణ్ణి. వెలుగునిచ్చేవాటిలో కిరణాలు గలిగిన సూర్యుణ్ణి. మరుద్దేవతలలో మరీచి అను పేరుగల మరుత్తును. నక్షత్రాలలో చంద్రుణ్ణి.

**మూ. వేదానాం సామవేదోఽస్మి దేవానామస్మి వాసవః ।**
**ఇన్ద్రియాణాం మనశ్చాస్మి భూతానామస్మి చేతనా ॥ 22**

**తె.అ.** వేదాలలో సామవేదాన్ని, దేవతలలో ఇంద్రుణ్ణి, ఇంద్రియాలలో మనస్సును, ప్రాణులలో చైతన్యాన్ని.

**భాష్యమ్ : 22 వేదానామితి - వేదానాం మధ్యే సామవేదః అస్మి. దేవానాం రుద్రాదిత్యాదీనాం వాసవః ఇన్ద్రః, అస్మి, ఇన్ద్రియాణామ్ ఏకాదశానాం చక్షురాదీనాం, మనః చ అస్మి, సంకల్ప వికల్పాత్మకం మనశ్చ అస్మి. భూతానామ్ అస్మి చేతనా. కార్యకరణసంఘాతే నిత్యాభివ్యక్తా బుద్ధివృత్తిః చేతనా.**

**తె.అ.** వేదాలలో సామవేదాన్ని. రుద్రులు ఆదిత్యులు మొదలైన దేవతలలో నేను ఇంద్రుణ్ణి. కన్ను మొదలైన పదకొండు ఇంద్రియాలలో సంకల్ప వికల్పాత్మకమైన మనస్సును. ప్రాణులలో కార్యకరణ సంఘాతమైన దేహంలో నిత్యము ప్రకటితమయ్యే బుద్ధి వ్యాపారమైన చైతన్యాన్ని.

**మూ. రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్ ।।**
**వసూనాం పావకశ్చాస్మి మేరుః శిఖరిణామహమ్ ।। 23**

**తె.అ.** నేను రుద్రులలో శంకరుణ్ణి. యక్షరాక్షసులలో కుబేరుణ్ణి. వసువులలో అగ్నిని. పర్వతాలలో మేరువుని.

**భాష్యమ్ : 23.1 రుద్రాణామితి – రుద్రాణామ్ ఏకాదశానాం శంకరః చ అస్మి. విత్తేశః కుబేరః యక్షరక్షసాం యక్షాణాం రక్షసాం చ. వసూనామ్ అష్టానాం పావకః చ అస్మి అగ్నిః. మేరు శిఖరిణాం శిఖరవతామ్, అహమ్.**

**తె.అ.** ఏకాదశరుద్రులలో శంకరుణ్ణి. యక్షరాక్షసులలో ధనపతి అయిన కుబేరుణ్ణి. అష్ట–వసువులలో అగ్నిని నేను. పర్వతాలలో మేరువును నేను.

**మూ. పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిమ్ ।**
**సేనానీనామహం స్కన్దః సరసామస్మి సాగరః ।। 24**

**తె.అ.** అర్జునా, పురోహితులలో ముఖ్యుడైన బృహస్పతిని నేనని తెలుసుకో. సేనాపతులలో స్కందుణ్ణి. సరస్సులలో సముద్రాన్ని నేను.

**భాష్యమ్ : 24.1 పురోధసామితి – పురోధసాం చ రాజపురోహితానాం, ముఖ్యం ప్రధానం, మాం, విద్ధి జానీహి, హే పార్థ! బృహస్పతిమ్. స హి ఇన్ద్రస్య ఇతి ముఖ్యః స్యాత్ పురోధసామ్. సేనానీనాం సేనాపతీనామ్, అహం స్కన్దః దేవసేనాపతిః. సరసాం యాని దేవఖాతాని సరాంసి తేషాం సరసాం సాగరః, అస్మి భవామి.**

**తె.అ.** రాజపురోహితులలో ప్రధానుడైన బృహస్పతిని నేనని తెలుసుకో. ఇంద్రుని పురోహితులలో అతడే గదా ముఖ్యుడు. సేనాపతులలో దేవసేనాపతి అయిన స్కందుణ్ణి నేను, దేవతలు త్రవ్విన సరస్సులలో సముద్రాన్ని నేను.

**మూ. మహర్షీణాం భృగురహం గిరామస్మ్యేకమక్షరమ్ ।**
**యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః ।। 25**

**తె.అ.** నేను మహర్షులలో భృగువును, వాక్కులలో ఓంకారాన్ని, యజ్ఞాలలో జపయజ్ఞాన్ని, కదలని వస్తువులలో హిమాచలాన్ని.

**భాష్యమ్ : 25.1 మహర్షీణామితి – మహర్షీణాం భృగుః అహమ్. గిరాం వాచాం పదలక్షణానామ్ ఏకమ్ అక్షరమ్ ఓంకారః అస్మి. యజ్ఞానాం జపయజ్ఞః అస్మి. స్థావరాణాం స్థితిమతాం హిమాలయః.**

**తె.అ.** మహర్షులలో భృగువును నేను. పదలక్షణం గలిగిన వాక్కులలో ఏకాక్షరమైన ఓంకారాన్ని నేను. యజ్ఞాలలో జపయజ్ఞాన్ని. స్థావరాలలో అంటే కదలనివాటిలో హిమాచలాన్ని.

**మూ. అశ్వత్థః సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః ।**
**గన్ధర్వాణాం చిత్రరథః సిద్ధానాం కపిలో మునిః ॥ 26**

**తె.అ.** వృక్షాలన్నిటిలో అశ్వత్థవృక్షాన్ని, దేవర్షులలో నారదుణ్ణి, గంధర్వులలో చిత్రరథుణ్ణి, సిద్ధులలో కపిలమునిని.

**భాష్యమ్ : 26.1 అశ్వత్థ ఇతి – అశ్వత్థః సర్వవృక్షాణాం, దేవర్షీణాం చ నారదః – దేవా ఏవ సన్తః ఋషిత్వం ప్రాప్తాః మన్త్రదర్శిత్వాత్, తే దేవర్షయః, తేషాం నారదః అస్మి. గన్ధర్వాణాం చిత్రరథో నామ గన్ధర్వః అస్మి. సిద్ధానాం – జన్మనైవ ధర్మజ్ఞానవైరాగ్యైశ్వర్యాతిశయం ప్రాప్తానాం కపిలః మునిః.**

**తె.అ.** వృక్షాలన్నిటిలో అశ్వత్థాన్ని. దేవతలయి ఉండి కూడా మంత్రదర్శిత్వం చేత కొందరు ఋషిత్వం పొందుతారు. వారు దేవర్షులు. ఆ దేవర్షులలో నారదుణ్ణి. గంధర్వులలో చిత్రరథుడనే పేరుగల గంధర్వుణ్ణి. పుట్టుకతోనే అతిశయమైన ధర్మజ్ఞానవైరాగ్య ఐశ్వర్యాలు పొందిన సిద్ధులలో కపిలమునిని.

**మూ. ఉచ్చైఃశ్రవసమశ్వానాం విద్ధి మామమృతోద్భవమ్ ।**
**ఐరావతం గజేన్ద్రాణాం నరాణాం చ నరాధిపమ్ ॥ 27**

**తె.అ.** గుఱ్ఱాలలో ఉచ్చైశ్రవము, ఏనుగులలో ఐరావతము, నరులలో రాజును నేనని తెలుసుకో.

**భాష్యమ్ : 27.1 ఉచ్చైరితి – ఉచ్చైః శ్రవసమ్ అశ్వానామ్ ఉచ్చైఃశ్రవాః నామ అశ్వః తం మాం, విద్ధి జానీహి, అమృతోద్భవమ్ అమృతనిమిత్తమథనోద్భవమ్. ఐరావతమ్ ఇరావత్యాః అపత్యం, గజేన్ద్రాణాం హస్తీశ్వరాణాం తం 'మాం విద్ధి' ఇత్యనువర్తతే. నరాణాం చ మనుష్యాణాం చ నరాధిపం రాజానం మాం విద్ధి జానీహి.**

**తె.అ.** గుఱ్ఱాలలో ఉచ్చైశ్రవమనే పేరుగల గుఱ్ఱము – అమృతము కొరకు చేసిన సాగర మథనంలో పుట్టిన గుఱ్ఱము – ఏనుగులలో ఇరావతికి పుత్రుడైన ఐరావతము, మనుష్యులలో రాజును నేనని తెలుసుకో.

**మూ. ఆయుధానామహం వజ్రం ధేనూనామస్మి కామధుక్ ।**
**ప్రజనశ్చాస్మి కన్దర్పః సర్పాణామస్మి వాసుకిః ॥ 28**

**తె.అ.** నేను ఆయుధాలలో వజ్రాన్ని, ఆవులలో కామధేనువును, సంతానోత్పత్తికి కారణమైన మన్మథుణ్ణి, సర్పాలలో వాసుకిని.

**భాష్యమ్ : 28.1 ఆయుధానామ్ ఇతి – ఆయుధానామ్ అహం వజ్రం దధీచ్యస్థిసంభవమ్. ధేనూనాం దోగ్ధ్రీణాం అస్మి కామధుక్ వసిష్ఠస్య సర్వకామానాం దోగ్ధ్రీ, సామాన్యా వా కామధుక్. ప్రజనః ప్రజనయితా అస్మి కన్దర్పః కామః. సర్పాణాం సర్పభేదానామ్ అస్మి వాసుకిః సర్పరాజః.**

**తె.అ.** ఆయుధాలలో నేను దధీచి అస్థినుండి ఏర్పడిన వజ్రాన్ని, పాలిచ్చే ఆవులలో వసిష్ఠునికి కోరినవన్నీ ఇచ్చే కామధేనువును. లేక కోరినవన్నీ యిచ్చే ఏ కామధేనువును సంతానోత్పత్తికి కారణమైన కందర్పుడు నేను. సర్పాలలో సర్పరాజయిన వాసుకిని.

**మూ. అనన్తశ్చాస్మి నాగానాం వరుణో యాదసామహమ్ ।**
**పితౄణామర్యమా చాస్మి యమః సంయమతామహమ్ ॥ 29**

**తె.అ.** నాగులలో అనంతుణ్ణి. జలదేవతలలో వరుణుణ్ణి. పితరులలో అర్యముణ్ణి. సంయములలో యముణ్ణి.

**భాష్యమ్ : 29.1 అనన్త ఇతి – అనన్తః చ అస్మి నాగానాం నాగవిశేషాణాం నాగరాజః చ అస్మి. వరుణః యాదసామ్ అహమ్ అబ్దేవతానాం రాజా అహమ్. పితౄణామ్ అర్యమా నామ పితృరాజః చ అస్మి. యమః సంయమతాం సంయమనం కుర్వతామ్ అహమ్.**

**తె.అ.** నాగులలో నాగరాజయిన అనంతుణ్ణి. జలదేవతలలో రాజయిన వరుణుణ్ణి. పితరులలో అర్యముడనే పితృరాజును. సంయమనం చేసేవారిలో యముణ్ణి నేను.

**మూ. ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహమ్ ।**
**మృగాణాం చ మృగేన్ద్రోఽహం వైనతేయశ్చ పక్షిణామ్ ॥ 30**

**తె.అ.** నేను దైత్యులలో ప్రహ్లాదుణ్ణి. గణకులలో కాలాన్ని, మృగాలలో సింహం లేక పులిని, పక్షులలో గరుత్మంతుణ్ణి.

**భాష్యమ్ : 29.1. ప్రహ్లాద ఇతి – ప్రహ్లాదః నామ చ అస్మి దైత్యానాం దితివంశ్యానామ్, కాలః కలయతాం కలనం గణనం కుర్వతామ్ అహమ్. మృగాణాం చ మృగేన్ద్రః సింహః వ్యాఘ్రో వా అహమ్. వైనతేయః చ గరుత్మాన్ వినతాసుతః పక్షిణాం పతత్రిణామ్.**

**తె.అ.** దితి వంశంలోనివారు దైత్యులు. వారిలో ప్రహ్లాదుణ్ణి. కలనము అంటే గణనం, లెక్కించడం. గణించే వారిలో నేను కాలాన్ని. మృగాలలో నేను సింహం లేక పులిని. పక్షులలో నేను వినతాసుతుడైన గరుత్మంతుణ్ణి.

**మూ. పవనః పవతామస్మి రామః శస్త్రభృతామహమ్ ।**
**ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసామస్మి జాహ్నవీ ॥ 31**

**తె.అ.** పావనం చేసేవాటిలో నేను పవనుణ్ణి. శస్త్రధారులలో రాముణ్ణి, చేపలవంటి వాటిలో మొసలిని, నదులలో గంగను.

**భాష్యమ్ : 31.1. పవన ఇతి – పవనః వాయుః, పవతాం పావయితౄణామ్ అస్మి. రామః శస్త్రభృతామ్ అహం శస్త్రాణాం ధారయితౄణాం దాశరథిః రామః అహమ్. ఝషాణాం మత్స్యాదీనాం మకరో నామ జాతి విశేషః అహమ్. స్రోతసామ్ స్రవంతీనాం అస్మి జాహ్నవీ గఙ్గా.**

**తె.అ.** పావనం చేసేవాటిలో నేను పవనుణ్ణి, అంటే వాయువును. శస్త్రం ధరించేవారిలో దాశరథి అయిన రాముణ్ణి. మత్స్యాదులలో మొసలిని నేను. ప్రవహించేవాటిలో నేను గంగను.

**మూ. సర్గాణామాదిరన్తశ్చ మధ్యం చైవాహమర్జున ।**
**అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతామహమ్ ॥ 32**

**తె.అ.** అర్జునా! నేను సర్గముల ఆది మధ్యము అంతము కూడా. విద్యలలో అధ్యాత్మ విద్యను. వాదించువారి వాదాన్ని నేను.

**భాష్యమ్ : 32.1. సర్గాణామితి – సృష్టీనామ్ ఆదిః అన్తః చ మధ్యం చ ఏవ అహమ్ ఉత్పత్తి స్థితిలయాః, అహమ్ అర్జున. భూతానాం జీవాధిష్ఠితానామేవ ఆదిః అన్తశ్చ ఇతి ఉక్తమ్ ఉపక్రమే. (20) ఇహ తు సర్వస్యైవ సర్గమాత్రస్య ఇతి విశేషః అధ్యాత్మవిద్యా విద్యానాం మోక్షార్థత్వాత్ ప్రధానమస్మి. వాదః అర్థనిర్ణయ హేతుత్వాత్, ప్రవదతాం ప్రధానమ్, అతః సః అహమ్ అస్మి. ప్రవక్తృద్వారేణ వాదనభేదానామేవ వాదజల్పవితణ్డానామ్ ఇహ గ్రహణం 'ప్రవదతామ్' ఇతి.**

**తె.అ.** సర్గము అంటే సృష్టి. సృష్టించబడే ప్రతి వస్తువుకూ ఆది మధ్యము అంతము అంటే ఉత్పత్తి స్థితిలయాలు నేను. ఉపక్రమంలో (20వ శ్లోకంలో) జీవాధిష్ఠితులకు అంటే ప్రాణులకు మాత్రమే ఆది అంతము నేనని చెప్పుకున్నాడు. ఇక్కడ సర్వసృష్టికి అని చెప్పడం విశేషం. మోక్షం కొరకు కనుక అధ్యాత్మవిద్య విద్యలలో ప్రధానమయింది. ఆ అధ్యాత్మవిద్యను నేను. అర్థనిర్ణయం చేసేది కనుక వాదించే వారికి వాదం ప్రధానం. ఆ వాదం నేను. 'వాదించేవారిలో అన్నప్పుడు' ప్రవక్త ద్వారా జరిగే వాదనల్ని వితండవాదభేదాలను గ్రహించాలి.

**మూ. అక్షరాణామకారోఽస్మి ద్వన్ద్వః సామాసికస్య చ ।**
**అహమేవాక్షయః కాలో ధాతాఽహం విశ్వతోముఖః ॥ 33**

**తె.అ.** అక్షరాలలో అకారాన్ని, సమాసాలలో ద్వంద్వాన్ని నేను. అక్షయమైన కాలాన్ని నేను. విశ్వతోముఖమైన విధాతను నేను.

**భాష్యమ్ : 33.1. అక్షరాణామితి – అక్షరాణాం వర్ణానామ్ అకారః వర్ణః అస్మి. ద్వన్ద్వః సమాసః అస్మి సామాసికస్య సమాససమూహస్య. కిం చ అహమేవ అక్షయః అక్షీణః, కాలః ప్రసిద్ధః క్షణాద్యాఖ్యః, అథవా పరమేశ్వరః వా కాలస్యాపి కాలః, అస్మి. ధాతా అహం కర్మఫలస్య విధాతా సర్వజగతః, విశ్వతోముఖః సర్వతోముఖః.**

**తె.అ.** వర్ణాలలో అకారాన్ని, సమాస సమూహంలో ద్వంద్వసమాసాన్ని నేను. ఇంకా క్షణం మొదలైన పేర్లతో ప్రసిద్ధమై అక్షయమైన కాలాన్ని నేను, లేక కాలకాలుడనైన పరమేశ్వరుడు నేను అని కూడా చెప్పవచ్చు. (కాలుడు అంటే యముడు, కాలకాలుడు అంటే యముని నిర్జించినవాడు, శివుడు) సర్వజగత్తుకు అన్ని విధాల కర్మఫలాన్ని విధించే విధాతను నేను.

**మూ. మృత్యుః సర్వహరశ్చాహముద్భవశ్చ భవిష్యతామ్ ।**
**కీర్తిః శ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా ॥ 34**

**తె.అ.** సర్వము హరించే మృత్యువును నేను. భావిభాగ్యానికి ప్రాప్తి హేతువును. స్త్రీలలో కీర్తి, శ్రీ, వాక్కు, స్మృతి, బుద్ధి, ధైర్యము, ఓర్పు కూడా నేను.

**భాష్యమ్ : 34.1. మృత్యుః ద్వివిధః ధనాదిహరః ప్రాణహరశ్చ. తత్ర యః ప్రాణహరః సః సర్వహరః ఇత్యుచ్యతే. సః అహమిత్యర్థః. అథవా, పరః ఈశ్వరః ప్రలయే సర్వహరణాత్ సర్వ హరః, సః అహమ్. ఉద్భవః ఉత్కర్షః అభ్యుదయః, తత్ప్రాప్తిహేతుశ్చ అహం, కేషామ్? భవిష్యతాం భావికల్యాణానామ్ ఉత్కర్షప్రాప్తి యోగ్యానామ్ ఇత్యర్థః. కీర్తిః, శ్రీః వాక్ చ, నారీణాం, స్మృతిః**

**మేధా, ధృతిః క్షమా - ఇత్యేతాః ఉత్తమాః స్త్రీణామ్ అహమ్ అస్మి, యాసాం ఆభాసమాత్ర సంబన్ధేనాపి లోకః కృతార్థమ్ ఆత్మానం మన్యతే.**

**తె.అ.** మృత్యువు రెండు విధాలు. ధనం వంటి వాటిని హరించేది, ప్రాణం హరించేది. వీటిలో ప్రాణం హరించే మృత్యువును సర్వహరమంటారు. అది నేను అని అర్థం. లేక, పరుడు ఈశ్వరుడు ప్రళయకాలంలో సర్వము హరిస్తాడు కనుక సర్వహరుడు, అతడే నేను. అభ్యుదయము, దాన్ని పొందడానికి కారణము నేను. ఎవరికి? అభ్యుదయం కలగడానికి యోగ్యులైనవారికి, వారి భావి కల్యాణాలకు అని అర్థం. స్త్రీలలో ఉత్తమమైన కీర్తి, శ్రీ, వాక్కు, స్మృతి, బుద్ధి, ధైర్యము, ఓర్పు నేను. వీటితో ఏ మాత్రం సంబంధం ఉన్నట్లు కనిపించినా లోకులు తాము కృతార్థులైనట్లు అనుకుంటారు. (కీర్తి మొదలైనవి గల స్త్రీలతో సంబంధం గాదు. స్త్రీగా రూపించిన కీర్తి మొదలైన వాటితో సంబంధం ఇక్కడ చెప్పబడింది).

**మూ. బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛన్దసామహమ్ ।**
**మాసానాం మార్గశీర్షో௨హమృతూనాం కుసుమాకరః ॥ 35**

**తె.అ.** మరి సామాలలో బృహత్సామాన్ని నేను. వేద ఛందస్సులలో గాయత్రిని. నెలలలో మార్గశిరము, ఋతువులలో వసంత ఋతువును నేను.

**భాష్యమ్ : 35.1. బృహత్సామేతి - బృహత్సామ తథా సామ్నాం ప్రధానమ్ అస్మి. "గాయత్రీ ఛన్దసామహమ్ గాయత్ర్యా"ది ఛన్దోవిశిష్టానామ్ ఋచాం గాయత్రీఋక్ అహమ్ అస్మి ఇత్యర్థః. మాసానాం మార్గశీర్షో௨హమ్ ఋతూనాం కుసుమాకరః. వసంతః.**

**తె.అ.** మరి, సామాలలో ప్రధానమైన బృహత్సామాన్ని. గాయత్రి మొదలైన ఛందస్సులలో ఉన్న ఋక్కులలో గాయత్రీ ఋక్కును నేను. నెలలలో మార్గశిరము ఋతువులలో వసంతము నేను.

**మూ. ద్యూతం ఛలయతామస్మి తేజస్తేజస్వినామహమ్ ।**
**జయో௨స్మి వ్యవసాయో௨స్మి సత్త్వం సత్త్వవతామహమ్ ॥ 36**

**తె.అ.** వంచన చేసేవారిలో జూదం నేను. తేజస్సు గలవారి తేజస్సు నేను. విజేతలయొక్క జయము నేను. ఉద్యమించే వాళ్ళ ఉద్యమము నేను. సాత్త్వికుల సత్త్వము నేను.

**భాష్యమ్ : 36.1. ద్యూతమితి - ద్యూతమ్ అక్షదేవనాదిలక్షణం, ఛలయతాం ఛలస్య కర్తౄణామ్ అస్మి. తేజస్తేజస్వినామహం, జయః అస్మి జేతౄణాం, వ్యవసాయః అస్మి వ్యవసాయినామ్ సత్త్వం సత్త్వవతాం సాత్త్వికానామ్ అహమ్.**

**తె.అ.** పాచికలు మొదలైన వాటితో వంచన చేసేవారిలో జూదం నేను. తేజస్సుగలవారి తేజస్సు నేను. జయించేవారిలో జయం, ఉద్యమించేవారిలో ఉద్యమం నేను. సాత్త్వికుల సత్త్వం నేను.

**మూ. వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాండవానాం ధనంజయః ।**
**మునీనామప్యహం వ్యాసః కవీనాముశనా కవిః ॥ 37**

**తె.అ.** యాదవులలో వాసుదేవుణ్ణి నేను. పాండవులలో అర్జునుణ్ణి. మునులలోను నేను వ్యాసుణ్ణి. ఋషులలో ఉశనాఋషిని, శుక్రుణ్ణి.

**భాష్యమ్ : 37.1. వృష్ణీనామితి – వృష్ణీనాం యాదవానాం వాసుదేవః అస్మి అయమేవ అహం త్వత్సఖా. పాణ్డవానాం ధనంజయః త్వమేవ. మునీనాం మననశీలానాం సర్వపదార్థజ్ఞానినామపి అహం వ్యాసః. కవీనాం క్రాన్తదర్శినాం ఉశనా కవిః అస్మి.**

**తె.అ.** వృష్ణివంశపువారిలో, యాదవులలో వాసుదేవుణ్ని ఇదిగో నీ సఖుడనైన నేనే. పాండవులలో అర్జునుడవైన నీవే నేను. మననశీలురై సర్వవిషయాలు తెలిసిన మునులలో నేను వ్యాసుణ్ణి. ఇంద్రియాలకు గోచరించని విషయాలను చూడగలిగినవారైన క్రాంతదర్శులైన ఋషులలో శుక్రుడు నేను..

**మూ. దణ్డో దమయతామస్మి నీతిరస్మి జిగీషతామ్ ।**
**మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతామహమ్ ॥ 38**

**తె.అ.** దండించేవారి దండం నేను. జయించగోరేవారి యుద్ధనీతి నేను. గోప్యముల మౌనం కూడా నేను. జ్ఞానుల జ్ఞానం నేను.

**భాష్యమ్ : 38.1. దణ్డ ఇతి – దణ్డః దమయతాం దమయితౄణామ్ అస్మి, అదాన్తానాం దమనకారణమ్. నీతిః అస్మి, జిగీషతాం జేతుమ్ ఇచ్ఛతామ్, మౌనం చ ఏవ అస్మి, గుహ్యానాం గోప్యానామ్. జ్ఞానం జ్ఞానవతామహమ్.**

**తె.అ.** లొంగనివాళ్ళకు ఉపయోగించే దండం నేను. జయించు కోర్కె గలవారి నీతి నేను. గోప్యంగా, రహస్యంగా, ఉంచవలసినవాటి మౌనం నేను. జ్ఞానుల జ్ఞానం నేను.

**మూ. యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున ।**
**న తదస్తి వినా యత్స్యాన్మయా భూతం చరాచరమ్ ॥ 39**

**తె.అ.** సమస్త భూతములకు బీజం నేను, అర్జునా! నేను లేని చరాచర భూతమేదీ లేదు.

**భాష్యమ్ : 39.1. యచ్చాపీతి - యచ్చాపి సర్వభూతానాం, బీజం ప్రరోహకారణం, తత్ అహమ్ అర్జున. ప్రకరణోపసంహారార్థం విభూతి సంక్షేపమ్ ఆహ - న తత్ అస్తి భూతం చరాచరం చరమ్ అచరం వా, మయా వినా యత్ స్యాత్ భవేత్, మయా అప్రకృష్టం పరిత్యక్తం నిరాత్మకం శూన్యం హి తత్ స్యాత్, అతః మదాత్మకం సర్వమ్ ఇత్యర్థః.**

**తె.అ.** సర్వభూతములకు మొలకెత్తడానికి కారణమైన బీజం నేను. ప్రకరణాన్ని ముగిస్తూ భగవానుడు అంటున్నాడు. చరంగాని, అచరంగాని నేనులేని భూతమేమీ లేదు. నా చేత పరిత్యజించబడినది (స్వరూపరహితమైనది) శూన్యం అవుతుంది. కనుక సమస్తానికి ఆత్మను నేను.

**మూ. నాన్తోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప ।**
**ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతేర్విస్తరో మయా ॥ 40**

**తె.అ.** అర్జునా, నా దివ్యవిభూతులకు అంతులేదు. ఇప్పుడు నేను నీకు చెప్పింది ఉదాహరణమునకు.

**భాష్యమ్ : 40.1. నాన్తోస్తీతి - నాన్తః అస్తి మమ దివ్యానాం విభూతీనాం విస్తరాణాం పరంతప. న హి ఈశ్వరస్య సర్వాత్మనః దివ్యానాం విభూతీనామ్ ఇయత్తా శక్యా వక్తుం జ్ఞాతుం వా కేనచిత్. ఏషః తు ఉద్దేశతః ఏకదేశేన ప్రోక్తః విభూతేః విస్తరః మయా.**

**తె.అ.** అర్జునా, నా దివ్యవిభూతుల విస్తారానికి అంతులేదు. సర్వాత్మ అయిన ఈశ్వరుని దివ్యవిభూతులు ఇంతమాత్రమని చెప్పను, తెలియను ఎవరికీ శక్యం కాదు. ఇప్పుడు చెప్పిన విభూతివిస్తరం ఏకదేశంగా చెప్పిందే.

**మూ. యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా ।**
**తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవమ్ ॥ 41**

**తె.అ.** ఏ వస్తువులో విభూతి కలది, శ్రీమంతం, ఉత్సాహాతిశయం - వంటి లక్షణాలు ఉంటాయో - అదంతా నా తేజస్సులోని అంశం నుంచి ఏర్పడినవే అని తెలుసుకో.

**భాష్యమ్ : 41.1. యద్యదితి - యద్యత్ లోకే, విభూతిమత్ విభూతియుక్తం, సత్త్వం వస్తు శ్రీమత్ ఊర్జితమ్ ఏవ వా, శ్రీః లక్ష్మీః, తయా సహితమ్ ఉత్సాహోపేతం వా, తత్ తత్, ఏవ అవగచ్ఛ త్వం విజానీహి, మమ ఈశ్వరస్య తేజోంశసంభవం, తేజసః అంశః ఏకదేశః సంభవః యస్య తత్ తేజోంశసంభవమ్ ఇతి అవగచ్ఛ త్వమ్.**

**తె.అ.** లోకంలో ఏదేది విభూతిమంతము లేక లక్ష్మితో కూడిన (శోభాయమానంగా విరాజిల్లే) లేక ఉత్సాహవంతము అయిన వస్తువు ఉన్నదో అదంతా ఈశ్వరుడనైన నా తేజస్సులోని అంశం నుండి ఏర్పడిందని తెలుసుకో.

**మూ. అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున ।**
**విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్ ॥ 42**

**తె.అ.** లేక, అర్జునా, ఇన్ని తెలుసుకోవడం వల్ల నీకేమి లాభము? నేను ఈ సమస్త జగత్తును ఒకటిగా వ్యాపించి ఉన్నాను.

**ఇతి శ్రీమహాభారతే శతసహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా – సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే విభూతియోగో నామ దశమోఽధ్యాయః.**

ఇది వ్యాసభగవానుని శతసహస్రసంహిత అయిన శ్రీమహాభారతంలో భీష్మపర్వంలో ఉపనిషత్తులు బ్రహ్మవిద్య యోగశాస్త్రము శ్రీకృష్ణార్జునసంవాదము అయిన భగవద్గీతలయందు విభూతియోగం అనే పదవ అధ్యాయానికి తెలుగు అనువాదం.

**భాష్యమ్ : అథవేతి – అథవా బహునా ఏతేన ఏవమాదినా కిం జ్ఞాతేన తవ అర్జున. స్యాత్ సావశేషేణ. అశేషతః త్వమ్ ఇమమ్ ఉచ్యమానమ్ అర్థం శృణు – విష్టభ్య విశేషతః, స్తంభనం దృఢం కృత్వా ఇదం కృత్స్నం జగత్ ఏకాంశేన ఏకావయవేన ఏకపాదేన సర్వభూతస్వరూపేణ ఇత్యేతత్. తథా చ మన్త్రవర్ణః 'పాదోఽస్య విశ్వాభూతాని' (తై.ఆ.30.12, ఋ.సం.10.90.3) ఇతి – స్థితః అహం ఇతి.**

**తె.అ.** ఈ విధంగా ఎన్నని తెలుసుకుంటావు, ఎన్ని తెలుసుకున్నా ఏం లాభం, ఎన్ని తెలుసుకున్నా ఇంకా మిగిలే ఉంటుంది. అశేషవిషయం చెపుతాను, విను. ఈ సమస్త జగత్తును విశేషంగా స్తంభింపజేసి, దృఢం చేసి ఏకావయవంతో నిరవయవంగా ఏకపాదంగా అంటే సర్వభూతస్వరూపంతో ఉన్నాను, అని. 'సమస్తభూతములు ఈ పరమేశ్వరుని ఏకపాదము' (తై.ఆ. 30.12. ఋ.సం.10.90.3.) అని మంత్రవర్ణం కూడా ఉంది.

**ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యగోవిన్దభగవత్పూజ్యపాదశిష్యశ్రీమచ్ఛంకరభగవతః కృతౌ శ్రీమద్భగవద్గీతాభాష్యే విభూతియోగో నామ దశమోఽధ్యాయః.**

ఇది శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య గోవిందభగవత్పూజ్యపాదశిష్యులు శ్రీమత్ శంకర భగవత్పాదులు రచించిన శ్రీమద్భగవద్గీతా భాష్యంలో విభూతియోగం అనే పదవ అధ్యాయానికి తెలుగు అనువాదం.



# ఏకాదశోఽధ్యాయః

# విశ్వరూపదర్శనయోగః

**భాష్యమ్ : 1.0. భగవతః విభూతయః ఉక్తాః. తత్ర చ "విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్" (10.42) ఇతి భగవతా అభిహితం శ్రుత్వా యత్ జగత్ ఆత్మరూపమ్ ఆద్యమ్ ఐశ్వర్యం తత్సాక్షాత్కర్తుమిచ్ఛన్ –**

**తె.అ.** భగవానుని విభూతులు విన్నాడు అర్జునుడు. ఆ సందర్భంలో 'ఈ సర్వజగత్తును ఏకాంశతో వ్యాపించి ఉన్నాను' (10.42) అని భగవానుడన్నమాట విని, జగదాత్మకమైన ఈశ్వరుని మూలస్వరూపం సాక్షాత్కరించుకోగోరి –

**అర్జున ఉవాచ**

**మూ. మదనుగ్రహాయ పరమం గుహ్యమధ్యాత్మసంజ్ఞితమ్ ।**
**యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ ॥ 1**

అర్జునుడు అంటున్నాడు.
**తె.అ.** నన్ను అనుగ్రహించడానికి అధ్యాత్మమనే అతి రహస్యమైన మాట నీవు చెప్పావు. దానిచేత నా ఈ మోహం తొలగిపోయింది.

**భాష్యమ్ : 1.1. మదనుగ్రహాయ మమ అనుగ్రహార్థం, పరమం నిరతిశయం, గుహ్యం గోప్యమ్ అధ్యాత్మ సంజ్ఞితమ్ ఆత్మానాత్మ వివేకవిషయం యత్ త్వయా ఉక్తం వచః వాక్యం, తేన తే వచసా మోహః అయం విగతః మమ అవివేకబుద్ధిః అపగతా ఇత్యర్థః. కించ**

**తె.అ.** నన్ను అనుగ్రహించడం కొరకు ఎంతో గోప్యమైన ఆత్మానాత్మవివేకవిషయమైన అధ్యాత్మ విషయమైన మాట చెప్పావు. దానివల్ల నా ఈ మోహం, అవివేకబుద్ధి తొలగిపోయింది. అంతేకాదు –

**మూ. భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా ।**
**త్వత్తః కమలపత్రాక్ష మాహాత్మ్యమపి చావ్యయమ్ ॥ 2**

**తె.అ.** కృష్ణా, నీవు చెప్పగా భూతముల సృష్టిలయములు విపులంగా విన్నాను. అక్షయమైన నీ మాహాత్మ్యం కూడా విన్నాను.

**భాష్యమ్ : 2.1 ఉద్భవః – ఉత్పత్తి, అప్యయః ప్రలయో తౌ భవాప్యయౌ హి భూతానాం శ్రుతే విస్తరశః న సంక్షేపతః మయా త్వత్తః త్వత్సకాశాత్ కమలప్రతాక్ష. కమలస్య పత్రం కమలపత్రం తద్వత్ అక్షిణీ యస్య తవ స త్వం కమలప్రతాక్షః, మే కమలపత్రాక్ష మహాత్మనః భావః మహాత్మ్యమపి చ అవ్యయం అక్షయం 'శ్రుతం' ఇతి అనువర్తతే.**

**తె.అ.** భవమంటే ఉద్భవం, ఉత్పత్తి, అవ్యయమంటే ప్రళయం. కృష్ణా, నీ వలన భూతముల ఉత్పత్తి ప్రళయాలు సవిస్తరంగా విన్నాను. అక్షయమైన మాహాత్మ్యం కూడా. 'విన్నాను' అని వెనుక నుండి కలిపి చెప్పుకోవలెను.

**మూ. ఏవమేతద్యథాఽఽత్థ త్వమాత్మానం పరమేశ్వర ।**
**ద్రష్టుమిచ్ఛామి తే రూపమైశ్వరం పురుషోత్తమ ॥ 3**

**తె.అ.** పరమేశ్వరా, నిన్ను గురించి నీవు చెప్పినదంతా యథార్థమే. పురుషోత్తమా! నీ వ్యాపకరూపం చూడాలని ఉంది.

**భాష్యమ్ : 3.1 ఏవమితి – ఏవమ్ ఏతత్, న అన్యథా,యథా యేన ప్రకారేణ, ఆత్థ కథయసి, త్వమ్ ఆత్మానం పరమేశ్వర, తథాపి ద్రష్టుమ్ ఇచ్ఛామి, తే తవ, జ్ఞానైశ్వర్య బలశక్తివీర్య తేజోభిః సంపన్నమ్, ఐశ్వరం వైష్ణవం రూపం పురుషోత్తమ.**

**తె.అ.** పరమేశ్వరా, నిన్ను గురించి నీవు చెప్పినదంతా యథార్థమే, నీవు చెప్పినట్లేగాక మరొకవిధంగా కాదు. అయినా జ్ఞాన ఐశ్వర్యబలశక్తి వీర్య తేజస్సులతో సంపన్నమైన, వైష్ణవమైన నీ రూపం చూడాలని ఉంది, పురుషోత్తమా.

మూ. **మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టుమితి ప్రభో ।**
**యోగేశ్వర తతో మే త్వం దర్శయాత్మానమవ్యయమ్ ॥ 4**

**తె.అ.** ప్రభూ, యోగేశ్వరా, అది నేను చూడగలనని నీవు అనుకుంటే నీ అవ్యయమైన ఆత్మస్వరూపాన్ని నాకు చూపించు.

**భాష్యమ్ : 4.1 మన్యసే చింతయసి యది మయా అర్జునేన తత్ శక్యం ద్రష్టుం ఇతి ప్రభో! స్వామిన్! యోగినో యోగాః, తేషాం ఈశ్వరః యోగేశ్వరః, హే యోగేశ్వర, యస్మాత్ అహం అతీవ అర్థీ ద్రష్టుం, తతః తస్మాత్ మే మదర్థం దర్శయ. త్వం ఆత్మానం అవ్యయమ్.**

**తె.అ.** ప్రభూ, యోగేశ్వరా, అర్జునుడు చూడగలడు అనుకుంటే నీ అవ్యయమైన ఆత్మను నాకు చూపించు. ఎందుకంటె అది చూడవలెనని నేనెంతగానో కోరుకుంటున్నాను.

**భాష్యమ్ : 5.0 ఏవం చోదితః అర్జునేన –**

**తె.అ.** ఈ విధంగా అర్జునునిచేత ప్రేరేపించబడిన వాడై –

**శ్రీభగవానువాచ**

**మూ. పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః ।**
**నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ ॥ 5**

శ్రీ భగవానుడంటున్నాడు –

**తె.అ.** పార్థా, అనేకవిధాలైన అనేకవర్ణాలు, ఆకారాలు కలిగిన దివ్యమైన నా రూపాలు వందలకొలది వేలకొలది చూడు.

**భాష్యమ్ : 5.1 పశ్య ఇతి. పశ్య మే పార్థ! రూపాణి శతశః అథ సహస్రశః, అనేకశః ఇత్యర్థః. తాని చ నానావిధాని, దివి భవాని దివ్యాని అప్రాకృతాని, నానావర్ణాకృతీని చ నానా విలక్షణాః నీలపీతాదిప్రకారాః వర్ణాః తథా ఆకృతయశ్చ అవయవసంస్థావిశేషాః యేషాం రూపాణాం తాని నానావర్ణాకృతీని చ.**

**తె.అ.** వందల కొలది, వేలకొలది అంటే అనేకమైన అని అర్థం. అవి నానా విధాలైనవి, దివ్యమైనవి, అంటే దివిలోనివి, ప్రకృతిలోనివి కావు. నీలము ఎరుపు మొదలైన అనేక విలక్షణ వర్ణములు ఆకృతులు, అంటే అవయవస్థితి గల రూపాలు, వాటిని చూడు.

**మూ. పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రానశ్వినౌ మరుతస్తథా ।**
**బహూన్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత ॥ 6**

**తె.అ.** ఆదిత్యులను, వసువులను, రుద్రులను, అశ్వినులను, మరుత్తులను ఇంకా పూర్వం ఎన్నడూ చూడని అనేక అద్భుతాలను చూడు.

**భాష్యమ్ : 6.1 పశ్యాదిత్యానితి – పశ్య ఆదిత్యాన్ ద్వాదశ, వసూన్ అష్టౌ, రుద్రాన్ ఏకాదశ, అశ్వినౌ ద్వౌ, మరుతః సప్త సప్తగణాః యే తాన్, తథా, బహూని అన్యాన్యపి అదృష్టపూర్వాణి మనుష్యలోకే త్వయా త్వత్తః అన్యేన వా కేనచిత్, పశ్య ఆశ్చర్యాణి అద్భుతాని భారత. న కేవలం ఏతావదేవ –**

**తె.అ.** ద్వాదశాదిత్యులను, అష్టవసువులను, ఏకాదశరుద్రులను, అశ్వినీ ద్వయాన్ని, సప్తమరుద్గణాలను చూడు. అట్లాగే, మనుష్యలోకంలో నీవు గాని మరొకడు గాని చూడని అద్భుతాలనేకం చూడు. ఇంతమాత్రమే కాదు –

**మూ. ఇహైకస్థం జగత్ కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్ ।**
**మమ దేహే గుడాకేశ యచ్చాన్యద్ద్రష్టుమిచ్ఛసి ॥ 7**

**తె.అ.** అర్జునా, ఇక్కడ నా దేహంలో ఒక్కచోట చేరిన సమస్త చరాచర జగత్తును చూడు. ఇవి కాక ఇంకా ఏం చూడదలచుకున్నావో అవి కూడా.

**భాష్యమ్ : 7.1 ఇహ ఏకస్థమ్ ఏకస్మిన్ స్థితం జగత్, కృత్స్నం సమస్తం, పశ్య, అద్య, ఇదానీం సచరాచరం సహ చరేణ అచరేణ చ వర్తతే, మమ దేహే, గుడాకేశ, యత్ చ అన్యత్ జయపరాజయాది యత్ శఙ్కసే "యద్వా జయేమ యది వా నో జయేయుః" (2.6) ఇతి యత్ అవోచః తదపి ద్రష్టుం యది ఇచ్ఛసి. కింతు –**

**తె.అ.** ఇక్కడ నా దేహంలో ఒకేచోట చేరిన చరాచరమైన సమస్త జగత్తును చూడు. ఇది కాక ఇంకా జయాపజయాలు మొదలైనవి కూడా, వేటి గురించి నీవు శంకించావో, 'మనం జయిస్తామో మనలను వారు జయిస్తారో' (2.6) అని, అవికూడా చూడు. కాని –

**మూ. న తు మాం శక్యసే ద్రష్టుమనేనైవ స్వచక్షుషా ।**
**దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్ ॥ 8**

**తె.అ.** కాని ఈ నీ కళ్ళతో నన్ను చూడలేవు. నీకు దివ్యచక్షువును ఇస్తున్నాను. నా ఈశ్వరయోగాన్ని చూడు.

**భాష్యమ్ : 8.1 న తు, మాం విశ్వరూపధరం, శక్యసే ద్రష్టుమ్ అనేనైవ ప్రాకృతేన స్వచక్షుషా, స్వకీయేన చక్షుషా. యేన తు శక్యసే ద్రష్టుం దివ్యేన, తత్ దివ్యం దదామి, తే తుభ్యమ్ చక్షుః. తేన పశ్య మే యోగమ్ ఐశ్వరమ్ ఈశ్వరస్య మమ ఐశ్వరం యోగం, యోగశక్త్యతిశయమ్ ఇత్యర్థః.**

**తె.అ.** కాని, ఈ నీ ప్రాకృతమైన కళ్ళతో విశ్వరూపం ధరించిన నన్ను చూడలేవు. ఏ చక్షువుతో చూడగలవో ఆ దివ్యచక్షువును నీకు ఇస్తున్నాను. దానితో ఈశ్వరుడనైన నా యోగమును, అతిశయమైన నా యోగశక్తిని, చూడు.

**సంజయ ఉవాచ –**

**మూ. ఏవముక్త్వా తతో రాజన్ మహాయోగేశ్వరో హరిః ।**
**దర్శయామాస పార్థాయ పరమం రూపమైశ్వరమ్ ॥ 9**

సంజయుడు అంటున్నాడు –

**తె.అ.** ధృతరాష్ట్రా! మహాయోగేశ్వరుడైన నారాయణుడు ఈ విధంగా పలికి, తరువాత అర్జునునికి ఈశ్వరుని విశ్వరూపం చూపించాడు.

**భాష్యమ్ : 9.1 ఏవం యథోక్త ప్రకారేణ, ఉక్త్వా తతః అనన్తరం రాజన్ ధృతరాష్ట్ర, మహాయోగేశ్వరః మహాంశ్చాసౌ యోగేశ్వరశ్చ, మహాయోగేశ్వరః హరిః నారాయణః దర్శయామాస దర్శితవాన్, పార్థాయ పృథాసుతాయ, పరమం రూపం విశ్వరూపమ్ ఐశ్వరమ్.**

**తె.అ.** ఓ రాజా! ధృతరాష్ట్రా, ఈ ప్రకారం పలికి తరువాత మహాయోగేశ్వరుడైన నారాయణుడు అర్జునునికి తన (ఈశ్వరుని) విశ్వరూపం చూపించాడు.

**మూ. అనేకవక్త్రనయనమనేకాద్భుతదర్శనమ్ ।**
**అనేకదివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్ ॥ 10**

**తె.అ.** అనేక ముఖాలతో, కన్నులతో, అనేకమైన అద్భుతదృశ్యాలతో, అనేక దివ్యాభరణాలతో పైకెత్తిన అనేక దివ్యాయుధాలతో –

**భాష్యమ్ : 10.1 అనేకేతి – అనేకవక్త్రనయనమ్ – అనేకాని వక్త్రాణి నయనాని చ యస్మిన్ రూపే తత్ అనేక వక్త్రనయనమ్. అనేకాద్భుతదర్శనమ్ – అనేకాని అద్భుతాని విస్మాపకాని దర్శనాని యస్మిన్ రూపే తత్ అనేకాద్భుతదర్శనం, తథా అనేకదివ్యాభరణమ్ – అనేకాని దివ్యాని ఆభరణాని యస్మిన్ తత్ అనేక దివ్యాభరణమ్, తథా దివ్యానేకోద్యతాయుధమ్ దివ్యాని అనేకాని అస్యాదీని ఉద్యతాని ఆయుధాని యస్మిన్ తత్ దివ్యానేకోద్యతాయుధం, 'దర్శయామాసేతి' పూర్వేణ సంబన్ధః. కించ –**

**తె.అ.** అనేక ముఖాలతో కన్నులతో, విస్మయం కలిగించే అనేక దృశ్యాలతో ఇంకా అనేకమైన దివ్యాభరణాలతో, పైకెత్తిన కత్తులు మొదలైన దివ్యాయుధాలతోటి రూపం – 'చూపించాడు' అని వెనుకటి శ్లోకంతో అన్వయించుకోవాలి.

**మూ. దివ్యమాల్యామ్బరధరం దివ్యగన్ధానులేపనమ్ ।**
**సర్వాశ్చర్యమయం దేవమనంతం విశ్వతోముఖమ్ ॥ 11**

**తె.అ.** దివ్యమైన పుష్పమాలలను, వస్త్రాలను ధరించిన, దివ్యగంధం పూసిన, సమస్తమైన అద్భుతాలతో నిండిన, అంతులేని సర్వతోముఖమైన దేవుని – (చూపించెను, లేక అర్జునుడు చూచెను అని చేర్చుకోవలెను.)

**భాష్యమ్ : 11.1 దివ్యమాల్యామ్బరధరమ్ దివ్యాని మాల్యాని పుష్పాణి అమ్బరాణి వస్త్రాణి చ ధ్రియన్తే యేన ఈశ్వరేణ తం దివ్యమాల్యామ్బరధరం, దివ్యగన్ధానులేపమ్ – దివ్యం గన్ధానులేపనం యస్య తం దివ్యగన్ధానులేపనం, సర్వాశ్చర్యమయం సర్వాశ్చర్యప్రాయమ్, దేవం అనన్తం న అస్య అన్తః అస్తి ఇతి అనన్తః తం, విశ్వతోముఖం సర్వతోముఖం సర్వభూతాత్మభూతత్వాత్, 'తం దర్శయామాస', 'అర్జునః దదర్శ' ఇతి వా అధ్యాహ్రియతే.**

**తె.అ.** దివ్యపుష్పాలు వస్త్రాలు ధరించిన ఈశ్వరుని, దివ్యగంధం పూసిన సర్వాశ్చర్యప్రాయమైన, అనంతమైన సర్వతోముఖమైన సర్వభూతములకు ఆత్మ తానే కనుక – దేవుని, 'చూపించెను' లేక 'అర్జునుడు చూసెను' అని చేర్చుకోవలె.

**భాష్యమ్ : 12.0 యా పునః భగవతః విశ్వరూపస్య భాః తస్యాః ఉపమా ఉచ్యతే –**

**తె.అ.** భగవానుని విశ్వరూపం యొక్క కాంతికి ఉపమానం చెపుతున్నాడు.

**మూ. దివి సూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా ।**
**యది భాః సదృశీ సా స్యాద్భాసస్తస్య మహాత్మనః ॥ 12**

**తె.అ.** ఆకాశంలో ఒకేసారి వేయిసూర్యులు వెలిగితే కలిగే కాంతి ఆ మహాత్ముని కాంతికి సమానమైనదిగా ఉంది.

**భాష్యమ్ : 12.1 దివి అన్తరిక్షే, తృతీయస్యాం వా దివి, సూర్యాణాం సహస్రం సూర్యసహస్రం, తస్య యుగపత్ ఉత్థితస్య సూర్యసహస్రస్య యా యుగపత్ ఉత్థితా భాః సా యది, సదృశీ స్యాత్ తస్య మహాత్మనః విశ్వరూపస్యైవ భాసః, యది వా న స్యాత్, తతోఽపి విశ్వరూపస్యైవ భాః అతిరిచ్యతే ఇత్యభిప్రాయః. కించ**

**తె.అ.** ఆకాశంలో, లేక మూడవ స్వర్గంలో, ఒకేసారి ఉదయించిన వేయి సూర్యులకాంతి కలిగినట్లయితే, ఆ కాంతి ఆ మహాత్ముని కాంతికి, అంటే విశ్వరూపకాంతికి, సదృశం కావచ్చును. కాకపోవచ్చును, దానికంటె విశ్వరూపం యొక్క వెలుగు మించవచ్చును అని అభిప్రాయం. అంతే కాదు –

**మూ. తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్తమనేకధా ।**
**అపశ్యద్దేవదేవస్య శరీరే పాండవస్తదా ॥ 13**

**తె.అ.** అప్పుడు అర్జునుడు దేవదేవుని శరీరంలో ఒకేచోట చేరి ఉన్న, అనేకంగా విభజింపబడిన సమస్త జగత్తును చూచాడు.

**భాష్యమ్ : 13.1 తత్ర తస్మిన్ విశ్వరూపే, ఏకస్మిన్ స్థితమ్ ఏకస్థం జగత్ కృత్స్నం ప్రవిభక్తమ్ అనేకధా దేవపితృమనుష్యాదిభేదైః, అపశ్యత్ దృష్టవాన్, దేవదేవస్య హరేః, శరీరే, పాణ్డవః అర్జునః తదా.**

**తె.అ.** అక్కడ దేవదేవుని విశ్వరూపశరీరంలో ఒకేచోట చేరి ఉన్న, దేవపితృమనుష్యాది భేదాలతో అనేకంగా విభజింపబడిన సమస్త జగత్తును అర్జునుడు చూచాడు.

**మూ. తతః స విస్మయావిష్టో హృష్టరోమా ధనంజయః ।**
**ప్రణమ్య శిరసా దేవం కృతాంజలిరభాషత ॥ 14**

**తె.అ.** అప్పుడు ఆశ్చర్యంతో నిండి పులకితుడైన అర్జునుడు దేవునికి శిరసుతో నమస్కరించి చేతులు మోడ్చి అన్నాడు.

**భాష్యమ్ : 14.1 తత ఇతి – తతః తం దృష్ట్వా సః విస్మయేన ఆవిష్టః విస్మయావిష్టః, హృష్టాని రోమాణి యస్య సః అయం హృష్టరోమా చ అభవత్ ధనంజయః. ప్రణమ్య ప్రకర్షేణ నమనం కృత్వా ప్రహ్వీభూతః సన్ శిరసా, దేవం విశ్వరూపధరం, కృతాఞ్జలిః నమస్కారార్థం సంపుటీకృతహస్తః సన్ అభాషత ఉక్తవాన్.**

**తె.అ.** విస్మయంతో నిండిన అర్జునునికి వెంట్రుకలు నిక్కబొడుచుకున్నాయి. నమస్కారం బాగా చేయడమే ప్రణామం. అంటే వినమ్రతతో నమస్కరించి అని. కృతాంజలియై అంటే నమస్కారం చేయడం కొరకు చేతులు చేర్చి అని. విశ్వరూపధరుడైన దేవునికి వినమ్రుడై శిరసుతో ప్రణామం చేసి చేతులు మోడ్చి అర్జునుడు అంటున్నాడు.

**భాష్యమ్ : 15.0 కథమ్. యత్త్వయా దర్శితం విశ్వరూపం తదహం పశ్యామి ఇతి స్వానుభవమ్ ఆవిష్కుర్వన్ –**

**తె.అ.** ఏమని? 'నీవు చూపిన విశ్వరూపాన్ని నేను చూస్తున్నాను' అని తన అనుభవాన్ని ప్రకటిస్తూ –

**అర్జున ఉవాచ**

**మూ. పశ్యామి దేవాంస్తవ దేవ దేహే సర్వాంస్తథా భూతవిశేషసంఘాన్ ।**
**బ్రహ్మాణమీశం కమలాసనస్థం ఋషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్ ॥ 15**

అర్జునుడు అంటున్నాడు –

**తె.అ.** దేవా, నీ దేహంలో సమస్త దేవతలను, అనేకమైన ఆకారాలతోటి భూత సమూహాలను, పద్మాసనంలో కూర్చుని ఉన్న ఈశుడైన బ్రహ్మను, సర్వఋషులను, దివ్యసర్పాలను చూస్తున్నాను.

**భాష్యమ్ : 15.1 పశ్యామి ఉపలభే, హే దేవ, తవ దేహే, దేవాన్ సర్వాన్ తథా భూతవిశేషసంఘాన్ – భూత విశేషాణాం స్థావరజంగమానాం నానాసంస్థానవిశేషాణాం సంఘాః భూతవిశేషసంఘాః తాన్, కించ బ్రహ్మాణం చతుర్ముఖమ్ ఈశం ఈశితారం ప్రజానాం, కమలాసనస్థం పృథివీపద్మమధ్యే మేరుకర్ణికాసనస్థమ్ ఇత్యర్థః. ఋషీన్ చ వశిష్ఠాదీన్, సర్వాన్ ఉరగాన్ చ వాసుకి ప్రభృతీన్, దివ్యాన్ దివి భవాన్.**

**తె.అ.** ఓ దేవా, నీ దేహంలో సమస్త దేవతలను, స్థావరజంగమములైన అనేకవిధాల ఆకారాలు కలిగిన భూత సమూహాలను, అంతేకాదు కమలాసనస్థుడై, అంటే పృథ్వీపద్మమధ్యంలో మేరుకర్ణికాసనంలో నున్న ప్రజలను శాసించే చతుర్ముఖబ్రహ్మను, వసిష్ఠాది ఋషులందరినీ, వాసుకి మొదలైన దివ్యసర్పాలను చూస్తున్నాను.

**మూ. అనేకబాహూదరవక్త్రనేత్రం పశ్యామి త్వాం సర్వతోఽనన్తరూపమ్ ।**
**నాంతం న మధ్యం న పునస్తవాదిం పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప ॥ 16**

**తె.అ.** ఓ విశ్వేశ్వరా, విశ్వరూపా, అనేకమైన చేతులు, కడుపులు, ముఖములు, కన్నులు గలిగి అంతటా అనంతమైన రూపాలతో నిన్ను చూస్తున్నాను. నీ మొదలు, మధ్యభాగం, తుది భాగం గానీ, తెలియడం లేదు.

**భాష్యమ్ : 16.1 అనేక బాహూదరవక్త్రనేత్రమ్ – అనేక బాహవః ఉదరాణి వక్త్రాణి నేత్రాణి చ యస్య తవ సః త్వం అనేకబాహూదరవక్త్రనేత్రః, తమ్ అనేకబాహూదరవక్త్రనేత్రం. పశ్యామి త్వాం సర్వతః సర్వత్ర, అనన్తరూపమ్ అనన్తాని రూపాణి అస్య ఇతి అనన్తరూపః, తం అనన్తరూపం. న అన్తః, అవసానం, న మధ్యం, మధ్యం నామ ద్వయోః కోట్యోః అన్తరం, న పునః తవ ఆదిం, తవ దేవస్య న అన్తం పశ్యామి, న మధ్యం పశ్యామి న పునః ఆదిం పశ్యామి, హే విశ్వేశ్వర, హే విశ్వరూప. కించ**

**తె.అ.** అనేకమైన చేతులు, కడుపులు, ముఖాలు, కన్నులు గల నిన్ను అంతటా అన్ని రూపాలతో చూస్తున్నాను. నీ తుది మధ్య అంటే, రెండుకొనల మధ్యభాగం, మొదలు తెలియడంలేదు, విశ్వేశ్వరా, విశ్వరూపా.

**మూ. కిరీటినం గదినం చక్రిణం చ తేజోరాశిం సర్వతోదీప్తిమన్తమ్ ।**
**పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమన్తాద్దీప్తానలార్కద్యుతిమప్రమేయమ్ ॥ 17**

**తె.అ.** కిరీటము, గద, చక్రము ధరించి సూర్యాగ్నిసమానమైన కాంతితో అన్నివైపుల చూడరాని తేజస్సుతో వెలిగిపోతున్న నిన్ను చూస్తున్నాను.

**భాష్యమ్ : 17.1 కిరీటం నామ శిరోభూషణ విశేషః, తత్ యస్య అస్తి సః కిరీటీ తం కిరీటినం, తథా గదినం గదా అస్య విద్యతే ఇతి గదీ తం గదినం, తథా చక్రిణమ్ చక్రమ్ అస్య అస్తీతి చక్రీ, తం చక్రిణమ్, తేజోరాశిం తేజః పుంజం. సర్వతోదీప్తిమన్తం సర్వతః దీప్తిః అస్య అస్తి సః సర్వతోదీప్తిమాన్ తం సర్వతోదీప్తిమన్తం, పశ్యామి త్వాం, దుర్నిరీక్ష్యమ్ దుఃఖేన నిరీక్ష్యః దుర్నిరీక్ష్యః, తం దుర్నిరీక్ష్యం, సమన్తాత్ సమంతతః, దీప్తానలార్కద్యుతిం అనలశ్చ అర్కశ్చ అనలార్కౌ తయోః దీప్తానలార్కయోః ద్యుతిః ఇవ ద్యుతిః తేజః యస్య తవ స త్వం దీప్తానలార్క ద్యుతిః, తం దీప్తానలార్కద్యుతిమ్, అప్రమేయం న ప్రమేయమ్ అప్రమేయం, అశక్యపరిచ్ఛేదమ్ ఇత్యర్థః.**

**తె.అ.** కిరీటమనే శిరోభూషణము గలవాడు కిరీటి. గద గలవాడు గది. చక్రం కలవాడు చక్రి. కిరీటము గద చక్రము ధరించి అగ్ని సూర్యులకాంతితో సమానమైన తేజస్సుతో అన్నివైపుల వెలిగిపోతున్న నిన్ను చూస్తున్నాను.

**భాష్యమ్ : 18.0 ఇత ఏవ తే యోగశక్తిదర్శనాత్ అనుమినోమి –**

**తె.అ.** నీ యోగశక్తిని చూచిన నేను ఊహిస్తున్నాను –

**మూ. త్వమక్షరం పరమం వేదితవ్యం త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।**
**త్వమవ్యయః శాశ్వతధర్మగోప్తా సనాతనస్త్వం పురుషో మతో మే ॥ 18**

**తె.అ.** నీవు అక్షరబ్రహ్మము, తెలుసుకోదగినవాడవు. ఈ జగత్తుకు ఆశ్రయము, అవ్యయుడవు, శాశ్వత ధర్మమును రక్షించువాడవు. సనాతన పురుషుడవు అని నేననుకుంటాను.

**భాష్యమ్ : 18.1 త్వమ్, అక్షరమ్ – న క్షరతీతి, అక్షరం పరమం బ్రహ్మ, వేదితవ్యం జ్ఞాతవ్యం ముముక్షుభిః. త్వమ్ అస్య విశ్వస్య సమస్తస్య జగతః పరమ ప్రకృష్టం నిధానం – నిధీయతే అస్మిన్ ఇతి నిధానమ్, పరః ఆశ్రయః ఇత్యర్థః. కిం చ త్వమ్ అవ్యయః. న తవ వ్యయః విద్యతే ఇతి అవ్యయః. శాశ్వత ధర్మగోప్తా – శశ్వత్ భవః శాశ్వతః, నిత్యః ధర్మః, తస్య గోప్తా శాశ్వతధర్మగోప్తా, సనాతనః చిరంతనః త్వం పురుషః పరమః మతః అభిప్రేతః మే మమ. కించ**

**తె.అ.** నీవు నాశనము లేని బ్రహ్మము. మోక్షం కోరేవారు తెలుసుకోదగినవాడవు. ఈ సమస్త జగత్తుకు ఆధారము, ఉత్తమ ఆశ్రయము. అంతేగాదు, నీవు అవ్యయుడవు మార్పులేనివాడవు. నిత్యమైన ధర్మాన్ని పరిరక్షించే వాడవు, నీవు సనాతన పరమపురుషుడవు అని నేననుకుంటున్నాను. అంతేకాదు –

**మూ. అనాదిమధ్యాన్తమనన్తవీర్యమ్ అనంతబాహుం శశిసూర్యనేత్రమ్ ।**
**పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం స్వతేజసా విశ్వమిదం తపన్తమ్ ॥ 19**

**తె.అ.** ఆదిమధ్యాంతములు లేని, అంతులేనిశక్తికలిగిన నిన్ను, అనేకమైన చేతులతో చంద్రసూర్యులు కన్నులుగా మండుతున్న నిప్పువంటి ముఖంతో నీ తేజస్సుతో ఈ ప్రపంచాన్ని కాల్చివేస్తున్న నిన్ను చూస్తున్నాను.

**భాష్యమ్ : 19.1 అనాదిమధ్యాన్తమ్ ఆదిశ్చ మధ్యం చ అన్తశ్చ న విద్యతే యస్య సః అయమ్ అనాదిమధ్యాన్తః, తమ్ – త్వామ్ అనాదిమధ్యాన్తమ్, అనన్తవీర్యమ్ – న తవ వీర్యస్య అన్తః అస్తి ఇతి అనన్తవీర్యః, తం త్వామ్ అనన్తవీర్యం, తథా అనన్తబాహుమ్ – అనన్తాః బాహవః యస్య తవ సః త్వమ్ అనన్తబాహుః, తం త్వామ్ అనన్తబాహుం శశిసూర్యనేత్రమ్ – శశిసూర్యౌ నేత్రే యస్య తవ సః త్వం శశిసూర్యనేత్రః, తం త్వాం శశిసూర్యనేత్రం, చన్ద్రాదిత్యనయనం పశ్యామి త్వాం, దీప్తహుతాశవక్త్రమ్ – దీప్తశ్చాసౌ హుతాశశ్చ సః వక్త్రం యస్య తవ సః త్వ దీప్తహుతాశవక్త్రః, తం త్వాం దీప్తహుతాశవక్త్రమ్ స్వతేజసా విశ్వమ్ ఇదం తపన్తం తాపయన్తమ్.**

**తె.అ.** నీ మొదలు, నడుమ, తుది తెలియరానివి. నీ శక్తికి అంతులేదు. నీ చేతులనేకం. చంద్రసూర్యులు నీ కన్నులు. నీ ముఖం మండుతున్న నిప్పువలె ఉంది. నీ తేజస్సుతో ఈ ప్రపంచాన్ని కాల్చివేస్తున్నావు. అటువంటి నిన్ను చూస్తున్నాను.

**మూ. ద్యావాపృథివ్యోరిదమంతరం హి వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః ।**
**దృష్ట్వాఽద్భుతం రూపమిదం తవోగ్రం లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్ ॥ 20**

**తె.అ.** మహాత్మా, నింగి నేలల నడిమినంతా నీవే నిండి వున్నావు. దిక్కులన్నీ కూడా నీవే. ఉగ్రము అద్భుతము అయిన నీ రూపము చూచి మూడు లోకాలు భయపడిపోతున్నవి.

**భాష్యమ్ : 20.1 ద్యావాపృథివ్యోః, ఇదమ్ అన్తరం హి అన్తరిక్షమ్ వ్యాప్తం, త్వయా ఏకేన విశ్వరూప ధరేణ, దిశః చ సర్వాః వ్యాప్తాః, దృష్ట్వా ఉపలభ్య, అద్భుతమ్ విస్మాపకం, రూపమ్ ఇదం, తవ, ఉగ్రం, క్రూరం, లోకానాం త్రయం లోకత్రయం, ప్రవ్యథితం భీతం, ప్రచలితం వా, మహాత్మన్ అక్షుద్రస్వభావ**

**తె.అ.** విశ్వరూపం ధరించి భూమి ఆకాశాల నడుమ ఈ అంతరిక్షమంతా వ్యాపించి నీవే ఉన్నావు. విస్మయం కలిగించే నీ ఉగ్రరూపాన్ని చూచి మూడులోకాలు భయపడిపోతున్నవి, లేక చలించినవి.

**భాష్యమ్ : 21.0 అథ అధునా పురా "యద్వా జయేమ యది వా నో జయేయు" (2.6) ఇతి అర్జునస్య యః సంశయః ఆసీత్, తన్నిర్ణయాయ పాణ్డవవిజయమ్ ఐకాన్తికం దర్శయామి ఇతి ప్రవృత్తః భగవాన్. తం పశ్యన్ ఆహ, కించ –**

**తె.అ.** 'మనం జయిస్తామో లేక వారు మనలను జయిస్తారో' అని వెనుక అర్జునునికి కలిగిన సంశయాన్ని తొలగించ కోరి పాండవవిజయం తప్పదని చూపించబూనుకున్న భగవానుని చూచి అర్జునుడు అంటున్నాడు, అంతేకాదు –

**మూ. అమీ హి త్వాం సురసంఘా విశన్తి కేచిద్భీతాః ప్రాంజలయో గృణన్తి ।**
**స్వస్తీత్యుక్త్వా మహర్షిసిద్ధసంఘాః స్తువన్తి త్వాం స్తుతిభిః పుష్కలాభిః ॥ 21**

**తె.అ.** ఈ దేవతల సమూహాలు నీలో ప్రవేశిస్తున్నాయి. కొందరు భయపడి చేతులు మోడ్చి స్తుతిస్తున్నారు. మహర్షులు, సిద్ధులు గుంపులుగా అనేక స్తోత్రాలతో 'మేలగుగాక' అని నిన్ను స్తుతిస్తున్నారు.

**భాష్యమ్ : 21.1 అమీ హి యుధ్యమానాః యోద్ధారః త్వాం త్వాం, సురసంఘాః యే అత్ర భూభారావతారాయ అవతీర్ణాః వస్వాదిదేవసంఘాః మనుష్యసంస్థానాః త్వాం విశన్తి ప్రవిశన్తః దృశ్యన్తే, తత్ర కేచిద్ భీతాః ప్రాఞ్జలయః సన్తః, గృణన్తి స్తువన్తి త్వామ్, అన్యే పలాయనేఽప్యశక్తాః సన్తః. యుద్ధే ప్రత్యుపస్థితే ఉత్పాతాదినిమిత్తాన్యుపలక్ష్య స్వస్త్యస్తు జగతః ఇత్యుక్త్వా, మహర్షిసిద్ధ సంఘాః, మహర్షీణాం సిద్ధానాం చ సంఘాః స్తువన్తి త్వాం స్తుతిభిః, పుష్కలాభిః సంపూర్ణాభిః.**

**తె.అ.** భూభారాన్ని తగ్గించడానికి ఇక్కడ మానవరూపంలో అవతరించిన వసువు మొదలైన దేవతా సమూహాలు యుద్ధం చేస్తున్న యోధులు నీలో ప్రవేశిస్తూ కనిపిస్తున్నారు. పారిపోవడానికి కూడా భయపడుతున్న కొందరు చేతులు జోడించి నిన్ను స్తుతిస్తున్నారు. యుద్ధంవలన కలిగే చెడును గుర్తించిన మహర్షులు, సిద్ధులు జగత్తుకు మేలు అగుగాక అని స్తుతిస్తున్నారు.

**మూ. రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ ।**
**గన్ధర్వయక్షాసురసిద్ధసంఘా వీక్షన్తే త్వాం విస్మితాశ్చైవ సర్వే ॥ 22**

**తె.అ.** రుద్రులు, ఆదిత్యులు, వసువులు, సాధ్యులు, విశ్వేదేవతలు, అశ్వినులిద్దరు, మరుత్తులు, ఊష్మపా అనే పితరులు, గంధర్వులు, యక్షులు, అసురులు, సిద్ధులు – వీరందరూ కూడా నిజంగా ఆశ్చర్యంతో నిన్నే చూస్తున్నారు.

**భాష్యమ్ : 22.1 రుద్రాదిత్యాః వసవః యే చ సాధ్యాః – రుద్రాదయః గణాః విశ్వే, అశ్వినౌ చ దేవౌ, మరుతశ్చ, ఊష్మపాశ్చ పితరః, గన్ధర్వయక్షాసుర సిద్ధసంఘాః – గన్ధర్వాః హాహాహూహూ ప్రభృతయః, యక్షాః, కుబేరప్రభృతయః, అసురాః విరోచనప్రభృతయః, సిద్ధాః కపిలాదయః తేషాం సంఘాః గన్ధర్వయక్షాసురసిద్ధసంఘాః తే, వీక్షన్తే పశ్యన్తి, త్వా త్వాం, విస్మితాః విస్మయమ్ ఆపన్నాః సన్తః త ఏవ సర్వే. యస్మాచ్చ –**

**తె.అ.** రుద్రులు, ఆదిత్యులు, వసువులు, సాధ్యులు మొదలైన గణాలు విశ్వేదేవతలు అశ్వినులనే దేవతలిద్దరు, మరుత్తులు, ఊష్మపా అనే పితరులు, హాహాహూహూ మొదలైన గంధర్వులు, కుబేరుడు మొదలైన యక్షులు, విరోచనుడు మొదలైన రాక్షసులు, కపిలుడు మొదలైన సిద్ధులు – వీరందరూ విస్మయం చెంది నిన్ను చూస్తున్నారు. ఎందుకంటే –

**మూ. రూపం మహత్తే బహువక్త్రనేత్రం మహాబాహో బహుబాహూరుపాదమ్ ।**
**బహూదరం బహుదంష్ట్రాకరాలం దృష్ట్వా లోకాః ప్రవ్యథితాస్తథాఽహమ్ ॥ 23**

**తె.అ.** కృష్ణా! అనేక ముఖాలు కన్నులు కలది, అనేక బాహువులు, ఊరువులు, పాదాలు కలది అనేకమైన ఉదరములు కలది అనేకమైన కోరలతో భయంకరమైనది అయిన నీ మహద్రూపం చూచి లోకాలు భయపడిపోతున్నవి. నేను కూడా.

**భాష్యమ్ : 23.1 రూపం, మహత్ అతిప్రమాణం, తే తవ, బహువక్త్రనేత్రం బహూని వక్త్రాణి ముఖాని, నేత్రాణి చక్షూంషి చ యస్మిన్ రూపే తత్ బహువక్త్రనేత్రం, హే మహాబాహో! బహుబాహూరుపాదం – బహవః ఊరవః పాదాః చ యస్మిన్ తత్ రూపే బహుబాహూరుపాదం, కిం చ, బహూదరం బహూని ఉదరాణి అస్మిన్ ఇతి బహూదరం, బహుదంష్ట్రాకరాలం – బహ్వీభిః దంష్ట్రాభిః కరాలం వికృతం తత్ బహుదంష్ట్రాకరాలం, దృష్ట్వా రూపమ్ ఈదృశం లోకాః లౌకికాః, ప్రాణినః, ప్రవ్యథితాః ప్రచలితాః భయేన, తథా అహమపి. తత్రేదం కారణమ్ –**

**తె.అ.** కృష్ణా, అనేక ముఖాలు కన్నులు గలది, అనేకమైన బాహువులు ఊరువులు పాదాలు కలది, ఇంకా అనేక ఉదరములు కలది, అనేకమైన కోరలతో వికారమైనది – అతి ప్రమాణమైన ఇటువంటి నీ రూపం చూచి లోకంలోని ప్రాణులు భయంతో వణికిపోతున్నారు. నేను కూడా. అందుకు కారణం ఇది –

**మూ. నభః స్పృశం దీప్తమనేకవర్ణం వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రమ్ ।**
**దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాన్తరాత్మా ధృతిం న విందామి శమం చ విష్ణో ॥ 24**

**తె.అ.** విష్ణూ! ఆకాశమంటుతూ అనేక వర్ణాలు కలిగి వెలిగిపోతూ తెరచిన నోళ్ళతో వెలిగే విశాలమైన కన్నులతో ఉన్న నిన్ను చూచి నా అంతరాత్మ వ్యాకులమైంది. ధైర్యం పోయింది. శాంతి లేదు.

**భాష్యమ్ : 24.1 నభః స్పృశమ్ ద్యుస్పర్శమిత్యర్థః, దీప్తం ప్రజ్వలితమ్, అనేకవర్ణమ్ అనేకే వర్ణాః భయంకరాః నానా సంస్థానాః యస్మిన్ త్వయి తం త్వామ్ అనేకవర్ణం, వ్యాత్తాననం వ్యాత్తాని వివృతాని ఆననాని ముఖాని యస్మిన్ త్వయి తం త్వాం వ్యాత్తాననం, దీప్తవిశాలనేత్రం దీప్తాని ప్రజ్వలితాని విశాలాని విస్తీర్ణాని నేత్రాణి యస్మిన్ త్వయి తం త్వాం దీప్తవిశాలనేత్రం, దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాన్తరాత్మా – ప్రవ్యథితః ప్రభీతః అన్తరాత్మా మనః యస్య మమ సః అహం ప్రవ్యథితాన్తరాత్మా సన్ ధృతిం ధైర్యం న విన్దామి న లభే, శమం చ ఉపశమం మనస్తుష్టిం హే విష్ణో! కస్మాత్?**

**తె.అ.** ఆకాశమంటుతూ ప్రజ్వలిస్తూ, భయంకరమైన అనేక వర్ణాలతో, తెరచిన నోళ్ళతో, ప్రజ్వలిస్తున్న విశాలమైన నేత్రాలతో ఉన్న నిన్ను చూచి నా మనసు వ్యథ చెందుతున్నది. నాకు ధైర్యం కలగడం లేదు. మనసుకు శాంతి లేదు. ఎందుకని?

**మూ. దంష్ట్రాకరాలాని చ తే ముఖాని దృష్ట్వైవ కాలానలసంనిభాని ।**
**దిశో న జానే న లభే చ శర్మ ప్రసీద దేవేశ జగన్నివాస ॥ 25**

**తె.అ.** వికృతమైన కోరలతో ప్రలయ కాలాగ్ని సమానమైన నీ ముఖాలు చూడగానే నాకు దిక్కు తెలియడం లేదు. శాంతి లేదు. దేవేశా! జగన్నివాసా! ప్రసన్నుడవు కా.

**భాష్యమ్ : 25.1 దంష్ట్రాకరాలాని దంష్ట్రాభిః కరాలాని వికృతాని, తే తవ, ముఖాని, దృష్ట్వా ఏవ ఉపలభ్య కాలానలసంనిభాని ప్రలయకాలే లోకానాం దాహకః అగ్నిః కాలానలః తత్సంనిభాని కాలానలసదృశాని దృష్ట్వా ఇత్యేతత్ దిశః పూర్వాపరవివేకేన న జానే, దిఙ్మూఢః జాతః అస్మి, అతః న లభే నోపలభే చ శర్మ సుఖమ్, అతః ప్రసీద ప్రసన్నః భవ, హే దేవేశ, జగన్నివాస.**

**తె.అ.** వికృతమైన కోరలు గలిగి ప్రళయకాలంలో లోకాలను దహించే అగ్నితో సమానమైన నీ ముఖాలను చూడగానే నాకు దిక్కుతోచడం లేదు. శాంతి పొందలేకున్నాను. దేవేశా! జగన్నివాసా! ప్రసన్నుడవు కమ్ము.

**భాష్యమ్ : 26.0 యేభ్యః మమ పరాజయశంకా ఆసీత్ సా చ అపగతా, యతః –**

**తె.అ.** ఎవరి వలన నాకు పరాజయ శంక ఉండినదో ఆ శంక కూడా తొలగిపోయింది. ఎందుకంటే –

**మూ. అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః సర్వే సహైవావనిపాలసంఘైః ।**
**భీష్మో ద్రోణః సూతపుత్రస్తథాఽసౌ సహాస్మదీయైరపి యోధముఖ్యైః ॥ 26**

**తె.అ.** ఆ ధార్తరాష్ట్రులందరూ, వారితో ఉన్న రాజులందరూ, భీష్మద్రోణకర్ణులు మరియు మనవైపు వారైన ప్రధానయోధులు ('వీరందరూ త్వరత్వరగా నీలో ప్రవేశిస్తున్నారు'), అని తరువాతి శ్లోకంతో కలిపి చదువుకోవాలి.

**భాష్యమ్ : 26.1 అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః దుర్యోధనప్రభృతయః – 'త్వరమాణాః త్వా విశన్తి' (27) ఇతి వ్యవహితేన సంబంధః సర్వే సహైవ సహితాః అవనిపాలసంఘైః అవనిం పృథ్వీం పాలయన్తీతి అవనిపాలాః తేషాం సంఘైః, కిం చ భీష్మః ద్రోణః, సూతపుత్రః కర్ణః తథా అసౌ, సహ అస్మదీయైరపి ధృష్టద్యుమ్న ప్రభృతిభిః యోధముఖ్యైః యోధానాం ప్రధానైః సహ –**

**తె.అ.** దుర్యోధనుడు మొదలైన ఆ ధృతరాష్ట్రుని పుత్రులందరూ రాజుల సమూహాలతో సహా భీష్మద్రోణకర్ణులు మరియు మనవైపు వారైన ధృష్టద్యుమ్నుడు మొదలైన ప్రధానయోధులతో సహా 'త్వరత్వరగా నీలో ప్రవేశిస్తున్నారు' అని తరువాతి శ్లోకంతో కలిపి అన్వయించుకోవాలి.

**మూ. వక్త్రాణి తే త్వరమాణా విశన్తి దంష్ట్రాకరాలాని భయానకాని ।**
**కేచిద్విలగ్నా దశనాన్తరేషు సందృశ్యన్తే చూర్ణితైరుత్తమాంగైః ॥ 27**

**తె.అ.** వికారమైన కోరలతో భయంకరమైన నీ నోళ్ళలోకి వారు దూకుతున్నారు. కొందరు కోరల సందున చిక్కుకొని తలలు నలిగి కనిపిస్తున్నారు.

**భాష్యమ్ : 27.1 వక్త్రాణి ముఖాని, తే తవ, త్వరమాణాః త్వరాయుక్తాః సన్తః విశన్తి – కిం విశిష్టాని ముఖాని? దంష్ట్రాకరాలాని, భయానకాని భయంకరాణి, కిం చ కేచిత్ ముఖాని ప్రవిష్టానాం మధ్యే విలగ్నాః దశనాన్తరేషు దన్తాన్తరేషు, మాంసమివ భక్షితం సందృశ్యన్తే ఉపలభ్యన్తే చూర్ణితైః చూర్ణీకృతైః, ఉత్తమాఙ్గైః శిరోభిః.**

**తె.అ.** వికృతమైన కోరలతో భయంకరమైన నీ నోళ్ళలోకి త్వరపడి ప్రవేశిస్తున్నారు. ఆ విధంగా నోళ్ళలోకి ప్రవేశిస్తున్నవారిలో కొందరు కోరలసందున చిక్కుకొని తినేటప్పుడు పండ్ల సందున చిక్కిన మాంసపుముక్కల వలె నలిగిన తలలతో కనిపిస్తున్నారు.

**భాష్యమ్ : 28.0 కథం ప్రవిశన్తి ముఖానీత్యాహ –**

**తె.అ.** నోళ్ళలోకి వారు ప్రవేశించడం ఏ విధంగా ఉంది? అంటే చెపుతున్నాడు.

**మూ. యథా నదీనాం బహవోఽమ్బువేగాః సముద్రమేవాభిముఖా ద్రవన్తి ।**
**తథా తవామీ నరలోకవీరా విశన్తి వక్త్రాణ్యభివిజ్వలన్తి ॥ 28**

**తె.అ.** వేగంగా సాగే అనేక నదుల జలప్రవాహాలు సముద్రం వైపుకే దూకినట్లు ఈ లోకంలోని వీరులంతా మండుతున్న నీ నోళ్ళలోకి ప్రవేశిస్తున్నారు.

**భాష్యమ్ : 28.1 యథా ఇతి. యథా నదీనాం స్రవంతీనాం బహవః అనేకే అంబూనాం వేగాః అంబువేగాః త్వరావిశేషాః సముద్రమేవ అభిముఖాః ప్రతిముఖాః ద్రవంతి ప్రవిశంతి, తథా తద్వత్ తవ అమీ భీష్మాదయః నరలోకవీరాః మనుష్యలోకే శూరాః విశంతి వక్త్రాణి అభివిజ్జ్వలంతి ప్రకాశమానాని.**

**తె.అ.** ఏ విధంగా వేగంగా దూకే అనేక నదుల జలప్రవాహాలు సముద్రం వైపుకే దూకుతాయో అదే విధంగా భీష్మాదులైన ఈ మనుష్యలోకంలోని శూరులు ప్రకాశమానమైన నీ నోళ్ళలోకి ప్రవేశిస్తున్నారు.

**భాష్యమ్ : 29.0 తే కిమర్థం ప్రవిశంతి కథం చ ఇత్యాహ –**

**తె.అ.** వారు ఎందుకు ప్రవేశిస్తున్నారు, ఏ విధంగాను? అంటే –

**మూ. యథా ప్రదీప్తం జ్వలనం పతంగా విశన్తి నాశాయ సమృద్ధవేగాః ।**
**తథైవ నాశాయ విశన్తి లోకాస్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః ॥ 29**

**తె.అ.** రెక్కపురుగులు మండే దీపంలోకి దూకి నశించడానికి ఏ విధంగా తొందరపడతాయో అదే విధంగా ప్రాణులు నీ నోళ్ళలో దూకి నశించడానికి వేగిరపడుతున్నారు.

**భాష్యమ్ : 29.1 యథా ప్రదీప్తం జ్వలనమ్ అగ్నిం పతంగాః పక్షిణః విశన్తి, నాశాయ వినాశాయ, సమృద్ధవేగాః సమృద్ధః ఉద్భూతః వేగః గతిః యేషాం తే సమృద్ధవేగాః తథైవ నాశాయ విశన్తి, లోకాః ప్రాణినః తవ అపి వక్త్రాణి సమృద్ధవేగాః. త్వం పునః –**

**తె.అ.** ఏ విధంగా రెక్కపురుగులు మించిన తొందరతో నశించడం కొరకు మండే నిప్పులో దూకుతాయో అదే విధంగా నాశనంకావడంకొరకు ప్రాణులు నీ నోళ్ళలో అంత త్వరగా ప్రవేశిస్తున్నారు. మరి నీవేమో –

**మూ. లేలిహ్యసే గ్రసమానః సమన్తాల్లోకాన్ సమగ్రాన్ వదనైర్జ్వలద్భిః ।**
**తేజోభిరాపూర్య జగత్సమగ్రం భాసస్తవోగ్రాః ప్రతపన్తి విష్ణో ॥ 30**

**తె.అ.** మంటలెగసే నోళ్ళతో సమస్తప్రాణులను అన్నివైపులనుండి గ్రహిస్తూ నీ పెదవులు నాకుతున్నావు. ఓ విష్ణూ, నీ ఉగ్రదీప్తులు సమస్త జగత్తును తేజస్సుతో నింపి కాల్చివేస్తున్నాయి.

**భాష్యమ్ : 30.1 లేలిహ్యసే ఆస్వాదయసి, గ్రసమానః అన్తః ప్రవేశయన్, సమంతాత్ సమస్తతః లోకాన్, సమగ్రాన్ సమస్తాన్, వదనైః, వక్త్రైః, జ్వలద్భిః దీప్యమానైః తేజోభిః ఆపూర్య సంపూర్య, జగత్ సమగ్రం సమస్తమ్ ఇత్యేతత్. కిం చ భాసః దీప్తయః తవ ఉగ్రాః క్రూరాః ప్రతపన్తి సంతాపం కుర్వన్తి, హే! విష్ణో! వ్యాపనశీల.**

**తె.అ.** ఓ విష్ణూ, వ్యాపనశీలమైనవాడా, మండుతున్న నోళ్ళతో అన్ని వైపుల నుండి సమస్త ప్రాణులను భక్షిస్తూ నీ పెదవులను నాకుతున్నావు, ఆస్వాదిస్తున్నావు. సమస్త జగత్తును నీ క్రూరదీప్తులు తేజస్సులతో నింపి సంతాపం కలిగిస్తున్నాయి.

**భాష్యమ్ : 31.0 యతః ఏవమ్ ఉగ్రస్వభావః అతః –**

**తె.అ.** ఈ విధమైన ఉగ్రస్వభావం కలవాడివి కనుక –

**మూ. ఆఖ్యాహి మే కో భవానుగ్రరూపో నమోఽస్తు తే దేవవర ప్రసీద ।**
**విజ్ఞాతుమిచ్ఛామి భవన్తమాద్యం న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్ ॥ 31**

**తె.అ.** ఉగ్రరూపుడవైన నీవెవరవో నాకు చెప్పు, ఓ దేవదేవా, నీకు నమస్కారము. ప్రసన్నుడవు కమ్ము. ఆద్యుడవైన నిన్ను తెలుసుకోగోరుతున్నాను. నీ చేష్ట నాకు అర్థం కావడం లేదు.

**భాష్యమ్ : 31.1 ఆఖ్యాహి కథయ, మే మహ్యం, కః భవాన్ ఉగ్రరూపః క్రూరాకారః. నమః అస్తు తే తుభ్యం, హే దేవవర దేవానాం ప్రధాన, ప్రసీద ప్రసాదం కురు, విజ్ఞాతుం విశేషణ జ్ఞాతుమ్ ఇచ్ఛామి భవన్తమ్, ఆద్యమ్ ఆదౌ భవమ్ ఆద్యమ్. న హి యస్మాత్ ప్రజానామి తవ త్వదీయాం ప్రవృత్తిం చేష్టామ్.**

**తె.అ.** ఈ విధంగా క్రూరాకారుడవైన నీవు ఎవరవు, నాకు చెప్పు. ఓ ప్రధానదేవా! నీకు నమస్కారము, ప్రసాదము వహించు. ఆద్యుడవైన నిన్ను తెలుసుకోగోరుతున్నాను. నీ చేష్ట తెలియలేకున్నాను.

**శ్రీ భగవానువాచ –**

**మూ. కాలోఽస్మి లోకక్షయకృత్ ప్రవృద్ధో లోకాన్సమాహర్తుమిహ ప్రవృత్తః ।**
**ఋతేఽపి త్వాం న భవిష్యన్తి సర్వే యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః ॥ 32**

శ్రీ భగవానుడంటున్నాడు –

**తె.అ.** లోకక్షయం చేయడం కొరకు పెరిగిన కాలస్వరూపుణ్ణి నేను. లోకాలను సంహరించడానికి ఇక్కడ పూనుకుని ఉన్నాను. రెండువైపుల మోహరించి ఉన్న యోధులందరూ నీవు లేకపోయినా మిగలనివారు.

**భాష్యమ్ : 32.1 కాలోస్మీతి – కాలః అస్మి లోకక్షయకృత్ – లోకానాం క్షయం కరోతీతి లోకక్షయకృత్, ప్రవృద్ధః వృద్ధిం గతః, యదర్థం ప్రవృద్ధః తత్ శృణు – లోకాన్ సమాహర్తుం, సంహర్తుమ్, ఇహ అస్మిన్ కాలే, ప్రవృత్తః. ఋతేఽపి వినాపి, త్వా త్వాం, న భవిష్యన్తి భీష్మద్రోణ కర్ణప్రభృతయః సర్వే, యేభ్యః తవ ఆశంకా, యే అవస్థితాః, ప్రత్యనీకేషు అనీకమనీకం ప్రతి ప్రత్యనీకేషు ప్రతిపక్షభూతేషు అనీకేషు, యోధాః యోద్ధారః.**

**తె.అ.** లోకాలను క్షయంచేసే కాలస్వరూపుణ్ణి. వృద్ధిపొంది, పెరిగి ఉన్నాను. ఎందుకింతగా పెరిగి ఉన్నాను అంటే విను. లోకాలను సంహరించడానికి ఇప్పుడు పూనుకుని ఉన్నాను. నీవు లేకపోయినా (నీవు చంపకపోయినా) ఎవరిని గురించి నీవు భయపడుతున్నావో ఆ యోధులందరూ, భీష్మద్రోణకర్ణాదులు, శత్రుసైన్యములయందు మోహరించి నిలిచి ఉన్నవారు, ఉండబోరు.

**మూ. తస్మాత్త్వముత్తిష్ఠ యశో లభస్వ జిత్వా శత్రూన్ భుఙ్క్ష్వ రాజ్యం సమృద్ధమ్ ।**
**మయైవైతే నిహతాః పూర్వమేవ నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్ ॥ 33**

**తె.అ.** కనుక అర్జునా, నీవు లే. కీర్తిపొందు. శత్రువులను జయించి సమృద్ధమైన రాజ్యం అనుభవించు. వీరందరూ పూర్వమే నా చేత హతులైనారు. అర్జునా, నీవు నిమిత్తమాత్రుడవు కమ్ము!

**భాష్యమ్ : 33.1 తస్మాత్ త్వమ్ ఉత్తిష్ఠ "భీష్మద్రోణప్రభృతయః అతిరథాః అవస్థితాః అజేయాః దేవైరపి, అర్జునేన జితాః" ఇతి యశః లభస్వ. కేవలం పుణ్యైః హి తత్ ప్రాప్యతే. జిత్వా శత్రూన్ దుర్యోధనప్రభృతీన్. భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్ అసపత్నమ్ అకణ్టకమ్. మయైవ ఏతే నిహతాః నిశ్చయేన హతాః ప్రాణైః వియోజితాః పూర్వమేవ. నిమిత్తమాత్రం భవ త్వం, హే సవ్యసాచిన్. సవ్యేన వామేనాపి హస్తేన శరాణాం క్షేపాత్ సవ్యసాచీతి ఉచ్యతే అర్జునః.**

**తె.అ.** సవ్యసాచీ, ఎడమచేతితో కూడా బాణములు వేయగలవాడు గనుక అర్జునునికి సవ్యసాచి అని పేరు. నీవు లే, కీర్తి పొందు, దేవతలు కూడా జయించలేని భీష్మద్రోణాది అతిరథులను అర్జునుడు జయించాడన్న కీర్తిని పొందు. ఆ కీర్తి పుణ్యం చేసుకున్నవారికి మాత్రమే కలుగుతుంది.

దుర్యోధనాది శత్రువులను జయించి శత్రువులు లేని నిష్కంటకమైన రాజ్యాన్ని అనుభవించు. వీరు నాచేత పూర్వమే నిశ్చయంగా హతులైనారు. వారి ప్రాణాలు నేను హరించాను. నీవు నిమిత్తమాత్రుడవు కమ్ము.

**మూ. ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ కర్ణం తథాన్యానపి యోధవీరాన్ ।**
**మయా హతాంస్త్వం జహి మా వ్యథిష్ఠా యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్ ॥ 34**

**తె.అ.** నా చేత చంపబడిన భీష్మ ద్రోణజయద్రథకర్ణులను ఇంకా ఇతర యోధవీరులను నీవు చంపు. భయపడకు. యుద్ధం చేయి. యుద్ధంలో శత్రువులను జయిస్తావు.

**భాష్యమ్ : 34.1 ద్రోణంచేతి : ద్రోణం చ - యేషు యోధేషు అర్జునస్య ఆశంకా తాంస్తాన్ వ్యపదిశతి భగవాన్ మయా హతాన్ ఇతి. తత్ర ద్రోణభీష్మయోస్తావత్ ప్రసిద్ధమ్ ఆశఙ్కా కారణమ్. ద్రోణః ధనుర్వేదాచార్యః దివ్యాస్త్రసంపన్నః ఆత్మనశ్చ విశేషతః గురుః గరిష్ఠః. భీష్మః స్వచ్ఛన్దమృత్యుః దివ్యాస్త్రసంపన్నశ్చ పరశురామేణ ద్వన్ద్వయుద్ధమ్ అగమత్, న చ పరాజితః. తథా జయద్రథః యస్య పితా తపః చరతి "మమ పుత్రస్య శిరః భూమౌ నిపాతయిష్యతి యః తస్యాపి శిరః పతిష్యతీ"తి. కర్ణోఽపి వాసవదత్తాయా శక్త్యా తు అమోఘయా సంపన్నః సూర్యపుత్రః కానీనః యతః అతః తన్నామ్నైవ నిర్దేశః. మయా హతాన్ త్వం జహి నిమిత్తమాత్రేణ, మా వ్యథిష్ఠాః, తేభ్యో భయం మా కార్షీః. యుధ్యస్వ. జేతాసి దుర్యోధనప్రభృతీన్, రణే యుద్ధే సపత్నాన్ శత్రూన్.**

**తె.అ.** ఏ యే యుద్ధవీరుల గురించి అర్జునునికి భయం ఉన్నదో ఆయా వీరులను పేరు పేరున చెప్పి 'వారిని నేను మునుపే చంపివేశాను' అని భగవానుడు చెపుతున్నాడు. ద్రోణభీష్ముల విషయంలో అతడు భయపడడానికి కారణం ప్రసిద్ధమే. ద్రోణుడు ధనుర్వేదాచార్యుడు, దివ్యాస్త్ర-సంపన్నుడు. పైగా తనకు గౌరవనీయుడైన గురువు. భీష్ముడు స్వచ్ఛందమరణం కలవాడు. తను కోరినప్పుడు తప్ప మరణించనివాడు, దివ్యాస్త్రసంపన్నుడు, ద్వంద్వయుద్ధంలో పరశురాముడి చేత గూడా ఓడిపోనివాడు. ఇక జయద్రథుడు. ఇతని తండ్రి 'నా కుమారుని తల నేలకూలనేయువాని తల నేలకూలుగాక' అని తపం చేస్తున్నవాడు. కర్ణుడు కూడా ఇంద్రునివలన అమోఘమైన శక్తిని పొందినవాడు. కన్య అయిన కుంతికి సూర్యునివలన కలిగినవాడితడు. కనుకనే ఇతనిని పేర్కొన్నాడు. నాచేత చచ్చిన వీరందరినీ నీవు నిమిత్తమాత్రుడవై చంపు. వారిని గురించి భయపడవద్దు. యుద్ధం చేయి, దుర్యోధనాది శత్రువులను యుద్ధంలో జయిస్తావు.

**సంజయ ఉవాచ –**

**మూ. ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య కృతాఞ్జలిర్వేపమానః కిరీటీ ।**
**నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం సగద్గదం భీతభీతః ప్రణమ్య ॥ 35**

సంజయుడు అంటున్నాడు –

**తె.అ.** కేశవుని ఈ మాటలు విని అర్జునుడు వణుకుతూ చేతులు మోడ్చి నమస్కరించి భయంతో వినమ్రుడై గద్గదస్వరంతో కృష్ణుడితో మళ్ళీ అన్నాడు.

**భాష్యమ్ : 35.1 ఏతచ్ఛ్రుత్వేతి – ఏతత్ శ్రుత్వా వచనం కేశవస్య పూర్వోక్తం కృతాఞ్జలిః సన్, వేపమానః, కంపమానః, కిరీటీ, నమస్కృత్వా, భూయః పునః ఏవ, ఆహ ఉక్తవాన్, కృష్ణం సగద్గదం, భయావిష్టస్య దుఃఖాభిఘాతాత్, స్నేహావిష్టస్య చ హర్షోద్భవాత్, అశ్రుపూర్ణనేత్రత్వే సతి శ్లేష్మణా కణ్ఠావరోధః తేనః వాచః అపాటవం మన్దశబ్దత్వం యత్ సః గద్గదః, తేన సహ వర్తతే ఇతి. "సగద్గదం వచనమ్ ఆహే"తి వచన క్రియా విశేషణమ్. భీతభీతః. పునః పునః భయావిష్టచేతాః సన్ ప్రణమ్య ప్రహ్వః భూత్వా 'ఆహ' ఇతి వ్యవహితేన సంబన్ధః.**

**తె.అ.** కేశవుడు అన్న ఈ మాట విని అర్జునుడు చేతులు మోడ్చి వణుకుతూ నమస్కరించి మరల మరల భయావిష్టచేతసుడై, వినమ్రుడై గద్గదస్వరంతో కృష్ణునితో మళ్ళీ అన్నాడు. భయం వల్ల కలిగే దుఃఖం చేత, కృష్ణునియందు తనకు గలస్నేహం చేత కలిగిన హర్షం వలన కళ్ళకు నీరు వచ్చి శ్లేష్మం వలన కంఠావరోధం కలుగుతుంది. దానివలన మాటకు పటుత్వం తగ్గి మాంద్యం కలుగుతుంది. అంటే స్పష్టత తగ్గి మాట బలహీనంగా వస్తుంది. దానినే గద్గదం అంటారు.

**భాష్యమ్ : 35.2 అత్రావసరే సంజయవచనం సాభిప్రాయమ్. కథమ్? ద్రోణాదిషు అర్జునేన నిహతేషు అజేయేషు చతుర్షు నిరాశ్రయః దుర్యోధనః నిహతః ఏవేతి మత్వా ధృతరాష్ట్రః జయం ప్రతి నిరాశః సన్ సంధిం కరిష్యతి, తతః శాన్తిః ఉభయేషాం భవిష్యతి ఇతి. తదపి న అశ్రౌషీత్ ధృతరాష్ట్రః భవితవ్యవశాత్.**

**తె.అ.** ఈ సందర్భంలో సంజయుడి మాట సాభిప్రాయమైనదే. ఎట్లా? అజేయులైన ద్రోణాదులు నలుగురూ అర్జునునిచేత నిహతులైనపుడు నిరాశ్రయుడైన దుర్యోధనుడు నిహతుడైనట్లేనని తలచి ధృతరాష్ట్రుడు జయాశవదలి సంధి చేసుకుంటాడు, అప్పుడు ఇరుపక్షాలవారికి శాంతి కలుగుతుంది అని సంజయుడు అనుకున్నాడు. కాని ధృతరాష్ట్రుడు భవితవ్యవశుడై అంటే జరుగవలసింది మరొకవిధంగా ఉండటంచేత అది కూడా వినలేదు.

**అర్జున ఉవాచ**

**మూ. స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ ।**
**రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి సర్వే నమస్యన్తి చ సిద్ధసంఘాః. 36**

అర్జునుడు అంటున్నాడు –

**తె.అ.** హృషీకేశా! నీ కీర్తనంతో లోకంలో హర్షము అనురాగము పొందడం యుక్తమే. రాక్షసులు భయంతో దిక్కులకు పారిపోతున్నారు. సిద్ధసంఘాలన్నీ నమస్కరిస్తున్నారు.

**భాష్యమ్ : 36.1 స్థానే ఇతి – స్థానే యుక్తమ్. కిం తత్. తవ ప్రకీర్త్యా త్వన్మాహాత్మ్యకీర్తనేన శ్రుతేన, హే! హృషీకేశ! యత్ జగత్ ప్రహృష్యతి, ప్రహర్షమ్ ఉపైతి, తత్ స్థానే యుక్తమ్ ఇత్యర్థః. అథవా విషయవిశేషణం స్థానే ఇతి. యుక్తః హర్షాదివిషయః భగవాన్, యతః ఈశ్వరః సర్వాత్మా సర్వభూతసుహృత్ చ ఇతి. తథా అనురజ్యతే అనురాగం చ ఉపైతి, తచ్చ విషయే ఇతి వ్యాఖ్యేయమ్. కిం చ రక్షాంసి, భీతాని భయావిష్టాని దిశః ద్రవన్తి గచ్ఛన్తి, తచ్చ స్థానే విషయే, సర్వే నమస్యన్తి నమస్కుర్వన్తి చ సిద్ధసంఘాః సిద్ధానాం సముదాయాః కపిలాదీనాం, తచ్చ స్థానే.**

**తె.అ.** హృషీకేశా, కృష్ణా, నీ మాహాత్మ్యమును కీర్తించడం చేత వినడం చేత లోకము ఆనందం పొందుతున్నది. ఆ విధంగా పొందడం యుక్తం. లేక భగవానుడు హర్షాదులను కలిగించడం యుక్తము. ఎందుకంటే ఈశ్వరుడు సర్వాత్ముడు సర్వభూతమిత్రుడు కనుక. లోకం ఆ విధంగా అనురాగం కూడా పొందుతుంది. ఆ అనురాగం పొందవలసిన విషయంలోనే పొందుతున్నది అని వ్యాఖ్యానించాలి. అంతేకాదు రాక్షసులు భీతులై దిక్కులకు పారిపోతున్నారు. కపిలుడు మొదలైన సిద్ధులందరూ నమస్కరిస్తున్నారు కూడా. అది కూడా యుక్తమే.

**భాష్యమ్ : 37.0 భగవతః హర్షాదివిషయత్వే హేతుం దర్శయతి –**

**తె.అ.** భగవానుడు హర్షాదులు కలిగించడానికి కారణం చెపుతున్నాడు.

**మూ. కస్మాచ్చ తే న నమేరన్ మహాత్మన్ గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే ।**
**అనన్త దేవేశ జగన్నివాస త్వమక్షరం సదసత్తత్పరం యత్ ॥ 37**

**తె.అ.** మహాత్మా, బ్రహ్మదేవునికంటె కూడా మొదటి సృష్టికర్తవు ఆయనకంటె గొప్పవాడివైన నీకు వారెందుకు నమస్కరించరాదు? అనంతా, దేవేశా, జగన్నివాసా! నీవు సదసత్తులకు అతీతుడవు, అక్షరుడవు కనుక.

**భాష్యమ్ : 37.1 కస్మాచ్చ హేతోః, తే తుభ్యం న నమేరన్ న నమస్కుర్యుః మహాత్మన్! గరీయసే గురుతరాయ, యతః బ్రహ్మణః హిరణ్యగర్భస్యాపి, ఆదికర్తా కారణమ్, తస్మాత్ ఆదికర్త్రే, కథమ్ ఏతే న నమస్కుర్యుః. అతః హర్షాదీనాం నమస్కారస్య చ స్థానం త్వమ్ అర్హః విషయః ఇత్యర్థః, హే అనన్త! దేవేశ జగన్నివాస! త్వమ్ అక్షరం తత్ పరం యత్ వేదాన్తేషు శ్రూయతే. కిం తత్? సదసత్ ఇతి సత్ విద్యమానమ్. అసచ్చ యత్ నాస్తి ఇతి బుద్ధిః. తే ఉపధానభూతే (ఉపాధిభూతే) సదసతీ యస్య అక్షరస్య, యద్ద్వారేణ సత్ అసత్ ఇతి ఉపచర్యతే. పరమార్థతః తు సదసతః పరం తత్ అక్షరం యత్ వేదవిదః వదన్తి. తత్ త్వమేవ న అన్యత్ ఇత్యభిప్రాయః పునరపి స్తౌతి –**

**తె.అ.** మహాత్మా, నీకు ఎందుకు నమస్కరిస్తారు అంటే మూలకారణమైన హిరణ్యగర్భుని కంటె గొప్పవాడివి కనుక, మూలకారణానికి కారణమైనవాడివి, ఆదికర్తవు కనుక. ఆదికర్తకు వారెందుకు నమస్కరించరు? కనుక హర్షాదులు కలిగించడానికి నమస్కరించబడడానికి నీవు అర్హుడవు అని అర్థం. ఓ అనంతా, దేవేశా, జగన్నివాసా, నీవు అక్షరుడవు, ఉపనిషత్తులయందు చెప్పబడిన పరుడవు; ఏమి చెప్పబడింది? ఉన్నదని లేదని చెప్పడానికి వీలుపడని అక్షరుడు అని. సదసత్తులు అక్షరుని ఉపాధులు. వాటి కారణంగా బ్రహ్మ విషయంలో ఔపచారికంగా సదసత్తులనే శబ్దాలు ప్రయోగింపబడుతున్నాయి. నిజానికి అక్షరుడు సదసత్తులకు అతీతుడు. వేదవేత్తలు అక్షరుడని ఎవరిని అంటున్నారో ఆ అక్షరుడవు నీవేనని అభిప్రాయం. అర్జునుడు ఇంకా స్తుతిస్తున్నాడు.

**మూ. త్వమాదిదేవః పురుషః పురాణ స్త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।**
**వేత్తాఽసి వేద్యం చ పరం చ ధామ త్వయా తతం విశ్వమనన్తరూప ॥ 38**

**తె.అ.** నీవు ఆదిదేవుడవు, పురాణపురుషుడవు, ఈ విశ్వానికి పరమమైన ఆశ్రయం నీవు. తెలివి, తెలియబడదగినది నీవు. నీవు పరంధాముడవు. అనంతరూపాలతో విశ్వమంతా నిండియున్నావు.

**భాష్యమ్ : 38.1 త్వమ్ ఆదిదేవః, జగతః స్రష్టృత్వాత్, పురుషః పురి శయనాత్. పురాణః చిరంతనః త్వమేవ అస్య విశ్వస్య పరం ప్రకృష్టం, నిధానమ్ నిధీయతే అస్మిన్ జగత్ సర్వం మహాప్రలయాదౌ ఇతి. కించ వేత్తా అసి, వేదితా అసి, సర్వస్యైవ వేద్యజాతస్య. యచ్చ వేద్యం వేదనార్హం తచ్చ అసి. పరం చ ధామ పరమం పదం వైష్ణవమ్. త్వయా తతం వ్యాప్తం విశ్వం సమస్తమ్, అనన్తరూప! అన్తః న విద్యతే తవ రూపాణామ్. కించ**

**తె.అ.** నీవు మొదటి దేవుడవు, జగత్తును సృష్టించినవాడవు కనుక (అంటే దేవతలను సృష్టించినవాడవు కూడా) చిరంతనమైన పురుషుడవు; శరీరమనే పురంలో శయనించువాడు

పురుషుడు. నీవు ఈ విశ్వానికి ఉత్తమమైన ఆశ్రయము, మహాప్రళయాదులందు సర్వ జగత్తు ఇతని యందుంటుంది అని. అంతేకాదు, తెలియదగినదంతా తెలిసినవాడవు. తెలియదగినదేది ఉన్నదో అది కూడా నీవే. ఉత్తమమైన వైష్ణవపదం నీవే. సమస్త విశ్వము నీచేత నిండి ఉన్నది. నీ రూపములకు అంతులేదు.

**మూ. వాయుర్యమోఽగ్నిర్వరుణః శశాఙ్కః ప్రజాపతిస్త్వం ప్రపితామహశ్చ ।**
**నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః పునశ్చ భూయోఽపి నమో నమస్తే ॥ 39**

**తె.అ.** వాయువు, యముడు, అగ్ని, వరుణుడు, చంద్రుడు, ప్రజాపతి, బ్రహ్మపిత – వీరందరూ నీవే. నీకు మరల మరల నమస్కారము. వేయిసార్లు నమస్కారము.

**భాష్యమ్ : 39.1 వాయుః త్వం యమశ్చ అగ్నిః, వరుణః అపాంపతిః శశాంకః చన్ద్రమాః ప్రజాపతిః త్వం కశ్యపాదిః, ప్రపితామహః చ పితామహస్యాపి పితా ప్రపితామహః, బ్రహ్మణః అపి పితా ఇత్యర్థః. నమః నమః, తే తుభ్యమ్ అస్తు సహస్రకృత్వః పునః చ భూయః అపి నమః నమః తే. బహుశః నమస్కార క్రియాభ్యాసావృత్తిగణనం కృత్వసుచా ఉచ్యతే, 'పునశ్చ' 'భూయోఽపీ'తి శ్రద్ధాభక్త్యతిశయాత్ అపరితోషమ్ ఆత్మనః దర్శయతి.**

**తె.అ.** వాయువు, యముడు, అగ్ని, జలదేవత అయిన వరుణుడు, చంద్రుడు, కశ్యపుడు మొదలైన ప్రజాపతులు పితామహునికి పిత అనగా బ్రహ్మకు తండ్రివి కూడా. నీకు వేయిసార్లు నమస్కారము. నీకు మరల మరల అనేకమార్లు నమస్కారము. 'కృత్వసుచ్' అనేమాట అనేక పర్యాయాలు నమస్కారం చేయడమనే అభ్యాసం మరల మరల చేయడాన్ని చెపుతుంది. శ్రద్ధాభక్త్యతిశయం వల్ల ఎన్నిమార్లు నమస్కారం చేసినా తనకు సంతుష్టి లేదని తెలుపుతున్నాడు.

**మూ. నమః పురస్తాదథ పృష్ఠతస్తే నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ ।**
**అనన్తవీర్యామితవిక్రమస్త్వం సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః ॥ 40**

**తె.అ.** ఓ సర్వరూపా, నీకు ఎదుట నమస్కారము, వెనుక నమస్కారము, అన్నివైపుల నమస్కారము. నీ బలపరాక్రమములకు అంతులేదు. సమస్తమును నీవు వ్యాపించియున్నావు. కనుకనే నీవు సర్వుడవు.

**భాష్యమ్ : 40.1 నమః పురస్తాత్ పూర్వస్యాం దిశి, తుభ్యమ్ అథ పృష్ఠతః తే పృష్ఠతః అపి చ తే నమః అస్తు. సర్వతః ఏవ సర్వాసు దిక్షు సర్వత్ర స్థితాయ, హే సర్వ! అనన్తవీర్యామితవిక్రమః అనన్తం వీర్యమ్ అస్య, అమితః విక్రమః అస్య, వీర్యం సామర్థ్యమ్, విక్రమః పరాక్రమః. వీర్యవానపి కశ్చిత్ శత్రువధాది విషయే న పరాక్రమతే, మన్దపరాక్రమో వా. త్వం తు అనన్తవీర్యః**

**అమితవిక్రమః చ ఇతి అనన్తవీర్యామితవిక్రమః. సర్వం సమస్తం జగత్ సమాప్నోషి సమ్యక్ ఏకేన ఆత్మనా వ్యాప్నోషి యతః తతః తస్మాత్ అసి భవసి సర్వః. త్వయా వినాభూతం న కించిదస్తీత్యర్థః.**

**తె.అ.** ఓ సర్వరూపా! నీకు తూర్పుదిక్కున వెనుకను నమస్కారము. నీకు అన్నిదిక్కులనుండి కూడా అంతటా ఉన్న నీకు, నమస్కారము. అంతులేని సామర్థ్యము, అమితపరాక్రమము కలవాడవు నీవు. సామర్థ్యం ఉండి కూడా ఒకడు శత్రువధాది విషయంలో పరాక్రమించకపోవచ్చు. లేక మందమైన పరాక్రమం కలవాడుగా ఉండవచ్చును. కాని నీవు అనంతసామర్థ్యము, అమితపరాక్రమము కూడా కలవాడవు. సమస్తజగత్తును వ్యాపించి ఉన్నావు. ఒకే ఆత్మస్వరూపంలో వ్యాపించి ఉన్నావు. కనుక సర్వుడవు. నీవు లేనిదేదియు లేదని అభిప్రాయం.

**భాష్యమ్ : 41.0 యతః అహం త్వాన్మాహాత్మ్యాపరిజ్ఞానాపరాధీ అతః –**

**తె.అ.** నీ మాహాత్మ్యం తెలియక అపరాధం చేసినవాడిని, కనుక –

**మూ. సఖేతి మత్వా ప్రసభం యదుక్తం హే కృష్ణ హే యాదవ హే సఖేతి ।**
**అజానతా మహిమానం తవేదం మయా ప్రమాదాత్ప్రణయేన వాపి ॥ 41**

**తె.అ.** నీ ఈ మాహాత్మ్యం తెలియక సఖుడవునుకొని కృష్ణా, యాదవా, సఖా అని పొరపాటుచే గానీ, స్నేహంచే గాని నిన్ను తక్కువచేసి మాట్లాడాను.

**భాష్యమ్ : 41.1 సఖా సమానవయా : ఇతి మత్వా జ్ఞాత్వా విపరీతబుద్ధ్యా, ప్రసభమ్ అభిభూయ, యత్ ఉక్తం హే కృష్ణ హే యాదవ హే సఖేతి చ అజానతా అజ్ఞానినా, మూఢేన, కిమ్ అజానతా ఇత్యాహ మహిమానం మాహాత్మ్యం తవ ఇదమ్ ఈశ్వరస్య విశ్వరూపం, "తవ ఇదం మహిమానమ్ అజానతా" ఇతి వైయధికరణ్యేన సంబన్ధః. 'తవేమ' మితి పాఠో యద్యస్తి తదా సామానాధికరణ్యమేవ. మయా ప్రమాదాత్ విక్షిప్త చిత్తతయా ప్రణయేన వా అపి ప్రణయః నామ స్నేహనిమిత్తః విస్రమ్భః తేనాపి కారణేన యత్ ఉక్తవానస్మి.**

**తె.అ.** ఈశ్వరుడవైన నీ ఈ మాహాత్మ్యం, విశ్వరూపం, తెలియని మూఢుడనైన నేను నిన్ను సఖుడవని, సమాన వయస్కుడవని విపరీతబుద్ధిచేత తలచి అవమానించి తక్కువచేసి ఓకృష్ణా! ఓ యాదవా! ఓ సఖా! అని చిత్తవిక్షేప కారణంగా కాని స్నేహం కారణంగా కాని ఏది అన్నానో,

**మూ. యచ్చాపహాసార్థమసత్కృతోఽసి విహారశయ్యాసనభోజనేషు ।**
**ఏకోఽథవాప్యచ్యుత తత్సమక్షం తత్ క్షామయే త్వామహమప్రమేయమ్ ॥ 42**

**తె.అ.** విహార, శయ్య, ఆసన, భోజన సమయాలయందు నవ్వులాటగా నిన్ను అవమానించినాను, ఏకాంతంలోనూ, నలుగురి ఎదుటనూ పరిహాసం చేసాను. అందుకు క్షమించమని అప్రమేయుడవైన నిన్ను వేడుకుంటున్నాను.

**భాష్యమ్ : 42.1 యచ్చ అపహాసార్థం పరిహాసప్రయోజనాయ, అసత్కృతః పరిభూతః, అసి భవసి, క్వ? విహారశయ్యాసనభోజనేషు – విహరణం విహారః, పాదవ్యాయామః. శయనం శయ్యా, ఆసనమ్ ఆస్థాయికా, భోజనమ్ అశనమ్, ఇత్యేతేషు విహారశయ్యాసనభోజనేషు, ఏకః పరోక్షః సన్, అసత్కృతః అసి పరిభూతః అసి, అథవాఽపి హే అచ్యుత! తత్ సమక్షమ్, తచ్ఛబ్దః క్రియావిశేషణార్థః ప్రత్యక్షం వా అసత్కృతః అసి, తత్ సర్వమ్ అపరాధజాతం, క్షామయే క్షమాం కారయే, త్వామ్, అహమ్, అప్రమేయం ప్రమాణాతీతమ్. యతః త్వమ్ –**

**తె.అ.** విహార శయ్య ఆసన భోజనసమయాలలో పరోక్షంలో గానీ నలుగురిలో గాని నవ్వులాటకు నిన్ను అవమానించానో ఆ అపరాధాలన్నిటిని ప్రమాణాతీతుడవైన నిన్ను క్షమించమని వేడుకుంటున్నాను, ఎందుకంటే, నీవు –

**మూ. పితాఽసి లోకస్య చరాచరస్య త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్ ।**
**న త్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో లోకత్రయేఽప్యప్రతిమప్రభావ ॥ 43**

**తె.అ.** చరాచరలోకానికి నీవు తండ్రివి, పూజ్యుడవు, గురుడవు, గురుతరుడవు, నీతో సమానమైనవాడు లేడు. నీకంటె అధికుడు ఈ మూడు లోకాలలోను ఎట్లా ఉండగలడు? నిన్ను మించినవాడు మరొకడు లేడు.

**భాష్యమ్ : 43.1 పితా అసి జనయితా అసి, లోకస్య ప్రాణిజాతస్య, చరాచరస్య స్థావరజంగమస్య. న కేవలం త్వమ్ అస్య జగతః పితా, పూజ్యః చ పూజార్హః, యతః గురుః గరీయాన్ గురుతరః . కస్మాద్గురుతరస్త్వమ్ ఇత్యాహ – న చ త్వత్సమః త్వత్తుల్యః అన్యః అస్తి. న హి ఈశ్వరద్వయం సంభవతి, అనేకేశ్వరత్వే వ్యవహారానుపపత్తేః. త్వత్సమః ఏవ తావత్ అన్యః న సంభవతి, కుతః ఏవ అన్యః అభ్యధికః స్యాత్? లోకత్రయేఽపి అప్రతిమప్రభావ – ప్రతిమీయతే యయా సా ప్రతిమా, న విద్యతే ప్రతిమా యస్య తవ ప్రభావస్య సః త్వమ్ అప్రతిమప్రభావః హే! అప్రతిమప్రభావ నిరతిశయప్రభావ ఇత్యర్థః.**

**తె.అ.** నీవు స్థావరజంగమాత్మకమైన లోకానికి తండ్రివి. తండ్రివి మాత్రమే గాదు. నీవు ఈ లోకానికి పూజింపదగినవాడవు కూడ. ఎందుకంటే, గురుడవు, గురుతరుడవు. ఎందుకు గురుతరుడవంటే చెపుతున్నాడు. నీతో సమానమైనవాడు మరొకడు లేడు. ఇద్దరు ఈశ్వరులుండడం

అసంభవం. ఒకరి కంటె ఎక్కువ ఈశ్వరులున్నట్లయితే వ్యవహారం నడవదు. నీతో సమానమైనవాడే మరొకడు లేనపుడు మూడులోకాలలో అంతటా కూడా నీకంటె అధికుడు మరొకడు ఎట్లా ఉండగలడు? నీ ప్రభావాన్ని కొలవగల సాధనం లేదు. కనుక నీవు అప్రతిమప్రభావుడవు, నిరతిశయ ప్రభావుడవు అని అర్థం. దేనితో మరొక వస్తువును పోల్చి కొలత చూస్తామో అది ప్రతిమ. అటువంటిది లేకపోవడం అప్రతిమం.

**మూ. తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం ప్రసాదయే త్వామహమీశమీడ్యమ్ ।**
**పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్ ॥ 44**

**తె.అ.** కనుక దేవా! నమస్కరించి సాష్టాంగపడి, స్తుతింపదగినవాడవు అయిన నిన్ను ప్రసన్నుడవు కమ్ము అని ప్రార్థిస్తున్నాను. పుత్రుని తండ్రివలె, సఖుని సఖునివలె, ప్రియురాలిని ప్రియునివలె నన్ను నా అపరాధములు మన్నించు..

**భాష్యమ్ : 44.1 తస్మాత్, ప్రణమ్య నమస్కృత్య, ప్రణిధాయ ప్రకర్షేణ నీచైః ధృత్వా, కాయం శరీరమ్, ప్రసాదయే ప్రసాదం కారయే, త్వామ్, అహమ్, ఈశితారం, ఈడ్యం స్తుత్యమ్, త్వం పునః పుత్రస్య అపరాధం పితా యథా క్షమతే సర్వం, సఖేవ చ సఖ్యుః అపరాధం, యథా వా ప్రియః ప్రియాయాః అపరాధం క్షమతే ఏవమ్ అర్హసి, హే! దేవ! సోఢుం ప్రసహితుం, క్షన్తుమ్ ఇత్యర్థః.**

**తె.అ.** కనుక నమస్కరించి శరీరాన్ని సాష్టాంగపరచి ఈశ్వరుడవు, స్తుతింపదగినవాడవు అయిన నిన్ను ప్రసన్నుడవు కమ్ము అని ప్రార్థిస్తున్నాను. పుత్రుని తండ్రివలె, సఖ్యుని సఖునివలె ప్రియురాలిని ప్రియునివలె దేవదేవా క్షమించదగును.

**మూ. అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా భయేన చ ప్రవ్యథితం మనో మే ।**
**తదేవ మే దర్శయ దేవ రూపం ప్రసీద దేవేశ జగన్నివాస ॥ 45**

**తె.అ.** పూర్వమెన్నడు చూడనిది చూచి ఆనందం పొందుతున్నాను. మనస్సులో భయంకూడా కలుగుతున్నది. ఓ దేవదేవా! జగన్నివాసా! ప్రసన్నుడవు కమ్ము. నీ పూర్వపురూపమే నాకు చూపించుము.

**భాష్యమ్ : 45.1 అదృష్టపూర్వమితి :- అదృష్టపూర్వం న కదాచిదపి దృష్టపూర్వమ్ ఇదం విశ్వరూపం తవ మయా అన్యైర్వా తదహం దృష్ట్వా, హృషితః, అస్మి. భయేన చ ప్రవ్యథితం మనః మే, అతః తదేవ మే మమ, దర్శయ, హే దేవ! రూపం యత్ మత్సఖమ్, ప్రసీద దేవేశ, జగన్నివాస జగతః నివాసః జగన్నివాసః, హే జగన్నివాస.**

**తె.అ.** నేనుగాని వేరెవరుగాని పూర్వమెన్నడూ చూడని నీ ఈ విశ్వరూపం చూచి ఆనందం పొందుతున్నాను. నా మనస్సు భయంచేత బాధనొందుతున్నది. కనుక ఆ పూర్వపురూపమే అనగా సఖునిరూపం నాకు చూపించు. ఓ దేవా ప్రసన్నుడవు కమ్ము. ఓ దేవదేవా, జగన్నివాసా, జగత్తుకు నివాసమైన వాడా.

**మూ. కిరీటినం గదినం చక్రహస్తమిచ్ఛామి త్వాం ద్రష్టుమహం తథైవ ।**
**తేనైవ రూపేణ చతుర్భుజేన సహస్రబాహో భవ విశ్వమూర్తే ॥ 46**

**తె.అ.** నిన్ను కిరీటంతో, గదతో, చేత చక్రంతో వెనుకటివలె చూడగోరుతున్నాను. ఓ సహస్రబాహూ, విశ్వమూర్తీ, పూర్వపు నీ చతుర్భుజరూపంతోనే ఉండు.

**భాష్యమ్ : 46.1 కిరీటినమితి :- కిరీటినం కిరీటవన్తం, తథా గదినం గదావన్తం, చక్రహస్తమ్ ఇచ్ఛామి త్వాం ప్రార్థయే త్వాం ద్రష్టుమ్ అహం, తథైవ పూర్వవత్ ఇత్యర్థః. యతః ఏవం తస్మాత్, తేనైవ రూపేణ వసుదేవపుత్రరూపేణ, చతుర్భుజేన, సహస్రబాహో వార్తమానికేన విశ్వరూపేణ, భవ, విశ్వమూర్తే! ఉపసంహృత్య విశ్వరూపం తేనైవ రూపేణ వసుదేవపుత్రరూపేణ భవ ఇత్యర్థః.**

**తె.అ.** నిన్ను కిరీటంతో, గదతో, చేతిలో చక్రంతో అట్లాగే పూర్వంవలెనే నేను చూడగోరుతున్నాను. కనుక వేలచేతులు గలిగిన నీ ఈ విశ్వరూపాన్ని ఉపసంహరించి ఆ పూర్వపు వసుదేవపుత్రుని రూపాన్ని నాలుగు చేతులుగల రూపాన్ని పొందు.

**భాష్యమ్ : 47.0 అర్జునం భీతమ్ ఉపలభ్య ఉపసంహృత్య విశ్వరూపం ప్రియవచనేన ఆశ్వాసయన్ -**

**తె.అ.** అర్జునుడు భయపడడం చూసి విశ్వరూపాన్ని ఉపసంహరించి ప్రియమైన మాటలతో ధైర్యం కలిగిస్తూ ,

**శ్రీభగవానువాచ-**

**మూ. మయా ప్రసన్నేన తవార్జునేదం రూపం పరం దర్శితమాత్మయోగాత్ ।**
**తేజోమయం విశ్వమనన్తమాద్యం యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్ ॥ 47**

శ్రీ భగవానుడు అంటున్నాడు -

**తె.అ.** ఓ అర్జునా! ప్రసన్నుడనైన నేను నీకు మునుపెవ్వరు చూడని తేజోమయము, విశ్వము, అనంతము, ఆద్యము, పరమము అయిన నా రూపం ఆత్మయోగం చేత చూపించాను.

**భాష్యమ్ : 47.1 మయా ప్రసన్నేన, ప్రసాదః నామ త్వయి అనుగ్రహబుద్ధిః, తద్వతా ప్రసన్నేన మయా తవ హే! అర్జున! పరం రూపం విశ్వరూపం, దర్శితమ్ ఆత్మయోగాత్ ఆత్మనః ఐశ్వర్యస్య సామర్థ్యాత్, తేజోమయం తేజఃప్రాయం, విశ్వం సమస్తమ్, అనన్తమ్ అన్తరహితమ్, ఆదౌ భవమ్ ఆద్యమ్, యద్రూపం, మే మమ త్వదన్యేన త్వత్తః అన్యేన కేనచిత్ న దృష్టపూర్వమ్.**

**తె.అ.** ఓ అర్జునా, నిన్ను అనుగ్రహించాలనే బుద్ధిచేత నా యీ తేజోమయము, సమస్తము, అనంతము, ఆద్యము అయిన విశ్వరూపం నీకు ఐశ్వర్యసామర్థ్యము చేత చూపించాను. దానిని నీవు తప్ప వేరెవరూ పూర్వం చూచియుండలేదు.

**భాష్యమ్ : 48.0 ఆత్మనః మమ రూపదర్శనేన కృతార్థః ఏవ త్వం సంవృత్తః ఇతి తత్ స్తౌతి–**

**తె.అ.** 'నా ఈ ఆత్మరూపం చూచిన నీవు కృతార్థుడవు' అని ఆ రూపాన్ని స్తుతిస్తున్నాడు.

**మూ. న వేదయజ్ఞాధ్యయనైర్నదానైర్న చ క్రియాభిర్నతపోభిరుగ్రైః ।**
**ఏవంరూపః శక్య అహం నృలోకే ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర ॥ 48**

**తె.అ.** ఓ కురువీరా! వేదములచేగాని, యజ్ఞములచేగాని, అధ్యయనంచే గాని, దానములచేగాని, కర్మలచేగాని, ఉగ్రతపములచేగాని నన్ను ఈ రూపంలో చూడడం నీకు తప్ప మరొకరికి మానవలోకంలో శక్యం కాదు.

**భాష్యమ్ : 48.1 న వేదయజ్ఞాధ్యయనైః న చతుర్ణామపి వేదానామ్ అధ్యయనైః యథావత్ యజ్ఞాధ్యయనైశ్చ. వేదాధ్యయనైరేవ యజ్ఞాధ్యయనస్య సిద్ధత్వాత్ పృథక్ యజ్ఞాధ్యయనగ్రహణం యజ్ఞవిజ్ఞానోపలక్షణార్థమ్. తథా న దానైః తులాపురుషాదిభిః, న చ, క్రియాభిః అగ్నిహోత్రాదిభిః శ్రౌతాదిభిః, నాపి తపోభిః, ఉగ్రైః చాన్ద్రాయణాదిభిః ఉగ్రైః ఘోరైః, ఏవంరూపః యథాదర్శితం విశ్వరూపం యస్య సః అహమ్ ఏవంరూపః, న శక్యః అహం, నృలోకే మనుష్యలోకే, ద్రష్టుం త్వదన్యేన త్వత్తః అన్యేన కురుప్రవీర.**

**తె.అ.** నాలుగు వేదాలను యజ్ఞాలను సరిగా అధ్యయనం చేయడం చేత – వేదాధ్యయనమంటే యజ్ఞాధ్యయనం కూడా అని అర్థం. అయినప్పటికి యజ్ఞాధ్యయనమని వేరుగా చెప్పడం యజ్ఞాల గురించిన విశేషజ్ఞానం చెప్పడం కొరకు –, అట్లాగే నిలువెత్తు బంగారం దానం చేయడం వంటి దానాలచేతగాని, అగ్నిహోత్రాది శ్రౌతకర్మల చేతగాని, చాంద్రాయణాది ఘోరతపములచేగాని ఇప్పుడు నీవు చూసిన విశ్వరూపం గల నన్ను భూలోకంలో నీవు తప్ప మరొకరికి చూడ శక్యం కానిది.

**మూ. మా తే వ్యథా చ విమూఢభావో దృష్ట్వా రూపం ఘోరమీదృక్ మమేదమ్ ।**
**వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం తదేవ మే రూపమిదం ప్రపశ్య ॥ 49**

**తె.అ.** ఈ విధమైన ఈ నా ఘోరరూపం చూచి నీవు భయపడవద్దు. మోహం చెందవద్దు. భయం వదలి మనఃప్రీతితో నీవు మళ్ళీ ఆ రూపాన్నే ఇదిగో చూడు.

**భాష్యమ్ : 49.1 మా తే వ్యథేతి – మా తే వ్యథా – మా భూత్ తే భయమ్, మా చ విమూఢభావః విమూఢచిత్తతా, దృష్ట్వా ఉపలభ్య, రూపం ఘోరమ్ ఈదృక్ యథాదర్శితం మమ ఇదం. వ్యపేతభీః విగతభయః ప్రీతమనాః చ సన్ పునః భూయః త్వం తదేవ చతుర్భుజం శఙ్ఖచక్రగదాధరం తవ ఇష్టం రూపమ్ ఇదం ప్రపశ్య.**

**తె.అ.** ఇప్పుడు చూపిన నా ఈ ఘోరరూపం చూచి నీవు భయపడవద్దు. మోహం కూడా చెందవద్దు. భయం వదలి మనఃప్రీతితో మళ్ళీ నీవు నీకిష్టమైన శంఖము, చక్రము, గద ధరించిన నా ఈ చతుర్భుజరూపం చూడు.

**సంజయ ఉవాచ**

**మూ. ఇత్యర్జునం వాసుదేవస్తథోక్త్వా స్వకం రూపం దర్శయామాస భూయః ।**
**ఆశ్వాసయామాస చ భీతమేనం భూత్వా పునః సౌమ్యవపుర్మహాత్మా ॥ 50**

సంజయుడు అంటున్నాడు.

**తె.అ.** ఈ విధంగా అర్జునుడితో అని, వాసుదేవుడు మళ్ళీ తన స్వరూపాన్ని చూపించాడు. ఆ మహాత్ముడు మళ్ళీ సౌమ్యదేహం ధరించి; భయపడిన అర్జునునికి ధైర్యం కలిగించాడు.

**భాష్యమ్ : 50.1 ఇత్యర్జునమితి – ఇతి ఏవమ్, అర్జునం వాసుదేవః తథాభూతాం వచనమ్ ఉక్త్వా, స్వకం వసుదేవ గృహే జాతం రూపం, దర్శయామాస దర్శితవాన్ భూయః పునః ఆశ్వాసయామాస చ ఆశ్వాసితవాన్ చ, భీతమ్ ఏనం భూత్వా పునః సౌమ్యవపుః ప్రసన్నదేహః మహాత్మా.**

**తె.అ.** అని ఈ విధంగా అర్జునునితో పలికి కృష్ణుడు మళ్ళీ వసుదేవునింట పుట్టిన తన రూపాన్ని చూపించాడు. మహాత్ముడైన కృష్ణుడు మళ్ళీ ప్రసన్నదేహుడై; భయపడిన అర్జునునికి ధైర్యం కలిగించాడు.

**అర్జున ఉవాచ**

**మూ. దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన ।**
**ఇదానీమస్మి సంవృత్తః సచేతాః ప్రకృతిం గతః ॥ 51**

అర్జునుడు అంటున్నాడు

**తె.అ.** ఓ జనార్దనా, సౌమ్యమైన నీ ఈ మానుషరూపం చూచి మనశ్శాంతిని పొందాను, యథాస్థితికి వచ్చాను.

**భాష్యమ్ : 51.1 దృష్ట్వేదమితి – దృష్ట్వా ఇదం మానుషం రూపం మత్సఖం ప్రసన్నం తవ సౌమ్యం జనార్దన, ఇదానీమ్ అధునా, అస్మి సంవృత్తః సంజాతః, కిమ్? సచేతాః ప్రసన్నచిత్తః ప్రకృతిం స్వభావం గతశ్చ అస్మి.**

**తె.అ.** ఓ జనార్దనా! ఈ నీ మానుషరూపం, నా సఖుని ప్రసన్నరూపం చూచి ఇప్పుడు ప్రసన్నచిత్తుడనైనాను, యథాస్థితికి వచ్చాను.

**శ్రీ భగవానువాచ**

**మూ. సుదుర్దర్శమిదం రూపం దృష్టవానసి యన్మమ ।**
**దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శినకాఙ్క్షిణః ॥ 52**

శ్రీ భగవానుడంటున్నాడు.

**తె.అ.** నీవు చూసిన నా రూపం చాలా దుర్లభమైనది. దేవతలు సైతం నిత్యము ఈ రూపం చూడవలెనని కోరుకుంటారు.

**భాష్యమ్ : 52.1 సుదుర్దర్శమితి – సుదుర్దర్శం సుష్ఠు దుఃఖేన దర్శనమ్ అస్య ఇతి సుదుర్దర్శమ్, ఇదం రూపం దృష్టవాన్ అసి యత్, మమ దేవాః అపి, అస్య మమ రూపస్య నిత్యం సర్వదా దర్శనకాంక్షిణః దర్శనేప్సవః అపి న త్వమివ దృష్టవన్తః న ద్రక్ష్యన్తి చ ఇత్యభిప్రాయః. కస్మాత్ –**

**తె.అ.** చూడడం కష్టసాధ్యమైన ఈ నా రూపం, నీవు చూచినది, దేవతలు సైతం సర్వదా చూడగోరుతారు. అయినప్పటికి నీ వలె వారు చూడలేదు. చూడబోరు కూడా అని నా అభిప్రాయం. ఎందుకని?

**మూ. నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా ।**
**శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా ॥ 53**

**తె.అ.** నీవు నన్ను చూచినట్లు చూడడం వేదాల వల్ల గాని, తపస్సు చేతగాని, దానంచేత గాని, యజ్ఞం వల్ల గాని సాధ్యం కాదు.

**భాష్యమ్ : 53.1 న అహం వేదైః ఋగ్యజుఃసామాథర్వవేదైః చతుర్భిరపి, న తపసా ఉగ్రేణ చాన్ద్రాయణాదినా, న దానేన గోభూహిరణ్యాదినా, న చ ఇజ్యయా యజ్ఞేన పూజయా వా శక్యః, ఏవంవిధః యథాదర్శితప్రకారః ద్రష్టుం దృష్టవానసి మాం యథా త్వమ్.**

**తె.అ.** నన్ను ఏ విధంగా నీవు చూచావో, ఇప్పుడు చూపిన ఈ రూపంలో నేను ఋగ్యజుస్సామాథర్వములనే నాలుగు వేదాలచేతగాని, గో, భూ హిరణ్యాది, దానాలచేత గాని యజ్ఞం చేత లేక పూజ చేతగాని చూడ సాధ్యము కాను.

**భాష్యమ్ : 54.0 కథం పునః శక్యః ఇతి? ఉచ్యతే**

**తె.అ.** మరి ఏ విధంగా సాధ్యము? అంటే -

**మూ. భక్త్యా త్వనన్యయా శక్యః అహమేవం విధోఽర్జున ।**
**జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప ॥ 54**

**తె.అ.** అర్జునా! ఈ విధమైన నా రూపం గురించి తెలియడం, దర్శించడం, నాలో ప్రవేశించడం, అనన్యభక్తివల్లనే సాధ్యము.

**భాష్యమ్ : 54.1 భక్త్యా తు, కిం విశిష్టయా ఇత్యాహ అనన్యయా అపృథగ్భూతయా, భగవతః అన్యత్ర పృథక్ న కదాచిదపి (యా) భవతి (సా తు అనన్యా భక్తిః). సర్వైః అపి కరణైః వాసుదేవాత్ అన్యత్ న ఉపలభ్యతే యయా సా అనన్యా భక్తిః తయా భక్త్యా శక్యః అహమ్, ఏవంవిధః విశ్వరూపప్రకారః, హే అర్జున, జ్ఞాతుం శాస్త్రతః, న కేవలం జ్ఞాతుం శాస్త్రతః ద్రష్టుం చ సాక్షాత్కర్తుం తత్త్వతః తత్త్వేన ప్రవేష్టుం చ మోక్షం చ గన్తుం పరంతప.**

**తె.అ.** ఓ అర్జునా, ఈ విశ్వరూపంలో తెలుసుకోవడానికి, కేవలం శాస్త్రాల ద్వారా తెలుసుకోవడమే గాదు, వాస్తవంగా సాక్షాత్కరించుకోడానికి, ప్రవేశించడానికి అంటే మోక్షం పొందడానికి, నేను అనన్యభక్తిచేత సాధ్యమవుతాను. అనన్యభక్తి అంటే భగవంతుడు తప్ప భిన్నమైనది లేనిది. సమస్త ఇంద్రియాల ద్వారా వాసుదేవుని కంటె దేనిచేత తెలియబడునది ఏదీ లేనిది.

**భాష్యమ్ : 55.0 అథునా సర్వస్య గీతాశాస్త్రస్య సారభూతః అర్థః నిఃశ్రేయసార్థః, అనుష్ఠేయత్వేన సముచ్చిత్య ఉచ్యతే -**

**తె.అ.** ఇప్పుడు సమస్త గీతాశాస్త్రం యొక్క సారభూతమైన అర్థాన్ని మోక్షప్రయోజన మైనదాన్ని అనుష్ఠానం కొరకు క్లుప్తంగా చెపుతున్నాడు –

**మూ. మత్కర్మకృన్మత్పరమో మద్భక్తః సంగవర్జితః ।**
**నిర్వైరః సర్వభూతేషు యః స మామేతి పాండవ ॥ 55**

**తె.అ.** అర్జునా, అత్యాసక్తిని విడిచి, సర్వప్రాణుల ఎడల ద్వేషములేక, నా కొరకు కర్మలను ఆచరిస్తూ, నన్నే పరమగతి అని, తలచి నా భక్తుడైనవాడు నన్నే పొందుతాడు.

**ఇతి శ్రీ మహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే విశ్వరూపదర్శనయోగో నామ ఏకాదశోఽధ్యాయః.**

ఇది వ్యాసభగవానుని శతసహస్ర సంహిత అయిన శ్రీమహాభారతంలో భీష్మపర్వంలో ఉపనిషత్తులు బ్రహ్మవిద్య యోగశాస్త్రము శ్రీకృష్ణార్జునసంవాదము అయిన భగవద్గీతలయందు విశ్వరూపదర్శనయోగం అనే పదకొండవ అధ్యాయానికి తెలుగు అనువాదం.

**భాష్యమ్ : 55.1. మత్కర్మకృత్ – మదర్థం కర్మ మత్కర్మ. తత్ కరోతీతి మత్కర్మకృత్ మత్పరమః – కరోతి భృత్యః స్వామికర్మ, న తు ఆత్మనః పరమా ప్రేత్య గన్తవ్యా గతిః ఇతి స్వామినం ప్రతిపద్యతే. అయం తు మత్కర్మకృత్ మామేవ పరమాం గతిం ప్రతిపద్యతే ఇతి మత్పరమః, అహం పరమః పరా గతిః యస్య సః అయమ్ మత్పరమః తథా, మద్భక్తః మామేవ సర్వప్రకారైః సర్వాత్మనా సర్వోత్సాహేన భజతే ఇతి మద్భక్తః. సంగవర్జితః ధనపుత్రమిత్రకలత్రబన్ధువర్గేషు సంగవర్జితః సంగః ప్రీతిః స్నేహః, తద్వర్జితః, నిర్వైరః నిర్గతవైరః సర్వభూతేషు శత్రు భావరహితః ఆత్మనః అత్యన్తాపకారప్రవృత్తేష్వపి, యః ఈదృశః మద్భక్తః, సః మామ్ ఏతి, అహమేవ తస్య పరా గతిః, న అన్యా గతిః కాచిత్ భవతి. అయం తవ ఉపదేశః ఇష్టః మయా ఉపదిష్టః, హే! పాణ్డవ! ఇతి.**

**తె.అ.** ఓ అర్జునా, ధనపుత్రమిత్ర కళత్ర బంధువర్గమందు ప్రీతి విడిచినవాడు, తనకు అత్యంతము అపకారం చేయబూనిన వారియందు సైతము శత్రుభావం లేనివాడు, నా కొరకు కర్మచేయువాడు నేనే పరమగమ్యంగా – తాను చనిపోయినతరువాత చేరవలసిన గమ్యంగా, స్వామి పనులు సేవకుడు చేస్తాడు కాని పరమగమ్యంగా చేయడు – ఆశ్రయించేవాడు, సర్వవిధాలా సర్వాత్మభావంతో, సర్వోత్సాహంతో నన్నే భజించేవాడు నా భక్తుడు నన్నే చేరుకుంటాడు. నేనే అతనికి పరమగతిని. ఇది నీకు నా ఉపదేశం, నీవు కోరింది.

**ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యగోవింద భగవత్పూజ్య పాద శిష్య శ్రీమచ్ఛంకరభగవతః కృతౌ శ్రీమద్భగవద్గీతాభాష్యే విశ్వరూపదర్శనం యోగో నామ ఏకాదశోఽధ్యాయః**

ఇది శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య గోవిందభగవత్పూజ్యపాద శిష్యులు శ్రీమత్ శంకర భగవత్పాదులు రచించిన శ్రీమద్భగవద్గీతా భాష్యంలో విశ్వరూపదర్శనయోగమనే పదకొండవ అధ్యాయానికి తెలుగు అనువాదం.



# ద్వాదశోఽధ్యాయః

# భక్తియోగః

**భాష్యమ్ : 1.0 ద్వితీయ ప్రభృతిషు అధ్యాయేషు విభూత్యన్తేషు పరమాత్మనః బ్రహ్మణః అక్షరస్య విధ్వస్తసర్వఉపాధివిశేషస్య ఉపాసనమ్ ఉక్తమ్. సర్వయోగైశ్వర్య సర్వజ్ఞానశక్తిమత్సత్త్వోపాధేః ఈశ్వరస్య తవ చ ఉపాసనం తత్ర తత్ర ఉక్తమ్. విశ్వరూపాధ్యాయే తు ఐశ్వరమ్ ఆద్యం సమస్త- జగదాత్మరూపం విశ్వరూపం త్వదీయం దర్శితమ్ ఉపాసనార్థమేవ త్వయా. తచ్చ దర్శయిత్వా ఉక్తవానసి "మత్కర్మకృత్" ఇత్యాది. అతః అహమ్ అనయోః ఉభయోః పక్షయోః విశిష్టతరబుభుత్సయా త్వాం పృచ్ఛామి ఇతి –**

**తె.అ.** రెండవ అధ్యాయం నుండి విభూతియోగమనే పదవ అధ్యాయం వరకు అన్నివిధాలైన ఉపాధులు తొలగిన అక్షర పరబ్రహ్మ ఉపాసనం చెప్పబడింది. సర్వయోగైశ్వర్యము సర్వజ్ఞానశక్తి కలిగిన సత్త్వగుణరూప ఉపాధితోటి ఈశ్వరుని ఉపాసన కూడా అక్కడక్కడా ఆ అధ్యాయాల్లో చెప్పబడింది. విశ్వరూప అధ్యాయంలో ఐశ్వరము. ఆద్యము సమస్తజగదాత్మరూపము అయిన నీ విశ్వరూపం ఉపాసన కొరకే చూపావు. ఆ విశ్వరూపం చూపి 'మత్కర్మకృత్' (11.55) మొదలైన మాటలు చెప్పావు. కనుక ఈ రెంటిలో సోపాధిక నిరుపాధికములలో, సగుణ నిర్గుణములలో ఏది శ్రేష్ఠతరమో తెలుసుకోవలెననే కోరికతో అడుగుతున్నాను –

**అర్జున ఉవాచ**

**మూ. ఏవం సతతయుక్తా యే భక్తాస్త్వాం పర్యుపాసతే ।**
**యే చాప్యక్షరమవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః ॥ 1**

అర్జునుడు అంటున్నాడు –

**తె.అ.** ఈ విధంగా సతతయుక్తు లై నిన్నుపాసించే భక్తులు, ఇంద్రియగోచరం కాని అక్షర పరబ్రహ్మను ఉపాసించేవారు – వీరిద్దరిలో యోగం ఎక్కువ తెలిసినవారెవరు?

**భాష్యమ్ : 1.1 ఏవమితి అతీతానన్తర శ్లోకేన ఉక్తమ్ అర్థం పరామృశతి "మత్కర్మకృత్" (11.55) ఇత్యాదినా. ఏవం సతతయుక్తాః నైరన్తర్యేణ భగవత్కర్మాదౌ యథోక్తేఽర్థే సమాహితాః సన్తః ప్రవృత్తా ఇత్యర్థః. యే భక్తాః అనన్యశరణాః సన్తః త్వాం యథాదర్శితం విశ్వరూపం**

**పర్యుపాసతే ధ్యాయన్తి, తే, యే చాన్యేఽపి త్యక్తసర్వైషణాః సంన్యస్తసర్వకర్మాణః యథావిశేషితం బ్రహ్మ అక్షరం నిరస్తసర్వోపాధిత్వాత్ అవ్యక్తమ్ అకరణగోచరం, యత్ హి లోకే కరణగోచరం తత్ వ్యక్తమ్ ఉచ్యతే. అఞ్జేః ధాతోః తత్కర్మకత్వాత్, ఇదం తు అక్షరం తద్విపరీతం, శిష్టైశ్చ ఉచ్యమానైః విశేషణైః విశిష్టం తత్ యే చాపి పర్యుపాసతే తేషామ్ ఉభయేషాం మధ్యే కే యోగవిత్తమాః, కే అతిశయేన యోగవిదః ఇత్యర్థః.**

**తె.అ.** 'ఈ విధంగా' అంటే వెనుకటి శ్లోకంలో 'మత్కర్మకృత్' (11.55) చెప్పిన విధంగా అని. అందులో చెప్పిన విధంగా నిరంతరము భగవత్కర్మాదులయందు మనసు లగ్నం చేసి ప్రవర్తించేవారు సతతయుక్తులు. ఈ భక్తులు అనన్యశరణులై ఇప్పుడు చూపిన విశ్వరూపాన్ని ఉపాసిస్తారు. మరికొందరు అన్ని కోర్కెలను వదలి అన్ని కర్మలను సన్యసించినవారు (జ్ఞానులు). వీరు పూర్వం వర్ణించబడిన అవ్యక్త అక్షర పరబ్రహ్మాన్ని ఉపాసిస్తారు. ఉపాధులు తొలగినది కనుక అది ఇంద్రియాలకు అందనిది. అందుకే అవ్యక్తం. ఇంద్రియాల ద్వారా తెలుసుకోగలిగిన విషయాన్నే వ్యక్తం అని లోకంలో అంటాం. 'అఞ్జ్' అనే ధాతువుకు ఇంద్రియగోచరం కావడం అని అర్థం. అట్లా కాక ఇంద్రియగోచరం కానిది ఈ అక్షరం. ఈ విధంగా శిష్టులు చెప్పిన విశేషణాలు గలిగిన బ్రహ్మాన్ని ఉపాసన చేసేవారున్నారు. ఈ ఇద్దరిలో యోగవిత్తములెవరు? యోగం ఎక్కువగా తెలిసినవారెవరు అని అర్థం.

**శ్రీభగవానువాచ –**

**భాష్యమ్ : 2.0 యే త్వక్షరోపాసకాః సమ్యగ్దర్శినః నివృత్తైషణాః తే తావత్తిష్ఠన్తు. తాన్ ప్రతి యద్వక్తవ్యం తదుపరిష్టాత్ వక్ష్యామః (12.20). యే తు ఇతరే –**

శ్రీ భగవానుడు అంటున్నాడు –

**తె.అ.** కోర్కెలు వదలి సమ్యగ్దర్శనులైన అక్షరోపాసకులను అటుండనిద్దాం. వారి గురించి చెప్పవలసినది తరువాత (12.20) చెప్పుకుందాము. ఇతరుల విషయం.

**మూ. మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే ।**
**శ్రద్ధయా పరయోపేతాస్తే మే యుక్తతమా మతాః ॥ 2**

**తె.అ.** మనసు నాయందు నిలిపి నిత్యయుక్తులై పరమశ్రద్ధతో నన్నుపాసించేవారు మిక్కిలి యోగ్యులని నేననుకుంటాను.

**భాష్యమ్ : 2.1 మయి విశ్వరూపే పరమేశ్వరే, ఆవేశ్య సమాధాయ, మనః యే భక్తాః సన్తః మాం సర్వయోగేశ్వరాణామ్ అధీశ్వరం సర్వజ్ఞం, విముక్తరాగాదిక్లేశతిమిరదృష్టిం నిత్యయుక్తాః**

**అతీతానన్తరాధ్యాయాన్తే ఉక్తశ్లోకార్థన్యాయేన సతతయుక్తాః సన్తః ఉపాసతే, శ్రద్ధయా పరయా ప్రకృష్టయా ఉపేతాః యే, తే మే మమ యుక్తతమాః మతాః అభిప్రేతాః యుక్తతమాః ఇతి. నైరన్తర్యేణ హి తే మచ్చిత్తతయా అహోరాత్రమ్ అతివాహయన్తి, అతః యుక్తం తాన్ ప్రతి యుక్తతమాః ఇతి వక్తుమ్.**

**తె.అ.** నాయందు, అంటే విశ్వరూపుడనైన పరమేశ్వరునియందు, మనసును ఏకాగ్రం చేసి సర్వయోగేశ్వరులకు అధీశ్వరుడనై రాగము మొదలుగా గల పంచక్లేశముల వలన గలుగు అజ్ఞానదృష్టి తొలగి సర్వజ్ఞుడనైన నన్ను వెనుకటి అధ్యాయంలోని చివరి శ్లోకంలో చెప్పిన విధంగా పరమశ్రద్ధతో సతతయుక్తులై ఉపాసించేవారు యోగులలో శ్రేష్ఠులని నా అభిప్రాయం. వారు నా యందు మనసు లగ్నం చేసి అహోరాత్రాలు గడుపుతారు. కనుక వారు యుక్తతములు అనడం యుక్తమే.

**భాష్యమ్ : 3.0 కిం ఇతరే యుక్తతమాః న భవన్తి? న, కిన్తు తాన్ ప్రతి యత్ వక్తవ్యం తత్ శృణు –**

**తె.అ.** మరి, తక్కినవారు యుక్తతములు కారా? కారనికాదు, వారి విషయంలో చెప్పవలసినది చెపుతాను, విను –

**మూ. యే త్వక్షరమనిర్దేశ్యమవ్యక్తం పర్యుపాసతే ।**
**సర్వత్రగమచింత్యం చ కూటస్థమచలం ధ్రువమ్ ॥ 3**

**మూ. సంనియమ్యేన్ద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః,**
**తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితే రతాః. 4**

**తె.అ.** ఇంద్రియాలను నియమించి సర్వత్ర సమబుద్ధి కలిగి సర్వప్రాణులకు మేలు చేస్తూ అనిర్దేశ్యము, అవ్యక్తము, సర్వవ్యాపకము, అచింత్యము, కూటస్థము, అచలము, ధ్రువమును అయిన అక్షరమును ఉపాసించేవారు నన్నే పొందుదురు.

**భాష్యమ్ : 3.1 యే తు అక్షరమ్, అనిర్దేశ్యమ్ అవ్యక్తత్వాత్ అశబ్దగోచరమ్ ఇతి న నిర్దేష్టుం శక్యతే, అతః అనిర్దేశ్యమ్, అవ్యక్తం న కేనాపి ప్రమాణేన వ్యజ్యతే ఇతి అవ్యక్తమ్, పర్యుపాసతే పరి సమన్తాత్ ఉపాసతే, ఉపాసనం నామ యథాశాస్త్రమ్ ఉపాస్యస్య అర్థస్య విషయీకరణేన, సామీప్యమ్ ఉపగమ్య తైలధారావత్ సమానప్రత్యయప్రవాహేణ దీర్ఘకాలం యత్ ఆసనం తత్ ఉపాసనమ్ ఆచక్షతే. అక్షరస్య విశేషణమ్ ఆహ ఉపాస్యస్య సర్వత్రగం వ్యోమవత్ వ్యాపి, అచిన్త్యం చ అవ్యక్తత్వాత్ అచిన్త్యమ్. యత్ హి కరణగోచరం తత్ మనసాఽపి చిన్త్యం,**

**తద్విపరీతత్వాత్ అచిన్త్యమ్ అక్షరమ్ కూటస్థమ్ – దృశ్యమానగుణకమ్ అన్తర్దోషం వస్తుకూటం, కూటరూపకం కూటసాక్ష్యమ్ ఇత్యాదౌ కూటశబ్దః ప్రసిద్ధో లోకే. తథా చ అవిద్యాద్యనేకసంసారబీజమ్ అన్తర్దోషవత్ మాయాఽవ్యాకృతాది అనేక శబ్దవాచ్యతయా – "మాయాం తు ప్రకృతిం విద్యాత్ మాయినం తు మహేశ్వరమ్" (శ్వే. ఉ.4.10) "మమ మాయా దురత్యయా" (7.14) ఇత్యాదౌ ప్రసిద్ధం యత్ తత్ కూటమ్, తస్మిన్ కూటే స్థితం కూటస్థం తదధ్యక్షతయా. అథవా – రాశిః ఇవ స్థితం కూటస్థమ్, అతః ఏవ అచలం, యస్మాత్ అచలం తస్మాత్ ధ్రువం నిత్యమిత్యర్థః.**

**తె.అ.** అవ్యక్తం కనుక అక్షరం శబ్దగోచరం కాదు. కనుక ఇటువంటిది అని నిర్దేశించరానిది. ఏ ప్రమాణం చేత కూడా ప్రతక్ష్యం చేయ సాధ్యం కానిది కనుక అది అవ్యక్తం. ఇటువంటి అక్షరమును ఉపాసించేవారు, పర్యుపాసనం అంటే అన్నివిధాలా ఉపాసించడం. శాస్త్రం చెప్పిన విధంగా ఉపాస్య వస్తువును విషయం చేసుకుని దానిని సమీపించి తైలధారవలె సమానప్రత్యయప్రవాహంతో (అంటే చెదరని చిత్తవృత్తితో, ఏ వస్తువు ఉపాసనకు విషయం చేసుకోబడిందో అది తప్ప మరొక వస్తువుపైకి చిత్తం ప్రవహించకుండా) దీర్ఘకాలం ఉండడాన్ని ఉపాసనమంటారు. అక్షరం యొక్క విశేషణాలు చెపుతున్నాడు – ఆకాశం వలె అంతటా వ్యాపించి ఉన్నది, ఆలోచనకు అందనిది – ఇంద్రియ గోచరమైన దానినే మనసుతో కూడా ఆలోచించగలం. అక్షరం అట్లా కాదు కనుక అది అచింత్యం. పైకి గుణము లోపల దోషము ఉన్న వస్తువును కూటం అంటారు. కూటరూపము కూటసాక్ష్యము మొదలైనవాటిలో కూటశబ్దం లోకంలో ప్రసిద్ధమే. అదేవిధంగా అనేక జన్మలకు బీజంవంటిది అయిన అవిద్యాది అంతర్దోషం గలది. మాయ అని అవ్యాకృతమని చెప్పబడేది, "మాయ ప్రకృతి అని మాయావి మహేశ్వరుడని తెలియవలెను" (శ్వే.ఉ.4.10), "మమ మాయా దురత్యయా" (7.14) మొదలైన శ్రుతులలో ప్రసిద్ధమైనది కూటము. ఆ కూటమందు అధ్యక్షరూపంలో ఉండేది కూటస్థం. లేక రాశివలె ఉండేది కూటస్థం అని కూడా అర్థం చెప్పుకోవచ్చు. కనుకనే అచలం. చలనం లేనిది కనుక ధ్రువం, అంటే నిత్యమని అర్థం.

**భాష్యమ్ : 4.1 సంనియమ్యేతి : సంనియమ్య సమ్యక్ నియమ్య ఉపసంహృత్య, ఇన్ద్రియగ్రామమ్ ఇన్ద్రియసముదాయం, సర్వత్ర సర్వస్మిన్ కాలే సమబుద్ధయః – సమా తుల్యా బుద్ధిః యేషాం ఇష్టానిష్ట ప్రాప్తౌ తే సమబుద్ధయః. తే యే ఏవంవిధాః తే ప్రాప్నువంతి మామ్ ఏవ సర్వభూతహితే రతాః. న తు తేషాం వక్తవ్యం కించిత్ "మాం తే ప్రాప్నువన్తీతి", "జ్ఞానీత్వాత్మైవ మే మతమ్" (7.18) ఇతి హి ఉక్తమ్. న హి భగవత్స్వరూపాణాం సతాం యుక్తతమత్వమ్ అయుక్తతమత్వం వా వాచ్యమ్. కింతు –**

**తె.అ.** ఇంద్రియ సమూహాన్ని చక్కగా నియమించి, అంటే ఉపసంహరించి, సర్వకాలాలయందు ఇష్టానిష్టప్రాప్తియందు సమబుద్ధి కలిగి సర్వభూతాలకు హితం చేయాలన్న ఆసక్తికలవారు నన్నే పొందుతారు. ఈ అక్షరోపాసకుల గురించి వారు నన్నే పొందుతారు అని చెప్పడం కూడా అవసరం లేదు. 'జ్ఞానీత్వాత్మైవ మే మతమ్' (7.18) అని చెప్పనే చెప్పాను. భగవత్స్వరూపులై ఉన్నవారి గురించి వారి యోగసిద్ధి ఇంతది అంతది అని చెప్పడంలో అర్థం లేదు. కానీ

**మూ. క్లేశోఽధికతరస్తేషామవ్యక్తాసక్తచేతసామ్ ।**
**అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే ॥ 5**

**తె.అ.** అవ్యక్తం మీద మనసును లగ్నం చేసేవారి క్లేశం అధికంగా ఉంటుంది. దేహాభిమానం గల మానవులకు అవ్యక్తగతి కష్టమైనది.

**భాష్యమ్ : 5.1 క్లేశః అధికతరః - యద్యపి మత్కర్మాదిపరాణాం క్లేశః అధికః ఏవ, క్లేశః అధికతరః తు అక్షరాత్మనాం పరమాత్మదర్శినాం దేహాభిమానపరిత్యాగనిమిత్తః, అవ్యక్తాసక్తచేతసామ్ - అవ్యక్తే ఆసక్తం చేతః యేషాం తే అవ్యక్తాసక్తచేతసః తేషామ్ అవ్యక్తాసక్తచేతసామ్. అవ్యక్తా హి యస్మాత్, యా గతిః అక్షరాత్మికా, దుఃఖం సా దేహవద్భిః దేహాభిమానవద్భిః అవాప్యతే, అతః క్లేశః అధికతరః, అక్షరోపాసకానాం యద్వర్తనం తత్ ఉపరిష్టాత్ (12.13-20) వక్ష్యామః.**

**తె.అ.** నా కొరకు కర్మలు మొదలైనవి చేయడంలో కష్టం ఎక్కువే. కాని అంతకంటే ఎక్కువ కష్టం అవ్యక్తం మీద చిత్తం ఆసక్తమైన వారికి. అక్షరమే తమ ఆత్మ అయిన పరమాత్మ దర్శనులకు దేహాభిమానం వదలుకొనవలసి ఉంటుంది. కనుక వారి క్లేశం ఇంకా ఎక్కువ. అక్షరమైన అవ్యక్తాన్ని ఉపాసించడమనే మార్గం దేహాభిమానులకు కష్టం మీద గాని దొరకదు. కనుకనే అవ్యక్తాన్ని ఉపాసించేవారు ఇతర ఉపాసకుల కంటే ఎక్కువ క్లేశం పొందవలసి ఉంటుంది. అక్షరోపాసకుల ప్రవృత్తి ఏ విధంగా ఉంటుందో ముందు శ్లోకాలలో ('అద్వేష్టా ...' 13. మొదలైన శ్లోకాలలో) చెపుతాము.

**మూ. యే తు సర్వాణి కర్మాణి మయి సంన్యస్య మత్పరాః ।**
**అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే ॥ 6**

**మూ. తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్ ।**
**భవామి న చిరాత్ పార్థ మయ్యావేశితచేతసామ్ ॥ 7**

**తె.అ.** సర్వకర్మలు నాయందు సన్న్యసించి నన్నే పరమగతిగా భావించి, మనసును నాయందు ఆవేశింపజేసి, అనన్యయోగంతో నన్నే ధ్యానిస్తూ ఉపాసించేవారిని నేను శీఘ్రమే మృత్యుసంసారసాగరం దాటిస్తాను.

**భాష్యమ్ : 6.1 యే త్వితి – యే తు సర్వాణి కర్మాణి మయి ఈశ్వరే సంన్యస్య, మత్పరాః అహం పరః యేషాం తే మత్పరాః సన్తః, అనన్యేన ఏవ – అవిద్యమానమ్ అన్యత్ ఆలమ్బనం విశ్వరూపం దేవమ్ ఆత్మానం ముక్త్వా యస్య సః అనన్యః, తేన అనన్యేనైవ, కేన? యోగేన సమాధినా, మాం ధ్యాయన్తః చిన్తయన్తః ఉపాసతే. తేషాం కిం –**

**తె.అ.** నాయందు అంటే ఈశ్వరునియందు సర్వకర్మలు సన్న్యసించి నన్నే పరమగతిగా భావించి అనన్యయోగంతో నన్ను ధ్యానిస్తూ ఉపాసించేవారిని – అనన్యమంటే విశ్వరూపదైవమైన ఆత్మ తప్ప అన్యమేదీ ఆధారం లేని సమాధి. అటువంటివారికి ఏమవుతుంది?

**భాష్యమ్ : 7.1 తేషాం మదుపాసనైకపరాణామ్. అహమ్ ఈశ్వరః, సముద్ధర్తా – కుతః ఇత్యాహ – మృత్యుసంసారసాగరాత్, మృత్యుయుక్తః సంసారః మృత్యుసంసారః, స ఏవ సాగరః ఇవ సాగరః, దుస్తరత్వాత్. తస్మాత్ మృత్యుసంసారసాగరాత్, అహం తేషాం సముద్ధర్తా భవామి, న చిరాత్, కిం తర్హి? క్షిప్రమ్ ఏవ, హే పార్థ, మయి ఆవేశితచేతసామ్ – మయి విశ్వరూపే ఆవేశితం ప్రవేశితం సమాహితం చేతః యేషాం తే మయ్యావేశితచేతసః, తేషామ్. యతః ఏవం, తస్మాత్ –**

**తె.అ.** నన్ను ఉపాసించడం కంటె వేరెరుగని వారిని నేను సముద్ధరిస్తాను. దేనినుండి? మృత్యుసంసారసాగరం నుండి, మృత్యువు గల సంసారం మృత్యుసంసారం. అదే సాగరం వంటిది, దాటడం కష్టం కనుక. అటువంటి సాగరం నుండి దాటిస్తాను. ఎప్పుడో కాదు, వెంటనే. వారు విశ్వరూపుడైన నాయందు మనసు నిలిపినవారు కనుక. అందుకని –

**మూ. మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ ।**
**నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః ॥ 8**

**తె.అ.** మనసు నాయందే నిలుపు. నామీదనే బుద్ధిని ఉంచు. ఆపై నీవు నాలోనే ఉంటావు. సందేహం లేదు.

**భాష్యమ్ : 8.1 మయ్యేవ విశ్వరూపే ఈశ్వరే, మనఃసంకల్పవికల్పాత్మకమ్, ఆధత్స్వ స్థాపయ. మయ్యేవ అధ్యవసాయం కుర్వతీం బుద్ధిమ్, ఆధత్స్వ నివేశయ. తతః తే కిం స్యాదితి శృణు – నివసిష్యసి నివత్స్యసి, నిశ్చయేన మదాత్మనా మయి నివాసం కరిష్యస్యేవ, అతః శరీరపాతాత్ ఊర్ధ్వం. న సంశయః, సంశయః అత్ర న కర్తవ్యః.**

**తె.అ.** సంకల్ప వికల్పాత్మకమైన మనసును నాయందు అంటే విశ్వరూపుడైన ఈశ్వరునియందు నిలుపు. అధ్యవసాయం చేసే బుద్ధిని నాయందు నిలుపు. అప్పుడు వారికేమవుతుంది? విను –

ఆపై నిశ్చయంగా నీవు నా ఆత్మ వై నాయందే నివసిస్తావు. ఆపై అంటే శరీరపాతమయిన తరువాత. ఇందులో సందేహం లేదు. సందేహించ పనిలేదు.

**మూ. అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్ ।**
**అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ ॥ 9**

**తె.అ.** అర్జునా, నాయందు స్థిరంగా చిత్తాన్ని నిలుపలేకపోతే అప్పుడు అభ్యాసయోగం చేత నన్ను పొందగోరుము.

**భాష్యమ్ : 9.1 అథేతి – అథ ఏవం యథా అవోచం తథా మయి చిత్తం సమాధాతుం స్థాపయితుం, స్థిరమ్ అచలం, న శక్నోషి చేత్, తతః పశ్చాత్, అభ్యాసయోగేన చిత్తస్య ఏకస్మిన్ ఆలమ్బనే సర్వతః సమాహృత్య పునః పునః స్థాపనమ్ అభ్యాసః, తత్పూర్వకః యోగః సమాధాన– లక్షణః, తేన అభ్యాసయోగేన, మాం విశ్వరూపమ్, ఇచ్ఛ ప్రార్థయస్వ, ఆప్తుం ప్రాప్తుం, హే ధనంజయ.**

**తె.అ.** వెనుక చెప్పిన విధంగా నాయందు చిత్తాన్ని స్థిరంగా నిలుపలేకపోతే, అప్పుడు అభ్యాసయోగం చేత విశ్వరూపుడైన నన్ను పొందుటకు ప్రార్థించు. అన్ని విషయాలనుండి చిత్తాన్ని ఉపసంహరించి ఒకే విషయంపై ఉంచడానికి మళ్ళీ మళ్ళీ చేసే ప్రయత్నమే అభ్యాసం.

**మూ. అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ ।**
**మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధిమవాప్స్యసి ॥ 10**

**తె.అ.** అభ్యాసంలో కూడా నీవు అసమర్థుడవైతే నా కోసం కర్మలు భావంతో, శ్రద్ధగా చేయుము. నా కొరకు కర్మలు చేస్తూ కూడా సిద్ధి పొందగలవు.

**భాష్యమ్ : 10.1 అభ్యాసేఽపీతి – అభ్యాసేఽపి, అసమర్థః అశక్తః, అసి తర్హి, మత్కర్మపరమః భవ. మదర్థం కర్మ, మత్కర్మ తత్పరమః మత్కర్మప్రధానః ఇత్యర్థః. అభ్యాసేన వినా మదర్థమ్ అపి కర్మాణి కేవలం కుర్వన్, సిద్ధిం సత్త్వశుద్ధియోగజ్ఞానప్రాప్తిద్వారేణ అవాప్స్యసి.**

**తె.అ.** అభ్యాసంలో కూడా నీవు అశక్తుడవయితే నా కర్మలు చేయడమే ప్రధానంగా పెట్టుకో. అభ్యాసం లేకపోయినా నాకొరకు కర్మలు చేస్తూ కూడా సత్త్వశుద్ధి కలిగి యోగజ్ఞానం ప్రాప్తించి తద్వారా సిద్ధి పొందగలవు.

**మూ. అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగమాశ్రితః ।**
**సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్ ॥ 11**

**తె.అ.** ఇది కూడా నీవు చేయలేకపోతే నా యోగాన్ని ఆశ్రయించు. అప్పుడు ఆత్మ సంయమనంతో సర్వకర్మ ఫలత్యాగం చేయి.

**భాష్యమ్ : 11.1 అథైతదితి – అథ పునః ఏతదపి యత్ ఉక్తం మత్కర్మపరత్వం తత్ కర్తుమ్ అశక్తః అసి, మద్యోగమ్ ఆశ్రితః – మయి క్రియమాణాని సంన్యస్య యత్కరణం తేషామ్ అనుష్ఠానం సః మద్యోగః, తమ్ ఆశ్రితః సన్ సర్వకర్మఫలత్యాగం – సర్వేషాం కర్మణాం ఫలసంన్యాసం సర్వకర్మ ఫలత్యాగం, తతః అనన్తరం, కురు, యతాత్మవాన్ సంయతచిత్తః సన్ ఇత్యర్థః.**

**తె.అ.** మరి ఇది కూడా, అంటే ఇప్పుడు చెప్పినట్లు నా యోగాన్ని ఆశ్రయించి భగవత్కర్మలు చేయడమే ప్రధానంగా పెట్టుకోవడం కూడా, నీవు చేయలేకపోతే — నా యోగం అంటే చేస్తున్న కర్మలను నాయందు సన్న్యసించి ఆచరించడం — అది కూడా నీవు చేయలేకపోతే, అప్పుడు చిత్తాన్ని నియమించి సర్వకర్మల ఫలాన్ని వదలివేయి.

**భాష్యమ్ : 12.0 ఇదానీం సర్వకర్మఫలత్యాగం స్తౌతి –**

**తె.అ.** ఇప్పుడు సర్వకర్మఫలత్యాగాన్ని స్తుతిస్తున్నాడు –

**మూ. శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే ।**
**ధ్యానాత్కర్మఫలత్యాగస్త్యాగాచ్ఛాన్తిరనన్తరమ్ ॥ 12**

**తె.అ.** అభ్యాసం కంటె జ్ఞానము, జ్ఞానం కంటె ధ్యానము, ధ్యానం కంటె కర్మఫలత్యాగము విశిష్టమైనవి. త్యాగం వల్ల వెంటనే శాంతి కలుగుతుంది.

**భాష్యమ్ : 12.1 శ్రేయః హి ప్రశస్యతరం జ్ఞానం, కస్మాత్? (అ)వివేకపూర్వకాత్ అభ్యాసాత్, తస్మాదపి జ్ఞానాత్ జ్ఞానపూర్వకం ధ్యానం విశిష్యతే. జ్ఞానవతః ధ్యానాదపి కర్మఫలత్యాగః 'విశిష్యతే' ఇత్యనుషజ్యతే. ఏవం కర్మఫలత్యాగాత్ పూర్వోక్తవిశేషణవతః శాన్తిః ఉపశమః సహేతుకస్య సంసారస్య అనన్తరమేవ స్యాత్, న తు కాలాన్తరమ్ అపేక్షతే.**

**తె.అ.** జ్ఞానం మేలైనది, ఎక్కువ ప్రశస్తమైనది. దేనికంటె? వివేకపూర్వకమైన అభ్యాసం కంటె. ఆ జ్ఞానం కంటె జ్ఞానసహితమైన ధ్యానం విశిష్టమైనది. జ్ఞాని చేసే ధ్యానం కంటె కూడా కర్మఫలత్యాగం విశిష్టం. వెనుక (11లో) చెప్పిన లక్షణాలు గలిగిన ఇటువంటి కర్మఫలత్యాగం వల్ల శాంతి కలుగుతుంది. సంసారం, దాని కారణాలతో సహా, ఉపశమించడమే శాంతి. అనంతరమే, అంటే కాలాంతరంలో కాదు. వెంటనే.

**భాష్యమ్ : 12.2 అజ్ఞస్య కర్మణి ప్రవృత్తస్య పూర్వోపదిష్టోపాయానుష్ఠానాశక్తౌ సర్వకర్మణాం ఫలత్యాగః శ్రేయః సాధనమ్ ఉపదిష్టం, న ప్రథమమేవ, అతః చ "శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్" ఇతి ఉత్తరోత్తర విశిష్టత్వోపదేశేన సర్వకర్మఫలత్యాగః స్తూయతే, సంపన్నసాధనానుష్ఠానాశక్తౌ అనుష్ఠేయత్వేన శ్రుతత్వాత్. కేన ధర్మేణ స్తుతిత్వమ్? "యదా సర్వే ప్రముచ్యన్తే" (కఠ. ఉ.6.14) ఇతి సర్వకామప్రహాణాత్ అమృతత్వమ్ ఉక్తం తత్ ప్రసిద్ధమ్. కామాశ్చ సర్వే శ్రౌతస్మార్తకర్మణాం ఫలాని. తత్త్యాగే చ విదుషః జ్ఞాననిష్ఠస్య అనన్తరైవ శాన్తిః. ఇతి సర్వకామత్యాగసామాన్యమ్ అజ్ఞకర్మఫల– త్యాగస్య అపి అస్తి ఇతి తత్సామాన్యాత్ సర్వకర్మఫలత్యాగస్తుతిః ఇయం ప్రరోచనార్థా. యథా అగస్త్యేన బ్రాహ్మణేన సముద్రః పీతః ఇతి ఇదానీన్తనాః అపి బ్రాహ్మణాః బ్రాహ్మణత్వసామాన్యాత్ స్తూయన్తే. ఏవం కర్మఫలత్యాగాత్ కర్మయోగస్య శ్రేయః సాధనత్వమ్ అభిహితమ్.**

**తె.అ.** కర్మలయందు ప్రవృత్తి గలిగిన అజ్ఞానికి, వెనుక చెప్పిన ఉపాయాలను అనుష్ఠించలేని వానికి, సర్వకర్మ ఫలత్యాగం శ్రేయస్సాధనమని ఉపదేశించబడింది. దాన్ని మొదటే చెప్పలేదు. కనుక 'జ్ఞానం మేలు' (శ్రేయో హి జ్ఞానం) అంటూ ఒకదానికంటె మరొకటి విశిష్టమైంది అని సర్వకర్మఫలత్యాగాన్ని స్తుతిస్తున్నాడు, ఉత్తమ సాధనాలను అనుష్ఠించలేనివారు అనుష్ఠించదగిందిగా చెప్పబడి ఉండడం చేత. ఏ గుణముందని స్తుతిస్తున్నాడు? 'కోర్కెలన్నీ తొలగినప్పుడు' (కఠ.ఉ.6.14) అని కోర్కెలన్నిటినీ త్యజించడం వల్ల అమృతత్వం కలుగుతుందని చెప్పడం ప్రసిద్ధమే. కోరికలంటె శ్రౌతస్మార్తకర్మలన్నిటి ఫలాలే. జ్ఞాననిష్ఠ గలిగిన విద్వాంసునికి అటువంటి త్యాగం వల్ల వెంటనే శాంతి కలుగుతుంది. అజ్ఞాని ఆచరించే కర్మయోగంలో కూడా సర్వకామత్యాగం ఉంది. జ్ఞానికి కర్మలాచరించే అజ్ఞానికి సర్వకామత్యాగం సామాన్యం. కనుక కర్మలాచరించేవానికి అందులో శ్రద్ధ కలగడం కొరకు సర్వకర్మ ఫలత్యాగాన్ని స్తుతిస్తున్నాడు. అగస్త్యుడు బ్రాహ్మణుడు, అతడు సముద్రాన్ని తాగేశాడు అని ఈనాటి బ్రాహ్మణులు కూడా స్తుతింపబడుతున్నట్లు. ఈ విధంగా కర్మఫలత్యాగం చేత కర్మయోగం శ్రేయస్సాధనమవుతుందని చెప్పబడింది. (జ్ఞాని సర్వకామత్యాగము, కర్మలాచరించే అజ్ఞాని సర్వకర్మఫలత్యాగము ఒకటి కాదు. ఆ రెంటికీ అగస్త్యునికి, సామాన్యబ్రాహ్మణుడికి ఉన్న అంతరం ఉంది.)

**భాష్యమ్ : 13.0 అత్ర చ ఆత్మేశ్వరభేదమ్ ఆశ్రిత్య విశ్వరూపే ఈశ్వరే చేతః సమాధానలక్షణః యోగః ఉక్తః, ఈశ్వరార్థం కర్మానుష్ఠానాది చ. "అథైతదప్యశక్తోఽసి" (12.11) ఇతి అజ్ఞానకార్య– సూచనాత్ న అభేదదర్శినః అక్షరోపాసకస్య కర్మయోగః ఉపపద్యతే ఇతి దర్శయతి. తథా కర్మయోగినః అక్షరోపాసనానుపపత్తిం దర్శయతి భగవాన్ "తే ప్రాప్నువన్తి మామేవ" (12.4)**

**ఇతి అక్షరోపాసకానాం కైవల్య ప్రాప్తౌ స్వాతన్త్ర్యమ్ ఉక్త్వా ఇతరేషాం పారతన్త్ర్యాత్ ఈశ్వరాధీనతాం దర్శితవాన్ "తేషామహం సముద్ధర్తా" (12.7)ఇతి. యది హి ఈశ్వరస్య ఆత్మభూతాః తే మతాః అభేదదర్శిత్వాత్ అక్షరస్వరూపా ఏవ తే ఇతి సముద్ధరణకర్మవిషయవచనం తాన్ ప్రతి అపేశలం స్యాత్.**

**యస్మాచ్చ అర్జునస్య అత్యన్తమేవ హితైషీ భగవాన్ తస్య సమ్యగ్దర్శనాన్వితం కర్మయోగం భేదదృష్టిమన్తమ్ ఏవ ఉపదిశతి. న చ ఆత్మానమ్ ఈశ్వరం ప్రమాణతః బుద్ధ్వా కస్యచిత్ గుణభావం జిగమిషతి కశ్చిత్, విరోధాత్. తస్మాత్ అక్షరోపాసకానాం సమ్యగ్దర్శననిష్ఠానాం సంన్యాసినాం త్యక్తసర్వైషణానాం 'అద్వేష్టా సర్వభూతానామ్' ఇత్యాది ధర్మపూగం సాక్షాత్ అమృతత్వకారణం వక్ష్యామీతి ప్రవర్తతే.**

**తె.అ.** ఇక్కడ, ఆత్మేశ్వరభేదమాశ్రయించి విశ్వరూపుడైన ఈశ్వరునియందు చిత్తం నిలపడమనే యోగం చెప్పబడింది. ఈశ్వరుని కొరకు కర్మానుష్ఠానం మొదలైనవి కూడా చెప్పబడ్డాయి. 'ఇది కూడా చేయలేకపోతే' (11) అని కర్మలు అజ్ఞానకార్యమని సూచిస్తూ, అభేదదర్శియైన అక్షరోపాసకునికి కర్మయోగం లేదు అని ప్రదర్శిస్తున్నాడు. అట్లాగే కర్మయోగికి అక్షరోపాసన అసంభవమని భగవానుడు ప్రదర్శిస్తున్నాడు, 'వారు నన్నే చేరుతారు' (4) అని. అక్షరోపాసకులకు కైవల్యప్రాప్తిలో స్వాతంత్ర్య ముందని చెపుతూ, ఇతరులకు పారతంత్ర్యకారణంగా ఈశ్వరాధీనత్వాన్ని ప్రదర్శించాడు, 'వారిని నేను ఉద్ధరిస్తాను' (7) అని. ఈశ్వరునికి తమకు భేదంలేదని తెలిసినవారు కనుక అక్షరోపాసకులు ఈశ్వరుని ఆత్మయే అవుతారని అనుకున్నప్పుడు వారిని ఉద్ధరించవలసి ఉంటుందనడంలో అర్థం లేదు. అర్జునుని పూర్తి మేలుకోరేవాడు కనుక భగవానుడు అతనికి సమ్యగ్దర్శనం కలగనపుడు భేదదృష్టితో చేసే కర్మయోగమే ఉపదేశిస్తున్నాడు. ప్రమాణపూర్వకంగా తన్ను తాను ఈశ్వరునిగా తెలుసుకున్నవాడెవడూ తనను మరొకరికి తక్కువ చేసుకోడు, విరుద్ధం కనుక. (నేను ప్రభువును నేను సేవకుణ్ణి - ఈ రెండు పరస్పర విరుద్ధ భావాలు. నేను ప్రభువును అని తెలుసుకున్నవాడెవడు మరొకడికి సేవకుడు కావలెనని కోరుకోడు.) కనుక సమ్యగ్దర్శననిష్ఠ కలిగి అక్షరోపాసకులై అన్ని కోర్కెలను త్యజించి సన్న్యసించిన వారి గుణాలు సాక్షాత్తు మోక్షకారణాలు. వాటిని చెప్పడం కొరకు 'సర్వ భూతముల యందు ద్వేషము లేనివారు' (13) అంటూ ఉపక్రమిస్తున్నాడు.

**మూ. అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ ।**
**నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ ॥ 13**

**తె.అ.** సమస్తభూతములయందు ద్వేషములేనివాడు, మిత్రభావంతో ఉండేవాడు, కరుణ గలవాడు, మమకార అహంకారాలు లేనివాడు, దుఃఖంలో సుఖంలో ఒకేరీతిగా ఉండేవాడు, క్షమాగుణం కలవాడు.

**భాష్యమ్ : 13.1 అద్వేష్టా సర్వభూతానామ్, సర్వేషామ్ భూతానామ్ న ద్వేష్టా అద్వేష్టా ఆత్మనః దుఃఖహేతుమపి న కించిత్ ద్వేష్టి, సర్వాణి భూతాని ఆత్మత్వేన హి పశ్యతి. మైత్రః – మిత్రభావః మైత్రీ. మిత్రతయా వర్తతే ఇతి మైత్రః. కరుణః ఏవ చ కరుణా కృపా దుఃఖితేషు దయా. తద్వాన్ కరుణః, సర్వభూతానామ్: అభయప్రదః సంన్యాసీ ఇత్యర్థః. నిర్మమః – మమప్రత్యయ– వర్జితః. నిరహంకారః నిర్గతాహంప్రత్యయః. సమదుఃఖసుఖః. సమే దుఃఖసుఖే ద్వేషరాగయోః అప్రవర్తకే యస్య సః సమదుఃఖసుఖః క్షమీ క్షమావాన్ ఆక్రుష్టః అభిహితః వా అవిక్రియః ఏవ ఆస్తే.**

**తె.అ.** సర్వభూతములయందు ద్వేషభావం లేనివాడు, కష్టం కలిగించినవానిని కూడా ఎంతమాత్రము ద్వేషించనివాడు; సర్వభూతములను తన్నుగా చూచేవాడు; మిత్రభావంతో ప్రవర్తించేవాడు; కరుణ అంటే కృప, కష్టంలో ఉన్నవారియందు దయ. అటువంటి కరుణ గలవాడు, సర్వభూతములకు అభయమిచ్చేవాడు, సన్న్యాసి అని అర్థం; నాది అన్న బుద్ధి లేనివాడు; నేను అన్న బుద్ధి వదలినవాడు; దుఃఖంలో సుఖంలో ద్వేషము రాగము కలుగనివాడు; క్షమాగుణం కలవాడు, తిట్టినా కొట్టినా వికారం చెందనివాడు (ప్రతిక్రియ చేయనివాడు).

**మూ. సంతుష్టః సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః,**
**మయ్యర్పితమనోబుద్ధిర్యో మద్భక్తః స మే ప్రియః. 14**

**తె.అ.** సదా సంతుష్టుడు, యోగి, ఆత్మసంయమి, దృఢనిశ్చయం కలవాడు, మనసును బుద్ధిని నాకు అర్పించినవాడు నాకు ప్రియమైన భక్తుడు.

**భాష్యమ్ : 14.1 సంతుష్ట ఇతి :– సంతుష్టః, సతతం నిత్యం దేహస్థితికారణస్య లాభే అలాభే చ ఉత్పన్నాలంప్రత్యయః. తథా గుణవల్లాభే విపర్యయే చ సంతుష్టః. సతతం, యోగీ సమాహిత చిత్తః, యతాత్మా సంయతస్వభావః, దృఢనిశ్చయః – దృఢః స్థిరః నిశ్చయః అధ్యవసాయః యస్య ఆత్మతత్త్వవిషయే సః దృఢనిశ్చయః, మయి అర్పితమనోబుద్ధిః సంకల్పవికల్పాత్మకం మనః అధ్యవసాయలక్షణా బుద్ధిః, తే మయ్యేవ అర్పితే స్థాపితే యస్య సంన్యాసినః సః మయి అర్పితమనో–బుద్ధిః. యః ఈదృశః మద్భక్తః సః మే ప్రియః. 'ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమహం స చ మమ ప్రియః" (7.17) ఇతి సప్తమే అధ్యాయే సూచితం, తత్ ఇహ ప్రపఞ్చ్యతే.**

**తె.అ.** సదా సంతుష్టుడు, నిత్యము తృప్తి చెందినవాడు, దేహస్థితికి అవసరమైనవి లభించినా లభించకపోయినా, 'ఇది చాలు' అనుకునేవాడు. అట్లాగే మంచివి దొరికినపుడు దొరకనపుడు కూడా సంతోషంగా ఉండేవాడు. యోగి, సతతము చిత్తాన్ని ఏకాగ్రం చేసినవాడు. సంయమ స్వభావుడు యతాత్ముడు. ఆత్మతత్త్వవిషయంలో స్థిరమైన నిశ్చయం కలవాడు. సంకల్పవికల్పాత్మక మైన మనస్సును, నిశ్చయలక్షణమైన బుద్ధిని నాయందే నిలిపిన సన్న్యాసి. ఇటువంటివాడు నా భక్తుడు నాకు ప్రియుడు. 'జ్ఞానికి నేను అత్యంతము ప్రియుడను అదేవిధంగా నాకు జ్ఞాని ప్రియుడు' (7.17) అని ఏడవ అధ్యాయంలో సూచించిన దానినే ఇక్కడ వివరిస్తున్నాడు.

**మూ. యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః ।**
**హర్షామర్షభయోద్వేగైర్ముక్తో యః స చ మే ప్రియః ॥ 15**

**తె.అ.** ఎవడు లోకాన్ని క్షోభపెట్టడో లోకం ఎవనిని క్షోభపెట్టలేదో ఎవనికి సంతోషము, క్రోధము, భయము, దిగులు లేవో అతడు నాకు ప్రియుడు.

**భాష్యమ్ : 15.1 యస్మాదితి – యస్మాత్ సంన్యాసినః. న ఉద్విజతే న ఉద్వేగం గచ్ఛతి న సంతప్యతే న సంక్షుభ్యతి లోకః, తథా లోకాత్ న ఉద్విజతే చ యః, హర్షామర్షభయోద్వేగైః – హర్షశ్చ అమర్షశ్చ భయం చ ఉద్వేగశ్చ తైః హర్షామర్షభయోద్వేగైః ముక్తః. హర్షః ప్రియలాభే అన్తఃకరణస్య ఉత్కర్షః రోమాఞ్చనాశ్రుపాతాదిలింగః అమర్షః అసహిష్ణుతా, భయం త్రాసః, ఉద్వేగః ఉద్విగ్నతా, తైః ముక్తః యః సః చ మే ప్రియః.**

**తె.అ.** ఎవనివల్ల లోకం ఉద్వేగం చెందదో, సంతాపం చెందదో, సంక్షోభం చెందదో, అట్లాగే లోకం వల్ల ఎవనికి ఉద్వేగం కలుగదో అటువంటి సంన్యాసి హర్షామర్ష భయోద్వేగాలు లేనివాడు, నాకు ప్రియుడు. ప్రియమైనది దొరకినపుడు మనసుకు కలిగే పొంగు హర్షం. ఒళ్ళు గగుర్పాటు, కంటికి నీరు మొదలైనవి దీని లక్షణాలు. అమర్షమంటే అసహనం, ఓర్చుకోలేకపోవడం.

**మూ. అనపేక్షః శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః ।**
**సర్వారమ్భపరిత్యాగీ యో మద్భక్తః స మే ప్రియః ॥ 16**

**తె.అ.** దేనినీ అపేక్షించనివాడు, శుచియైనవాడు, దక్షుడు, ఉదాసీనుడు, వ్యథతొలగినవాడు ఏ కార్యము తలపెట్టని వాడు నా భక్తుడు, నాకు ప్రియుడు.

**భాష్యమ్ : 16.1 అనపేక్షః ఇతి – దేహేన్ద్రియవిషయసమ్బన్ధాదిషు అపేక్షా విషయేషు అపేక్షా యస్య నాస్తి సః అనపేక్షః నిఃస్పృహః, శుచిః బాహ్యేన ఆభ్యన్తరేణ చ శౌచేన సంపన్నః, దక్షః**

**ప్రత్యుత్పన్నేషు కార్యేషు సద్యః యథావత్ ప్రతిపత్తుం సమర్థః, ఉదాసీనః న కస్యచిత్ మిత్రాదేః పక్షం భజతే యః స ఉదాసీనః, యతిః. గతవ్యథః గతభయః, సర్వారమ్భపరిత్యాగీ ఆరభ్యన్తే ఇతి ఆరంభాః, ఇహాముత్రార్థఫలభోగార్థాని కామహేతూని కర్మాణి సర్వారమ్భాః, తాన్ పరిత్యక్తుం శీలమ్ అస్యేతి సర్వారమ్భపరిత్యాగీ యః మద్భక్తః సః మే ప్రియః. కించ –**

**తె.అ.** దేహము, ఇంద్రియాలు, ఇంద్రియ విషయాలు – వీటికి సంబంధించిన వాటియందు దేనిపై అపేక్ష లేనివాడు; బాహ్యాభ్యంతరములయందు శుచియైనవాడు; ఏది ఎట్లా చేయవలెనో వెంటనే తెలుసుకోగల సమర్థుడు; ఉదాసీనుడు అంటే మిత్రాదుల పక్షం వహించనివాడు, యతి; వ్యథ, అంటే భయం, తొలగినవాడు, ఇహపరములయందు గల కోరికలకై చేసే కర్మలను పరిత్యజించినవాడు – సర్వారంభపరిత్యాగి; అటువంటి భక్తుడు నాకు ప్రియుడు, అంతేకాదు–

**మూ. యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాఙ్క్షతి ।**
**శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ యః స మే ప్రియః ॥ 17**

**తె.అ.** హర్షం చెందనివాడు, ద్వేషించనివాడు, శోకించనివాడు, కోరనివాడు, శుభాశుభకర్మలను పరిత్యజించినవాడు, భక్తుడు, నాకు ప్రియుడు.

**భాష్యమ్ : 17.1 యః న హృష్యతి ఇష్టప్రాప్తౌ, న ద్వేష్టి అనిష్టప్రాప్తౌ, న శోచతి ప్రియవియోగే, న చ అప్రాప్తం కాఙ్క్షతి, శుభాశుభే కర్మణీ పరిత్యక్తుం శీలమ్ అస్యేతి శుభాశుభపరిత్యాగీ, భక్తిమాన్ యః, స మే ప్రియః.**

**తె.అ.** ఇష్టమైనది ప్రాప్తించినపుడు హర్షం చెందనివాడు, ఇష్టంకానిది ప్రాప్తించినపుడు ద్వేషించనివాడు, ప్రియమైనది పోయినపుడు శోకించనివాడు, ప్రాప్తించినదానిని కోరనివాడు, శుభాశుభకర్మలను పరిత్యజించేవాడు, భక్తుడు నాకు ప్రియుడు.

**మూ. సమః శత్రౌ చ మిత్రే చ తథా మానాపమానయోః ।**
**శీతోష్ణసుఖదుఃఖేషు సమః సంగవివర్జితః ॥ 18**

**తె.అ.** శత్రువును మిత్రుని సమంగా భావించేవాడు, మానావమానాలను సమానంగా గ్రహించేవాడు, శీతోష్ణ సుఖదుఃఖాలయందు ఒకేవిధంగా ఉండేవాడు, దేనియందు రాగంలేనివాడు అంటే ఆసక్తి లేనివాడు.

**భాష్యమ్ : 18.1 సమః ఇతి – సమః శత్రౌ చ మిత్రే చ తథా, మానాపమానయోః పూజాపరిభవయోః, శీతోష్ణసుఖదుఃఖేషు సమః సర్వత్ర చ సంగవర్జితః. కించ**

**తె.అ.** శత్రు మిత్రులయందు సముడు, అదేవిధంగా మానావమానాలయందు అంటే పూజించినా, అవమానించినా సమంగా భావించేవాడు, శీతోష్ణసుఖదుఃఖాలయందు ఒకేవిధంగా ఉండేవాడు, దేనియందు ఆసక్తి లేనివాడు. అంతేకాదు -

**మూ. తుల్యనిన్దాస్తుతిర్మౌనీ సంతుష్టో యేన కేన చిత్ ।**
**అనికేతః స్థిరమతిర్భక్తిమాన్ మే ప్రియో నరః ॥ 19**

**తె.అ.** నిందాస్తుతులను సమానంగా గ్రహించేవాడు, మౌని, దొరికినదానితో సంతుష్టి చెందేవాడు, స్థిరనివాసం లేనివాడు, స్థిరమైన మతి గలవాడు - ఇటువంటి భక్తుడు నాకు ప్రియుడు.

**భాష్యమ్ : 19.1 తుల్యనిన్దాస్తుతిః నిన్దా చ స్తుతిశ్చ నిన్దాస్తుతీ. తే తుల్యే యస్య సః తుల్యనిన్దా-స్తుతిః. మౌనీ మౌనవాన్ సంయతవాక్, సంతుష్టః యేన కేనచిత్ శరీరస్థితిమాత్రేణ, తథా చోక్తమ్.**

**'యేన కేన చిదాచ్ఛన్నో యేన కేనచిదాశితః ।**
**యత్ర క్వచన శాయీ స్యాత్తం దేవా బ్రాహ్మణం విదుః' ॥ (శాం.ప. 245.12) ఇతి.**

**కిం చ అనికేతః నికేతః ఆశ్రయః నివాసః నియతః న విద్యతే యస్య సః అనికేతః 'నాగారే' ఇత్యాది స్మృత్యన్తరాత్. స్థిరమతిః - స్థిరా పరమార్థవస్తువిషయా మతిః యస్య సః స్థిరమతిః, భక్తిమాన్ మే ప్రియః నరః.**

**తె.అ.** నిందను, స్తుతిని సమానంగా గ్రహించేవాడు; వాక్కును అదుపులో ఉంచినవాడు, మౌని; శరీరస్థితికి అవసరమైనంత దొరికినదానితో సంతోషపడేవాడు, 'ఏదో ఒకటి కట్టుకుని, ఏదో ఒకటి తింటూ, ఎక్కడబడితే అక్కడ పడుకుంటూ ఉండేవాణ్ణి బ్రాహ్మణుడని దేవతలంటారు' (మ.భా. శాం.245.12) అని అన్నట్టు; అంతేకాదు నియతమైన నికేతనం అంటే స్థిరనివాసం లేనివాడు, ఇతర స్మృతులలో కూడా 'అనాగారః' ('నివాసం లేనివాడు') అని చెప్పబడింది; పరమార్థవస్తు విషయంలో సడలని బుద్ధి కలవాడు - ఇటువంటి భక్తుడు నాకు ప్రియుడు.

**భాష్యమ్ : 20.0 'అద్వేష్టా సర్వభూతానామ్' (13) ఇత్యాదినా అక్షరస్యోపాసకానాం నివృత్తసర్వైషణానాం సంన్యాసినాం పరమార్థజ్ఞాననిష్ఠానాం ధర్మజాతం ఉపక్రాన్తమ్ ఉపసంహరతి.**

**తె.అ.** 'అద్వేష్టా సర్వభూతానాం' (13)తో ప్రారంభించిన సర్వకామనలు త్యజించి అక్షరో-పాసకులై పరమార్థజ్ఞాననిష్ఠగల సంన్యాసుల లక్షణాలు ఇక ముగిస్తున్నాడు.

**మూ. యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే ।**
**శ్రద్దధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః ॥ 20**

**తె.అ.** నన్నే పరమగతిగా భావించి ఇప్పుడు చెప్పిన ఈ ధర్మ్యామృతాన్ని శ్రద్ధతో ఉపాసించే భక్తులు నాకు అతిప్రియులు.

**ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే భక్తియోగో నామ ద్వాదశోఽధ్యాయః**

ఇది వ్యాసభగవానుని శతసహస్ర సంహిత అయిన శ్రీమహాభారతంలో భీష్మపర్వంలో ఉపనిషత్తులు బ్రహ్మవిద్య యోగశాస్త్రము శ్రీకృష్ణార్జునసంవాదము అయిన భగవద్గీతలయందు భక్తియోగమనే పన్నెండవ అధ్యాయానికి తెలుగు అనువాదం.

**భాష్యమ్ : 20.1 యే తు సంన్యాసినః ధర్మ్యామృతం ధర్మాత్ అనపేతం ధర్మ్యం చ తత్ అమృతం చ తత్, అమృతత్వహేతుత్వాత్ ఇదం యథోక్తమ్ 'అద్వేష్టా సర్వభూతానామ్' ఇత్యాదినా, పర్యుపాసతే అనుతిష్ఠన్తి, శ్రద్దధానాః సన్తః మత్పరమాః యథోక్తాః అహమ్ అక్షరాత్మా పరమః నిరతిశయాగతిః, యేషాం తే మత్పరమాః, మద్భక్తాః చ ఉత్తమాం పరమార్థజ్ఞానలక్షణాం భక్తిమ్ ఆశ్రితాః, తే అతీవ మే ప్రియాః 'ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమ్' (7.17) ఇతి యత్ సూచితం తద్ వ్యాఖ్యాయ ఉపసంహృతం 'భక్తాస్తేఽతీవ మే ప్రియాః' ఇతి. యస్మాత్ ధర్మ్యామృతమ్ ఇదం యథోక్తమ్ అనుతిష్ఠన్ భగవతః విష్ణోః పరమేశ్వరస్య అతీవ మే ప్రియః భవతి తస్మాత్ ఇదం ధర్మ్యామృతం ముముక్షుణా యత్నతః అనుష్ఠేయం విష్ణోః ప్రియం పరం ధామ జిగమిషుణా – ఇతి వాక్యార్థః.**

**తె.అ.** ధర్మం నుండి వేరుకానిది ధర్మ్యం. ధర్మ్యము అమృతము అయినది ధర్మ్యామృతం, అమృతత్వ హేతువు గనుక. దీనిని 'సర్వభూతములయందు ద్వేషములేనివాడు' (13) మొదలైన శ్లోకాలలో చెప్పిన దానిని, నాయందు శ్రద్ధ గలిగి అనుష్ఠించే భక్తులు నాకు అత్యంత ప్రియులు. వారికి నేను పరమగతిని, నన్ను మించి పొందదగినదేదీ వారికి లేదు. వారు పరమార్థజ్ఞానంతో కూడిన ఉత్తమ భక్తియందు నిలిచినవారు. వారు నాకు పరమప్రియులు. 'జ్ఞానికి నేను అత్యంతము ప్రియము' (7.17) అని చెప్పినదానిని వివరించి 'ఆ భక్తులు నాకు అత్యంత ప్రియులు' అని ఇక్కడ ముగిస్తున్నాడు. ఈ ధర్మ్యామృతాన్ని అనుష్ఠించినవాడు పరమేశ్వరుడైన విష్ణుభగవానునికి అత్యంతము ప్రియుడవుతాడు. కనుక విష్ణువుకు ప్రియమైన పరమధామం చేరగోరే ముముక్షువులకు యత్నించి అనుష్ఠించదగినవీ, అమృతప్రాయమైనవీ ఈ గుణాలు.

**ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యగోవిన్దభగవత్పూజ్యపాదశిష్యశ్రీమచ్ఛఙ్కరభగవతః కృతౌ శ్రీమద్భగవద్గీతాభాష్యే భక్తియోగో నామ ద్వాదశోఽధ్యాయః**

ఇది శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య గోవిందభగవత్పూజ్యపాదశిష్యులు శ్రీమత్ శంకరభగవత్పాదులు రచించిన శ్రీ మద్భగవద్గీతా భాష్యంలో భక్తియోగమనే పన్నెండవ అధ్యాయానికి తెలుగు అనువాదం.



# త్రయోదశోఽధ్యాయః

# క్షేత్రక్షేత్రజ్ఞయోగః

**భాష్యమ్ : 0.1 సప్తమే అధ్యాయే సూచితే ద్వే ప్రకృతీ ఈశ్వరస్య – త్రిగుణాత్మికా అష్టధా భిన్నా అపరా సంసారహేతుత్వాత్, పరా చ అన్యా జీవభూతా క్షేత్రజ్ఞలక్షణా ఈశ్వరాత్మికా, యాభ్యాం ప్రకృతిభ్యామ్ ఈశ్వరః జగదుత్పత్తిస్థితిలయహేతుత్వం ప్రతిపద్యతే. తత్ర క్షేత్రక్షేత్రజ్ఞలక్షణప్రకృతిద్వయ నిరూపణద్వారేణ తద్వతః ఈశ్వరస్య తత్త్వనిర్ధారణార్థం క్షేత్రాధ్యాయః ఆరభ్యతే. అతీతానన్తరాధ్యాయే చ "అద్వేష్టా సర్వభూతానామ్" (12.13) ఇత్యాదినా యావదధ్యాయపరిసమాప్తిః తావత్తత్త్వజ్ఞానినాం సంన్యాసినాం నిష్ఠా యథా తే వర్తన్తే ఇత్యేతదుక్తమ్. కేన పునః తే తత్త్వజ్ఞానేన యుక్తాః యథోక్తధర్మాచరణాద్ భగవతః ప్రియాః భవన్తి ఇత్యేవమర్థః చ అయమ్ అధ్యాయః ఆరభ్యతే – ప్రకృతిశ్చ త్రిగుణాత్మికా సర్వకార్యకరణవిషయాకారేణ పరిణతా పురుషస్య భోగాపవర్గార్థకర్తవ్యతయా దేహేన్ద్రియాద్యాకారేణ సంహన్యతే. సోఽయం సంఘాతః ఇదం శరీరమ్, తదేతత్ శ్రీ భగవానువాచ.**

**తె.అ.** ఏడవ అధ్యాయంలో ఈశ్వరుని రెండు ప్రకృతులు తెలుపబడ్డాయి. ఒకటి ఎనిమిది విధాలుగా విభజింపబడిన త్రిగుణాత్మికయైన అపరా ప్రకృతి, మరొకటి జీవభూతము క్షేత్రజ్ఞలక్షణము ఈశ్వరాత్మకమునైన పరాప్రకృతి. ఈ రెండు ప్రకృతులవల్లనే ఈశ్వరుడు జగదుత్పత్తిస్థితిలయములకు కారకుడవుతున్నాడు. క్షేత్రక్షేత్రజ్ఞులనే ఈ రెండు ప్రకృతులను నిరూపించి తద్ద్వారా ఈ ప్రకృతులు కలిగిన ఈశ్వరుని తత్త్వం నిర్ధారణ చేయడం కొరకు ఈ క్షేత్రాధ్యాయాన్ని ఆరంభిస్తున్నాడు. వెనుకటి అధ్యాయంలో 'అద్వేష్టా సర్వభూతానాం' (12.13) నుండి అధ్యాయ పరిసమాప్తివరకు తత్త్వం తెలిసిన సంన్యాసుల నిష్ఠ, వారి వర్తనము చెప్పబడ్డాయి. ఆవిధంగా ధర్మమాచరించేవారి తత్త్వజ్ఞానం ఎటువంటిది కనుక వారు భగవంతునికి ప్రియులవుతారు? ఈ విషయం చెప్పడానికి ఈ అధ్యాయం ఆరంభించబడుతున్నది. త్రిగుణాత్మికయైన ప్రకృతి సర్వకార్యకరణ విషయాల ఆకారంగా మారి పురుషుని భోగ అపవర్గ సంపాదన కొరకు దేహేంద్రియాది ఆకారంలో సమకూడుతుంది. ఈ కూడిక శరీరం. అది చెపుతున్నాడు భగవానుడు.

**శ్రీభగవానువాచ -**

**మూ. ఇదం శరీరం కౌన్తేయ క్షేత్రమిత్యభిధీయతే ।**
**ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥ 1**

శ్రీ భగవానుడు అంటున్నాడు.

**తె.అ.** కౌంతేయా! ఈ శరీరాన్ని క్షేత్రమంటారు. దీనిని తెలిసినవానిని క్షేత్రజ్ఞుడని వీటిని తెలిసినవారంటారు.

**భాష్యమ్ : 1.ఇదమితి – ఇదమితి సర్వనామ్నా ఉక్తం విశినష్టి 'శరీరమ్' ఇతి. హే కౌన్తేయ! క్షతత్రాణాత్, క్షయాత్, క్షరణాత్, క్షేత్రవద్వా అస్మిన్ కర్మఫలనిష్పత్తేః క్షేత్రమ్ ఇతి. ఇతి శబ్దః ఏవం– శబ్దపదార్థకః. క్షేత్రమ్ ఇతి ఏవం అభిధీయతే, కథ్యతే. ఏతత్ శరీరం క్షేత్రం యః వేత్తి విజానాతి ఆపాదతలమస్తకం జ్ఞానేన విషయీకరోతి స్వాభావికేన ఔపదేశికేన వా వేదనేన విషయీకరోతి విభాగశః, తం వేదితారం ప్రాహుః కథయన్తి క్షేత్రజ్ఞః ఇతి. ఇతి శబ్దః ఏవంశబ్దపదార్థకః ఏవ పూర్వవత్. క్షేత్రజ్ఞ ఇతి ఏవమ్ ఆహుః. కే? తద్విదః తౌ క్షేత్రక్షేత్రజ్ఞౌ యే విదన్తి విజానంతి తే తద్విదః.**

**తె.అ.** 'ఈ' (ఇదం) అనే సర్వనామంతో చెప్పినదాన్నే 'శరీరం' అనే విశేషణంతో స్పష్టం చేస్తున్నాడు. గాయం నుండి కాపాడుతుంది కనుక, లేక క్షరమవుతుంది నశిస్తుంది కనుక, లేక కర్మఫలం క్షేత్రంలో వలె ఇందులో కలుగుతుంది కనుక దాన్ని క్షేత్రం అంటారు. 'ఇతి' అనే శబ్దం 'ఏవం' ('ఈ విధంగా') అనే అర్థంలో వాడబడింది. క్షేత్రమని ఈ విధంగా అనబడుతున్నది. ఈ శరీరాన్ని ఆపాదతలమస్తకము ఎవడు విభాగించి తెలుసుకుంటాడో, సహజంగా గాని ఉపదేశ మూలంగా గాని అటువంటివాణ్ణి క్షేత్రజ్ఞుడంటారు. ఎవరంటారు? క్షేత్రక్షేత్రజ్ఞులను తెలిసినవారు.

**భాష్యమ్ : 2.0 ఏవం క్షేత్రక్షేత్రజ్ఞౌ ఉక్తౌ. కిమ్ ఏతావన్మాత్రేణ జ్ఞానేన జ్ఞాతవ్యౌ ఇతి? న ఇత్యుచ్యతే –**

**తె.అ.** ఇప్పుడు చెప్పిన క్షేత్రక్షేత్రజ్ఞులను గురించి ఇంతమాత్రం తెలుసుకుంటే సరిపోతుందా? సరిపోదు, అంటున్నాడు –

**మూ. క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత ।**
**క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తద్ జ్ఞానం మతం మమ ॥ 2**

**తె.అ.** సర్వక్షేత్రాలలోనున్న (అన్ని శరీరాలలోను) క్షేత్రజ్ఞుడు నేనని కూడా తెలుసుకో. క్షేత్రక్షేత్రజ్ఞులను తెలుసుకోడమే నిజమైన జ్ఞానమని నా అభిప్రాయం.

**భాష్యమ్ : 2.1 క్షేత్రజ్ఞమితి – క్షేత్రజ్ఞం యథోక్తలక్షణం చాపి మాం పరమేశ్వరమ్ అసంసారిణం, విద్ధి జానీహి. సర్వక్షేత్రేషు యః క్షేత్రజ్ఞః బ్రహ్మాదిస్తమ్బపర్యన్తానేకక్షేత్రోపాధిప్రవిభక్తః తం నిరస్తసర్వో-పాధిభేదం సదసదాదిశబ్దప్రత్యయాగోచరం విద్ధి ఇత్యభిప్రాయః. హే భారత! యస్మాత్ క్షేత్రక్షేత్రజ్ఞేశ్వర-యాథాత్మ్య వ్యతిరేకేణ న జ్ఞానగోచరమ్ అన్యత్ అవశిష్టమ్ అస్తి తస్మాత్ క్షేత్రక్షేత్రజ్ఞయోః జ్ఞేయభూతయోః యత్ జ్ఞానం క్షేత్రక్షేత్రజ్ఞౌ యేన జ్ఞానేన విషయీక్రియేతే తద్ జ్ఞానం, సమ్యగ్ జ్ఞానమ్ ఇతి మతమ్ అభిప్రాయః మమ ఈశ్వరస్య విష్ణోః.**

**తె.అ.** మరి పైన చెప్పినటువంటి క్షేత్రజ్ఞుడు సంసారరహితుడను, పరమేశ్వరుడు అయిన నేనే అని తెలుసుకో. బ్రహ్మ మొదలు గడ్డిపరక వరకు అన్నిక్షేత్రాలలోను ఉంటూ అనేక ఉపాధులవల్ల వేరువేరుగా కనిపించే క్షేత్రజ్ఞుడు యథార్థంలో అన్ని ఉపాధిభేదాలు తొలగినవాడు, ఉన్నాడనిగాని లేడనిగాని చెప్పరానివాడు అని తెలుసుకో, అని అభిప్రాయం. క్షేత్రము, క్షేత్రజ్ఞుడు, ఈశ్వరుడు తప్ప తెలుసుకోదగినది మరొకటి ఏదీ మిగలిలేదు కనుక క్షేత్రక్షేత్రజ్ఞులను తెలుసుకోడమే, క్షేత్రక్షేత్రజ్ఞులను జ్ఞానానికి విషయంగా చేయడమే, నిజమైన జ్ఞానమని నా అభిప్రాయం, అంటే ఈశ్వరుడైన విష్ణువు అభిప్రాయం.

**భాష్యమ్ : 2.2 నను సర్వక్షేత్రేషు ఏక ఏవ ఈశ్వరః న అన్యః తద్వ్యతిరిక్తః భోక్తా విద్యతే చేత్, తతః ఈశ్వరస్య సంసారిత్వం ప్రాప్తమ్; ఈశ్వరవ్యతిరేకేణ వా సంసారిణః అన్యస్య అభావాత్ సంసారాభావప్రసంగః, తచ్చ ఉభయమ్ అనిష్టమ్, బన్ధమోక్షతద్ధేతుశాస్త్రానర్థక్యప్రసంగాత్, ప్రత్యక్షాది ప్రమాణవిరోధాచ్చ. ప్రత్యక్షేణ తావత్ సుఖదుఃఖతద్ధేతులక్షణః సంసారః ఉపలభ్యతే. జగద్వైచిత్ర్యోప లబ్ధేః ధర్మాధర్మనిమిత్తః సంసారః అనుమీయతే. సర్వమ్ ఏతత్ అనుపపన్నమ్ ఆత్మేశ్వరైకత్వే.**

ఆక్షేపణ – అన్ని క్షేత్రాలలోనున్నవాడు ఒకే ఈశ్వరుడు, అతడుకాక భోక్త మరొకడు లేడు అన్నట్లయితే, అప్పుడు ఈశ్వరుడు సంసారి అన్నట్లే. లేక, ఈశ్వరుడు కాక మరొకడు సంసారి లేనట్లయితే సంసారమే లేదనవలసివస్తుంది. ఈ రెండూ అనిష్టాలే, ఎందుకంటే బంధమోక్షాలను వాటి కారణాలను చెప్పే శాస్త్రాలు నిష్ప్రయోజనాలు అవుతాయి కనుక, ప్రత్యక్షాది ప్రమాణాలు కూడా కాదంటున్నాయి కనుక. సుఖము దుఃఖము వాటి కారణాలు కలిగిన సంసారం ప్రత్యక్షంగా కనిపిస్తుంటే లేదనడమెట్లా? పైగా ప్రపంచంలోని వైచిత్ర్యాన్ని చూసి ధర్మాధర్మనిమిత్తంగా ఈ సంసారం కలుగుతున్నదనికూడా మనం అనుమానించవచ్చు. ఆత్మ, ఈశ్వరుడు ఒకడే అయితే ఇదంతా అసంగతం కావలసివస్తుంది.

**భాష్యమ్ : 2.2.1 న, జ్ఞానాజ్ఞానయోః అన్యత్వేన ఉపపత్తేః – "దూరమేతే విపరీతే విషూచీ అవిద్యా యా చ విద్యేతి జ్ఞాతా" (కఠ.ఉ.2.4). తథా చ తయోః విద్యాఽవిద్యయోః ఫలభేదోఽపి విరుద్ధః నిర్దిష్టః – "శ్రేయశ్చ ప్రేయశ్చ" (కఠ.ఉ.2.2) ఇతి. విద్యావిషయః శ్రేయః, ప్రేయస్తు అవిద్యాకార్యమ్ ఇతి. తథా చ వ్యాసః – "ద్వావిమావథ పన్థానౌ" (శాం.ప.240.6) ఇత్యాది "ఇమౌ ద్వావేవ పన్థానౌ" ఇత్యాది చ. ఇహ చ ద్వే నిష్ఠే ఉక్తే. అవిద్యా చ కార్యేణ సహ హాతవ్యా ఇతి శ్రుతిస్మృతిన్యాయేభ్యః అవగమ్యతే. శ్రుతయః తావత్ – "ఇహ చేదవేదీదథ సత్యమస్తి న చేదిహావేదీన్మహతీ వినష్టిః" (కేన.ఉ.2.5), "తమేవం విద్వానమృత ఇహ భవతి నాన్యః పన్థా విద్యతేఽయనాయ" (పురుషసూక్తే. తై.ఆ.3.12, శ్వే.ఉ.3.8), "విద్వాన్న బిభేతి కుతశ్చన" (తై.ఉ.2.4) అవిదుషః తు – "అథ తస్య భయం భవతి" (తై.ఉ.2.7), "అవిద్యాయామన్తరే వర్తమానాః" (కఠ.ఉ.2.5), "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" (ముం.ఉ.3.2.9), "అన్యోఽసావన్యోఽహమస్మీతి న స వేద యథా పశురేవం స దేవానామ్" (బృహ.ఉ.1.4.10), ఆత్మవిత్ యః – "సః ఇదం సర్వం భవతి". (బృ.ఉ.1.4.10), "యదా చర్మవత్" (శ్వే.ఉ.6.20) ఇత్యాద్యాః సహస్రశః. స్మృతయశ్చ – "అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః" (5.15) "ఇహైవ తైర్జితః సర్గో యేషాం సామ్యే స్థితం మనః" (5.25), "సమం పశ్యన్ హి సర్వత్ర" (13.28) ఇత్యాద్యాః.**

సమాధానం – కాదు, జ్ఞానము అజ్ఞానము వేరు కనుక ఇదంతా సంగతమే. 'విద్య అవిద్య అనేవి ఒకదానికొకటి విరుద్ధమైనవి. అవి రెండు వ్యతిరేకదిశలను సూచిస్తాయి.' (కఠ.ఉ.2.4) విద్యావిద్యఫలాలుకూడా విరుద్ధమని 'శ్రేయము, ప్రేయము' (కఠ.ఉ.2.2) నిర్దేశించబడింది, విద్యావిషయం శ్రేయస్సు, అవిద్యావిషయం ప్రేయస్సు (ప్రీతిని కలిగించేది) అని, వ్యాసుడు కూడా ఇదే అంటాడు. 'ఇవి రెండేమార్గాలు (మ.భా.శాం.ప.240.6), 'ఈ రెండు మార్గాలే' అని కూడా. ఈ భగవద్గీతలోనూ రెండు నిష్ఠలను చెప్పాడు. శ్రుతి, స్మృతి న్యాయాలవల్లకూడా అవిద్య దాని కారణాలతో సహా తొలగించదగినది అని తెలుస్తూంది. ఈ విషయంలో శ్రుతులు – 'ఇక్కడ తెలుసుకుంటే సత్యముంది. లేకుంటే గొప్పహాని' (కేన.ఉ.2.5), 'దానిని తెలిసినవాడు ఇక్కడ అమరు డవుతాడు' (తై.ఆ.3.12), 'అభ్యుదయానికి మరొక మార్గంలేదు' (శ్వే.ఉ.3.8), 'జ్ఞానికి దేనివలననూ భయంలేదు' (తై.ఉ.2.4) అంటున్నాయి. అజ్ఞాని విషయంలో ఇట్లాకాదు – 'అతనికి భయం' (తై.ఉ.2.7) 'అవిద్యలో పడి ఉండేవారు' (కఠ.ఉ.2.5) 'బ్రహ్మమును తెలుసుకున్నవాడు బ్రహ్మమే అవుతాడు' (ముం.ఉ.3.2.9) 'ఇతడు (ఉపాసించబడే దేవుడు) వేరు, నేను వేరు అనుకునేవాడు తెలిసినవాడు కాడు. అతడు దేవతల పశువు వంటివాడు', (బృహ. ఉ. 1.4.10) 'ఆత్మవేత్త అయినవాడెవడో అతడు ఇదంతా అవుతాడు' (బృహ.ఉ.1.4.10), 'ఎప్పుడు చర్మమువలె'

(శ్వే.ఉ.6.20) – ఇవికాక వేల శ్రుతులున్నాయి. స్మృతులూ ఉన్నాయి – 'అజ్ఞానంచేత జ్ఞానం కప్పుబడి ఉన్నది', (5.25) 'ఎవరిమనసు సమత్వంలో స్థిరమై ఉంటుందో వారు సృష్టిని జయించినవారు', (5.19), 'అంతటా సమంగా ఉన్న ఈశ్వరుని (ఆత్మను) చూస్తూ' (13.28).

### పురుషస్సూకం

**భాష్యమ్ : 2.2.2 న్యాయతశ్చ –**

**"సర్పాన్ కుశాగ్రాణి తథోదపానం జ్ఞాత్వా మనుష్యాః పరివర్జయన్తి ।**
**అజ్ఞానతస్తత్ర పతన్తి కేచిద్ జ్ఞానే ఫలం పశ్య యథా విశిష్టమ్" (శాం.ప.201.16)**

**తథా చ దేహాదిషు ఆత్మబుద్ధిః అవిద్వాన్ రాగద్వేషాదిప్రయుక్తః ధర్మాధర్మానుష్ఠానకృత్ 'జాయతే మ్రియతే' చ ఇత్యవగమ్యతే. దేహాదివ్యతిరిక్తాత్మదర్శినః రాగద్వేషాదిప్రహాణాత్ తదపేక్ష ధర్మాధర్మప్రవృత్త్యుపశమనాత్ ముచ్యన్తే ఇతి న కేనచిత్ ప్రత్యాఖ్యాతుం శక్యం న్యాయతః. తత్ర ఏవం సతి క్షేత్రజ్ఞస్య ఈశ్వరస్యైవ సతః అవిద్యాకృతోపాధిభేదతః సంసారిత్వమివ భవతి, యథా దేహాద్యాత్మత్వమ్ ఆత్మనః. సర్వజన్తూనాం హి ప్రసిద్ధః దేహాదిషు అనాత్మసు ఆత్మభావః నిశ్చితః అవిద్యాకృతః, యథా స్థాణౌ పురుషనిశ్చయః. న చ ఏతావతా పురుషధర్మః స్థాణోః భవతి, స్థాణుధర్మో వా పురుషస్య; తథా న చైతన్యధర్మః దేహస్య, దేహధర్మో వా చేతనస్య, ఏవం సుఖదుఃఖమోహాత్మకత్వాదిః ఆత్మనః న యుక్తః అవిద్యాకృతత్వావిశేషాత్, జరామృత్యువత్.**

**తె.అ.** తర్కానికి (యుక్తికి) కూడా ఇది అనుగుణంగా ఉంది. 'పాములను దర్భలను చెరువులను తెలుసుకుని మనుష్యులు వాటికి దూరంగా ఉంటారు. తెలియక కొందరు అందులో పడతారు. జ్ఞానంవల్ల ఈ ఫలం ఉందని తెలుసుకో', (మ.భా.శాం.201.16) అంటే, దేహాదులయందు ఆత్మబుద్ధిగల అవిద్వాంసుడు రాగద్వేషాదులతో ధర్మాధర్మకర్మలు అనుష్ఠిస్తూ పుడుతూ చస్తూ ఉంటాడు అని తెలుస్తున్నది. దేహాదులకంటే వేరయిన ఆత్మను దర్శించినవారు రాగద్వేషాదులను వదలుకొని, వాటివల్ల చేయబడే ధర్మాధర్మకర్మలను ఆచరించడమనే ప్రవృత్తి ఉపశమించి ముక్తి పొందుతారు. ఇది కాదనడం ఎవరికీ యుక్తిసాధ్యం కాదు. కనుక క్షేత్రజ్ఞుడు వాస్తవంలో ఈశ్వరుడే అయినా అవిద్యచే ఏర్పడిన ఉపాధిభేదంచేత సంసారిత్వం పొందుతున్నాడు, ఆత్మ దేహాది స్వరూపం అన్నట్లు ఎలా కనబడుతుందో అట్లే ఇది కూడ. సమస్తజీవులు అనాత్మలయిన దేహాదులనే ఆత్మలని నిశ్చయించడం ప్రసిద్ధమే. ఇది అవిద్యవలన, స్తంభాన్ని చూచి మనిషి అనుకున్నట్లు. కాని ఈ విధమైన నిశ్చయంవల్ల స్తంభానికి మనిషి లక్షణాలుగాని మనిషికి స్తంభం లక్షణాలుగాని ఏవీ కలగవు. అదే విధంగా దేహానికి చైతన్యధర్మంగాని చేతనానికి దేహధర్మంగాని కలగదు. కనుక సుఖము దుఃఖము మోహము మొదలైనవి ఆత్మకు కలుగవు. అవిద్యాకృతమైన ముసలితనం మృత్యువు వంటివే ఇవికూడా కనుక.

**భాష్యమ్ : 2.3 న, అతుల్యత్వాత్ ఇతి చేత్ – స్థాణుపురుషౌ జ్ఞేయౌ ఏవ సన్తౌ జ్ఞాత్రా అన్యోన్యస్మిన్ అధ్యస్తౌ అవిద్యయా; దేహాత్మనోః తు జ్ఞేయజ్ఞాత్రోః ఏవ ఇతరేతరాధ్యాసః ఇతి న సమః దృష్టాన్తః, అతః దేహధర్మః జ్ఞేయః అపి జ్ఞాతుః ఆత్మనః భవతి ఇతి చేత్ –**

ఆక్షేపణ – కాదు, రెంటికీ పోలికలేదు. స్తంభము పురుషుడు, రెండూ కూడా జ్ఞేయములు అంటే తెలుసుకొనబడేవి. జ్ఞాత అవిద్యవలన ఒకదానిని మరొకదానియందు భ్రమతో ఆరోపిస్తాడు. దేహాత్మల విషయంలో (రెండూ జ్ఞేయములు తెలుసుకొనబడేవి కావు. ఒకటి జ్ఞేయము తెలుసుకొనబడేది మరొకటి జ్ఞాత అంటె తెలుసుకునేవాడు. ఇక్కడ) జ్ఞేయజ్ఞాతలకు ఒకదానియందు మరొకదాని భ్రమారోపణం. కనుక దృష్టాంతం సరిఅయింది కాదు. కనుక దేహం జ్ఞేయమే అయినా దాని ధర్మాలు జ్ఞాత అయిన ఆత్మధర్మాలవుతాయి.

**భాష్యమ్ : 2.3.1 న, అచైతన్యాదిప్రసంగాత్, యది హి జ్ఞేయస్య దేహాదేః క్షేత్రస్య ధర్మాః సుఖదుఃఖ మోహేచ్ఛాద్వేషాదయః జ్ఞాతుః ఆత్మనః భవన్తి తదా జ్ఞేయస్య క్షేత్రస్య ధర్మాః కేచిత్ ఆత్మనః భవంతి అవిద్యాధ్యారోపితాః, జరామరణాదయస్తు న భవన్తి ఇతి విశేషహేతుః వక్తవ్యః. 'న భవన్తి' ఇత్యస్తి అనుమానమ్ అవిద్యాధ్యారోపిత్వాత్, జరామరణాదివత్ ఇతి, హేయత్వాత్ ఉపాదేయత్వాచ్చ ఇత్యాది. తత్రైవం సతి కర్తృత్వభోక్తృత్వలక్షణః సంసారః జ్ఞేయస్థః జ్ఞాతరి అవిద్యయా అధ్యారోపితః ఇతి, న తేన జ్ఞాతుః కించిద్దుష్యతి. యథా బాలైః అధ్యారోపితేన ఆకాశస్య తలమలినత్వాదినా. ఏవం చ సతి సర్వక్షేత్రేష్వపి సతః భగవతః క్షేత్రజ్ఞస్య ఈశ్వరస్య సంసారిత్వగన్ధమాత్రమ్ అపి న ఆశంక్యమ్ (న శక్యం వక్తుమ్). న హి క్వచిదపి లోకే అవిద్యాధ్యస్తేన ధర్మేణ కస్యచిత్ ఉపకారః అపకారో వా దృష్టః.**

సమాధానం – అట్లాకాదు, అప్పుడు ఆత్మ అచేతనం అనవలసివస్తుంది కనుక. జ్ఞేయమయిన క్షేత్రంయొక్క దేహాదిధర్మాలు – సుఖము, దుఃఖము, మోహము, ఇచ్ఛ, ద్వేషము మొదలైనవి – జ్ఞాత అయిన ఆత్మవయితే, అప్పుడు జ్ఞేయమయిన క్షేత్రం యొక్క ధర్మాలు కొన్నిమాత్రం అవిద్యవల్ల అధ్యారోపితమై ఆత్మవవుతున్నాయి, జరామరణాదులైన మరికొన్ని ధర్మాలు మాత్రం ఆత్మకు అంటు కోవడంలేదు అనవలసివస్తుంది. కొన్నిధర్మాలు మాత్రమే ఆత్మకు అంటుకుని మరికొన్ని అంటుకొనక పోవడానికిగల విశేషహేతువు చెప్పవలసివస్తుంది. సుఖదుఃఖాది ధర్మాలు ఆత్మకు అంటుకోడం లేదని మనం అనుమానప్రమాణంచేత గ్రహించవచ్చు. అవి జరామరణాదులవంటివే, అవిద్యవలన బలవంతంగా ఆరోపించబడ్డాయి. అవి హేయములు (విడువబడగలిగినవి) ఉపాదేయములు ((గ్రహింపబడ గలిగినవి) కనుక కూడా ఆత్మధర్మాలు కావని గ్రహించవచ్చు. కర్తృత్వభోక్తృత్వలక్షణమైన సంసారం జ్ఞేయంలోనిదైనా అవిద్యవల్ల

జ్ఞాతయందు బలవంతంగా ఆరోపించబడుతున్నదనేది అసలువిషయం. దానివల్ల జ్ఞాతకు ఏ బాధాలేదు. మూర్ఖులచే అధ్యారోపించబడిన తలమలినత్వాదులు ఆకాశాన్నంటనట్లు. విషయమిది కనుక భగవానుడైన ఈశ్వరుడు క్షేత్రజ్ఞుడు. అన్ని క్షేత్రాలలో ఉంటున్నప్పటికి ఆయనకు సంసారిత్వం వాసనకూడా ఉందని మనం శంకించలేము. ఎందుకంటె లోకంలో అవిద్యవల్ల అధ్యారోపించబడిన ధర్మంచేత ఉపకారం గాని అపకారం గాని కలగడం మనం చూడడంలేదు. (సంసారిధర్మాలు ఈశ్వరునియందు అజ్ఞాన కారణంగా అధ్యారోపించ బడుతున్నాయి. అంతమాత్రంచేత సంసారిధర్మాలు ఈశ్వరునికి కలుగవు, అంటే ఈశ్వరుడు సంసారి అయిపోవడం లేదు, చీకటిలో స్తంభాన్ని చూచి మనిషి అనుకున్నంత మాత్రాన స్తంభం మనిషి అయిపోనట్టు).

**భాష్యమ్ : 2.3.2 యత్తు ఉక్తం 'న సమో దృష్టాన్తః ఇతి' తత్ అసత్. కథమ్? అవిద్యాఽధ్యాసమాత్రం హి దృష్టాన్తదార్ష్టాన్తికయోః సాధర్మ్యం వివక్షితమ్; తత్ న వ్యభిచరతి. 'యత్తు జ్ఞాతరి వ్యభిచరతి' ఇతి మన్యసే తస్యాపి అనైకాన్తికత్వం దర్శితం జరాదిభిః.**

**అవిద్యావత్త్వాత్ క్షేత్రజ్ఞస్య సంసారిత్వమ్ ఇతి చేత్, న అవిద్యాయాః తామసత్వాత్. తామసో హి ప్రత్యయః ఆవరణాత్మకత్వాత్ అవిద్యా, విపరీతగ్రాహకః, సంశయోపస్థాపకః వా అగ్రహణాత్మకో వా. వివేకప్రకాశభావే తదభావాత్. తామసే చ ఆవరణాత్మకే తిమిరాదిదోషే సతి అగ్రహణాదేః అవిద్యామాత్రస్య (అవిద్యాత్రయస్య) ఉపలబ్ధేః.**

**తె.అ.** సమాధానం – దృష్టాంతం సరి అయిందికాదు అనడం కూడా తప్పు. ఎట్లా? అవిద్యవల్ల చేసే అధ్యాసం మాత్రమే దృష్టాంత దార్ష్టాంతాలకు చెప్పిన స్వాధర్మ్యం. అందులో దోషంలేదు. జ్ఞాతవిషయంలో దోషమని మీరంటున్నది కూడా అన్నిధర్మాలవిషయంలో కాదని జరాది దృష్టాంతాలతో ప్రదర్శించాము. (జ్ఞేయములు ఒకదానియందు మరొకటి అధ్యారోపించ బడవచ్చు, జ్ఞాతయందు అధ్యారోపించబడలేవు అని మీరనవచ్చు. అంటే, స్తంభము మనిషి జ్ఞేయాలు. ఇది స్తంభము లేక ఇది మనిషి అని తెలిసినవాడు జ్ఞాత. స్తంభధర్మం మనిషిలోను మనిషిధర్మం స్తంభంలోను భ్రమాస్పద ఆరోపణ చేయవచ్చు. స్తంభాన్ని చూసి మనిషి అని మనిషిని చూసి స్తంభమని భ్రమపడవచ్చు. అంతేగాని స్తంభాన్ని చూచినవాడు తనను మరొకమనిషిగా భ్రమపడడు. స్తంభాన్ని చూసి చీకట్లో దొంగ అనుకోవచ్చు, తనను దొంగ అనుకోడు. కనుక జ్ఞేయధర్మం జ్ఞాతకుగాని జ్ఞాతధర్మం జ్ఞేయమునకు గాని కలగదు అని మీరు ఆక్షేపించవచ్చు. కాని ఆ విధమైన భ్రమాస్పద ఆరోపణ చేయబడింది. లోకంలో మనం సర్వసాధారణంగా చూస్తున్నాం. జ్ఞేయమైన దేహంయొక్క జరామరణాదులు ఆత్మయందు భ్రమాస్పదంగా ఆరోపించబడుతున్నాయి. 'నేను' ముసలివాణ్ణయిపోతున్నాను, 'నేను' చచ్చిపోతున్నాను, అని అనుకుంటున్నాం గదా!)

ఆక్షేపణ - అవిద్యవల్ల క్షేత్రజ్ఞునికి సంసారిత్వం కలుగుతున్నదంటే?

సమాధానం - అట్లా అనడం దోషం. ఎందుకంటె అవిద్య తమస్సువల్ల కలుగుతుంది. అసలు అవిద్య అంటేనే తామసికలక్షణం. అది ఆవరణాత్మకం, అంటే వస్తుస్వరూపం కనిపించకుండా కప్పివేసేది. ఒక వస్తువును చూచి మరొకటి అనుకోవడము (విపరీతగ్రహణము), వస్తువును చూచి ఇది ఆ వస్తువేనా అనే సందేహం కలగడము (సంశయం), అసలు వస్తువున్నట్లే గ్రహించలేకపోవడము (అగ్రహణం) - ఇవన్నీ (ఈ అవిద్యాత్రయం) తమస్సువల్ల జరుగుతాయి. వివేకమనే వెలుగులో తమస్సు ఉండదు. ఆవరణాత్మకమైన తామసంలోనే అగ్రహణాది అవిద్యాత్రయం. (ఆవరణం కలిగించే తమస్సులోనే అగ్రహణం అంటే గ్రహించలేకపోవడం. సంశయం అంటే అనుమాన పడడం; విపరీతగ్రహణం అంటే ఉన్నది ఉన్నట్టుగా కాక యింకో విధంగా గ్రహించడం, అన్న అవిద్యా మూలక మూడు దోషాలు సంభవం).

**భాష్యమ్ : 2.4. అత్రాహ - ఏవం తర్హి జ్ఞాతృధర్మః అవిద్యా? న, కరణే చక్షుషి తైమిరికత్వాది దోషోపలబ్ధేః. యత్తు మన్యసే జ్ఞాతృధర్మః అవిద్యా, తదేవ చ అవిద్యాధర్మవత్త్వం క్షేత్రజ్ఞస్య సంసారిత్వమ్; తత్ర యదుక్తమ్ ఈశ్వర ఏవ క్షేత్రజ్ఞః న సంసారీ ఇత్యేతత్ అయుక్తమ్ ఇతి - తత్ న; యథా కరణే చక్షుషి విపరీతగ్రాహకాదిదోషస్య దర్శనాత్. న విపరీతాదిగ్రహణం తన్నిమిత్తో వా తైమిరికత్వాదిదోషః గ్రహీతుః చక్షుషః సంస్కారేణ తిమిరే అపనీతే గ్రహీతుః అదర్శనాత్ న గ్రహీతుః అధర్మః యథా, తథా సర్వత్రైవ అగ్రహణవిపరీతసంశయప్రత్యయాః తన్నిమిత్తాః, కరణస్యైవ కస్యచిత్ భవితుమ్ అర్హన్తి. న జ్ఞాతుః క్షేత్రజ్ఞస్య. సంవేద్యత్వాచ్చ తేషాం ప్రదీపప్రకాశవత్ న జ్ఞాతృధర్మత్వమ్. సంవేద్యత్వాదేవ స్వాత్మవ్యతిరిక్తసంవేద్యత్వమ్. సర్వకరణవియోగే చ కైవల్యే సర్వవాదిభిః అవిద్యాదిదోషవత్త్వానభ్యు పగమాత్. ఆత్మనః యది క్షేత్రస్య అగ్న్యుష్ణవత్ స్వః ధర్మః, తతః న కదాచిదపి తేన వియోగః స్యాత్. అవిక్రియస్య చ వ్యోమవత్ సర్వగతస్య అమూర్తస్య ఆత్మనః కేనచిత్ సంయోగవియోగానుపపత్తేః సిద్ధం క్షేత్రజ్ఞస్య నిత్యమ్ ఏవ ఈశ్వరత్వమ్. "అనాదిత్వాన్నిర్గుణత్వాత్" (13.31) ఇతి ఈశ్వరవచనాచ్చ.**

ఆక్షేపణ - అట్లా అయితే అవిద్య జ్ఞాతయొక్క గుణమవుతుంది.

సమాధానం - కాదు. కనుచూపు సరిగా లేకపోవడంవంటి దోషాలు కంటివి.

ఆక్షేపణ - అవిద్య జ్ఞాత యొక్క గుణం, ఆ అవిద్య అనే గుణం ఉన్నవాడు కనుకనే క్షేత్రజ్ఞుడు సంసారి అవుతున్నాడు. 'క్షేత్రజ్ఞుడు ఈశ్వరుడే సంసారికాదు' అని మీరంటున్నమాట అయుక్తం.

సమాధానం - మీ వాదం సరికాదు. విపరీతగ్రహణంవంటి దోషాలు కరణమైన కన్నువి. విపరీతగ్రహణాదులు అందుకు కారణమైన దృష్టిదోషాలు గాని గ్రహించేవాడివికావు. కన్ను

బాగుచేసుకున్న తరువాత చూచేవాని దృష్టిదోషం తొలగి చూచేవానిలో ఆ దోషం కనిపించనట్లే అగ్రహణాది అవిద్యాత్రయం, వాటికి కారణాలైన దృష్టి దోషాలు కరణానివే గాని జ్ఞాత అయిన క్షేత్రజ్ఞునివి కావు. ఇవి జ్ఞేయములు. దీపపువెలుగు దీపధర్మమైనట్లుగా ఇవి జ్ఞాతధర్మాలు కావు. అవి తెలియదగినవి, అంటే తమ్ము తాము తెలిసుకోలేనివి, అన్యవస్తువుచే మాత్రమే తెలుసుకోబడగలవి అని. అన్ని కరణములు వదలిపోయిన కైవల్యస్థితిలో ఆత్మకు అవిద్యాది దోషాలుండవు అని అన్నివాదాలవారు అంగీకరిస్తారు. అగ్నికి ఉష్ణం స్వధర్మమైనట్లు ఆత్మ అయిన క్షేత్రజ్ఞునివే ఈ దోషాలయినట్లయితే అవి వదలిపోవడమంటూ ఉండదు. (అగ్నిని ఉష్ణం వదలనట్లు. అవిద్యాధర్మం ఆత్మకు ఒకప్పుడుండి మరొకపుడు వదలడమనేది అసంగతం.) ఆకాశంవలె అంతటా వ్యాపించి అవిక్రియము అమూర్తము అయిన ఆత్మకు దేనితోను సంయోగవియోగాలు లేవు. కనుక క్షేత్రజ్ఞుడు ఎప్పుడూ ఈశ్వరుడే అని తేలింది. భగవానుడు కూడా 'అనాదిత్వాత్ నిర్గుణత్వాత్' (13.31) అని అంటున్నాడు.

**భాష్యమ్ : 2.5. నన్వేవం సతి సంసారసంసారిత్వాభావే శాస్త్రానర్థక్యాదిదోషః స్యాదితి చేత్ – న సర్వైః అభ్యుపగతత్వాత్. సర్వైః హి ఆత్మవాదిభిః అభ్యుపగతః దోషః న ఏకేన పరిహర్తవ్యః భవతి. కథమ్ అభ్యుపగతః ఇతి? ముక్తాత్మనాం హి సంసారసంసారిత్వవ్యవహారాభావః సర్వైరేవ ఆత్మవాదిభిః ఇష్యతే. న చ తేషాం శాస్త్రానర్థక్యాదిదోషప్రాప్తిః అభ్యుపగతా. తథా నః, క్షేత్రజ్ఞానామ్ ఈశ్వరైకత్వే సతి శాస్త్రానర్థక్యం భవతు, అవిద్యావిషయే చ అర్థవత్త్వమ్, యథా ద్వైతవాదినాం సర్వేషాం బన్ధావస్థాయామ్ ఏవ శాస్త్రాద్యర్థవత్వం న ముక్తావస్థాయాం, ఏవమ్.**

ఆక్షేపణ – మరి అటువంటపుడు సంసారము సంసారిత్వము లేవు కనుక శాస్త్రం నిష్ప్రయోజనం కావడం వంటి దోషం కలుగుతుంది కదా?

సమాధానం – అందరూ ఒప్పుకున్న దోషమే అది. ఆత్మవాదులందరూ ఒప్పుకున్న దోషాన్ని పరిహరించవలసిన అవసరం అద్వైతులమైన మాకొకరికే ఉండదు.

ఆక్షేపణ – అందరూ ఎట్లా ఒప్పుకున్నారు?

సమాధానం – ముక్తాత్ములకు సంసారసంసారిత్వవ్యవహారం లేదనేది ఆత్మవాదులందరు ఒప్పుకుంటున్నారు. వారి మతంలో శాస్త్రం నిష్ప్రయోజనమవుతున్నదని ఎవరూ అనడం లేదు. అట్లాగే మామతంలో కూడా జీవుడు ఈశ్వరుడితో ఐక్యమయిన స్థితిలో శాస్త్రం నిరర్థకం కావచ్చు, కాని అవిద్యాస్థితిలో శాస్త్రం సార్థకమే. ద్వైతవాదులందరూ కూడా ఇదేకదా అంటున్నారు, బంధావస్థయందే శాస్త్రాదులకర్థం ముక్తావస్థయందు కాదని. అట్లాగే మామతంలోనూ.

**భాష్యమ్ : 2.6 నను ఆత్మనః బన్ధముక్తావస్థే పరమార్థతః ఏవ వస్తుభూతే ద్వైతినాం నః సర్వేషామ్. అతః హేయోపాదేయతత్సాధనసద్భావే శాస్త్రాద్యర్థవత్త్వం స్యాత్, అద్వైతినాం పునః ద్వైతస్య అపరమార్థత్వాత్, అవిద్యాకృతత్వాత్, బన్ధావస్థాయాశ్చ ఆత్మనః అపరమార్థత్వే నిర్విషయత్వాత్ శాస్త్రాద్యానర్థక్యమ్ ఇతి చేత్, న ఆత్మనః అవస్థాభేదానుపపత్తేః. యది తావత్ ఆత్మనః బన్ధముక్తావస్థే యుగపత్ స్యాతాం క్రమేణ వా? యుగపత్ తావత్ విరోధాత్ న సంభవతః, స్థితిగతీ ఇవ ఏకస్మిన్. క్రమభావిత్వే చ నిర్నిమిత్తత్వం సంనిమిత్తత్వం వా? నిర్నిమిత్వత్వే అనిర్మోక్షప్రసంగః. స నిమిత్తత్వే చ స్వతః అభావాత్ అపరమార్థత్వప్రసంగః. తథా చ సతి అభ్యుపగమహానిః.**

ఆక్షేపణ – ద్వైతవాదులందరూ ఆత్మకు బంధముక్తావస్థలు రెండూ నిజంగానే ఉన్నాయంటారు. కనుక హేయ ఉపాదేయాలు వాటి సాధనాలు ఉన్నాయని ఒప్పుకున్నపుడు వాటిని చెప్పే శాస్త్రాలు సార్థకమవుతాయి. కాని అద్వైతులు రెండవది నిజంగా లేదు, ఆత్మయొక్క బంధావస్థ అవిద్యాకృతము, వాస్తవంలో ఆత్మకు బంధావస్థలేదు అంటున్నారు. ఇక శాస్త్రం దేన్ని ఎవరికి చెపుతుంది? అది వ్యర్థం కాదా?

**భాష్యమ్ : 2.6.1 కిం చ - బన్ధముక్తావస్థయోః పౌర్వాపర్యానిరూపణాయాం బన్ధావస్థా పూర్వం ప్రకల్ప్యా అనాదిమతీ, అన్తవతీ చ. తచ్చ ప్రమాణవిరుద్ధమ్. తథా మోక్షావస్థా సాదిమతీ అనన్తా చ ప్రమాణవిరుద్ధా ఏవ అభ్యుపగమ్యతే. న చ అవస్థావతః అవస్థాన్తరం గచ్ఛతః నిత్యత్వమ్ ఉపపాదయితుం శక్యమ్. అథ అనిత్యత్వదోష పరిహారాయ బన్ధముక్తావస్థాభేదః న పరికల్ప్యతే అతః ద్వైతినామపి శాస్త్రానర్థక్యాదిదోషః అపరిహార్యః ఏవ, ఇతి సమానత్వాత్ న అద్వైతవాదినా పరిహర్తవ్యో దోషః.**

సమాధానం – మేము ఒప్పుకోము. ఎందుకంటే మీరంటున్నట్లు ఆత్మకు వివిధావస్థలు లేవు కనుక. ఉంటే, ఈ రెండవస్థలు ఒకే సమయంలోనా, ఒకదాని తరువాత మరొకటా? ఒకే సమయంలో ఉండడం అసంభవం, ఆ రెండూ స్థితిగతులవలె విరుద్ధమైనవి కనుక. (కదలకుండా ఉండడం కదలడం రెండూ ఒక వస్తువుకు ఒకేసారి సంభవించవు). ఒకదాని తరువాత మరొక అవస్థ కలుగుతుంది అంటారా? అయితే నిర్నిమిత్తంగానా? సనిమిత్తంగానా? (అంటే ముక్తావస్థ ఏ కారణము లేకుండానే దానంతట అదే కలుగుతుందా? లేక దానికేదైనా కారణం ఉందా?) కారణంలేదంటే అసలు ముక్తావస్థ లేదనవలసివస్తుంది. కారణముందంటే, (స్వతహాగా కలిగినది కాదు కనుక, మరొక దానిపై ఆధారపడిన ముక్తిగనుక) ఆ ముక్తి నిజమైన ముక్తి కాదనవలసి వస్తుంది. అప్పుడు మీ సిద్ధాంతాన్ని మీరే వదులుకోవలసివస్తుంది. అంతేకాదు, బంధముక్తావస్థలు

ఒకటి ముందు మరొకటి వెనుక కలుగుతాయి అని నిరూపించినట్లయితే బంధావస్థ ముందు అనవలసివస్తుంది. అంటే దానికి ఆది లేదు కాని అంతముంది అని ఒప్పుకోవలసి వస్తుంది. ఇది ప్రమాణవిరుద్ధం. అట్లాగే ముక్తావస్థకు ఆది ఉంది కాని అంతంలేదు అని ప్రమాణ విరుద్ధమైన మాట అనవలసివస్తుంది. ఇన్ని అవస్థలున్న ఆత్మ, ఒక అవస్థనుండి మరొక అవస్థకు మారే ఆత్మ నిత్యమని సిద్ధాంతం చేయడం సాధ్యంకాదు. అనిత్యత్వాదిదోషం పరిహరించాలంటే ఆత్మకు బంధాముక్తావస్థాభేదం కల్పించరాదు. కనుక ద్వైతులకు కూడా శాస్త్రానర్థక్యదోషం తప్పదు. ఈ దోషం ద్వైతులకు అద్వైతులకు సమానమే కనుక అద్వైతులకు మాత్రమే దీన్ని పరిహరించవలసిన అవసరం లేదు.

**భాష్యమ్ : 2.6.2. న చ శాస్త్రానర్థక్యమ్, యథాప్రసిద్ధావిద్వత్పురుషవిషయత్వాత్ శాస్త్రస్య, అవిదుషాం హి ఫలహేత్వోః అనాత్మనోః ఆత్మదర్శనం న విదుషామ్. విదుషాం హి ఫలహేతుభ్యామ్ ఆత్మనః అన్యత్వదర్శనే సతి తయోః అహమితి ఆత్మదర్శనానుపపత్తేః. న హి అత్యన్తమూఢః ఉన్మత్తాదిః అపి జలాగ్న్యోః ఛాయాప్రకాశయోః వా ఐకాత్మ్యం పశ్యతి, కిముత వివేకీ. తస్మాత్ న విధిప్రతిషేధశాస్త్రం తావత్ ఫలహేతుభ్యామ్ ఆత్మనః అన్యత్వదర్శినః భవతి. న హి "దేవదత్త త్వమ్ ఇదం కురు" ఇతి కస్మింశ్చిత్ కర్మణి నియుక్తే విష్ణుమిత్రః 'అహం నియుక్తః' ఇతి తత్రస్థః నియోగం శృణ్వన్నపి ప్రతిపద్యతే. నియోగవిషయవివేకాగ్రహణాత్తు ఉపపద్యతే ప్రతిపత్తిః. తథా ఫలహేత్వోః అపి.**

(అంతేకాదు) శాస్త్రం వ్యర్థమని మేము అనం. ఎందుకంటె లోకంలో అవిద్వాంసులు ఎప్పుడూ ఉంటూనే ఉంటారు. శాస్త్రం వారికొరకు. అవిద్వాంసులు మాత్రమే ఫలాన్ని, దాని హేతువును ఆత్మ అనుకుంటారు. (జాతి ఆయు భోగాలను ఫలమంటారు. శుభాశుభకర్మలు వాటికి హేతువు.) విద్వాంసులు ఫలహేతువులు ఆత్మకంటె వేరని గ్రహిస్తారు, కనుక వాటియందు 'అవి నేను' అనే ఆత్మదర్శనం కలగదు. అతిమూఢులు పిచ్చివారు గూడా నీటిని చూచి నిప్పని, నీడను చూచి వెలుగని అనుకోరు. అటువంటప్పుడు వివేకమున్నవాడు ఎట్లా అనుకుంటాడు? కనుక ఫలహేతువులు ఆత్మకాదు, అవి వేరు నేను వేరు అని గ్రహించినవానికి విధిప్రతిషేధశాస్త్రంతో పనిలేదు. 'దేవదత్తా, నీవు ఇది చేయి' అని అన్నపుడు అక్కడే ఉన్న విష్ణుమిత్రుడు విని 'నన్ను చెయ్యమంటున్నారు' అనుకోడు, చెయ్యమని అంటున్నది ఎవరినో అర్థంకానపుడు ఆ విధంగా అనుకోడం సాధ్యమే. ఫలహేతువుల విషయంలోనూ అంతే.

**భాష్యమ్ : 2.7. నను ప్రాకృతసంబన్ధాపేక్షయా యుక్తాః ఏవ ప్రతిపత్తిః శాస్త్రార్థవిషయా ఫలహేతుభ్యామ్ అన్యాత్మదర్శనేఽపి సతి – ఇష్టఫలహేతౌ ప్రవర్తితః అస్మి, అనిష్టఫలహేతోః**

**చ నివర్తితః అస్మి ఇతి; యథా పితృపుత్రాదీనామ్ ఇతరేతరాత్మాన్యత్వదర్శనే సత్యపి అన్యోన్యనియోగ ప్రతిషేధార్థప్రతిపత్తిః? (బృ.ఉ.1.5.17).**

ఆక్షేపణ - ఫలహేతువులు ఆత్మకాదు అని తెలుసుకున్న తరువాత కూడా ప్రకృతితోటి తన సంబంధం చేత శాస్త్రం నన్ను ఇష్టఫలహేతువులయందు ప్రవర్తింపచేస్తున్నది, అనిష్టఫలహేతువులనుండి నివర్తింపచేస్తున్నది అనుకోవచ్చు గదా? ఎట్లాగంటే, తండ్రి కొడుకులకు ఒకరియందొకరికి ఆత్మభావం లేనప్పటికి (తండ్రి తాను తనకొడుకనిగాని కొడుకు తన తండ్రి అనిగాని అనుకోనప్పటికీ) ఒకరికి చేసిన నిషేధప్రతిషేధాలు మరొకరు గ్రహించినట్లు. (తండ్రికి శాస్త్రం ఏ కర్మలు విధించిందో ఏ కర్మలు ప్రతిషేధించిందో తండ్రి తరువాత కుమారుడు కూడా ఆ విధి ప్రతిషేధాలు గ్రహిస్తాడు. శాస్త్రం విధించింది ప్రతిషేధించింది నా తండ్రికికదా నాకు కాదు అనుకోడు.)

**భాష్యమ్ : 2.7.1 న వ్యతిరిక్తాత్మదర్శన ప్రతిపత్తేః ప్రాగేన ఫలహేత్వో ఆత్మాభిమానస్య సిద్ధత్వాత్. ప్రతిపన్ననియోగప్రతిషేధార్థః. హి ఫలహేతుభ్యామ్ అన్యత్వం ప్రతిపద్యతే, న పూర్వమ్. తస్మాత్ విధిప్రతిషేధ శాస్త్రమ్ అవిద్వద్విషయమ్ ఇతి సిద్ధమ్.**

సమాధానం - కాదు. ఆత్మ వేరు అనే జ్ఞానం కలుగకపూర్వం మాత్రమే ఫలహేతువులయందు ఆత్మాభిమానం ఉండగలదు. నియోగప్రతిషేధాల అర్థం బాగా తెలుసుకున్న తరువాతనే ఫలహేతువులు ఆత్మకాదు అని తెలుస్తుంది, అంతకుముందు తెలియదు. కనుక విధిప్రతిషేధశాస్త్రం అజ్ఞానులకు మాత్రమే అని తేలింది.

**భాష్యమ్ : 2.8 నను "స్వర్గకామో యజేత" (ఆప.శ్రౌ. 10.2.1) "కలఞ్జం న భక్షయేత్" ఇత్యాదౌ ఆత్మవ్యతిరేకదర్శినామ్ అప్రవృత్తౌ కేవలదేహాద్యాత్మదృష్టీనాం చ - అతః కర్తుః అభావాత్ శాస్త్రానర్థక్యమ్ ఇతి చేత్?**

ఆక్షేపణ - 'స్వర్గం కోరుకునేవారు యజ్ఞం చేయవలె' (ఆప.శ్రౌ.సూ. 10.2.1) 'మాంసం తినరాదు' వంటి విధిప్రతిషేధ రూప శాస్త్రం ఆత్మవేరు అని తెలిసినవానిని ప్రవర్తింపచేయలేదు. దేహమే ఆత్మ అనుకునేవాడికి శాస్త్రంతో పనిలేదు. ఎవరికీ పనికిరాని శాస్త్రం వ్యర్థం కదా?

**భాష్యమ్ : 2.8.1 న, యథా ప్రసిద్ధితః ఏవ ప్రవృత్తినివృత్త్యుపపత్తేః. ఈశ్వరక్షేత్రజ్ఞై కత్వదర్శీ బ్రహ్మవిత్ తావత్ న ప్రవర్తతే. తథా నైరాత్మ వాద్యపి 'నాస్తి పరలోకః' ఇతి న ప్రవర్తతే. యథాప్రసిద్ధి తస్తు విధిప్రతిషేధశాస్త్ర శ్రవణాన్యథాఽనుప పత్త్యా అనుమితాత్మస్తిత్వః ఆత్మవిశేషానభిజ్ఞః కర్మఫలం సంజాతతృష్ణః శ్రద్ధధానతయా చ ప్రవర్తతే ఇతి సర్వేషాం నః ప్రత్యక్షమ్, అతః న శాస్త్రానర్థక్యమ్.**

సమాధానం – కాదు, ప్రవృత్తి నివృత్తులు లోకంలో ఎప్పుడూ ఉంటూనే ఉన్నాయి. క్షేత్రజ్ఞుడు ఈశ్వరుడు ఒకడే అని తెలిసిన బ్రహ్మవేత్తకు శాస్త్రంతో పనిలేదు. ఆత్మలేదు పరలోకంలేదు అనేవాడికి శాస్త్రం పనికిరానిదే (లోకంలో ఉన్నది ఈ రెండువిధాలైనవారే అయితే శాస్త్రం మీరన్నట్లు వ్యర్థమే. కాని లోకంలో చాలామంది ఈ రెండువర్గాలలోను చేరనివారు.) శాస్త్రశ్రవణంవల్ల తప్ప అన్యథా అనుమానించరాని ఆత్మను ఉన్నట్టు గ్రహించి, అంతకంటె ఆత్మను విశేషంగా తెలియక, కర్మఫలంపై కోరికకలిగి శ్రద్ధతో కర్మలాచరించేవారిని మనం ఎందరినో చూస్తున్నాం. కనుక శాస్త్రం వ్యర్థం కాదు.

**భాష్యమ్ : 2.9 వివేకినామ్ అప్రవృత్తిదర్శనాత్ తదనుగామినామ్ అప్రవృత్తౌ శాస్త్రానర్థక్యమ్ ఇతి చేత్ –**

ఆక్షేపణ – జ్ఞానులు కర్మలయందు ప్రవర్తించకపోవడం చూచి ఇతరులుకూడా ప్రవర్తించరు. అప్పుడు శాస్త్రం వ్యర్థం కదా?

**భాష్యమ్ : 2.9.1 న, కస్యచిదేవ వివేకోపపత్తేః. అనేకేషు హి ప్రాణిషు కశ్చిదేవ వివేకీ స్యాత్, యథా ఇదానీమ్. న చ వివేకినామ్ అనువర్తన్తే మూఢాః, రాగాదిదోషతన్త్రత్వాత్ ప్రవృత్తేః, అభిచరణాదౌ చ ప్రవృత్తిదర్శనాత్. స్వభావ్యాచ్చ ప్రవృత్తేః. "స్వభావస్తు ప్రవర్తతే" (5.14) ఇతి హి ఉక్తమ్. తస్మాత్ అవిద్యామాత్రం సంసారః యథాదృష్టవిషయః ఏవ, న క్షేత్రజ్ఞస్య కేవలస్య అవిద్యా తత్కార్యం చ. న మిథ్యాజ్ఞానం పరమార్థవస్తు దూషయితం సమర్థమ్. న హి ఊషరదేశం స్నేహేన పంకీకర్తుం శక్నోతి మరీచ్యుదకం, తథా అవిద్యా క్షేత్రజ్ఞస్య న కించిత్ కర్తుం శక్నోతి. అతశ్చ ఇదముక్తం "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" (13.2), "అజ్ఞానేనావృతం జ్ఞానమ్" (5.15) ఇతి చ.**

సమాధానం – కాదు, వివేకం ఎవడికోకాని కలగదు. అనేకప్రాణులలో ఎవడో ఒకడుంటాడు వివేకి, ఈనాటివలె మూఢులు వివేకిని అనుసరించరు, వాళ్ళ ప్రవర్తన వాళ్ళ చేతిలో లేదు. వారి కోరిక వారి నియంత. రాగాదిదోషం వారిచేత కర్మచేయిస్తుంది. శాతబడివంటి కర్మలు చేయడం చూస్తున్నాం. పైగా వారి కర్మలు వారి స్వభావాన్ని బట్టే ఉంటాయి. 'స్వభావస్తు ప్రవర్తతే' (5.14) అని కదా అన్నాడు. కనుక సంసారం అవిద్యతప్ప మరేమీ కాదు. వెనుక చెప్పుకొన్నట్లు అది అజ్ఞానికి మాత్రమే విషయం. క్షేత్రజ్ఞుడికి అవిద్య దాని ఫలితము కూడా లేవు. మిథ్యాజ్ఞానం పరమార్థవస్తువును దూషితం చేయలేదు. ఎండమావిలోని నీరు బీడును తడుపలేనట్లు అవిద్య క్షేత్రజ్ఞుని ఏమీ చేయలేదు. (అవిద్య అనే ఎండమావిలోని నీరు క్షేత్రాన్ని తడుపుతుంది. ఆ క్షేత్రం ఫలిస్తుంది, అదే సంసారఫలం. ఏమీ ఫలించని ఊషరక్షేత్రమే క్షేత్రజ్ఞుడు. అసలే బీడు. నీరు లేదు.

విత్తనం (జ్ఞానాగ్నిలో) కాలినది. ఇక ఆ క్షేత్రంలో ఏం ఫలం?) కనుకనే ఇలా అంటున్నాడు 'క్షేత్రజ్ఞంచాపి మాం విద్ధి' (13.2), 'అజ్ఞానేనావృతం జ్ఞానం' (5.15) అని.

**భాష్యమ్ : 2.10 అథ కిమిదం సంసారిణామ్ ఇవ "అహమ్ ఏవమ్" "మమైవ ఇదమ్" ఇతి పణ్డితానామ్ అపి?**

ఆక్షేపణ - మరి సంసారులకు వలె 'నేనింతవాణ్ణి' 'ఇది నాదే' అని పండితులకు కూడా అనిపించడమేమిటి?

**భాష్యమ్ : 2.10.1 శృణు; ఇదం తత్పాణ్డిత్యం, యత్ క్షేత్ర ఏవ ఆత్మదర్శనమ్. యది పునః క్షేత్రజ్ఞమ్ అవిక్రియం పశ్యేయుః, తతః న భోగం కర్మ వా ఆకాంక్షేయుః "మమ స్యాత్" ఇతి. విక్రియైవ భోగకర్మణీ. అథ ఏవం సతి, ఫలార్థిత్వాత్ అవిద్వాన్ ప్రవర్తతే. విదుషః పునః అవిక్రియాత్మ దర్శినః ఫలార్థిత్వాభావాత్ ప్రవృత్త్యనుపపత్తౌ కార్యకారణసంఘాతవ్యాపారోపరమే నివృత్తిః ఉపచర్యతే.**

**ఇదం చ అన్యత్ పాణ్డిత్యం కస్య చిత్ అస్తు – క్షేత్రజ్ఞః ఈశ్వరః ఏవ, క్షేత్రం చ అన్యత్ క్షేత్రజ్ఞస్య ఏవ విషయః. అహం తు సంసారీ సుఖీ దుఃఖీ చ. సంసారోపరమశ్చ మమ కర్తవ్యః క్షేత్రక్షేత్రజ్ఞవిజ్ఞానేన ధ్యానేన చ ఈశ్వరం క్షేత్రజ్ఞం సాక్షాత్కృత్వా తత్స్వరూప అవస్థానేన ఇతి. యశ్చ ఏవం బుధ్యతే, యశ్చ బోధయతి, నాసౌ క్షేత్రజ్ఞః ఇతి. ఏవం మన్వానః యశ్చ స పణ్డితాపసదః సంసారమోక్షయోః శాస్త్రస్య చ అర్థవత్త్వం కరోమి ఇతి, ఆత్మహా స్వయం మూఢః, అన్యాంశ్చ వ్యామోహయతి – శాస్త్రార్థసంప్రదాయరహితత్వాత్ శ్రుతహానిమ్ అశ్రుతకల్పనాం చ కుర్వన్. తస్మాత్ అసంప్రదాయవిత్ సర్వశాస్త్రవిదపి మూర్ఖవదేవ ఉపేక్షణీయః.**

సమాధానం - విను. ఆ పాండిత్యమేపాటిదంటే క్షేత్రంలో మాత్రమే ఆత్మను దర్శించడం. అవిక్రియమైన క్షేత్రజ్ఞుణ్ణి దర్శించగలిగితే 'నాకీ భోగం కలగాలి' అనిగాని 'దానికొరకీ కర్మ చేయాలి' అనిగాని అనిపించదు. భోగకర్మలు రెండూ వికారాలే. ఫలం కోరుకుంటాడు కనుక అజ్ఞాని కర్మలయందు ప్రవర్తిస్తాడు. జ్ఞాని అట్లాకాక అవిక్రియాత్మను దర్శించినవాడు కనుక అతనికి ఫలంపై కోరిక, కర్మలయందు ప్రవృత్తిలేకపోవడంచేత కార్యకరణసంఘాతవ్యాపారం ఆగిపోయి నివృత్తిని సేవిస్తాడు.

మరొకవిధమైన పాండిత్యం కూడా ఉంది. క్షేత్రజ్ఞుడీశ్వరుడే, క్షేత్రజ్ఞునికి విషయమైన క్షేత్రం వేరు, 'నేనేమో సుఖము దుఃఖము అనుభవించే సంసారిని, క్షేత్రక్షేత్రజ్ఞవిజ్ఞానం చేత ధ్యానంచేత ఈశ్వరుడైన క్షేత్రజ్ఞుణ్ణి సాక్షాత్కరించుకుని, ఆ స్వరూపంలో నిలిచిపోయి సంసారంనుండి

వైదొలగడం నా కర్తవ్యం' – ఇట్లా అనుకునేవాడు, ఇతరులకు బోధించేవాడు క్షేత్రజ్ఞుడు కాదు. 'ఈ విధంగా సంసారమోక్షాలనూ శాస్త్రాన్ని కూడా సార్థకం చేస్తాను' అని భావించేవాడు పండితుల్లో అధముడు, ఆత్మను హత్యచేసేవాడు, శాస్త్రార్థ సంప్రదాయం తెలియనివాడు, విన్నదానిని వదలి విననిదానిని కల్పన చేసేవాడు, స్వయంగా మూఢుడు, వాడు ఇతరులను కూడా మూఢులను చేస్తాడు. కనుక సంప్రదాయం తెలియనివాడు, సర్వశాస్త్రాలు తెలిసినవాడైనప్పటికీ ఉపేక్షణీయుడు.

**భాష్యమ్ : 2.11.1 యదుక్తమ్ – 'ఈశ్వరస్య క్షేత్రజ్ఞై కత్వే సంసారిత్వం ప్రాప్నోతి, క్షేత్రజ్ఞానాం చేశ్వ రైకత్వే సంసారిణః "అభావాత్ సంసారాభావప్రసంగః" ఇతి – ఏతౌ దోషౌ ప్రత్యుక్తౌ "విద్యాఽ విద్యయోః వైలక్షణ్యాభ్యుపగమాత్" ఇతి. కథమ్? అవిద్యాపరికల్పితదోషేణ తద్విషయం వస్తు పారమార్థికం న దుష్యతి ఇతి. తథా చ దృష్టాన్తః దర్శితః – మరీచ్యమ్భసా ఊషరదేశః న పంకీక్రియతే ఇతి. సంసారిణః అభావాత్ సంసారభావప్రసంగదోషోఽ పి సంసారసంసారిణోః అవిద్యాకల్పితత్వో– పపత్త్యా ప్రత్యుక్తః.**

సమాధానం – పైన రెండు ఆక్షేపణలు చేయబడ్డాయి. 1. క్షేత్రజ్ఞునితో ఐక్యమైనందున ఈశ్వరుడికి సంసారిత్వం ప్రాప్తిస్తుంది అని, 2. క్షేత్రజ్ఞులు ఈశ్వరుడే కనుక సంసారం లేనందున సంసారులే లేదనవలసి వస్తుంది అని. ఈ రెండు ఆక్షేపాలకు సమాధానం చెప్పాం, విద్యను అవిద్యను వేరుచేసి చూడడం చేత ఆ దోషాలు తొలగుతవి. ఎట్లా? అవిద్యాకల్పిత దోషం చేత అసలువస్తువు దూషితంకాదు కనుక. దృష్టాంతం కూడా చూపాం, ఎండమావిలోని నీరు ఊషరక్షేత్రాన్ని తడుపలేనట్లు అని. ఇక, సంసారులు లేరు కనుక సంసారమూ లేకపోవలసి వస్తుందన్న ఆక్షేపానికి అవిద్యాకల్పితాలై ఆ రెండూ ఉంటూనే ఉంటాయని సమాధానం చెప్పాం.

**భాష్యమ్ : 2.12 నను అవిద్యావత్త్వమేవ క్షేత్రజ్ఞస్య సంసారిత్వదోషః. తత్కృతం చ సుఖిత్వ దుః ఖిత్వాది ప్రత్యక్షమ్ ఉపలభ్యతే? ఇతి చేత్ –**

ఆక్షేపణ – ఈ అవిద్య కలిగి ఉండడమే క్షేత్రజ్ఞుని సంసారిత్వదోషం. దాని ఫలితంగా కలిగే సుఖము దుఃఖము మొదలైనవి ప్రత్యక్షంగా చూస్తున్నాం కదా?

**భాష్యమ్ : 2.12.1 న, జ్ఞేయస్య క్షేత్రధర్మత్వాత్, జ్ఞాతుః క్షేత్రజ్ఞస్య తత్కృతదోషానుపపత్తేః. యావత్ కించిత్ క్షేత్రజ్ఞస్య దోషజాతమ్ అవిద్యమానమ్ ఆసంజయసి తస్య జ్ఞేయత్వోపపత్తేః క్షేత్రధర్మత్వ మేవ న క్షేత్రజ్ఞధర్మత్వమ్. న చ తేన క్షేత్రజ్ఞః దుష్యతి, జ్ఞేయేన జ్ఞాతుః సంసర్గానుపపత్తేః. యది హి సంసర్గః స్యాత్ జ్ఞేయత్వమేవ న ఉపపద్యేత. యది ఆత్మనః ధర్మః అవిద్యావత్త్వం దుఃఖిత్వాది చ కథం భోః ప్రత్యక్షమ్ ఉపలభ్యతే? కథం వా క్షేత్రజ్ఞధర్మః?**

**'జ్ఞేయం చ తత్ సర్వం క్షేత్రం జ్ఞాతైవ క్షేత్రజ్ఞః' ఇత్యవధారితే, అవిద్యాదుఃఖిత్వాదేః క్షేత్రజ్ఞవిశేషణత్వం క్షేత్రజ్ఞధర్మత్వం, తస్య చ ప్రత్యక్షోప లభ్యత్వమ్ ఇతి విరుద్ధమ్ ఉచ్యతే అవిద్యామాత్రావష్టమ్భాత్ కేవలమ్.**

సమాధానం - కాదు, తెలియబడేదంతా, అంటే జ్ఞేయం, క్షేత్రధర్మం. దానిఫలితంగా కలిగే దోషాలు తెలుసుకునే క్షేత్రజ్ఞుడికి, జ్ఞాతకు అంటుకోవు. వాస్తవంగా లేని దోషాలు ఏవైతే మీరు క్షేత్రజ్ఞుడికి అంటగడుతున్నారో అవి జ్ఞేయములు, కనుక క్షేత్రధర్మాలు; కాని క్షేత్రజ్ఞుని ధర్మాలు కావు. వాటివల్ల క్షేత్రజ్ఞుడు దూషితుడు కాడు, జ్ఞేయంతో జ్ఞాతకు సంసర్గం లేదు కనుక. సంసర్గమే ఉంటే అవి జ్ఞేయాలే కాకపోవును. అవిద్యకలిగి ఉండడం దుఃఖం చెందడం వంటివి ఆత్మధర్మాలైతే అవి ప్రత్యక్షంగా ఎట్లా కనిపించగలుగుతాయి? క్షేత్రజ్ఞుని ధర్మాలెట్లా అవుతాయి? జ్ఞేయమైనదంతా క్షేత్రము, జ్ఞాతయే క్షేత్రజ్ఞుడునని ఒప్పుకున్న తరువాత అవిద్యాదుఃఖాదులు క్షేత్రజ్ఞుని ధర్మాలని అవి ప్రత్యక్షంగా కనిపిస్తున్నాయని అనడం కేవలం అవిద్యాబలంతో చెప్పే విరుద్ధమైనమాట.

**భాష్యమ్ : 2.13 అత్రాహ - సా అవిద్యా కస్యేతి. యస్య దృశ్యతే తస్యైవ. కస్య దృశ్యతే ఇతి? అత్రోచ్యతే - "అవిద్యా కస్య దృశ్యతే" ఇతి ప్రశ్నః నిరర్థకః. కథమ్? దృశ్యతే చేత్ అవిద్యా, తద్వన్తమపి పశ్యసి. న చ తద్వతి ఉపలభ్యమానే "సా కస్యేతి" ప్రశ్నః యుక్తః. న హి గోమతి ఉపలభ్యమానే "గావః కస్యేతి" ప్రశ్నః అర్థవాన్ భవతి.**

**నను విషమః దృష్టాన్తః - గవాం తద్వతశ్చ ప్రత్యక్షత్వాత్ సంబన్ధః అపి ప్రత్యక్షః ఇతి ప్రశ్నః నిరర్థకః. న తథా అవిద్యా తద్వాన్ చ ప్రత్యక్షౌ, యతః ప్రశ్నః నిరర్థకః స్యాత్. అప్రత్యక్షేణ అవిద్యావతా అవిద్యాసంబన్ధే జ్ఞాతే కిం తవ స్యాత్? అవిద్యాయాః అనర్థహేతుత్వాత్ పరిహర్తవ్యా స్యాత్. యస్య అవిద్యా సః తాం పరిహరిష్యతి. నను మమైవ అవిద్యా? జానాసి తర్హి అవిద్యాం తద్వన్తం చ ఆత్మానమ్. జానామి, న తు ప్రత్యక్షేణ. అనుమానేన చేత్ జానాసి కథం సంబన్ధగ్రహణమ్? న హి తవ జ్ఞాతుః జ్ఞేయభూతయా అవిద్యయా తత్కాలే సంబన్ధః గ్రహీతుం శక్యతే, అవిద్యాయాః విషయత్వేనైవ జ్ఞాతుః ఉపయుక్తత్వాత్. న చ జ్ఞాతుః అవిద్యాయాః చ సంబన్ధస్య యః గ్రహీతా, జ్ఞానం చ అన్యత్ తద్విషయం సంభవతి, అనవస్థా ప్రాప్తేః. యది జ్ఞాత్రాఽపి జ్ఞేయసంబన్ధో జ్ఞాయేత అన్యః జ్ఞాతా కల్ప్యః స్యాత్, తస్యాపి అన్యః తస్యాపి అన్యః ఇతి అనవస్థా అపరిహార్యా. యది పునః అవిద్యా జ్ఞేయా, అన్యద్వా జ్ఞేయం జ్ఞేయమేవ. తథా జ్ఞాతాఽపి జ్ఞాతైవ, న జ్ఞేయం భవతి. యదా చ ఏవమ్ అవిద్యాదుఃఖిత్వాద్యైః న జ్ఞాతుః క్షేత్రజ్ఞస్య కించిత్ దుష్యతి.**

ఆక్షేపణ – ఈ సందర్భంలో ఈ ప్రశ్న అడుగవచ్చు – ఆ అవిద్య ఎవరిది? అని.

సమాధానం – ఎవనిలో కనిపిస్తే వానిది.

ఆక్షేపణ – ఎవనిలో కనిపిస్తున్నది?

సమాధానం – 'అవిద్య ఎవనిలో కనిపిస్తున్నది' అన్నది అర్థంలేని ప్రశ్న. ఎందుకంటావా? నీకు అవిద్య కనిపిస్తూ ఉంటే అవిద్యావంతుడుకూడా కనిపిస్తూనే ఉంటాడు. అది ఎవడిదో వాడు కనిపిస్తూ ఉన్నపుడు 'అది ఎవడిది?' అని అడగడమేమిటి? ఆవులున్నవాడు కనిపిస్తున్నపుడు ఆవులెవరివి అనే ప్రశ్న అర్థం లేనిది.

ఆక్షేపణ – నీ దృష్టాంతం సరిగా లేదు. గోవులు గోస్వామి ప్రత్యక్షంగా కనిపిస్తున్నారు కనుక వారి సంబంధం కూడా ప్రత్యక్షం. అటువంటపుడు ప్రశ్న నిరర్థకమే. అవిద్య అవిద్యావంతుడు ఆ విధంగా ప్రత్యక్షంగా లేరు, కనుక ప్రశ్న నిరర్థకం కాదు.

సమాధానం – అప్రత్యక్షమైన అవిద్యావంతునికి అవిద్యకు ఉన్న సంబంధం తెలుసుకున్నందు వల్ల ఏం లాభం నీకు?

ఆక్షేపణ – అవిద్య అనర్థహేతువు కనుక దానిని తొలగించుకోవలసి ఉంది.

సమాధానం – అవిద్య ఎవనికున్నదో వాడు దాన్ని తొలగించుకుంటాడు.

ఆక్షేపణ – నాకే ఉంది ఆ అవిద్య.

సమాధానం – అయితే నీకు అవిద్యతెలుసు, ఆ అవిద్య ఎవరికుందో కూడా తెలుసునన్నమాట.

ఆక్షేపణ – తెలియడమైతే తెలుసు, కాని ప్రత్యక్షంగా తెలియదు.

సమాధానం – (ప్రత్యక్షంగా కాక) అనుమాన ప్రమాణంచేత తెలుసుకుని ఉంటే జ్ఞాత అయిన నీకు అవిద్యకు ఉన్న సంబంధం ఎట్లా గ్రహించావు? అవిద్యను అనుమానంచేత గ్రహించే ఆ సమయంలో జ్ఞాత అయిన నీకు జ్ఞేయమైన అవిద్యతోటి సంబంధం గ్రహించడం సాధ్యంకాదు. ఎందుకంటె జ్ఞాత అప్పుడు అవిద్యను గ్రహించడంలో పూర్తిగా మునిగి ఉంటాడు. అంటే జ్ఞాత అవిద్యకు విషయమై మాత్రమే ఉంటాడు. జ్ఞాతకు అవిద్యకుగల సంబంధాన్ని గ్రహించగలవాడు, ఆ విషయమైన జ్ఞానము – ఈ రెండూ కూడా అసంభవం. ఎందుకంటె అనవస్థాదోషం కలుగుతుంది కనుక. అంటే జ్ఞాతను జ్ఞేయజ్ఞాతల సంబంధాన్ని తెలుసుకోడం సాధ్యమంటే వీటిని తెలుసుకునే మరొక జ్ఞాతను కల్పించవలసి ఉంటుంది. ఆ జ్ఞాతను తెలుసుకునే మరొక జ్ఞాత ఆ జ్ఞాతకు మరొక జ్ఞాత – ఇట్లా అనవస్థాదోషం తొలగదు. అవిద్యగాని మరొకటిగాని జ్ఞేయమెప్పుడూ జ్ఞేయమే. అట్లాగే జ్ఞాత గూడా జ్ఞాతయే, జ్ఞేయం కాదు. అటువంటపుడు జ్ఞాత అయిన క్షేత్రజ్ఞుని అవిద్యా దుఃఖత్వాది దోషాలేవీ అంటవు.

**భాష్యమ్ : 2.14 నను అయమేవ దోషః యత్ దోషవత్ క్షేత్రవిజ్ఞాతృత్వమ్? న. విజ్ఞాన స్వరూపస్యైవ అవిక్రియస్య విజ్ఞాతృత్వోపచారాత్. యథా ఉష్ణతామాత్రేణ అగ్నేః తప్తక్రియోపచారః తద్వత్. యథా చ అత్ర భగవతా క్రియాకారకఫలాత్మత్వాభావః ఆత్మని స్వత ఏవ దర్శితః అవిద్యా- ధ్యారోపితః ఏవ క్రియాకారకాదిః ఆత్మని ఉపచర్యతే తథా తత్ర తత్ర "య ఏనం వేత్తి హన్తారమ్" (2.19), "ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః" (3.27), "నాదత్తే కస్యచిత్ పాపమ్" (5.15) ఇత్యాదిప్రకరణేషు దర్శితః, తథైవ చ వ్యాఖ్యాతమ్ అస్మాభిః. ఉత్తరేషు చ ప్రకరణేషు దర్శయిష్యామః.**

ఆక్షేపణ - దోషాలతో నిండినది క్షేత్రం. దానియొక్క విజ్ఞానం కలిగి ఉండడమే దోషం కాదా?

సమాధానం - కాదు. మనం దేనినైతే విజ్ఞాత అంటున్నామో అది మాటవరుసకే. నిజానికి దాని స్వరూపమే విజ్ఞానం. అది అవిక్రియం. (అందులో ఏ క్రియాలేదు. తెలుసుకోవడమనే క్రియ కూడాలేదు.) అగ్నియొక్క స్వభావం వేడిగా ఉండడం. అది వేడిని కలిగిస్తుంది అని దానియందు క్రియను ఆరోపించడం కేవలం మాటవరుసకే. క్రియాకారక ఫలాత్మత్వాలు ఆత్మయందు స్వతహాగా లేవని, అవి అవిద్యచేత అధ్యారోపించబడి ఉన్నట్లనిపిస్తున్నాయని భగవానుడీ సందర్భంలో 'య ఏనం వేత్తి హన్తారమ్', 'ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః', 'నాదత్తే కస్యచిత్పాపమ్' మొదలైన వాక్యాలలో ప్రదర్శించాడు. మేము కూడా అదే విధంగా వ్యాఖ్యానించాము, ముందుకూడా ప్రదర్శిస్తాము.

**భాష్యమ్ : 2.15. హన్త! తర్హి ఆత్మని క్రియాకారకఫలాత్మతాయాః స్వతః అభావే అవిద్యయా చ అధ్యారోపితత్వే 'కర్మాణి అవిద్వత్కర్తవ్యాన్యేవ, న విదుషామ్', ఇతి ప్రాప్తమ్?**

ఆక్షేపణ - అయితే, క్రియాకారక ఫలాత్మత్వాలు ఆత్మయందు స్వతహాగా లేవు, అవిద్యచేత అధ్యారోపించబడ్డాయి అంటారు? అంటే కర్మలు అజ్ఞానికే కర్తవ్యం. జ్ఞానికి కాదన్నమాట.

**భాష్యమ్ : 2.15.1 సత్యమ్ ఏవం ప్రాప్తమ్. ఏతదేవ చ "న హి దేహభృతా శక్యమ్" (18.11) ఇత్యత్ర దర్శయిష్యామః. సర్వశాస్త్రోపసంహారప్రకరణే చ "సమాసేనైవ కౌన్తేయ! నిష్ఠా జ్ఞానస్య యా పరా" (18.50) ఇత్యత్ర విశేషతః దర్శయిష్యామః. అలమ్ అత్ర బహుప్రపంచేనేతి ఉపసంహ్రియతే.**

సమాధానం - అవును. 'న హి దేహభృతాం శక్యమ్' (18.11) అనేచోట ఇదే ప్రదర్శిస్తాము. 'సమాసేనైవ కౌన్తేయ నిష్ఠా జ్ఞానస్య యా పరా' (18.50) అని గీతయొక్క సర్వశాస్త్రార్థాన్ని ఉపసంహరిస్తూ చెప్పేచోట ఇంకా విశేషంగా ప్రదర్శిస్తాం. మరీ విస్తారం కాకుండా ఈ చర్చ ఇంతటితో ముగిస్తున్నాం.

**భాష్యమ్ : 3.0 "ఇదం శరీరం (1) ఇత్యాది శ్లోకోపదిష్టస్య క్షేత్రాధ్యాయార్థస్య సంగ్రహశ్లోకః అయముపన్యస్యతే "తత్ క్షేత్రం యచ్చ" (3) ఇత్యాది. వ్యాచిఖ్యాసితస్య హి అర్థస్య సంగ్రహోపన్యాసః న్యాయ్యః ఇతి –**

**తె.అ.** 'ఇదం శరీరం' (1) అనే శ్లోకంలో చెప్పిన క్షేత్రాధ్యాయం యొక్క అర్థాన్ని 'తత్క్షేత్రం యచ్చ' (3) అనే శ్లోకంలో సంగ్రహంగా చెపుతున్నాడు, వ్యాఖ్యానించదలచిన విషయాన్ని సంగ్రహంగా వివరించడం న్యాయమని –

**మూ. తత్క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్ ।**
**స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు ॥ 3**

**తె.అ.** ఆ క్షేత్రమేమిటి, ఎటువంటిది, ఏ మార్పులు చెందుతుంది, ఏకారణం చేత ఏ విధంగా మారుతుంది చెపుతా విను. అంతేకాదు, క్షేత్రజ్ఞుడు ఎవడు? అతని ప్రభావం ఎటువంటిది, ఇదికూడా సంక్షేపంగా చెపుతా విను.

**భాష్యమ్ : 3.1 తత్ యితి. యత్ నిర్దిష్టమ్ "ఇదం శరీరమ్" ఇతి తత్ తచ్ఛబ్దేన పరామృశతి. యచ్చేదం నిర్దిష్టం క్షేత్రం తత్, యాదృక్ యాదృశం స్వకీయైః ధర్మైః, 'చ' శబ్దః సముచ్చయార్థః. యద్వికారి యః వికారః యస్య తత్ యద్వికారి, యతః యస్మాత్ చ యత్, 'కార్యమ్ ఉత్పద్యతే' ఇతి వాక్యశేషః. సః చ యః క్షేత్రజ్ఞః నిర్దిష్టః సః యత్ప్రభావః యే ప్రభావాః ఉపాధికృతాః శక్తయః యస్య సః యత్ప్రభావః చ. తత్ క్షేత్రక్షేత్రజ్ఞయోః యాథాత్మ్యం యథావిశేషితం సమాసేన సంక్షేపేణ మే మమ వాక్యతః శృణు, శృత్వా అవధారయ ఇత్యర్థః.**

**తె.అ.** 'ఇదం శరీరం' (ఈ శరీరము) అని ఏది నిర్దేశించబడిందో అదే ఇక్కడ 'తత్' (అది) అనే శబ్దంచేత చెప్పబడింది. ఈ విధంగా నిర్దేశించబడిన క్షేత్రమెటువంటిది, దాని లక్షణాలేమిటి, అది ఏ విధమైన మార్పులు చెందుతుంది, ఏది ఏ మార్పును కలిగిస్తుంది, విను. క్షేత్రజ్ఞుడని నిర్దేశించబడినవాడు ఎటువంటి ప్రభావం కలవాడు – ప్రభావమంటే ఉపాధివల్ల కలిగే శక్తులు. క్షేత్రక్షేత్రజ్ఞులగురించిన యథార్థం సంక్షేపంగా విను. విని నిశ్చయభావం కలిగి ఉండు అని అర్థం.

**భాష్యమ్ : 4.0 తత్ క్షేత్రక్షేత్రజ్ఞయోః యాథాత్మ్యం వివక్షితం స్తౌతి శ్రోతృబుద్ధిప్రరోచనార్థమ్–**

**తె.అ.** చెప్పదలచిన క్షేత్రక్షేత్రజ్ఞుల యాథాత్మ్యాన్ని వినేవానికి అభిరుచి కలగడంకొరకు స్తుతిస్తున్నాడు –

**మూ. ఋషిభిర్బహుధా గీతం ఛన్దోభిర్వివిధైః పృథక్ ।**
**బ్రహ్మసూత్రపదైః చైవ హేతుమద్భిర్వినిశ్చితైః ॥ 4**

**తె.అ.** ఋషులు వేదాలలో నానావిధాలుగా వివేకంతో ఈ జ్ఞానంగురించి గానం చేశారు. హేతుయుక్తంగా బ్రహ్మను సూచించే పదాల చేత దీనిని నిశ్చయించి చెప్పారు.

**భాష్యమ్ : 4.1 ఋషిభిరితి – ఋషిభిః వసిష్ఠాదిభిః, బహుధా బహుప్రకారం, గీతం కథితమ్, ఛన్దాంసి ఋగాదీని, తైః ఛన్దోభిః వివిధైః నానాభావైః నానాప్రకారైః, పృథక్ వివేకతః, గీతమ్. కిం చ – బ్రహ్మసూత్రపదైః చ, ఏవ బ్రహ్మణః సూచకాని వాక్యాని బ్రహ్మసూత్రాణి, తైః పద్యతే గమ్యతే జ్ఞాయతే బ్రహ్మేతి తాని పదాని ఉచ్యన్తే. తైః ఏవ చ క్షేత్రక్షేత్రజ్ఞయోః యాథాత్మ్యం 'గీతమ్' ఇత్యనువర్తతే – "ఆత్మేత్యేవోపాసీత" (బృ.ఉ.1.4.7) ఇత్యేవమాదిభిః బ్రహ్మసూత్రపదైః ఆత్మా జ్ఞాయతే. హేతుమద్భిః యుక్తియుక్తైః, వినిశ్చితైః నిఃసంశయరూపైః. నిశ్చిత ప్రత్యయోత్పాదకైః ఇత్యర్థః.**

**తె.అ.** వసిష్ఠాది ఋషులు అనేక విధాలుగా గల ఆ ఛాందస్సులతో వివేకపూర్వకంగా గానం చేశారు. అంతేకాదు – బ్రహ్మసూత్రపదాలతో దీనిని నిస్సంశయరూపంగా చెప్పారు. బ్రహ్మమును సూచించే వాక్యాలు బ్రహ్మసూత్రాలు. బ్రహ్మమును చేర్చు పదములు (మెట్లు) కనుక అవి బ్రహ్మసూత్రపదములు. వాటితో క్షేత్రక్షేత్రజ్ఞయాథాత్మ్యాన్ని వివరించబడింది అని అర్థం చేసుకోవాలి. "ఆత్మేత్యేవోపాసీత" ఇత్యాది బ్రహ్మసూత్ర పదాలచే ఆత్మ తెలియబడుతుంది. యుక్తియుక్తమైన ఈ పదాలు సంశయం తొలగించి నిశ్చయజ్ఞానాన్ని కలిగించగలవి అని అర్థం.

**భాష్యమ్ : స్తుత్యా అభిముఖీభూతాయ అర్జునాయ ఆహ భగవాన్ –**

**తె.అ.** స్తుతిచేత అభిముఖం చేయబడిన అర్జునునితో భగవానుడంటున్నాడు –

**మూ. మహాభూతాన్యహంకారో బుద్ధిరవ్యక్తమేవ చ ।**
**ఇన్ద్రియాణి దశైకం చ పఞ్చ చేన్ద్రియగోచరాః ॥ 5**

**తె.అ.** మహాభూతములు అహంకారము బుద్ధి అవ్యక్తము ఏకాదశేంద్రియములు ఇంద్రియ గోచరమయెడి పంచవిషయములు –

**భాష్యమ్ : 5.1 మహాభూతాని ఇతి – మహాభూతాని – మహాన్తి చ తాని భూతాని సర్వవికారవ్యాపకత్వాత్. భూతాని చ సూక్ష్మాణి, (న స్థూలాని). స్థూలాని తు ఇన్ద్రియగోచరశబ్దేన అభిధాయిష్యన్తే. అహంకారః మహాభూతకారణమ్ అహంప్రత్యయలక్షణః. అహంకారకారణం**

**బుద్ధిః అధ్యవసాయలక్షణా. తత్కారణమ్ అవ్యక్తమేవ చ, న వ్యక్తమ్ అవ్యక్తమ్, అవ్యాకృతమ్, ఈశ్వరశక్తిః "మమ మాయా దురత్యయా" (7.14) ఇత్యుక్తమ్. ఏవశబ్దః ప్రకృత్యవధారణార్థః . ఏతావత్ ఏవ అష్టధా భిన్నా ప్రకృతిః. 'చ' శబ్దః భేదసముచ్చయార్థః. ఇన్ద్రియాణి, దశశ్రోత్రాదీని పఞ్చ బుద్ధ్యుత్పాదకత్వాత్ బుద్ధీన్ద్రియాణి, వాక్పాణ్యాదీని పఞ్చ కర్మనిర్వర్తకత్వాత్ కర్మేన్ద్రియాణి, తాని దశ, ఏకం చ, కిం తత్? మనః ఏకాదశం సంకల్పాద్యాత్మకమ్. పఞ్చ చ ఇన్ద్రియగోచరాః శబ్దాదయః విషయాః. తాన్యేతాని సాంఖ్యాః చతుర్వింశతితత్త్వాని ఆచక్షతే.**

**తె.అ.** మహాభూతాలు (అంటే పృథివ్యప్తేజోవాయురాకాశాలు) అని వానిని ఎందుకంటు‌న్నారంటే అవి ప్రకృతియొక్క అన్ని మార్పులలోను వ్యాపించి ఉంటున్నాయి కనుక, ఇవి సూక్ష్మ‌మహాభూతాలు. స్థూలభూతాలను 'ఇంద్రియగోచరమయేవి' అని తరువాత చెపుతున్నాడు. ఈ మహాభూతాలకు కారణం అహంకారం, నేను అనే బుద్ధి. అహంకారానికి కారణం బుద్ధి. దీని లక్షణం నిశ్చయంచేయడం. దీనికి కారణం అవ్యక్తమే, **'మమ మాయా దురత్యయా'** (7.14) అని చెప్పబడిన వికారము పొందని ఈశ్వరశక్తి. 'ఏవ' అనే శబ్దం భిన్నమై ఎనిమిది విధాలుగా కనిపించే ప్రకృతియే అని చెప్పడానికి. 'చ' అనేది సముచ్చయార్థకం, ఇంతవరకు వేరుగా చెప్పినవాటిని కలపడానికి. దశేంద్రియాలు – శ్రోత్రాదులయిదు జ్ఞానాన్ని కలిగించేవి కనుక జ్ఞానేంద్రియాలు, వాక్పాణి పాదాదులు కర్మలు నిర్వర్తించేవి కనుక కర్మేంద్రియాలు; ఇవి పది. ఇక ఒకటి ఏమిటి? మనస్సు, సంకల్పరూపమైనది. ఇది పదకొండవ ఇంద్రియం. ఇంద్రియగోచరమయే శబ్దాది విషయాలు అయిదు. వీటిని సాంఖ్యులు ఇరవై నాలుగు తత్త్వాలు అంటారు.

**భాష్యమ్ : 6.0 అథేదానీమ్ ఆత్మగుణాః ఇతి యాన్ ఆచక్షతే వైశేషికాః తేఽపి క్షేత్రధర్మాః ఏవ, న తు క్షేత్రజ్ఞస్య ఇత్యాహ భగవాన్ –**

**తె.అ.** వైశేషికులు ఆత్మగుణాలని వేటిని అంటున్నారో అవికూడా క్షేత్రధర్మాలే, క్షేత్రజ్ఞునివి కావని భగవానుడు అంటున్నాడు –

**మూ. ఇచ్ఛా ద్వేషః సుఖం దుఃఖం సంఘాతశ్చేతనా ధృతిః ।**
**ఏతత్ క్షేత్రం సమాసేన సవికారముదాహృతమ్ ॥ 6**

**తె.అ.** ఇచ్ఛ, ద్వేషము, సుఖము, దుఃఖము దేహేంద్రియాల సముదాయం. ఇవీ అంతఃకరణ వృత్తిరూపమైన జ్ఞానం, ధైర్యం – మొదలైన వికారములతో కూడినదే క్షేత్రమని సంగ్రహంగా వర్ణించబడింది.

**భాష్యమ్ : 6.1 ఇచ్ఛా ఇతి – ఇచ్ఛా యజ్జాతీయం సుఖాత్మకమ్ అర్థమ్ ఉపలబ్ధవాన్ పూర్వం, పునః తజ్జాతీయమ్ సముపలభమానః తమ్ అర్థం ఆదాతుమ్ ఇచ్ఛతి సుఖహేతుః ఇతి; సా ఇయమ్ ఇచ్ఛా అన్తఃకరణస్యధర్మః, జ్ఞేయత్వాత్ క్షేత్రమ్. తథా ద్వేషః – యజ్జాతీయమ్ అర్థం దుఃఖహేతుత్వేన అనుభూతవాన్, పునః తజ్జాతీయమ్ అర్థం ఉపలభమానః తం ద్వేష్టి, సః అయం ద్వేషః జ్ఞేయత్వాత్ క్షేత్రమేవ. తథా సుఖమ్ అనుకూలం ప్రసన్నసత్త్వాత్మకం జ్ఞేయత్వాత్ క్షేత్రమేవ. దుఃఖం ప్రతికూలాత్మకం; జ్ఞేయత్వాత్ తదపి క్షేత్రమ్. సంఘాతః దేహేన్ద్రియాణాం సంహతిః. తస్యామ్ అభివ్యక్తా అన్తఃకరణవృత్తిః, తప్తే ఇవ లోహపిణ్డే అగ్నిః ఆత్మచైతన్యాభాసరసవిద్ధా చేతనా, సా చ క్షేత్రం, జ్ఞేయత్వాత్. ధృతిః యయా అవసాదప్రాప్తాని దేహేన్ద్రియాణి ధ్రియన్తే, సా చ జ్ఞేయత్వాత్ క్షేత్రమ్. సర్వాన్తఃకరణధర్మోపలక్షణార్థమ్ ఇచ్ఛాదిగ్రహణమ్. యత్ ఉక్తం తత్ ఉపసంహరతి – ఏతత్ క్షేత్రం సమాసేన, సవికారం సహ వికారేణ మహదాదినా ఉదాహృతమ్ ఉక్తమ్.**

**తె.అ.** పూర్వం ఎటువంటి వస్తువు సుఖం కలిగించిందో మళ్ళీ అటువంటిదానినే సుఖహేతువని పొందగోరుతాము. ఆ కోరికే ఇచ్ఛ. ఇది అంతఃకరణధర్మం, జ్ఞేయం కనుక క్షేత్రం. అదే విధంగా ద్వేషం – ఏ విధమైన వస్తువును పొంది పూర్వం దుఃఖమనుభవించామో మళ్ళీ అటువంటిదే సంప్రాప్తించినపుడు ద్వేషిస్తాం. ఈ ద్వేషమూ జ్ఞేయమే, కనుక క్షేత్రమే. అదే విధంగా, అనుకూలంగా ఉండేది సుఖం. అప్పుడు అంతఃకరణం ప్రసన్నంగా ఉంటుంది. సుఖమూ జ్ఞేయమే కనుక క్షేత్రమే. ప్రతికూలాత్మకమైన దుఃఖమూ జ్ఞేయమే కనుక క్షేత్రం. దేహేంద్రియసముదాయమే సంఘాతం. కాలిన ఇనుపగుండులో ఎర్రగా అగ్నివలె అభివ్యక్తమవుతుంది. అట్లే దేహేంద్రియ సంఘాతంలో బుద్ధి వృత్తి అవ్యక్తమవుతుంది. అభివ్యక్తమైన అగ్ని ఇనుపగుండును అగ్ని వలె కనబడేటట్లు చేస్తుంది. అట్లే సర్వవ్యాప్తమైన ఆత్మచైతన్యం బుద్ధివృత్తిలో అభివ్యక్తమై ఆ బుద్ధి వృత్తియే ఆత్మచైతన్యంగా భాసిస్తుంది. కాని జ్ఞేయం కనుక అదికూడా క్షేత్రమే. అలసినపుడు దేహేంద్రియాలను ధరించేది ధృతి. ఇది కూడా జ్ఞేయమే కనుక క్షేత్రం. ఇక్కడ చెప్పిన ఇచ్ఛ మొదలైనవి అంతఃకరణ ధర్మాలన్నిటికి ఉపలక్షణం. (అన్నిటిని సూచించడానికి చెప్పిన కొన్ని) చెప్పినదాన్ని ముగిస్తున్నాడు. జీవుల శరీరం వ్యష్టిరూపమైన క్షేత్రమైతే మహదాదిభేద సముదాయం సమష్టి క్షేత్రంగా చెప్పబడింది.

**భాష్యమ్ : 7.0 యస్య క్షేత్రభేదజాతస్య సంహతిః "ఇదం శరీరం క్షేత్రమ్" (1) ఇత్యుక్తం తత్ క్షేత్రం వ్యాఖ్యాతం మహాభూతాదిభేదభిన్నం ధృత్యన్తమ్ (5.6) క్షేత్రజ్ఞః వక్ష్యమాణ విశేషణః, యస్య సప్రభావస్య క్షేత్రజ్ఞస్య పరిజ్ఞానాత్ అమృతత్వం భవతి, తం "జ్ఞేయం యత్తత్**

**ప్రవక్ష్యామి" (13.12) ఇత్యాదినా సవిశేషణం స్వయమేవ వక్ష్యతి భగవాన్. అధునా తు తద్జ్ఞానసాధనగణమ్ అమానిత్వాది- లక్షణం, యస్మిన్ సతి తద్జ్ఞేయవిజ్ఞానే యోగ్యః అధికృతః భవతి, యత్పరః సంన్యాసీ జ్ఞాననిష్ఠః ఉచ్యతే, తమ్ అమానిత్వాదిగణం, జ్ఞానసాధనత్వాత్ జ్ఞానశబ్దవాచ్యం విదధాతి భగవాన్ –**

**తె.అ.** సమస్త క్షేత్రభేదసమూహాన్ని, 'ఇదం శరీరం క్షేత్రం' (1) అని చెప్పినదానిని, మహత్తు నుండి ధృతివరకు భిన్నంగా ఉన్నదానిని 5,6 శ్లోకాలలో వ్యాఖ్యానించాడు. ఇక క్షేత్రజ్ఞుని లక్షణాలు చెప్పబోతున్నాడు. ప్రభావసహితుడైన ఏ క్షేత్రజ్ఞుని తెలుసుకోడంచేత అమృతత్వం కలుగుతుందో ఆ క్షేత్రజ్ఞుని 'జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి' అని సవిశేషణంగా స్వయంగా భగవానుడు చెపుతున్నాడు. ఆ చెప్పబోయేముందు ఇప్పుడు ఆ జ్ఞానసాధనాలైన అమానిత్వాది లక్షణాలను చెపుతున్నాడు. ఈ సాధనాలు గలవాడు జ్ఞేయాన్ని తెలుసుకోడానికి యోగ్యతగల అధికారి కాగలడు. అటువంటి సాధనతత్పరుడైన సన్న్యాసిని జ్ఞాననిష్ఠుడంటారు. జ్ఞానసాధనాలు కనుక అమానిత్వాది సాధనాల గుణమును జ్ఞానమంటారు. వాటిని చెపుతున్నాడు భగవానుడు –

**మూ. అమానిత్వమదమ్భిత్వమహింసా క్షాన్తిరార్జవమ్ ।**
**ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మవినిగ్రహః ॥ 7**

**తె.అ.** గర్వం లేకపోవడం, డాంబికం లేకపోవడం, అహింస, క్షాంతి, ఆర్జవము, ఆచార్యోపాసనము, శౌచము, స్థైర్యము, ఆత్మనిగ్రహము –

**భాష్యమ్ : 7.1 అవమానిత్వమ్ ఇతి. అమానిత్వమ్ – మానినః భావః మానిత్వమ్, ఆత్మనః శ్లాఘనమ్, తదభావః అమానిత్వమ్. అదమ్భిత్వమ్ – స్వధర్మప్రకటీకరణం దమ్భిత్వం. తదభావః అదమ్భిత్వమ్. అహింసా అహింసనమ్, ప్రాణినామ్ అపీడనమ్. క్షాన్తిః పరాపరాధప్రాప్తౌ అవిక్రియా. ఆర్జవమ్ ఋజు – భావః, అవక్రత్వమ్. ఆచార్యోపాసనమ్ – మోక్షసాధనోపదేష్టుః ఆచార్యస్య శుశ్రూషాదిప్రయోగేణ సేవనమ్. శౌచమ్ – కాయమలానాం మృజ్జలాభ్యాం ప్రక్షాలనమ్; అన్తశ్చ మనసః ప్రతిపక్షభావనయా రాగాదిమలాపనయనం శౌచమ్. స్థైర్యమ్ స్థిరభావః మోక్షమార్గే ఏవ కృతాధ్యవసాయత్వమ్. ఆత్మవినిగ్రహః – ఆత్మనః అపకారకస్య ఆత్మశబ్దవాచ్యస్య కార్యకరణసంఘాతస్య, వినిగ్రహః స్వభావేన సర్వతః ప్రవృత్తస్య సన్మార్గే ఏవ నిరోధః ఆత్మవినిగ్రహః. కిం చ –**

**తె.అ.** తనగొప్పను ప్రకటించుకునేవాడు మాని. అది ప్రకటించుకోకపోవడం అమానిత్వం. స్వధర్మం ప్రకటించుకోడం దంభిత్వం. అది చేయకపోవడం అదంభిత్వం. ప్రాణులను పీడించకుండడం అహింస. ఇతరుల వలన తనకు అపరాధం జరిగినపుడు వికారం చెందకపోవడం

క్షాంతి. వక్రత్వం లేకపోవడం, సూటిగా ప్రవర్తించడం ఆర్జవం. మోక్షసాధనం ఉపదేశించే ఆచార్యుని శుశ్రూషాదులతో సేవించడం ఆచార్యోపాసనం. శరీర మాలిన్యాన్ని మట్టితో నీటితో క్షాళనం చెయ్యడం, రాగాది మనోమాలిన్యాన్ని ప్రతిపక్షభావనతో తొలగించడం శౌచం. తొలగించవలసిన దోషానికి విరోధిగుణాన్ని భావనచేయడం ప్రతిపక్షభావన. మోక్షమార్గమే మార్గమనే నిశ్చయం, స్థిరభావం స్థైర్యం. ఆత్మ అని మనమనే దేహేంద్రియసమూహం ఆత్మకు అపకారం చేసేది. అన్ని విషయాలవైపు వెళ్ళే స్వభావం గల దీనిని సన్మార్గంలోనే నిరోధించడం ఆత్మవినిగ్రహం. ఇంకా -

**మూ. ఇన్ద్రియార్థేషు వైరాగ్యమనహంకార ఏవ చ ।**
**జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్ ॥ 8**

**తె.అ.** ఇంద్రియార్థములయందు వైరాగ్యము, అహంకారం లేకపోవడం, జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషదర్శనము,

**భాష్యమ్ : 8.1 ఇన్ద్రియార్థేష ఇతి - ఇన్ద్రియార్థేషు శబ్దాదిషు దృష్టాదృష్టేషు భోగేషు విరాగభావః వైరాగ్యమ్. అనహంకారః అహంకారాభావః ఏవ చ జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషాను-దర్శనమ్ - జన్మ చ మృత్యుః చ జరా చ వ్యాధయః చ దుఃఖాని చ తేషు జన్మాదిదుఃఖాన్తేషు ప్రత్యేకం దోషానుదర్శనమ్. జన్మని గర్భవాసయోనిద్వారనిఃసరణం దోషః, తస్య అనుదర్శనమ్ ఆలోచనమ్. తథా మృత్యౌ దోషానుదర్శనమ్. తథా జరాయాం ప్రజ్ఞాశక్తితేజోనిరోధదోషానుదర్శనం పరిభూతతా చ ఇతి. తథా వ్యాధిషు శిరోరోగాదిషు దోషానుదర్శనమ్. తథా దుఃఖేషు అధ్యాత్మాధిభూతాధి-దైవనిమిత్తేషు. అథవా దుఃఖాన్యేవ దోషః దుఃఖదోషః తస్య జన్మాదిషు పూర్వవత్ అనుదర్శనమ్. దుఃఖం జన్మ, దుఃఖం మృత్యుః, దుఃఖం జరా, దుఃఖం వ్యాధయః. దుఃఖనిమిత్తత్వాత్ జన్మాదయః దుఃఖాని, న పునః స్వరూపేణైవ దుఃఖమితి. ఏవం జన్మాదిషు దుఃఖదోషానుదర్శనాత్ దేహేన్ద్రియ-విషయభోగేషు వైరాగ్యమ్ ఉపజాయతే. తతః ప్రత్యగాత్మని ప్రవృత్తిః కరణానామ్ ఆత్మదర్శనాయ. ఏవం జ్ఞానహేతుత్వాత్ జ్ఞానముచ్యతే జన్మాదిదుఃఖదోషానుదర్శనమ్. కించ -**

**తె.అ.** శబ్దాది ఇంద్రియార్థాలయందు అంటే ఐహిక పారలౌకిక భోగాలయందు రాగం లేకపోవడం వైరాగ్యం. అహంకారం లేకపోవడం నిరహంకారం. జన్మ మృత్యువు జర వ్యాధి దుఃఖము - వీటిలోని ప్రతి ఒక్కదానిలోని దోషాన్ని చూడడం జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోష దర్శనం. జన్మలో గర్భవాసము యోనిద్వారం నుండి బయటపడడము అనే దోషం; అట్లాగే మృత్యువులో దోషం; అట్లాగే జర అంటే ముసలితనంలో ప్రజ్ఞాశక్తి, తేజస్సు తగ్గిపోవడం అసలు పడిపోవడమనే

దోషం; శిరోరోగాది వ్యాధులందు దోషం అదేవిధంగా అధ్యాత్మ అధిభూత అధిదైవ నిమిత్తంగా కలిగే దుఃఖాలలోని దోషం – వీటిని చూడడం. లేక, దుఃఖాలే దోషం, ఆ దుఃఖమనే దోషాన్ని జన్మాదులయందు చూడడం – జన్మ దుఃఖము మృత్యువు దుఃఖము జర దుఃఖము వ్యాధులు దుఃఖము అని. దుఃఖ కారణాలు కనుక జన్మాదులు దుఃఖాలు, కాని వాటంతట అవి దుఃఖం కాదు. ఈ విధంగా జన్మాదుల యందు దుఃఖదోషం చూడడంచేత దేహేంద్రియ విషయభోగాల యందు వైరాగ్యం పుడుతుంది. అప్పుడు ఇంద్రియాలు అంతరాత్మ వైపు ఆత్మదర్శనం కొరకు నడుస్తాయి. జ్ఞానహేతువు కావడం చేత జన్మాది దుఃఖదోషానుదర్శనం జ్ఞానమని చెప్పబడుతున్నది. ఇంకా –

**మూ. అసక్తిరనభిష్వంగః పుత్రదారగృహాదిషు ।**
**నిత్యం చ సమచిత్తత్వమిష్టానిష్టోపపత్తిషు ॥ 9**

**తె.అ.** విషయాలవైపుకి దృష్టి మళ్ళకపోవడం, పుత్రదార గృహాదులయందు అతిమమకారం లేకపోవడము ఇష్టం లభించినా అనిష్టం లభించినా సదా సమచిత్తత్వం కలిగివుండడం.

**భాష్యమ్ : 9.1 అసక్తిరితి – అసక్తి ః – సక్తిః సంగనిమిత్తేషు విషయేషు ప్రీతిమాత్రమ్, తదభావః అసక్తిః. అనభిష్వంగః అభిష్వంగాభావః. అభిష్వంగః నామ సక్తివిశేషః ఏవ అనన్యాత్మభావనా లక్షణః. యథా అన్యస్మిన్ సుఖిని దుఃఖిని వా "అహమేవ సుఖీ దుఃఖీ చ", జీవతి మృతే వా 'అహమేవ జీవామి మరిష్యామి' చ ఇతి. క్వ ఇత్యాహ – పుత్రదారగృహాదిషు పుత్రేషు దారేషు గృహేషు, 'ఆది' గ్రహణాత్ అన్యేషు అపి అత్యన్తేష్టేషు దాసవర్గాదిషు. తచ్చ ఉభయం జ్ఞానార్థత్వాత్ జ్ఞానమ్ ఉచ్యతే. నిత్యం చ సమచిత్తత్వం తుల్యచిత్తతా–క్వ? ఇష్టానిష్టోపపత్తిషు. ఇష్టానామ్ అనిష్టానాం చ, ఉపపత్తయః సంప్రాప్తయః, తాసు ఇష్టానిష్టోపపత్తిషు నిత్యమేవ తుల్యచిత్తతా. ఇష్టోపపత్తిషు న హృష్యతి, న కుప్యతి చ అనిష్టోపపత్తిషు. తచ్చ ఏతత్ నిత్యం సమచిత్తత్వం జ్ఞానమ్. కిం చ –**

**తె.అ.** ఆసక్తి కలిగించే విషయాలయందు ప్రీతిలేకపోవడం అసక్తి. అభిష్వంగం లేకపోవడం అనభిష్వంగం. అభిష్వంగమంటే అనన్య ఆత్మభావనాలక్షణమైన ప్రీతి. అంటే మరొకరి సుఖంలో దుఃఖంలో 'నేనే సుఖంగా ఉన్నాను' 'నేనే దుఃఖంలో ఉన్నాను, చచ్చిపోతున్నాను' అని జీవించి ఉన్నపుడు చనిపోయినపుడు 'నేనే జీవించి వున్నాను, చచ్చిపోతున్నాను' అని అనుకోడం; ఏ విషయంలో అంటే చెపుతున్నాడు – పుత్రుల భార్యల గృహాల, ఇంకా చాలా ఇష్టమయిన దాసవర్గాదుల విషయంలో. ఈ రెండూ – అసక్తి అనభిష్వంగము – జ్ఞానానికి సాధనాలు కనుక జ్ఞానమన బడుతున్నాయి. ఇష్టము అనిష్టము సంప్రాప్తించినపుడు ఒకే చిత్తంతో ఉండడం

సమచిత్తత్వం. ఇష్టమైనది సంప్రాప్తించినపుడు సంతోషించడు, అనిష్టం కలిగినపుడు కోపించడు. ఈ విధంగా నిత్యము సమచిత్తంతో ఉండడం జ్ఞానం. ఇంకా –

**మూ. మయి చానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ ।**
**వివిక్తదేశసేవిత్వమరతిర్జనసంసది ॥ 10**

**తె.అ.** నాయందు చెదరని భక్తి అనే అనన్యయోగము, ఏకాంతప్రదేశవాసము, జన సమూహాలయందు ఇచ్ఛ లేకపోవడము,

**భాష్యమ్ : 10.1 మయీతి – మయి చ ఈశ్వరే అనన్యయోగేన అపృథక్సమాధినా, "న అన్యః భగవతః వాసుదేవాత్ పరః అస్తి, అతః సః ఏవ నః గతిః" ఇత్యేవం నిశ్చితా అవ్యభిచారిణీ బుద్ధిః అనన్య – యోగః. తేన భజనం భక్తిః, న వ్యభిచరణశీలా అవ్యభిచారిణీ. సా చ జ్ఞానమ్. వివిక్తదేశసేవిత్వమ్ – వివిక్తః స్వభావతః సంస్కారేణ వా అశుచ్యాదిభిః సర్పచోరవ్యాఘ్రభయాదిభిః చ రహితః అరణ్యనదీపులినదేవగృహాదిః వివిక్తో దేశః, తం సేవితుం శీలమ్ అస్య ఇతి వివిక్త దేశసేవీ, తద్భావః వివిక్తదేశసేవిత్వమ్. వివిక్తేషు హి దేశేషు చిత్తం ప్రసీదతి యతః, తతః ఆత్మాదిభావనా వివిక్తే సంజాయతే. అతః వివిక్తదేశసేవిత్వం జ్ఞానమ్ ఉచ్యతే. అరతిః అరమణం, జనసంసది – జనానాం ప్రాకృతానాం సంస్కారశూన్యానామ్ అవినీతానాం సంసత్ సమవాయః జనసంసత్ న సంస్కారవతాం వినీతానాం సంసత్, తస్యాః జ్ఞానోపకారిత్వాత్. అతః ప్రాకృతజనసంసది అరతిః జ్ఞానార్థత్వాత్ జ్ఞానమ్. కించ –**

**తె.అ.** నాయందు అంటే ఈశ్వరునియందు, "అనన్యయోగంతో" అంటే మరొకదానిపై తగులు లేక, అని. 'భగవానుడైన వాసుదేవునికంటె అన్యమేదీ లేదు, కనుక అతడే మనకు గతి' అని నిశ్చయమైన చెదరని బుద్ధి అనన్యయోగం. ఆ బుద్ధితో భజించడం చెదరని భక్తి. అదే జ్ఞానం. ఏకాంతప్రదేశసేవనము – సహజంగాగాని సంస్కరించబడిగాని ఏకాంతమైన ప్రదేశానికి వెడుతూ ఉండడం. సర్పచోరవ్యాఘ్ర భయాదులు లేని అరణ్యనదీతీర దేవాలయాది ఏకాంతప్రదేశాలలో చిత్తం ప్రసన్నమవుతుంది, ఆత్మ మొదలైన విషయాలగురించి భావన కలుగుతుంది. కనుక ఏకాంతదేశసేవనం జ్ఞానం అనబడుతున్నది. జనసమూహాలయందు అంటే ప్రాకృతులు, సంస్కారశూన్యులు, అవినీతిపరులు అయిన జనుల సమూహాలయందు ఇష్టంలేకపోవడం జ్ఞానం. సంస్కారవంతులు వినయసంపన్నులు అయిన జనుల సమూహం జ్ఞానానికి ఉపకరిస్తుంది కనుక, అటువంటి జనుల గురించి కాదు ఇక్కడ చెపుతున్నది. ఇంకా–

**మూ. అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్ ।**
**ఏతద్ జ్ఞానమితి ప్రోక్తమజ్ఞానం యదతోఽన్యథా ॥ 11**

**తె.అ.** నిత్యము అధ్యాత్మజ్ఞానమునందు స్థిరంగా ఉండడం, తత్త్వజ్ఞానం ప్రయోజనాన్ని భావన చేస్తూ ఉండడం – దీనిని జ్ఞానమంటారు. తక్కినది అజ్ఞానము.

**భాష్యమ్ : 11.1 అధ్యాత్మఇతి – అధ్యాత్మజ్ఞాననిత్యత్వమ్ – ఆత్మాదివిషయజ్ఞానమ్ అధ్యాత్మ-జ్ఞానమ్. తస్మిన్ నిత్యభావః నిత్యత్వమ్. అమానిత్వాదీనాం (7) జ్ఞానసాధనానామ్ భావనాపరి-పాకనిమిత్తం తత్త్వజ్ఞానం, తస్య అర్థః మోక్షః, సంసారోపరమః; తస్య ఆలోచనం తత్త్వజ్ఞానార్థదర్శనమ్; తత్త్వజ్ఞానఫలాలోచనే హి తత్సాధనానుష్ఠానే ప్రవృత్తిః స్యాదితి. ఏతత్ అమానిత్వాది తత్త్వజ్ఞానార్థ-దర్శనాన్తమ్ ఉక్తం జ్ఞానమితి ప్రోక్తమ్, జ్ఞానార్థత్వాత్. అజ్ఞానం యత్ అతః అస్మాత్ యథోక్తాత్ అన్యథా విపర్యయేణ – మానిత్వమ్, దమ్భిత్వమ్, హింసా, అక్షాన్తిః, అనార్జవమ్ ఇత్యాది అజ్ఞానం విజ్ఞేయం పరిహరణాయ, సంసారప్రవృత్తికారణత్వాత్ ఇతి.**

**తె.అ.** ఆత్మ మొదలైన విషయాలగురించిన జ్ఞానం అధ్యాత్మజ్ఞానం – దానిని నిత్యము భావించడము, అమానిత్వాది జ్ఞానసాధనాలను భావనం చేయడం పరిపాకదశను చేరినపుడు తత్త్వజ్ఞానం కలుగుతుంది. ఆ జ్ఞానానికి అర్థం మోక్షం, అంటే సంసార వినాశ రూపమైన జ్ఞానాన్ని (మోక్షాన్ని) పొందడం. దాన్ని ఆలోచన చేయడమే తత్త్వజ్ఞానార్థదర్శనం. తత్త్వజ్ఞానఫలాన్ని భావన చేసినపుడే ఆ సాధనా అనుష్ఠానాలను చేయాలన్న ప్రవృత్తి కలుగుతుంది. అమానిత్వం మొదలుకొని తత్త్వజ్ఞానార్థదర్శనం వరకు (7 నుండి 11వ శ్లోకం వరకు) చెప్పినదంతా జ్ఞానమనబడుతుంది, జ్ఞానసాధనాలు కనుక. ఈ చెప్పినదానికి విపరీతమైనది అజ్ఞానము – మానిత్వము, దంభిత్వము, హింస, అక్షాంతి, అనార్జవము మొదలైనవి. దీనిని అజ్ఞానమని తెలుసుకొని పరిహరించాలి. అవి సంసారప్రవృత్తి కారణాలు కనుక.

**భాష్యమ్ : 12.0 యథోక్తేన జ్ఞానేన జ్ఞాతవ్యం కిమిత్యాకాంక్షాయామ్ ఆహ – "జ్ఞేయం యత్తత్" ఇత్యాది. నను యమాః నియమాశ్చ అమానిత్వాదయః, న తైః జ్ఞేయం జ్ఞాయతే. న హి అమానిత్వాది కస్యచిత్ వస్తునః పరిచ్ఛేదకం దృష్టమ్. సర్వత్రైవ హి యద్విషయం, జ్ఞానం తదేవ తస్య జ్ఞేయస్య పరిచ్ఛేదకం దృశ్యతే. న హి అన్యవిషయేణ జ్ఞానేన అన్యత్ ఉపలభ్యతే, యథా ఘటవిషయేణ జ్ఞానేన అగ్నిః. నైష దోషః, జ్ఞాననిమిత్తత్వాత్ జ్ఞానమ్ ఉచ్యతే ఇతి హి అవోచామ; జ్ఞానసహకారి కారణత్వాచ్చ.**

**తె.అ.** ఈ విధంగా చెప్పబడిన జ్ఞానంచేత తెలియదగినదేది అని అడుగవచ్చునని చెపుతున్నాడు – **జ్ఞేయం యత్తత్** అని మొదలుపెట్టి.

ఆక్షేపణ – అమానిత్వాదులు యమనియమాలు కదా? వాటిచేత తెలియదగినది తెలియరాదు. అవి ఏ వస్తువును నిర్ణయించినట్లు మనం చూడడంలేదు. ఏ విషయం గురించిన జ్ఞానం ఆ విషయాన్నే నిర్ణయించడం అంతటా చూస్తున్నాం. ఒక విషయాన్ని గురించిన జ్ఞానం మరొక విషయాన్ని నిర్ణయించడానికి పనికిరాదు. కుండను గురించిన జ్ఞానం నిప్పును తెలుసుకోవడానికి పనికిరానట్లు.

సమాధానం – ఇది దోషం కాదు. ఇవి జ్ఞానానికి దోహదం చేసేవి కనుక వీటిని జ్ఞానమంటారు అని చెప్పాము. అవి జ్ఞానంతో సహకరించే కారణాలు కనుక కూడా.

**మూ. జ్ఞేయం యత్తత్ ప్రవక్ష్యామి యద్ జ్ఞాత్వాఽమృతమశ్నుతే ।**
**అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే ॥ 12**

**తె.అ.** జ్ఞేయమేదో, ఆది లేని ఆ పరబ్రహ్మమును చెపుతాను. దాన్ని తెలుసుకున్నవాడు అమృతత్త్వం పొందుతాడు. ఆ బ్రహ్మమును ఉన్నదనిగాని లేదనిగాని చెప్ప శక్యం కాదు.

**భాష్యమ్ : 12.1 జ్ఞేయ జ్ఞాతవ్యం యత్ తత్ ప్రవక్ష్యామి ప్రకర్షేణ యథావత్ వక్ష్యామి. కిం ఫలం తదితి ప్రరోచనేన శ్రోతుః అభిముఖీకరణాయ ఆహ – యత్ జ్ఞేయం జ్ఞాత్వా అమృతం అమృతత్వం అశ్నుతే, న పునః మ్రియతే ఇత్యర్థః. అనాదిమత్ – ఆదిః అస్య అస్తీతి ఆదిమత్. న ఆదిమత్. కిం తత్? పరం నిరతిశయం బ్రహ్మ 'జ్ఞేయమ్' ఇతి ప్రకృతమ్.**

**తె.అ.** తెలియదగినదేదో దానిని ఉన్నదున్నట్లు స్పష్టంగా చెపుతాను. వినేవానికి రుచి కలిగించి అతనిని అభిముఖుణ్ణి చేసుకొనడం కొరకు చెబుతున్నాడు. తెలుసుకోడం వల్ల ఏం ఫలమో చెపుతున్నాడు. దానిని తెలుసుకున్నవాడు అమృతత్వం పొందుతాడు. అంటే ఇక అతనికి చావులేదు అని అర్థం. ఆది లేని పరబ్రహ్మమే అది. అదే ప్రస్తుత విషయమైన జ్ఞేయం.

**భాష్యమ్ : 12.2 అత్ర కేచిత్ "అనాదిమత్పరమ్" ఇతి పదం ఛిన్దన్తి, బహువ్రీహిణోక్తే అర్థే మతుపః ఆనర్థక్యమ్ అనిష్టం స్యాదితి. అర్థవిశేషం చ దర్శయన్తి – అహం వాసుదేవాఖ్యా పరా శక్తిః యస్య తత్ మత్పరమ్ ఇతి. సత్యమ్ ఏవమ్ అపునరుక్తం స్యాత్ అర్థః చేత్ సంభవతి. న తు అర్థః సంభవతి, బ్రహ్మణః సర్వవిశేషప్రతిషేధేనైవ విజిజ్ఞాపయిషితత్వాత్ 'న సత్తన్నాసదుచ్యతే' ఇతి. విశిష్టశక్తిమత్త్వప్రదర్శనం విశేషప్రతిషేధశ్చేతి విప్రతిషిద్ధమ్. తస్మాత్ మతుపః బహువ్రీహిణా సమానార్థత్వేఽపి ప్రయోగః శ్లోకపూరణార్థః.**

**తె.అ.** ఇక్కడ 'అనాదిమత్పరం' అన్నదానికి కొందరు 'అనాది, మత్పరం' అని విడదీసి అర్థం చెపుతున్నారు ఎందుకంటే బహువ్రీహితో చెప్పిన అర్థానికి 'మతుప్' ప్రత్యయం చేర్చడం నిరర్థకము,

అనిష్టమునని, వారు అర్థం కూడా వేరుగా ఇట్లా చెపుతారు, 'వాసుదేవుడనైన ఎవరి పరమశక్తినో ఆ బ్రహ్మము అనాది' అని. నిజమే, ఈ విధంగా అర్థం చెప్పడంవల్ల పునరుక్తి తొలగుతుంది. కాని అర్థమదికాదు. 'స సత్తన్నాసదుచ్యతే' అని అన్ని విశేషణాలను ప్రతిషేధిస్తూ తెలియదగినది అని చెపుతూ విశిష్టశక్తిమత్వం ప్రదర్శించటం పరస్పరవిరుద్ధం. బహువ్రీహి, మతుప్ ప్రత్యయము రెండూ ఒకే అర్థాన్ని చెపుతున్నప్పటికీ శ్లోకం పూరించడం కొరకు ప్రయోగించబడినవని గ్రహించవలెను.

**భాష్యమ్ : 12.3 "అమృతత్త్వఫలం జ్ఞేయం మయా ఉచ్యతే" ఇతి ప్రరోచనేన అభిముఖీకృత్య ఆహ – న సత్ తద్ జ్ఞేయముచ్యతే, నాప్యసత్తదుచ్యతే. నను మహతా పరికరబన్ధేన కణ్ఠరవేణ ఉద్ఘుష్య "జ్ఞేయం ప్రవక్ష్యామి" ఇతి, అననురూపమ్ ఉక్తం "న సత్తన్నాసదుచ్యతే" ఇతి? న, అనురూపమేవ ఉక్తమ్. కథమ్? – సర్వాసు హి ఉపనిషత్సు జ్ఞేయం బ్రహ్మ "నేతి నేతి" (బృ.ఉ.2.3.6), "అస్థూలమ్ అనణు" (బృ.ఉ.3.8.8) ఇత్యాది విశేషప్రతిషేధేనైవ నిర్దిశ్యతే, "న ఇదం తత్" ఇతి, వాచః అగోచరత్వాత్. నను న తద్ అస్తి యత్ వస్తు 'అస్తి' శబ్దేన నోచ్యతే? అథ 'అస్తి' శబ్దేన నోచ్యతే నాస్తి తద్ జ్ఞేయమ్. విప్రతిషిద్ధం చ 'జ్ఞేయం తత్' 'అస్తిశబ్దేన నోచ్యతే' ఇతి. న తావత్ నాస్తి, నాస్తిబుద్ధ్య విషయత్వాత్.**

**నను సర్వాః బుద్ధయః అస్తినాస్తిబుద్ధ్యనుగతా ఏవ? తత్రైవం సతి జ్ఞేయమపి అస్తిబుద్ధ్యనుగత ప్రత్యయ విషయం వా స్యాత్ నాస్తిబుద్ధ్యనుగతప్రత్యయవిషయం వా స్యాత్. న, అతీన్ద్రియత్వేన ఉభయబుద్ధ్యనుగత ప్రత్యయావిషయత్వాత్. యత్ హి ఇన్ద్రియగమ్యం వస్తు ఘటాదికం, తత్ అస్తిబుద్ధ్యనుగతప్రత్యయవిషయం వా స్యాత్, నాస్తి బుద్ధ్యనుగతప్రత్యయవిషయం వా స్యాత్. ఇదం తు జ్ఞేయమ్ అతీన్ద్రియత్వేన శబ్దైక ప్రమాణగమ్యత్వాత్ న ఘటాదివత్ ఉభయబుద్ధ్యనుగత ప్రత్యయవిషయమ్, ఇత్యతః "న సత్తన్నాసత్" ఇతి ఉచ్యతే. యత్తూక్తం విరుద్ధమ్ ఉచ్యతే, 'జ్ఞేయం తత్' 'న సత్తన్నాసదుచ్యతే' ఇతి, న విరుద్ధమ్ – "అన్యదేవ తద్విదితాదథో అవిదితాదధి" (కే.ఉ.1.3) ఇతి శ్రుతేః. శ్రుతిరపి విరుద్ధార్థా ఇతి చేత్ – యథా యజ్ఞాయ శాలామారభ్య "కో హి తద్వేద యద్యముష్మిన్ లోకేఽస్తి వా న వేతి" (తై.సం.6.1.1.) ఇతి చేత్ – న, విదితావిదితాన్యత్వశ్రుతేః అవశ్యవిజ్ఞేయార్థప్రతిపాదనపరత్వాత్. "యద్యముష్మిన్" ఇత్యాది తు విధిశేషః అర్థవాదః.**

**తె.అ.** అమృతత్వఫలమిచ్చే జ్ఞేయాన్ని నేను చెపుతాను అని రుచి కలిగించి అర్జునుని అభిముఖుణ్ణి చేసుకుని 'ఆ జ్ఞేయం ఉన్నదనలేము లేదనలేము' అని అన్నాడు.

ఆక్షేపణ – 'తెలియదగినదానినిచెపుతాను' అని గొప్పగా గొంతెత్తి ఘోషించి 'ఉన్నదనలేము, లేదనలేము' అని తేల్చివేయడం తగనివిధంగా ఉంది.

సమాధానం - కాదు , అనురూపంగానే ఉంది. ఎట్లా? అన్ని ఉపనిషత్తులలోను జ్ఞేయమైన బ్రహ్మము **నేతి నేతి** 'ఇది కాదు ఇది కాదు' (బృ.ఉ.2.3.6) **అస్థూలమనణు** 'పెద్దదికాదు చిన్నది కాదు' (బృ.ఉ.3.8.8) అంటూ విశేషణాలు తొలగిస్తూ 'అది ఇది కాదు' అని నిర్దేశించబడింది, వాక్కుకు అందనిది కనుక.

ఆక్షేపణ - 'ఉన్నది' అని చెప్పరాని వస్తువు లేనట్లే కదా? కనుక 'ఉన్నది' అని చెప్పబడలేని జ్ఞేయం లేనట్లే. పైగా 'అది జ్ఞేయము' అంటూ 'అది ఉన్నదనలేము' అనడం పరస్పరవిరుద్ధం.

సమాధానం - కాదు, అది లేనిది కాదు. లేదని తెలియబడనిది కనుక.

ఆక్షేపణ - ఏ వస్తువును గురించిన జ్ఞానమైనా ఉన్నదనో లేదనో ఉండవలెకదా? అటువంటపుడు జ్ఞేయంకూడా ఉన్నదని తెలియబడాలి, లేదా లేదని తెలియబడాలి.

సమాధానం - కాదు. అతీంద్రియం కనుక జ్ఞేయం రెండువిధాలుగా కూడా తెలియదగినది కాదు. ఇంద్రియాలద్వారా తెలియదగిన వస్తువైతే, కుండ మొదలైనది, అది ఉన్నదనో లేదనో తెలుసుకోవచ్చు. కాని ఈ జ్ఞేయం అతీంద్రియం కనుక కేవల శబ్దప్రమాణం చేతనే తెలియదగినది. కుండ మొదలైన వస్తువులవలె ఉన్నదనికాని లేదనికాని రెంటిలో ఏదో ఒక విధంగా తెలియరానిది. కనుక జ్ఞేయం ఉన్నదనలేము లేదనలేము. అది అనుభవైకవేద్యమైనది.

జ్ఞేయం ఉన్నదనలేము లేదనలేము అని అనడం విరుద్ధమంటున్నారు. విరుద్ధంకాదు. 'అది తెలిసినదానికంటె తెలియనిదానికంటె కూడా వేరు' (కే.ఉ.1.3) అని శ్రుతి అంటున్నది.

ఆక్షేపణ - శ్రుతికూడా విరుద్ధ విషయం చెపుతున్నది. ఎట్లాగంటే యజ్ఞశాలను ఆరంభించి 'ఇదంతా ఆ లోకంలో ఉన్నదో లేదో ఎవరికి తెలుసు?' (తై.సం.6.1.1.) అన్నట్లు.

సమాధానం - 'తెలిసినదానికంటె తెలియనిదానికంటె వేరు' అని చెప్పిన శ్రుతి అవశ్యము తెలియదగిన విషయాన్ని ప్రతిపాదించేది. 'ఇది ఆ లోకంలో' అంటూ చెప్పేమాట కేవలం విధి చివరచేసే అర్థవాదం.

**భాష్యమ్ : 12.4 ఉపపత్తేశ్చ సదసదాదిశబ్దైః బ్రహ్మ నోచ్యతే ఇతి. సర్వో హి శబ్దః అర్థ-ప్రకాశనాయ ప్రత్యుక్తః, శ్రూయమాణః చ శ్రోతృభిః, జాతిక్రియాగుణసంబన్ధద్వారేణ సంకేతగ్రహణ-సవ్యపేక్షః అర్థం ప్రత్యాయయతి, న అన్యథా, అదృష్టత్వాత్. తద్యథా - 'గౌః' 'అశ్వః' ఇతి వా జాతితః, 'పచతి', 'పఠతి' ఇతి వా క్రియాతః, 'శుక్లః' 'కృష్ణః' ఇతి వా గుణతః, 'ధనీ' 'గోమాన్' ఇతి వా సంబన్ధతః. న తు బ్రహ్మ జాతిమత్, అతః న సదాదిశబ్దవాచ్యమ్ - నాపి గుణవత్. యేన గుణశబ్దేన ఉచ్యేత - నిర్గుణత్వాత్, నాపి క్రియాశబ్దవాచ్యమ్, నిష్క్రియత్వాత్,**

**"నిష్కలం నిష్క్రియం శాన్తమ్" ఇతిశ్రుతేః (శ్వే.ఉ.6.19). న చ సంబన్ధీ, ఏకత్వాత్. అద్వయత్వాత్ అవిషయత్వాత్, ఆత్మత్వాత్ చ న కేనచిత్ శబ్దేన ఉచ్యతే ఇతి యుక్తమ్; "యతో వాచో నివర్తన్తే" (తై.ఉ.2.9.9) ఇత్యాది శ్రుతిభిః చ.**

**తె.అ.** బ్రహ్మము ఉన్నదనిగాని లేదనిగాని చెప్పరానిది అనే విషయం యుక్తియుక్తం కూడా. శబ్దాలన్నీ అర్థం తెలియడానికే ప్రయోగించబడతాయి. వినేవానికి వినిపించేవానికి కూడా ఆ శబ్దాలు జాతిక్రియాగుణసంబంధం ద్వారా గుర్తులు తెలిపి అర్థప్రతీతి కలిగిస్తాయి. మరొకవిధంగా అర్థప్రతీతి కలగడం మనం చూడలేదు. ఎట్లాగంటే, ఆవు గుర్రము అని జాతిచేతగాని; వండుతున్నాడు చదువుతున్నాడు అని క్రియచేతగాని; తెల్లనిది నల్లనిది అని గుణంచేతగాని; ధనవంతుడు గోవులు కలవాడు అని సంబంధం చేతగాని. కాని బ్రహ్మమునకు జాతిలేదు. కనుక ఉన్నది మొదలైన శబ్దాలతో చెప్పబడలేనిది. గుణంకూడా లేదు, నిర్గుణాన్ని ఏ గుణం చేత చెపుతాము? క్రియా శబ్దం చేతకూడా చెప్పరానిది, నిష్క్రియం కనుక, 'నిష్కలము నిష్క్రియము శాంతము' (శ్వే.ఉ.6.1.19) అని శ్రుతి. సంబంధం కూడా లేదు, ఏకత్వకారణంగా. (ఒకదానికి మరొకదానితో సంబంధం. ఉన్నదొకటే అయినపుడు, మరొకటి లేనపుడు, దేనితో సంబంధం?) అద్వయము, ఇంద్రియాలకు అవిషయము, ఆత్మరూపము కనుక ఏ శబ్దము దానిని చెప్పకపోవడం యుక్తమే. 'దేనినుండి వాక్కు వెనుదిరుగునో' (తై.ఉ.2.9.9) వంటి శ్రుతులు కూడా ఉన్నాయి.

**భాష్యమ్ : 13.0 సచ్ఛబ్దప్రత్యయావిషయత్వాత్ అసత్త్వాశంకాయాం జ్ఞేయస్య సర్వప్రాణికరణో-పాధిద్వారేణ తదస్తిత్వం ప్రతిపాదయన్ తదాశంకానివృత్త్యర్థమ్ ఆహ –**

**తె.అ.** 'ఉన్నది' అన్న శబ్దంచేత తెలియదగని విషయం కనుక జ్ఞేయమసలు లేదనే సందేహం కలుగువచ్చునని ఆ సందేహాన్ని తొలగించడంకొరకు సమస్తప్రాణుల ఇంద్రియాల ఉపాధులద్వారా ఆ జ్ఞేయం యొక్క అస్తిత్వాన్ని ప్రతిపాదిస్తూ అంటున్నాడు –

**మూ. సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షిశిరోముఖమ్ ।**
**సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి ॥ 13**

**తె.అ.** దాని హస్తాలూ పాదాలూ అంతటా ఉన్నాయి; నేత్రాలూ, శిరస్సులూ, ముఖాలూ, చెవులూ అన్ని వైపులా ఉన్నాయి. అది లోకంలో సమస్తమునూ ఆవరించి ఉంది.

**భాష్యమ్ : 13.1 సర్వతః ఇతి – సర్వతః పాణిపాదమ్ – సర్వతః పాణయః పాదాః చ అస్య ఇతి సర్వతః పాణిపాదం తత్ జ్ఞేయమ్. సర్వప్రాణికరణోపాధిభిః క్షేత్రజ్ఞస్యాస్తిత్వం విభావ్యతే. క్షేత్రజ్ఞశ్చ క్షేత్రోపాధితః ఉచ్యతే. క్షేత్రం చ పాణిపాదాదిభిః అనేకధా భిన్నమ్. క్షేత్రోపాధిభేదకృతం**

**విశేషజాతం మిథ్యైవ క్షేత్రజ్ఞస్య, ఇతి తదపనయనేన జ్ఞేయత్వమ్ ఉక్తం "న సత్తన్నాసదుచ్యతే" ఇతి. ఉపాధికృతం మిథ్యారూపమపి అస్తిత్వాధిగమాయ జ్ఞేయధర్మవత్ పరికల్ప్య ఉచ్యతే "సర్వతః పాణిపాదమ్" ఇత్యాది. తథా హి సంప్రదాయవిదాం వచనమ్ - "అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపఞ్చం ప్రపంచ్యతే" ఇతి. సర్వత్ర సర్వదేహావయవత్వేన గమ్యమానాః పాణిపాదాదయః జ్ఞేయశక్తి సద్భావనిమిత్తస్వకార్యాః ఇతి జ్ఞేయసద్భావే లింగాని, 'జ్ఞేయస్య' ఇతి ఉపచారతః ఉచ్యన్తే. తథా వ్యాఖ్యేయమన్యత్. సర్వతః పాణిపాదం తత్ జ్ఞేయం, సర్వతః అక్షిశిరోముఖం, సర్వతః అక్షీణి శిరాంసి ముఖాని చ యస్య తత్ సర్వతోఽక్షిశిరోముఖమ్; సర్వతః శ్రుతిమత్ శ్రుతిః శ్రవణేన్ద్రియం, తత్ యస్య తత్ శ్రుతిమత్ లోకే ప్రాణినికాయే; సర్వమ్ ఆవృత్య సర్వం వ్యాప్య తిష్ఠతి స్థితిం లభతే.**

**తె.అ.** ఆ జ్ఞేయానికి కాళ్ళుచేతులు అంతటా ఉన్నాయి. సమస్తప్రాణుల ఇంద్రియాలద్వారా క్షేత్రజ్ఞుని అస్తిత్వము ప్రకటమవుతున్నది. క్షేత్రమనే ఉపాధిచేతనే అతడు క్షేత్రజ్ఞుడనబడుతున్నాడు. ఆ క్షేత్రము పాణిపాదాదులచేత అనేక విధాలుగా భిన్నమై ఉంది. క్షేత్రమనే ఉపాధికారణంగా కలిగిన వైవిధ్యమంతా క్షేత్రజ్ఞునికి మిథ్యారూపమే అని, దానిని తొలగించడం ద్వారా తెలియదగినది అని, ఉన్నదనలేము లేదనలేము అని జ్ఞేయాన్ని అంటున్నాడు. ఉపాధికారణమైన మిథ్యారూపమే అయినప్పటికీ జ్ఞేయం యొక్క అస్తిత్వాన్ని తెలియపరచడంకొరకు 'అంతటా కాళ్ళు చేతులు'నని ఆ జ్ఞేయధర్మాలేనన్నట్లు కల్పించి చెపుతున్నాడు. సంప్రదాయవేత్తలు కూడా ఇదే మాటంటున్నారు. 'అధ్యారోప, అపవాదములద్వారా నిష్ప్రపంచమును (బ్రహ్మమును) వ్యాఖ్యానిస్తున్నాము' అని. సర్వ దేహావయవాలుగా అందరికీ తెలిసిన పాణిపాదాదులు జ్ఞేయశక్తి ఉన్నది కనుక వాటివాటి పనులు చేసుకోగలుగుతున్నాయి. జ్ఞేయమున్నదనడానికి గుర్తులు కనుక ఇవి జ్ఞేయధర్మాలేనని చెప్పబడు తున్నాయి. తక్కినవి (ఇంద్రియాలు) కూడా ఇదేవిధంగా వ్యాఖ్యానించుకోవలె. ఆ జ్ఞేయానికి అంతటా కాళ్ళు చేతులు. దానికి కళ్ళు తలలు నోళ్ళు అంతటా ఉన్నాయి. దాని చెవులు అంతటా ఉన్నాయి. అది ప్రాణిలోకాన్నంతటినీ ఆవరించి ఉన్నది.

**భాష్యమ్ : 14.0 ఉపాధిభూతపాణిపాదాదీన్ద్రియాధ్యారోపణాత్ జ్ఞేయస్య తద్వత్తాశంకా మా భూత్ ఇత్యేవమర్థః శ్లోకారమ్భః :-**

**తె.అ.** ఉపాధిరూపమైన పాణిపాదాది ఇంద్రియాలను అధ్యారోపం చేసినందున జ్ఞేయానికి ఉపాధులున్నాయన్న సందేహం కలగకుండా ఈ శ్లోకం చెపుతున్నాడు -

**మూ. సర్వేన్ద్రియగుణాభాసం సర్వేన్ద్రియవివర్జితమ్ ।**
**అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ ॥ 14**

**తె.అ.** సర్వేంద్రియాలు ఇంద్రియధర్మాలు కలిగి ఉన్నట్లు కనిపిస్తుంది. నిజానికి దానికే ఇంద్రియమూ లేదు. దేనిమీదా ఆసక్తిలేదు, కాని అన్నిటిని భరిస్తుంది. దేనికి గుణాలు లేవు. కాని గుణాల నన్నిటిని అనుభవిస్తుంది.

**భాష్యమ్ : 14.1 సర్వేన్ద్రియ ఇతి – సర్వేన్ద్రియగుణాభాసమ్ – సర్వాణి చ తాని ఇన్ద్రియాణి శ్రోత్రాదీని, బుద్ధీన్ద్రియ కర్మేన్ద్రియాఖ్యాని, అన్తఃకరణే చ బుద్ధిమనసీ జ్ఞేయోపాధిత్వస్య తుల్యత్వాత్ సర్వేన్ద్రియ – గ్రహణేన గృహ్యన్తే. అపి చ, అన్తఃకరణోపాధిద్వారేణైవ శ్రోత్రాదీనామపి ఉపాధిత్వమ్ ఇత్యతః అన్తఃకరణబహిష్కరణోపాధిభూతైః సర్వేన్ద్రియగుణైః అధ్యవసాయసంకల్పశ్రవణవచనాదిభిః అవభాసతే ఇతి సర్వేన్ద్రియగుణాభాసమ్, సర్వేన్ద్రియవ్యాపారైః వ్యాపృతమివ తద్ జ్ఞేయమిత్యర్థః. “ధ్యాయతీవ లేలాయతీవ” (బృ.ఉ.4.3.7) ఇతి శ్రుతేః. కస్మాత్ పునః కారణాత్ న వ్యాపృతమేవ ఇతి గృహ్యతే ఇత్యతః ఆహ – సర్వేన్ద్రియవివర్జితం సర్వకరణరహితమ్ ఇత్యర్థః. అతః న కరణవ్యాపారైః వ్యాపృతం తద్ జ్ఞేయమ్. యస్తు అయం మన్త్రః “అపాణిపాదో జవనో గ్రహీతా పశ్యత్యచక్షుః స శృణోత్య –కర్ణః” (శ్వే.ఉ.3.19) ఇత్యాదిః సః సర్వేన్ద్రియోపాధి గుణానుగుణ్యభజనశక్తిమత్ తత్ జ్ఞేయమ్ ఇత్యేవం ప్రదర్శనార్థః; న తు సాక్షాదేవ జననాదిక్రియావత్త్వప్రదర్శనార్థః “అన్ధో మణిమవిన్దత్” (తై.ఆ.1.1) ఇత్యాదిమన్త్రార్థవత్ తస్య మన్త్రస్య అర్థః. యస్మాత్ సర్వకరణవర్జితం తత్ జ్ఞేయం, తస్మాత్ అసక్తం సర్వసంశ్లేషవర్జితమ్. యద్యపి ఏవం, తథాపి సర్వభృత్ చ ఏవ. సదాస్పదం హి సర్వం, సర్వత్ర సద్బుద్ధ్యనుగమాత్. న హి మృగతృష్ణికాదయః అపి నిరాస్పదా భవన్తి. అతః సర్వభృత్ సర్వం బిభర్తి ఇతి. స్యాత్ ఇదం చ అన్యత్ జ్ఞేయస్య సత్త్వాధిగమద్వారమ్ – నిర్గుణం – సత్త్వరజస్తమాంసి గుణాః తైః వర్జితం తత్ జ్ఞేయం, తథాపి గుణభోక్తృ చ – గుణానాం సత్త్వరజస్తమసాం శబ్దాది ద్వారేణ సుఖదుఃఖమోహాకారపరిణతానాం, భోక్తృ చ ఉపలబ్ధృ చ తత్ జ్ఞేయమ్ – ఇత్యర్థః – కించ –**

**తె.అ.** సర్వేంద్రియాలు అంటే చెవులు మొదలైన జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, బుద్ధి మనసులనే అంతఃకరణాలు. బుద్ధిమనసులు కూడా జ్ఞేయానికి ఉపాధులు కనుక అవీ తక్కిన ఇంద్రియాల వంటివే. అంతేకాదు అంతఃకరణోపాధి ద్వారానే శ్రోత్రాదులు ఉపాధులవుతున్నాయి. (బుద్ధి మనసుల ద్వారానే శ్రోత్రాదులు పనిచేస్తున్నాయి.) కనుక అంతఃకరణబహిష్కరణాలైన సర్వేంద్రియగుణాలద్వారా, అంటే నిశ్చయము, సంకల్పము, శ్రవణము, వచనముల వంటి వాటి వలన జ్ఞేయం తెలియబడుతుంది. ఇంద్రియాలన్నీ చేసే పనులవలన ఆ జ్ఞేయం పనులు చేస్తున్నట్లు కనిపిస్తుంది. **‘ధ్యానిస్తున్నట్టు, కదులుతున్నట్టు’**, (బృ.ఉ.4.3.7) అని శ్రుతి. ‘ఆ జ్ఞేయం క్రియలు చేస్తున్నదని ఎందుకనుకోరాదు?’ అంటారని చెపుతున్నాడు, సర్వేంద్రియ

వివర్జితమని, అది దానికే ఇంద్రియము లేదని చెబుతున్నాడు. కనుక ఇంద్రియాలు పనిచేస్తున్నా జ్ఞేయం పనిచేసినట్లు కాదు. 'చేతులు కాళ్ళు లేవు, కాని వేగముంది, పట్టుకుంటుంది; కళ్ళులేవు కాని చూడగలదు; చెవులు లేవు కాని వినగలదు'. (శ్వే.ఉ.3.19) వంటి శ్రుతులు ఏం చెపుతున్నాయంటే జ్ఞేయానికి అన్ని ఇంద్రియాల వ్యాపారాలకు అనురూపమైన శక్తి ఉన్నదని. అంతేకాని సాక్షాత్తు వేగము మొదలైన క్రియలు అది చేస్తుందనికాదు. 'గ్రుడ్డివాడు మణిని పొందెను' (తై.ఆ.1.1) మొదలైన మంత్రార్థం వంటిదే ఈ మంత్రానికి కూడా అర్థం. ఏ ఇంద్రియాలు లేనిది కనుక ఆ జ్ఞేయం అసక్తం, అంటే దేనికీ అంటుకోదు. అంటకున్నా అన్నిటినీ భరిస్తుంది. సర్వమూ సదాస్పదం, అన్నిటియందు సద్బుద్ధి ఉంటుంది గనుక. (సత్ ఆస్పదం అంటే సత్ అనేదానిమీద ఆధారపడినది అని. సత్ అంటే ఉన్నది అని. సద్బుద్ధి అంటే ఉన్నది అన్న బుద్ధి. ఏ వస్తువైనా అది ఉన్నదనుకుంటేనే ఉంటున్నది) ఎండమావులుకూడా ఉన్నాయని అనుకుంటేనే ఉంటున్నాయి. అంటే అవికూడా నిరాస్పదం కావు, సదాస్పదమే. కనుక సర్వమును భరించునది జ్ఞేయం. ఈ జ్ఞేయం ఉన్నదని తెలుసుకోడానికి మరొక మార్గముంది. జ్ఞేయం నిర్గుణం, సత్త్వరజస్తమో గుణరహితం. అయినప్పటికి సుఖదుఃఖమోహాకారంగా మారిన సత్త్వరజస్తమస్సులను అది శబ్దాదుల ద్వారా అనుభవిస్తుంది. (కనుక జ్ఞేయమున్నదని తెలుసుకుంటున్నాము) అంతేకాదు –

**మూ. బహిరన్తశ్చ భూతానామచరం చరమేవ చ ।**
**సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థం చాన్తికే చ తత్ ॥ 15**

**తె.అ.** ఈ పరబ్రహ్మ వెలుపల, లోపల అంతటా ఉన్నది. చరము అచరము కూడా. సూక్ష్మము, కనుక తెలియరానిది. దూరముగా ఉంటుంది. దగ్గర కూడా ఉంటుంది.

**భాష్యమ్ : 15.1 బహిః ఇతి – బహిః – త్వక్పర్యన్తం దేహమ్ ఆత్మత్వేన అవిద్యాకల్పితమ్ అపేక్ష్య తమేవ అవధిం కృత్వా బహిః ఉచ్యతే. తథా ప్రత్యగాత్మానమ్ అపేక్ష్య దేహమేవ అవధిం కృత్వా అన్తః ఉచ్యతే. 'బహిరన్తశ్చ' ఇత్యుక్తే మధ్యే అభావే ప్రాప్తే ఇదమ్ ఉచ్యతే – అచరం చరమేవ చ, యత్ చరాచరం, దేహాభాసమపి, తదేవ జ్ఞేయం, యథా రజ్జుః సర్పాభాసః. యది అచరం చరమేవ చ స్యాత్ వ్యవహారవిషయం సర్వం జ్ఞేయం కిమర్థమ్ 'ఇదమ్' ఇతి సర్వైః న విజ్ఞేయమ్ ఇతి? ఉచ్యతే – సత్యం సర్వాభాసం తత్, తథాపి వ్యోమవత్ సూక్ష్మమ్. అంతః సూక్ష్మత్వాత్ స్వేన రూపేణ తత్ జ్ఞేయమపి అవిజ్ఞేయమ్ అవిదుషామ్. విదుషాం తు – "ఆత్మైవ ఇదం సర్వమ్" (బృ.ఉ.2.4.6) "బ్రహ్మైవేదం సర్వమ్" (బృ.ఉ.2.5.1) ఇత్యాదిప్రమాణతః నిత్యం విజ్ఞాతమ్. అవిజ్ఞాతతయా దూరస్థం వర్షసహస్ర కోట్యాఽపి అవిదుషామ్ అప్రాప్యత్వాత్. అన్తికే చ తత్ ఆత్మత్వాత్ విదుషామ్. కిం చ –**

**తె.అ.** అవిద్యచేత ఇదే ఆత్మ అనుకుంటున్న చర్మం వరకు గల దేహాన్ని హద్దుగా చేసి, దానికి వెలుపల అంటున్నాడు. అట్లాగే ప్రత్యగాత్మనుద్దేశించి ఆ దేహాన్నే హద్దుగా చేసి లోపల అంటున్నాడు. (ఈ దేహం వరకు నేను (ఆత్మ), ఈ దేహానికి వెలుపల ఉన్నది నేనుకాదు అనుకోడం అవిద్య. నిజానికి ఈ దేహమూ వెలుపలిదే, అంటే అనాత్మ) లోపల వెలుపల అనడం చేత మధ్యలో లేదు అన్నట్లవుతుందని అంటున్నాడు, చరము అచరము కూడా అని. కదులుతూను కదలకుండాను కనిపించే దేహంకూడా, జ్ఞేయమే. రజ్జువు సర్పంవలె కనిపించినట్లు, జ్ఞేయంనందు ఆరోపించబడిన చరాచర జగత్తు కూడా జ్ఞేయమే. కదిలేది కదలనిది వ్యవహారమంతా ఆ జ్ఞేయమే అయినపుడు ఇది అని అందరకు ఎందుకు తెలియడంలేదు? అంటే, నిజమే, అది. సకల చరాచర రూపంలో భాసిస్తున్నది. కాని ఆకాశంవలె సూక్ష్మమైనది కనుక దాని స్వరూపం జ్ఞేయమే అయినా, అజ్ఞానులకది తెలియ శక్యం కాదు. జ్ఞానులకు మాత్రం 'ఇదంతా ఆత్మే' (బృ.ఉ.2.4.6) 'ఇదంతా బ్రహ్మమే' (బృ.ఉ.2.5.1) మొదలైన ప్రమాణాలచేత నిత్యము తెలుస్తూనే ఉంది. తెలియనపుడు అదెంతోదూరం, వేలకోట్ల సంవత్సరాలకైనా అజ్ఞానులకు అందనిది కనుక. జ్ఞానులకు ఆత్మే కనుక దగ్గరిది. అంతేకాదు –

**మూ. అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితమ్ ।**
**భూతభర్తృ చ తద్ జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ ॥ 16**

**తె.అ.** అవిభక్తమయినప్పటికి సమస్త ప్రాణులలో వేరువేరుగా ఉన్నట్లు కనిపిస్తుంది. భూతములను పోషించేదీ, మ్రింగివేసేదీ, పుట్టించేదే తెలిసికొనదగినదైన ఆ బ్రహ్మము అవిభక్తమైనప్పటికీ సమస్త ప్రాణులలో వేరు వేరుగా ఉన్నట్లు కనిపిస్తుంది.

**భాష్యమ్ : 16.1 అవిభక్తం ఇతి – అవిభక్తం చ, ప్రతిదేహం వ్యోమవత్ తత్ ఏకమ్. భూతేషు సర్వప్రాణిషు విభక్తమివ చ స్థితం, దేహేష్వేవ విభావ్యమానత్వాత్. భూతభర్తృ చ – భూతాని బిభర్తీతి తత్ జ్ఞేయం భూతభర్తృ చ స్థితికాలే. ప్రలయకాలే చ గ్రసిష్ణు గ్రసనశీలమ్. ఉత్పత్తికాలే ప్రభవిష్ణు చ ప్రభవనశీలం, యథా రజ్జ్వాదిః సర్పాదేః మిథ్యాకల్పితస్య.**

**తె.అ.** ఆ జ్ఞేయం ప్రతి ఒక్క శరీరంలోను ఆకాశంవలె అవిభక్తము, ఏకము. దేహాలలో కనిపిస్తుంది కనుక విభక్తమైనట్లుగా మనకనిపిస్తుంది. ఆ జ్ఞేయం స్థితికాలంలో ప్రాణులను భరిస్తుంది. ప్రళయకాలంలో హరిస్తుంది, ఉత్పత్తికాలంలో పుట్టిస్తుంది. మిథ్యాకల్పిత సర్పాదులను రజ్జ్వాదులవలె. (తాడును చూచి పాము అనుకున్నప్పుడు, అది పాముకాదు తాడని తెలిసినపుడు ఆ పాముయొక్క ఉత్పత్తి స్థితిలయాలు తాడులో జరిగినట్లు జగత్తుయొక్క స్థితిలయాలు ఆ జ్ఞేయంలో జరుగుతున్నాయి).

**భాష్యమ్ : 17.0 కిం చ- సర్వత్ర విద్యమానమపి సత్ న ఉపలభ్యతే చేత్ జ్ఞేయం తమః తర్హి? న. కిం తర్హి -**

**తె.అ.** అంతటా ఉన్న వస్తువు (సత్పదార్థం) ఎవరికీ కనిపించడంలేదంటే అది చీకటి అన్నట్లే గదా? అంటే - కాదు. మరేమిటి?

**మూ. జ్యోతిషామపి తజ్జ్యోతిస్తమసః పరముచ్యతే ।**
**జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్ ॥ 17**

**తె.అ.** అది సూర్యచంద్రాదులకు వెలుగునిచ్చే ప్రకాశము. తమస్సుకు అవతలిది. జ్ఞానము, జ్ఞేయము, జ్ఞానంచేత చేరవలసిన గమ్యము అదే. అందరి హృదయాలలో విశేషరూపంతో వెలుగుతున్నది.

**భాష్యమ్ : 17.1 జ్యోతిషామ్ ఇతి - జ్యోతిషామ్ ఆదిత్యాదీనామ్ అపి, తత్ జ్ఞేయం, జ్యోతిః. ఆత్మచైతన్య జ్యోతిషా ఇద్ధాని హి ఆదిత్యాదీని జ్యోతీంషి దీప్యన్తే. "యేన సూర్యస్తపతి తేజసేద్ధః" (తై.బ్రా.3.12.9), "తస్య భాసా సర్వమిదం విభాతి" (శ్వే.ఉ.6.14) ఇత్యాది మన్త్రేభ్యః; స్మృతేశ్చ ఇహైవ "యదాదిత్య గతం తేజః" (15.12.) ఇత్యాదేః. తమసః అజ్ఞానాత్, పరమ్ అసంస్పృష్టమ్, ఉచ్యతే. జ్ఞానాదేః దుఃఖసంపాదనబుద్ధ్యా ప్రాప్తావసాదస్య ఉత్తమ్భనార్థమ్ ఆహ జ్ఞానమ్ అమానిత్వాది (13.7-11), జ్ఞేయం "జ్ఞేయం యత్తత్ ప్రవక్ష్యామి" (13.12-17) ఇత్యాదినా ఉక్తమ్. జ్ఞానగమ్యమ్ జ్ఞేయమేవ జ్ఞాతం సత్ జ్ఞానఫలమ్ ఇతి జ్ఞానగమ్యమ్ ఉచ్యతే. జ్ఞాయమానం తు తద్ జ్ఞేయమ్. తత్ ఏతత్ త్రయమపి హృది బుద్ధౌ సర్వస్య ప్రాణిజాతస్య, విష్ఠితం విశేషేణ స్థితమ్. తత్రైవ హి ఏతత్ త్రయం విభావ్యతే.**

**తె.అ.** ఆ జ్ఞేయం సూర్యులకు కూడా వెలుగునిచ్చే జ్యోతి. ఆదిత్యాది జ్యోతులు ఆత్మ చైతన్య జ్యోతిలో వెలిగించబడియే దేదీప్యమానమవుతున్నాయి. 'ఏ తేజస్సు చేత వెలిగించబడి సూర్యుడు తపింపజేస్తున్నాడో' (తై.బ్రా.3.12.9) 'అతని కాంతితో ఈ సమస్తము ప్రకాశిస్తున్నది', (శ్వే.ఉ.6.1.4) మొదలైన శ్రుతులు, స్మృతులూ 'ఆదిత్యునిలో ఏ తేజమున్నదో' (15.12) అని అంటున్నాయి. అజ్ఞానమనే తమస్సుకు అవతలిది, అజ్ఞానం దాన్ని అంటలేదు. జ్ఞానాదులను సంపాదించడం కష్టమని నిరుత్సాహి అయినవానిని ఉత్సాహపరచడంకొరకు అంటున్నాడు - జ్ఞానము, జ్ఞేయము, జ్ఞానగమ్యము ప్రతిప్రాణి హృదయంలో ఉంటాయి అని. జ్ఞానమంటే ఇక్కడ అమానిత్వాది జ్ఞాన సాధనాలు (13.7-11). జ్ఞేయమంటే 'జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి' (13.12-17) మొదలైన శ్లోకాలలో చెప్పబడినది. జ్ఞానగమ్యమంటే జ్ఞానం కలిగిన తరువాత

జ్ఞేయమే జ్ఞానఫలం కనుక దానిని జ్ఞానగమ్యమంటారు. తెలియబడినదానినే జ్ఞేయమంటారు. ఈ మూడు ప్రతీప్రాణి హృదయంలో అంటే బుద్ధియందు విశేషరూపంతో ఉంటాయి. బుద్ధిమాత్రమే ఈ మూడింటిని భావించగలదు.

**భాష్యమ్ : 18.0 యథోక్తార్థోపసంహారార్థః అయం శ్లోకః ఆరభ్యతే –**

**తె.అ.** ఇంతవరకు చెప్పిన విషయాన్ని ఈ శ్లోకంతో ముగిస్తున్నాడు –

**మూ. ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః ।**
**మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావాయోపపద్యతే ॥ 18**

**తె.అ.** క్షేత్రము, జ్ఞానము, జ్ఞేయము వీటిని గురించి సంక్షిప్తంగా చెప్పాను. దీనిని తెలుసుకున్న నా భక్తుడు మోక్షానికి అర్హుడవుతాడు.

**భాష్యమ్ : 18.1 ఇతి క్షేత్రం ఇతి – ఇతి ఏవమ్ క్షేత్రమ్ మహాభూతాది ధృత్యన్తం (13.5–6), తథా జ్ఞానమ్ అమానిత్వాది తత్త్వజ్ఞానార్థదర్శనపర్యన్తమ్ (13.7–11), జ్ఞేయం చ "జ్ఞేయం యత్తత్" (13.12) ఇత్యాది "తమసః పరముచ్యతే" (13.17) ఇత్యేవమన్తమ్, ఉక్తం సమాసతః సంక్షేపతః. ఏతావాన్ హి సర్వః వేదార్థః గీతార్థశ్చ ఉపసంహృత్య ఉక్తః. అస్మిన్ సమ్యగ్దర్శనే కః అధిక్రియతే ఇతి ఉచ్యతే – మద్భక్తః మయి సర్వేశ్వరే సర్వజ్ఞే పరమగురౌ వాసుదేవే సమర్పిత–సర్వాత్మభావః యత్ పశ్యతి శృణోతి స్పృశతి వా "సర్వమేవ భగవాన్ వాసుదేవః" ఇత్యేవంగ్రహా–విష్టబుద్ధిః మద్భక్తః సః ఏతత్ యథోక్తం సమ్యగ్దర్శనం విజ్ఞాయ, మద్భావాయ – మమ భావః మద్భావః, పరమాత్మభావః, తస్మై మద్భావాయ ఉపపద్యతే ఘటతే, మోక్షం గచ్ఛతి.**

**తె.అ.** మహాభూతములు మొదలుకొని ధృతివరకు (13.5–6) గలది క్షేత్రము. అమానిత్వము మొదలు తత్త్వజ్ఞానార్థదర్శనపర్యంతము జ్ఞానము. (జ్ఞానమంటే ఇక్కడ అమానిత్వాది జ్ఞానసాధనాలు). 'జ్ఞేయం యత్తత్' (13.12) మొదలు 'తమసః పరముచ్యతే' (13.17) వరకు జ్ఞేయము. ఈ మూడింటిని సంక్షిప్తంగా చెప్పాను. సమస్తమైన వేదార్థాన్ని, గీతార్థాన్ని సంగ్రహంగా చెప్పిందే ఇదంతా. ఈ సమ్యగ్దర్శనానికి అధికారి ఎవరు అంటే, చెపుతున్నాడు నా భక్తుడు అని. సర్వజ్ఞుడు పరమగురువు అయిన నాయందు, అంటే వాసుదేవునియందు, సర్వాత్మభావం కలిగినవాడు. అంటే ఏది చూచినా విన్నా తాకినా ఇదంతా భగవంతుడైన వాసుదేవుడే అన్నభావం ఆవేశించినవాడు. అటువంటి భక్తుడు ఇప్పుడు చెప్పిన సమ్యగ్దర్శనం కలిగి పరమాత్మభావమును అంటే మోక్షమును పొందుతాడు.

**భాష్యమ్ : 19.0 తత్ర సప్తమాధ్యాయే ఈశ్వరస్య ద్వే ప్రకృతీ ఉపన్యస్తే పరాపరే క్షేత్రక్షేత్రజ్ఞ లక్షణే ; "ఏతద్యోనీని భూతాని" (7.6) ఇతి చోక్తమ్. క్షేత్రక్షేత్రజ్ఞప్రకృతిద్వయయోనిత్వం కథం భూతానామ్ ఇత్యయమ్ అర్థః అధునా ఉచ్యతే –**

**తె.అ.** ఏడవ అధ్యాయంలో ఈశ్వరునికి పరము అపరము అనే రెండు ప్రకృతులు క్షేత్రక్షేత్రజ్ఞ రూపమైనవి ఉన్నవని చెప్పబడింది. భూతములన్నిటికి ఈ రెండును ఉత్పత్తి స్థానములని కూడా చెప్పబడింది. ఈ క్షేత్రక్షేత్రజ్ఞ రూపమైన ప్రకృతిద్వయం భూతములకు ఉత్పత్తిస్థానమెట్లా అయింది అనేదానిని ఇప్పుడు చెపుతున్నాడు –

**మూ. ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి ।**
**వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్ ॥ 19**

**తె.అ.** ప్రకృతిపురుషులిద్దరికీ ఆది అనేది లేదని తెలుసుకో. వికారములు (బుద్ధి మొదలైన కార్యాలూ) గుణములు (సత్త్వరజస్తమోగుణాలు) కూడా ప్రకృతివల్ల కలుగుతున్నవని తెలుసుకో –

**భాష్యమ్ : 19.1 ప్రకృతిం ఇతి – ప్రకృతిం పురుషం చైవ ఈశ్వరస్య ప్రకృతీ, తౌ ప్రకృతిపురుషౌ ఉభౌ అపి అనాదీ విద్ధి. న విద్యతే ఆదిః యయోః తౌ అనాదీ. నిత్యేశ్వరత్వాదీశ్వరస్య తత్ప్రకృత్యోరపి యుక్తం నిత్యత్వేన భవితుమ్. ప్రకృతిద్వయవత్త్వమేవ హి ఈశ్వరస్య ఈశ్వరత్వమ్. యాభ్యాం ప్రకృతిభ్యామ్ ఈశ్వరః జగదుత్పత్తిస్థితిప్రళయహేతుః. తే ద్వే ప్రకృతీ అనాదీ సత్యౌ సంసారస్య కారణమ్.**

**తె.అ.** ఈశ్వరప్రకృతులైన ప్రకృతిపురుషులిద్దరు ఆదిలేనివారని తెలుసుకో. ఈశ్వరుడు నిత్యుడు కనుక ఈశ్వరుని ప్రకృతులు కూడా నిత్యంకావడం యుక్తం. ఈ ప్రకృతులు రెండూ కలిగి ఉండడమే ఈశ్వరుని ఈశ్వరత్వం. ఎందుకంటే ఈ ప్రకృతులవల్లనే ఈశ్వరుడు జగత్తు యొక్క ఉత్పత్తి, స్థితి, ప్రళయాలకు హేతువవుతున్నాడు. అనాది అయిన ఆ రెండూ సంసారకారణం.

**భాష్యమ్ : 19.2 "న ఆదీ అనాదీ" ఇతి తత్పురుషసమాసం కేచిత్ వర్ణయన్తి. తేన హి కిల ఈశ్వరస్య కారణత్వం సిధ్యతి. యది పునః ప్రకృతిపురుషావేవ నిత్యౌ స్యాతాం తత్కృతమేవ జగత్, న ఈశ్వరస్య జగతః కర్తృత్వమ్. తదసత్ – ప్రాక్ ప్రకృతిపురుషయోః ఉత్పత్తేః ఈశితవ్యాభావాత్ ఈశ్వరస్య అనీశ్వరత్వప్రసంగాత్, సంసారస్య నిర్నిమిత్తత్వే అనిర్మోక్షప్రసంగాత్, శాస్త్రానర్థక్య ప్రసంగాత్, బన్ధమోక్షాభావప్రసంగాచ్చ. నిత్యత్వే పునః ఈశ్వరస్య ప్రకృత్యోః సర్వమ్ ఏతత్ ఉపపన్నం భవేత్. కథమ్? వికారాన్ చ గుణాన్ చ ఏవ, వక్ష్యమాణాన్ వికారాన్**

**బుద్ధ్యాది దేహేన్ద్రియాన్తాన్, గుణాన్ చ సుఖదుఃఖమోహప్రత్యయాకారపరిణతాన్ వృక్ష్యమాణాన్ విద్ధి జానీహి, ప్రకృతిసంభవాన్, ప్రకృతిః ఈశ్వరస్య వికారకారణశక్తిః త్రిగుణాత్మికా మాయా, సా సంభవః యేషాం వికారాణాం గుణానాం చ తాన్ వికారాన్ గుణాన్ చ విద్ధి జానీహి ప్రకృతిసంభవాన్ ప్రకృతిపరిణామాన్.**

**తె.అ.** కొందరు వ్యాఖ్యాతలు 'అనాది' అన్న పదాన్ని 'ఆదిలేనిది' అని కాక 'ఆదికానిది' అని తత్పురుష సమాసం చేసి అర్థం చెపుతున్నారు. 'ఆ విధంగా అర్థం చెపితేనే ఈశ్వరుడు జగత్కారణమని చెప్పినట్లవుతుంది. అట్లాకాక ప్రకృతిపురుషులే నిత్యులయితే వారే జగత్కారణమవుతారు, ఈశ్వరుడికి జగత్కర్తృత్వం ఉండదు', అని కూడా అంటున్నారు. అది నిజంకాదు. ప్రకృతి పురుషుల ఉత్పత్తికి పూర్వం శాసించబడదగినదేదీ లేని కారణంగా ఈశ్వరుడు దేనికీశ్వరుడు? (ఈశ్వరుడు ఈశ్వరుడు కాకుండా పోతాడు. రాజ్యం ఉంటేనే కదా రాజనే మాట ఉంటుంది) అప్పుడతడు ఈశ్వరుడు కాదనవలసివస్తుంది. ఏకారణము లేకనే ఈ సంసారం ఉత్పత్తి అయింది అని ఒప్పుకుంటే దానికి అంతంలేదని అన్నట్లవుతుంది. సంసారబంధము మోక్షము రెండూ లేవు కనుక వాటిని చెప్పే శాస్త్రం వ్యర్థమన్నట్లే. ఈశ్వరుని ప్రకృతులు నిత్యము అని ఒప్పుకున్నట్లయితే ఇదంతా సంగతమవుతుంది. ఎట్లా? ముందుచెప్పబోయే వికారాలు – బుద్ధి మొదలు దేహేంద్రియాలవరకు సుఖ – దుఃఖమోహాకారంగా పరిణమించే గుణాలు ప్రకృతివల్ల కలుగుతున్నాయని తెలుసుకో. ప్రకృతి ఈశ్వరుని వికారకారణశక్తి, త్రిగుణాత్మికయైన మాయ.

**భాష్యమ్ : 20.0** కే పునః తే వికారాః గుణాః చ ప్రకృతిసంభవాః?

**తె.అ.** మరి ఆ వికారాలు గుణాలు ఏవి?

**మూ. కార్యక(కా)రణకర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే ।**
**పురుషః సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే ॥ 20**

**తె.అ.** ప్రకృతి, కార్యమైన దేహాన్ని దానికి సంబంధించిన ఇంద్రియాలను పుట్టించడంలో హేతువు, అని చెప్పబడింది. సుఖము దుఃఖము అనుభవించేవాడు పురుషుడు.

**భాష్యమ్ : 20.1 కార్య ఇతి – కార్యం శరీరమ్. కరణాని తత్స్థాని త్రయోదశ. దేహస్యారమ్భకాణి భూతాని, పంచ విషయాశ్చ ప్రకృతిసంభవాః వికారాః పూర్వోక్తాః ఇహ కార్యగ్రహణేన గృహ్యన్తే. గుణాశ్చ ప్రకృతిసంభవాః సుఖదుఃఖమోహాత్మకాః కరణాశ్రయత్వాత్ కరణగ్రహణేన గృహ్యన్తే. తేషాం కార్యకరణానాం కర్తృత్వమ్ ఉత్పాదకత్వం యత్ తత్ కార్యకరణకర్తృత్వమ్, తస్మిన్ కార్యకరణకర్తృత్వే హేతుః కారణమ్, ఆరమ్భకత్వేన ప్రకృతిః ఉచ్యతే. ఏవం కార్యకరణకర్తృత్వేన**

**సంసారస్య కారణం ప్రకృతిః. "కార్యకారణకర్తృత్వే" ఇత్యస్మిన్ అపి పాఠే కార్యం - యదస్య విపరిణామః తత్ తస్య కార్యమ్. వికారః వికారి, కారణమ్. తయోః వికారవికారిణోః కార్యకారణయోః కర్తృత్వే ఇతి. తాని ఏవ కార్యకారణాని ఉచ్యన్తే. అథవా షోడశ వికారాః కార్యమ్. సప్త ప్రకృతి వికృతయః కారణమ్. తేషాం కర్తృత్వే హేతుః ప్రకృతిః ఉచ్యతే ఆరమ్భకత్వేనైవ. పురుషశ్చ సంసారస్య కారణం యథా స్యాత్ తత్ ఉచ్యతే - పురుషః జీవః క్షేత్రజ్ఞః భోక్తా ఇతి పర్యాయః. సః సుఖదుఃఖానాం భోగ్యానాం, భోక్తృత్వే ఉపలబ్ధృత్వే హేతుః ఉచ్యతే.**

**కథం పునః అనేన కార్యకరణకర్తృత్వేన సుఖదుఃఖభోక్తృత్వేన చ ప్రకృతిపురుషయోః సంసార-కారణత్వమ్ ఉచ్యతే ఇతి? అత్రోచ్యతే - కార్యకరణసుఖదుఃఖరూపేణ హేతుఫలాత్మనా ప్రకృతేః పరిణామాభావే పురుషస్య చ చేతనస్య అసతి తదుపలబ్ధృత్వే కుతః సంసారః స్యాత్? యదా పునః కార్యకరణ సుఖదుఃఖరూపేణ హేతుఫలాత్మనా పరిణతయా ప్రకృత్యా భోగ్యయా పురుషస్య తద్విపరీతస్య భోక్తృత్వేన అవిద్యారూపః సంయోగః స్యాత్ తదా సంసారః స్యాత్ ఇతి. అతః యత్ ప్రకృతిపురుషయోః కార్యకరణకర్తృత్వేన సుఖదుఃఖభోక్తృత్వేన చ సంసారకారణత్వమ్ ఉక్తం. తత్ యుక్తమ్ ఉక్తమ్. కః పునః అయం సంసారః నామ? సుఖదుఃఖసంభోగః సంసారః. పురుషస్య సుఖదుఃఖానాం సంభోక్తృత్వం సంసారిత్వమ్ ఇతి.**

**తె.అ.** కార్యం శరీరం. కరణాలు అందులోని పదమూడు. ఇక్కడ శరీరమంటే దేహాన్ని ఆరంభించే పంచభూతాలు, శబ్దాది పంచవిషయాలు - ప్రకృతివల్ల సంభవించే వెనుక చెప్పిన పది వికారాలు. ప్రకృతివల్ల కలిగే సుఖదుఃఖమోహ రూపమైన గుణాలు కరణాశ్రయాలు కనుక కరణమని చెప్పబడ్డాయి. ఈ కార్యకరణాలకు కారణం ప్రకృతి, అంటే అవి ప్రకృతితో మొదలువుతున్నాయి. ఈ విధంగా కార్యకరణాలకు కర్త కావడం చేత ప్రకృతి సంసారకారణం అవుతున్నది.

'కార్యకారణకర్తృత్వే' అని పాఠమయితే కూడా అర్థమిదే - ఏది దేనికి విపరిణామమో అది దాని కార్యము, అంటే వికారము. కారణం వికారి. ఈ వికారవికారిరూప కార్యకారణాలకు కర్త ప్రకృతి అని.

లేక, పదహారు వికారాలు కార్యం, ప్రకృతివికృతులు ఏడు కారణం - ఇవే కార్యకారణాలు. వీటికి కర్త, వీటిని ప్రారంభించేది ప్రకృతి.

పురుషుడు కూడా సంసారకారణం ఎట్లా అవుతున్నాడో చెపుతున్నాడు. జీవుడు క్షేత్రజ్ఞుడు భోక్త అనే పర్యాయపదాల చేత చెప్పబడే పురుషుడు సుఖదుఃఖాదిభోగాలను అనుభవించేవాడు. మరి ఈ కార్యకరణకర్తృత్వం వలన సుఖదుఃఖ భోక్తృత్వం వలన ప్రకృతిపురుషులు సంసార

కారణమని ఎట్లా అనగలం? అంటే చెపుతున్నాడు. కార్యకరణ సుఖదుఃఖ రూపమైన హేతువు ఫలము అయిన ప్రకృతి పరిణామాలు లేకపోతే, వాటిని అనుభవించే పురుష చైతన్యములేకపోతే సంసారం ఎలా ఉంటుంది? కార్యకరణరూపమైన హేతుఫలాలుగా పరిణమించిన భోగ్యప్రకృతితో అందుకు విపరీతుడైన పురుషునికి భోక్తృత్వం చేత అవిద్యారూపసంయోగం కలిగినపుడే సంసారం కలుగుతుంది. కనుక ప్రకృతిపురుషుల కార్యకరణకర్తృత్వ సుఖదుఃఖ భోక్తృత్వకారణంగా వారిని సంసారకారణమని చెప్పడం యుక్తమే. మరి ఈ సంసారమనేది ఏమిటి? సుఖదుఃఖాలను అనుభవించడమే. సుఖదుఃఖాలతోటి పురుషుని సంభోగమే సంసారము.

**భాష్యమ్ : 21.0 యత్పురుషస్య సుఖదుఃఖానాం భోక్తృత్వం సంసారిత్వమ్ ఇతి ఉక్తం తస్య తత్ కిం నిమిత్తమితి? ఉచ్యతే –**

**తె.అ.** పురుషునికి సుఖదుఃఖభోక్తృత్వము సంసారిత్వము ఎందుకు కలుగుతున్నాయి?

**మూ. పురుషః ప్రకృతిస్థో హి భుంక్తే ప్రకృతిజాన్ గుణాన్ ।**
**కారణం గుణసంగోఽస్య సదసద్యోనిజన్మసు ॥ 21**

**తె.అ.** ప్రకృతియందు ఉండి పురుషుడు ప్రకృతివల్ల కలిగే గుణాలను, సుఖదుఃఖాదులను అనుభవిస్తున్నాడు. మంచి జన్మలు, చెడు జన్మలు ఎత్తడానికి కారణం ఈ గుణాలతోటి సంగమే.

**భాష్యమ్ : 21.1 పురుషః ఇతి – పురుషః భోక్తా, ప్రకృతిస్థః – ప్రకృతౌ అవిద్యాలక్షణాయాం కార్యకరణరూపేణ పరిణతాయాం స్థితః ప్రకృతిస్థః, ప్రకృతిమ్ ఆత్మత్వేన గతః ఇత్యేతత్. హి యస్మాత్ తస్మాత్ భుంక్తే ఉపలభతే ఇత్యర్థః. ప్రకృతిజాన్ ప్రకృతితః జాతాన్ సుఖదుః ఖమోహాకారాభివ్యక్తాన్ గుణాన్ "సుఖీ– దుఃఖీ, మూఢః పణ్డిత అహమ్" ఇత్యేవమ్. సత్యామపి అవిద్యాయాం సుఖదుఃఖమోహేషు గుణేషు భుజ్యమానేషు యః సంగః ఆత్మభావః, సంసారస్య సః ప్రధానం కారణం అస్య పురుషస్య జన్మనః – "స యథాకామో భవతి తత్క్రతుర్భవతి" (బృ.ఉ.4.4.5) ఇత్యాది శ్రుతేః. తదేతత్ ఆహ – కారణం హేతుః గుణసంగః గుణేషు సంగః, అస్య పురుషస్య భోక్తుః, సదసద్యోనిజన్మసు – సత్ చ అసత్ చ యోనయః సదసద్యోనయః, తాసు సదసద్యోనిషు జన్మాని సదసద్యోనిజన్మాని, తేషు సదసద్యోనిజన్మసు విషయభూతేషు కారణం గుణసంగః. అథవా, సదసద్యోనిజన్మసు అస్య సంసారస్య కారణం గుణసంగః ఇతి సంసారపదమ్ అధ్యాహార్యమ్. సద్యోనయః దేవాదియో–నయః, అసద్యోనయః పశ్వాదియోనయః, సామర్థ్యాత్ సదసద్యోనయః మనుష్యయోనయః అపి అవిరుద్ధాః ద్రష్టవ్యాః. ఏతత్ ఉక్తం భవతి.**

**తె.అ.** పురుషుడు ప్రకృతియందుండు భోక్త. ప్రకృతియొక్క లక్షణం అవిద్య. అది కార్యకరణ రూపంగా పరిణమిస్తుంది. అటువంటి ప్రకృతిని ఆత్మగా భావించి ప్రకృతిజాతమైన గుణాలను, సుఖదుఃఖమోహాకారంగా అభివ్యక్తమయ్యే వాటిని, పురుషుడు అనుభవిస్తున్నాడు. (ప్రకృతిని ఆత్మగా భావించిన పురుషుడు ప్రకృతిగుణాలను తనగుణాలనుకొని) నేను సుఖంగా ఉన్నాను, దుఃఖంలో ఉన్నాను, నేను మూఢుణ్ణి, నేను పండితుణ్ణి అనుకుంటున్నాడు. అవిద్యవలన అనుభవించబడుతున్న సుఖదుఃఖమోహమనే గుణాలయందు సంగము లేక ఆత్మభావము పురుషుని జన్మకు ప్రధానకారణం. 'స యథాకామో భవతి' – అతని కోరికలెట్టివో క్రతువులట్లే (బృ.ఉ.4.4.5) అని శ్రుతి. అదే చెపుతున్నాడు (శ్లోకం రెండవ పాదంలో). భోక్త అయిన పురుషునికి గుణములయందు సంగమే సదసద్యోనులయందు జన్మలకు హేతువు. లేక, మంచి యోనుల యందు చెడ్డ యోనులయందు జన్మలు కలగడం విషయంలో గుణసంగమే కారణం. లేదా ఇతని సంసార పదాన్ని చేర్చుకుని చెప్పుకోవలెను. సద్యోనులు అంటే దేవాదియోనులు. అసద్యోనులు అంటే పశుయోని వంటివి. సదసద్యోనులు అంటే మంచిచెడు రెండు కలిగిన మనుష్యయోనులనికూడా సందర్భాన్ని బట్టి అర్థం చెప్పడంలో విరోధంలేదు.

**భాష్యమ్ : 21.2 ప్రకృతిస్థత్వాఖ్యా అవిద్యా, గుణేషు చ సంగః కామః సంసారస్య కారణమ్ ఇతి. తచ్చ పరివర్జనాయ ఉచ్యతే. అస్య చ నివృత్తి కారణం జ్ఞానవైరాగ్యే ససంన్యాసే గీతాశాస్త్రే ప్రసిద్ధమ్. తచ్చ జ్ఞానం పురస్తాత్ ఉపన్యస్తం క్షేత్రక్షేత్రజ్ఞవిషయమ్. "యద్ జ్ఞాత్వాఽమృతమశ్నుతే" (13.12) ఇతి. ఉక్తం చ అన్యాపోహేన అతద్ధర్మాధ్యారోపేణ చ (13.13).**

**తె.అ.** అంటే, ప్రకృతియందుండడమనే అవిద్య, గుణములయందు సంగము, కామము సంసారకారణమని. దానిని పరివర్జించవలెనని చెపుతున్నాడు. జ్ఞానవైరాగ్యాలతోటి సంన్యాసమే దీనికి నివృత్తికారణమని గీతాశాస్త్రంలో ప్రసిద్ధం. అన్యాపోహ అధ్యారోపాలద్వారా (దానివి కాని ధర్మాలను ఆరోపించడం చేత) ఇది చెప్పబడింది. (13.13) క్షేత్రక్షేత్రజ్ఞులగురించిన ఆ జ్ఞానం వెనుకనే చెప్పబడింది. అన్యధర్మాలను తొలగించి (న సత్తన్నాసదుచ్యతే), అనాత్మధర్మాలను అధ్యారోహించి (సర్వతః పాణిపాదం) ఆ జ్ఞేయం (యత్జ్ఞాత్వాఽ – మృతమశ్నుతే) చెప్పబడింది.

**భాష్యమ్ : 22.0 తస్యైవ పునః సాక్షాత్ నిర్దేశః క్రియతే –**

**తె.అ.** మళ్ళీ పురుషుణ్ణే సాక్షాత్తు నిర్దేశిస్తున్నాడు –

**మూ. ఉపద్రష్టాఽనుమన్తా చ భర్తా భోక్తా మహేశ్వరః ।**
**పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః ॥ 22**

**తె.అ.** ఈ దేహంలో ఉండే పురుషుణ్ణి సాక్షిగా ఉంటూ చూచేవాడనీ, అనుమతించేవాడనీ, భర్త, భోక్త, మహేశ్వరుడు, పరమాత్మ అనికూడా అంటారు.

**భాష్యమ్ : 22.1 ఉపద్రష్టా – సమీపస్థః సన్ ద్రష్టా స్వయమ్ అవ్యాపృతః, యథా ఋత్విగ్యజ – మానేషు యజ్ఞకర్మవ్యాపృతేషు తటస్థః అన్యః అవ్యాపృతః యజ్ఞవిద్యాకుశలః ఋత్విగ్యజమానవ్యాపార – గుణదోషాణామ్ ఈక్షితా, తద్వత్ కార్యకరణవ్యాపారేషు అవ్యాపృతః అన్యః విలక్షణః తేషాం కార్యకరణానాం సవ్యాపారాణాం సామీప్యేన ద్రష్టా ఉపద్రష్టా. అథవా దేహచక్షుర్మనోబుద్ధ్యాత్మానః ద్రష్టారః. తేషాం బాహ్యః ద్రష్టా దేహః. తతః ఆరభ్య అన్తరతమః చ ప్రత్యక్ సమీపః ఆత్మా ద్రష్టా, యతః పరః అన్తరః నాస్తి సః అతిశయసామీప్యేన ద్రష్టత్వాత్ ఉపద్రష్టా. యజ్ఞోపద్రష్టృవద్వా సర్వవిషయీకరణాత్ ఉపద్రష్టా. అనుమన్తా చ – అనుమోదనమ్ అనుమననమ్. కుర్వత్సు తత్క్రియాసు పరితోషః. తత్కర్తా అనుమన్తా చ. అథవా, అనుమన్తా – కార్యకరణప్రవృత్తిషు స్వయమ్ అప్రవృత్తః అపి ప్రవృత్తః ఇవ తదనుకూలః విభావ్యతే, తేన అనుమన్తా. అథవా ప్రవృత్తాన్ స్వవ్యాపారేషు తత్సాక్షిభూతః కదాచిదపి న నివారయతి ఇతి అనుమన్తా. భర్తా – భరణం నామ దేహేన్ద్రియ మనోబుద్ధీనాం సంహతానాం చైతన్యాత్మపారార్థ్యేన నిమిత్తభూతేన చైతన్యాభాసానాం యత్ స్వరూపధారణం తత్ చైతన్యాత్మకృతమేవేతి భర్తా ఆత్మా ఉచ్యతే. భోక్తా – అగ్న్యుష్ణవత్ నిత్యచైతన్య స్వరూపేణ బుద్ధేః సుఖదుఃఖమోహాత్మకాః ప్రత్యయాః సర్వ విషయ విషయాః చైతన్యాత్మగ్రస్తాః ఇవ జాయమానాః విభక్తాః విభావ్యన్తే ఇతి భోక్తా ఆత్మా ఉచ్యతే. మహేశ్వరః – సర్వాత్మత్వాత్ స్వతన్త్రత్వాచ్చ మహాన్ చ అసౌ ఈశ్వరశ్చ ఇతి మహేశ్వరః. పరమాత్మా దేహాదీనాం బుద్ధ్యన్తానాం, ప్రత్యగాత్మత్వేన పరికల్పితానామ్ అవిద్యయా పరమః ఉపద్రష్టృత్వాదిలక్షణః ఆత్మా ఇతి పరమాత్మా. సః అన్తః (తః) 'పరమాత్మా' ఇత్యనేన శబ్దేన చాపి ఉక్తః కథితః శ్రుతౌ. క్వ అసౌ? అస్మిన్ దేహే పరః అవ్యక్తాత్, "ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః" (15.17) ఇతి యో వక్ష్యమాణః "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" (13.2) ఇతి ఉపన్యస్తః వ్యాఖ్యాయ ఉపసంహృతశ్చ.**

**తె.అ.** సమీపమందుండి స్వయంగా ఏమీ చేయకుండా చూస్తూ ఉన్నవాడు కనుక ఉపద్రష్ట. ఎట్లాగంటే, ఋత్విక్కు యజమాని యజ్ఞకర్మవ్యాపారం నిర్వహిస్తూ ఉండగా యజ్ఞవిద్యాకుశలుడు వేరొకడు తటస్థంగా ఉండి యజమానుడు చేస్తున్న పనులలో గుణదోషాలను చూస్తూ ఉన్నట్లు. అట్లాగే, కార్యకరణవ్యాపారాలయందు జోక్యం చేసుకోకుండా ఉండేవాడు వాటికి విలక్షణంగా వేరుగా ఉంటూ ఆ వ్యాపారం నిర్వహిస్తూ ఉన్న కార్యకరణాలను చూస్తూ ఉండేవాడు ఉపద్రష్ట. లేక, దేహము చక్షువు మనసు బుద్ధి ఆత్మ – ఇవి ద్రష్టలు. వీటిలో దేహం బాహ్యద్రష్ట. దానితో

ఆరంభించి అన్నిటికంటె లోపలి ద్రష్ట ఆత్మ. ఆత్మకంటె అంతరతమము సమీపము అయిన ద్రష్ట మరొకటి లేదు. అత్యంతసామీప్యంతో చూస్తూ ఉండేవాడు కనుక ఉపద్రష్ట, లేక, యజ్ఞాన్ని చూస్తూ ఉండేవానివలె అన్ని విషయాలను చూస్తూ ఉండేవాడు కనుక ఉపద్రష్ట, చేయబడుతున్న పనులయందు పరితోషమే అనుమననం లేక అనుమోదనం. అదిచేయువాడు అనుమన్త. లేక, కార్యకారణప్రవృత్తుల యందు స్వయంగా అతడు ప్రవర్తించకపోయినప్పటికి ప్రవర్తించినట్లు కనిపిస్తూ ఉంటాడు కనుక అనుమన్త. లేక, ఎవరిపనిలో వారు ప్రవర్తిస్తూ ఉన్నపుడు సాక్షిగా మాత్రమే ఉంటాడు, కాని ఎన్నడూ వారించడు కనుక అనుమన్త. చైతన్యస్వరూపమైన ఆత్మయొక్క సేవకొరకు నిర్మింపబడిన దేహేంద్రియ మనోబుద్ధులు తమ స్వరూపాన్ని ధరించి ఉండడం భరణం. అది చేయువాడు కనుక ఆత్మను భర్త అంటారు. సమస్త విషయాలలో బుద్ధికి వేరువేరుగా కలిగే సుఖదుఃఖమోహాత్మకమైన అనుభవాలు నిత్యచైతన్యకారణంగానే కలుగుతున్నవి. అగ్నితో వేడి ఉన్నట్లు ఆ అనుభవాలు కలుగుతూనే చైతన్యగ్రస్తమైనట్లుగా కనిపిస్తాయి. కనుక ఆత్మను భోక్త అంటారు. అన్నిటి ఆత్మ అవడంచేత స్వతంత్రుడు కావడం చేత మహేశ్వరుడు. అవిద్యవలన ఆత్మ అనుకొనబడే దేహము బుద్ధి మొదలైన వాటికంటె పరమైనది అంటే శ్రేష్ఠమైనది. వాటిని చూస్తూ ఉండేది కనుక ఆత్మను పరమాత్మ అంటారు. 'లోపలనున్న పరమాత్మ' అని శ్రుతి కూడా ఇతనిని వర్ణించింది. ఈ ఆత్మ ఎక్కడ? ఈ దేహంలో, 'ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః' (15.17) అని ముందు చెప్పబోతున్న ఈ పురుషుడు అవ్యక్తానికి అవతలివాడు. 'క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి' (13.2) అని వెనుకచెప్పి వ్యాఖ్యానించిన విషయం ఇక్కడ ఉపసంహరించబడింది.

**భాష్యమ్ : 23.0 తమేతం యథోక్తలక్షణమ్ ఆత్మానమ్ –**

**తె.అ.** ఈ విధమైన లక్షణాలు గలిగినట్లు చెప్పిన ఆత్మను –

**మూ. య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైః సహ ।**
**సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే ॥ 23**

**తె.అ.** ఈ విధంగా పురుషుని, గుణాలతో సహా ప్రకృతిని, తెలిసినవాడు ఏ విధంగా ప్రవర్తించినా మళ్ళీ పుట్టడు.

**భాష్యమ్ : 23.1 య ఏవం ఇతి. యః ఏవం యథోక్తప్రకారేణ వేత్తి పురుషం సాక్షాత్ ఆత్మభావేన 'అయం అహం అస్మి' ఇతి, ప్రకృతిం చ యథోక్తామ్ అవిద్యాలక్షణాం గుణైః స్వవికారైః సహ, నివర్తితామ్ అభావమ్ ఆపాదితాం విద్యయా, సర్వథా సర్వప్రకారేణ వర్తమానః**

**అపి సః భూయః పునః పతితే అస్మిన్ విద్వచ్ఛరీరే, దేహాన్తరాయ న అభిజాయతే, న ఉత్పద్యతే. దేహాన్తరం న గృహ్ణాతి ఇత్యర్థః. అపి శబ్దాత్ కిము వక్తవ్యం స్వవృత్తస్థః న జాయతే ఇతి అభిప్రాయః.**

**తె.అ.** ఇప్పుడు చెప్పిన విధంగా పురుషుని సాక్షాత్తు ఆత్మభావంతో 'ఇదినేను' అని తెలిసినవాడు; అవిద్యా లక్షణమైన ప్రకృతిని దాని వికారాలతో సహా విద్యచేత తొలగించినవాడు, ఏ విధంగా ప్రవర్తించినప్పటికి మళ్ళీ పుట్టడు. జ్ఞాని శరీరం రాలిపోయిన తరువాత మరొక శరీరంలో పుట్టడు. మరొక దేహం ధరించడు. 'ఏవిధంగా ప్రవర్తించినప్పటికి' అనడం చేత స్వధర్మంలో ప్రవర్తించేవాడు పుట్టడని వేరుగా చెప్పవలెనా? అని అభిప్రాయం.

**భాష్యమ్ : 23.2 నను యద్యపి జ్ఞానోత్పత్త్యనన్తరం పునర్జన్మాభావః ఉక్తః, తథాఽపి ప్రాగ్ జ్ఞానోత్పత్తేః కృతానాం కర్మణామ్, ఉత్తర కాలభావినాం చ యాని చ అతిక్రాన్తానేక జన్మకృతాని తేషాం చ, ఫలమ్ అదత్త్వా నాశో న యుక్తః ఇతి, స్యుః త్రీణి జన్మాని, కృతవిప్రణాశో హి న యుక్తః ఇతి, యథా ఫలే ప్రవృత్తానామ్ ఆరబ్ధజన్మనాం కర్మణామ్ న చ కర్మణాం విశేషః అవగమ్యతే. తస్మాత్ త్రిప్రకారాణ్యపి కర్మాణి త్రీణి జన్మాని ఆరభేరన్; సంహతాని వా సర్వాణి ఏకం జన్మ ఆరభేరన్. అన్యథా కృతవిప్రణాశే సతి సర్వత్ర అనాశ్వాసప్రసంగః, శాస్త్రార్థానర్థక్యం చ స్యాత్. ఇత్యతః ఇదమ్ అయుక్తం ఉక్తం "న స భూయోఽభిజాయతే" ఇతి.**

**న; "క్షీయన్తే చాస్య కర్మాణి" (ము.ఉ.2.2.8), "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" (ము.3.2.9), "తస్య తావదేవ చిరమ్" (ఛాం.ఉ.6.14.2), "ఇషీకాతూలవత్ సర్వాణి కర్మాణి ప్రదూయన్తే" (ఛాం.ఉ.5.24.3. అర్థతోనువాదం) ఇత్యాది శ్రుతిశతేభ్యః ఉక్తః విదుషః సర్వకర్మదాహః. ఇహాపి చ ఉక్తః "యథైధాంసి" (4.37) ఇత్యాదినా సర్వకర్మదాహః, వక్ష్యతి చ (18.66) ఉపపత్తేశ్చ – అవిద్యాకామక్లేశబీజనిమిత్తాని హి కర్మాణి జన్మాన్తరాంకురమ్ ఆరభన్తే. ఇహాపి చ 'సాహంకారాభి – సంధీని కర్మాణి ఫలారమ్భకాణి, న ఇతరాణి' ఇతి తత్ర తత్ర భగవతా ఉక్తమ్.**

**బీజాన్యగ్న్యుపదగ్ధాని న రోహన్తి యథా పునః**

**జ్ఞానదగ్ధైస్తథా క్లేశైర్నాత్మా సంపద్యతే పునః (వన.ప. 200.100) ఇతి చ.**

ఆక్షేపణ – జ్ఞానం కలిగిన తరువాత మళ్ళీ జన్మ ఉండదు అని అంటున్నారు. కాని, జ్ఞానం కలగడానికి పూర్వం చేసిన కర్మలు, కలిగిన తరువాత చేసిన కర్మలు, గడచిన అనేక జన్మలలో చేసిన కర్మలు ఫలం ఇవ్వకుండా నశించవు. చేసిన కర్మ నశించదు కనుక మూడుజన్మలు ఉండాలి. ఫలమివ్వడం ప్రారంభించిన కర్మలవల్లనే ఈ జన్మ ఆరంభమయింది. కొన్ని కర్మలు

ఒక విధము మరికొన్ని మరొక విధము కావు. కనుక మూడువిధాలైన కర్మలచేత మూడు జన్మలు రావాలి. లేక, మూడును కలిపి ఒక జన్మలో రావాలి. అట్లా కాక, చేసినకర్మ ఊరకేపోతుంది అంటే శాస్త్రంలో శ్రద్ధ ఎవరికీ ఉండదు, శాస్త్రం నిరర్థకమవుతుంది కూడా. కనుక 'అతడు మళ్ళీ పుట్టడు' అనడం సరికాదు.

సమాధానం – కాదు, జ్ఞానియొక్క సర్వకర్మలు దహింపబడుతాయి అని వందలశ్రుతులు ఘోషిస్తున్నాయి. 'అతని కర్మలు క్షయమవుతాయి' (ముం.ఉ.2.2.8) బ్రహ్మమును 'తెలిసినవాడు బ్రహ్మమే అవుతాడు' (ముం.3.2.9) 'అతడంతవరకే వేచి ఉంటాడు' (ఛాం.ఉ.6.14.2) 'గడ్డిపరక కొనవలె సర్వకర్మలు భస్మమవుతాయి' (ఛాం.ఉ.5.24.3). ఇక్కడకూడా 'యథైధాంసి' (4.37) వంటి శ్లోకాలలో సర్వకర్మదాహం చెప్పబడింది, చెప్పబడుతుంది కూడా (18.66) ఉపపత్తిచేత కూడా మనం గ్రహించవచ్చు. అవిద్యవల్ల కలిగే కామక్లేశబీజాలవల్లనే మరొకజన్మ అంకురిస్తుంది. భగవద్గీతలోకూడా భగవానుడు అనేక సందర్భాలలో ఇదే చెప్పాడు. అహంకారంతో ఫలాపేక్షతో చేసే కర్మలు ఫలాన్ని ఆరంభిస్తాయి, తక్కినవి ఆరంభించవు అని. 'నిప్పులో కాలిన విత్తనాలు మొలకెత్తనట్లు, జ్ఞానంలో దగ్ధమైన క్లేశాలను ఆత్మపొందదు' (వనపర్వం 200.100).

**భాష్యమ్ : 23.3. అస్తు తావత్ జ్ఞానోత్పత్త్యుత్తరకాలకృతానాం కర్మణాం జ్ఞానేన దాహః, జ్ఞానసహభావిత్వాత్. న తు ఇహ జన్మని జ్ఞానోత్పత్తేః ప్రాక్ కృతానామ్ కర్మణాం అతీతానేకజన్మాన్తర కృతానాం చ దాహః యుక్తః. న; "సర్వకర్మాణి" (4.37) ఇతి విశేషణాత్. జ్ఞానోత్తరకాలభావినామేవ సర్వకర్మణామ్ ఇతి చేత్ – న; సంకోచే కారణానుపపత్తేః. యత్తు ఉక్తం 'యథా వర్తమానజన్మారమ్భకాణి కర్మాణి న క్షీయన్తే ఫలదానాయ ప్రవృత్తాన్యేవ సత్యపి జ్ఞానే, తథా అనారబ్ధఫలానామపి కర్మణాం క్షయః న యుక్తః' ఇతి తదసత్. కథమ్? తేషాం ముక్తేషువత్ ప్రవృత్తఫలత్వాత్. యథా పూర్వం లక్ష్యవేధాయ ముక్తః ఇషుః ధనుషః లక్ష్యవేధోత్తరకాలమపి ఆరబ్ధవేగక్షయాత్ పతనేనైవ నివర్తతే, ఏవం శరీరారమ్భకం కర్మ శరీరస్థితిప్రయోజనే నివృత్తేఽపి ఆ సంస్కారవేగక్షయాత్ పూర్వవత్ ప్రవర్తతే ఏవ. స ఏవ ఇషుః ప్రవృత్తినిమిత్తానారబ్ధవేగః తు అముక్తః ధనుషి ప్రయుక్తః అపి ఉపసంహ్రియతే, తథా అనారబ్ధఫలాని కర్మాణి స్వాశ్రయస్థాన్యేవ తత్త్వజ్ఞానేన నిర్బీజీక్రియన్తే ఇతి, పతితే అస్మిన్ విద్వచ్ఛరీరే "న స భూయోఽభిజాయతే" ఇతి, యుక్తమేవ ఉక్తమ్ ఇతి సిద్ధమ్.**

ఆక్షేపణ – జ్ఞానం కలిగిన తరువాత చేసిన కర్మలు జ్ఞానంచేత దగ్ధమవుతాయని ఒప్పుకుందాం. జ్ఞానంతో కూడిన కర్మలు కనుక. కాని జ్ఞానం కలగక పూర్వం చేసిన కర్మలు దగ్ధమవుతాయి అనడం సరికాదు.

సమాధానం – కాదు. 'సర్వ కర్మాణి' అంటున్నాడు కనుక.

ఆక్షేపణ – 'అన్ని కర్మలు' అంటే జ్ఞానం కలిగిన తరువాత చేసిన కర్మలన్నీ అని అర్థం కావచ్చు కదా?

సమాధానం – కాదు. ఆ విధంగా అర్థాన్ని సంకోచించవలసిన కారణం లేదు కనుక.

ఫలమివ్వసాగి, వర్తమాన జన్మ ఆరంభానికి కారణమైన కర్మలు జ్ఞానం కలిగినా కూడా క్షయం కానట్లే, ఫలం ఆరంభించని కర్మలు కూడా క్షయం కాకూడదు అని వాదించడం తప్పు. ఎట్లా? మొదటివి వదలిన బాణాల వంటివి. అవి ఫలమివ్వసాగాయి. లక్ష్యంపై వదలిన బాణం ధనుస్సును విడిచిన తరువాత లక్ష్యాన్ని కొట్టిన తరువాతకూడా ఆరబ్ధవేగం క్షయమై అది పడేవరకు దూసుకుపోతూనే ఉంటుంది. అట్లాగే శరీరాన్ని ఆరంభించిన కర్మ శరీరాన్ని నిలుపవలసిన అవసరం లేకపోయినా సంస్కారవేగం క్షయమయేవరకు పూర్వంవలెనే ప్రవర్తిస్తూ ఉంటుంది. ధనుస్సుపై ఎక్కుపెట్టినదైనా ఇంకా వదలని బాణాన్ని, వేగం ఆరంభం కాలేదు కనుక, ఉపసంహరించవచ్చు. అట్లాగే ఫలమాశించని కర్మలను, అవి స్వాశ్రయంలో ఉన్నవైనా తత్త్వజ్ఞానం చేత నిర్బీజం చేయవచ్చు. కనుక జ్ఞానికి శరీరపాతమైన తరువాత 'అతడు మళ్ళీ పుట్టడు' అనడం యుక్తమే.

**భాష్యమ్ : 24.0 అత్ర ఆత్మదర్శనే ఉపాయవికల్పాః ఇమే ధ్యానాదయః ఉచ్యన్తే –**

**తె.అ.** ఆత్మదర్శనానికి ధ్యానము మొదలైన అనేక ఉపాయ వికల్పాలను చెపుతున్నాడు–

**మూ. ధ్యానేనాత్మని పశ్యన్తి కేచిదాత్మానమాత్మనా ।**
**అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే ॥ 24**

**తె.అ.** కొందరు ఆత్మయందు (ఆత్మచేత) ఆత్మచేత (బుద్ధి) ధ్యానించి ఆత్మదర్శనం చేసుకుంటారు. కొందరు సాంఖ్యయోగంచేత మరికొందరు కర్మయోగంచేత.

**భాష్యమ్ : 24.1 ధ్యానేన ఇతి – ధ్యానేన – ధ్యానం నామ శబ్దాదిభ్యో విషయేభ్య శ్రోత్రాదీని కరణాని మనసి ఉపసంహృత్య, మనశ్చ ప్రత్యక్చేతయితరి, ఏకాగ్రతయా యచ్చిన్తనం, తత్ ధ్యానమ్. తథా – ధ్యాయతీవ బకః, "ధ్యాయతీవ పృథివీ ... ధ్యాయన్తీవ పర్వతాః" (ఛాం.ఉ.7.6.1) ఇతి ఉపమోపాదానాత్ తైలధారావత్ సంతతః అవిచ్ఛిన్నప్రత్యయః ధ్యానమ్. తేన ధ్యానేన, ఆత్మని బుద్ధౌ, పశ్యన్తి ఆత్మానం ప్రత్యక్చేతనమ్, ఆత్మనా స్వేనైవ ప్రత్యక్చేతనేన ధ్యానసంస్కృతేన అన్తఃకరణేన, కేచిత్ యోగినః. అన్యే సాంఖ్యేన యోగేన. సాంఖ్యం నామ – "ఇమే సత్త్వరజస్తమాంసి గుణాః మయా దృశ్యాః, అహం తేభ్యః అన్యః, తద్వ్యాపారసాక్షిభూతః**

**నిత్యః గుణవిలక్షణః ఆత్మా" ఇతి చిన్తనం; సాంఖ్యః యోగః, తేన 'పశ్యన్తి ఆత్మానమ్ ఆత్మనా' ఇతి వర్తతే. కర్మయోగేన – కర్మైవ యోగః. ఈశ్వరార్పణబుద్ధ్యా అనుష్ఠీయమానం ఘటనరూపం యోగార్థత్వాత్ యోగ ఉచ్యతే గుణతః. తేన సత్త్వశుద్ధిజ్ఞానోత్పత్తిద్వారేణ చ అపరే.**

**తె.అ.** శ్రోత్రాదీంద్రియాలను శబ్దాది విషయాలవైపు వెళ్ళకుండా మనస్సునందు ఉపసంహరించుకొని, మనస్సును ప్రత్యగాత్మ యందు నిలపడమే ధ్యానం. కొంగ ధ్యానం చేస్తున్నట్లుంటుంది, పర్వతాలు ధ్యానం చేస్తున్నట్లున్నాయి మొదలైన ఉపమానాలవల్ల ధ్యానమంటే తైలధారవలె అవిచ్ఛిన్నమైన చింతన అని తెలుస్తుంది. అటువంటి ధ్యానంతో ఆత్మయందు అంటే బుద్ధియందు ఆత్మను అంటే ఆత్మచైతన్యాన్ని ఆత్మచేత అంటే ధ్యానంచేత సంస్కరించబడిన అంతఃకరణంచేత కొందరు యోగులు చూస్తారు. కొందరు సాంఖ్యయోగంచేత. సాంఖ్యమంటే 'నాచేత చూడబడుతున్న ఇవన్నీ సత్త్వరజస్తమోగుణాలు, నేను వీటికంటె అన్యుడను, వాటి వ్యాపారాలకు సాక్షీభూతుడను నిత్యుడను త్రిగుణవిలక్షణమైన ఆత్మను', అనే చింతన. ఇటువంటి చింతనే ఒక యోగం. ఆ యోగంతో ఆత్మచేత ఆత్మను దర్శిస్తారు అని చెప్పుకోవలెను. కర్మయోగంతో – కర్మమే యోగం. ఈశ్వరార్పణబుద్ధితో అనుష్ఠించబడే కర్మ, యోగానికి సహకరిస్తుంది కనుక అది గౌణంగా చెప్పబడుతుంది. ఆ యోగం సత్త్వశుద్ధిచేసి జ్ఞానోత్పత్తి కలిగిస్తుంది. అటువంటి యోగం ద్వారా మరికొందరు ఆత్మదర్శనం చేసుకుంటారు.

**మూ. అన్యే త్వేవమజానన్తః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే ।**
**తేఽపి చాతితరన్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః ॥ 25**

**తె.అ.** ఈ విధంగా తెలుసుకోలేనివారు కొందరు ఇతరులు బోధింపగా విని ఉపాసిస్తారు. ఈ విధంగా విన్నదానియందు శ్రద్ధకలిగినవారు కూడా మృత్యువును దాటతారు.

**భాష్యమ్ : 25.1 అన్యేతు ఇతి – అన్యే తు ఏతేషు వికల్పేషు అన్యతమేనాపి ఏవం యథోక్తమ్ ఆత్మానమ్ అజానన్తః, అన్యేభ్యః ఆచార్యేభ్యః శ్రుత్వా "ఇదమేవ చిన్తయత" ఇతి ఉక్తాః ఉపాసతే శ్రద్ధధానాః సన్తః చిన్తయన్తి. తేఽపి చ అతితరన్త్యేవ అతిక్రామన్త్యేవ, మృత్యుం – మృత్యుయుక్తం సంసారమ్ ఇత్యేతత్. శ్రుతిపరాయణాః – శ్రుతిః శ్రవణం పరమ్ అయనం గమనం మోక్షమార్గప్రవృత్తౌ పరం సాధనం యేషాం తే శ్రుతిపరాయణాః, కేవలం పరోపదేశ ప్రమాణాః, స్వయం వివేకరహితాః ఇత్యభి ప్రాయః. కిమువక్తవ్యం ప్రమాణం ప్రతి స్వతన్త్రాః వివేకినః మృత్యుమ్ అతిక్రామన్తి ఇత్యభిప్రాయః.**

**తె.అ.** ఈ అన్ని మార్గాలలో ఏ ఒక్కమార్గంచేతను ఈ విధంగా వర్ణించబడిన ఆత్మను తెలుసుకోలేనివారు ఆచార్యులనుండి విని 'దీనిని ఈ విధంగా చింతన చేయదగును' అని వారు

చెప్పగా శ్రద్ధగలవారై ఉపాసిస్తారు. వారుకూడా మృత్యువును అంటే మృత్యుయుక్తమైన సంసారమును తరిస్తారు. మోక్షమార్గగమనంలో వారికి పరమసాధనం శ్రుతి. స్వయంగా వివేకం లేనివారు, కేవలము పరోపదేశమే ప్రమాణంగా గ్రహించేవారు అని అభిప్రాయం. అటువంటివారే మృత్యువును తరిస్తారు. అంటే స్వతంత్రప్రమాణం గల వివేకులు తరిస్తారని ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు.

**భాష్యమ్ : 26.0 'క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి' (13.2) ఇతి క్షేత్రజ్ఞేశ్వరైకత్వవిషయం జ్ఞానం మోక్షసాధనం "యద్ జ్ఞాత్వాఽమృతమశ్నుతే" (13.12) ఇత్యుక్తమ్. తత్ కస్మాత్ హేతోః ఇతి తద్ధేతుప్రదర్శనాయ శ్లోకః ఆరభ్యతే. యస్మాత్ –**

**తె.అ.** 'క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి' (13.2) అన్న శ్లోకంలో క్షేత్రజ్ఞ ఈశ్వర ఏకత్వవిషయమైన జ్ఞానము మోక్షసాధనమని చెప్పబడింది. 'యత్జ్ఞాత్వామృతమశ్నుతే' (13.12) అని అటువంటి జ్ఞానాన్ని గురించి చెప్పడానికి హేతువేమిటి? అది చెప్పడానికి ఈ శ్లోకం ఆరంభించబడుతున్నది–

**మూ. యావత్సంజాయతే కించిత్ సత్త్వం స్థావరజఙ్గమమ్ ।**
**క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్తద్విద్ధి భరతర్షభ ॥ 26**

**తె.అ.** అర్జునా! పుట్టిన ప్రతిదీ స్థావరంగాని జంగమంగాని క్షేత్రక్షేత్రజ్ఞుల సంయోగం వల్లనే అని తెలుసుకో.

**భాష్యమ్ : 26.1 యావదితి – యావత్ యత్, కించిత్, సంజాయతే సముత్పద్యతే, సత్త్వం వస్తు, కిమ్ అవిశేషేణ? న ఇత్యాహ – స్థావరజంగమమ్ స్థావరం జఙ్గమం చ, క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్ తత్ జాయతే ఇత్యేవం, విద్ధి జానీహి, హే భరతర్షభ. కః పునః అయం క్షేత్రక్షేత్రజ్ఞయోః సంయోగః అభిప్రేతః? న తావత్ రజ్జ్వా ఇవ ఘటస్య అవయవసంశ్లేషద్వారకః సంబంధవిశేషః సంయోగః క్షేత్రేణ క్షేత్రజ్ఞస్య సంభవతి, ఆకాశవత్ నిరవయవత్వాత్. నాపి సమవాయలక్షణః తన్తుపటయోరివ క్షేత్రక్షేత్రజ్ఞయోః ఇతరేతర కార్యకారణభావానభ్యుపగమాత్ ఇతి.**

**ఉచ్యతే – క్షేత్రక్షేత్రజ్ఞయోః విషయవిషయిణోః భిన్నస్వభావయోః ఇతరేతరతద్ధర్మాధ్యాసలక్షణః సంయోగః క్షేత్రక్షేత్రజ్ఞస్వరూపవివేకాభావనిబంధనః, రజ్జుశుక్తికాదీనాం తద్వివేకజ్ఞానాభావాత్ అధ్యారోపితసర్పరజతాది సంయోగవత్. సః అయం అధ్యాసస్వరూపః క్షేత్రక్షేత్రజ్ఞయోః సంయోగః మిథ్యాజ్ఞానలక్షణః. యథాశాస్త్రం క్షేత్రక్షేత్రజ్ఞ లక్షణభేద పరిజ్ఞానపూర్వకం ప్రాక్ దర్శితరూపాత్ క్షేత్రాత్, ముంజాదివ ఇషీకాం, యథోక్తలక్షణం క్షేత్రజ్ఞం ప్రవిభజ్య 'న సత్తన్నాసదుచ్యతే (13.12)**

**ఇత్యనేన నిరస్తసర్వోపాధివిశేషం జ్ఞేయం బ్రహ్మస్వరూపేణ యః పశ్యతి, క్షేత్రం చ మాయానిర్మితహస్తి (హర్మ్యాదివత్) స్వప్నదృష్టవస్తు (వత్) గంధర్వనగరాదివత్ 'అసదేవ సదివ అవభాసతే' ఇతి ఏవం నిశ్చితవిజ్ఞానః యః, తస్య యథోక్తసమ్యగ్దర్శనవిరోధాత్ అపగచ్ఛతి మిథ్యాజ్ఞానమ్. తస్య జన్మహేతోః అపగమాత్ 'య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైః సహ' (13.23) ఇత్యనేన 'విద్వాన్ భూయః న అభిజాయతే' ఇతి యత్ ఉక్తం తత్ ఉపపన్నం ఉక్తమ్.**

**తె.అ.** స్థావరంగాని జంగమంగాని పుట్టిన ప్రతి వస్తువు క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగంవల్లనే పుడుతున్నది అని తెలుసుకో.

ప్రశ్న – ఈ క్షేత్రక్షేత్రజ్ఞసంయోగమంటే ఏమిటి? తాడువలె కుండవలె వేరు వేరు వస్తువుల కలయిక (అవయవ సంశ్లేషం) వంటి సంబంధం క్షేత్రక్షేత్రజ్ఞుల విషయంలో సంభవం కాదు కదా, ఆకాశంవలె క్షేత్రజ్ఞుడు అవయవాలు లేనివాడు కనుక. దారానికి బట్టకు ఉన్న సమవాయసంబంధం కూడా క్షేత్రక్షేత్రజ్ఞులకు సంభవం కాదు. ఎందుకంటె అవి బట్టకు దారం కారణమైనట్లు ఒకదానికొకటి కార్యకారణాలు కావు కనుక.

సమాధానం – విషయము విషయి అయిన క్షేత్రక్షేత్రజ్ఞులు భిన్నస్వభావంకలవి. వీటి సంయోగమంటే ఒకదానిగుణాలు మరొకదానియందు ఆరోపించడం. ఈ అధ్యాసం క్షేత్రక్షేత్రజ్ఞ స్వరూపవివేకం లేకపోవడంవలన కలుగుతుంది. తాడు ముత్యపుచిప్పవంటివాని విషయంలో వాటిని గురించిన వివేకజ్ఞానం లేకపోవడంచేత వాటియందు ఆరోపించబడిన పాము వెండి మొదలైన వాటితో సంయోగంవలె. క్షేత్రక్షేత్రజ్ఞులసంయోగం ఈ అధ్యాసరూపమైనదే. దాని లక్షణం మిథ్యాజ్ఞానం. ఎవడు శాస్త్రం చెప్పినవిధంగా క్షేత్రక్షేత్రజ్ఞుల లక్షణాలలోని భేదం తెలుసుకొని వెనుక వివరించిన క్షేత్రంనుండి, ముంజను గడ్డిపరకను వలె, చెప్పిన లక్షణాలు గలిగిన క్షేత్రజ్ఞుణ్ణి వేరుచేసి ('ప్రవిభజ్య' ఇదే క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగం) 'న సత్తన్నాసదుచ్యతే' (13.12) అన్నట్లు సమస్త ఉపాధులు తొలగిన జ్ఞేయాన్ని బ్రహ్మస్వరూపంగా చూస్తాడో, గారడివాడు నిర్మించిన మేడవంటిది కలలోచూచిన గంధర్వనగరం వంటిది క్షేత్రం, నిజంగా లేదు, అయినా ఉన్నట్లు కనిపిస్తున్నది, అన్న నిశ్చయజ్ఞానం ఎవనికి కలుగుతుందో వానికి మిథ్యాజ్ఞానం, సమ్యగ్దర్శనంతో విరోధకారణంగా, తొలగుతుంది. అతనికి జన్మహేతువు తొలగడంతో 'య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ' (13.23) అని జ్ఞాని మళ్ళీ పుట్టడు అన్నది నిర్ధారణ అవుతున్నది.

**భాష్యమ్ : 27.0 "న స భూయోఽభిజాయతే" (13.23) ఇతి సమ్యగ్దర్శనఫలమ్ అవిద్యాది–సంసారబీజ నివృత్తిద్వారేణ జన్మాభావః ఉక్తః. జన్మకారణం చ అవిద్యానిమిత్తకః**

**క్షేత్రక్షేత్రజ్ఞసంయోగః ఉక్తః. అతః తస్యాః అవిద్యాయాః నివర్తకం సమ్యగ్దర్శనమ్ ఉక్తమ్ అపి పునః శబ్దాన్తరేణ ఉచ్యతే –**

**తె.అ.** 'న స భూయోఽభిజాయతే' (13.23) అని అవిద్యాది సంసారబీజమును నివృత్తి చేయడం ద్వారా జన్మలేకపోవడమనే సమ్యగ్దర్శనఫలం చెప్పబడింది. జన్మకారణమైన అవిద్యవలన కలిగే క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగం కూడా చెప్పబడింది. ఆ అవిద్యను తొలగించే సమ్యగ్దర్శనం గురించి ఇంతకుముందు చెప్పినా ఇక్కడ వేరు మాటలలో మళ్ళీ చెపుతున్నాడు –

**మూ. సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్ ।**
**వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి ॥ 27**

**తె.అ.** అన్ని భూతములయందు సమంగా వసిస్తూ, అవి నశించినా తాను నశించకుండా ఉండు పరమేశ్వరుని చూచినవాడే నిజంగా చూపుకలవాడు.

**భాష్యమ్ : 27.1 సమమితి – సమం నిర్విశేషం, తిష్ఠన్తం స్థితిం కుర్వన్తం, క్వ? సర్వేషు సమస్తేషు భూతేషు బ్రహ్మాదిస్థావరాన్తేషు ప్రాణిషు, కమ్? పరమేశ్వరం, దేహేన్ద్రియ మనోబుద్ధ్యవ్యక్తాత్మనః అపేక్ష్య పరమేశ్వరః తం సర్వేషు భూతేషు సమం తిష్ఠన్తమ్. తాని విశినష్టి 'వినశ్యత్సు' ఇతి, తం చ పరమేశ్వరమ్ 'అవినశ్యన్తమ్' ఇతి, భూతానాం పరమేశ్వరస్య చ అత్యన్తవైలక్షణ్యప్రదర్శనార్థమ్. కథమ్? సర్వేషాం హి భావవికారాణాం జనిలక్షణః భావవికారః మూలమ్, జన్మోత్తరకాలభావినః అన్యే సర్వే భావవికారాః వినాశాన్తాః; వినాశాత్ పరః న కశ్చిత్ అస్తి భావవికారః, భావాభావాత్. సతి హి ధర్మిణి ధర్మాః భవన్తి. అతః అన్త్యభావ వికారాభావానువాదేన తత్ పూర్వభావినః సర్వే భావవికారాః ప్రతిషిద్ధాః భవన్తి సహ కార్యైః. తస్మాత్ సర్వభూతవైలక్షణ్యమ్, అత్యన్తమేవ పరమేశ్వరస్య సిద్ధం, నిర్విశేషత్వమ్, ఏకత్వం చ. యః ఏవం యథోక్తం పరమేశ్వరం పశ్యతి, సః పశ్యతి.**

**తె.అ.** బ్రహ్మ మొదలు స్థావరములవరకు సమస్త ప్రాణులయందు ఒకేవిధంగా ఉంటూ అవి నశించినా నశించకుండా ఉండే పరమేశ్వరుని చూచినవాడే నిజంగా చూపుకలవాడు. దేహేంద్రియ మనోబుద్ధ్యవ్యక్తాత్మలకంటె పరమైనవాడు ఈశ్వరుడు పరమేశ్వరుడు. అవి నశించినా తాను నశించక ఉండువాడు అనడం భూతములకంటె పరమేశ్వరుడు అత్యంత విలక్షణుడు అని ప్రదర్శించడం కొరకు. ఎట్లా విలక్షణుడు? అన్ని భావవికారాలకు మూలం జనిలక్షణమైన భావవికారం. (జన్మ అన్ని వికారాలకు మొదటిది, మూలము) జన్మ తరువాత కలిగే వికారాలన్నీ వినాశంతో ముగుస్తాయి. వినాశం తరువాత ఏ భావవికారము ఉండదు, వికారం చెందడానికి

ఏదీలేదు కనుక. ధర్మి ఉన్నపుడే ధర్మాలు. కనుక చివరి భావవికారమైన వినాశం లేదనడంతో అంతకు పూర్వపు భావవికారాలు, వాటి పరిణామాలు లేవని చెప్పినట్లయింది. అందుచేత పరమేశ్వరుడు సమస్త భూతములకంటె విలక్షణుడు అని సిద్ధిస్తున్నది. ఆయన నిర్విశేషుడు అంటే అంతటా ఒకే విధంగా ఉంటాడు. ఏకంగా ఉండే ఈ పరమేశ్వరుని చూచినవాడే నిజంగా చూచినవాడు.

**భాష్యమ్ : 27.2 నను సర్వోఽపి లోకః పశ్యతి, కిం విశేషణేన ఇతి? సత్యమ్ పశ్యతి; కిం తు విపరీతం పశ్యతి. అతః విశినష్టి – స ఏవ పశ్యతీతి. యథా తిమిరదోషదృష్టిః అనేకం చన్ద్రం పశ్యతి తమపేక్ష్య ఏకచన్ద్రదర్శీ విశిష్యతే – స ఏవ పశ్యతీతి; తథైవ ఇహాపి ఏకమ్ అవిభక్తం యథోక్తమ్ ఆత్మానం యః పశ్యతి, సః విభక్తానేకాత్మవిపరీతదర్శిభ్యః విశిష్యతే – స ఏవ పశ్యతీతి. ఇతరే పశ్యన్తః అపి న పశ్యన్తి, విపరీతదర్శిత్వాత్ – అనేకచన్ద్రదర్శివత్ ఇత్యర్థః**

ఆక్షేపణ – లోకంలో అందరూ చూస్తూనే ఉన్నారుగదా? ఈ విశేషణం ఎందుకు?

సమాధానం – నిజమే, చూస్తూనే ఉన్నారు. కాని విపరీతంగా చూస్తున్నారు. అందుకే వాడే నిజంగా చూచినవాడు అని విశేషించి చెప్పడం. దృష్టిదోషం ఉన్నవాడు అనేక చంద్రులను చూస్తాడు. అటువంటివానిని ఉపేక్షించి ఒక చంద్రుని చూచేవానిని విశేషంగా చెపుతాము, వాడే నిజంగా చూచినవాడు అని. అట్లాగే ఇక్కడకూడా చెప్పబడిన విధంగా విభక్తంగాని ఒక ఆత్మను చూచువాడు, విభక్తమైన అనేకాత్మలను చూచేవానికంటె విశిష్టుడు, వాడే చూచువాడు. ఇతరులు చూచినా చూచినవారు కారు, అనేక చంద్రులను చూచువానివలె విపరీతంగా చూస్తున్నారు కనుక.

**భాష్యమ్ : 28.0 యథోక్తస్య సమ్యగ్దర్శనస్య ఫలవచనేన స్తుతిః కర్తవ్యా, ఇతి శ్లోకః ఆరభ్యతే –**

**తె.అ.** పైన చెప్పిన సమ్యగ్దర్శనం యొక్క ఫలంచెప్పి దాన్ని స్తుతించడం కొరకు శ్లోకం ఆరంభిస్తున్నాడు –

**మూ. సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థితమీశ్వరమ్ ।**
**న హినస్త్యాత్మనాఽఽత్మానం తతో యాతి పరాం గతిమ్ ॥ 28**

**తె.అ.** సర్వభూతములయందు సమంగా వసించే ఈశ్వరుని చూస్తూ ఉన్న అతడు ఆత్మచేత ఆత్మను హింసించడు. ఈ అహింసచేత అతడు పరమగతిని పొందుతాడు.

**భాష్యమ్ : 28.1 సమమితి – సమం పశ్యన్ ఉపలభమానః యస్మాత్ సర్వత్ర సర్వభూతేషు, సమవస్థితం తుల్యతయా అవస్థితమ్ ఈశ్వరమ్ అతీతానన్తరశ్లోకోక్తలక్షణమిత్యర్థః. సమం పశ్యన్. కిమ్? న హినస్తి హింసాం న కరోతి ఆత్మనా స్వేనైవ స్వమ్ ఆత్మానమ్. తతః తదహింసనాత్ యాతి పరాం ప్రకృష్టాం గతిమ్ మోక్షాఖ్యామ్.**

**నను నైవ కశ్చిత్ ప్రాణీ స్వయం స్వమ్ ఆత్మానం హినస్తి, కథమ్ ఉచ్యతే అప్రాప్తం 'న హినస్తి' ఇతి? యథా "న పృథివ్యామ్ నాన్తరిక్షే న దివ్యగ్నిః చేతవ్యః" (తై.సం. 5.2.7.1) ఇత్యాది.**

**నైష దోషః. అజ్ఞానామ్ ఆత్మతిరస్కరణోపపత్తేః. సర్వో హి అజ్ఞః అత్యన్తప్రసిద్ధం సాక్షాత్ అపరోక్షమ్ ఆత్మానం తిరస్కృత్య అనాత్మానమ్ ఆత్మత్వేన పరిగృహ్య, తమపి ధర్మాధర్మౌ కృత్వా ఉపాత్తమ్ ఆత్మానం హత్వా అన్యమ్ ఆత్మానమ్ ఉపాదత్తే నవమ్, తం చైవ హత్వా అన్యమ్, ఏవం తమపి హత్వా అన్యమ్. ఇత్యేవమ్ ఉపాత్తముపాత్తమ్ ఆత్మానం హన్తీతి ఆత్మహా సర్వః అజ్ఞః. యస్తు పరమార్థాత్మా, అసావపి సర్వదా అవిద్యయా హత ఇవ, విద్యమానఫలాభావాత్, ఇతి సర్వే ఏవ ఆత్మహనః ఏవ అవిద్వాంసః. యస్తు ఇతరః యథోక్తాత్మదర్శీ సః ఉభయథాపి ఆత్మనా ఆత్మానం న హినస్తి న హన్తి. తతః యాతి పరాం గతిం, యథోక్తం ఫలం తస్య భవతీత్యర్థః.**

**తె.అ.** సర్వభూతములయందు సమంగా ఉన్న ఈశ్వరుని వెనుకటిశ్లోకంలో చెప్పబడిన లక్షణాలు గలిగినవానిని, సమభావంతో చూస్తూ – చూస్తే ఏమవుతుంది? ఆ విధంగా చూచేవాడు తనను తాను హింసించుకోడు. తనను తాను హింసించుకొనడు కనుక పరమగతిని అంటే మోక్షాన్ని పొందుతాడు.

ఆక్షేపణ – ఏ ప్రాణి తనను తాను హింసించుకోడు గదా? మరి చేయనిదానిని 'అతడు హింసించడు' అని చెప్పడమెందుకు? 'భూమిమీదగాని అంతరిక్షంలోగాని దివిలోగాని అగ్నిని వెలిగించరాదు' (తై.సం. 5. 2. 7. 1.) అన్నట్లు.

సమాధానం – ఇందులో దోషంలేదు. అజ్ఞానులు ఆత్మను తిరస్కరించడం జరుగుతున్నది కనుక. అజ్ఞానులందరు అత్యంతప్రసిద్ధమై సాక్షాత్తుగా ప్రత్యక్షమై ఉన్న ఆత్మను కాదని అనాత్మను ఆత్మగా భావించి, పుణ్యపాపకర్మలు చేసి ఆ ఆత్మను (శరీరరూప ఆత్మను) హత్యచేసి మరొక ఆత్మను కొత్తదానిని పొందుతున్నారు. దాన్ని ఇదేవిధంగా మళ్ళీ హత్యచేసి మరొకదానిని, దాన్నికూడా హత్యచేసి మరొకదానిని, ఈవిధంగా ప్రాప్తించిన ఆత్మను మళ్ళీ మళ్ళీ హత్య చేస్తున్నారు. కనుక అజ్ఞానులందరు ఆత్మహత్య చేసేవారే. వాస్తవమైన ఆత్మకూడా అవిద్యచేత ఎప్పుడూ హతమైనట్లే ఉంటుంది, ఎందుకంటె అది ఉన్న ఫలంలేదు కనుక. అందుకని అజ్ఞానులందరు ఆత్మను హింసించేవారే. జ్ఞాని, చెప్పబడినవిధంగా ఆత్మను దర్శించినవాడు రెండువిధాలుగా కూడా ఆత్మను ఆత్మచేత హింసించడు. కనుక పరమగతిని పొందుతాడు. అతనికి వెనుక చెప్పిన ఫలం లభిస్తుంది అని అర్థం.

**భాష్యమ్ : 29.0 సర్వభూతస్థమ్ ఈశం సమం పశ్యన్ న హినస్తి ఆత్మనా ఆత్మానమ్ ఇత్యుక్తమ్, తదనుపపన్నం, స్వగుణకర్మవైలక్షణ్యభేదభిన్నేషు ఆత్మసు, ఇత్యేతత్ ఆశఙ్క్య ఆహ –**

**తె.అ.** 'సర్వభూతములయందున్న ఈశ్వరుని సమంగా చూస్తూ ఆత్మచేత ఆత్మను హింసించడు' అని చెప్పబడింది. జీవులకు తమతమ గుణాలువేరు. వారి కర్మలు వేరు. ఈవిధంగా వేరువేరుగా ఉన్న ఆత్మలలో ఒకేవిధమైన దృష్టి సాధ్యంకాదు, అని సందేహించవచ్చునని (అందుకు సమాధానంగా) చెపుతున్నాడు -

**మూ. ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః ।**
**యః పశ్యతి తథాఽఽత్మానమకర్తారం స పశ్యతి ॥ 29**

**తె.అ.** ఏవిధమైన కర్మగాని ప్రకృతిచేతనే చేయబడుతున్నదని, అట్లాగే ఆత్మ అకర్త, ఏమీ చేయడం లేదు అని చూచినవాడు నిజంగా చూచినవాడు.

**భాష్యమ్ : 29.1 ప్రకృత్యా ఇతి – ప్రకృతిః భగవతః మాయా త్రిగుణాత్మికా, "మాయాం తు ప్రకృతిం విద్యాత్" (శ్వే.ఉ.4.10) ఇతి మన్త్రవర్ణాత్. తయా ప్రకృత్యైవ న అన్యేన, మహదాది కార్యకరణాకారపరిణతయా కర్మాణి వాఙ్మనఃకాయారభ్యాణి, క్రియమాణాని నిర్వర్త్యమానాని, సర్వశః సర్వప్రకారైః యః పశ్యతి ఉపలభతే, తథా ఆత్మానం క్షేత్రజ్ఞమ్, అకర్తారం సర్వోపాధివివర్జితం, స పశ్యతి సః పరమార్థదర్శీ ఇత్యభిప్రాయః నిర్గుణస్య అకర్తుః నిర్విశేషస్య ఆకాశస్యేవ భేదే ప్రమాణానుపపత్తిః ఇత్యర్థః.**

**తె.అ.** ప్రకృతి అంటే భగవంతుని త్రిగుణాత్మికయైన మాయ. 'మాయను ప్రకృతి అని తెలియవలెను' (శ్వే.ఉ.4.10) అని మంత్రవర్ణము. మహదాది కార్యకారణాల ఆకారంగా మారిన ప్రకృతిచేతనే, మరి దేనిచేతను గాదు, వాఙ్మనఃకాయములచేత జరుపబడుతున్న అన్ని ప్రకారముల కర్మములు మహదాది కార్యకరణముల ఆకారంగా మారిన ప్రకృతిచేతనే నిర్వర్తింపబడుచున్నవి మరి వేరే దేనిచేతను గాదు అని చూచినవాడు. అట్లాగే ఆత్మను అంటే క్షేత్రజ్ఞుని అన్ని ఉపాధులు తొలగినవానిగా అకర్తగా చూచువాడు. అతడు పరమార్థదర్శి అని అభిప్రాయము. ఆకాశంవలె నిర్గుణము నిర్విశేషము అయిన అకర్తయందు భేదభావం ఉందనడానికి ప్రమాణంలేదు అని అర్థం.

**భాష్యమ్ : 30.0 పునరపి తదేవ సమ్యగ్దర్శనం శబ్దాన్తరేణ ప్రపఞ్చయతి –**

**తె.అ.** అదే సమ్యగ్దర్శనాన్ని మళ్ళీ వేరు మాటలలో వివరిస్తున్నాడు -

**మూ. యదా భూతపృథగ్భావమేకస్థమనుపశ్యతి ।**
**తత ఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా ॥ 30**

**తె.అ.** అనేకంగా కనిపించే ఈ భూతములన్నీ ఉండేది ఒకదానియందేనని, ఆ ఒకటినుండియే ఈ విస్తారమునని ఎప్పుడు చూస్తాడో అప్పుడు బ్రహ్మమవుతాడు.

**భాష్యమ్ : 30.1 యదా ఇతి – యదా యస్మిన్‌కాలే, భూతపృథగ్భావమ్ భూతానాం పృథగ్భావం పృథక్త్వమ్, ఏకస్మిన్ ఆత్మని స్థితమ్ ఏకస్థమ్ అనుపశ్యతి, శాస్త్రోచార్యోపదేశమ్ అను ఆత్మానం ప్రత్యక్షత్వేన పశ్యతి "ఆత్మైవేదం సర్వమ్" (బృ.ఉ.2.4.6) ఇతి, తతః ఏవ చ తస్మాదేవ చ విస్తారమ్ ఉత్పత్తిం వికాసమ్ – "ఆత్మతః ప్రాణః, ఆత్మతః ఆశా, ఆత్మతః స్మరః, ఆత్మతః ఆకాశః ఆత్మతః తేజః ఆత్మతః ఆపః ఆత్మతః ఆవిర్భావతిరోభావౌ, ఆత్మతః అన్నమ్" (ఛాం.ఉ.7.26.1) ఇత్యేవమాదిప్రకారైః విస్తారం యదా పశ్యతి, బ్రహ్మ సంపద్యతే బ్రహ్మైవ భవతి తదా తస్మిన్ కాలే ఇత్యర్థః.**

**తె.అ.** శాస్త్రాచార్య ఉపదేశానుసారంగా భూతముల పృథగ్భావం ఒకటే అయిన ఆత్మయందు, 'ఇదంతా ఆత్మే' (బృ.ఉ.2.4.6) అని ప్రత్యక్షంగా ఎప్పుడు చూస్తాడో, దానినుండియే విస్తారము 'ఆత్మనుండి ప్రాణము, ఆత్మనుండి ఆశ, ఆత్మనుండి స్మృతి, ఆత్మనుండి ఆకాశము, ఆత్మనుండి తేజము, ఆత్మనుండి నీరు, ఆత్మనుండి ఆవిర్భావతిరోభావాలు, ఆత్మనుండి అన్నము' (ఛాం.ఉ.7.16.1) అన్నవిధంగా ఉత్పత్తి వికాసము దానినుండియే అని ఎప్పుడు చూస్తాడో అప్పుడు బ్రహ్మమే అవుతాడు, అని అర్థం.

**భాష్యమ్ : 31.0 ఏకస్య ఆత్మనః సర్వదేహాత్మత్వే తద్దోషసంబన్ధే ప్రాప్తే ఇదమ్ ఉచ్యతే –**

**తె.అ.** సర్వదేహములకు ఆత్మ అయిన ఏకాత్మకు ఆ దేహములకున్న దోషములతోటి సంబంధం ఉండవచ్చునన్న దానికి చెపుతున్నాడు –

**మూ. అనాదిత్వాన్నిర్గుణత్వాత్పరమాత్మాఽయమవ్యయః ।**
**శరీరస్థోఽపి కౌన్తేయ న కరోతి న లిప్యతే ॥ 31**

**తె.అ.** అనాది నిర్గుణము కనుక ఈ పరమాత్మ అవ్యయము. శరీరంలో ఉంటూకూడా ఏ కర్మచేయదు. ఏ కర్మఫలము దానికి అంటుకోదు.

**భాష్యమ్ : 31.1 అనాదిత్వత్ ఇతి – అనాదిత్వాత్ – అనాదేః భావః అనాదిత్వమ్, ఆదిః కారణమ్, తత్ యస్య నాస్తి తత్ అనాది. యత్ హి ఆదిమత్ తత్ స్వేన ఆత్మనా వ్యేతి; అయం తు అనాదిత్వాత్ నిరవయవః ఇతి కృత్వా న వ్యేతి. తథా నిర్గుణత్వాత్. సగుణో హి గుణవ్యయాత్ వ్యేతి, అయం తు నిర్గుణత్వాత్ న వ్యేతి; ఇతి పరమాత్మా అయమ్ అవ్యయః, న అస్య వ్యయః విద్యతే ఇత్యవ్యయః. యతః ఏవమ్ అతః శరీరస్థోఽపి, శరీరేషు ఆత్మనః ఉపలబ్ధిః భవతీతి**

**శరీరస్థః ఉచ్యతే. తథాపి న కరోతి కర్మ. తదకరణాదేవ తత్ఫలేన న లిప్యతే. యః హి కర్తా సః కర్మఫలేన లిప్యతే. అయం తు అకర్తా, అతః న ఫలేన లిప్యతే ఇత్యర్థః. కః పునః దేహేషు కరోతి లిప్యతే చ? యది తావత్ అన్యః పరమాత్మనః దేహీ కరోతి లిప్యతే చ, తతః ఇదమ్ అనుపపన్నమ్ ఉక్తం క్షేత్రజ్ఞేశ్వరైకత్వం 'క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి' (13.2) ఇత్యాది. అథ నాస్తి ఈశ్వరాత్ అన్యః దేహీ, కః కరోతి కః లిప్యతే చ ఇతి వాచ్యమ్. పరో వా నాస్తీతి. సర్వథా దుర్విజ్ఞేయం దుర్వాచ్యం చేతి భగవత్ప్రోక్తం ఔపనిషదం దర్శనం పరిత్యక్తం వైశేషికైః సాంఖ్యార్హతబౌద్ధైశ్చ.**

**తె.అ.** ఆది అంటే కారణం. దేనికి కారణం లేదో అది అనాది. ఆది దేనికున్నదో అది సహజంగా మారుతుంది. ఆత్మ అనాది కనుక నిరవయవమైన కారణంగా మార్పు చెందదు. సగుణమైనది గుణం మారడంతో మారుతుంది. నిర్గుణమైనది కనుక ఆత్మ మారదు. కనుక ఈ పరమాత్మకు మార్పులేదు. ఈ కారణంగా శరీరంలో ఉంటూ కూడా కర్మ చేయదు. కర్మచేయదు కనుక దాని ఫలము అంటదు. కర్త ఎవడో వానిని కర్మఫలం అంటుతుంది. ఈ ఆత్మ అకర్త. కనుక ఫలమంటదు అని అర్థం.

ఆక్షేపణ – మరి దేహాలలో ఉంటూ కర్మ చేస్తున్నదెవడు? ఫలం అంటడం ఎవరికి? పరమాత్మ కంటే అన్యుడొకడు దేహి చేస్తూ చేసినదానిఫలం అతన్ని అంటుకుంటూ ఉంటే క్షేత్రజ్ఞుడు ఈశ్వరుడు ఒకడేనని 'క్షేత్రజ్ఞంచాపి మాం విద్ధి' అనడం వీలుపడదు. లేక ఈశ్వరునికంటె అన్యుడొకడు దేహి లేదు అంటె, మరి చేస్తున్నదెవడు? ఫలమంటడం ఎవరిని? లేదంటే, అసలు దీనికంతటికి పైన ఎవడూలేడు అని చెప్పండి.

సమాధానం – భగవంతుడు చెప్పిన ఈ ఉపనిషద్దర్శనం చెప్పడంకాని తెలియడంకాని కష్టమవడంచేత వైశేషికులు సాంఖ్యులు జైనులు బౌద్ధులు దీన్ని కాదన్నారు.

**భాష్యమ్ : 31.2 తత్రాయం పరిహారః భగవతా స్వేనైవ ఉక్తః 'స్వభావస్తు ప్రవర్తతే' (5.14) ఇతి. అవిద్యామాత్రస్వభావో హి కరోతి లిప్యతే ఇతి వ్యవహారః భవతి, న తు పరమార్థతః ఏవ తస్మిన్ పరమాత్మని తత్ అస్తి. అతః ఏవ ఏతస్మిన్ పరమార్థసాంఖ్యదర్శనే స్థితానాం జ్ఞాననిష్ఠానాం పరమహంసపరివ్రాజకానాం తిరస్కృతావిద్యావ్యవహారాణాం కర్మాధికారః నాస్తి ఇతి తత్ర తత్ర దర్శితం భగవతా.**

**తె.అ.** దీనికి పరిహారం స్వయంగా భగవానుడే చెప్పి ఉన్నాడు. 'స్వభావస్తు ప్రవర్తతే' (5.14) అని. వ్యవహారంలో చేస్తున్నాడు ఫలమంటుతున్నది అనడం అవిద్యామాత్రమే. వాస్తవంలో పరమాత్మయందు అదిలేదు. కనుకనే ఈ పరమార్థ సాంఖ్యదర్శనంలో ఉంటూ జ్ఞాననిష్ఠులై అవిద్యా వ్యవహారాన్ని తిరస్కరించిన పరమహంసపరివ్రాజకులకు కర్మాధికారం లేదని భగవంతుడు అనేకచోట్ల ప్రదర్శించాడు.

**భాష్యమ్ : 32.0 కిమివ న కరోతి న లిప్యతే ఇత్యత్ర దృష్టాన్తమ్ ఆహ –**

**తె.అ.** అతడు చేయకపోవడం, ఫలం అతన్ని అంటకపోవడం దేనివలె అంటే దృష్టాంతం చెపుతున్నాడు –

**మూ. యథా సర్వగతం సౌక్ష్మ్యాదాకాశం నోపలిప్యతే ।**
**సర్వత్రావస్థితో దేహే తథాఽఽత్మా నోపలిప్యతే ॥ 32**

**తె.అ.** ఆకాశం అంతటా ఉంటుంది. కాని అది సూక్ష్మమైనది. ఆ కారణంగా దానినేదీ అంటదు. అదేవిధంగా అంతటా దేహాలలో ఉంటున్న ఆత్మనుకూడా ఏదీ అంటదు.

**భాష్యమ్ : 32.1 యథా ఇతి – యథా సర్వగతం సర్వవ్యాప్యపి సత్, సౌక్ష్మ్యాత్ సూక్ష్మభావాత్, ఆకాశం ఖం, న ఉపలిప్యతే న సంబధ్యతే, సర్వత్ర అవస్థితః దేహే తథా ఆత్మా న ఉపలిప్యతే. కిం చ –**

**తె.అ.** సర్వవ్యాపి అయినప్పటికీ ఆకాశం సూక్ష్మమైనది కనుక దానినేదీ అంటదు. అన్ని దేహాలలో ఉంటూ ఉన్న ఆత్మను కూడా అదేవిధంగా ఏదీ అంటదు. అంతేకాదు –

**మూ. యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోకమిమం రవిః ।**
**క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత ॥ 33**

**తె.అ.** అర్జునా, ఒక సూర్యుడు సమస్తలోకాన్ని ప్రకాశింపజేసినట్లు క్షేత్రి క్షేత్రమంతటిని ప్రకాశింపజేస్తున్నాడు.

**భాష్యమ్ : 33.1 యథా ఇతి – యథా, ప్రకాశయతి అవభాసయతి, ఏకః కృత్స్నం లోకమ్ ఇమం రవిః సవితా ఆదిత్యః, తథా తద్వత్, అవ్యక్తమహాభూతాది ధృత్యన్తం క్షేత్రం ఏకః సన్ ప్రకాశయతి, కః? క్షేత్రీ, పరమాత్మా ఇత్యర్థః, భారత! రవిదృష్టాన్తః అత్ర ఆత్మనః ఉభయార్థః అపి భవతి, రవివత్ సర్వక్షేత్రేషు ఏకః ఏవ ఆత్మా అలేపకశ్చ ఇతి.**

**తె.అ.** సూర్యుడొకడు ఈ సమస్తలోకాన్ని ప్రకాశింపజేసినట్లు అవ్యక్తమహాభూతాలు మొదలుకొని ధృతివరకు గల క్షేత్రాన్ని ఒక్కడు ప్రకాశింపజేస్తున్నాడు. ఎవడు? క్షేత్రి, అంటే పరమాత్మ. ఇక్కడ ఆత్మను సూర్యునితో పోల్చడం వలన రెండర్థాలు కలుగుతున్నాయి – సూర్యునివలె సర్వక్షేత్రముల యందున్న ఆత్మ ఒకడేనని, అతనినేదీ అంటదు అని కూడా.

**భాష్యమ్ : 34.0 సమస్తాధ్యాయోపసంహారార్థః అయం శ్లోకః –**

**తె.అ.** సమస్త అధ్యాయంలో చెప్పిన విషయాన్ని ముగిస్తూ ఈ శ్లోకం –

**మూ. క్షేత్రక్షేత్రజ్ఞయోరేవమన్తరం జ్ఞానచక్షుషా ।**
**భూతప్రకృతిమోక్షం చ యే విదుర్యాన్తి తే పరమ్ ॥ 34**

**తె.అ.** క్షేత్రక్షేత్రజ్ఞుల ఈ అంతరాన్నీ, ప్రకృతినుండి ముక్తిపొందగలిగే మార్గాన్ని జ్ఞానచక్షువుతో తెలిసినవారు పరమగతిని పొందుతారు.

**ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే క్షేత్రక్షేత్రజ్ఞయోగో నామ త్రయోదశోఽధ్యాయః.**

ఇది వ్యాసభగవానుని శతసహస్రసంహిత అయిన శ్రీమహాభారతంలో భీష్మపర్వంలో ఉపనిషత్తులు బ్రహ్మవిద్య యోగశాస్త్రము శ్రీకృష్ణార్జునసంవాదము అయిన భగవద్గీతలయందు క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగము అనే పదమూడవ అధ్యాయానికి తెలుగు అనువాదం.

**భాష్యమ్ : 34.1 క్షేత్రక్షేత్రయోః ఇతి – క్షేత్రక్షేత్రజ్ఞయోః యథావ్యాఖ్యాతయోః, ఏవం యథాప్రదర్శితప్రకారేణ, అన్తరమ్ ఇతరేతరవైలక్షణ్యవిశేషం, జ్ఞానచక్షుషా శాస్త్రాచార్యప్రసాదో-పదేశజనితమ్ ఆత్మప్రత్యయికం జ్ఞానం చక్షుః, తేన జ్ఞానచక్షుషా, భూతప్రకృతిమోక్షం చ – భూతానాం ప్రకృతిః అవిద్యాలక్షణా అవ్యక్తాఖ్యా తస్యాః భూతప్రకృతేః మోక్షణమ్ అభావగమనం చ, యే విదుః జానన్తి, యాన్తి గచ్ఛన్తి, తే, పరం పరమార్థతత్త్వం బ్రహ్మ, న పునః దేహమ్ ఆదదతే ఇత్యర్థః.**

**తె.అ.** ఇంతవరకు వివరించిన క్షేత్రక్షేత్రజ్ఞుల అంతరాన్ని ప్రదర్శించిన ప్రకారంగా శాస్త్రాచార్యప్రసాద ఉపదేశం చేత కలిగిన ఆత్మప్రత్యయరూపమైన జ్ఞానచక్షువుతో తెలిసినవారు అవ్యక్తమనబడే అవిద్యాలక్షణమైన భూతముల ప్రకృతినుండి విముక్తిమార్గం తెలిసినవారు పరమార్థ తత్త్వమును అంటే బ్రహ్మమును పొందుతారు. మళ్ళీ దేహం ధరించరు అని అర్థం.

**ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యగోవిన్దభగవత్పూజ్యపాదశిష్యశ్రీమచ్ఛఙ్కరభగవతః కృతౌ శ్రీమద్భగవద్గీతాభాష్యే క్షేత్రక్షేత్రజ్ఞయోగో నామ త్రయోదశోఽధ్యాయః**

ఇది శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య గోవిందభగవత్పూజ్యపాదశిష్యులు శ్రీమత్ శంకరభగవత్పాదులు రచించిన శ్రీమద్భగవద్గీతాభాష్యంలో క్షేత్రక్షేత్రజ్ఞయోగమనే పదమూడవ అధ్యాయానికి తెలుగు అనువాదం.



# చతుర్దశోఽధ్యాయః

# గుణత్రయ విభాగయోగః

**భాష్యమ్ : 0.1 సర్వమ్ ఉత్పద్యమానం క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్ ఉత్పద్యతే ఇత్యుక్తమ్. తత్ కథమ్ ఇతి ప్రదర్శనార్థం 'పరం భూయః' ఇత్యాది అధ్యాయః ఆరభ్యతే. అథవా 'ఈశ్వరపరతన్త్రయోః క్షేత్రక్షేత్రజ్ఞయోః జగత్కారణత్వమ్ న తు సాంఖ్యానామ్ ఇవ స్వతన్త్రయోః' ఇత్యేమవర్థం ప్రకృతిస్థత్వం, గుణేషు చ సంగః సంసారకారణమ్ ఇత్యుక్తమ్. (13.21) కస్మిన్ గుణే కథం సంగః? కే వా గుణాః? కథం వా తే బధ్నన్తి? ఇతి, గుణేభ్యః చ మోక్షణం కథం స్యాత్? ముక్తస్య చ లక్షణం వక్తవ్యమ్. ఇత్యేవమర్థం చ.**

**తె.అ.** ఉత్పన్నమయే ప్రతి వస్తువు క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగంవల్లనే అని చెప్పబడింది. అదెట్లా? అంటే దాన్ని వివరించడం కొరకు 'పరం భూయః' మొదలైన శ్లోకాలతో ఈ అధ్యాయం ఆరంభించ బడుతున్నది. లేక, ఈశ్వరునికి లోబడియే క్షేత్రక్షేత్రజ్ఞులు జగత్కారణం అవుతున్నారు, సాంఖ్యులు వాదించినట్లు స్వతంత్రంగా కాదు అని చూపడానికి. ప్రకృతికి వశమై ఉండడము, గుణసంగము సంసారకారణమని చెప్పబడింది. ఏ గుణాలలో ఎటువంటి సంగము, గుణాలేవి, అవి ఎట్లా బంధిస్తాయి, గుణాలనుండి విముక్తి ఎట్లా కలుగుతుంది, ముక్తుని లక్షణాలేవి – ఇవి చెప్పడానికి ఈ అధ్యాయం ఆరంభించబడుతున్నది.

**శ్రీ భగవానువాచ –**

**మూ. పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమమ్ ।**
**యద్ జ్ఞాత్వా మునయస్సర్వే పరాం సిద్ధిమితో గతాః ॥ 1**

శ్రీ భగవానుడు అంటున్నాడు –

**తె.అ.** జ్ఞానములలోకెల్ల ఉత్తమము శ్రేష్ఠము అయిన జ్ఞానమును మళ్ళీ చెపుతాను. ఈ జ్ఞానాన్ని పొందిన మునులందరు దేహం విడిచిన తరువాత పరమస్థితిని పొందారు.

**భాష్యమ్ : 1.1 పరం 'జ్ఞానమ్' ఇతి వ్యవహితేన సంబన్ధః. భూయః పునః, పూర్వేషు సర్వేషు అధ్యాయేషు అసకృత్ ఉక్తమ్ అపి, ప్రవక్ష్యామి, తచ్చ, పరం పరవస్తువిషయత్వాత్. కిం తత్? జ్ఞానమ్ సర్వేషాం జ్ఞానానామ్ ఉత్తమమ్, ఉత్తమఫలత్వాత్. 'జ్ఞానానామ్' ఇతి న అమానిత్వాదీనమ్, (13.7–20) కిం తర్హి? యజ్ఞాదిజ్ఞేయవస్తువిషయాణామ్ ఇతి. తాని న మోక్షాయ. ఇదం తు**

**మోక్షాయ ఇతి పరోత్తమశబ్దాభ్యాం స్తౌతి శ్రోతృబుద్ధిరుచ్యుత్పాదనార్థమ్. యద్ జ్ఞాత్వా, యద్ జ్ఞానం జ్ఞాత్వా ప్రాప్య మునయః సంన్యాసినః మననశీలాః సర్వే పరాం సిద్ధిం మోక్షాఖ్యామ్ ఇతః అస్మాత్ దేహబన్ధనాత్ ఊర్ధ్వం గతాః ప్రాప్తాః.**

**తె.అ.** వెనుకటి అధ్యాయాలలో చాలామార్లు చెప్పియున్నప్పటికి జ్ఞానములలోకెల్ల ఉత్తమము, శ్రేష్ఠము అయిన జ్ఞానమును మళ్ళీ చెపుతాను. ఉత్తమ ఫలమిచ్చేది కనుక అది ఉత్తమజ్ఞానము. 'జ్ఞానములలో' అంటే అమానిత్వాది జ్ఞానసాధనాలలో అని కాదు, యజ్ఞాది జ్ఞేయవస్తువిషయక జ్ఞానములలో అవి యజ్ఞాది జ్ఞానాలు మోక్షమివ్వవు. ఇది మోక్షమిచ్చేది. కనుక, వినేవానిబుద్ధికి రుచి కలగడం కొరకు దీనిని ఉత్తమము, శ్రేష్ఠము అనే మాటలతో స్తుతిస్తున్నాడు. ఈ జ్ఞానమును పొంది మననశీలురైన సన్యాసులందరు ఇక్కడనుండి, అంటే దేహబంధనం తరువాత, పరమసిద్ధిని పొందారు.

**భాష్యమ్ : 2.0 అస్యాః చ సిద్ధేః ఐకాన్తికత్వం ఉచ్యతే.**

**తె.అ.** ఈ సిద్ధి కలగడంలో సందేహంలేదు అని చెపుతున్నాడు.

**మూ. ఇదం జ్ఞానముపాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః,**
**సర్గేఽపి నోపజాయన్తే ప్రలయే న వ్యథన్తి చ. 2**

**తె.అ.** ఈ జ్ఞానాన్ని ఆశ్రయించి వారు నాతో సమానరూపాన్ని పొందారు. వారు సృష్టిసమయంలో కూడా మళ్ళీ పుట్టరు. ప్రళయంలోను వ్యథ చెందరు.

**భాష్యమ్ : 2.1 ఇదం జ్ఞానం యథోక్తమ్, ఉపాశ్రిత్య జ్ఞానసాధనమ్ అనుష్ఠాయ ఇత్యేతత్. మమ పరమేశ్వరస్య, సాధర్మ్యం మత్స్వరూపతామ్, ఆగతాః ప్రాప్తాః ఇత్యర్థః. న తు సమానధర్మతా సాధర్మ్యమ్, క్షేత్రజ్ఞేశ్వరయోః భేదానభ్యుపగమాత్ గీతాశాస్త్రే. ఫలవాదశ్చాయం స్తుత్యర్థమ్ ఉచ్యతే. సర్గేఽపి సృష్టికాలేఽపి న ఉపజాయన్తే న ఉత్పద్యన్తే. ప్రలయే బ్రహ్మణః అపి వినాశకాలే, న వ్యథన్తి చ వ్యథాం నాపద్యన్తే. న చ్యవన్తి ఇత్యర్థః.**

**తె.అ.** ఇప్పుడు చెప్పిన ఈ జ్ఞానాన్ని ఆశ్రయించి, అంటే ఈ జ్ఞానాన్ని కలిగించగల సాధనాన్ని అనుష్ఠించి, నా సాధర్మ్యమును అంటే పరమేశ్వరస్వరూపమును పొందారు అని అర్థం. సాధర్మ్యమంటె సమానధర్మత కాదు. (నావంటి వాడు కాదు, నేనే అవుతాడు) ఎందుకంటె గీతాశాస్త్రం క్షేత్రజ్ఞ ఈశ్వరులకు మధ్య భేదాన్ని ఒప్పుకోదు. స్తుతికొరకు ఈ జ్ఞానానికి ఫలం చెపుతున్నాడు. ఇక సృష్టికాలంలో కూడా వారు పుట్టరు. ప్రళయంలో బ్రహ్మకూడా నశించినపుడు, వ్యథచెందరు. అంటే వారు ముక్తస్థితి నుండి జారరు.

**భాష్యమ్ : 3.0 క్షేత్రక్షేత్రజ్ఞసంయోగః ఈదృశః భూతకారణమ్ ఇత్యాహ –**

**తె.అ.** క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగంవలన భూతములు ఏ విధంగా పుడుతున్నది వివరిస్తున్నాడు.

**మూ. మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్ ।**
**సంభవః సర్వభూతానాం తతో భవతి భారత ॥ 3**

**తె.అ.** అర్జునా, గొప్పదైన మూల ప్రకృతి నా యొక్క సర్వభూతోత్పత్తి స్థానము. దానియందు నేను గర్భకారణమైన చైతన్యరూపమగు బీజమునుంచుచున్నాను. సర్వభూతములకు సంభవం దాని నుండియే.

**భాష్యమ్ : 3.1 మమ స్వభూతా మదీయా మాయా త్రిగుణాత్మికా ప్రకృతిః యోనిః, సర్వభూతానాం, కారణమ్. సర్వకార్యేభ్యః మహత్త్వాత్ కారణత్వాత్ బృంహణత్వాత్ చ స్వవికారాణాం మహత్ బ్రహ్మ ఇతి యోనిః ఏవ విశిష్యతే. తస్మిన్ మహతి బ్రహ్మణి యోనౌ, గర్భం హిరణ్యగర్భస్య జన్మనో బీజం, సర్వభూతజన్మకారణం బీజం, దధామి నిక్షిపామి. క్షేత్రక్షేత్రజ్ఞప్రకృతిద్వయశక్తిమాన్ ఈశ్వరః అహమ్ అవిద్యాకామకర్మోపాధిస్వరూపానువిధాయినం క్షేత్రజ్ఞం క్షేత్రేణ సంయోజయామీత్యర్థః. సంభవః ఉత్పత్తిః సర్వభూతానాం హిరణ్యగర్భోత్పత్తిద్వారేణ, తతః తస్మాత్ గర్భనిధానాత్, భవతి హే భారత.**

**తె.అ.** త్రిగుణాత్మికయైన ప్రకృతి నా మాయ. అది సర్వభూతములకు సంభవస్థానము, గర్భము. కార్యములన్నిటికంటె మహత్త్వం కలది కనుక, తన వికారాలన్నిటికి కారణము కావడంచేత నా ప్రకృతి మహత్ బ్రహ్మ అనే విశేషణంతో చెప్పబడుతున్నది. ఆ మహత్బ్రహ్మగర్భంలో హిరణ్యగర్భుని జన్మకు బీజముంచుతాను. అదే సమస్త ప్రాణుల జన్మకారణం. క్షేత్రక్షేత్రజ్ఞులనే రెండు ప్రకృతిశక్తులుగల ఈశ్వరుడనైన నేను అవిద్య, కామము, కర్మము అనే ఉపాధులకు లోబడిన క్షేత్రజ్ఞుని క్షేత్రంలో కలుపుతాను అని అర్థం. ఆ గర్భాధానం వల్ల హిరణ్యగర్భుని ఉత్పత్తిద్వారా సమస్తభూతముల పుట్టుక జరుగుచున్నది.

**మూ. సర్వయోనిషు కౌంతేయ మూర్తయః సంభవన్తి యాః ।**
**తాసాం బ్రహ్మ మహద్యోనిరహం బీజప్రదః పితా ॥ 4**

**తె.అ.** కౌంతేయా అన్ని గర్భములందు ఏ మూర్తులు పుడుతున్నాయో వాటికి గర్భము మహద్బ్రహ్మము. నేను బీజాన్ని ఇచ్చే తండ్రిని.

**భాష్యమ్ : 4.1 సర్వయోనిష్వితి :– దేవపితృమనుష్యపశుమృగాది సర్వయోనిషు, కౌన్తేయ, మూర్తయః దేహసంస్థానలక్షణాః మూర్ఛితాఙ్గావయవాః మూర్తయః సంభవన్తి యాః తాసాం**

**మూర్తీనాం బ్రహ్మ మహత్ సర్వావస్థం యోనిః కారణమ్. అహమ్ ఈశః బీజప్రదః గర్భాధానస్య కర్తా పితా.**

**తె.అ.** అర్జునా దేవ, పితృ, మనుష్య, పశు, మృగాది, సర్వగర్భములందు అంగములేర్పడి దేహరూపం కల అన్ని మూర్తులకు మహద్బ్రహ్మ గర్భము, కారణము అవుతుంది. ఈశ్వరుడనైన నేను గర్భాధాన కర్తను, పితను.

**భాష్యమ్ : 5.0 కే గుణాః కథం బధ్నన్తి ఇత్యుచ్యతే**

**తె.అ.** గుణాలేవి? ఎట్లా బంధిస్తాయి? అంటే –

**మూ. సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః ।**
**నిబధ్నన్తి మహాబాహో దేహే దేహినమవ్యయమ్ ॥ 5**

**తె.అ.** మహాబాహూ! సత్త్వము, రజస్సు, తమస్సు, అనే గుణాలు ప్రకృతివల్ల కలిగేవి. ఇవి ఎట్టి మార్పులూ లేని దేహిని (జీవుణ్ణి) దేహంలో బంధిస్తున్నాయి.

**భాష్యమ్ : 5.1 సత్త్వం రజః తమః ఇత్యేవం నామానః, 'గుణాః' ఇతి పారిభాషికః శబ్దః, న రూపాదివత్ ద్రవ్యాశ్రితాః. న చ గుణగుణినోః అన్యత్వమ్ అత్ర వివక్షితమ్, తస్మాద్ గుణాః ఇవ నిత్యపరతన్త్రాః క్షేత్రజ్ఞం ప్రతి, అవిద్యాత్మకత్వాత్ క్షేత్రజ్ఞం నిబధ్నన్తీవ. తమ్ ఆస్పదీకృత్య ఆత్మానం ప్రతిలభన్తే ఇతి నిబధ్నన్తి ఇత్యుచ్యతే. తే చ ప్రకృతిసంభవాః భగవన్మాయాసంభవాః, నిబధ్నన్తి ఇవ, మహాబాహో మహాన్తౌ సమర్థతరౌ ఆజానుప్రలమ్బౌ బాహూ యస్య సః మహాబాహుః. హే మహాబాహో, దేహే శరీరే, దేహినం దేహవన్తమ్, అవ్యయమ్ అవ్యయత్వం చ ఉక్తమ్ 'అనాదిత్వాత్' (13.31) ఇత్యాదిశ్లోకేన.**

**నను 'దేహీ న లిప్యతే' (13.31) ఇత్యుక్తమ్. తత్ కథమ్ ఇహ నిబధ్నన్తి ఇతి అన్యథా ఉచ్యతే? పరిహృతమ్ అస్మాభిః ఇవశబ్దేన 'నిబధ్నన్తీవ' ఇతి.**

**తె.అ.** సత్త్వము రజస్సు తమస్సు అని వీటి పేర్లు. గుణాలు అనేది పారిభాషికపదం. ద్రవ్యాశ్రితాలైన రూపము మొదలైన గుణాలవంటివి కావు. గుణంవేరు గుణి వేరు అని చెప్పడం కూడా ఇక్కడి ఉద్దేశ్యం కాదు. కనుక గుణాలవలెనే ఇవి క్షేత్రజ్ఞునికి నిత్యపరతంత్రాలు. అవిద్యాత్మకం కనుక అవి క్షేత్రజ్ఞుని బంధిస్తున్నట్లుంటాయి. అతనిని ఆసరా చేసుకుని అవి మేమున్నాము అంటాయి. ఆ విధంగా బంధిస్తున్నాయి అని చెప్పబడింది. భగవంతుని మాయ అయిన ప్రకృతివల్ల కలిగే ఈ గుణాలు అవ్యయమైన దేహిని దేహంలో బంధించినట్లుంటాయి. 'అనాదిత్వాత్' (13.31) అన్న శ్లోకంలో అవ్యయత్వం చెప్పబడింది. 'దేహీ న లిప్యతే' (13.31) అని చెప్పాడు కదా,

మరి ఇక్కడ బంధిస్తున్నాయి అని ఎట్లా అంటున్నాడు? 'బంధించినట్లు' అని ఆ ఆక్షేపానికి ఆస్కారం లేకుండా మేము అర్థం చెప్పాము. గొప్పవి ఎక్కువ సమర్థమైనవి అయిన బాహువులు దీర్ఘమైనవి, కలవాడు కనుక మహాబాహువు, అర్జునుడు.

**భాష్యమ్ : 6.0 తత్ర సత్త్వాదీనాం సత్త్వస్యైవ తావత్ లక్షణమ్ ఉచ్యతే –**

**తె.అ.** ఆ సత్త్వాది గుణాలలోని సత్త్వలక్షణం చెప్పబడుతున్నది.

**మూ. తత్ర సత్త్వం నిర్మలత్వాత్ ప్రకాశకమనామయమ్ ।**
**సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చాఽనఘ ॥ 6**

**తె.అ.** పాపరహితుడా! వాటిలో సత్త్వగుణం నిర్మలమైనది. కనుక అది ప్రకాశింపచేస్తుంది; మరియు దోషరహితం అయినది. అది సుఖంతో జ్ఞానంతో ఆసక్తిని కల్పించి (క్షేత్రజ్ఞుని) బంధిస్తుంది.

**భాష్యమ్ : 6.1 తత్ర సత్త్వమితి :– నిర్మలత్వాత్ స్ఫటికమణిః ఇవ ప్రకాశకమ్ అనామయం నిరుపద్రవం సత్త్వం తత్ బధ్నాతి. కథమ్? సుఖసంగేన. 'సుఖీ అహమ్' ఇతి విషయభూతస్య సుఖస్య విషయిణి ఆత్మని సంశ్లేషాపాదనం మృషైవ సుఖే సంజనమ్ ఇతి. సా ఏషా అవిద్యా, న హి విషయధర్మః విషయిణః భవతి. ఇచ్ఛాది చ ధృత్యన్తం క్షేత్రస్యైవ విషయస్య ధర్మః ఇతి ఉక్తం భగవతా. అతః అవిద్యయైవ స్వకీయధర్మభూతయా విషయవిషయ్య వివేకలక్షణయా అస్వాత్మభూతే సుఖే సంజయతీవ ఆసక్తమివ కరోతి అసంగం సక్తమివ కరోతి, అసుఖినం సుఖినమివ. తథా జ్ఞానసంగేన చ. జ్ఞానమితి సుఖసాహచర్యాత్ క్షేత్రస్య విషయస్య అన్తః కరణస్యైవ ధర్మః, న ఆత్మనః. ఆత్మధర్మత్వే సంగానుపపత్తేః బన్ధానుపపత్తేశ్చ. సుఖే ఇవ జ్ఞానాదౌ సంగః మన్తవ్యః హే అనఘ అవ్యసన.**

**తె.అ.** సత్త్వం నిర్మలమయినది కనుక స్ఫటికమణివలె ప్రకాశకము. ఉపద్రవములు లేనిది కూడా. అది బంధిస్తుంది. ఎట్లా? సుఖంతో ఆసక్తిని కల్పించి – నేను సుఖంగా ఉన్నాను అన్న అనుభవంలో విషయమైన సుఖంలో విషయి అయిన ఆత్మకు తగులు కల్పించి, సుఖంలో వ్యర్థంగా తగులుకునేటట్లు చేసి. ఇది అవిద్య. విషయధర్మం విషయికి కలుగదు కదా? ఇచ్ఛ మొదలు ధృతివరకు క్షేత్రధర్మాలే, విషయధర్మాలేనని భగవానుడు చెప్పి ఉన్నాడు. (13.6) ఇది విషయము ఇది విషయి అని తెలియని అవివేకలక్షణమైన తన అవిద్యవలన తనదికాని సుఖంలో తగులు కల్పించినట్టు ఆసక్తిలేని దానిని ఆసక్తికలిగిన దానివలె బంధం చేస్తుంది. సుఖి కాని దానిని సుఖివలె చేస్తుంది. అదేవిధంగా జ్ఞానంతోను బంధం కల్పించినట్లుంటుంది. ఇక్కడ చెప్పిన జ్ఞానం సుఖంతో సహచరించేది కనుక విషయమైన క్షేత్రంలోని అంతఃకరణధర్మం, ఆత్మజ్ఞానం కాదు. ఆత్మజ్ఞానమైతే దానిలో తగులుకొనడం దానిచేత బంధించబడడం జరుగదు

కనుక. సుఖ విషయంలో సంగం ఏ విధంగా ఏర్పడుతుందని చెప్పబడుతుందో జ్ఞానాదుల విషయంలోను అలాగే జరుగుతుందని భావించవలెను. అనఘా, వ్యసనములు లేని వాడా.

**మూ. రజో రాగాత్మకం విద్ధి తృష్ణాఽఽసంగసముద్భవమ్ ।**
**తన్నిబధ్నాతి కౌంతేయ కర్మసంగేన దేహినమ్ ॥ 7**

**తె.అ.** కౌంతేయా! రజస్సు దృశ్యవిషయాల యందు ప్రీతితో ఉండేదని తెలుసుకో. తృష్ణను కలుగజేయునది. ఇది దేహిని కర్మములందు ఆసక్తి కలిగించి బంధిస్తుంది.

**భాష్యమ్ : 7.1 రజః రాగాత్మకం - రంజనాత్ రాగః గైరికాదివద్రాగాత్మకం విద్ధి జానీహి. తృష్ణాఽఽసంగ సముద్భవం తృష్ణా అప్రాప్తాభిలాషః, ఆసంగః ప్రాప్తే విషయే మనసః ప్రీతిలక్షణః సంశ్లేషః, తృష్ణాఽఽసంగయోః సముద్భవం తృష్ణాఽఽసంగసముద్భవమ్. తత్ రజః నిబధ్నాతి కౌంతేయ! కర్మసంగేన, దృష్టాదృష్టార్థేషు కర్మసు(రం)సంజనం తత్పరతా కర్మసంగః, తేన నిబధ్నాతి రజః దేహినమ్.**

**తె.అ.** ప్రాప్తించని వస్తువుపై అభిలాషయే తృష్ణ. ఆసంగము అంటే ప్రాప్తించిన వస్తువునందు మనఃప్రీతి లేక ఆసక్తి. తృష్ణ ఆసంగము దీనినుండి పుడుతాయి. కనుక రజస్సు రాగాత్మకమని తెలుసుకో. గైరికాది రంగులవలె అంటుకుంటుంది, మనసును రంజింపజేస్తుంది కనుక రాగాత్మకము. ఆ రజస్సు ఇహపర ఫలమునిచ్చే కర్మములందు ఆసక్తిని కల్పించి దేహిని బంధిస్తుంది. సత్త్వము నందు 'బధ్నాతి' అని చెప్పి, రజస్సున, తమస్సునందు నిబధ్నాతి అని తెలిపారు. అంటే ఈ గుణములు లెస్సగ బంధించేవని గమనించాలి.

**మూ. తమస్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్ ।**
**ప్రమాదాలస్యనిద్రాభిస్తన్నిబధ్నాతి భారత ॥ 8**

**తె.అ.** అర్జునా! మరి తమస్సు అజ్ఞానంవల్ల పుడుతుందని తెలుసుకో. అది దేహధారులందరికి మోహం కలిగిస్తుంది. అది ప్రమాదము, ఆలస్యము, నిద్రలతో బంధిస్తుంది.

**భాష్యమ్ : 8.1 తమస్త్వితి :- తమః తృతీయః గుణః, అజ్ఞానజమ్ అజ్ఞానాత్ జాతమ్ అజ్ఞానజం, విద్ధి మోహనం మోహకరమ్ అవివేకకరం, సర్వదేహినాం సర్వేషాం దేహవతాం, ప్రమాదాలస్యనిద్రాభిః ప్రమాదశ్చ ఆలస్యం చ నిద్రా చ ప్రమాదాలస్యనిద్రాః, తాభిః తత్ తమః నిబధ్నాతి భారత.**

**తె.అ.** గుణాలలో మూడవది తమస్సు. అది అజ్ఞానంవలన పుడుతుందని తెలుసుకో. అది దేహం కలవారినందరిని పొరపాటు, సోమరితనం నిద్ర - వీటితో బంధిస్తుంది.

**భాష్యమ్ : 9.0 పునః గుణానాం వ్యాపారః సంక్షేపతః ఉచ్యతే –**

**తె.అ.** గుణాలు ఏం చేస్తాయో సంక్షిప్తంగా చెపుతున్నాడు.

**మూ. సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత ।**
**జ్ఞానమావృత్య తు తమః ప్రమాదే సంజయత్యుత ॥ 9**

**తె.అ.** భారతా! సత్త్వం సుఖం మీదకు, రజస్సు కర్మలమీదకు ఆసక్తిని కలిగిస్తుంది. తమస్సు జ్ఞానాన్ని కప్పివేసి ప్రమాదంలోకి లాగుతుంది.

**భాష్యమ్ : 9.1 సత్త్వం, సుఖే సంజయతి సంశ్లేషయతి. రజః కర్మణి, హే భారత, 'సంజయతి' ఇతి అనువర్తతే. జ్ఞానం సత్త్వకృతం వివేకమ్ ఆవృత్య ఆచ్ఛాద్య తు తమః, స్వేన ఆవరణాత్మనా ప్రమాదే సంజయతి, ఉత ప్రమాదః ప్రాప్తకర్తవ్యాకరణమ్.**

**తె.అ.** అర్జునా, సత్త్వం సుఖంలో ఆసక్తుడయ్యేటట్లు చేస్తుంది. రజస్సు కర్మముల యందు, సత్త్వం వల్ల కలిగే వివేకాన్ని కప్పి తమస్సు ప్రమాదంలోకి లాగుతాయి. ప్రాప్తించిన కర్తవ్యాన్ని ఆచరించకపోవడం ప్రమాదం.

**భాష్యమ్ : 10.0 ఉక్తం కార్యం కదా కుర్వన్తి గుణాః ఇతి ఉచ్యతే –**

**తె.అ.** ఈ గుణాలు పైన చెప్పిన తమ పనులు ఎప్పుడు చేస్తాయి?

**మూ. రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత ।**
**రజస్సత్త్వం తమశ్చైవ తమస్సత్త్వం రజస్తథా ॥ 10**

**తె.అ.** భారతా! రజస్తమస్సులను అణచి సత్త్వం, సత్త్వం తమస్సులను అణచి రజస్సు, సత్త్వ రజస్సులను అణచి తమస్సు ప్రధాన గుణాలవుతాయి.

**భాష్యమ్ : 10.1 రజః తమః చ ఉభౌ అపి అభిభూయ సత్త్వం, భవతి ఉద్భవతి వర్ధతే యదా తదా లబ్ధాత్మకం సత్త్వం స్వకార్యం జ్ఞానసుఖాది ఆరభతే, హే భారత! తథా రజోగుణః సత్త్వం తమః చ అపి అభిభూయ వర్ధతే యదా తదా కర్మ తృష్ణాది స్వకార్యమ్ ఆరభతే. తమ ఆఖ్యః గుణః సత్త్వం రజశ్చ ఉభావపి అభిభూయ తథైవ వర్ధతే యదా తదా జ్ఞానావరణాది స్వకార్యమ్ ఆరభతే.**

**తె.అ.** రజస్తమస్సులను రెంటిని అణచి సత్త్వం ఉద్భవిస్తుంది, వృద్ధి చెందుతుంది. ఈ విధంగా పైకి వచ్చిన సత్త్వం తన ఫలాలను, జ్ఞానసుఖాదులను, ఆరంభిస్తుంది. అదే విధంగా

సత్త్వతమస్సులను అణచి రజస్సు పైకి వచ్చినపుడు అది తన తృష్ణాది ఫలాలను ఆరంభిస్తుంది. అట్లాగే సత్త్వ రజస్సులను అణచి తమస్సుపైకి వచ్చినపుడు అది జ్ఞానాన్ని కప్పడం వంటి తన పనులు ఆరంభిస్తుంది.

**భాష్యమ్ : 11.0 యదా యః గుణ ఉద్భూతః భవతి తదా తస్య కిం లిఙ్గమ్ ఇతి ఉచ్యతే–**

**తె.అ.** ఎప్పుడు ఏ గుణం వృద్ధిలో ఉందో తెలుసుకోవడానికి గుర్తులేవి?

**మూ. సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే ।**
**జ్ఞానం యదా తదా విద్యాత్ వివృద్ధం సత్త్వమిత్యుత ॥ 11**

**తె.అ.** ఈ దేహంలోని సర్వద్వారములయందు జ్ఞానమనే ప్రకాశం ఎప్పుడు వెలుగుతుందో అప్పుడు సత్త్వం వృద్ధి పొందినదని గుర్తించాలి.

**భాష్యమ్ : 11.1 సర్వద్వారేషు ఆత్మనః ఉపలబ్ధిద్వారాణి శ్రోత్రాదీని సర్వాణి కరణాని తేషు సర్వద్వారేషు, అన్తఃకరణస్య బుద్ధేః వృత్తిః ప్రకాశః దేహే అస్మిన్ ఉపజాయతే, తదేవ జ్ఞానం, యదా ఏవం ప్రకాశః జ్ఞానాఖ్యః ఉపజాయతే తదా జ్ఞానప్రకాశేన లిఙ్గేన విద్యాత్, వివృద్ధమ్ ఉద్భూతం, సత్త్వమ్ ఇతి, ఉత అపి.**

**తె.అ.** జ్ఞానేంద్రియాలైన శ్రోత్రాదులనే సర్వదేహద్వారములయందు అంతఃకరణమైన బుద్ధి వ్యాపారమనే వెలుగు ఎప్పుడు కలుగుతుందో (ఆత్మస్వరూపం యొక్క ప్రకాశం) అప్పుడు సత్త్వం వృద్ధిలో ఉన్నదని తెలియవలెను. ఆ వెలుగే జ్ఞానం. జ్ఞానమనే ఆ వెలుగే సత్త్వం వృద్ధిలో ఉందని తెలియడానికి గుర్తు.

**భాష్యమ్ : 12.0 రజసః ఉద్భూతస్య ఇదం చిహ్నమ్ –**

**తె.అ.** రజస్సు వృద్ధిలో ఉందనడానికి గుర్తు.

**మూ. లోభః ప్రవృత్తిరారంభః కర్మణామశమః స్పృహా ।**
**రజస్యేతాని జాయన్తే వివృద్ధే భరతర్షభ ॥ 12**

**తె.అ.** భరతవంశశ్రేష్ఠా! రజస్సు వృద్ధిచెందినపుడు లోభము, కర్మారంభము, ప్రవర్తన, అశాంతి, కోరికలు పుడతాయి.

**భాష్యమ్ : 12.1 లోభః పరద్రవ్యాదిత్సా, ప్రవృత్తిః ప్రవర్తనం సామాన్యచేష్టా, ఆరమ్భః, కస్య? కర్మణామ్. అశమః అనుపశమః, హర్షరాగాదిప్రవృత్తిః, స్పృహా సర్వసామాన్యవస్తువిషయా తృష్ణా, రజసి గుణే వివృద్ధే ఏతాని లిఙ్గాని, జాయన్తే హే భరతర్షభ.**

**తె.అ.** పరద్రవ్యమును కోరడం లోభం. ప్రవృత్తి అంటే ప్రవర్తన, ప్రతిచేష్ట. కర్మారంభమంటె పనులు చేయడానికి పూనుకోడం. హర్షము, రాగము మొదలైన వాటి కారణంగా చేసే చేష్టలు అశమం. సర్వసామాన్యమైన తృష్ణయే స్పృహ. రజస్సు వృద్ధియందున్నప్పుడు ఈ లక్షణాలు కనిపిస్తాయి.

**మూ. అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ ।**
**తమస్యేతాని జాయన్తే వివృద్ధే కురునన్దన ॥ 13**

**తె.అ.** కురునందనా! తమస్సు వృద్ధిచెందినపుడు ప్రకాశం లేకపోవడం, ఏ పని చేయాలనిపించకపోవడము, పొరపాట్లు చేయడం, మోహము పుడుతాయి.

**భాష్యమ్ : 13.1 అప్రకాశ ఇతి :- అప్రకాశః అవివేకః అత్యన్తమ్, అప్రవృత్తిః చ ప్రవృత్త్యభావః తత్కార్యం ప్రమాదః, మోహః ఏవ చ అవివేకః, మూఢతా ఇత్యర్థః. తమసి గుణే వివృద్ధే ఏతాని లిఙ్గాని జాయన్తే, హే కురునన్దన.**

**తె.అ.** అప్రకాశమంటే వివేకం లేకపోవడం. దీని ఫలితం అప్రవృత్తి, అంటే ఏ పనిని చేయబూనవలెనని అనిపించకపోవడం. ప్రమాదము (పొరపాటు) మోహము అంటే అవివేకము మూఢత్వము కూడా దాని ఫలితాలే. తమస్సు వృద్ధిచెందినప్పుడు కలిగే లక్షణాలు.

**భాష్యమ్ : 14.0 మరణద్వారేణాపి యత్ ఫలం ప్రాప్యతే తదపి సంగరాగహేతుకం సర్వం గౌణమ్ ఏవ ఇతి దర్శయన్నాహ –**

**తె.అ.** చావు తరువాత కలిగే ఫలానికి కూడా ఆసక్తి, కోరికలే కారణం. ఆ ఫలం గుణాలవల్ల కలిగేదే.

**మూ. యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రళయం యాతి దేహభృత్ ।**
**తదోత్తమవిదాం లోకానమలాన్ ప్రతిపద్యతే ॥ 14**

**తె.అ.** సత్త్వం వృద్ధి చెందిన సమయంలో మరణించువాడు ఉత్తమజ్ఞానులు వెళ్ళే నిర్మలమైన లోకాలకు చేరతాడు.

**భాష్యమ్ : 14.1 యదా సత్త్వే, ప్రవృద్ధే ఉద్భూతే, తు, ప్రలయం మరణం, యాతి ప్రతిపద్యతే, దేహభృత్ ఆత్మా, తదా ఉత్తమవిదాం మహదాదితత్త్వవిదామ్ ఇత్యేతత్. లోకాన్ అమలాన్ మలరహితాన్, ప్రతిపద్యతే, ప్రాప్నోతి ఇత్యేతత్.**

**తె.అ.** సత్త్వం వృద్ధిలోనున్నపుడు మరణించినవాడు మహత్తు మొదలైనవాటి తత్త్వం తెలిసినవారు వెళ్ళే నిర్మలమైన లోకాలకు (బ్రహ్మలోకాది) జీవుడు వెళుతాడు.

**మూ. రజసి ప్రలయం గత్వా కర్మసంగిషు జాయతే ।**
**తథా ప్రలీనస్తమసి మూఢయోనిషు జాయతే ॥ 15**

**తె.అ.** రజస్సు ప్రధానంగా ఉన్నపుడు మరణించినవాడు కర్మలయందు ఆసక్తిగలవారియందు పుడుతాడు. తమస్సులో మరణించినవాడు మూఢుల గర్భంలో జన్మిస్తాడు.

**భాష్యమ్ : 15.1 రజసి గుణే ప్రవృద్ధే, ప్రళయం మరణం, గత్వా ప్రాప్య, కర్మసంగిషు కర్మాసక్తియుక్తేషు మనుష్యేషు జాయతే. తథా తద్వదేవ, ప్రలీనః మృతః, తమసి ప్రవృద్ధే, మూఢయోనిషు పశ్వాదియోనిషు జాయతే.**

**తె.అ.** రజోగుణం ప్రవృద్ధంగా ఉన్నప్పుడు మరణించినవాడు కర్మలయందు ఆసక్తిగల మనుష్యులందు పుడుతాడు. అట్లాగే తమస్సు వృద్ధిలోనున్నపుడు మరణించినవాడు మూఢయోనులందు జన్మిస్తారు.

**భాష్యమ్ : 16.0 అతీతశ్లోకార్థస్యైవ సంక్షేపః ఉచ్యతే –**

**తె.అ.** వెనుక చెప్పిన శ్లోకాల సారమే సంక్షేపంగా చెప్పబడుతున్నది.

**మూ. కర్మణః సుకృతస్యాహుః సాత్త్వికం నిర్మలం ఫలమ్ ।**
**రజసస్తు ఫలం దుఃఖమజ్ఞానం తమసః ఫలమ్ ॥ 16**

**తె.అ.** పుణ్యకర్మలవల్ల నిర్మలమైన సాత్త్వికఫలం కలుగుతుంది. కాని రాజసిక కర్మలకు ఫలం దుఃఖం, తామసిక కర్మలకు ఫలం అజ్ఞానం.

**భాష్యమ్ : 16.1 కర్మణః సుకృతస్య సాత్త్వికస్యేత్యర్థః. ఆహుః శిష్టాః సాత్త్వికమ్ ఏవ నిర్మలం ఫలమ్ ఇతి. రజసః తు ఫలం దుఃఖం రాజసస్య కర్మణః ఇత్యర్థః – కర్మాధికారాత్. ఫలమపి దుఃఖమేవ కారణానురూప్యాత్ రాజసమేవ. తథా అజ్ఞానం తమసః తామసస్య కర్మణః అధర్మస్య ఫలం పూర్వవత్. కించ గుణేభ్యః భవతి –?**

**తె.అ.** పుణ్యకర్మలంటె సాత్త్వికకర్మలని అర్థం. ఆ కర్మలకు నిర్మలమైన సాత్త్వికఫలమని శిష్టులంటారు. రాజసిక కర్మలకు ఫలం దుఃఖమే. కారణానికి తగినట్లుగా ఫలం కూడా రాజసికమే. తామసిక కర్మలంటె పాపకర్మలు. వెనుకటివలె దీనిఫలంకూడా తామసికమే, అంటే అజ్ఞానం. గుణాలవల్ల ఇంకా ఏం కలుగుతుంది?

**మూ. సత్త్వాత్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ ।**
**ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞానమేవ చ ॥ 17**

**తె.అ.** సత్త్వంవలన జ్ఞానం కలుగుతుంది. రజస్సువలన లోభము. తమస్సువలన పొరబాటు పడడం, మోహమే కాక అజ్ఞానం కూడా కలుగుతుంది.

**భాష్యమ్ : 17.1 సత్త్వాత్ లబ్ధాత్మకాత్, సంజాయతే సముత్పద్యతే, జ్ఞానం, రజసః లోభః ఏవ చ, ప్రమాదమోహౌ చ ఉభౌ తమసః గుణాత్ భవతః, అజ్ఞానమ్ ఏవ చ.**

**తె.అ.** సత్త్వం ప్రధానమైనపుడు జ్ఞానం కలుగుతుంది. రజస్సువలన లోభము, తమస్సు వలన ప్రమాదము మోహమేకాక అజ్ఞానం కూడా కలుగుతుంది.

**మూ. ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా మధ్యే తిష్ఠన్తి రాజసాః ।**
**జఘన్యగుణవృత్తస్థా అధో గచ్ఛన్తి తామసాః ॥ 18**

**తె.అ.** సత్త్వమందుండువారు దేవలోకాలకు వెళతారు. రజోగుణకార్యులు మధ్యలో (మనుష్యలోకంలో) నిలుస్తారు. చివరిగుణమైన తమస్సులో ఉండేవారు అధోగతి (పశ్వాది జన్మలు) పొందుతారు.

**భాష్యమ్ : 18.1 ఊర్ధ్వం గచ్ఛన్తి దేవలోకాదిషు ఉత్పద్యన్తే, సత్త్వస్థాః సత్త్వగుణవృత్తస్థాః. మధ్యే తిష్ఠన్తి మనుష్యేషు ఉత్పద్యన్తే రాజసాః. జఘన్యగుణవృత్తస్థాః – జఘన్యః చ అసౌ గుణః చ జఘన్యగుణః, తమః తస్య వృత్తం నిద్రాలస్యాది. తస్మిన్ స్థితాః జఘన్యగుణవృత్తస్థాః మూఢాః, అధః గచ్ఛన్తి, పశ్వాదియోనిషు ఉత్పద్యన్తే తామసాః.**

**తె.అ.** సత్త్వగుణంలో ప్రవర్తించేవారు, సాత్త్వికప్రవర్తన కలవారు, పైకి వెళుతారు, అంటే దేవలోకాదులందు పుడుతారు. రాజస ప్రవృత్తిగలవారు మనుష్యులలో పుడుతారు. అన్నిటికంటే తక్కువగుణమైన తమస్సులో ప్రవర్తించేవారు, అంటే నిద్ర, సోమరితనము లక్షణమైన మూఢులు, అధోగతి పొందుతారు, పశువులు మొదలైన వాటి గర్భములందు పుడుతారు.

**భాష్యమ్ : 19.0 'పురుషస్య ప్రకృతిస్థత్వరూపేణ మిథ్యాజ్ఞానేన యుక్తస్య భోగ్యేషు గుణేషు సుఖదుఃఖమోహాత్మకేషు, 'సుఖీ దుఃఖీ మూఢః అహమ్ అస్మి' ఇత్యేవం రూపః యః సంగః తత్ కారణం పురుషస్య సదసద్యోనిజన్మప్రాప్తిలక్షణస్య సంసారస్య' ఇతి పూర్వాధ్యాయే సమాసేన యత్ ఉక్తం తత్ ఇహ 'సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః' (14.5) ఇత్యారభ్య గుణస్వరూపం గుణవృత్తం స్వవృత్తేన చ గుణానాం బన్ధకత్వం గుణవృత్తనిబద్ధస్య చ పురుషస్య యా గతిః ఇత్యేతత్ సర్వం మిథ్యాజ్ఞానమ్ అజ్ఞానమూలం బన్ధకారణం విస్తరేణ ఉక్త్వా అధునా సమ్యగ్దర్శనాత్ మోక్షః వక్తవ్యః ఇత్యాహ భగవాన్ –**

**తె.అ.** వెనుకటి అధ్యాయంలో ప్రకృతియందున్న పురుషునికి మిథ్యాజ్ఞానంచేత ప్రకృతి గుణాలయందు కలిగే సంగమే సదసద్యోనులందు పుట్టడమనే లక్షణంగల సంసారానికి కారణమని

చెప్పబడింది. ఇది సుఖదుఃఖ మోహాత్మకమైనది. నేను సుఖిని దుఃఖిని మూఢుణ్ణి ఈ విధమైన సంగము. ఈ అధ్యాయంలో 'సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతి సంభవాః' (14.5) అన్న శ్లోకంతో ఆరంభించి గుణాలస్వరూపము, వాటి ప్రభావము, వాటివర్తనంతో అవి ఎట్లా బంధకా-లవుతాయి, గుణబద్ధుడైనవానిగతి ఏమి? ఈ విధంగా మిథ్యాజ్ఞాన మూలకమైన బంధకారణమంతా చెప్పి ఇక ఇప్పుడు సమ్యగ్దర్శనం వలన మోక్షం చెప్పవలెనని భగవానుడు అంటున్నాడు -

**మూ. నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టాఽనుపశ్యతి ।**
**గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి ॥ 19**

**తె.అ.** గుణాలకంటె అన్యుడైన కర్త మరొకడు లేడని తెలిసి, గుణాలకంటె పరమైనదానిని ఎప్పుడు తెలుసుకుంటాడో అప్పుడతడు నా భావమును పొందుతాడు.

**భాష్యమ్ : 19.1 న అన్యం కార్యకరణవిషయాకారపరిణతేభ్యః గుణేభ్యః కర్తారమ్ అన్యం యదా ద్రష్టా విద్వాన్ సన్ న అనుపశ్యతి. గుణాః ఏవ సర్వావస్థాః సర్వకర్మణాం కర్తారః ఇత్యేవం పశ్యతి. గుణేభ్యః చ పరం గుణవ్యాపారసాక్షిభూతం వేత్తి మద్భావం మమ భావం వాసుదేవత్వం 'వాసుదేవః సర్వం' (7.19) ఇత్యేవం పశ్యన్ సన్ సః ద్రష్టా అధిగచ్ఛతి.**

**తె.అ.** కార్యకరణ విషయాల ఆకారంగా మారిన గుణాలుతప్ప మరొక కర్త లేడని జ్ఞాని ఎప్పుడు చూడగలుగుతాడో, సర్వావస్థలలో సర్వకర్మలు చేస్తున్నది గుణాలేనని చూస్తాడో, గుణాలకతీతమై గుణాలు చేసే పనులను చూస్తూ ఉండేవానిని చూచినవాడు సర్వమును వాసుదేవునిగా చూస్తాడు, నా భావమును వాసుదేవతత్త్వమును పొందుతాడు.

**భాష్యమ్ : 20.0 కథమధిగచ్ఛతీత్యుచ్యతే -**

**తె.అ.** ఎట్లా పొందుతాడు?

**మూ. గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్ ।**
**జన్మమృత్యుజరాదుఃఖైర్విముక్తోఽమృతమశ్నుతే ॥ 20**

**తె.అ.** దేహోత్పత్తికి కారణమైన ఈ మూడుగుణాలను అతిక్రమించి దేహి జన్మమృత్యుజరా దుఃఖములనుండి విముక్తుడై అమృతత్వమును పొందుతాడు.

**భాష్యమ్ : 20.1 గుణానేతాన్ యథోక్తాన్ అతీత్య జీవన్నేవ అతిక్రమ్య, మాయోపాధిభూతాన్ త్రీన్ దేహీ, దేహ సముద్భవాన్ దేహోత్పత్తిబీజభూతాన్ జన్మమృత్యుజరాదుఃఖైః జన్మ చ మృత్యుః**

**చ జరా చ దుఃఖాని చ తైః జీవన్నేవ విముక్తః సన్ విద్వాన్ అమృతమ్ అశ్నుతే. ఏవం మద్భావం అధిగచ్ఛతీత్యర్థః.**

**తె.అ.** మాయకు ఉపాధులై దేహోత్పత్తికి బీజమైన ఈ మూడు గుణాలను దేహి జీవించి ఉండగనే అతిక్రమించి పుట్టుక, చావు ముసలితనము మొదలైన దుఃఖములనుండి, ముక్తుడై జ్ఞాని అమృతత్త్వమును పొందుతాడు, నా భావమును పొందుతాడు అని అర్థం.

**భాష్యమ్ : 21.0 జీవన్నేవ గుణానతీత్య అమృతమ్ అశ్నుతే ఇతి ప్రశ్నబీజం ప్రతిలభ్య–**

**తె.అ.** జీవించి ఉండగనే గుణాలను అతిక్రమించి అమృతత్త్వం పొందుతాడు అన్నదానిలో ప్రశ్నకు అవకాశం కనిపించి –

**అర్జున ఉవాచ –**

**మూ. కైర్లింగైః త్రీన్గుణానేతానతీతో భవతి ప్రభో ।**
**కిమాచారః కథం చైతాంస్త్రీన్గుణానతివర్తతే ॥ 21**

అర్జునుడు అడుగుతున్నాడు.

**తె.అ.** ఈ త్రిగుణాలను అతిక్రమించినవాని గుర్తులేవి? అతని ప్రవర్తన ఎట్లా ఉంటుంది? ఈ త్రిగుణాలనెట్లా అతిక్రమిస్తాడు?

**భాష్యమ్ : 21.1 కైః లింగైః చిహ్నైః త్రీన్ ఏతాన్ వ్యాఖ్యాతాన్ గుణాన్ అతీతః అతిక్రాన్తః భవతి ప్రభో. కిమాచారః కః అస్య ఆచారః ఇతి కిమాచారః కథం కేన చ ప్రకారేణ ఏతాన్ త్రీన్ గుణాన్ అతివర్తతే, అతీత్య వర్తతే.**

**తె.అ.** ఇప్పుడు వర్ణించిన ఈ మూడుగుణాలను అతిక్రమించినవాని గుర్తులేవి? ఇతని ఆచారమెటువంటిది? ఈ గుణాలను అతిక్రమించిన తరువాత అతడు ఎట్లా ప్రవర్తిస్తాడు?

**భాష్యమ్ : 22.0 గుణాతీతస్య లక్షణం గుణాతీతత్వోపాయం చ అర్జునేన పృష్టః అస్మిన్ శ్లోకే ప్రశ్నద్వయార్థం ప్రతివచనమ్ –**

**తె.అ.** గుణాతీతుని లక్షణం, గుణాలను అతిక్రమించడానికి ఉపాయం అడిగాడు అర్జునుడు. ఈ రెండు ప్రశ్నలకు ప్రతివచనం ఇస్తున్నాడు భగవానుడు ఈ శ్లోకంలో –

**శ్రీ భగవానువాచ –**

**మూ. ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాండవ ।**
**న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి ॥ 22**

శ్రీభగవానుడంటున్నాడు –

**తె.అ.** అర్జునా, ప్రకాశము, ప్రవృత్తి, మోహము కలిగినపుడు వాటిని ద్వేషించడు, అవి తొలగినపుడు వాటిని కోరడు.

**భాష్యమ్ : 22.1 ప్రకాశం చ సత్త్వకార్యం, ప్రవృత్తిం చ రజఃకార్యం, మోహమ్ ఏవ చ తమః కార్యమ్ ఇత్యేతాని న ద్వేష్టి సంప్రవృత్తాని, సమ్యక్ విషయభావేన ఉద్భూతాని. మమ తామసః ప్రత్యయః జాతః, తేన అహం మూఢః తథా రాజసీ ప్రవృత్తిః మమ ఉత్పన్నా దుఃఖాత్మికా, తేనాహం రజసా ప్రవర్తితః ప్రచలితః స్వరూపాత్, కష్టం మమ వర్తతే యః అయం మత్స్వరూపావస్థానాత్ భ్రంశః. తథా సాత్త్విక గుణః ప్రకాశాత్మా మాం వివేకిత్వమ్ ఆపాదయన్ సుఖేన చ సంజయన్ బధ్నాతి ఇతి తాని ద్వేష్టి అసమ్యగ్దర్శిత్వేన. తదేవం గుణాతీతః న ద్వేష్టి సంప్రవృత్తాని. యథా చ సాత్త్వికాది పురుషః సత్త్వాది కార్యాణి ఆత్మానం ప్రతి ప్రకాశ్య నివృత్తాని కాఙ్క్షతి న తథా గుణాతీతః నివృత్తాని కాఙ్క్షతి ఇత్యర్థః. ఏతత్ న పరప్రత్యక్షం లింగం, కిం తర్హి స్వాత్మప్రత్యక్షత్వాత్ ఆత్మవిషయమేవ ఏతత్ లక్షణమ్. న హి స్వాత్మవిషయం ద్వేషమ్ ఆకాంక్షాం వా పరః పశ్యతి.**

**తె.అ.** సత్త్వంవల్ల ప్రకాశము రజస్సువల్ల ప్రవృత్తి తమస్సువల్ల మోహము కలుగుతున్నాయి. ఇవి విషయరూపంలో స్పష్టంగా తెలిసేటట్లు ప్రవర్తించినప్పుడు వాటిని ద్వేషించడు. 'నాకు తామసబుద్ధి కలుగుతున్నది. దానివల్ల నేను మూఢుణ్ణి అయినాను. నాకు దుఃఖలక్షణమైన రాజసప్రవృత్తి కలుగుతున్నది. దానివల్ల స్వరూపంనుండి భ్రష్టుడనై కష్టపడుతున్నాను. ప్రకాశలక్షణమైన సత్త్వం వివేకాన్ని ఆపాదించి సుఖంతో తగులుకొలిపి నన్ను బంధిస్తున్నది'. సమ్యగ్దర్శనం లేనివాడు ఈ విధంగా వాటిని ద్వేషిస్తాడు. గుణాతీతుడు అవి ఉత్పన్నమైనపుడు వాటిని ద్వేషించడు. సాత్త్వికాది గుణాలు కలిగినవాడు వాటి ఫలాలను తనలో ప్రకాశింపచేసుకుని అవి తొలగినపుడు వాటిని కోరుతాడు. గుణాతీతుడు తొలగినవాటిని ఆ విధంగా కోరడు. ఈ లక్షణం బయటివానికి తెలిసేది కాదు. తనలోనిది కనక తనకు మాత్రమే తెలిసేది. స్వాత్మవిషయమైన ద్వేషంకాని ఆకాంక్షగాని బయటివాడు చూడలేడు.

**భాష్యమ్ : 23.0 అథ ఇదానీం 'గుణాతీతః కిమాచారః' ఇతి ప్రశ్నస్య ప్రతివచనమ్ ఆహ–**

**తె.అ.** ఇప్పుడు గుణాతీతుని ఆచారం ఏ విధంగా ఉంటుంది. అన్న ప్రశ్నకు సమాధానం–

**మూ. ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే ।**
**గుణా వర్తంత ఇత్యేవ యోఽవతిష్ఠతి నేంగతే ॥ 23**

**తె.అ.** ఉదాసీనునివలె ఆసీనుడై గుణాలచేత కలతచెందక ఉంటాడు, గుణాలు వాటి పని అవి చేస్తున్నాయి అని చలించక ఉంటాడు.

**భాష్యమ్ : 23.1 ఉదాసీనవత్ యథా ఉదాసీనః న కస్యచిత్ పక్షం భజతే తథా అయం గుణాతీతత్వోపాయమార్గే అవస్థితః ఆసీనః ఆత్మవిత్ గుణైః యః సంన్యాసీ న విచాల్యతే వివేకదర్శ-నావస్థాతః. తత్ ఏతత్ స్ఫుటీకరోతి – గుణాః కార్యకరణవిషయాకారపరిణతాః అన్యోన్యస్మిన్ వర్తన్తే ఇతి యః అవతిష్ఠతి. ఛన్దోభఙ్గభయాత్ పరస్మైపదప్రయోగః. 'యోఽనుతిష్ఠతి' ఇతి వా పాఠాన్తరమ్. న ఇఙ్గతే న చలతి, స్వరూపావస్థః ఏవ భవతీత్యర్థః. కించ**

**తె.అ.** గుణాతీత స్థితికి చేర్చగల దారిలో ఉన్న ఆత్మవిదుడు ఉదాసీనునివలె ఉంటాడు. ఉదాసీనుడు అంటే ఏ పక్షము వహించనివాడు. వివేక దర్శనంగల అటువంటి సన్యాసి గుణాలవలన చలించడు. దీన్నే స్పష్టం చేస్తున్నాడు. కార్యకరణ విషయాల ఆకారంగా మారిన గుణాలు అన్యోన్యము వర్తిస్తున్నాయి. ఒకదానిపై మరొకటి పని చేస్తున్నాయి, అని తెలిసి ఉంటాడు. స్వరూపం నుండి చలించడు. ఛందోభంగం కాకుండడం కొరకు 'అవతిష్ఠతే' అనే ఆత్మనేపద రూపం కాక 'అవతిష్ఠతి' అని పరస్మైపదరూపం ప్రయోగించబడింది. లేక 'అనుతిష్ఠతి' అనే పాఠాంతరమైనా గ్రహించాలి. అంతేకాదు –

**మూ. సమదుఃఖసుఖః స్వస్థః సమలోష్టాశ్మకాంచనః ।**
**తుల్యప్రియాప్రియో ధీరస్తుల్యనిందాత్మసంస్తుతిః ॥ 24**

**తె.అ.** స్వస్థునికి సుఖము దుఃఖము ఒక్కటే. మట్టిముద్ద, రాయి, బంగారము ఒక్కటే. ప్రియము, అప్రియము, నింద, ఆత్మస్తుతి ఆ ధీరునకు ఒక్కటే.

**భాష్యమ్ : 24.1 సమదుఃఖసుఖః – సమే దుఃఖసుఖే యస్య సః సమదుఃఖసుఖః స్వస్థః స్వే ఆత్మని స్థితః ప్రసన్నః, సమలోష్టాశ్మకాఞ్చనః – లోష్టం చ అశ్మా చ కాఞ్చనం చ లోష్టాశ్మకాంచనాని సమాని యస్య సః సమలోష్టాశ్మకాఞ్చనః. తుల్యప్రియాప్రియః – ప్రియం చ అప్రియం చ ప్రియాప్రియే తుల్యే సమే యస్య సః అయం తుల్యప్రియాప్రియః. ధీరః ధీమాన్ తుల్యనిన్దాత్మ సంస్తుతిః నిన్దా చ ఆత్మసంస్తుతిశ్చ నిన్దాత్మసంస్తుతీ, తుల్యే నిన్దాత్మసంస్తుతీ యస్య యతేః సః తుల్యనిన్దాత్మసంస్తుతిః.**

**తె.అ.** దుఃఖము సుఖము స్వస్థునకు ఒక్కటే. తన ఆత్మయందుండువాడు స్వస్థుడు. (స్వాస్థ్యమంటే స్వాత్మస్థితి) మట్టిముద్ద రాయి బంగారము అతనికి సమానము. అతనికి ప్రియము అప్రియము సమము. అతడు ధీరుడు అంటే ధీమంతుడు. ఆ యతికి నింద ఆత్మసంస్తుతి సమానము. అంతేకాదు.

**మూ. మానాపమానయోస్తుల్యస్తుల్యో మిత్రారిపక్షయోః ।**
**సర్వారంభపరిత్యాగీ గుణాతీతః స ఉచ్యతే ॥ 25**

**తె.అ.** అతనికి మానావమానాలు ఒక్కటే. మిత్రపక్షము శత్రుపక్షము ఒక్కటే. ఏ కర్మను చేయనారంభించడు. అట్టివానిని గుణాతీతుడంటారు.

**భాష్యమ్ : 25.1 మానాపమానయోః తుల్యః సమః నిర్వికారః, తుల్యః మిత్రారిపక్షయోః. యద్యపి ఉదాసీనాః భవన్తి కేచిత్ స్వాభిప్రాయేణ, తథాపి పరాభిప్రాయేణ మిత్రారిపక్షయోః ఇవ భవన్తి ఇతి. అయం తు తుల్యః మిత్రారిపక్షయోః ఇత్యాహ. సర్వారమ్భపరిత్యాగీ దృష్టాదృష్టార్థాని కర్మాణి ఆరభ్యన్తే ఇతి ఆరమ్భాః, సర్వాన్ ఆరమ్భాన్ పరిత్యక్తుం శీలమ్ అస్య ఇతి సర్వారమ్భపరిత్యాగీ. దేహధారణమాత్రనిమిత్తవ్యతిరేకేణ సర్వకర్మ పరిత్యాగీ ఇత్యర్థః. గుణాతీతః సః ఉచ్యతే.**

**తె.అ.** మానావమానాలయందు సముడు, నిర్వికారుడు. కొందరు తాము ఉదాసీనులమని అనుకుంటారు. అయినా ఇతరులు వారిని మిత్రులని శత్రువులని అభిప్రాయపడతారు. అందుకని అంటున్నాడు. మిత్రశత్రు పక్షాలయందు సముడు, ఏ పక్షమూ వహించనివాడు అని. (తనకు మిత్రులు శత్రువులు లేరు. మిత్రశత్రుపక్షాలంటే తనను మిత్రునిగా శత్రువునిగా భావించేవారి పక్షాలయందు అని) ఇహంలో పరంలో ప్రయోజనాలను ఆశించి చేసే కర్మలు ఆరంభములు. అన్ని ఆరంభములను వదలినవాడు. దేహధారణమాత్ర ప్రయోజనమైన కర్మలు తప్ప మరేమీ చేయనివాడు.

**భాష్యమ్ : 26.0 'ఉదాసీనవత్' ఇత్యాది 'గుణాతీతః స ఉచ్యతే' (23.25) ఇత్యేతదన్తమ్ ఉక్తం యావత్ యత్నసాధ్యం తావత్ సంన్యాసినః అనుష్ఠేయం గుణాతీతత్వసాధనం ముముక్షోః. స్థిరీభూతం తు స్వసంవేద్యం సత్ గుణాతీతస్య యతేః లక్షణం భవతి ఇతి. 'అధునా కథం చ త్రీన్ గుణాన్ అతివర్తతే' ఇతి ప్రశ్నస్య ప్రతివచనమ్ ఆహ –**

**తె.అ.** 'ఉదాసీనవత్' మొదలు 'గుణాతీతః స ఉచ్యతే' (23.25) వరకు చెప్పినది యత్నంచేత సాధించదగింది. గుణాలను అతిక్రమించదలచిన ముముక్షువైన సంన్యాసి దానిని అనుష్ఠించాలి. ఇక ఇప్పుడు త్రిగుణాలను అతిక్రమించడమెట్లా అనే ప్రశ్నకు సమాధానం–

**మూ. మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే ।**
**స గుణాన్ సమతీత్యైతాన్బ్రహ్మభూయాయ కల్పతే ॥ 26**

**తె.అ.** ఎవడు అచంచలమైన భక్తితో నన్ను సేవిస్తాడో అతడు ఈ గుణాలను అతిక్రమించి బ్రహ్మభావమును పొందడానికి సమర్థుడవుతాడు.

**భాష్యమ్ : 26.1 మాం చ ఈశ్వరం నారాయణం సర్వభూతహృదయాశ్రితం యః యతిః కర్మీ వా అవ్యభిచారేణ న కదాచిత్ యః వ్యభిచరతి, భక్తియోగేన – భజనం భక్తిః, సైవ యోగః తేన భక్తియోగేన, సేవతే, సః గుణాన్ సమతీత్య, ఏతాన్ యథోక్తాన్, బ్రహ్మభూయాయ భవనం భూయః, బ్రహ్మభూయాయ బ్రహ్మభవనాయ మోక్షాయ, కల్పతే సమర్థః భవతి ఇత్యర్థః.**

**తె.అ.** చెదరని భక్తి అంటే నిరంతరము సేవించడము. అదే వివేక విజ్ఞానాత్మకమైన యోగం. ఆ భక్తియోగం భగవదనుగ్రహంవల్ల కలుగుతుంది. అటువంటి భక్తియోగంతో ఎవడు, (జ్ఞానిగాని, కర్మిగాని) నన్ను ఈశ్వరుడనైన నారాయణుని నిరంతరము సేవిస్తాడో అతడు గుణాలను అతిక్రమించి బ్రహ్మభావమును అంటే మోక్షమును పొందడానికి సమర్థుడవుతాడు అని అర్థం.

**భాష్యమ్ : 27.0 కుతః ఏతత్ ఇతి ఉచ్యతే –**

**తె.అ.** ఎట్లా చెప్పగలవు అంటే –

**మూ. బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహమమృతస్యావ్యయస్య చ ।**
**శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాంతికస్య చ ॥ 27**

**తె.అ.** అమృతము, అవ్యయము, శాశ్వతము, ధర్మం చేత పొందదగినది, నిరతిశయ ఆనంద స్వరూపము అయిన బ్రహ్మము నాయందు ప్రతిష్ఠితము.

**ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా – సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే గుణత్రయవిభాగయోగోనామ చతుర్దశోఽధ్యాయః.**

ఇది వ్యాసభగవానుని శతసహస్రసంహిత అయిన శ్రీమహాభారతంలో భీష్మపర్వంలో ఉపనిషత్తులు బ్రహ్మవిద్య యోగశాస్త్రం శ్రీకృష్ణార్జున సంవాదము అయిన భగవద్గీతల యందు గుణత్రయవిభాగయోగం అనే పదునాల్గవ అధ్యాయానికి తెలుగు అనువాదం.

**భాష్యమ్ : 27.1 బ్రహ్మణః పరమాత్మనః, హి యస్మాత్, ప్రతిష్ఠా అహం, ప్రతితిష్ఠతి అస్మిన్నితి ప్రతిష్ఠా, అహం ప్రత్యగాత్మా. కీదృశస్య బ్రహ్మణః? అమృతస్య అవినాశినః అవ్యయస్య అవికారిణః, శాశ్వతస్య చ నిత్యస్య, ధర్మస్య ధర్మజ్ఞానస్య జ్ఞానయోగధర్మప్రాప్యస్య, సుఖస్య ఆనన్దరూపస్య, ఐకాన్తికస్య అవ్యభిచారిణః. అమృతాదిస్వభావస్య పరమానందరూపస్య పరబ్రహ్మణః ప్రత్యగాత్మా ప్రతిష్ఠా. సమ్యగ్జ్ఞానేన పరమాత్మతయా నిశ్చీయతే, తదేతత్**

**'బ్రహ్మభూయాయ కల్పతే' ఇత్యుక్తమ్. యయా చ ఈశ్వరశక్త్యా భక్తానుగ్రహాది ప్రయోజనాయ బ్రహ్మ ప్రతితిష్ఠతే ప్రవర్తతే సా శక్తిః బ్రహ్మైవ అహమ్, శక్తి శక్తిమతోః అనన్యత్వాత్ ఇత్యభిప్రాయః.**

**తె.అ.** ప్రత్యగాత్మనైన నేను పరమాత్మ అయిన బ్రహ్మమునకు ప్రతిష్ఠ, అంటే నివాసస్థానము. బ్రహ్మమెటువంటిది? అమృతము, వినాశము లేనిది. అవ్యయము, మార్పు చెందనిది, శాశ్వతము, నిత్యమైనది. ధర్మము, జ్ఞానయోగ ధర్మంద్వారా పొందదగినది. ఐకాంతిక సుఖము, చెదరని ఆనందరూపము. ఇటువంటి పరమానంద రూపమైన పరమాత్మకు నివాసస్థానము ప్రత్యగాత్మయేనని సమ్యగ్జ్ఞానం చేత నిశ్చయించబడుతుంది. 'బ్రహ్మభూయాయ కల్పతే' అని వెనుకటి శ్లోకంలో చెప్పిందిదే. భక్తానుగ్రహాది ప్రయోజనం కొరకు ఏ ఈశ్వరశక్తితో బ్రహ్మము ప్రవర్తిస్తున్నదో ఆ శక్తి నేనే, అంటే బ్రహ్మమును. శక్తి శక్తిమంతుడు వేరుకాలేరు కనుక.

**భాష్యమ్ : 27. అథవా బ్రహ్మశబ్దవాచ్యత్వాత్ సవికల్పకం బ్రహ్మ. తస్య బ్రహ్మణః నిర్వికల్పకః అహమేవ, న అన్యః, ప్రతిష్ఠా ఆశ్రయః. కింవిశిష్టస్య? అమృతస్య అమరణధర్మస్య, అవ్యయస్య వ్యయరహితస్య. కిం చ శాశ్వతస్య నిత్యస్య ధర్మస్య జ్ఞాననిష్ఠాలక్షణస్య, సుఖస్య తజ్జనితస్య ఐకాన్తికస్య ఏకాన్తనియతస్య చ 'ప్రతిష్ఠా అహమ్' ఇతి అనువర్తతే.**

**తె.అ.** లేక, బ్రహ్మమంటే ఇక్కడ సవికల్పకబ్రహ్మము అని చెప్పుకోవచ్చు. ఆ బ్రహ్మమునకు నిర్వికల్పుడనైన నేను కాక మరివేరు ఆశ్రయము లేదు. ఆ బ్రహ్మముయొక్క లక్షణాలేవి? అమృతము, మరణమనే ధర్మంలేనిది, అవ్యయము, మార్పులేనిది. అంతేకాదు, శాశ్వతము, నిత్యమైనది. ధర్మము, జ్ఞాననిష్ఠాలక్షణం గలది. సుఖము ఆ జ్ఞానంవల్ల కలిగిన ఆనందము, ఐకాంతికము, నిశ్చయరూపమైనది. అటువంటి బ్రహ్మమునకు ప్రతిష్ఠ నేను అని చెప్పుకోవచ్చును.

**ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యగోవిన్దభగవత్పూజ్యపాదశిష్యశ్రీమచ్ఛఙ్కరభగవతః కృతౌశ్రీమద్భగవద్గీతాభాష్యే గుణత్రయవిభాగయోగో నామ చతుర్దశోఽధ్యాయః**

ఇది శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్య గోవింద భగవత్పూజ్యపాద శిష్యులు శ్రీమత్ శంకర భగవత్పాదులు రచించిన శ్రీ మద్భగవద్గీతా భాష్యంలో గుణత్రయవిభాగయోగమనే పదునాల్గవ అధ్యాయానికి తెలుగు అనువాదం.



# పంచదశోఽధ్యాయః

# పురుషోత్తమయోగః

**భాష్యమ్ : 1.0 యస్మాత్ మదధీనం కర్మిణాం కర్మఫలం జ్ఞానినాం చ జ్ఞానఫలమ్ అతః భక్తియోగేన మాం యే సేవన్తే తే మత్ప్రసాదాత్ జ్ఞానప్రాప్తిక్రమేణ గుణాతీతాః మోక్షం గచ్ఛన్తి, కిము వక్తవ్యమ్ ఆత్మనః తత్త్వమేవ సమ్యక్ విజానన్తః ఇత్యతః భగవాన్ అర్జునేన అపృష్టమపి ఆత్మనః తత్త్వం వివక్షుః ఉవాచ – 'ఊర్ధ్వమూలమ్' ఇత్యాదినా. తత్ర తావత్ వృక్షరూపకల్పనయా వైరాగ్యహేతోః సంసారస్వరూపం వర్ణయతి. విరక్తస్య హి సంసారాత్ భగవత్తత్త్వజ్ఞానే అధికారః న అన్యస్య ఇతి.**

**తె.అ.** కర్మలు చేయువారి కర్మఫలము, జ్ఞానుల జ్ఞానఫలము నా అధీనములోనివి. కనుక భక్తియోగంతో ఎవరు నన్ను సేవిస్తారో వారు నా ప్రసాదం వలన జ్ఞానమును పొంది గుణాలను అతిక్రమించి మోక్షాన్ని పొందుతారు. మరి ఆత్మతత్త్వం సరిగా తెలిసినవారి విషయం చెప్పడమెందుకు? కనుక భగవానుడు అర్జునుడు అడుగకపోయినా ఆత్మతత్త్వం చెప్పగోరి 'ఊర్ధ్వమూలం'తో మొదలుపెట్టి చెపుతున్నాడు. ఇక్కడ ముందుగా వైరాగ్యహేతువుగా వృక్షరూప కల్పనతో సంసారస్వరూపాన్ని వర్ణిస్తున్నాడు. సంసారంపై విరక్తి కలిగిన వానికే భగవత్తత్త్వం తెలుసుకోవడానికి అధికారం ఉంది. విరక్తి కలగనివానికి లేదు అని.

**శ్రీ భగవానువాచ –**

**మూ. ఊర్ధ్వమూలమధఃశాఖమశ్వత్థం ప్రాహురవ్యయమ్ ।**
**ఛన్దాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్ ॥ 1**

శ్రీ భగవానుడు అంటున్నాడు –

**తె.అ.** అవ్యయమని చెప్పబడే అశ్వత్థవృక్షానికి వేరుపైన, కొమ్మలు క్రింద. దాని ఆకులు వేదాలు. దానిని తెలిసినవాడు వేదం తెలిసినవాడు.

**భాష్యమ్ : 1.1 ఊర్ధ్వమూలం కాలతః సూక్ష్మత్వాత్, కారణత్వాత్, నిత్యత్వాత్, మహత్త్వాత్ చ 'ఊర్ధ్వమ్ ఉచ్యతే బ్రహ్మ అవ్యక్తం మాయాశక్తిమత్, తత్ మూలమ్ అస్య ఇతి సోఽయం సంసారవృక్షః ఊర్ధ్వమూలః. శ్రుతేశ్చ 'ఊర్ధ్వమూలోఽవాక్శాఖః ఏషోఽశ్వత్థః సనాతనః' (క.ఉ.6.1) ఇతి, పురాణే చ**

**అవ్యక్తమూలప్రభవస్తస్యైవానుగ్రహోచ్ఛ్రితః ।**
**బుద్ధిస్కన్ధమయశ్చైవ ఇన్ద్రియాన్తర కోటరః ॥**

**మహాభూతవిశాఖశ్చ విషయైః పత్రవాంస్తథా ।**
**ధర్మాధర్మ సుపుష్పశ్చ సుఖదుఃఖఫలోదయః ॥**

**ఆజీవ్యః సర్వభూతానాం బ్రహ్మవృక్షః సనాతనః ।**
**ఏతద్ బ్రహ్మవనం చైవ బ్రహ్మవృక్షస్య తస్య తత్ ॥**

**ఏతచ్ఛిత్త్వా చ భిత్త్వా చ జ్ఞానేన పరమాసినా ।**
**తతశ్చాత్మరతిం ప్రాప్య తస్మాన్నావర్తతే పునః ॥**

**(అశ్వ.పర్వ. 35.20-22,47.12-15) ఇత్యాది**

**తం ఊర్ధ్వమూలం సంసారం మాయామయం వృక్షం ఆహుః. మహదహంకార తన్మాత్రాదయః శాఖాః ఇవ అస్య అధః భవంతీతి సోఽయం అధఃశాఖః, తం అధః శాఖమ్. న శ్వోఽపి స్థాతా ఇతి అశ్వత్థః తం క్షణప్రధ్వంసినం అశ్వత్థం ప్రాహుః కథయంతి. అవ్యయం - సంసారమాయాయాః అనాదికాలప్రవృత్తత్వాత్ సోఽయం సంసారవృక్షః అవ్యయః అనాద్యనంతదేహాదిసంతానాశ్రయః హి సుప్రసిద్ధః - తం అవ్యయమ్. తస్యైవ సంసారవృక్షస్య ఇదం అన్యత్ విశేషణమ్ - ఛందాంసి యస్య పర్ణాని ఛందాంసి ఛాదనాత్ ఋగ్యజుః సామలక్షణాని యస్య సంసారవృక్ష పర్ణానీవ పర్ణాని. యథా వృక్షస్య పరిరక్షణార్థాని పర్ణాని, తథా వేదాః సంసారవృక్ష పరిరక్షణార్థాః, ధర్మాధర్మ తద్ధేతుఫలప్రదర్శనార్థత్వాత్. యథావ్యాఖ్యాతం సంసారవృక్షం సమూలం యః తం వేద సః వేదవిత్, వేదార్థవిత్ ఇత్యర్థః. న హి సమూలాత్ సంసారవృక్షాత్ అస్మాత్ జ్ఞేయః అన్యః అణుమాత్రోఽపి అవశిష్టః అస్తి ఇత్యతః సర్వజ్ఞః సర్వవేదార్థవిదితి సమూలసంసారవృక్షజ్ఞానం స్తౌతి -**

**తె.అ.** ఈ సంసారవృక్షానికి వేరు బ్రహ్మము. కాలం కంటె సూక్ష్మము కనుక, కారణం కనుక, నిత్యం కనుక మహత్త్వం కలది కనుక బ్రహ్మము పైనున్న వేరు అని చెప్పబడుతున్నది. అవ్యక్తమాయాశక్తి గల బ్రహ్మము దీనికి వేరు కనుక ఈ సంసారవృక్షం ఊర్ధ్వమూలం. శ్రుతి కూడా అంటున్నది. 'వేరు పైన కొమ్మలు క్రింద' (క.ఉ.2.6.1) అని. పురాణంలోనూ, 'అవ్యక్తరూపమైన వేరు నుండి పుట్టింది. దాని అనుగ్రహంతోనే పెరిగింది. బుద్ధి దీని కాండము. ఇంద్రియాలు దీనిలోని తొర్రలు. మహాభూతములు దీని ఉపశాఖలు. విషయాలు ఆకులు. ధర్మాధర్మాలు దీని చక్కని పూలు, సుఖదుఃఖాలు ఫలాలు. ఈ సనాతన బ్రహ్మవృక్షం సమస్త

ప్రాణులకు జీవనాధారం. బ్రహ్మం దీనియందు సాక్షిగా ఉంది. ఈ చెట్టును జ్ఞానమనే కత్తితో ఛిన్నాభిన్నం చేసి ఆత్మరతిని (ఆసక్తిని) పొంది ఇక అక్కడినుండి తిరిగిరారు'. (అశ్వమేధ. ప. 35.20.22 47.12-15) మొదలైన వాక్యాలున్నాయి. ఈ ఊర్ధ్వమూలమైన సంసారమాయామయ వృక్షానికి కొమ్మలు క్రింద ఉన్నట్లు చెబుతున్నారు. మహత్తత్త్వము, అహంకారము, తన్మాత్రలు, మొదలైన కొమ్మలు దీనికి క్రింద ఉంటాయి. ఈ అశ్వత్థవృక్షాన్ని అవ్యయము అంటారు. అశ్వత్థము అంటే రేపటివరకు ఉండనిది, క్షణంలో నశించేది అని. మాయామయమైన సంసారం అనాదికాలం నుండి వస్తూ ఉంది. దేహాదులు ఒకదాని తరువాత ఒకటి కలగడానికి ఇది సుప్రసిద్ధమైన ఆశ్రయం. కనుక ఇది అవ్యయం. ఆ సంసారవృక్షానికే ఇది మరొక విశేషణం. ధర్మము అధర్మము వాటికి హేతువు, వాటి ఫలము తెలిపి వేదాలు సంసారవృక్షాన్ని పరిరక్షిస్తున్నాయి. చెట్టును ఆకులు కప్పి కాపాడినట్లు వేదాలు సంసారవృక్షాన్ని రక్షిస్తున్నాయి. కనుక అవి దీని ఆకులు. ఇప్పుడు వ్యాఖ్యానించిన విధంగా సమూలంగా (వేరుతోకూడా) సంసారవృక్షాన్ని తెలుసుకున్నవాడు, వేదం తెలిసినవాడు ఈ సమూలమైన సంసారవృక్షం తప్ప తెలుసుకోవలసినది మరేదీ అణుమాత్రం కూడా మిగిలి లేదు. కనుక వేదార్థం తెలిసినవాడు సర్వజ్ఞుడు. ఈ ప్రకారంగా సమూల సంసారవృక్ష జ్ఞానాన్ని స్తుతిస్తున్నాడు.

**భాష్యమ్ : 2.0 తస్య ఏతస్య సంసారవృక్షస్య అపరా అవయవ కల్పనా ఉచ్యతే**

**తె.అ.** ఈ సంసారవృక్షం యొక్క ఇతర అవయవాల కల్పన చెపుతున్నాడు.

**మూ. అధశ్చోర్ధ్వం ప్రసృతాస్తస్య శాఖా గుణప్రవృద్ధా విషయప్రవాలాః ।**
**అధశ్చ మూలాన్యనుసంతతాని కర్మానుబన్ధీని మనుష్యలోకే ॥ 2**

**తె.అ.** గుణాలవల్ల వృద్ధిచెందిన దాని కొమ్మలు క్రింద పైన వ్యాపించి ఉన్నాయి. విషయాలు దాని చిగుళ్ళు. కర్మలతో పెనవేసుకున్న దానివేళ్ళు క్రింద మనుష్యలోకంలోకి ప్రవేశించి ఉన్నాయి.

**భాష్యమ్ : 2.1 అధః మనుష్యాదిభ్యః యావత్ స్థావరమ్, ఊర్ధ్వం చ యావత్ బ్రాహ్మణః విశ్వసృజః ధామ ఇత్యేతదన్తం యథాకర్మ యథాశ్రుతం జ్ఞానకర్మఫలాని తస్య వృక్షస్య శాఖాః ప్రసృతాః ప్రగతాః, గుణప్రవృద్ధాః - గుణైః సత్త్వరజస్తమోభిః ప్రవృద్ధాః స్థూలీకృతాః ఉపాదానభూతైః, విషయప్రవాలాః విషయాః శబ్దాదయః, ప్రవాలాః ఇవ దేహాది కర్మఫలేభ్యః శాఖాదిభ్యః అఙ్కురీభవన్తీవ, తేన విషయప్రవాలాః శాఖాః. సంసార వృక్షస్య పరమమూలమ్ ఉపాదానకారణం పూర్వమ్ ఉక్తమ్. అథ ఇదానీం కర్మఫలజనితరాగద్వేషాదివాసనాః మూలానీవ ధర్మాధర్మప్రవృత్తి కారణాని అవాన్తరభావీని, తాని అధః చ దేహాద్యపేక్షయా మూలాని,**

**అనుసంతతాని అనుప్రవిష్టాని, కర్మానుబన్ధీని– కర్మ ధర్మాధర్మలక్షణమ్, అనుబన్ధః పశ్చాద్భావి యేషామ్ ఉద్భూతిమ్ అను ఉద్భవతీతి తాని కర్మానుబన్ధీని, మనుష్యలోకే విశేషతః. అత్ర హి మనుష్యాణాం కర్మాధికారః ప్రసిద్ధః.**

**తె.అ.** 'క్రింద' అంటే మనుషులు మొదలైన జీవులనుండి స్థావరముల వరకు. 'పైన' అంటే సృష్టికర్త అయిన బ్రహ్మయొక్క లోకం వరకు. కర్మకు, జ్ఞానానికి అనుగుణమైన ఫలాలు క్రిందనుండి పై వరకు వ్యాపించి ఉంటాయి. ఆ చెట్టుకొమ్మలు ఉపాదానమైన సత్త్వరజస్తమోగుణాలచేత వృద్ధి చెందినవి; స్థూలమైనవి. శబ్దాది విషయాలు దాని చిగుళ్ళు, కొమ్మలనుండి చిగుళ్ళు మొలిచినట్టు కర్మఫలమైన దేహాదులు నుండి మొలుచుకువస్తాయి కనుక. సంసార వృక్షానికి ఉపాదాన కారణమైన తల్లి వేరు ఇంతకుముందే చెప్పబడింది. ఇక ఇప్పుడు పిల్లవేళ్ళను చెపుతున్నాడు. అవే రాగద్వేషాది వాసనలు. అవి కర్మఫలం వల్ల పుడుతాయి. పుణ్యాపాపాలలో మనకు ప్రవృత్తి కలగడానికి అవి కారణాలు. ధర్మాధర్మకర్మలతో పెనవేసుకున్న ఈ వేళ్ళు క్రిందికి అంటే మనుష్యలోకంలోకి దిగి ఉన్నాయి. దేవలోకం కంటె క్రిందిది కనుక క్రిందిది అన్నారు. ప్రత్యేకించి మనుష్యులకే కర్మాధికారం కనుక మనుష్యలోకం అని చెప్పబడింది.

**భాష్యమ్ : 3.0 యస్తు అయం వర్ణితః సంసారవృక్షః –**

**తె.అ.** ఇప్పుడు వర్ణించిన ఈ సంసారవృక్షం –

**మూ. న రూపమస్యేహ తథోపలభ్యతే నాన్తో నచాదిర్న చ సంప్రతిష్ఠా ।**
**అశ్వత్థమేనం సువిరూఢమూలమసంగశస్త్రేణ దృఢేన ఛిత్త్వా ॥ 3**

**తె.అ.** ఈ అశ్వత్థవృక్షాన్ని ఇటువంటి రూపంతో చూడలేము. దీని తుది మొదలు నడుమ కూడా తెలుసుకోలేము. దీని వేరు చాలా గట్టిది. ఈ చెట్టును వైరాగ్యమనే బలమైన కత్తితో నరికి–

**భాష్యమ్ : 3.1 న రూపమ్ అస్య ఇహ యథా వర్ణితం తథా నైవ ఉపలభ్యతే, స్వప్నమరీచ్యుదక–మాయాగన్ధర్వనగరసమత్వాత్, దృష్టనష్టస్వరూపః హి సః ఇత్యతః, అన్తః పర్యన్తః నిష్ఠా పరిసమాప్తిర్వా, విద్యతే. తథా న చ ఆదిః – "ఇతః ఆరభ్య అయం ప్రవృత్తః" ఇతి న కేనచిత్ అవగమ్యతే. న చ సంప్రతిష్ఠా స్థితిః, మధ్యమ్ అస్య కేనచిత్ ఉపలభ్యతే. అశ్వత్థమ్ ఏనం యథోక్తం, సువిరూఢమూలం సుష్టు విరూఢాని[1] విరోహం గతాని సుదృఢాని మూలాని యస్య తమ్ ఏనం యథోక్తం, సువిరూఢ– మూలమ్ అసంగశస్త్రేణ – అసంగః పుత్రవిత్తలోకైషణాభ్యః వ్యుత్థానం, తేన అసంగశస్త్రేణ, దృఢేన పరమాత్మాభిముఖ్యనిశ్చయ దృఢీకృతేన, పునః పునః వివేకాభ్యాసాశ్మనిశితేన, ఛిత్త్వా సంసారవృక్షం సబీజమ్ ఉద్ధృత్య.**

**తె.అ.** ఇక్కడ వర్ణించిన విధంగా దీని రూపం లభ్యం కాదు. కల వంటిది, ఎండమావిలోని నీటి వంటిది, మాయాగంధర్వనగరం వంటిది, చూస్తూ చూస్తూనే నశించేది కనుక. అందుకనే దీనికి తుది లేదు, అంటే ఇంతవరకే ఉంటుంది, తరువాత పరిసమాప్తి చెందుతుంది అని చెప్పలేము. అట్లాగే మొదలు కూడా లేదు. ఇక్కడ నుండి మొదలై ఇది సాగుతున్నది అని ఎవనికీ తెలియరానిది. దాని నడుమభాగం కూడా ఎవనికీ తెలియదు. ఈ విధమైన అశ్వత్థవృక్షపు వేళ్ళు లోతుగా పాతుకుపోయినవి. అసంగమనే బలమైన శస్త్రంతో దీన్ని ఛేదించి (పుత్రులమీద ధనంమీద లోకంమీద కోరికను వదలడం అసంగం లేక వైరాగ్యం.) పరమాత్మయందు ఆభిముఖ్యరూప నిశ్చయంతో దృఢమైన శస్త్రంతో వివేకము, అభ్యాసము, అనే రాతిపై పదేపదే పదును పెట్టిన శస్త్రంతో నరికి, సంసారవృక్షాన్ని విత్తుతో సహా పెకిలించి –

**మూ. తతః పదం తత్పరిమార్గితవ్యం యస్మిన్ గతా న నివర్తంతి భూయః ।**
**తమేవ చాద్యం పురుషం ప్రపద్యే యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ ॥ 4**

**తె.అ.** 'ఎవనినుండి సనాతన ప్రవృత్తి ప్రకటమవుతున్నదో ఆ ఆదిపురుషుని శరణు చెందుతున్నాను' అని ఆ పదమును అన్వేషించాలి. దానిని పొందినవారు తిరిగి రారు.

**భాష్యమ్ : 4.1 తతః ఇతి – తతః పశ్చాత్ యత్ పదం వైష్ణవం, తత్ పరిమార్గితవ్యమ్. పరిమార్గణమ్ అన్వేషణమ్. జ్ఞాతవ్యమ్ ఇత్యర్థః. యస్మిన్ పదే గతాః ప్రవిష్టాః. న నివర్తన్తి న ఆవర్తన్తే, భూయః పునః, సంసారాయ. కథం పరిమార్గితవ్యమ్ ఇత్యాహ – తమేవ చ యః పదశబ్దేన ఉక్తః, ఆద్యమ్ ఆదౌ భవం పురుషం ప్రపద్యే ఇత్యేవం పరిమార్గితవ్యం తచ్ఛరణతయా ఇత్యర్థః. కః అసౌ పురుషః ఇతి ఉచ్యతే – యతః యస్మాత్ పురుషాత్. సంసారమాయా వృక్ష ప్రవృత్తిః, ప్రసృతా నిఃసృతా, ఐన్ద్రజాలికాదివ మాయా, పురాణీ చిరన్తనీ.**

**తె.అ.** తరువాత ఆ విష్ణుపదమును అన్వేషించి, తెలుసుకొనవలెనని అర్థం. ఆ పదమును చేరినవారు సంసారంలోకి తిరిగి రారు. ఏ విధంగా అన్వేషించాలి? అంటే – 'పదము' అన్న శబ్దంతో చెప్పబడిన ఆదిపురుషుని శరణు చెందుచున్నాను అదే తెలుసుకొనదగినది. ఎవరీ పురుషుడు? అంటే, గారడీవాని మాయవలె ఎవరినుండి సంసారమాయావృక్షం విస్తరించిందో అతడు.

**భాష్యమ్ : 5.0 కథం భూతాః తత్ పదం గచ్ఛన్తీతి? ఉచ్యతే –**

**తె.అ.** ఎటువంటివారు ఆ పదమును చేరుకుంటారు అంటే –

**మూ. నిర్మానమోహా జితసంగదోషా అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః ।**
**ద్వన్ద్వైర్విముక్తాః సుఖదుఃఖసంజ్ఞైః గచ్ఛంత్యమూఢాః పదమవ్యయం తత్ ॥ 5**

**తె.అ.** అహంకార మోహాలు లేనివారు, ఆసక్తి అనే దోషాన్ని జయించినవారు, నిత్యము అధ్యాత్మచింతన చేసేవారు, కోరికలు తొలగినవారు, సుఖదుఃఖాలనే ద్వంద్వములనుండి ముక్తులైన వారు, మూఢులు కానివారు ఆ అవ్యయపదమును చేరుకుంటారు.

**భాష్యమ్ : 5.1 నిర్మానమోహాః మానశ్చ మోహశ్చ మానమోహౌ, తౌ నిర్గతౌ యేభ్యః తే నిర్మానమోహాః, మాన మోహవర్జితాః జితసంగదోషాః సంగ ఏవ దోషః సంగదోషః జితః సంగదోషః యైః తే జితసంగదోషాః. అధ్యాత్మ నిత్యాః పరమాత్మస్వరూపాలోచనే నిత్యాః తత్పరాః. వినివృత్తకామాః విశేషేణ నిర్లేపేన నివృత్తాః కామాః యేషాం తే వినివృత్త కామాః, యతయః సంన్యాసినః, ద్వంద్వైః ప్రియాప్రియాదిభిః విముక్తాః సుఖదుఃఖంజ్ఞైః పరిత్యక్తాః గచ్ఛన్తి, అమూఢాః మోహవర్జితాః పదమ్ అవ్యయమ్ తత్ యథోక్తమ్.**

**తె.అ.** అభిమానము, మోహము లేనివారు, ఆసక్తి అనే దోషాన్ని జయించినవారు, నిత్యము పరమాత్మ స్వరూపం గురించి ఆలోచన చేసేవారు, కోరికల వాసన కూడా తొలగినవారు మోహం తొలగినవారు అయిన యతులు అంటే సన్యాసులు ఆ అవ్యయపదాన్ని అంటే నాశరహితమైన శాశ్వతపదాన్ని చేరుకుంటారు.

**భాష్యమ్ : 6.0 తదేవ పదం పునః విశిష్యతే –**

**తె.అ.** ఆ పదమును గురించి మళ్ళీ విశేషంగా చెపుతున్నాడు –

**మూ. న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః ।**
**యద్గత్వా న నివర్తన్తే తద్ధామ పరమం మమ ॥ 6**

**తె.అ.** ఆ స్థానాన్ని సూర్యుడు గాని, అగ్ని గాని, చంద్రుడు గాని ప్రకాశింపజేయడం లేదు. అది నా పరమధామము. దానిని చేరినవారు తిరిగిరారు.

**భాష్యమ్ : 6.1 తత్ ధామ ఇతి వ్యవహితేన ధామ్నా సంబన్ధః. ధామ తేజోరూపం పదం, న భాసయతే సూర్యః ఆదిత్యః, సర్వావభాసనశక్తిమత్త్వేఽపి సతి. తథా న శశాఙ్కః చన్ద్రః, న పావకః న అగ్నిః అపి. యత్ ధామ వైష్ణవం పదం గత్వా ప్రాప్య న నివర్తన్తే. యచ్చ సూర్యాదిః న భాసయతే తత్ ధామ పదం పరమం విష్ణోః మమ పదమ్.**

**తె.అ.** తేజోరూపమైన ఆ పదమును ధామమును సూర్యుడు ప్రకాశింపజేయడం లేదు, సమస్త వస్తువులను ప్రకాశింపజేయగల శక్తి గలవాడై కూడా. అట్లాగే చంద్రుడు, అగ్ని కూడా. ఏ

ధామమును అంటే వైష్ణవపదమును పొంది తిరిగిరారో, దేనిని సూర్యాదులు ప్రకాశింపజేయవో ఆ ధామం విష్ణువైన నా పరమపదము.

**భాష్యమ్ : 7.0 యత్ గత్వా న నివర్తన్తే ఇత్యుక్తమ్. నను సర్వా హి గతిః ఆగత్యన్తా, 'సంయోగాః విప్రయోగాన్తాః' (స్త్రీ. పర్వ 2.3, మోక్ష. పర్వ 27.31, 330.20, వా.రా. అయో 105.16 ఇత్యాదౌ) ఇతి ప్రసిద్ధమ్. కథం ఉచ్యతే. "తత్ ధామ గతానాం నాస్తి నివృత్తిః" ఇతి? శృణు తత్ర కారణమ్ –**

**తె.అ.** 'యద్గత్వా న నివర్తన్తే' అని చెపుతున్నాడు. వెళ్ళడమంటూ ఉంటే తిరిగి రావడం తప్పదు కదా. కలయికలన్నీ చివరకు ఎడబాటులే కదా, మరి ఆ ధామం చేరుకున్నవాడు తిరిగిరావడమన్నది ఉండదని ఎట్లా చెపుతున్నాడు? అంటే, అందుకు కారణం విను –

**మూ. మమైవాంశో జీవలోకే జీవభూతః సనాతనః ।**
**మనఃషష్ఠానీన్ద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి ॥ 7**

**తె.అ.** నా అంశయే జీవలోకంలో సనాతనజీవమై తమ తమ స్థానాలలో ఉన్న అయిదు ఇంద్రియాలను, ఆరవ ఇంద్రియమైన మనస్సును ఆకర్షిస్తున్నది.

**భాష్యమ్ : 7.1 మమైవ పరమాత్మనః నారాయణస్య, అంశః భాగః అవయవః ఏకదేశః ఇతి అనర్థాన్తరమ్. జీవలోకే జీవానాం లోకే సంసారే, జీవభూతః భోక్తా కర్తా ఇతి ప్రసిద్ధః సనాతనః చిరంతనః, యథా జలసూర్యకః సూర్యాంశః జలనిమిత్తాపాయే సూర్యమేవ గత్వా న నివర్తతే – తేనైవ ఆత్మనా సంగచ్ఛతి, ఏవమేవ. యథా వా ఘటాద్యుపాధిపరిచ్ఛిన్నః ఘటాద్యాకాశః ఆకాశాంశః సన్ ఘటాదినిమిత్తాపాయే ఆకాశం ప్రాప్య న నివర్తతే ఇత్యేవమ్, అతః ఉపపన్నమ్ ఉక్తం "యద్ గత్వా న నివర్తన్తే" ఇతి. నను నిరవయవస్య పరమాత్మనః కుతః అవయవః ఏకదేశః అంశః ఇతి? సావయవత్వే చ వినాశప్రసంగః అవయవవిభాగాత్. నైషః దోషః. అవిద్యాకృతోపాధిపరిచ్ఛిన్నః ఏకదేశః అంశః ఇవ కల్పితః యతః. దర్శితశ్చ అయమ్ అర్థః క్షేత్రాధ్యాయే (13) విస్తరశః. సః చ జీవః మదంశత్వేన కల్పితః కథం సంసరతి ఉత్క్రామతి చ ఇతి? ఉచ్యతే – మనః షష్ఠాని ఇన్ద్రియాణి శ్రోత్రాదీని ప్రకృతిస్థాని స్వస్థానే కర్ణశష్కుల్యాదౌ ప్రకృతౌ స్థితాని కర్షతి ఆకర్షతి. కస్మిన్ కాలే.**

**తె.అ.** పరమాత్మనైన నా అంశయే నాలోని భాగమే నా అవయవమే జీవలోకంలో సంసారంలో సనాతన జీవమై భోక్త, కర్త అని ప్రసిద్ధమైనది. నీటిలో ప్రతిబింబించిన సూర్యుని సూర్యాంశ నీరు తొలగినప్పుడు సూర్యునిలో కలిసిపోయి తిరిగిరానట్లు ఈ అంశ కూడా ఆత్మలో కలిసిపోయి

తిరిగి రాదు. లేక కుండ మొదలైన ఉపాధిచేత పరిమితమైన ఆకాశం యొక్క ఆకాశాంశ కుండ మొదలైన ఉపాధులు తొలగినపుడు ఆకాశంతో కలిసిపోయి తిరిగి రానట్లు అని ఇక్కడ కూడా అర్థం చేసుకోవలెను. 'యద్గత్వా న నివర్తన్తే' అనడం ఉచితమే.

ఆక్షేపణ – నిరవయవమైన పరమాత్మకు అవయవం అంశ ఎట్లా ఉంటుంది? అవయవాలున్నాయి అనుకుంటే అవయవవిభాగము, వినాశము ఆత్మకున్నాయన్నమాట రాదా?

సమాధానం - ఇది దోషం కాదు. ఈ అంశ అవిద్యాకృతమైన ఉపాధిచేత కల్పించబడింది కనుక. ఈ విషయం క్షేత్రాధ్యాయం (పదమూడవ అధ్యాయం)లో సవిస్తరంగా వివరించబడింది.

నా అంశంగా కల్పించబడిన ఆ జీవము సంసారంలోకి ఎట్లా వస్తున్నది. ఎట్లా దేహం నుండి బయట పడుతున్నది అంటే తమ తమ స్థానాలలో ఉన్న చెవి మొదలైన అయిదు ఇంద్రియాలను ఆరవ ఇంద్రియమైన మనసును నా అంశ ఆకర్షిస్తున్నది. ఎప్పుడు?

**మూ. శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః ।**
**గృహీత్వైతాని సంయాతి వాయుర్గన్ధానివాశయాత్ ॥ 8**

**తె.అ.** జీవాత్మ శరీరం వదిలి వెళ్ళేటప్పుడు మరొక శరీరం పొందేటపుడు గాలి పూలనుండి వాసనలను తీసుకువెళ్ళినట్లు. ఈ మనుస్సును ఇంద్రియాలను తీసుకుని వెళుతుంది.

**భాష్యమ్ : 8.1 యచ్చాపి యదా చాపి ఉత్క్రామతి, ఈశ్వరః దేహాదిసంఘాతస్వామీ జీవః 'తదా కర్షతి' ఇతి శ్లోకస్య ద్వితీయపాదః అర్థవశాత్ ప్రాథమ్యేన సంబధ్యతే. యదా చ పూర్వస్మాత్ శరీరాత్ శరీరాన్తరమ్ ఆప్నోతి తదా గృహీత్వా ఏతాని మనః షష్ఠాని ఇన్ద్రియాణి సంయాతి సమ్యక్ యాతి గచ్ఛతి. కిమివ ఇత్యాహ వాయుః పవనః గన్ధాన్ ఇవ, ఆశయాత్ పుష్పాదేః. కాని పునః తాని ఇతి? –**

**తె.అ.** దేహాది సంఘాతానికి స్వామి అయిన జీవాత్మ దేహం వదలివెళ్ళేటపుడు (అర్థాన్ని బట్టి శ్లోకం యొక్క మొదటి పాదంలోని రెండవసగానికి ముందు వ్యాఖ్యానం చేయబడింది) వెనుకటి శరీరం వదలి మరొక శరీరం పొందేటపుడు మనసుతో కలిసి ఆరు ఇంద్రియాలను తీసుకుని పూర్తిగా వెళ్ళిపోతుంది. ఎట్లా పోతుంది అంటే, పూలు మొదలైనవాటినుండి వాసనలను గాలి తీసుకువెళ్ళినట్లు. మరి ఆ ఆరు ఇంద్రియాలు ఏవి అంటే –

**మూ. శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణమేవ చ ।**
**అధిష్ఠాయ మనశ్చాయం విషయానుపసేవతే ॥ 9**

**తె.అ.** చెవి, కన్ను, చర్మము, నాలుక, ముక్కు మనస్సు – వీటిని అధిష్టించి జీవుడు విషయాలను అనుభవిస్తున్నాడు.

**భాష్యమ్ : 9.1 శ్రోత్రం చక్షుః స్పర్శనం చ త్వగిన్ద్రియం రసనం జిహ్వా ఘ్రాణమ్ ఏవ చ, మనః షష్ఠమ్, ప్రత్యేకమ్ ఇన్ద్రియేణ సహ అధిష్ఠాయ దేహస్థః విషయాన్ శబ్దాదీన్ ఉపసేవతే.**

**తె.అ.** జీవుడు దేహంలో ఉంటూ చెవి కన్ను చర్మము నాలుక ముక్కు ఆరవదైన మనసు – ఈ ఒక్కొక్క ఇంద్రియాన్ని అధిష్టించి శబ్దాది విషయాలను అనుభవిస్తూ ఉంటాడు.

**ఏవం దేహగతం దేహాత్ –**

ఈ విధంగా దేహంలో ఉంటూ ఉన్న జీవుడు దేహం విడిచి –

**మూ. ఉత్క్రామన్తం స్థితం వాపి భుఞ్జానం వా గుణాన్వితమ్ ।**
**విమూఢా నానుపశ్యన్తి పశ్యన్తి జ్ఞానచక్షుషః ॥ 10**

**తె.అ.** వెళుతున్నప్పుడు గాని ఉంటూ ఉన్నప్పుడు గాని గుణాలతో కలిసి అనుభవిస్తున్నప్పుడు గాని మూఢులు చూడడం లేదు. జ్ఞానచక్షువులు కలవారు చూస్తారు.

**భాష్యమ్ : 10.1 ఉత్క్రామన్తం, పరిత్యజన్తం దేహం పూర్వోపాత్తం, స్థితం వా దేహే తిష్ఠన్తం, భుఞ్జానం వా శబ్దాదీన్ చ ఉపలభమానం, గుణాన్వితం సుఖదుఃఖమోహాఖ్యైః గుణైః అన్వితమ్ అనుగతం, సంయుక్తమిత్యర్థః. ఏవం భూతమ్ అపి ఏనమ్, అత్యన్తదర్శనగోచరప్రాప్తం, విమూఢాః దృష్టాదృష్టవిషయభోగబలాకృష్టచేతస్తయా, అనేకధా మూఢాః, న అనుపశ్యన్తి – అహో! కష్టం వర్తతే ఇతి అనుక్రోశతి చ భగవాన్. యే తు పునః ప్రమాణజనితజ్ఞానచక్షుషః తే ఏనం పశ్యన్తి జ్ఞాన చక్షుషః వివిక్తదృష్టయః ఇత్యర్థః. కేచిత్తు –**

**తె.అ.** పూర్వం ప్రాప్తించిన దేహాన్ని విడిచి వెడుతున్నపుడు గాని, దేహంలో ఉంటూ ఉన్నపుడు గాని, సుఖ దుఃఖమోహాలనే గుణాలను కలిగి శబ్దాదివిషయాలను అనుభవిస్తూ ఉండడం గాని మూఢులు చూడడం లేదు. అంటే ఇన్నివిధాలుగా కంటికి కనిపిస్తూ ఉన్నప్పటికి ఇహపరభోగబలం చేత ఆకర్షింపబడి అనేకవిధాలుగా మోహం చెందినవారు, మూఢులు, చూడడంలేదు. అయ్యో ఎంత కష్టము; అని భగవానుడు జాలిపడుతున్నాడు. శాస్త్రప్రమాణాన్ని ఆకళింపు చేసుకొన్న వివేకదృష్టి గలవారు కొందరు మాత్రమే చూస్తారు. కొందరు మాత్రం –

**మూ. యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మన్యవస్థితమ్ ।**
**యతన్తోఽప్యకృతాత్మానో నైనం పశ్యన్త్యచేతసః ॥ 11**

**తె.అ.** ప్రయత్నం చేసే యోగులు తమయందున్న దీనిని అంటే ఆత్మను చూస్తారు. ప్రయత్నం చేసినప్పటికి సంస్కరింపబడని మనస్సుగల అవివేకులు దీనిని చూడరు.

**భాష్యమ్ : 11.1 యతన్తః ప్రయత్నం కుర్వన్తః యోగినః చ సమాహితచిత్తాః, ఏనం ప్రకృతమ్ ఆత్మానం పశ్యన్తి – "అయమహమ్ అస్మి" ఇతి ఉపలభన్తే. ఆత్మని స్వస్యాం బుద్ధౌ అవస్థితం. యతన్తః అపి శాస్త్రాదిప్రమాణైః, అకృతాత్మానః అసంస్కృతాత్మానః తపసా ఇన్ద్రియజయేన చ, దుశ్చరితాత్ అనుపరతాః, అశాన్తదర్పాః, ప్రయత్నం కుర్వన్తః అపి, న ఏనం పశ్యన్తి, అచేతసః అవివేకినః.**

**తె.అ.** సమాహితచిత్తులై ప్రయత్నం చేస్తూ ఉన్న యోగులు ఇప్పుడు చెప్పుకుంటున్న ఆత్మను దర్శిస్తారు. తమ బుద్ధియందున్న దానిని 'ఇది నేనే' అని తెలుసుకుంటారు. తపస్సుచేత ఇంద్రియజయం చేత సంస్కరింపబడని మనస్సుకలవారు, పాపకార్యాలు చేయడం మాననివారు, అశాంతులు, గర్వితులు అయిన అవివేకులు శాస్త్రప్రమాణాలతో దీనికొరకు ప్రయత్నం చేస్తూ ఉన్నవారైనప్పటికి దీనిని చూడడం లేదు.

**భాష్యమ్ : 12.0 యత్ పదం సర్వస్య అవభాసకమ్ అపి అగ్న్యాదిత్యాదికం జ్యోతిః న అవభాసయతే. యత్ప్రాప్తాశ్చ ముముక్షవః పునః సంసారాభిముఖాః న నివర్తన్తే, యస్య చ పదస్య ఉపాధిభేదమనువిధీయమానాః జీవాః ఘటాకాశాదయః ఇవ ఆకాశస్య అంశాః తస్య పదస్య సర్వాత్మత్వం సర్వవ్యవహారాస్పదత్వం చ వివక్షుః చతుర్భిః శ్లోకైః విభూతిసంక్షేపం ఆహ భగవాన్–**

**తె.అ.** అన్నింటిని ప్రకాశింపజేసేదయినప్పటికి అగ్ని సూర్యుడు మొదలైనవాటి జ్యోతి ఏ పదమును ప్రకాశింపజేయడం లేదో, ఏ పదమును చేరి ముముక్షువులు సంసారంవైపు తిరిగిరారో, కుండలోని ఆకాశం, ఆకాశం యొక్క అంశయే అయినట్లు ఉపాధిభేదాన్ని అనుసరించే జీవులు ఏ పదముయొక్క అంశలో ఆ పదము యొక్క సర్వాత్మత్వము సమస్తవ్యవహారాస్పదం (అన్నివ్యవహారాలలో గోచరించే ఈ పదం) చెప్పదలచి భగవానుడు నాలుగు శ్లోకాలలో సంక్షిప్తంగా విభూతులను వర్ణిస్తున్నాడు.

**మూ. యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్ ।**
**యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్ ॥ 12**

**తె.అ.** సమస్తజగత్తును ప్రకాశింపజేస్తున్న సూర్యునిలోను, చంద్రునిలోను, అగ్నిలోను, కాంతిలోనూ ఉన్న తేజస్సు నేనే అని తెలుసుకో.

**భాష్యమ్ : 12.1 యత్, ఆదిత్యగతమ్ ఆదిత్యాశ్రయం, కిం, తత్? తేజః దీప్తిః, ప్రకాశః, జగత్ భాసయతే ప్రకాశయతి అఖిలం సమస్తం, యత్, చన్ద్రమసి, తేజః అవభాసకం వర్తతే, యత్ చ అగ్నౌ హుతవహే, తత్ తేజః విద్ధి విజానీహి, మామకం మదీయం, మమ విష్ణోః తత్ జ్యోతిః. అథవా – యత్ ఆదిత్యగతం తేజః చైతన్యాత్మకం జ్యోతిః, యత్ చన్ద్రమసి, యచ్చ అగ్నౌ వర్తతే తత్ తేజః విద్ధి మామకం మదీయం, మమ విష్ణోః తత్ జ్యోతిః.**

**నను స్థావరేషు జంగమేషు చ తత్ సమానం చైతన్యాత్మకం జ్యోతిః, తత్ర కథమ్ ఇదం విశేషణం "యదాదిత్యగతమ్" ఇత్యాది. నైష దోషః, సత్త్వాధిక్యాత్ ఆవిస్తరత్వోపపత్తేః. ఆదిత్యాదిషు హి సత్త్వమ్ అత్యన్తప్రకాశమ్ అత్యన్త భాస్వరమ్ అతః తత్రైవ ఆవిస్తరం జ్యోతిః ఇతి తత్ విశిష్యతే, న తు తత్రైవ తత్ అధికమ్ ఇతి. యథా హి లోకే తుల్యేఽపి ముఖ సంస్థానే న కాష్ఠకుడ్యాదౌ ముఖమ్ ఆవిర్భవతి, ఆదర్శాదౌ తు స్వచ్ఛే స్వచ్ఛతరే చ తారతమ్యేన ఆవిర్భవతి తద్వత్. కించ**

**తె.అ.** సూర్యునిలోని ఏ తేజస్సు, ఏ దీప్తి, ఏ ప్రకాశము సమస్తజగత్తును ప్రకాశింపజేస్తూ ఉన్నదో, ఏది చంద్రునిలోను, అగ్నిలోను ఉన్నదో, ఆ తేజస్సు నాదని విష్ణుజ్యోతి అని తెలుసుకో. లేక, సూర్యునిలో ఉన్న చైతన్యజ్యోతి చంద్రునిలోను, అగ్నిలోను ఉన్నటువంటిది నాదని విష్ణుజ్యోతి అని తెలుసుకో.

ఆక్షేపణ – స్థావరజంగమములయందు సమానంగా ఉండే చైతన్యజ్యోతి ప్రత్యేకంగా "యదాదిత్యగతం" అని చెప్పడమెందుకు?

సమాధానం – ఇది దోషం కాదు. సత్త్వాధిక్యంచేత విస్తృతి కలుగుతుంది కనుక. సూర్యాదుల యందు సత్త్వం అధికంగా ప్రకాశిస్తుంది కనుక అక్కడ జ్యోతియొక్క విస్తృతి ఎక్కువ అని సూర్యుని ప్రత్యేకించి చెప్పడం. అంతేగాని అక్కడే అధికంగా ఉంటుందనిగాదు. ఎట్లాగంటే, లోకంలో మనకు తెలిసిందే. ముఖం ఎదురుగా ఉన్నప్పటికి కొయ్యలో గోడలో దాని ప్రతిబింబం కనిపించదు. కాని అదే ముఖం అద్దం వంటి వస్తువులో అది ఎంత స్వచ్ఛమైనదైతే ముఖం అంత స్వచ్ఛంగా కనిపిస్తుంది. అట్లాగే –

**మూ. గామావిశ్య చ భూతాని ధారయామ్యహమోజసా ।**
**పుష్ణామి చౌషధీః సర్వాః సోమో భూత్వా రసాత్మకః ॥ 13**

**తె.అ.** పృథివియందు ప్రవేశించి జగత్తును నా బలంతో నిలుపుతున్నాను. రసాత్మకమైన సోముడనై ఓషధుల కన్నిటికి పుష్టి కలిగిస్తున్నాను.

**భాష్యమ్ : 13.1 గాం పృథివీమ్, ఆవిశ్య ప్రవిశ్య, ధారయామి, భూతాని జగత్, అహమ్, ఓజసా బలేన, యత్ బలం కామరాగవివర్జితమ్ ఐశ్వరం రూపం జగద్విధారణాయ పృథివ్యాం ఆవిష్టం, యేన గుర్వీ పృథివీ న అధః పతతి న విదీర్యతే చ, తథా చ మన్త్రవర్ణః – "యేన ద్యౌరుగ్రా పృథివీ చ దృఢా" (తై.సం. 4.1.8) ఇతి, "స దాధార పృథివీమ్" (తై.సం. 4.1.8) ఇత్యాదిశ్చ. అతః గామ్ ఆవిశ్య చ భూతాని చరాచరాణి ధారయామి ఇతి యుక్తమ్ ఉక్తమ్. కించ పృథివ్యాం జాతాః ఓషధీః సర్వాః వ్రీహియవాద్యాః పుష్ణామి పుష్టిమతీః రసస్వాదుమతీశ్చ కరోమి, సోమః భూత్వా, రసాత్మకః సోమః సన్ సర్వరసాత్మకః రసస్వభావః సర్వరసానామ్ ఆకరః సోమః. స హి సర్వరసాత్మకః సర్వాః ఓషధీః స్వాత్మరసాననుప్రవేశయన్ పుష్ణాతి. కించ –**

**తె.అ.** పృథివిని ప్రవేశించి జగత్తును నేను నా బలంతో నిలుపుతున్నాను. కామము రాగము మొదలైనవి లేనటువంటి ఐశ్వరరూపం జగత్తును నిలిపిఉంచడం కొరకు పృథివిని ప్రవేశించి ఉంది. ఆ బలంచేతనే ఇంత పెద్ద పృథివి కిందపడి ముక్కలు కాకుండా ఉన్నది. 'దేనిచేత ఆకాశము ఇంత పెద్ద పృథివి నిలుపబడుతున్నాయో' (తై.సం. 4.1.8) అని, 'అతడు పృథివి నిలిపెను' (తై.సం. 4.1.8) అని మంత్రవర్ణాలుకూడా ఉన్నాయి. అందుకని పృథివిని ప్రవేశించి చరాచరభూతము లన్నిటిని నేను ధరిస్తున్నాను అన్నమాట యుక్తమే. అంతేకాదు, రసస్వభావం గల సోముడనై పృథివియందు పుట్టిన ఓషధులకన్నిటికి వరి యవ మొదలైనవాటికి పుష్టిని రసము రుచి ఇస్తున్నాను. సోముడు అన్ని రసములకు నెలవు. సర్వరసాత్మకుడైన అతడే అన్ని ఓషధులకు తన రసాన్నిచ్చి పుష్టి కలిగిస్తున్నాడు. అంతేకాదు –

**మూ. అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః ।
ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్ ॥ 14**

**తె.అ.** నేను జఠరాగ్నిగా ప్రాణులదేహంలో ఉంటూ ప్రాణ అపానములతో కలిసి నాలుగు విధాలైన అన్నాన్ని పచనం చేస్తున్నాను.

**భాష్యమ్ : 14.1 అహమేవ వైశ్వానరః ఉదరస్థః అగ్నిః భూత్వా 'అయమగ్నిర్వైశ్వానరో యోఽయమన్తఃపురుషే, యేనేదమన్నం పచ్యతే' (బృ.ఉ.5.9.1) ఇత్యాదిశ్రుతేః, వైశ్వానరః సన్, ప్రాణినాం ప్రాణవతామ్, దేహమ్ ఆశ్రితః ప్రవిష్టః ప్రాణాపానసమాయుక్తః ప్రాణాపానాభ్యాం సమాయుక్తః సంయుక్తః, పచామి పక్తిం కరోమి, చతుర్విధం చతుష్ప్రకారమ్, అన్నమ్ అశనం, భోజ్యం, భక్ష్యం, చోష్యం, లేహ్యం చ. భోక్తా వైశ్వానరః అగ్నిః, భోజ్యమ్ అన్నం సోమః, తత్ ఏతత్ ఉభయమ్ అగ్నీషోమౌ సర్వమ్ ఇతి పశ్యతః అన్నదోషలేపః న భవతి. కించ –**

**తె.అ.** వైశ్వానరుడు అంటే కడుపులో ఉండే అగ్ని. నేను వైశ్వానరుడనై ప్రాణులదేహంలో ఉంటూ ప్రాణ అపానములతో కలిసి భక్ష్య భోజ్య చోష్య లేహ్యములనే నాలుగువిధాలైన అన్నాన్ని జీర్ణం చేస్తున్నాను. 'ఈ అగ్ని వైశ్వానరుడు. పురుషునిలో ఉండువాడు. ఈ అన్నం ఇతనిచేత జీర్ణం చేయబడుతున్నది' (బృ.ఉ. 5.9.1) అని శ్రుతి. 'భోక్త వైశ్వానరుడు అగ్ని, అతడు తినే అన్నం సోముడు – ఉన్నదంతా ఈ ఇద్దరే – అగ్ని సోముడు', అని తెలిసినవానిని అన్నదోషాలు అంటవు. అంతేకాదు –

**మూ. సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తః స్మృతిర్జ్ఞానమపోహనం చ ।**
**వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో వేదాన్తకృద్వేదవిదేవ చాహమ్ ॥ 15**

**తె.అ.** అందరి హృదయంలో నేనున్నాను. స్మృతి జ్ఞానము నావల్లనే. అవి రెండు తొలగిపోవడం కూడా నావల్లనే జరుగుతాయి. అన్ని వేదాలను తెలియదగినవాడను నేనే. వేదాంతాన్ని రచించింది నేనే. వేదవేత్తను కూడా నేను.

**భాష్యమ్ : 15.1 సర్వస్య ప్రాణిజాతస్య అహమ్ ఆత్మా సన్, హృది బుద్ధౌ, సంనివిష్టః, అతః మత్తః ఆత్మనః సర్వప్రాణినాం స్మృతిః జ్ఞానం తదపోహనం అపగమనం చ. యేషాం యథా పుణ్యకర్మిణాం పుణ్యకర్మానురోధేన జ్ఞాన స్మృతీ భవతః తథా పాపకర్మిణాం పాపకర్మానురూపేణ స్మృతిజ్ఞానయోః, అపోహనం చ అపాయనమ్ అపగమనం చ, వేదైః చ సర్వైః, అహమేవ పరమాత్మా, వేద్యః వేదితవ్యః, వేదాన్తకృత్, వేదాన్తార్థసంప్రదాయకృత్ ఇత్యర్థః. వేదవిత్ వేదార్థవిదేవ చ అహమ్.**

**తె.అ.** సమస్త ప్రాణికోటికి నేను ఆత్మనై హృదయంలో అంటే బుద్ధియందు నిలిచిఉంటాను. కనుక సమస్త ప్రాణులకు స్మృతి జ్ఞానము అవి తొలగిపోవడము కూడా నా వల్లనే. పుణ్యకర్మలు చేసుకున్నవారికి వారి పుణ్యకర్మల ననుసరించి జ్ఞానము స్మృతి కలుగుతాయి. అట్లాగే పాపకర్ములకు పాపకర్మలకుతగినట్లు స్మృతి జ్ఞానము తొలగుతాయి. సమస్త వేదములద్వారా తెలియదగినది పరమాత్మ అయిన నేనే. వేదాంతార్థ సంప్రదాయకర్తను వేదార్థం తెలిసినవాడిని కూడా నేనే.

**భాష్యమ్ : 16.0 భగవతః ఈశ్వరస్య నారాయణాఖ్యస్య విభూతిసంక్షేపః ఉక్తః విశిష్టోపాధికృతః 'యదాదిత్యగతం తేజః' (15.12) ఇత్యాదినా. అథ అధునా తస్యైవ క్షరాక్షరోపాధిప్రవిభక్తతయా నిరుపాధికస్య కేవలస్య తత్త్వ (స్వరూప) నిర్దిధారయిషయా ఉత్తరే శ్లోకాః ఆరభ్యంతే తత్ర సర్వమేవ అతీతానాగతాధ్యాయార్థ జాతం త్రిధా రాశీకృత్య ఆహ –**

**తె.అ.** 'యదాదిత్యగతం తేజః' (15.12)తో మొదలైన శ్లోకాలలో నారాయణుడనబడే ఈశ్వరుని విభూతులు, విశిష్టఉపాధుల వలన కలిగినవి సంక్షేపంగా చెప్పబడ్డాయి. ఇక ఇప్పుడు అతనివే అయిన క్షరము అక్షరము అనే ఉపాధులను విభజించి నిరుపాధికము కేవలము తత్త్వనిర్ధారణ చేయడం కొరకు తరువాతి శ్లోకాలు ఆరంభించబడుతున్నాయి. అందులో ఇంతవరకు గడచిన అధ్యాయాల లోనిది, ముందు రాబోయే అధ్యాయాలలోనిది విషయాన్నంతా మూడు రాసులుగా చేసి చెపుతున్నాడు-

**మూ. ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ ।**
**క్షరః సర్వాణి భూతాని కూటస్థోఽ క్షర ఉచ్యతే ॥ 16**

**తె.అ.** లోకంలో ఈ పురుషులిద్దరున్నారు, క్షరుడు అక్షరుడు అని. సర్వభూతములు క్షరమని; కూటస్థమైనది అక్షరమనీ చెబుతున్నాను.

**భాష్యమ్ : 16.1 ద్వౌ ఇమౌ పృథక్ రాశీకృతౌ పురుషావితి ఉచ్యేతే, లోకే సంసారే. క్షరః చ క్షరతీతి క్షరః, వినాశీ ఇతి ఏకః రాశిః అపరః పురుషః అక్షరః తద్విపరీతః భగవతః మాయాశక్తిః, క్షరాఖ్యస్య పురుషస్య ఉత్పత్తిబీజమ్, అనేక సంసారి జన్తుకామకర్మాదిసంస్కారాశ్రయః, అక్షరః పురుషః ఉచ్యతే. కౌ తౌ పురుషౌ ఇత్యాహ స్వయమేవ భగవాన్ - క్షరః సర్వాణి భూతాని, సమస్తం వికారజాతమ్ ఇత్యర్థః. కూటస్థః కూటః రాశిః రాశిరివ స్థితః, అథవా కూటః మాయా వఞ్చనా జిహ్మతా కుటిలతా ఇతి పర్యాయాః, అనేకమాయా వంచనాది ప్రకారేణ స్థితః కూటస్థః, సంసారబీజానన్త్యాత్ న క్షరతీతి అక్షరః ఉచ్యతే.**

**తె.అ.** సంసారంలో ఇద్దరు పురుషులున్నారు - రెండు రాసులుగా చేయబడినవారు. క్షయమయేది నశించేది అంతా ఒక రాశి, క్షరము. మరొకటి ఇందుకు విపరీతమైనది భగవంతుని మాయాశక్తి. క్షరమనే పురుషునికి ఉత్పత్తి బీజము. సంసారంలోని అనేక జీవుల కామకర్మాదిసంస్కారాలకు ఆశ్రయమైన అక్షరపురుషుడు. ఎవరీ పురుషులు? భగవానుడే స్వయంగా చెపుతున్నాడు - క్షరము అంటే సర్వభూతములు సమస్తవికారములు అని. అక్షరము అంటే కూటస్థుడు. కూటము అంటే మాయ. వంచన కుటిలత దీని మారుపేర్లు. అనేక మాయలతో వంచనతో ఉండువాడు కూటస్థుడు. సంసారబీజం అంతంలేనిది కనుక అక్షరము అని చెప్పబడుతున్నాడు. ఇందు సమస్త ప్రాణుల యొక్క దేహములు క్షరుడు, కూటస్థుడగు జీవుడు అక్షరుడు అని తెలియుచున్నది.

**భాష్యమ్ : 17.0 ఆభ్యాం క్షరాక్షరాభ్యాం అన్యః విలక్షణః క్షరాక్షరోపాధిద్వయ దోషేణ అస్పృష్టః నిత్యశుద్ధ బుద్ధముక్త స్వభావః.**

**తె.అ.** ఈ క్షరాక్షరములకంటె వేరుగా విలక్షణంగా క్షరాక్షరములనే రెండు ఉపాధుల దోషము అంటని నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావం గల –

**మూ.** **ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః ।**
**యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥ 17**

**తె.అ.** ఈ రెండిటికంటె వేరైన ఉత్తముడైనవాడే పరమాత్మ అని చెప్పబడేవాడు నాశనం లేని ఈశ్వరుడైన ఉత్తమపురుషుడే మూడలోకాలలో ప్రవేశించి వాటిని నిలుపుతున్నాడు.

**భాష్యమ్ : 17.1 ఉత్తమః ఉత్కృష్టతమః పురుషః తు, అన్యః అత్యన్తవిలక్షణః ఆభ్యాం పరమాత్మా ఇతి – పరమః చ అసౌ దేహాద్యవిద్యాకృతాత్మభ్యః ఆత్మా చ సర్వభూతానాం ప్రత్యక్చేతనః.**

**ఇత్యతః పరమాత్మా ఇతి – ఉదాహృతః ఉక్తః వేదాన్తేషు. సః ఏవ విశిష్యతే – యః లోకత్రయం భూర్భువః స్వరాఖ్యం స్వకీయయా చైతన్యబలశక్త్యా ఆవిశ్య ప్రవిశ్య, బిభర్తి – స్వరూపసద్భావమాత్రేణ బిభర్తి ధారయతి, అవ్యయః న అస్య వ్యయః విద్యతే ఇతి అవ్యయః కః? ఈశ్వరః సర్వజ్ఞః నారాయణాఖ్యః ఈశనశీలః.**

**తె.అ.** పురుషోత్తముడు ఈ ఇద్దరి పురుషులకంటె అన్యుడు అత్యంత విలక్షణుడు, పరమాత్మ అని ఉపనిషత్తులలో చెప్పబడువాడు. అవిద్యాకల్పితమైన ఈ దేహాదులకంటె ఉత్తమమైనది కనుక పరము. సర్వప్రాణులకు అంతరాత్మ రూపమైనది కనుక ఆత్మ. పరమమైన ఆత్మ పరమాత్మ. ఆ పరమాత్మనే విశేషణాలతో చెపుతున్నాడు. భూర్భువస్వర్లోకాలనే మూడు లోకాలను తన చైతన్యబలంతో ఆవేశించి స్వరూపసత్తామాత్రంతో వాటిని భరిస్తున్నాడు. అతడు మార్పు చెందనివాడు. ఎవడు? ఈశ్వరుడు! సర్వజ్ఞుడు! నారాయణుడనబడే పరిపాలకుడు.

**భాష్యమ్ : 18.0 యథావ్యాఖ్యాతస్య ఈశ్వరస్య 'పురుషోత్తమః' ఇత్యేతత్ నామ ప్రసిద్ధమ్. తస్య నామనిర్వచనప్రసిద్ధ్యా అర్థవత్త్వం నామ్నో దర్శయన్ 'నిరతిశయః అహం ఈశ్వరః' ఇతి ఆత్మానం దర్శయతి భగవాన్ –**

**తె.అ.** పైన వ్యాఖ్యానించబడిన ఈశ్వరునికి పురుషోత్తముడనే పేరు ప్రసిద్ధం. ఆయనకు ఈ పేరు ఏ విధంగా కలిగింది, పేరు ఎట్లా సార్థకమయింది చూపుతూ నేను ఈశ్వరుడను అని తనను ప్రకటించుకుంటున్నాడు భగవానుడు –

**మూ.** **యస్మాత్ క్షరమతీతోఽహమక్షరాదపి చోత్తమః ।**
**అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః ॥ 18**

**తె.అ.** క్షరాన్ని అక్షరాన్ని కూడా అతిక్రమించినవాడిని. కనుక లోకంలోను వేదంలోను నేను పురుషోత్తముడని ప్రఖ్యాతి పొందాను.

**భాష్యమ్ : 18.1 యస్మాదితి - యస్మాత్ క్షరమ్ అతీతః అహం సంసారమాయావృక్షమ్ అశ్వత్థాఖ్యమ్ అతిక్రాన్తః అహమ్, అక్షరాదపి సంసారమాయావృక్షబీజభూతాత్ అపి చ ఉత్తమః ఉత్కృష్టతమః ఊర్ధ్వతమః వా, అతః తాభ్యాం క్షరాక్షరాభ్యామ్ ఉత్తమత్వాత్, అస్మి భవామి, లోకే వేదే చ ప్రథితః ప్రఖ్యాతః, పురుషోత్తమః ఇత్యేవం మాం భక్తజనాః విదుః, కవయః కావ్యాదిషు చ ఇదం నామ నిబధ్నన్తి, పురుషోత్తమః ఇత్యనేన అభిధానేన అభిగృణన్తి.**

**తె.అ.** ఎందుకంటే నేను క్షరమునకంటె అతీతుడను. అంటే సంసారమాయావృక్షమైన అశ్వత్థమును అతిక్రమించినవాడిని. ఆ సంసారవృక్షబీజమైన అక్షరం కంటె కూడా ఉత్కృష్టమైనవాడిని, పైనున్న వాడిని, కనుక క్షరాక్షరములకంటె ఉత్తముడైన కారణంగా లోకంలోను, వేదంలోను పురుషోత్తముడని నేను ప్రఖ్యాతి పొందాను. భక్తజనులు నన్ను పురుషోత్తమునిగా ఎరుగుదురు. కవులు కావ్యాదులలో పురుషోత్తముడన్న ఈ పేరుతో స్తుతిస్తున్నారు.

**భాష్యమ్ : 19.0 అథ ఇదానీం యథానిరుక్తం ఆత్మానం యో వేద, తస్య ఇదం ఫలం ఉచ్యతే -**

**తె.అ.** పైన చెప్పబడిన ఆత్మను తెలుసుకున్నవానికి ఫలం ఇప్పుడు చెప్పబడుతున్నది -

**మూ. యో మామేవమసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్ ।**
**స సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత ॥ 19**

**తె.అ.** అర్జునా, ఎవడు మోహము తొలగి నన్నీవిధముగా పురుషోత్తమునిగా తెలుసుకుంటాడో ఆ సర్వజ్ఞుడు నన్ను సర్వాత్మభావంతో భజిస్తాడు.

**భాష్యమ్ : 19.1 యః మామ్ ఈశ్వరం యథోక్తవిశేషణమ్, ఏవం యథోక్తేన ప్రకారేణ, అసంమూఢః సంమోహవర్జితః సన్, జానాతి "అయమ్ అహమ్ అస్మి" ఇతి పురుషోత్తమమ్. సః సర్వవిత్ సర్వాత్మనా సర్వం వేత్తీతి సర్వజ్ఞః సర్వభూతస్థం భజతి మాం సర్వభావేన సర్వాత్మచిత్తతయా, హే భారత.**

**తె.అ.** ఓ అర్జునా! చెప్పబడిన విశేషణాలు గలిగిన నన్ను ఈశ్వరుని, చెప్పినవిధంగా మోహం తొలగి ఎవడు నన్ను పురుషోత్తముడుగా తెలుసుకుంటాడో, అతడు సర్వము తెలిసినవాడు. సర్వమును సర్వాత్మభావంతో తెలిసినవాడు. సర్వ భూతములయందున్న నన్ను సర్వాత్మభావంతో అతడు భజిస్తాడు.

**భాష్యమ్ : 20.0 అస్మిన్ అధ్యాయే భగవత్తత్త్వజ్ఞానం మోక్షఫలం ఉక్త్వా అథ ఇదానీం తత్ స్తౌతి.**

**తె.అ.** ఈ అధ్యాయంలో భగవత్తత్త్వజ్ఞానమైన మోక్షఫలాన్ని చెప్పి ఇక ఇప్పుడు దానిని స్తుతిస్తున్నాడు.

**మూ. ఇతి గుహ్యతమం శాస్త్రమిదముక్తం మయాఽనఘ ।**
**ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్స్యాత్ కృతకృత్యశ్చ భారత ॥ 20**

**తె.అ.** అనఘా! అతిరహస్యమైన ఈ శాస్త్రం ఈ విధంగా వివరించాను. భారతా! దీనిని తెలుసుకున్నవాడు బుద్ధిమంతుడౌతాడు, కృతకృత్యుడు కూడా.

**ఇతి శ్రీ మహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా – సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జునసంవాదే పురుషోత్తమయోగో నామ పంచదశోఽధ్యాయః.**

**తె.అ.** ఇది వ్యాసభగవానుని శతసహస్రసంహిత అయిన శ్రీ మహాభారతంలో భీష్మపర్వంలో ఉపనిషత్తులు బ్రహ్మవిద్య యోగశాస్త్రము శ్రీకృష్ణార్జునసంవాదము అయిన భగవద్గీతలయందు పురుషోత్తమయోగమనే పదిహేనవ అధ్యాయానికి తెలుగు అనువాదం.

**భాష్యమ్ : 20.1 ఇతి ఏతత్ గుహ్యతమం గోప్యతమం, అత్యంతరహస్యం, ఇత్యేతత్. కిం తత్ శాస్త్రమ్. యద్యపి గీతాఖ్యం సమస్తం శాస్త్రం ఉచ్యతే. తథా అయమేవ అధ్యాయః ఇహ 'శాస్త్రం' ఇతి ఉచ్యతే స్తుత్యర్థం, ప్రకరణాత్. సర్వో హి గీతాశాస్త్రార్థః అస్మిన్ అధ్యాయే సమాసేన ఉక్తః న కేవలం గీతాశాస్త్రార్థ ఏవ, కింతు సర్వశ్చ వేదార్థః ఇహ పరిసమాప్తః, 'యస్తం వేద స వేదవిత్' (15.1) 'వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః' (15.15) ఇతి చ ఉక్తమ్. ఇదం ఉక్తం కథితం మయా హే అనఘ! అపాప! ఏతత్ శాస్త్రం యథా దర్శితార్థం బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్ భవేత్ – న అన్యథా – కృతకృత్యశ్చ భారత! కృతం కృత్యం కర్తవ్యం యేన సః కృతకృత్యః, విశిష్టజన్మ ప్రసూతేన బ్రాహ్మణేన యత్ కర్తవ్యం తత్ సర్వం భగవత్తత్త్వే విదితే కృతం భవేత్ ఇత్యర్థః. న చ అన్యథా కర్తవ్యం పరిసమాప్యతే కస్య చిత్ ఇత్యభిప్రాయః. 'సర్వం కర్మాఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే' (4.33) ఇతి చ ఉక్తమ్.**

**ఏతద్ధి జన్మ సామగ్ర్యం (సాఫల్యం) బ్రాహ్మణస్య విశేషతః**

**ప్రాప్యైతత్ కృతకృత్యో హి ద్విజో భవతి నాన్యథా (మను.12.93)**

**ఇతి చ మానవం వచనమ్. యతః ఏతత్ పరమార్థతత్త్వం మత్తః శ్రుతవాన్ అసి, అతః కృతార్థః త్వం భారత! ఇతి.**

**తె.అ.** అత్యంత రహస్యమైన శాస్త్రము. గీత అనేది మొత్తం శాస్త్రమని చెప్పబడుతున్నప్పటికి ఇక్కడ ఈ అధ్యాయాన్ని మాత్రమే శాస్త్రమని అంటున్నాడు, సందర్భాన్ని బట్టి స్తుతించడం కొరకు. సమస్త గీతాశాస్త్రార్థము ఈ అధ్యాయంలో సంక్షేపంగా చెప్పబడింది. కేవలం గీతాశాస్త్రార్థమే కాదు సర్వవేదార్థము ఇక్కడ పరిసమాప్తం చేయబడింది. 'యస్తం వేద స వేదవిత్' (15.1) 'వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః' (15.15) అని కూడా చెప్పబడింది. నేను చెప్పిన శాస్త్రం తెలుసుకుని బుద్ధిమంతుడవుతాడు, మరొకవిధంగా కాదు. అంటే చేయవలసిన దానిని చేసి కృతకృత్యుడు కూడా అవుతాడు. మంచి పుట్టుక పుట్టిన బ్రాహ్మణునికి ఏది కర్తవ్యమో దానినంతా భగవత్తత్త్వం తెలుసుకుంటే చేసినట్లే అని అర్థం. ఎవనికి కాని కర్తవ్యం మరొకవిధంగా పరిసమాప్తం గాదు. 'సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే' (4.33) అని కూడా చెప్పబడింది. 'ఇదే మానవజన్మ సాఫల్యము, విశేషించి బ్రాహ్మణునికి. దీనిని పొంది బ్రాహ్మణుడు కృతకృత్యుడవుతాడు. మరొక విధంగా కాదు.' (మనుస్మృతి 12.93) అని కూడా చెప్పబడింది. అర్జునా! ఈ పరమార్థతత్త్వం నా వలన విన్నావు కనుక నీవు కృతార్థుడవు.

**ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యగోవిందభగవత్పూజ్యపాదశిష్య శ్రీమచ్ఛంకరభగవతః కృతౌ శ్రీమద్భగవద్గీతాభాష్యే పురుషోత్తమయోగో నామ పంచదశోఽధ్యాయః.**

ఇది శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య గోవింద భగవత్పూజ్యపాదశిష్యులు శ్రీమత్ శంకర భగవత్పాదులు రచించిన శ్రీమద్భగవద్గీతాభాష్యంలో పురుషోత్తమయోగమనే పదిహేనవ అధ్యాయానికి తెలుగు అనువాదం.



# షోడశోఽధ్యాయః

# దైవాసురసంపద్విభాగయోగః

**భాష్యమ్ : 0.1 దైవీ ఆసురీ రాక్షసీ చేతి ప్రాణినాం ప్రకృతయః నవమే అధ్యాయే సూచితాః, తాసాం విస్తరేణ ప్రదర్శనాయ 'అభయం సత్త్వసంశుద్ధిః' ఇత్యాదిః అధ్యాయః ఆరభ్యతే. తత్ర సంసారమోక్షాయ దైవీ ప్రకృతిః ఆసురీ రాక్షసీ చ ఇతి, దైవ్యాః ఆదానాయ ప్రదర్శనం క్రియతే, ఇతరయోః పరివర్జనాయ చ.**

**తె.అ.** తొమ్మిదవ అధ్యాయంలో (12,13 శ్లోకాలలో) ప్రాణులకు దైవీ, ఆసురి, రాక్షసి అనే మూడు ప్రకృతులు సూచించబడ్డాయి. వాటిని విస్తరించి ప్రదర్శించడం కొరకు 'అభయం సత్త్వ సంశుద్ధిః' అనే శ్లోకంతో ఈ అధ్యాయం ఆరంభమవుతున్నది. వాటిలో దైవీ ప్రకృతి సంసారంనుండి ముక్తి కలిగిస్తుందని, ఆసురీ, రాక్షసీ ప్రకృతులు బంధంకలిగిస్తాయని, కనుక దైవీ ప్రకృతిని పొందడం కొరకు తక్కినవి త్యజించడం కొరకు వాటిని ప్రదర్శిస్తున్నాడు.

**శ్రీ భగవానువాచ –**

**మూ. అభయం సత్త్వసంశుద్ధిర్జ్ఞానయోగవ్యవస్థితిః ।**
**దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్ ॥ 1**

శ్రీ భగవానుడు అంటున్నాడు.

**తె.అ.** అభయము, అంతఃకరణశుద్ధి, జ్ఞానయోగంలో స్థిరంగా ఉండడము. దానము, దమము, యజ్ఞము, స్వాధ్యాయము, తపము, ఋజుత్వము.

**భాష్యమ్ : 1.1 అభయమ్ అభీరుతా, సత్త్వసంశుద్ధిః, సత్త్వస్య అన్తఃకరణస్య సంశుద్ధిః సంవ్యవహారేషు పరవఞ్చనామాయాఽనృతాదిపరివర్జనం, శుద్ధసత్త్వభావేన వ్యవహారః ఇత్యర్థః. జ్ఞానయోగవ్యవస్థితిః జ్ఞానం శాస్త్రతః ఆచార్యతశ్చ ఆత్మాదిపదార్థానామ్ అవగమః, అవగతానామ్ ఇన్ద్రియాద్యుపసంహారేణ ఏకాగ్రతయా స్వాత్మసంవేద్యతాపాదనం యోగః, తయోః, జ్ఞానయోగయోః వ్యవస్థితిః వ్యవస్థానం తన్నిష్ఠతా. ఏషా ప్రధానా దైవీ సాత్త్వికీ సంపత్. యత్ర (చ) యేషామ్ అధికృతానాం యా ప్రకృతిః సంభవతి సాత్త్వికీ సా ఉచ్యతే. దానం యథాశక్తి సంవిభాగః అన్నాదీనాం, దమః చ బాహ్యకరణానామ్ ఉపశమః, అన్తఃకరణస్య ఉపశమం శాన్తి వక్ష్యతి**

**(16.2.3). యజ్ఞః చ శ్రౌతః అగ్నిహోత్రాదిః. స్మార్తః చ దేవయజ్ఞాదిః. స్వాధ్యాయః ఋగ్వేదాద్యధ్యయనమ్ అదృష్టార్థమ్. తపః వక్ష్యమాణం శారీరాది ఆర్జవం ఋజుత్వం సర్వదా. కించ**

**తె.అ.** అభయం అంటే భయం లేకపోవడం, సత్త్వ సంశుద్ధి అంటె వ్యవహారంలో అంతఃకరణం శుద్ధంగా ఉండడం. పరవంచన, మాయ, అబద్ధము మొదలైనవి వదలి శుద్ధభావంతో వ్యవహరించడం అని అర్థం. జ్ఞానయోగంలో స్థిరంగా ఉండడం, జ్ఞానమంటే శాస్త్రంద్వారా ఆచార్యుని ద్వారా ఆత్మవంటి పదార్థాలను అర్థం చేసుకోవడం. ఆ అర్థం చేసుకున్నవాటిని ఇంద్రియాదులను ఉపసంహరించి ఏకాగ్రతతో ఆత్మయందు ప్రత్యక్షంగా అనుభవంలోకి తెచ్చుకోవడం యోగం. ఈ జ్ఞానయోగాలయందు స్థిరంగా ఉండడం, వాటియందు నిష్ఠ – ఇది దైవీ సంపదలో ప్రధానమైనది, ముఖ్యమైన సాత్త్విక లక్షణం. ఏ అధికారికి ఏ సాత్త్విక ప్రకృతి కలగగలదో చెపుతున్నాడు. దానం, అన్నము మొదలైన వస్తువులను ఇతరులతో పంచుకోవడం. దమం, బాహ్యేంద్రియాలను నియమించడం, అంతరింద్రియ నిగ్రహం శాంతి అని తరువాతి శ్లోకంలో చెప్పబోతున్నాడు. యజ్ఞం అగ్నిహోత్రాది శ్రౌతయజ్ఞం. దేవ యజ్ఞాది స్మార్త యజ్ఞం. స్వాధ్యాయం అదృష్టప్రయోజనం కొరకు ఋగ్వేదాదుల అధ్యయనం. తపం దేహాదుల విషయమైనది. దీని గురించి ముందు (17.14–16) చెప్పబడుతుంది. ఆర్జవం, ఋజుత్వం అంటే ఎప్పుడూ సరళస్వభావం కలిగి ఉండడం ఇంకా.

**మూ. అహింసా సత్యమక్రోధస్త్యాగఃశాంతిరపైశునమ్ ।**
**దయా భూతేష్వలోలుప్త్వం మార్దవం హ్రీరచాపలమ్ ॥ 2**

**తె.అ.** అహింస, సత్యము, క్రోధం లేకపోవడం, త్యాగము, శాంతి, చాడీలు చెప్పకుండడం, భూతదయ, విషయాసక్తి లేకపోవడం, మృదుత్వం, తప్పుపనులు చేయడానికి సంకోచం, చపలత్వం లేకపోవటం.

**భాష్యమ్ : 2.1 అహింసా అహింసనమ్ ప్రాణినాం పీడావర్జనమ్, సత్యమ్ – అప్రియానృత వర్జితం యథాభూతార్థ వచనమ్, అక్రోధః – పరైః ఆక్రుష్టస్య అభిహితస్య వా వా ప్రాప్తస్య క్రోధస్య ఉపశమనమ్, త్యాగః సంన్యాసః, పూర్వం దానస్య ఉక్తత్వాత్, శాన్తిః అన్తఃకరణస్య ఉపశమః. అపైశునమ్ అపిశునతా, పరస్మై పరరన్ధ్రప్రకటీకరణం పిశునతా తదభావః అపైశునమ్. దయా కృపా భూతేషు దుఃఖితేషు. అలోలుప్త్వమ్ ఇన్ద్రియాణాం విషయంసంనిధౌ అవిక్రియా, మార్దవం మృదుతా అక్రౌర్యమ్, హ్రీః లజ్జా, అచాపలమ్ అసతి ప్రయోజనే వాక్పాణిపాదాదీనామ్ అవ్యాపారయితృత్వమ్. కించ**

**తె.అ.** అహింస, ప్రాణులకు కష్టం కలిగించకుండడం. సత్యం, అప్రియము, అనృతముకాని యధార్థవచనం. అక్రోధం పరులు తిట్టినపుడు కొట్టినపుడు కలిగిన కోపం శాంతించడం. త్యాగం అంటే (ఇక్కడ అర్థం) సన్న్యాసం, దానం వెనుకనే చెప్పబడింది కనుక. అపైశునం, పరుల లోపాలను ఇతరులవద్ద ప్రకటించకుండడం. భూతదయ, కష్టంలో ఉన్న ప్రాణులయెడ కృప. అలోలుప్త్వం, విషయాలు ఎదుట ఉన్నప్పుడు ఇంద్రియాలు వికారం చెందకుండడం. మార్దవం, క్రూరగుణం లేకపోవడం. హ్రీ, లజ్జ. అచాపలత్వం అనవసరంగా నోటికి కాలికి చేతికి పని పెట్టకుండడం ఇంకా–

**మూ. తేజః క్షమా ధృతిః శౌచమద్రోహో నాతిమానితా ।**
**భవన్తి సంపదం దైవీమభిజాతస్య భారత ॥ 3**

**తె.అ.** భారతా! తేజము, క్షమ, ధృతి, శౌచము, అద్రోహము, స్వాతిశయం లేకుండుట – దైవీసంపత్తితో పుట్టినవానికి ఈ లక్షణాలు ఉంటాయి.

**భాష్యమ్ : 3.1 తేజః ప్రాగల్భ్యం, న త్వగ్గతా దీప్తిః, క్షమా – ఆక్రుష్టస్య తాడితస్య వా అన్తః విక్రియాఽనుత్పత్తిః, ఉత్పన్నాయాం విక్రియాయాం ఉపశమనమ్ అక్రోధః ఇతి అవోచామ. ఇత్థం క్షమాయాః అక్రోధస్య చ విశేషః. ధృతిః – దేహేన్ద్రియేషు అవసాదం ప్రాప్తేషు తస్య ప్రతిషేధకః అన్తఃకరణవృత్తివిశేషః, యేన ఉత్తమ్భితాని కరణాని దేహశ్చ న అవసీదన్తి. శౌచం ద్వివిధమ్ బాహ్యమ్ మృజ్జలకృతం బాహ్యమ్ ఆభ్యన్తరం చ మనోబుద్ధ్యోః నైర్మల్యం, మాయారాగాది కాలుష్యాభావః ఏవం ద్వివిధం శౌచమ్. అద్రోహః పరజిఘాంసాఽభావః అహింసనమ్. నాతిమానితా అత్యర్థం మానః అతిమానః. సః యస్య విద్యతే సః అతిమానీ, తద్భావః అతిమానితా తదభావః నాతిమానితా, ఆత్మనః పూజ్యతాఽతిశయ భావనాఽభావః ఇత్యర్థః. భవన్తి అభయాదీని ఏతదన్తాని సంపదమ్ అభిజాతస్య. కిం విశిష్టాం సంపదమ్ – దైవీం దేవానాం సంపదమ్ అభిలక్ష్య జాతస్య దైవవిభూత్యర్హస్య భావికల్యాణస్య ఇత్యర్థః, హే భారత.**

**తె.అ.** తేజమంటే ప్రాగల్భ్యము, దక్షత, చర్మసౌందర్యము కాదు. క్షమ తిట్టినపుడు కొట్టినపుడు అంతఃకరణంలో ఏ వికారము కలగకపోవడం. కలిగిన వికారం శాంతించడం అక్రోధమని వెనుక చెప్పబడింది. క్షమకు అక్రోధానికి భేదమిది. ధృతి, దేహేంద్రియాలు అలసినపుడు ఆ అలసటను తొలగించే అంతఃకరణవృత్తి. దానివలన దేహము ఇంద్రియాలు ఉత్సాహం పొంది అలసట చెందవు. శౌచం రెండు విధాలు బాహ్యము ఆభ్యంతరము. మట్టితో నీటితో కలిగేది బాహ్యశౌచము. కాపట్యము రాగము మొదలైన కాలుష్యం లేకుండా మనోబుద్ధులు నిర్మలంగా

ఉండడం ఆభ్యంతర శౌచము. అద్రోహం – పరులకు ద్రోహం కలిగించడం అనే బుద్ధిలేకపోవడం, అంటే హింస చేయకపోవడం. నాతిమానిత, అతిశయమైన అభిమానం లేకపోవడం. తనపై తనకు అతిశయమైన పూజ్యభావం లేకపోవడమని అర్థం. అభయంతో మొదలు పెట్టి ఇంతవరకు చెప్పిన లక్షణాలన్నీ దైవీసంపదతో పుట్టిన వానిలో దైవ విభూతికి అర్హుడైన వానిలో ఉంటాయి. అటువంటి వానికి భవిష్యత్తులో మేలు కలగడం నిశ్చయం.

**భాష్యమ్ : 4.0 అథ ఇదానీం ఆసురీ సంపత్ ఉచ్యతే.**

**తె.అ.** ఇక ఇప్పుడు ఆసురీసంపద చెపుతున్నాడు.

**మూ. దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ ।**
**అజ్ఞానం చాభిజాతస్య పార్థ సంపదమాసురీమ్ ॥ 4**

**తె.అ.** దంభము, దర్పము, అభిమానము, క్రోధము, పారుష్యము, అజ్ఞానము – ఆసురీసంపత్తితో పుట్టినవానికి ఈ లక్షణాలుంటాయి.

**భాష్యమ్ : 4.1 దంభః ధర్మధ్వజిత్వమ్, దర్పః విద్యాధనస్వజనాదినిమిత్తః, ఉత్సేకః, అభిమానః పూర్వోక్తః, క్రోధః, చ, పారుష్యమేవ చ పరుషవచనం, యథా కాణం 'చక్షుష్మాన్', 'విరూపం', 'రూపవాన్', 'హీనాభిజనమ్', 'ఉత్తమాభిజనః' ఇత్యాది, అజ్ఞానం చ అవివేకజ్ఞానం కర్తవ్యాకర్తవ్యాది విషయమిథ్యాప్రత్యయః, అభిజాతస్య, పార్థ! కిమభిజాతస్య ఇత్యాహ అసురాణాం సంపత్ ఆసురీమ్, తామ్ అభిజాతస్య ఇత్యర్థః.**

**తె.అ.** దంభం, ధార్మికతను ప్రదర్శించుకోవడం. దర్పం, ధనము స్వజనములకారణంగా కలిగే గర్వం. అభిమానం, వెనుకటి శ్లోకంలో దీని అర్థం చెప్పాము. క్రోధము పారుష్యము, కష్టం కలిగించేమాట ఎట్లాగంటే ఒంటికంటివాణ్ణి 'ఎంతమంచికళ్ళు' అని, కురూపిని 'అందమైన వాడివని', తక్కువ కులంవాణ్ణి 'ఉత్తమ కులంవాడివని' అనడం. అజ్ఞానమంటే అవివేకం. ఏది కర్తవ్యము ఏది అకర్తవ్యము అన్న విషయంలో పొరపాటు. ఇవి ఆసురీ సంపత్తితో పుట్టినవాని లక్షణాలు.

**భాష్యమ్ : 5.0 అనయోః సమ్పదోః కార్య ఉచ్యతే**

**తె.అ.** ఈ రెండు సంపత్తుల ఫలితం చెపుతున్నాడు.

**మూ. దైవీ సంపద్విమోక్షాయ నిబంధాయాసురీ మతా ।**
**మా శుచస్సంపదం దైవీమభిజాతోఽసి పాండవ ॥ 5**

**తె.అ.** దైవీ సంపత్తి మోక్షానికి, ఆసురీ సంపత్తి బంధానికి దోహదం చేస్తాయి అని అంటారు. అర్జునా, నీవు దైవీసంపత్తితో జన్మించావు, కనుక శోకించవద్దు.

**భాష్యమ్ : 5.1 దైవీ సంపద్ యా సా విమోక్షాయ సంసారబన్ధనాత్, నిబన్ధాయ నిబన్ధః నియతః బన్ధః తదర్థమ్ ఆసురీ సంపత్ మతా అభిప్రేతా. తథా రాక్షసీ చ. తత్ర ఏవమ్ ఉక్తే సతి అర్జునస్య అన్తర్గతం భావం 'కిమహమ్ ఆసురీ సంపద్యుక్తః, కిం వా దైవీసంపద్యుక్తః' ఇత్యేవమ్ ఆలోచనారూపమ్, ఆలక్ష్య ఆహ భగవాన్ మా శుచః శోకం మా కార్షీః సంపదమ్ దైవీమ్, అభిజాతః అసి అభిలక్ష్య జాతః అసి, భావికల్యాణః త్వమ్ అసి ఇత్యర్థః, హే పాణ్డవ!**

**తె.అ.** దైవీ సంపత్తి సంసారబంధంనుండి విముక్తికి దోహదం చేస్తుంది. ఆసురీసంపద తప్పక బంధానికే దోహదం చేస్తుంది. రాక్షసీ సంపదకూడా ఆసురి వంటిదే. ఈ మాట అన్న తరువాత అర్జునుడు తనలో నేను ఆసురసంపత్తి కలవాడినా దైవీ సంపత్తి కలవాడినా అని ఆలోచించడం కనిపెట్టి భగవానుడు అంటున్నాడు. అర్జునా, శోకించవద్దు. నీవు దైవీసంపత్తితో జన్మించావు. భవిష్యత్తులో నీకు మేలు జరుగగలదు అని అర్థం.

**మూ. ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ ।**
**దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ మే శృణు ॥ 6**

**తె.అ.** దైవ ఆసుర అనే రెండువిధాలైన మనుష్యులు ఈ లోకంలో సృష్టించబడ్డారు. దైవసృష్టి వివరంగా చెప్పబడింది. అర్జునా, ఆసురసృష్టి చెపుతా విను.

**భాష్యమ్ : 6.1 ద్వౌ భూతేతి :– ద్వౌ ద్విసంఖ్యాకౌ భూతసర్గౌ భూతానాం మనుష్యాణాం సర్గౌ సృష్టీ భూతసర్గౌ, సృజ్యేతే ఇతి సర్గౌ భూతాన్యేవ సృజ్యమానాని దైవాసురసంపద్ద్వయ యుక్తాని ద్వౌ భూతసర్గౌ ఇతి ఉచ్యతే 'ద్వయా హ వై ప్రాజాపత్యా దేవాశ్చాసురాశ్చ' (బృ.ఉ.1.3.1) ఇతి శ్రుతేః. లోకే అస్మిన్ సంసారే ఇత్యర్థః. సర్వేషాం ద్వైవిధ్యోపపత్తేః. కౌ తౌ భూతసర్గౌ ఇత్యుచ్యతే, ప్రకృతావేవ దైవః ఆసురః ఏవ చ. ఉక్తయోరేవ పునః అనువాదప్రయోజనమాహ దైవః భూతసర్గః 'అభయం సత్త్వసంశుద్ధిః' (16.1) ఇత్యాదినా, విస్తరశః విస్తారప్రకారైః ప్రోక్తః కథితః న తు ఆసురః విస్తరశః, అతః తత్పరివర్జనార్థమ్ ఆసురం పార్థ! మే మమ వచనాత్ ఉచ్యమానం విస్తరశః శృణు అవధారయ.**

**తె.అ.** ఈ లోకంలో అంటే సంసారంలో రెండు విధాలైన మనుషులు సృష్టించబడ్డారు. దైవాసుర సంపత్తులతో కూడినవారు. 'ప్రజాపతి సంతానం రెండు వర్గాలు. దేవతలు అసురులు' అని శ్రుతి. (బృ.ఉ.1.3.1) మనుష్యులందరూ ఈ రెంటిలో ఏదో ఒక వర్గంలో చేరుతారు కనుక

'లోకంలో' అంటున్నాడు. ఏవి ఆ రెండు విధాలైన సృష్టులు? అంటె దైవము ఆసురము. చెప్పినవే అయినప్పటికి మళ్ళీ చెప్పడం ఎందుకంటే 'అభయం సత్త్వసంశుద్ధిః' (16.1) అని మొదలుపెట్టి దైవగుణం కల భూతసృష్టి వివరంగా చెప్పాను, కాని ఆసురము అంత వివరంగా చెప్పలేదు. కనుక అర్జునా, ఆసురమును పరిత్యజించడం కొరకు దాన్ని వివరంగా చెబుతాను విను అని అంటున్నాడు.

**భాష్యమ్ : 7.0 ఆ అధ్యాయ పరిసమాప్తేః ఆసురీ సమ్పత్ ప్రాణివిశేషణత్వేన ప్రదర్శ్యతే, ప్రత్యక్షీకరణేన చ శక్యతే తస్యాః పరివర్జనం కర్తుమితి.**

**తె.అ.** ఈ అధ్యాయం చివరివరకు ఆసురీసంపత్తి మనుష్యులయందు ఏ విధంగా ఉంటుంది అనేది ప్రదర్శింపబడుతున్నది. ప్రత్యక్షంగా తెలుసుకుంటే గదా దానిని పరిత్యజించడం సాధ్యమవుతుంది అని.

**మూ. ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః ।**
**న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే ॥ 7**

**తె.అ.** ఆసురులకు ప్రవృత్తి తెలియదు, నివృత్తి తెలియదు. వారిలో శౌచం గానీ సదాచారం గానీ ఉండదు. సత్యము కూడా వారిలో కనిపించదు.

**భాష్యమ్ : 7.1 ప్రవృత్తిం చ ప్రవర్తనం యస్మిన్ పురుషార్థసాధనే కర్తవ్యే ప్రవృత్తిః తామ్, నివృత్తిం చ తద్విపరీతాం, యస్మాత్ అనర్థహేతోః నివర్తితవ్యం సా నివృత్తిః, తాం చ, జనాః ఆసురాః న విదుః, న జానన్తి. న కేవలం ప్రవృత్తినివృత్తీ ఏవ తే న విదుః, న శౌచం, న అపి చ ఆచారః న సత్యం తేషు విద్యతే. అశౌచాః. అనాచారః, మాయావినః అనృతవాదినః హి ఆసురాః కించ.**

**తె.అ.** ప్రవృత్తి అంటే ప్రవర్తన. పురుషార్థం సాధించడం కొరకు చేయవలసిన దానిని చేసే ప్రయత్నం. దీనికి విపరీతమైనది నివృత్తి. అనర్థహేతువులను నివారించడం నివృత్తి. ఆసురులైన జనులు ఈ రెండూ ఎరుగరు. కేవలం ప్రవృత్తి నివృత్తులే కాదు, వారికి శౌచము, ఆచారము, సత్యము కూడా తెలియవు. వారు అశుచులు, ఆచారము లేనివారు, అసత్యము మాట్లాడే వారు కూడా.

**మూ. అసత్యమప్రతిష్ఠం తే జగదాహురనీశ్వరమ్ ।**
**అపరస్పరసంభూతం కిమన్యత్కామహైతుకమ్ ॥ 8**

**తె.అ.** ఈ జగత్తులో అసత్యము అనేది లేదు; దీనికి ఆధారం లేదు. దీనికొక ప్రభువు లేదు. పరస్పర సంయోగంవల్ల పుట్టింది. కామం తప్ప దీనికి మరొక కారణంలేదు, అని వారంటారు.

**భాష్యమ్ : 8.1 అసత్యం యథా వయమ్ అనృతప్రాయాః తథా ఇదమ్ జగత్ సర్వం అసత్యమ్ అప్రతిష్ఠం చ నాస్య ధర్మాధర్మౌ ప్రతిష్ఠా అతః అప్రతిష్ఠ చ ఇతి తే ఆసురాః జనాః జగత్ ఆహుః అనీశ్వరమ్ న చ ధర్మాధర్మ సవ్యపేక్షకః అస్య శాసితా ఈశ్వరః విద్యతే ఇత్యతః అనీశ్వరం జగత్ ఆహుః. కిం చ అపరస్పరం సంభూతం కామప్రయుక్తయోః స్త్రీపురుషయోః అన్యోన్యసంయోగాత్ జగత్సర్వం సంభూతమ్. కిం అన్యత్ కామహైతుకం – కామహేతుః ఏవ కామహైతుకమ్, కిమ్ అన్యత్ జగతః కారణం, న కించిత్ అదృష్టం ధర్మాధర్మాది కారణాన్తరం విద్యతే జగతః 'కామ ఏవ ప్రాణినాం కారణమ్' ఇతి లోకాయతిదృష్టిరియమ్.**

**తె.అ.** మనమెట్లా అసత్యవాదులమో ఈ సర్వజగత్తు కూడా అట్లాగే అసత్యము. దీనికి ధర్మాధర్మాలయందు ఆధారంలేదు. ధర్మాధర్మాలను గణించే శాసకుడు ఈశ్వరుడు లేడు. అంతేకాదు, కామప్రయుక్తులైన స్త్రీ పురుషుల అన్యోన్య సంయోగంవల్ల సర్వజగత్తు పుడుతున్నది. ఈ జగత్తుకు స్త్రీ పురుష కామం తప్ప మరొక కారణం అదృష్టధర్మాధర్మరూపమైనది కనిపించదు, అని ఆసుర జనులంటారు. 'కామమే ప్రాణులకు కారణము' అన్న లోకాయతికదృష్టి (ప్రత్యక్షంగా కనిపించేదాన్ని మాత్రమే నమ్మేవాళ్ళు) ఇది.

**మూ. ఏతాం దృష్టిమవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః ।**
**ప్రభవన్త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః ॥ 9**

**తె.అ.** ఈ దృష్టిని అవలంబించి నష్టాత్ములు ఈ అల్పబుద్ధులు అయినవారు జగత్తును నాశనం చేయడం కొరకు ఉగ్రకర్మలు చేస్తారు. వీరు జగత్తుకు శత్రువులు.

**భాష్యమ్ : 9.1 ఏతామితి :– ఏతాం దృష్టిమ్ అవష్టభ్య ఆశ్రిత్య, నష్టాత్మానః నష్టస్వ–భావాః, విభ్రష్ట పరలోకసాధనాః అల్పబుద్ధయః విషయవిషయా అల్పైవ బుద్ధిః యేషాం తే అల్పబుద్ధయః ప్రభవన్తి ఉద్భవన్తి, ఉగ్రకర్మాణః క్రూరకర్మాణః హింసాత్మకాః. క్షయాయ జగతః 'ప్రభవన్తి' ఇతి సంబన్ధః. జగతః అహితాః శత్రవః ఇత్యర్థః.**

**తె.అ.** ఈ దృష్టిని ఆశ్రయించి పరలోక సాధననుండి భ్రష్టులై ప్రాపంచిక విషయాలకే పరిమితమైన అల్పబుద్ధులై జగత్తును నాశనం చేయడంకొరకు హింసాత్మకులై క్రూర కర్మలు చేస్తారు. జగత్తుయొక్క క్షయంకొరకే వారు పుడతారు. జగత్తుకు వారు శత్రువులు అని అర్థం. ఇంకా వారు–

**మూ. కామమాశ్రిత్య దుష్పూరం దమ్భమానమదాన్వితాః ।**
**మోహాద్గృహీత్వాఽసద్గ్రాహాన్ప్రవర్తన్తేఽశుచివ్రతాః ॥ 10**

**తె.అ.** తీరని కోరికతో దంభమానమదాన్వితులై మోహంచేత అసద్విషయాలను పట్టుకుని అశుచివ్రతులై ప్రవర్తిస్తారు.

**భాష్యమ్ : 10.1 కామమ్ ఇచ్ఛావిశేషమ్, ఆశ్రిత్య అవష్టభ్య, దుష్పూరమ్ అశక్యపూరణం, దమ్భమానమదాన్వితాః దమ్భశ్చ మానశ్చ మదశ్చ దమ్భమానమదాః, తై అన్వితాః దమ్భమాన మదాన్వితాః, మోహాత్ అవివేకతః, గృహీత్వా, ఉపాదాయ అసద్ గ్రహాన్ అశుభనిశ్చయాన్, ప్రవర్తన్తే, అశుచివ్రతాః, అశుచీని వ్రతాని యేషాం తే అశుచివ్రతాః.**

**తె.అ.** తీర్చరాని కామమును పూని డాంబికము, అహంకారం, గర్వాన్ని ప్రదర్శిస్తూ అవివేకులై అశుభనిశ్చయులై అపవిత్ర నిర్ణయాలు తీసుకొని లోకంలో ప్రవర్తిస్తారు. అంతేకాదు–

**మూ. చిన్తామపరిమేయాం చ ప్రలయన్తాముపాశ్రితాః ।**
**కామోపభోగపరమా ఏతావదితి నిశ్చితాః ॥ 11**

**తె.అ.** మరణించేవరకు అంతులేని ఆలోచనతో, ఇంద్రియ సుఖాలు అనుభవించడమే పరమలక్ష్యంగా భావిస్తూ ఇంతకుమించి వేరేలేదన్న నిశ్చయంతో –

**భాష్యమ్ : 11.1 చిన్తామ్, అపరిమేయాం చ న పరిమాతుం శక్యతే యస్యాః చిన్తాయాః ఇయత్తా సా అపరిమేయా, తామ్ అపరిమేయాం ప్రలయాన్తాం మరణాన్తామ్, ఉపాశ్రితాః, సదా చిన్తాపరా ఇత్యర్థః. కామోపభోగ పరమాః కామ్యన్తే ఇతి కామాః శబ్దాదయః, విషయాః తదుపభోగ పరమాః, 'అయమేవ పరమః పురుషార్థః యః కామోపభోగః' ఇత్యేవం నిశ్చితాత్మానః ఏతావదితి నిశ్చితాః**

**తె.అ.** మరణకాలం వరకు ఇదే చింతనలో ఉంటూ (అంటే ఇంత అని కొలవడానికి శక్యంకానంతగా) చింతను ఆశ్రయించిన వారై అని అర్థం. శబ్దాది విషయాలను అనుభవించడమే పరమపురుషార్థం అనే నిశ్చయం గలవారై –

**మూ. ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః ।**
**ఈహన్తే కామభోగార్థమన్యాయేనార్థసంచయాన్ ॥ 12**

**తె.అ.** అసంఖ్యాకమైన ఆశాపాశాలచేత బద్ధులై కామక్రోధ పరాయణులై కామభోగం కొరకు అన్యాయంగా ధనం కూడబెట్టే యత్నం చేస్తారు.

**భాష్యమ్ : 12.1 ఆశాపాశేతి :– ఆశాపాశశతైః ఆశాః ఏవ పాశాః, తచ్ఛతైః ఆశాపాశ – శతైః, బద్ధా, నియన్త్రితాః సన్తః, సర్వతః ఆకృష్యమాణాః, కామక్రోధపరాయణాః కామక్రోధౌ పరమ్**

**అయనం ఆశ్రయః యేషాం తే కామక్రోధ పరాయణాః, ఈహన్తే చేష్టన్తే కామభోగార్థం కామభోగ ప్రయోజనాయ, న ధర్మార్థమ్, అన్యాయేన పరస్వాపహరణాదినా ఇత్యర్థః. కిమ్? అర్థసంచయాన్ అర్థప్రచయాన్. ఈదృశశ్చ తేషాం అభిప్రాయః**

**తె.అ.** ఆశ అనే త్రాడు ఆశాపాశం. అటువంటి వందల ఆశాపాశాలతో కట్టబడి అంటే అన్నివైపులకు లాగబడి కామక్రోధాదులను ఆశ్రయించి, కోరికలను అనుభవించుట కొరకు పనులు చేస్తారు తప్ప ధర్మాచరణకు కాదు. కామభోగం కొరకు అన్యాయంగా అర్థ సంచయం చేయడానికి యత్నం చేస్తారు. అన్యాయంగా అంటే పరులసొమ్ము అపహరించి అని. వారి అభిప్రాయమిది –

**మూ. ఇదమద్య మయా లబ్ధమిదం ప్రాప్స్యే మనోరథమ్ ।**
**ఇదమస్తీదమపి మే భవిష్యతి పునర్ధనమ్ ॥ 13**

**తె.అ.** ఈవేళ నేను ఇది సంపాదించాను. ముందు మరొకకోరిక నెరవేరుతుంది. ఇప్పుడు నాకు ఇంత ధనం ఉంది. ముందు కూడా ఇంకా ధనం వస్తుంది మళ్ళీ –

**భాష్యమ్ : 13.1 ఇదం ద్రవ్యమ్, అద్య ఇదానీం మయా లబ్ధమ్. ఇదమ్ అన్యత్ ప్రాప్స్యే. మనోరథం మనస్తుష్టికరమ్. ఇదం చ అస్తి. ఇదమ్ అపి చ మే భవిష్యతి ఆగామిని సంవత్సరే పునః ధనమ్, తేన అహం ధనీ విఖ్యాతః భవిష్యామి.**

**తె.అ.** ఈ సొమ్ము నేను ఈవేళ పొందాను. ముందు మరొక మనోరథాన్ని మనస్సుకు సంతోషం కలిగించే దానిని పొందగలను. ఇది ఉన్నది, వచ్చే సంవత్సరం ధనం ఇంకా వస్తుంది దానితో నేను ధనవంతుణ్ణి విఖ్యాతుణ్ణి అవుతాను అని.

**మూ. అసౌ మయా హతః శత్రుర్హనిష్యే చాపరానపి ।**
**ఈశ్వరోఽహమహం భోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ ॥ 14**

**తె.అ.** ఈ శత్రువును నేను చంపాను. మిగిలినవారిని కూడా చంపుతాను, నేను ప్రభువును, నేను భోగిని, నాకు అన్నీ ఉన్నవి, నేను బలవంతుణ్ణి, సుఖిని.

**భాష్యమ్ : 14.1 అసౌ మయేతి :– అసౌ దేవదత్తనామా మయా హతః దుర్జయః శత్రుః. హనిష్యే చ అన్యాన్ వరాకాన్ అపరాన్ అపి. కిమేతే కరిష్యన్తి తపస్వినః? సర్వాథాఽపి నాస్తి మత్తుల్యః. కథమ్? ఈశ్వరః అహమ్, అహం భోగీ, సర్వప్రకారేణ చ సిద్ధః అహం సంపన్నః పుత్రైః నప్తృభిః న కేవలం మానుషోహమ్. బలవాన్ సుఖీ చ అహమేవ, అన్యే తు భూమిభారాయ అవతీర్ణాః**

**తె.అ.** జయించడానికి కష్టమైన దేవదత్తుడనే పేరుగల ఈ శత్రువును నేను చంపాను. తక్కిన అల్ప శత్రువులను కూడా చంపుతాను. ఈ బక్కచిక్కిన తాపసులు ఏం చేయగలరు? ఏ విషయంలోనూ నాతో సమానమైనవాడు లేడు. ఎట్లా? నేను ప్రభువును, నేను భోగిని. నేను అన్నివిధాలా పుత్రులతో, పౌత్రులతో సంపన్నుణ్ణి. నేను మానవమాత్రుణ్ణి గాను, నేనే బలవంతుణ్ణి సుఖిని. తక్కినవారు భూమికి భారం మాత్రమే.

**మూ. ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా,**
**యక్ష్యే దాస్యామి మోదిష్యే ఇత్యజ్ఞానవిమోహితాః. 15**

**తె.అ.** నేను ఉన్నవాణ్ణి, ఉత్తమ కుటుంబంలో జన్మించాను. నాతో సమానమైనవాడు మరొకడెవడు? యజ్ఞాలు చేస్తాను, దానాలు చేస్తాను, సుఖంగా ఉంటాను అని అజ్ఞానమోహితులై అనుకొంటారు.

**భాష్యమ్ : 15.1 ఆఢ్యః ఇతి :- ఆఢ్యః ధనేన. అభిజనవాన్ సప్తపురుషం శ్రోత్రియత్వాది- సంపన్నః, తేనాపి న మమ తుల్యః అస్తి కశ్చిత్. కః అన్యః అస్తి, సదృశః తుల్యః మయా? కిం చ యక్ష్యే యాగేనాపి అన్యాన్ అభిభవిష్యామి. దాస్యామి నటాదిభ్యః, మోదిష్యే హర్షం చ అతిశయం ప్రాప్స్యామి. ఇత్యేవమ్ అజ్ఞానేన విమోహితాః అజ్ఞానవిమోహితాః వివిధమ్ అవివేకభావమ్ ఆపన్నాః.**

**తె.అ.** అజ్ఞాన విమోహితులు నానావిధ అవివేకభావనాయుక్తులు ఇట్లా అనుకుంటారు. ఉన్నవాణ్ణి అంటే ధనమున్నవాణ్ణి. ఏడు తరాలనుండి శ్రోత్రియులైన ఉత్తముల కుటుంబంలో జన్మించాను. నాతో సమానమైనవాడు మరొకడెవడు? యాగాలలో కూడా ఇతరులను మించిపోతాను. నటులు మొదలైనవారికి దానాలు చేస్తాను. అతిశయమైన సంతోషం పొందుతాను.

**మూ. అనేకచిత్తవిభ్రాన్తా మోహజాలసమావృతాః,**
**ప్రసక్తాః కామభోగేషు పతన్తి నరకేఽశుచౌ. 16**

**తె.అ.** అనేక ఆలోచనలచేత భ్రమచెంది మోహమనే వలలో చిక్కుకుని కామభోగాలలో తగుల్కొని వారు నరక కూపంలో పడతారు.

**భాష్యమ్ : 16.1 అనేకేతి :- అనేకచిత్తవిభ్రాన్తాః ఉక్తప్రకారైః అనేకైః చిత్తైః వివిధాం భ్రాన్తాః అనేకచిత్త విభ్రాన్తాః మోహజాలసమావృతాః మోహః అవివేకః అజ్ఞానమ్. తదేవ జాలమ్ ఇవ, ఆవరణాత్మకత్వాత్. తేన సమావృతాః, ప్రసక్తాః కామభోగేషు, తత్రైవ నిషణ్ణాః సన్తః, తేన ఉపచిత కల్మషాః, పతన్తి నరకే అశుచౌ వైతరణ్యాదౌ.**

**తె.అ.** పైన చెప్పిన అనేక ఊహలచేత భ్రమచెంది, మోహమనే వలలో చిక్కుకుని విషయ భోగాలలో మునిగిపోయి, పాపాలు మూటగట్టుకుని వీరు వైతరిణి వంటి మురికి నరకంలో పడతారు. మోహమంటే అవివేకం అజ్ఞానం. దానికి కప్పివేసే స్వభావం కనుక అదే వల ఆవరిస్తుంది.

**మూ. ఆత్మసంభావితాః స్తబ్ధాః ధనమానమదాన్వితాః ।**
**యజన్తే నామయజ్ఞైస్తే దమ్భేనాఽవిధిపూర్వకమ్ ॥ 17**

**తె.అ.** గొప్పవారమని తమకు తామే భావించుకొనే వాళ్ళు, స్తబ్ధులు ధనంతో అహంకార మదంతో బిర్రబిగిసినవారు, వీరు దంభంగా శాస్త్ర ప్రకారం కాకుండా వాళ్ళకు తోచినట్లు యజ్ఞాలు చేసి పూజిస్తారు.

**భాష్యమ్ : 17.1 ఆత్మేతి :- ఆత్మసంభావితాః సర్వగుణవిశిష్టతయా ఆత్మనైవ సంభావితాః న సాధుభిః. స్తబ్ధాః అప్రణతాత్మానః, ధనమానమదాన్వితాః ధననిమిత్తః మానః మదశ్చ, తాభ్యాం ధనమానమదాభ్యామ్ అన్వితాః, యజన్తే, నామయజ్ఞైః నామమాత్రైః యజ్ఞై ః, తే, దమ్భేన ధర్మధ్వజితయా అవిధిపూర్వకమ్ విధివిహితాంగేతికర్తవ్యతారహితమ్.**

**తె.అ.** ఆత్మ సంభావితులు, తమ్ముతాము సర్వగుణ సంపన్నులుగా సంభావించుకుని, తమ్ము తామే గొప్ప చేసుకునేవారు, సాధువులచేత సంభావించబడినవారు కారు. స్తబ్ధులు, వినయంలేని వారు, ధనమానమదాన్వితులు, ధనకారణంగా కలిగిన గర్వము మదములతో నిండినవారు. వీరు తమ ధార్మికతను ప్రకటించడంకొరకు విధించబడిన యజ్ఞాంగముల పరిజ్ఞానంలేకుండా పేరుకు మాత్రం యజ్ఞాలు చేస్తారు.

**మూ. అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః ।**
**మామాత్మపరదేహేషు ప్రద్విషన్తోఽభ్యసూయకాః ॥ 18**

**తె.అ.** అహంకారము, బలము, దర్పము, కామము, క్రోధము – వీటిని ఆశ్రయించి అసూయాపరులై నన్ను తమ దేహంలోనూ పరుల దేహంలోనూ ద్వేషిస్తారు.

**భాష్యమ్ : 18.1 అహమితి :- అహంకారమ్ అహంకరణమ్ అహంకారః విద్యమానైః అవిద్యమానైః చ గుణైః ఆత్మని అధ్యారోపితైః విశిష్టమ్ ఆత్మానమ్ 'అహమితి' మన్యతే, సః అహంకారః అవిద్యాఖ్యః, కష్టతమః సర్వదోషాణాం మూలం, సర్వానర్థప్రవృత్తీనాం చ. తథా బలం పరాభిభవ- నిమిత్తం కామరాగాన్వితమ్. దర్పమ్ దర్పః నామ యస్య ఉద్భవే ధర్మమ్**

**అతిక్రామతి. సః అయమ్ అన్తఃకరణాశ్రయః దోషవిశేషః. కామమ్ స్త్ర్యాది విషయమ్. క్రోధమ్ అనిష్టవిషయమ్. ఏతాన్ అన్యాన్ చ మహతః దోషాన్ సంశ్రితాః కిం చ తే మామ్ ఈశ్వరమ్ ఆత్మపరదేహేషు, స్వదేహే పరదేహేషు చ తద్బుద్ధికర్మసాక్షిభూతం మాం ప్రద్విషన్తః, మచ్ఛాసనాతివర్తిత్వం ప్రద్వేషః తం కుర్వన్తః అభ్యసూయకాః సన్మార్గస్థానాం గుణేషు అసహమానాః**

**తె.అ.** ఉన్నవి లేనివి గుణాలు తనయందు ఆరోపించుకుని నేను గుణవిశిష్టుడను అనుకోవడం, అహంకారం. ఇది అవిద్య అనే గొప్పకష్టం. సర్వదోషాలకు మూలం. సర్వానర్థాలయందు ప్రవృత్తి కలగడానికి కూడా మూలమిదే. బలం, పరులను పరాభవించడం కొరకు కామంతో రాగంతో కూడినది. దర్పం – ఇది పుట్టినపుడు ధర్మాన్ని అతిక్రమిస్తాడు. అంతఃకరణాశ్రయమైన దోషమిది. కామం, స్త్రీ మొదలైన విషయంలో కలిగేది. క్రోధం, ఇష్టంకాని విషయంలో కలిగేది. ఇవి, ఇవికాక ఇంకా ఇతర మహాదోషాలను ఆశ్రయించినవారు స్వదేహంలోను పరదేహంలోను వారి బుద్ధికర్మసాక్షినైన నన్ను ద్వేషిస్తున్నారు. నా శాసనాన్ని అతిక్రమించడమే నన్ను ద్వేషించడం. వారు అసూయాపరులు, సన్మార్గంలో నడిచేవారి గుణాలను సహించలేనివారు.

**మూ. తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్ ।**
**క్షిపామ్యజస్రమశుభానాసురీష్వేవ యోనిషు ॥ 19**

**తె.అ.** వారు ద్వేషపూరితులు. సతతము అశుభకర్మలు చేసే క్రూరులను అంటే నరాధములను సంసారంలో పడవేసి వీరిని ఆసురీయోనులందే జన్మ ఎత్తేటట్లు చూస్తాను.

**భాష్యమ్ : 19.1 తానహమితి :– తాన్ అహం సర్వాన్ సన్మార్గప్రతిపక్షభూతాన్ సాధుద్వేషిణః ద్విషత్ చ మాం క్రూరాన్, సంసారేష్వేవ అనేక నరకసంసారమార్గేషు, నరాధమాన్ అధర్మదోషవత్త్వాత్, క్షిపామి ప్రక్షిపామి. అజస్రం సంతతమ్, అశుభాన్ అశుభకర్మకారిణః ఆసురీష్వేవ క్రూరకర్మ ప్రాయాసు వ్యాఘ్రసింహాది యోనిషు – 'క్షిపామి' ఇత్యనేన సంబన్ధః**

**తె.అ.** వారు సన్మార్గ విరోధులు. సాధువులను, నన్నుకూడా ద్వేషిస్తారు. నరకానికి దారితీసే అనేక సంసార మార్గాలలో క్రూరులై ప్రవర్తిస్తారు. సతతము అశుభకర్మలు చేస్తూంటారు. అటువంటి నరాధములను అధర్మ దోష కారణంగా నేను పులి సింహము వంటి క్రూరకర్మలు చేయు ఆసురీయోనులందే పడతోస్తాను.

**మూ. ఆసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని ।**
**మామప్రాప్యైవ కౌన్తేయ తతో యాన్త్యధమాం గతిమ్ ॥ 20**

**తె.అ.** కౌన్తేయా, ఆసురీయోనులందు జన్మించి జన్మజన్మలలో మూఢులై నన్ను చేరక అంతకంటె అధోగతి చెందుతారు.

**భాష్యమ్ : 20.1 ఆసురీమితి :– ఆసురీం యోనిమ్, ఆపన్నాః ప్రతిపన్నాః, మూఢాః అవివేకినః జన్మని జన్మని ప్రతిజన్మ తమోబహులాస్వేవ యోనిషు జాయమానాః అధః గచ్ఛన్తః. మూఢా మామ్ ఈశ్వరమ్, అప్రాప్య అనాసాద్యైవ, హే కౌన్తేయ, తతః తస్మాదపి, యాన్తి అధమాం గతిమ్. నికృష్టతమాం గతిమ్. 'మామ్ అప్రాప్య ఏవ ఇతి న మత్ప్రాప్తౌ కాచిదప్యాశఙ్కా అస్తి, అతః మచ్ఛిష్టసాధుమార్గ ప్రాప్తిమ్ అప్రాప్యేత్యర్థః.**

**తె.అ.** అర్జునా, మళ్ళీ మళ్ళీ తమోబహుళమైన ఆసురీయోనులందు జన్మించి మూఢులై వివేకం కోల్పోయి ఈశ్వరుని నన్ను చేరక పూర్వంకంటె నికృష్టమైన అధమగతిని చెందుతారు. 'నన్ను చేరక' అనడంవల్ల నన్ను చేరితే ఏ కష్టము ఉండదు. నేను చెప్పిన శిష్టసాధుమార్గం అవలంబించ నందున ఈ కష్టము అని అర్థం.

**భాష్యమ్: 21.0 సర్వస్యాః ఆసుర్యాః సంపదః సంక్షేపః అయమ్ ఉచ్యతే. యస్మిన్ త్రివిధే సర్వః ఆసురీ సంపద్భేదః అనన్తః అపి అన్తర్భవతి, యత్పరిహారేణ పరిహృతః చ భవతి, యత్ మూలం సర్వస్య అనర్థస్య తత్ ఏతత్ ఉచ్యతే.**

**తె.అ.** సమస్త ఆసురీలక్షణాలు సంక్షేపంగా చెప్పబడుతున్నాయి. ఆసురీసంపత్తి భేదాలు అనంతమైనప్పటికీ, అవన్నీ ఇప్పుడు చెప్పబోయే త్రివిధంలో చేరిపోతాయి. ఈ మూడింటిని పరిహరిస్తే ఆసురీసంపత్తిని మొత్తము పరిహరించినట్లే. ఎందుకంటే ఈ మూడూ సర్వానర్థాలకు మూలం కనుక.

**మూ. త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః ।**
**కామః క్రోధస్తథా లోభస్తస్మాదేతత్త్రయం త్యజేత్ ॥ 21**

**తె.అ.** ఆత్మనాశనం కలిగించే ఈ నరకానికి మూడు ద్వారాలు కామము, క్రోధము, లోభము. కనుక ఈ మూడింటిని వదలవలెను.

**భాష్యమ్ : 21.1 త్రివిధం త్రిప్రకారం నరకస్య ప్రాప్తౌ ఇదం ద్వారం, నాశనమ్ ఆత్మనః. యత్ ద్వారం ప్రవిశన్నేవ ఆత్మా, కస్మైచిత్ పురుషార్థాయ యోగ్యః న భవతి ఇత్యేతత్. అతః ఉచ్యతే, 'ద్వారం నాశనమాత్మనః' ఇతి. కిం తత్? కామః క్రోధః తథా లోభః తస్మాత్ ఏతత్ త్రయం త్యజేత్. యతః ఏతత్ ద్వారం నాశనమ్ ఆత్మనః తస్మాత్ కామాదిత్రయమ్ ఏతత్ త్యజేత్. త్యాగస్తుతిరియమ్.**

**తె.అ.** నరకప్రాప్తికి ద్వారం మూడు విధాలుగా ఉంటుంది. ఆ ద్వారం ప్రవేశిస్తూనే ఆత్మ నాశనం అవుతుంది. ఏ పురుషార్థానికి యోగ్యుడు కాకుండా పోతాడు అని. ఏది ఆ ద్వారం? కామము, క్రోధము, లోభము. కనుక ఈ మూడింటిని వదలవలెను. ఇది ఆత్మనాశనం కలిగించే ద్వారము కనుక కామక్రోధలోభాలు త్యజించదగినవి. ఆ త్యాగాన్ని స్తుతిస్తూ తరువాతి శ్లోకం.

**మూ. ఏతైర్విముక్తః కౌన్తేయ తమోద్వారైస్త్రిభిర్నరః ।**
**ఆచరత్యాత్మనః శ్రేయస్తతో యాతి పరాం గతిమ్ ॥ 22**

**తె.అ.** కుంతీపుత్రా! ఈ మూడు తమోద్వారాలనుండి ముక్తుడై నరుడు ఆత్మ శ్రేయస్సు కలిగే విధంగా నడుచుకుంటాడు. దానివలన పరమగతిని పొందుతాడు.

**భాష్యమ్ : 22.1 ఏతైరితి :- ఏతైః విముక్తః కౌన్తేయ! తమోద్వారైః తమసః నరకస్య దుఃఖ మోహాత్మకస్య ద్వారాణి కామాదయః, తైః ఏతైః త్రిభిః విముక్తః నరః, ఆచరతి అనుతిష్ఠతి. కిమ్? ఆత్మనః శ్రేయః యత్ప్రతిబద్ధః పూర్వం న ఆచచార! తదపగమాత్ ఆచరతి. తతః తదాచరణాత్, యాతి పరాం గతిం మోక్షమ్ అపి ఇతి.**

**తె.అ.** అర్జునా, దుఃఖమోహాత్మకాలైన నరకద్వారాలు ఈ కామాది తమోద్వారాలు మూడు. వీటినుండి ముక్తుడై నరుడు ఆచరిస్తాడు. ఏమాచరిస్తాడు? ఆత్మశ్రేయస్సు. కామాదులచేత ప్రతిబద్ధుడై పూర్వమేది ఆచరించలేదో ఆ ఆత్మశ్రేయస్సును కామాదులు తొలగిపోగానే ఆచరిస్తాడు. ఆ ఆచరణ వలన పరమగతిని అంటే మోక్షమును కూడా పొందుతాడు. 'కూడా' అనడంచేత ఈ లోకంలో సుఖం పొందుతాడు, అంతేకాక మోక్షం కూడా అని.

**భాష్యమ్ : 23.0 సర్వస్య ఏతస్య ఆసురీసంపత్పరివర్జనస్య శ్రేయ ఆచరణస్య చ శాస్త్రం కారణమ్. శాస్త్రప్రమాణాత్ ఉభయం కర్తుం శక్యం, న అన్యథా, అతః -**

**తె.అ.** ఆసురీ సంపదను వదలడానికి, శ్రేయమును ఆచరించడానికి శాస్త్రం కారణం. ఈ రెండూ శాస్త్రప్రమాణం చేతనే చేయబడగలవు, మరొకవిధంగా కాదు కనుక -

**మూ. యః శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః ।**
**న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్ ॥ 23**

**తె.అ.** శాస్త్రవిధిని పాటించక కామంతో ప్రవర్తించేవాడు సిద్ధిని పొందడు. వానికి సుఖములేదు. స్వర్గమోక్షాలు లేవు.

**భాష్యమ్ : 23.1 యః శాస్త్రవిధిం శాస్త్రం వేదః తస్యవిధిం కర్తవ్యాకర్తవ్యజ్ఞానకారణం విధిప్రతిషేధాఖ్యమ్, ఉత్సృజ్య త్యక్త్వా, వర్తతే, కామకారతః కామప్రయుక్తః సన్, న, సః సిద్ధిం పురుషార్థయోగ్యతామ్ అవాప్నోతి. న అపి అస్మిన్ లోకే సుఖం, నాపి పరాం ప్రకృష్టాం గతిం స్వర్గం మోక్షం వా.**

**తె.అ.** ఇది కర్తవ్యము ఇది అకర్తవ్యము అని విధిప్రతిషేధరూపమైన వేదవిధిని వదలి కామప్రయుక్తుడై ప్రవర్తించేవాడు పురుషార్థయోగ్యతను పొందడు. ఈ లోకంలో సుఖం కూడా పొందడు. పరమగతిని, స్వర్గం కాని మోక్షం కాని పొందడు.

**మూ. తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ ।**
**జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి ॥ 24**

**తె.అ.** కనుక ఏది చేయదగును ఏది చేయరాదు అన్న విషయంలో నీకు శాస్త్రం ప్రమాణం. శాస్త్రం చెప్పిన విధానాన్ని తెలుసుకుని నీవు ఇక్కడ కర్మచేయదగును.

**ఇతి శ్రీ మహాభారతే శతసాహస్ర్యాం వైయాసిక్యాం భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే దైవాసురసంపద్విభాగయోగో నామ షోడశోఽధ్యాయః.**

ఇది వ్యాసభగవానుని శతసహస్ర సంహిత అయిన శ్రీ మహాభారతంలో భీష్మపర్వంలో ఉపనిషత్తులు బ్రహ్మవిద్య యోగశాస్త్రము శ్రీకృష్ణార్జున సంవాదము అయిన భగవద్గీతలయందు దైవాసుర సంపద్విభాగయోగం అనే పదునారవ అధ్యాయానికి తెలుగు అనువాదం.

**భాష్యమ్ : 24.1 తస్మాదితి :– తస్మాత్ శాస్త్రం ప్రమాణం జ్ఞానసాధనం, తే తవ, కార్యాకార్య వ్యవస్థితౌ కర్తవ్యాకర్తవ్యవ్యవస్థాయామ్, అతః జ్ఞాత్వా బుద్ధ్వా, శాస్త్రవిధానోక్తమ్, విధిః విధానమ్, శాస్త్రమేవ విధానం శాస్త్రవిధానమ్, 'కుర్యాత్ న కుర్యాత్' ఇత్యేవం లక్షణమ్. తేన ఉక్తం స్వకర్మ యత్ తత్ కర్తుమ్ ఇహ అర్హసి. 'ఇహ' ఇతి కర్మాధికార భూమిప్రదర్శనార్థమ్ ఇతి.**

**తె.అ.** కార్యాకార్యముల వ్యవస్థ తెలుసుకోవడానికి శాస్త్రం ప్రమాణం. శాస్త్రవిధానమంటే చేయదగును చేయరాదు అని చెప్పేది. ఆ విధంగా చెప్పిన కర్మలనన్నిటిని తెలిసి ఇక్కడ నీవు చేయదగును. 'ఇక్కడ' అనడం కర్మాధికారభూమిని ప్రదర్శించడం కొరకు.

**ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యగోవిన్దభగవత్పూజ్యపాదశిష్యశ్రీమచ్ఛంకరభగవతః కృతౌ శ్రీమద్భగవద్గీతాభాష్యే దైవాసురసంపద్విభాగయోగో నామ షోడశోఽధ్యాయః.**

ఇది శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య గోవింద భగవత్పూజ్యపాదశిష్యులు శ్రీమత్ శంకర భగవత్పాదులు రచించిన శ్రీమద్భగవద్గీతాభాష్యంలో దైవాసురసంపద్విభాగయోగమనే పదహారవ అధ్యాయానికి తెలుగు అనువాదం.



# సప్తదశోఽధ్యాయః

# శ్రద్ధాత్రయ విభాగయోగః

**భాష్యమ్ : 0.1 'తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే' ఇతి భగవద్వాక్యాత్ లబ్ధప్రశ్నబీజః అర్జున ఉవాచ –**

**తె.అ.** 'తస్మాత్ శాస్త్రం ప్రమాణం తే' అన్న భగవానుని వాక్యంలో ప్రశ్నబీజం దొరికిన అర్జునుడు అంటున్నాడు.

**అర్జున ఉవాచ –**

**మూ. యే శాస్త్రవిధిముత్సృజ్య యజన్తే శ్రద్ధయాఽన్వితాః ।**
**తేషాం నిష్ఠా తు కా కృష్ణ సత్త్వమాహోరజస్తమః. 1**

అర్జునుడు అంటున్నాడు –

**తె.అ.** కృష్ణా, మరి శాస్త్రవిధిని వదలి శ్రద్ధతో పూజించేవారి నిష్ఠ ఎటువంటిది? సత్త్వమా రజస్సా తమస్సా?

**భాష్యమ్ : 1.1 యే ఇతి. యే కేచిత్ అవిశేషితాః శాస్త్రవిధిం శాస్త్రవిధానం శ్రుతిస్మృతి శాస్త్ర చోదనాం ఉత్సృజ్య పరిత్యజ్య యజంతే దేవాదీన్ పూజయంతి శ్రద్ధయా అన్వితాః శ్రద్ధయా ఆస్తిక్యబుద్ధ్యా అన్వితాః సంయుక్తాః సంతః శృతిలక్షణం స్మృతిలక్షణం వా కంచిత్ శాస్త్రవిధిం అపశ్యంతః వృద్ధవ్యవహారదర్శనాదేవ శ్రద్ధానతయా యే దేవాదీన్ పూజయంతి తే ఇహ 'యే శాస్త్రవిధిముత్సృజ్య యజంతే శ్రద్ధయాఽన్వితాః' ఇత్యేవం గృహ్యంతే. యే పునః కంచిత్ శాస్త్రవిధిం ఉపలభమానా ఏవ తం ఉత్సృజ్య అయథావిధి దేవాదీన్ పూజయంతి తే ఇహ 'యే శాస్త్రవిధిముత్సృజ్య యజంతే' ఇతి న పరిగృహ్యంతే. కస్మాత్? శ్రద్ధయా అన్వితత్వవిశేషణాత్. దేవాదిపూజావిధిపరం కించిత్ శాస్త్రం పశ్యంత ఏవ తత్ ఉత్సృజ్య అశ్రద్ధానతయా తద్విహితాయాం దేవాదిపూజాయాం శ్రద్ధయా అన్వితాః ప్రవర్తంతే ఇతి న శక్యం కల్పయితుం యస్మాత్, తస్మాత్ పూర్వోక్తా ఏవ 'యే శాస్త్రవిధిముత్సృజ్య యజంతే శ్రద్ధయాఽన్వితాః' ఇత్యత్ర గృహ్యంతే. తేషాం ఏవంభూతానాం నిష్ఠా తు అవస్థానం కా కృష్ణ! సత్త్వం ఆహో రజః తమః, కిం సత్త్వం నిష్ఠా అవస్థానం, ఆహోస్విత్ రజః, అథవా తమః ఇతి? ఏతత్ ఉక్తం భవతి – యా తేషాం దేవాదివిషయా పూజా, సా కిం సాత్వికీ ఆహోస్విత్ రాజసీ, ఉత తామసీ ఇతి?**

**తె.అ.** కొందరు సాధారణ మనుష్యులు శ్రుతి స్మృతి శాస్త్రవిధానం వదలి శ్రద్ధతో అంటే ఆస్తిక్యబుద్ధితో దేవాదులను పూజిస్తారు. ఇక్కడ 'శాస్త్రవిధానం వదలి శ్రద్ధతో పూజిస్తారు' అన్నమాట శ్రుతి లక్షణంగాని స్మృతి లక్షణంగాని అయిన ఏ శాస్త్రవిధానము తెలియక కేవలం వృద్ధుల ఆచారం చూచి దేవాదులను శ్రద్ధతో పూజించేవారిని గురించి. శాస్త్రవిధిని తెలిసికూడా దానిని వదలి అవిధి పూర్వకంగా దేవాదులను పూజించేవారిని గురించి 'శాస్త్రవిధిని వదలి పూజిస్తారు' అని చెప్పడం లేదు. ఎందుకని? 'శ్రద్ధతో కూడినవారు' అన్న విశేషణం ఉండడంచేత దేవాది పూజావిధి విషయమైన శాస్త్రవిధానం తెలిసికూడా దానిలో శ్రద్ధ లేక వదలినవారు, ఆ శాస్త్రం విధించిన దేవాది పూజయందు శ్రద్ధ గలిగి ప్రవర్తిస్తారు అని అనుకోలేము. (విధానంలో శ్రద్ధ లేనివానికి విషయంలో శ్రద్ధ ఉంటుందని అనుకోలేము) కనుక శాస్త్రవిధిని వదలి శ్రద్ధతో పూజిస్తారు అన్నమాట మొదలు చెప్పినట్లు శాస్త్రవిధిని తెలియక వదలినవారి గురించే. కృష్ణా, ఇటువంటివారి నిష్ఠ సత్త్వమా రజస్సా తమస్సా, అంటే వారు చేసే దేవాది విషయకపూజ సాత్త్వికమా రాజసికమా తామసికమా అని అడుగుతున్నాడు.

**భాష్యమ్ : 2.0 సామాన్యవిషయః అయం ప్రశ్నః న అప్రవిభజ్య ప్రతివచనం అర్హతీతి శ్రీ భగవానువాచ -**

**తె.అ.** ఈ ప్రశ్న సామాన్య విషయకం, అంటే అన్నివిధాలైన పూజలకు సంబంధించినది. విభాగం చేయకుండా సమాధానం చెప్పరాదు అని భగవానుడంటున్నాడు.

**శ్రీభగవానువాచ -**

**మూ. త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా ।**
**సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు ॥ 2**

శ్రీ భగవానుడంటున్నాడు.

**తె.అ.** దేహధారులకు శ్రద్ధ స్వభావసిద్ధంగా మూడు విధాలుగా ఉంటుంది. సాత్త్వికి రాజసి తామసి అని. వాటిని చెపుతా విను.

**భాష్యమ్ : 2.1 త్రివిధేతి. త్రివిధా త్రిప్రకారా భవతి శ్రద్ధా, యస్యాం నిష్ఠాయాం త్వం పృచ్ఛసి, దేహినాం శరీరిణాం సా స్వభావజా, జన్మాంతరకృతధర్మాదిసంస్కారాః మరణకాలే అభివ్యక్తః 'స్వభావః' ఉచ్యతే, తతో జాతా స్వభావజా, సాత్త్వికీ సత్త్వ నిర్వృత్తా దేవపూజాదివిషయా. రాజసీ రజోనిర్వృత్తా యక్షరక్షఃపూజాదివిషయా, తామసీ తమోనిర్వృత్తా ప్రేత పిశాచాది పూజాదివిషయా, ఏవం త్రివిధాం తాముచ్యమానాం శ్రద్ధాం శృణు అవధారయ.**

**తె.అ.** శ్రద్ధ మూడు విధాలుగా ఉంటుంది. నీవు అడిగిన ఈ శ్రద్ధయందు నిష్ఠ దేహధారులకు స్వభావంచేత కలుగుతుంది. పూర్వజన్మలయందు చేసిన ధర్మాది సంస్కారం మరణ కాలంలో అభివ్యక్తమై స్వభావమనబడుతుంది. శ్రద్ధ ఈ స్వభావాన్ని అనుసరించి ఉంటుంది. సత్త్వం వల్ల కలిగేది సాత్త్వికశ్రద్ధ, దేవపూజాది విషయం. రజస్సు వల్ల కలిగేది రాజసి, యక్షరక్షస్సుల పూజాది విషయం. తమస్సు వల్ల కలిగేది ప్రేత పిశాచాది పూజాది విషయం. నేను చెప్పబోతున్న ఈ త్రివిధమైన శ్రద్ధను సావధానంతో విను.

**భాష్యమ్ : 3.0. సా ఇయం త్రివిధా భవతి –**

**తె.అ.** ఇది త్రివిధంగా ఉంటుంది.

**మూ. సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత ।**
**శ్రద్ధామయోఽయం పురుషః యో యచ్ఛ్రద్ధస్స ఏవ సః ॥ 3**

**తె.అ.** భారతా! ప్రతి ఒక్కని విషయంలోను ఎవరిశ్రద్ధ వారి అంతఃకరణాన్ని అనుసరించి ఉంటుంది. పురుషుడు ప్రధానంగా శ్రద్ధామయుడు. ఎవరికి ఎటువంటి శ్రద్ధ ఉంటే అతడు దానికి అనుకూలంగా ప్రవర్తిస్తుంటాడు.

**భాష్యమ్ : 3.1 సత్త్వానురూపా విశిష్టసంస్కారోపేతాంతఃకరణానురూపా సర్వస్య ప్రాణిజాతస్య శ్రద్ధా భవతి, భారత. యద్యేవం తతః కిం స్యాదితి, ఉచ్యతే, శ్రద్ధామయః అయం శ్రద్ధాప్రాయః పురుషః సంసారీ జీవః, కథం? యః యచ్ఛ్రద్ధః యా శ్రద్ధా యస్య జీవస్య, సః యచ్ఛ్రద్ధః స ఏవ తచ్ఛ్రద్ధానురూప ఏవ సః జీవః.**

**తె.అ.** అర్జునా, ప్రత్యేకమైన సంస్కారాలు కలిగిన అంతఃకరణానికి అనురూపంగా సర్వప్రాణులకు శ్రద్ధ కలుగుతుంది. కలిగితే ఏమవుతుంది? విను, ఈ సంసారి అయిన జీవుడు ప్రధానంగా శ్రద్ధను బట్టి నిర్ణయింపబడుతాడు. ఎట్లా? ఏ జీవునికి ఎటువంటి శ్రద్ధ ఉంటుందో ఆ శ్రద్ధకు అనురూపంగానే ఆ జీవుడు ప్రవర్తిస్తుంటాడు.

**భాష్యమ్ : 4.0 తతశ్చ కార్యేణ లింగేన దేవాదిపూజయా సత్త్వాది నిష్ఠా అనుమేయా ఇత్యాహ.**

**తె.అ.** కనుక అతడు చేసే దేవాది పూజా కార్యమును గుర్తుగా గ్రహించి అతని నిష్ఠ సాత్త్వికమా మరొకటా అని అనుమానించవచ్చును.

**మూ. యజంతే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః ।**
**ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే యజంతే తామసా జనాః ॥ 4**

**తె.అ.** సాత్త్వికులు దేవతలను పూజిస్తారు. రాజసికులు యక్షరాక్షసులను ఇతర తామసజనులు ప్రేతాలను భూతాలను భూతగణాలను పూజిస్తారు.

**భాష్యమ్ : 4.1 యజంతే పూజయంతి సాత్త్వికాః సత్త్వనిష్ఠాః దేవాన్, యక్షరక్షాంసి రాజసాః, ప్రేతాన్ భూతగణాంశ్చ సప్తమాతృకాదీంశ్చ అన్యే యజంతే తామసాః జనాః.**

**తె.అ.** సత్త్వనిష్ఠగల సాత్త్వికులు దేవతలను పూజిస్తారు. రాజసికులు యక్షరాక్షసులను ఇతర తామసిక జనులు ప్రేతాలను సప్తమాతృకాది భూతగణాలను పూజిస్తారు.

**భాష్యమ్ : 5.0 ఏవం కార్యతో నిర్ణీతః సత్త్వాదినిష్ఠాః శాస్త్రవిధ్యుత్సర్గే. తత్ర కశ్చిదేవ సహస్రేషు దేవపూజాదిపరః. సత్త్వనిష్ఠో భవతి, బాహుల్యేన తు రజోనిష్ఠాః తమోనిష్ఠాశ్చైవ ప్రాణినో భవంతి. కథం?**

**తె.అ.** శాస్త్రవిధిని వదలినవారి విషయంలో సత్త్వాది నిష్ఠ ఈ విధంగా కార్యాన్నిబట్టి నిర్ణయించబడుతుంది. కాని వేలలో ఒకడు మాత్రమే సత్త్వనిష్ఠతో దేవపూజాపరుడవుతాడు. ఎక్కువగా మాత్రం ప్రాణులు రజోనిష్ఠలో తమోనిష్ఠలో అయి ఉంటారు. ఎట్లా?

**మూ. అశాస్త్రవిహితం ఘోరం తప్యన్తే యే తపో జనాః ।**
**దంభాహంకారసంయుక్తాః కామరాగబలాన్వితాః ॥ 5**

**తె.అ.** కామరాగ బలాన్వితులై, దంభాహంకారయుక్తులై శాస్త్రవిహితం కాని ఘోరతపం చేసేవారు.

**భాష్యమ్ : 5.1 అశాస్త్రవిహితం న శాస్త్రవిహితం ఘోరం పీడాకరం ప్రాణినామాత్మనశ్చ తపః తప్యంతే నిర్వర్తయంతి యే తపో జనాః, తే చ దంభాహంకారసంయుక్తాః, దంభశ్చ అహంకారశ్చ దంభాహంకారౌ, తాభ్యాం సంయుక్తాః దంభాహంకారసంయుక్తాః, కామరాగబలాన్వితాః కామశ్చ రాగశ్చ కామరాగౌ తత్కృతం బలం కామరాగబలం తేన అన్వితాః కామరాగబలాన్వితాః.**

**తె.అ.** కామరాగముల బలంతో, లేక కామంతో, రాగంతో, బలంతో, దంభంతో అహంకారంతో ప్రాణులకు తమకు కూడా బాధ కలిగించే శాస్త్రవిహితం కాని ఘోరతపం చేసేవారు –

**మూ. కర్శయంతశ్శరీరస్థం భూతగ్రామమచేతసః ।**
**మాం చైవాన్తః శరీరస్థం తాన్ విద్ధ్యాసురనిశ్చయాన్ ॥ 6**

**తె.అ.** తమ శరీరంలో ఉన్న ఇంద్రియ సముదాయాన్నీ, తమ శరీరంలో ఉన్న నన్నూ కృశింపచేస్తూ వివేకం లేనివారై ఉంటారో వాళ్ళు ఆసురనిశ్చయం గలవారని తెలుసుకో.

**భాష్యమ్ : 6.1 కర్శయంతః కృశీకుర్వంతః, శరీరస్థం భూతగ్రామం కరణసముదాయం, అచేతసః అవివేకినః, మాం చైవ తత్కర్మబుద్ధిసాక్షిభూతం అంతశ్శరీరస్థం నారాయణం కర్శయంతః, మదనుశాసనాకరణమేవ మత్కర్శనం, తాన్ విద్ధి ఆసురనిశ్చయాన్, ఆసురో నిశ్చయో యేషాం తే ఆసురనిశ్చయాః, తాన్ పరిహరణార్థం విద్ధి ఇతి ఉపదేశః.**

**తె.అ.** శరీరంలోని ఇంద్రియాలను, వారి కర్మలకు బుద్ధికి సాక్షినై శరీరంలో ఉంటున్న నారాయణుని నన్నుకూడా కృశింపచేసేవారు – నా శాసనం ప్రకారం చేయకపోవడమే నన్ను కృశింపజేయడం – ఆసుర నిశ్చయం కలవారని తెలుసుకుని వారిని దూరంగా ఉంచు, అని ఉపదేశం.

**భాష్యమ్ : 7.0 ఆహారాదీనాం చ రస్యస్నిగ్ధాదివర్గత్రయరూపేణ భిన్నానాం యథాక్రమం సాత్త్విక రాజసతామస పురుషప్రియత్వప్రదర్శనం ఇహ క్రియతే – రస్యస్నిగ్ధాదిషు ఆహారవిశేషేషు ఆత్మనః ప్రీత్యతిరేకేణ లింగేన సాత్త్వికత్వం రాజసత్వం చ బుద్ధ్వా రజస్తమోలింగానామాహారాణాం పరివర్జనార్థం సత్త్వలింగానాం చోపాదనార్థం. తథా యజ్ఞాదీనామపి సత్త్వాదిగుణభేదేన త్రివిధత్వ ప్రతిపాదనం ఇహ 'రాజసతామసాన్ బుద్ధ్వా కథం ను నామ పరిత్యజేత్, సాత్త్వికానేవ అనుతిష్ఠేత్' ఇత్యేవమర్థం ఆహ.**

**తె.అ.** రస్యము, స్నిగ్ధము ఇట్లా భిన్నంగా ఉన్న ఆహారాలను మూడు వర్గాలుగా చేసి, అవి క్రమంగా సాత్త్విక రాజస తామస పురుషులకు ప్రియమైనవి అని ఇక్కడ చూపబడుతున్నది. రస్యము, స్నిగ్ధము మొదలైన ఆహారాలలో తమకు ఎక్కువ ప్రీతి దేనియందుంటుందో దాన్నిబట్టి తమది సాత్త్వికమో రాజసమో తెలుసుకుని రజస్తమోలక్షణం తెలిపే ఆహారాన్ని వదలి సాత్త్వికాహారాన్ని గ్రహించడానికి ఇది చెప్పబడుతున్నది. అదేవిధంగా యజ్ఞాదులయందు గూడా సత్త్వాదిగుణభేదం ఆధారంగా మూడు విధాల యజ్ఞం ప్రతిపాదించబడుతున్నది. రాజస తామస యజ్ఞాలను తెలిసి వాటిని వదలి సాత్త్వికమైనవాటినే అనుష్ఠించదగును అని.

**మూ. ఆహారస్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః ।**
**యజ్ఞస్తపస్తథా దానం తేషాం భేదమిమం శృణు ॥ 7**

**తె.అ.** సమస్తప్రాణులకు ప్రియమైన ఆహారం మూడు విధాలుగా ఉంటుంది. అట్లాగే యజ్ఞము, తపము, దానము. వాటిల్లో భేదం విను.

**భాష్యమ్ : 7.1 ఆహారస్త్వపి సర్వస్య భోక్తుః ప్రాణినః త్రివిధో భవతి ప్రియః ఇష్టః, తథా యజ్ఞః, తథా తపః తథా దానం. తేషాం ఆహారాదీనాం భేదమిమం వక్ష్యమాణం శృణు.**

**తె.అ.** తినేవారందరికి ఇష్టమైన ఆహారం మూడువిధాలుగా ఉంటుంది. అట్లాగే యజ్ఞం తపం దానం. ఆ ఆహారాదులలో భేదాలు చెపుతాను విను.

**మూ. ఆయుస్సత్త్వబలారోగ్యసుఖప్రీతివివర్ధనాః ।**
**రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారాస్సాత్త్వికప్రియాః ॥ 8**

**తె.అ.** ఆయువు, సత్త్వము, బలము, ఆరోగ్యము, సుఖము, ప్రీతి – వీటిని వృద్ధిచేసే రసము కలిగినవి, నూనె కలిగినవి, స్థిరము, హృద్యము అయిన ఆహారం సాత్త్వికులకు యిష్టము.

**భాష్యమ్ : 8.1 ఆయుశ్చ సత్త్వం చ బలం చ ఆరోగ్యం చ సుఖం చ ప్రీతిశ్చ ఆయుస్సత్త్వ-బలారోగ్య సుఖప్రీతయః తాసామాయుస్సత్త్వాదీనాం వివర్ధనాః ఆయుస్సత్త్వబలారోగ్యసుఖప్రీతి వివర్ధనాః, తే చ రస్యాః రసోపేతాః, స్నిగ్ధాః స్నేహవంతః, స్థిరాః చిరకాలస్థాయినః దేహే, హృద్యాః హృదయప్రియాః ఆహారాః సాత్త్వికప్రియాః సాత్త్వికస్య ఇష్టాః.**

**తె.అ.** ఆయువు, సత్త్వము బలము ఆరోగ్యము సుఖము ప్రీతి – వీటిని పెంచేవి, రసమున్నవి, నూనెగలవి, దేహంలో చాలాకాలం ఉండేవి, మనసుకు ఇష్టమైనవి – ఇవి సాత్త్వికులకు ఇష్టమైన ఆహారాలు.

**మూ. కట్వమ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహినః ।**
**ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః ॥ 9**

**తె.అ.** చాలా చేదు, పులుపు, ఉప్పు, వేడి, ఘాటు, మంటగా ఉండే ఆహారాలు రాజసికులకు ఇష్టము. అవి బాధ, కష్టము, రోగము కలిగిస్తాయి.

**భాష్యమ్ : 9.1 కట్వమ్లలవణాత్యుష్ణ తీక్ష్ణ రూక్ష విదాహినః ఇత్యత్ర అతి శబ్దః కట్వాదిషు సర్వత్ర యోజ్యః, అతి కటుః అతితీక్ష్ణః ఇత్యేవం కటుశ్చ అమ్లశ్చ లవణశ్చ అత్యుష్ణశ్చ అతి తీక్ష్ణశ్చ రూక్షశ్చ విదాహీ చ తే ఆహారాః రాజసస్యేష్టాః దుఃఖశోకామయప్రదాః దుఃఖం చ శోకం చ ఆమయం చ ప్రయచ్ఛంతీతి దుఃఖశోకామయప్రదాః.**

**తె.అ.** 'చాలా' అనేది చేదు మొదలైనవాటికన్నిటికి వర్తిస్తుంది. చాలా చేదు, చాలా పులుపు ఇట్లా. రాజసికులకు చేదు, పులుపు, ఉప్పు, వేడి, ఘాటు, మంట, అన్నీ ఎక్కువగా కలిగిన ఆహారం ఇష్టం. వాటివల్ల బాధ, కష్టము, రోగము కలుగుతాయి.

**మూ. యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్ ।**
**ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్ ॥ 10**

**తె.అ.** ఉడికీ ఉడకనిది, రుచిలేనిది, కంపుకొట్టేది, రాత్రి మిగిలినది, ఎంగిలిది, పూజకు పనికిరానిది – ఇటువంటి భోజనం తామసులకు ఇష్టము.

**భాష్యమ్ : 10.1 యాతయామం మందపక్వం నిర్వీర్యస్య గతరసశబ్దేనోక్తత్వాత్. గతరసం రసవియుక్తం, పూతి దుర్గంధి, పర్యుషితం చ పక్వం సత్ రాత్ర్యంతరితం చ యత్, ఉచ్ఛిష్టమపి భుక్తశిష్టముచ్ఛిష్టం, అమేధ్యం అయజ్ఞార్హం, భోజనమ్ ఈదృశం తామసప్రియమ్.**

**తె.అ.** సరిగా ఉడకనిది రసహీనమై రుచిలేనిది కనుక బలమివ్వనిది, కంపుకొట్టేది, రాత్రి వండినదానిలో తెల్లవారి మిగిలినది, తినగా మిగిలినది, పూజకు పనికిరానిది ఇటువంటి భోజనం తామసులకు ఇష్టము.

**భాష్యమ్ : 11.0 అథ ఇదానీం యజ్ఞః త్రివిధ ఉచ్యతే –**

**తె.అ.** ఇక మూడు విధాలైన యజ్ఞాలు చెప్పబడుతున్నాయి.

**మూ. అఫలాకాఙ్క్షిభిర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే ।**
**యష్టవ్యమేవేతి మనః సమాధాయ స సాత్త్వికః ॥ 11**

**తె.అ.** ఫలాన్ని కోరక, శాస్త్రవిధిననుసరించి యజ్ఞం చేయవలసిందే అని మనసును సమాధానపరచి చేయబడిన యజ్ఞం సాత్త్వికము.

**భాష్యమ్ : 11.1 అఫలాకాఙ్క్షిభిః అఫలార్థిభిః యజ్ఞః విధిదృష్టః శాస్త్రచోదనాదృష్టః యః యజ్ఞః ఇజ్యతే నిర్వర్త్యతే, యష్టవ్యమేవేతి యజ్ఞస్వరూపనిర్వర్తనమేవ కార్యమితి మనస్సమాధాయ, నానేన పురుషార్థో మమ కర్తవ్య ఇత్యేవం నిశ్చిత్య, సః సాత్త్వికో యజ్ఞ ఉచ్యతే.**

**తె.అ.** 'దీనిచేత సాధించదగిన పురుషార్థమేదీ నాకు లేదు' అని మనసులో నిశ్చయించుకుని ఫలంపై కోరిక లేకుండా, శాస్త్రం విధించిన యజ్ఞం చేయవలసిందే అని చేసే యజ్ఞం సాత్త్వికము అనబడుతుంది.

**మూ. అభిసంధాయ తు ఫలం దంభార్థమపి చైవ యత్ ।**
**ఇజ్యతే భరతశ్రేష్ఠ తం యజ్ఞం విద్ధి రాజసమ్ ॥ 12**

**తె.అ.** భరతశ్రేష్ఠా, ఫలంమీద దృష్టి ఉంచి దంభంతో చేసే యజ్ఞం రాజసమని తెలుసుకో.

**భాష్యమ్ : 12.1 అభిసంధాయ తు ఉద్దిశ్య ఫలం, దంభార్థమపిచైవ యదిజ్యతే, భరతశ్రేష్ఠ, తం యజ్ఞం విద్ధి రాజసమ్.**

**తె.అ.** అర్జునా, ఫలంమీద దృష్టి ఉంచి నలుగురు చూడడం కొరకు చేసే యజ్ఞం రాజసమని తెలుసుకో.

**మూ. విధిహీనమసృష్టాన్నం మంత్రహీనమదక్షిణమ్ ।**
**శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే ॥ 13**

**తె.అ.** శాస్త్రవిధానాన్ని అనుసరించనిది, అన్నదానం చేయనిది, మంత్రహీనమైనది, దక్షిణలు ఇవ్వనిది, శ్రద్ధగా చేయనిది – ఇటువంటి యజ్ఞాన్ని తామసమని అంటారు.

**భాష్యమ్ : 13.1 విధిహీనం యథాచోదితవిపరీతం, అసృష్టాన్నం బ్రాహ్మణేభ్యో న సృష్టం న దత్తమన్నం యస్మిన్ యజ్ఞే సః అసృష్టాన్నః తం అసృష్టాన్నం, మంత్రహీనం మన్త్రతః స్వరతః వర్ణతో వా వియుక్తం మంత్రహీనం, అదక్షిణం ఉక్తదక్షిణారహితం, శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే తమోనిర్వృత్తం కథయంతి.**

**తె.అ.** శాస్త్రం చెప్పినదానికి విపరీతంగా, బ్రాహ్మణులకు అన్నదానం చేయకుండా, స్వరంలోగాని, వర్ణంలోగాని మంత్రహీనమై, దక్షిణలివ్వకుండా, శ్రద్ధగా చేయని యజ్ఞం తామసమని అంటారు.

**భాష్యమ్ : 14.0 అథేదానీం తపః త్రివిధముచ్యతే –**

**తె.అ.** ఇక మూడువిధాలైన తపములు చెపుతున్నాడు.

**మూ. దేవద్విజగురుప్రాజ్ఞపూజనం శౌచమార్జవమ్ ।**
**బ్రహ్మచర్యమహింసా చ శారీరం తప ఉచ్యతే ॥ 14**

**తె.అ.** దేవతలను, ద్విజులను, గురువులను, పండితులను పూజించడము, శౌచము, ఆర్జవము, బ్రహ్మచర్యము, అహింస – ఇది శరీరంతో చేసే తపస్సు.

**భాష్యమ్ : 14.1 దేవాశ్చ ద్విజాశ్చ గురవశ్చ ప్రాజ్ఞాశ్చ దేవద్విజగురుప్రాజ్ఞాః తేషాం పూజనం దేవద్విజగురు ప్రాజ్ఞపూజనం, శౌచం, ఆర్జవం, ఋజుత్వం బ్రహ్మచర్యమహింసా చ శరీరనిర్వర్త్యం శారీరం శరీరప్రధానైః సర్వైరేవ కార్యకరణైః కర్త్రాదిభిః సాధ్యం శారీరం తపః ఉచ్యతే. 'పంచైతే తస్య హేతవః' ఇతి వక్ష్యతి.**

**తె.అ.** దేవతలను, బ్రాహ్మణులను, గురువులను, పండితులను పూజించడము; శుచిగా ఉండడం ఋజుత్వము, బ్రహ్మచర్యము, అహింస – ఇవి ప్రధానంగా శరీరంచేత నిర్వర్తించబడేవి కనుక, సమస్త కార్యకరణాల ద్వారా కర్తచేత సాధించదగినవి కనుక వీటిని శారీరిక తపము అంటారు. ఈ అయిదు అందుకు కారణాలు అని ముందు (18.15) చెప్పబోతున్నాడు.

**మూ. అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్ ।**
**స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే ॥ 15**

**తె.అ.** అనుద్వేగకరము, సత్యము, ప్రియము, హితము అయిన వాక్యము, శాస్త్రం చదువుకోవడమనే అభ్యాసము – ఇవి వాక్కుతో చేసే తపమంటారు.

**భాష్యమ్ : 15.1 అనుద్వేగకరం ప్రాణినాం అదుఃఖకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్ – ప్రియహితే దృష్టాదృష్టార్థే. అనుద్వేగకరత్వాదిభిః ధర్మైః వాక్యం విశేష్యతే. విశేషణధర్మసముచ్చయార్థం చశబ్దః. పరప్రత్యయార్థం ప్రయుక్తస్య వాక్యస్య సత్యప్రియహితానుద్వేగకరత్వానాం అన్యతమేన ద్వాభ్యాం త్రిభిర్వాహీనతా స్యాద్యది, న తత్ వాఙ్మయం తపః. తథా సత్యవాక్యస్య ఇతరేషాం అన్యతమేన ద్వాభ్యాం త్రిభిర్వా విహీనతాయాం న వాఙ్మయతపస్త్వమ్. తథా ప్రియవాక్యస్యాపి ఇతరేషాం అన్యతమేన ద్వాభ్యాం త్రిభిర్వా విహీనస్య న వాఙ్మయతపస్త్వమ్. తథా హితవాక్యస్యాపి ఇతరేషాం అన్యతమేన ద్వాభ్యాం త్రిభిర్వా విహీనస్య న వాఙ్మయతపస్త్వమ్. కిం పునః తత్ తపః? యత్ సత్యం వాక్యం అనుద్వేగకరం ప్రియం హితం చ తత్ తపః వాఙ్మయం, యథా "శాంతోభవ వత్స! స్వాధ్యాయం యోగం చ అనుతిష్ఠ. తథా తే శ్రేయో భవిష్యతి" ఇతి. స్వాధ్యాయాభ్యసనం చ ఏవ యథావిధి వాఙ్మయం తపః ఉచ్యతే.**

**తె.అ.** ప్రాణులకు దుఃఖం కలిగించనిది, సత్యమైనది, ఇహంలో ప్రియము పరంలో హితము అయిన వాక్యము వాఙ్మయతపమంటారు. 'దుఃఖం కలిగించనిది' మొదలైన అన్ని విశేషణాలు 'వాక్యం' అన్న పదానికి అన్వయించుకోవలెను. 'చ' అన్న శబ్దం ఈ గుణాలనన్నిటిని కలపడానికే. ఇతరులనుద్దేశించి ప్రయోగించిన వాక్యంలో సత్యప్రియహిత అనుద్వేగకరమైన నాలుగింటిలో ఏ వాక్యంలోనైనా తక్కిన మూటిలో ఏ ఒక్క గుణం లోపించినా అది వాఙ్మయతపంకాదు. అట్లాగే సత్యవాక్యంలో తక్కిన మూటిలో ఏ ఒక్కగుణం లోపించినా అది వాఙ్మయతపం కాదు. అట్లాగే ప్రియవాక్యంలో తక్కిన మూటిలో ఏ ఒక్క గుణంలోపించినా అది వాఙ్మయతపం కాదు. అట్లాగే హితవాక్యంలోను తక్కిన మూటిలో ఏ ఒక్కగుణం లోపించినా అది వాఙ్మయతపం కాదు. మరి ఆ తపమేది? ఏది సత్యము, అనుద్వేగకరము, ప్రియము, హితము అయిన వాక్యమో అది వాఙ్మయతపము. ఎట్లాగంటే 'నాయనా, శాంతంగా ఉండు! స్వాధ్యాయము, యోగము, అభ్యాసం చేయి. అట్లా చేస్తే నీకు మేలుకలుగుతుంది" అని యథావిధిగా స్వాధ్యాయం అభ్యసించడం గూడా వాఙ్మయతపమే అనబడుతుంది.

**మూ. మనఃప్రసాదః సౌమ్యత్వం మౌనమాత్మ వినిగ్రహః ।**
**భావసంశుద్ధిరిత్యేతత్తపో మానసముచ్యతే ॥ 16**

**తె.అ.** మనోనైర్మల్యం, సౌమ్యత్వము, మౌనము, (అధికంగా మాట్లాడకుండుట) ఆత్మనిగ్రహము, భావశుద్ధి – ఇది మానసిక తపమంటారు.

**భాష్యమ్ : 16.1 మనః ప్రసాదః మనసః ప్రశాంతిః స్వచ్ఛతాపాదనం ప్రసాదః, సౌమ్యత్వం యత్సౌమనస్యమాహుః, ముఖాదిప్రసాదాదికార్యోన్నేయా అంతఃకరణస్య వృత్తిః. మౌనం వాక్సంయమోఽపి మనస్సంయమపూర్వకో భవతి ఇతి కార్యేణ కారణం ఉచ్యతే మనస్సంయమో మౌనమితి, ఆత్మవినిగ్రహః మనోనిరోధః సర్వతః సామాన్యరూపః ఆత్మవినిగ్రహః, వాగ్విషయస్యైవ మనసః సంయమః మౌనం, ఇతి విశేషః. భావసంశుద్ధిః – పరైః వ్యవహారకాలే అమాయావిత్వం భావసంశుద్ధిః, ఇత్యేతత్ తపః మానసం ఉచ్యతే.**

**తె.అ.** మనసుకు ప్రశాంతి స్వచ్ఛత సంపాదించడం మనఃప్రసాదం. సౌమ్యత్వమంటే సౌమనస్యము, ముఖం ప్రసన్నంగా కనిపింపజేసే అంతఃకరణవృత్తి. మౌనమంటే మనస్సంయమమని అర్థం చెప్పుకోవలెను. ఎందుకంటె మనస్సు సంయమనం ఉంటేనేగాని వాక్సంయమం ఉండదు గనుక కార్యంచేత కారణం చెప్పబడింది. ఆత్మనిగ్రహమంటె మనస్సును అన్నిటినుండి నిరోధించడం. కేవలం వాగ్విషయంలో మనస్సును నిరోధించడం మౌనం. అన్నిటినుండి నిరోధించడం గనుక ఆత్మనిగ్రహం దానికంటె విశేషమైంది. భావసంశుద్ధి అంటే ఇతరులతోటి వ్యవహారంలో కపటం లేకపోవడం. ఇటువంటిది మానసిక తపం.

**భాష్యమ్ : 17.0 యథోక్తం కాయికం వాచికం మానసం చ తపః తప్తం నరైః సత్త్వాదిగుణభేదేన కథం త్రివిధం భవతీతి, ఉచ్యతే –**

**తె.అ.** ఇప్పుడు చెప్పిన కాయిక, వాచిక, మానసికతపం మనుష్యులచేత ఆచరించబడి సత్త్వాది భేదాలతో మూడువిధాలుగా ఎట్లా అవుతుందో చెపుతున్నాడు.

**మూ. శ్రద్ధయా పరయా తప్తం తపస్తత్త్రివిధం నరైః ।**
**అఫలాకాంక్షిభిర్యుక్తైః సాత్త్వికం పరిచక్షతే ॥ 17**

**తె.అ.** ఆ త్రివిధమైన తపం పరమశ్రద్ధతో ఫలాకాంక్ష లేనివారిచేత ఆచరించబడినపుడు అది సాత్త్విక తపమని అంటారు.

**భాష్యమ్ : 17.1 శ్రద్ధయా ఆస్తిక్యబుద్ధ్యా పరయా ప్రకృష్టయా తప్తం అనుష్ఠితం తపః తత్ ప్రకృతం త్రివిధం త్రిప్రకారం త్ర్యధిష్ఠానం నరైః అనుష్ఠాతృభిః అఫలాకాంక్షిభిః ఫలాకాంక్షారహితైః యుక్తైః సమాహితైః – యత్ ఈదృశం తపః, తత్ సాత్త్వికం సత్త్వనిర్వృత్తం పరిచక్షతే కథయంతి శిష్టాః.**

**తె.అ.** ప్రస్తుతం చెప్పుకుంటున్న త్రివిధతపం ఫలాకాంక్షలేనివారిచేత పరమశ్రద్ధతో ఆచరించబడినప్పుడు అది సాత్త్వికమని శిష్టులంటారు.

**మూ. సత్కారమానపూజార్థం తపో దంభేన చైవ యత్ ।**
**క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చలమధ్రువమ్ ॥ 18**

**తె.అ.** గొప్పకొరకు, గౌరవం కొరకు, పూజింపబడడం కొరకు దంభంతో చేయబడే తపం రాజసమంటారు. అది అనిశ్చితము, అస్థిరము.

**భాష్యమ్ : 18.1 సత్కారః సాధుకారః 'సాధుః అయం తపస్వీ బ్రాహ్మణః' ఇత్యేవమర్థం, మానో మాననం ప్రత్యుత్థానాభివాదనాదిః తదర్థం పూజా పాదప్రక్షాళనార్చనాశయితృత్వాది తదర్థం చ తపః సత్కారమానపూజార్థం, దంభేన చైవ యత్క్రియతే తపః తత్ ఇహ ప్రోక్తం కథితం రాజసం చలం కాదాచిత్కఫలత్వేన అధ్రువమ్.**

**తె.అ.** సత్కారం కొరకు అంటే ఇతడు సాధువు, తపస్వి, బ్రాహ్మణుడు అని అనిపించుకోడం కొరకు, మానం కొరకు అంటే ఎదురైనపుడు లేచి నమస్కరించడం మొదలైనవి చేయించుకోడం కొరకు, పూజింపబడడం కొరకు అంటే కాళ్ళు కడగడం, భోజనం పెట్టడం మొదలైనవి చేయించుకోడం కొరకు. వీటి కొరకు దంభంతో చేయబడే తపం రాజసమనబడుతుంది. దాని ఫలం అనిశ్చితం అధ్రువం (అంటే అస్థిరం).

**మూ. మూఢగ్రాహేణాత్మనో యత్ పీడయా క్రియతే తపః ।**
**పరస్యోత్సాదనార్థం వా తత్తామసముదాహృతమ్ ॥ 19**

**తె.అ.** మూఢనిశ్చయంతో శరీరానికి పీడ కలిగిస్తూ ఇతరులకు కీడు చేయడంకొరకు చేసే తపాన్ని తామసమంటారు.

**భాష్యమ్ : 19.1 మూఢగ్రామేణ అవివేక నిశ్చయేన ఆత్మనః పీడయా యత్ క్రియతే తపః పరస్య ఉత్సాదనార్థం వినాశార్థం వా తత్ తామసం తపః ఉదాహృతమ్.**

**తె.అ.** మూర్ఖపు పట్టుదలతో తనకు పీడ కలిగించుకుంటూ ఇతరుల వినాశనం కొరకు చేసే తపమే తామసం.

**భాష్యమ్ : 20.0 ఇదానీం దానత్రైవిధ్యం ఉచ్యతే –**

**తె.అ.** ఇక ఇప్పుడు త్రివిధ దానభేదాలు చెపుతున్నాడు.

**మూ. దాతవ్యమితి యద్దానం దీయతేఽనుపకారిణే ।**
**దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్ ॥ 20**

**తె.అ.** ఉపకారం చేయనివానికి దేశకాలపాత్రములెరిగి ఇది ఇవ్వదగును అని చేయుదానం సాత్త్వికము అనబడుతుంది.

**భాష్యమ్ : 20.1 దాతవ్యమిత్యేవం మనః కృత్వా యద్దానం దీయతే అనుపకారిణే ప్రత్యుపకారాసమర్థాయ, సమర్థాయాపి నిరపేక్షం దీయతే, దేశే పుణ్యదేశే కురుక్షేత్రాదౌ, కాలే సంక్రాంత్యాదౌ, పాత్రే చ షడంగవిద్వేదపారగే ఇత్యాదౌ, తద్దానం సాత్త్వికం స్మృతమ్.**

**తె.అ.** ఇది ఇవ్వదగును అని మనసుచేసి, ఉపకారం చేయనివానికి అంటే తిరిగి ఉపకారం చేయలేనివానికి లేదా చేయగలిగినవాడైనా వానినుండి ప్రత్యుపకారం ఆశించకుండా, దేశకాలపాత్రము లెరిగి చేసేదానం సాత్త్విక మనబడుతుంది. దేశమంటే కురుక్షేత్రాది పుణ్యప్రదేశం. కాలమంటే సంక్రాంతివంటి పుణ్యకాలం. పాత్రమంటే షడంగసహిత (శిక్షా; నిరుక్తం; వ్యాకరణం; ఛందస్సు; జ్యోతిషం; కల్పం అనే ఆరు వేదాంగములు అనబడతాయి) వేదం చదువుకున్నటువంటివాడు.

**మూ. యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః ।**
**దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్ ॥ 21**

**తె.అ.** ప్రత్యుపకారం కొరకుగాని, ఫలంకోరిగాని, బాధతో చేసే దానం రాజసమనబడుతుంది.

**భాష్యమ్ : 21.1 యత్తు దానం ప్రత్యుపకారార్థం కాలే తు అయం మాం ప్రత్యుపకరిష్యతి ఇత్యేవమర్థం, ఫలం వా అస్య దానస్య మే భవిష్యతి అదృష్టమితి, తత్ ఉద్దిశ్య పునః దీయతే చ పరిక్లిష్టం ఖేదసంయుక్తం తద్దానం రాజసం స్మృతమ్.**

**తె.అ.** సమయం వచ్చినపుడు తిరిగి నాకు ఉపకారం చేయగలడు అనిగాని, ఈ దానం వలన పరలోకంలో ఫలం కలుగుతుంది అనిగాని ఉద్దేశించి ఖేదంతో, అంటే బాధపడుతూ, చేసే దానం రాజసమనబడుతుంది.

**మూ. అదేశకాలే యద్దానమపాత్రేభ్యశ్చ దీయతే ।**
**అసత్కృతమవజ్ఞాతం తత్తామసముదాహృతమ్ ॥ 22**

**తె.అ.** దేశకాల పాత్రములు తెలియక సత్కారపూర్వకంగా కాక, అవమానం చేస్తూ చేసే దానం తామసమనబడుతుంది.

**భాష్యమ్ : 22.1 అదేశకాలే అదేశే అపుణ్యదేశే మ్లేచ్ఛా శుచ్యాది సంకీర్ణే అకాలే పుణ్యహేతుత్వేన అప్రఖ్యాతే సంక్రాంత్యాదివిశేషరహితే అపాత్రేభ్యశ్చ మూర్ఖతస్కరాదిభ్యః, దేశాది సంపత్తౌ వా అసత్కృతం ప్రియవచన పాదప్రక్షాళనపూజాదిరహితం అవజ్ఞాతం పాత్రపరిభవయుక్తం చ యత్, తద్దానం తామసముదాహృతమ్.**

**తె.అ.** దేశం తెలియక అంటే మ్లేచ్ఛదేశంలో అశుచిగా ఉన్న పాపపు ప్రదేశంలో, కాలం తెలియక అంటే సంక్రాంతి వంటివానివలె పుణ్యకాలమని ప్రఖ్యాతిపొందని కాలంలో, అపాత్రులు అంటే మూర్ఖులు, దొంగలు వంటివారు. దేశము కాలము సరియైనవే అయినా, ప్రియవచనము పాదప్రక్షాళనము పూజ మొదలైనవి లేకుండా చేసే దానము తామసము అంటారు.

**భాష్యమ్ : 23.0 యజ్ఞదానతపః ప్రభృతీనాం సాద్గుణ్యకరణాయ అయముపదేశ ఉచ్యతే-**

**తె.అ.** యజ్ఞదానతపాదులను సలక్షణంగా చేయడం కొరకు ఈ ఉపదేశం చేయబడుతున్నది.

**మూ. ఓంతత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధః స్మృతః ।**
**బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా ॥ 23**

**తె.అ.** ఓమ్ తత్ సత్ అనేది బ్రహ్మమునకు త్రివిధమైన నిర్దేశము. పూర్వము బ్రాహ్మణులు వేదములు యజ్ఞములు దానిచేతనే విధించబడినారు.

**భాష్యమ్ : 23.1 ఓం తత్సత్ ఇత్యేవం నిర్దేశః, నిర్దిశ్యతే అనేనేతి నిర్దేశః, త్రివిధో నామనిర్దేశః బ్రహ్మణః స్మృతః చింతితః వేదాంతేషు బ్రహ్మవిద్భిః, బ్రాహ్మణాః తేన నిర్దేశేన త్రివిధేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః నిర్మితాః పురా పూర్వం ఇతి నిర్దేశస్తుత్యర్థం ఉచ్యతే.**

**తె.అ.** ఓమ్ తత్ సత్ అని బ్రహ్మమునకు త్రివిధ నామనిర్దేశము. ఇట్లా అని బ్రహ్మవిదులు ఉపనిషత్తులయందు భావించారు. ఈ త్రివిధ నిర్దేశం చేత బ్రాహ్మణులు, వేదములు, యజ్ఞములు పూర్వం నిర్మించబడినవి. ఇది నిర్దేశాన్ని స్తుతించడం కొరకు చెప్పబడింది.

**మూ. తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదానతపఃక్రియాః ।**
**ప్రవర్తంతే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినామ్ ॥ 24**

**తె.అ.** కనుక ఓమ్ అని పలికిగాని బ్రహ్మవాదులు శాస్త్రోక్తమైన యజ్ఞ దాన తపః క్రియలు ప్రారంభించరు.

**భాష్యమ్ : 24.1 తస్మాత్ 'ఓమ్' ఇతి ఉదాహృత్య ఉచ్చార్య యజ్ఞదానతపః క్రియాః యజ్ఞాది స్వరూపాః క్రియాః ప్రవర్తంతే విధానోక్తాః శాస్త్రచోదితాః సతతం సర్వదా బ్రహ్మవాదినాం బ్రహ్మవదన శీలానామ్.**

**తె.అ.** కనుక బ్రహ్మావాదులు సర్వదా ఓమ్ అని ఉచ్చరించి శాస్త్రచోదితమైన యజ్ఞదాన తపః క్రియలు ఆరంభిస్తారు.

**మూ. తదిత్యనభిసంధాయ ఫలం యజ్ఞతపఃక్రియాః,**
**దానక్రియాశ్చ వివిధాః క్రియన్తే మోక్షకాఙ్క్షిభిః. 25**

**తె.అ.** మోక్షకాంక్షులు తత్ అని పలికి ఫలాకాంక్ష లేక యజ్ఞతపఃక్రియలు, వివిధ దానాలు ఆచరిస్తారు.

**భాష్యమ్ : 25.1 తత్ ఇతి అనభిసంధాయ 'తత్ ఇతి బ్రహ్మాభిధానముచ్చార్య అనభిసంధాయ చ యజ్ఞాది కర్మణః ఫలం, యజ్ఞతపః క్రియాః యజ్ఞక్రియాశ్చ తపఃక్రియాశ్చ యజ్ఞతపః క్రియాః దానక్రియాశ్చ వివిధాః క్షేత్ర హిరణ్యప్రదానాది లక్షణాః క్రియంతే నిర్వర్త్యంతే మోక్షకాఙ్క్షిభిః మోక్షార్థిభిః ముముక్షుభిః.**

**తె.అ.** ముముక్షువులు ఫలాన్నికోరక తత్ అని బ్రహ్మాభిధానాన్ని ఉచ్చరించి యజ్ఞతపఃక్రియలు క్షేత్రదానము, హిరణ్యదానము, మొదలైన వివిధ దానాలు చేస్తారు.

**భాష్యమ్ : 26.0 ఓం తచ్ఛబ్దయోః వినియోగః ఉక్తః. అథ ఇదానీం సచ్ఛబ్దస్య వినియోగ ఉచ్యతే –**

**తె.అ.** ఓమ్ తత్ అన్న రెండు శబ్దాల వినియోగం చెప్పబడింది. ఇక ఇప్పుడు సత్ శబ్దం యొక్క వినియోగం చెప్పబడుతున్నది.

**మూ. సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ప్రయుజ్యతే ।**
**ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే ॥ 26**

**తె.అ.** పార్థా! కలగనిది కలిగినపుడు అసాధువు సాధువైనపుడు శుభకార్యములపుడు సత్ అన్న శబ్దం ప్రయోగింపబడుతుంది.

**భాష్యమ్ : 26.1 సద్భావే, అసతః సద్భావే యథా అవిద్యమానస్య పుత్రస్య జన్మని, తథా సాధుభావే చ అసద్వృత్తస్య అసాధోస్సద్వృత్తతా సాధుభావః తస్మిన్ సాధుభావే చ సత్ ఇత్యేతదభిధానం బ్రహ్మణః ప్రయుజ్యతే అభిధీయతే. ప్రశస్తే కర్మణి వివాహాదౌ చ తథా సచ్ఛబ్దః పార్థ! యుజ్యతే ప్రయుజ్యతే ఇత్యేతత్.**

**తె.అ.** అర్జునా, కలగనిది కలిగినపుడు, ఎట్లాగంటే పూర్వం కుమారుడు లేడు ఇపుడు కలిగాడు అటువంటపుడు అసాధువు సాధువైనపుడు సత్ అన్న ఈ బ్రహ్మాభిధానం ప్రయోగించ బడుతుంది. వివాహాది శుభకార్యములపుడు కూడా.

**మూ. యజ్ఞే తపసి దానే చ స్థితిః సదితి చోచ్యతే ।**
**కర్మ చైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే ॥ 27**

**తె.అ.** యజ్ఞదానతపములయందు తత్పరతను (అంటే నిలకడగా ఉండడం) సత్ అంటారు. వాటి కొరకు చేసే కర్మను గూడా సత్ అనే అంటారు.

**భాష్యమ్ : 27.1 యజ్ఞే యజ్ఞకర్మణి యా స్థితిః, తపసి చ యా స్థితిః దానే చ యా స్థితిః, సా సదితి చోచ్యతే విద్వద్భిః. కర్మచైవ తదర్థీయం యజ్ఞదానతపోఽర్థీయం అథవా యస్య అభిధానత్రయం ప్రకృతం తదర్థీయం ఈశ్వరార్థీయమిత్యేతత్, సదిత్యేవాభిధీయతే తదేతద్యజ్ఞదానతప ఆది కర్మ అసాత్త్వికం విగుణమపి శ్రద్ధాపూర్వకం బ్రహ్మణః అభిధానత్రయప్రయోగేణ సగుణం సాత్త్వికం సంపాదితం భవతి.**

**తె.అ.** యజ్ఞకర్మయందు తపమందు, దానమందు, తత్పరతను జ్ఞానులు సత్ అంటారు. వాటికొరకు అంటే యజ్ఞదాన తపములకొరకు లేక, ఎవని అభిధానత్రయం ఇప్పుడు చెప్పుకుంటున్నామో ఆ ఈశ్వరునికొరకు చేసే కర్మను కూడా సత్ అనే అంటారు. యజ్ఞ తపాది కర్మ అసాత్త్వికము గుణహీనము అయినదైనా శ్రద్ధతో బ్రహ్మాభిధానత్రయప్రయోగంతో సలక్షణము సాత్త్వికము అవుతుంది.

**భాష్యమ్ : 28.0 తత్ర చ సర్వత్ర శ్రద్ధాప్రధానతయా సర్వం సంపాద్యతే యస్మాత్, తస్మాత్.**

**తె.అ.** ఏ విషయంలోనైనా శ్రద్ధ ప్రధానం. అది ఉంటే అన్నీ సలక్షణమే కనుక.

**మూ. అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్ ।**
**అసదిత్యుచ్యతే పార్థ న చ తత్ప్రేత్య నో ఇహ ॥ 28**

**తె.అ.** పార్థా, శ్రద్ధ లేకుండా ఏ హోమం చేసినా, ఏ దానం చేసినా, ఏ తపమాచరించినా ఏం చేసినా అది అసత్ అనబడుతుంది. దానివలన ఇహపరాలలో కూడా ఫలం లేదు.

**ఇతి శ్రీ మహాభారతే శతసాహస్ర్యాం వైయాసిక్యాం భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే శ్రద్ధాత్రయవిభాగయోగోనామ సప్తదశోఽధ్యాయః.**

ఇది వ్యాసభగవానుని శతసహస్ర సంహిత అయిన శ్రీ మహాభారతంలో భీష్మపర్వంలో ఉపనిషత్తులు బ్రహ్మవిద్య యోగశాస్త్రము శ్రీకృష్ణార్జున సంవాదము అయిన భగవద్గీతలయందు శ్రద్ధాత్రయ విభాగయోగం అనే పదిహేడవ అధ్యాయానికి తెలుగు అనువాదం.

**భాష్యమ్ : 28.1 అశ్రద్ధయా హుతం హవనం కృతం, అశ్రద్ధయా దత్తం బ్రాహ్మణేభ్యః, తథా అశ్రద్ధయా తపః తప్తం అనుష్ఠితం, తథా అశ్రద్ధయైవ కృతం చ యత్ స్తుతినమస్కారాది, తత్ సర్వం అసదిత్యుచ్యతే, మత్ప్రాప్తిసాధన మార్గబాహ్యత్వాత్, హే పార్థ, న చ తత్ బహులాయాసమపి ప్రేత్య ఫలాయ నోఽపి ఇహార్థం, సాధుభిః నిందితత్వాదితి.**

**తె.అ.** శ్రద్ధలేకుండా చేసిన హవనము, శ్రద్ధ లేకుండా బ్రాహ్మణులకు చేసిన దానము, శ్రద్ధ లేకుండా చేసిన తపము, శ్రద్ధ లేకుండా స్తుతి నమస్కారాదులేవి చేసినా, అదంతా అసత్ అనబడుతుంది. నన్ను చేరుకునే మార్గానికి వెలుపల ఉన్న కారణంగా. ఎంత ఆయాసపడి ఆచరించినా పరంలో గాని, సాధువులచేత నిందింపబడినది కనుక ఇహంలోగాని, దానికి ఫలం లేదు.

**ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యగోవిన్దభగవత్పూజ్యపాదశిష్యశ్రీమచ్ఛంకరభగవతః కృతౌ శ్రీమద్భగవద్గీతాభాష్యే శ్రద్ధాత్రయవిభాగయోగో నామ సప్తదశోఽధ్యాయః.**

ఇది శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య గోవింద భగవత్పూజ్యపాదశిష్యులు శ్రీమత్ శంకర భగవత్పాదులు రచించిన శ్రీమద్భగవద్గీతాభాష్యంలో శ్రద్ధాత్రయవిభాగయోగమనే పదిహేడవ అధ్యాయానికి తెలుగు అనువాదం.



# అష్టాదశోఽధ్యాయః

# మోక్షసంన్యాసయోగః

**భాష్యమ్ : 0.1 సర్వస్యైవ గీతాశాస్త్రస్య అర్థః అస్మిన్నధ్యాయే ఉపసంహృత్య సర్వశ్చ వేదార్థో వక్తవ్య ఇత్యేవమర్థః అయమధ్యాయః ఆరభ్యతే. సర్వేషు హి అతీతేష్వధ్యాయేషు ఉక్తః అర్థః అస్మిన్నధ్యాయే అవగమ్యతే. అర్జునస్తు సంన్యాసత్యాగశబ్దార్థయోరేవ విశేషంబుభుత్సుః ఉవాచ –**

**తె.అ.** సమస్త గీతాశాస్త్రార్థాన్ని ఈ అధ్యాయంలో ఉపసంహరించి సమస్త వేదార్థాన్ని కూడా చెప్పడం కొరకు ఈ అధ్యాయం ఆరంభించబడుతున్నది. వెనుకటి అన్ని అధ్యాయాలలోను చెప్పబడిన విషయం ఈ అధ్యాయంలో తెలుసుకోవచ్చు. అర్జునుడు మాత్రం సంన్యాస త్యాగ శబ్దాల అర్థాలలోని భేదం తెలుసుకోగోరి అడుగుతున్నాడు –

**అర్జున ఉవాచ –**

**మూ. సంన్యాసస్య మహాబాహో తత్త్వమిచ్ఛామి వేదితుమ్ ।**
**త్యాగస్య చ హృషీకేశ పృథక్కేశినిషూదన ॥ 1**

అర్జునుడు అడుగుతున్నాడు –

**తె.అ.** మహాబాహూ హృషీకేశా, కేశిని సంహరించినవాడా! సంన్యాసము త్యాగము వీటి తత్త్వం విడివిడిగా తెలుసుకోగోరుతున్నాను.

**భాష్యమ్ : 1.1 సంన్యాసస్య ఇతి. సంన్యాస శబ్దార్థస్య ఇత్యేతత్, హే మహాబాహో! తత్త్వం తస్య భావస్తత్త్వం యాథాత్మ్యమిత్యేతత్. ఇచ్ఛామి వేదితుం, జ్ఞాతుం, త్యాగస్య చ త్యాగశబ్దార్థస్య ఇత్యేతత్, హృషీకేశ! పృథక్ ఇతరేతర విభాగతః కేశినిషూదన! కేశినామా హయచ్ఛద్మా కశ్చిత్ అసురః తం నిషూదితవాన్ భగవాన్ వాసుదేవః, తేన తన్నామ్నా సంబోధ్యతే అర్జునేన.**

**తె.అ.** సంన్యాస శబ్దార్థం యొక్క యాథాత్మ్యం తెలుసుకోగోరుతున్నాను. అట్లాగే త్యాగ శబ్దార్థం యొక్క తత్త్వం కూడాను. ఆ రెంటి తేడాను తెలుసుకోగోరుతున్నాను. కేశి అనేవాడు గుఱ్ఱపు మాయవేషంలో నున్న రాక్షసుడు. భగవాన్ వాసుదేవుడు అతన్ని చంపాడు. కనుక అర్జునుడు కేశినిషూదన అనే పేరుతో భగవానుని సంబోధిస్తున్నాడు.

**భాష్యమ్ : 2.0 సంన్యాస త్యాగ శబ్దౌ తత్ర తత్ర నిర్దిష్టౌ, న నిర్లుఠితార్థౌ పూర్వేషు అధ్యాయేషు. అతః అర్జునాయ పృష్టవతే తన్నిర్ణయాయ.**

**తె.అ.** సంన్యాస త్యాగశబ్దాలు అక్కడక్కడా వెనుకటి అధ్యాయాలలో నిర్దేశించబడ్డాయి. కాని వాటి అర్థాలు స్పష్టంగా చెప్పబడలేదు. కనుక అర్జునుడు అడిగినపుడు భగవానుడు వాటి నిర్ణయం చేయడం కొరకు చెపుతున్నాడు –

**శ్రీభగవానువాచ –**

**మూ. కామ్యానాం కర్మణాం న్యాసం సంన్యాసం కవయో విదుః ।**
**సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః ॥ 2**

భగవానుడంటున్నాడు.

**తె.అ.** కామ్యకర్మలను చేయకపోవడం సంన్యాసమని పండితులకు తెలుసు. సర్వకర్మ – ఫలత్యాగం త్యాగమని వారంటారు.

**భాష్యమ్ : 2.1 కామ్యానామితి. కామ్యానాం అశ్వమేధాదీనాం కర్మణాం న్యాసం పరిత్యాగం సంన్యాసం సంన్యాసశబ్దార్థం, అనుష్ఠేయత్వేన ప్రాప్తస్య అననుష్ఠానం కవయః పండితాః కేచిత్ విదుః విజానంతి. నిత్యనైమిత్తికానాం అనుష్ఠీయమానానాం సర్వకర్మణాం ఆత్మసంబంధితయా ప్రాప్తస్య ఫలస్య పరిత్యాగః సర్వకర్మఫలత్యాగః తం ప్రాహుః కథయంతి త్యాగం త్యాగశబ్దార్థం విచక్షణాః పండితాః. యది కామ్యకర్మపరిత్యాగః ఫలపరిత్యాగో వా అర్థః వక్తవ్యః, సర్వథా పరిత్యాగమాత్రం సంన్యాసత్యాగశబ్దయోః ఏకార్థః స్యాత్, స ఘటపటశబ్దావివ జాత్యంతర – భూతార్థౌ.**

**భాష్యమ్ : 2.2 నను నిత్య నైమిత్తికానాం కర్మణాం ఫలమేవ నాస్తీత్యాహుః కథముచ్యతే. తేషాం ఫలత్యాగః, యథా వంధ్యాయాః పుత్ర త్యాగః.**

**భాష్యమ్ : 2.3 నైష దోషః, నిత్యానామపి కర్మణాం భగవతా ఫలవత్త్వస్య ఇష్టత్వాత్. వక్ష్యతి హి భగవాన్ 'అనిష్టమిష్టం మిశ్రం చ' ఇతి 'న తం సన్న్యాసినామితి' చ, సన్న్యాసినామేవ కేవలం కర్మఫలానుబంధం దర్శయన్ అసన్న్యాసినాం నిత్యకర్మఫలప్రాప్తిం 'భవత్యత్యాగినాం ప్రేత్యే'తి దర్శయతి.**

**తె.అ.** అనుష్ఠించవలసిన అవసరం కలిగినపుడు అశ్వమేధాది కామ్యకర్మలను అనుష్ఠించక పోవడం, అంటే కామ్యకర్మ పరిత్యాగం, సన్న్యాసమని పండితులకు తెలుసు. అనుష్ఠించవలసిన నిత్య నైమిత్తిక కర్మలన్నిటికి కలిగే ఫలాన్ని త్యాగం చేయడం సర్వకర్మ ఫలత్యాగమని

పండితులంటారు. కామ్యకర్మ పరిత్యాగం కాని ఫలపరిత్యాగం కాని చెప్పవలసి వున్నపుడు సన్న్యాస త్యాగశబ్దాలకు ఒకే అర్థం, వేరు వేరు జాతుల ఘటపటాదులకు వలె రెండు అర్థాలుండవు.

(ఈ శ్లోకంలో సంన్యాసమనే శబ్దానికి పారమార్థికసంన్యాసమని అర్థం కాదు. సంన్యాస శబ్దానికి త్యాగ శబ్దానికి కూడా శంకరుడు పరిత్యాగమనే అర్థం చెప్పాడు. అంటే భగవానుని దృష్టిలో అర్జునుడడిగిన సంన్యాసము త్యాగమూ రెండూ ఒకటే, కామ్యకర్మల త్యాగము ఫలత్యాగము ఒకటే కనుక. ఫలం కోరనివాడు ఫలం కోరి చేసే కామ్యకర్మలు ఎట్లాగూ చేయడు. అంటే త్యాగి అయినవాడు 'సంన్యాసి' కూడా అవుతాడు. అయితే అతన్ని సంన్యాసి అనడం కేవలం ఫలత్యాగాన్ని స్తుతించడం కొరకే. జ్ఞానలక్షణమైన సంన్యాసం కాదు. అజ్ఞాన పరిధిలోదే. అందుకే కామ్యకర్మ పరిత్యాగం చేసే 'సంన్యాసి'కి, ఫలపరిత్యాగం చేసే త్యాగికి తేడా లేదు. శంకరుడు అదేవిధంగా వ్యాఖ్యానించాడు తరువాతి శ్లోకాలలో. అర్జునుడడిగిన సంన్యాస శబ్దానికి పరిత్యాగమని వ్యాఖ్యానించడం లోనే విశేషముంది. అర్జునుడి నోట సంన్యాసమనే శబ్దం కూడా వినడం భగవానుడికిష్టం లేదు. ఇంత చెప్పినా అర్జునుడికి ఇంకా సంన్యాస శబ్దంపై వ్యామోహం తొలగినట్లు లేదు అని సంన్యాసం నీకు కాదు, నీకు ఫలత్యాగమే అని మళ్ళీ చెపుతున్నాడు. అర్జునుడడిగిన సంన్యాసానికి కూడా త్యాగమనే అర్థం చెప్పాడు).

ఆక్షేపణ – నిత్య నైమిత్తిక కర్మలకు ఫలమే లేదంటారు గదా? మరి వాటి ఫలాన్ని త్యాగం చేయడమేమిటి, గొడ్రాలు కొడుకును త్యాగం చేసింది అన్నట్టు?

సమాధానం – ఇది దోషం కాదు. నిత్యకర్మలకు కూడా ఫలముంటుందని భగవానుడు అంగీకరిస్తున్నాడు కనుక, 'అనిష్టమిష్టం మిశ్రంచ' (18.12), 'న తు సంన్యాసినాం' (18.12) అని భగవానుడు చెప్పబోతున్నాడు కూడా. కేవలం సంన్యాసులకు మాత్రమే కర్మఫలం అంటుకోదని చెపుతూ, అసంన్యాసులకు నిత్యకర్మ ఫలప్రాప్తి 'భవత్య త్యాగినాం ప్రేత్య' (18.12) అని చెపుతున్నాడు.

**మూ. త్యాజ్యం దోషవదిత్యేకే కర్మ ప్రాహుర్మనీషిణః ।**
**యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యమితి చాపరే ॥ 3**

**తె.అ.** మేధావులు కొందరు కర్మను దోషం వలె వదిలివేయవలె అంటారు. యజ్ఞదాన తపః కర్మలను త్యజించరాదని మరికొందరు అంటారు.

**భాష్యమ్ : 3.1 త్యాజ్యమితి. త్యాజ్యం త్యక్తవ్యం, దోషవత్ దోషః అస్యాస్తీతి దోషవత్. కిం తత్? కర్మ బంధహేతుత్వాత్సర్వ మేవ. అథవా, దోషః యథా రాగాదిః త్యజ్యతే. తథా త్యాజ్యమిత్యేకే కర్మ ప్రాహుః మనీషిణః పండితాః సాంఖ్యాది దృష్టిమాశ్రితాః, అధికృతానాం కర్మిణామపీతి. తత్రైవ యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యమితి చాపరే.**

**తె.అ.** 'దోషవత్ కర్మ' అంటే కర్మ బంధానికి హేతువు కాబట్టి దోషం గల కర్మ, అంటే అన్ని కర్మలు అని అర్థం. లేక, 'దోషవత్' అంటే దోషమును వలె, రాగము మొదలైన దానిని వలె అని కూడా అర్థం చెప్పుకోవచ్చు. అందులో దోషముంది కనుకు కర్మను త్యజించాలి. లేక దోషాన్ని వదలినట్లు కర్మను త్యజించాలి అని సాంఖ్యాది దృష్టినాశ్రయించిన పండితులు కొందరంటారు. కర్మయందు అధికారమున్నవారికి కూడా ఇది అన్వయిస్తుంది. మరికొందరు యజ్ఞదాన తపః కర్మలు త్యజించవలసిన వాటిలో చేరవు అని అంటారు.

**భాష్యమ్ : 3.2 కర్మిణ ఏవాధికృతాః, తాన్ అపేక్ష్య ఏతే వికల్పాః న తు నిష్ఠాన్ వ్యుత్థాయినః సంన్యాసినః అపేక్ష్య. 'జ్ఞానయోగేన సాంఖ్యానాం నిష్ఠా మయా పురా ప్రోక్తే'తి (3.3) కర్మాధికారాత్ అపోద్ధృతాః యే న తాన్ప్రతి చింతా. 'నను కర్మయోగేన యోగినాం' (3.3) ఇతి అధికృతాః పూర్వం విభక్తనిష్ఠాః అపి ఇహ సర్వశాస్త్రార్థోపసంహార - ప్రకరణే యథా విచార్యన్తే, తథా సాంఖ్యా అపి జ్ఞాననిష్ఠాః విచార్యంతాం ఇతి.**

**న, తేషాం మోహదుఃఖనిమిత్త త్యాగనుపపత్తేః. నా కాయక్లేశనిమిత్తం దుఃఖం సాంఖ్యాః ఆత్మని పశ్యన్తి, ఇచ్ఛాదీనాం క్షేత్రధర్మత్వేన ఏ దర్శితత్వాత్. అతః తే న కాయక్లేశదుఃఖభయాత్ కర్మ పరిత్యజంతి. నాపి తే కర్మాణి ఆత్మని పశ్యంతి, యేన నియతం కర్మ మోహాత్ పరిత్యజేయుః. గుణానాం కర్మ 'నైవ కించిత్ కరోమి' (5.8) ఇతి హి తే సంన్యస్యంతి. 'సర్వకర్మాణి మనసా సంన్యస్య' (5.13) ఇత్యాదిభిః తత్త్వవిదః సంన్యాసప్రకారః ఉక్తః. తస్మాత్ యే అన్యే అధికృతాః కర్మణి అనాత్మవిదః, యేషాం చ మోహనిమిత్తః త్యాగః సంభవతి కాయక్లేశభయాచ్చ, తే ఏవ తామసాః త్యాగినః రాజసాశ్చ ఇతి నింద్యంతే, కర్మిణాం అనాత్మజ్ఞానాం కర్మఫలత్యాగస్తుత్యర్థమ్. 'సర్వారంభ పరిత్యాగీ ...', 'మౌనీ సంతుష్టో యేన కేనచిత్. అనికేతః స్థిరమతిః' (12.16-19) ఇతి గుణాతీతలక్షణే చ పరమార్థసంన్యాసినః విశేషితత్వాత్. వక్ష్యతి చ 'నిష్ఠా జ్ఞానస్య యా పరా' ఇతి. (18.50) తస్మాత్ జ్ఞాననిష్ఠాః సంన్యాసినః న ఇహ వివక్షితాః. కర్మఫలత్యాగః ఏవ సాత్త్వికత్వేన గుణేన తామసత్వాద్యపేక్షయా సంన్యాసః ఉచ్యతే, న ముఖ్యః సర్వకర్మసంన్యాసః.**

**తె.అ.** ఈ వికల్పాలు కర్మాధికారం గలవారికే అన్వయిస్తాయి కాని జ్ఞాననిష్ఠులైన సన్న్యాసులకు కాదు. సాంఖ్యులకు జ్ఞానయోగనిష్ఠ పూర్వం చెప్పి ఉన్నాను (3.3) అన్నమాట ప్రకారం ఎవరు కర్మాధికారం నుండి తొలగించబడ్డారో వారి గురించికాదు ఈ చింత.

**తె.అ.** ఆక్షేపణ – 'కర్మయోగేన యోగినాం' (3.3) అని వెనుక కర్మాధికారులను వేరుచేసి వారికి కర్మనిష్ఠ చెప్పి ఉండినప్పటికి, ఇక్కడ సర్వ శాస్త్రార్థాన్ని ఉపసంహారం చేస్తున్న సందర్భంలో మళ్ళీ ఆ కర్మనిష్ఠను చర్చించినట్లే జ్ఞాననిష్ఠులైన సాంఖ్యులను కూడా ఇక్కడ చర్చించదలచి ఉండవచ్చు కదా?

సమాధానం – కాదు. వారు మోహం చేతగాని, దుఃఖనిమిత్తంగా గాని, కర్మలను త్యజించడం జరుగదు కనుక. సాంఖ్యులు ఆత్మయందు కాయక్లేశ నిమిత్తమైన దుఃఖం చూడడం లేదు, కోర్కెలు మొదలైనవి క్షేత్రధర్మాలు కనుక వారు కాయక్లేశ దుఃఖభయంతో కర్మ పరిత్యజించరు. వారు ఆత్మయందు కర్మను చూడడం లేదుకూడా, కనుక మోహం చేత నియతకర్మను పరిత్యజించరు. గుణములు కర్మ చేస్తున్నాయి, 'నైవ కించిత్ కరోమి' (5.8) అని వారు సంన్యసిస్తున్నారు. (సంన్యసించడమంటే కర్మలను వదలివేయడంగాదు, కర్మ యాథాత్మ్యం తెలియడం, నేను (ఆత్మ) కర్మ చేయడంలేదు అని దర్శించడం.) 'సర్వ కర్మాణి మనసా సంన్యస్య' (5.13) మొదలైన వాక్యాలలో తత్త్వవిదుల సంన్యాసప్రకారం చెప్పబడింది. కనుక కర్మలయందు అధికారం కలిగి మోహం చేత కాయక్లేశ భయంచేత కర్మ పరిత్యాగం చేసేవారినే ఇక్కడ తామస త్యాగులు రాజసత్యాగులు అని నిందించడం, అనాత్మజ్ఞులైన అధికారులు ఫలత్యాగం చేసి కర్మలనాచరించవలెనని ఫలత్యాగాన్ని స్తుతించడం కొరకు. 'సర్వారంభ పరిత్యాగీ' (2.16) 'మౌనీ సంతుష్టో యేనకేనచిత్' 'అనికేతః స్థిరమతిః' (12.19) అని పరమార్థ సంన్యాసుల గుణాతీతలక్షణాలు వేరుగా చెప్పబడ్డాయి కనుక 'నిష్ఠా జ్ఞానస్య యా పరా' (18.50) అని కూడా ముందు చెప్పబోతున్నాడు కనుక జ్ఞాననిష్ఠులైన సంన్యాసులు ఈ చర్చలో లేరు. తామస రాజస గుణాలచేత కర్మలు మానడాన్ని దృష్టిలో ఉంచుకుని, సత్త్వగుణం చేత చేసిన కర్మఫల త్యాగమే సంన్యాసమని చెప్పబడింది. కాని ముఖ్యార్థంలో కాదు. అంటే ఇక్కడ చెప్పిన సంన్యాసం సర్వకర్మ సంన్యాసం కాదు.

**భాష్యమ్ : 3.3 సర్వకర్మసంన్యాసాసంభవే చ 'న హి దేహభృతా' (18.11) ఇతి హేతు వచనాత్ ముఖ్య ఏవ ఇతి చేత్, న, హేతువచనస్య స్తుత్యర్థత్వాత్. యథా 'త్యాగాచ్ఛాంతిరనంతర' మితి (12.12) కర్మఫలత్యాగ–స్తుతిరేవ యథోక్తానేక పక్షానుష్ఠానాశక్తిమంతమర్జునం అజ్ఞం ప్రతి విధానాత్, తథేదమపి 'న హి దేహభృతా శక్య' మితి (18.11) కర్మఫలత్యాగ స్తుత్యర్థం**

**న 'సర్వకర్మాణి మనసా సంన్యస్య నైవ కుర్వన్నకారయన్నాస్తే' (5.13) ఇత్యస్య పక్షస్య అపవాదః కేనచిద్దర్శయితుం శక్యః. తస్మాత్ కర్మణ్యధికృతా న్ప్రత్యేవ ఏష సంన్యాసత్యాగవికల్పః. యే తు పరమార్థదర్శినః సాంఖ్యాః తేషాం జ్ఞాననిష్ఠాయామేవ సర్వకర్మసంన్యాసలక్షణాయాం అధికారః, నాన్యత్రేతి న తే వికల్పార్హాః. తచ్చ ఉపపాదితమస్మాభిః 'వేదావినాశినం' (2.21) ఇత్యస్మిన్ ప్రదేశే, తృతీయాదౌ చ.**

**తె.అ.** ఆక్షేపణ – ఇక్కడ సంన్యాస శబ్దం ముఖ్యార్థంలోనే ప్రయోగించబడింది. సర్వకర్మ సంన్యాసం అసంభవమని, అందుకు హేతువు కూడా 'న హి దేహభృతా' (18.11) అని చెప్పి ఉండడం చేత.

సమాధానం – కాదు, హేతువు చెప్పింది స్తుతికొరకు. ఎట్లాగంటే 'త్యాగాచ్ఛాంతిరనంతరమ్' (12.12) అని అనేక సాధనాలు చెప్పి అవేవీ అనుష్ఠించలేని అజ్ఞుడైన అర్జునునికి విధించినది కనుక అది కర్మఫల త్యాగస్తుతియే. అట్లాగే 'న హి దేహభృతాశక్యమ్' (18.11) అన్న వాక్యం కూడా కర్మఫల త్యాగాన్ని స్తుతించడం కొరకే. సర్వకర్మలను మనసా సన్యసించి ఏ కర్మను చేయక చేయించక ఉండువాడు అన్న పక్షానికి అపవాదం చూపడం ఎవరికీ శక్యం కాదు. కనుక కర్మలయందు అధికారం ఉన్నవారి విషయంలోనే సంన్యాసమా త్యాగమా అన్న వికల్పం. పరమార్థాన్ని దర్శించిన సాంఖ్యులకు మాత్రం సర్వకర్మ సంన్యాసలక్షణమైన జ్ఞాన నిష్ఠయందే గాని మరొకదానియందు వారికి అధికారం లేదు. కనుక వారి విషయంలో వికల్పానికి అవకాశం లేదు. 'వేదావినాశినమ్' (2.21) అనేచోట, మూడవ అధ్యాయ ఆరంభంలోను, మేము ఇదేవిధంగా నిర్ణయించాము.

**భాష్యమ్ : 4.0 తత్ర ఏతేషు వికల్పభేదేషు –**

**తె.అ.** ఇక్కడ ఈ వికల్ప భేదాలలో –

**మూ. నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ ।**
**త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధస్సంప్రకీర్తితః ॥ 4**

**తె.అ.** భరతసత్తమా! ఆ త్యాగం గురించి నా నిశ్చయమైన అభిప్రాయం విను. పురుష వ్యాఘ్రమా! త్యాగం మూడువిధాలని నిర్ణయించబడింది.

**భాష్యమ్ : 4.1 నిశ్చయమితి. నిశ్చయం శృణు అవధారయ, మే మమ, వచనాత్, తత్ర త్యాగే త్యాగసంన్యాస వికల్పే యథాదర్శితే, భరతసత్తమ! భరతానాం సాధుతమ! త్యాగో హి త్యాగసంన్యాసశబ్దవాచ్యో హి య అర్థః స ఏక ఏవేతి అభిప్రేత్యాహ – 'త్యాగో హి' ఇతి**

**పురుషవ్యాఘ్ర. త్రివిధః త్రిప్రకారః తామసాది ప్రకారైః సంప్రకీర్తితః శాస్త్రేషు సమ్యక్ కథితః. యస్మాత్ తామసాదిభేదేన త్యాగసంన్యాస శబ్ద వాచ్యాఽర్థో అధికృతస్య కర్మిణోఽనాత్మజ్ఞస్య త్రివిధః సంభవతి న పరమార్థదర్శినః, ఇత్యయమర్థో దుర్జ్ఞానః తస్మాత్ అత్ర తత్త్వం నాన్యో వక్తుం సమర్థః. తస్మాన్నిశ్చియం పరమార్థశాస్త్రార్థ విషయం అధ్యవసాయం ఐశ్వరం మే మత్తః శృణు.**

**తె.అ.** అర్జునా, వెనుక చెప్పిన త్యాగసంన్యాసవికల్పవిషయంలో నా మాట ద్వారా నా నిశ్చయం విను. త్యాగసంన్యాస శబ్దాలకు అర్థమొకటే గదా అనే అభిప్రాయంతో త్యాగమనే అంటున్నాడు భగవానుడు. తామసాది త్రివిధ త్యాగం శాస్త్రాలలో చక్కగా నిర్ణయించబడింది. కర్మలయందు అధికారం గల అనాత్మజ్ఞునికి తామసాది భేదం గల త్యాగసంన్యాస శబ్దవాచ్యమైన అర్థం త్రివిధంగా ఉంటుంది. పరమార్థదర్శికి (ఆత్మ తత్త్వాన్ని తెలుసుకొన్నవారికి) ఉండదు. ఈ విషయం తెలుసుకోడం కష్టం. కనుక ఈ విషయంలోని తత్త్వం ఇతరుడెవడూ చెప్ప సమర్థుడు కాడు. కనుక ఈ విషయంలో శాస్త్రం యథార్థంగా ఏమి చెప్పింది అన్నదాని గురించి ఈశ్వరుని నిశ్చయం విను.

**భాష్యమ్ : 5.0 కః పునః అసౌ నిశ్చయ ఇతి, ఆహ –**

**తె.అ.** ఏమిటా నిశ్చయం? చెపుతున్నాడు.

**మూ. యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యం కార్యమేవ తత్ ।**
**యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్ ॥ 5**

**తె.అ.** యజ్ఞం, దానం, తపస్సు అను కర్మను వదలరాదు. అది చేయవలసినదే. ఈ మూడు మనుషులను పావనం చేస్తాయి.

**భాష్యమ్ : 5.1 యజ్ఞ ఇతి. యజ్ఞః దానం తప ఇత్యేతత్ త్రివిధం కర్మ న త్యాజ్యం న త్యక్తవ్యం, కార్యం కరణీయమేవ తత్, కస్మాత్? యజ్ఞః దానం తపశ్చైవ పావనాని విశుద్ధికరాణి మనీషిణాం ఫలానభిసంధినామిత్యేతత్.**

**తె.అ.** యజ్ఞము దానము తపము అనే మూడు విధాలైన కర్మ వదలరాదు, చేయవలసినదే. ఎందుకంటే, యజ్ఞదానతపాలు ఫలాపేక్ష లేని పురుషులను పావనం చేస్తాయి. అవి విశుద్ధికారణాలు.

**మూ. ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ ।**
**కర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మతముత్తమమ్ ॥ 6**

**తె.అ.** పార్థా! ఈ కర్మలు కూడా ఆసక్తిని ఫలములను వదలి చేయవలెనని ఉత్తమమైన నా నిశ్చితాభిప్రాయం.

**భాష్యమ్ : 6.1 ఏతాన్యపి ఇతి. ఏతాన్యపి తు కర్మాణి యజ్ఞదానతపాంసి పావనాని ఉక్తాని, సంగం ఆసక్తిం తేషు, త్యక్త్వా ఫలాని చ తేషాం పరిత్యజ్య కర్తవ్యాని ఇతి అనుష్ఠేయానీతి, మే మమ, నిశ్చితం మతముత్తమమ్. 'నిశ్చయం శృణు మే తత్ర' (18.4) ఇతి ప్రతిజ్ఞాయ, పావనత్వం చ హేతుముక్త్వా, 'ఏతాన్యపి తు కర్మాణి కర్తవ్యాని' ఇతి ఏతత్ 'నిశ్చితం మతముత్తమమ్' యితి ప్రతిజ్ఞాతార్థోపసంహార ఏవ. న అపూర్వార్థం వచనమ్ 'ఏతాన్యపి' ఇతి ప్రకృతసన్నికృష్టార్థత్వోపపత్తేః సాసంగస్య ఫలార్థినో బంధహేతవః. 'ఏతాన్యపి కర్మాణి ముముక్షోః కర్తవ్యాని' ఇతి అపిశబ్దస్య అర్థః. న తు అన్యాని కర్మాణి అపేక్ష్య 'ఏతాన్యపి' ఇతి ఉచ్యతే.**

**అన్యే తు వర్ణయంతి – నిత్యానాం కర్మణాం ఫలాభావాత్ 'సంగం త్యక్త్వా ఫలాని' ఇతి నోపపద్యతే. అతః 'ఏతాన్యపి' యితి యాని కామ్యాని కర్మాణి నిత్యేభ్యః అన్యాని, ఏతాన్యపి కర్తవ్యాని, కిముత యజ్ఞదానతపాంసి నిత్యాని ఇతి, తదసత్, నిత్యానామపి కర్మణాం యిహ ఫలవత్త్వస్య ఉపపాదితత్వాత్ 'యజ్ఞో దానం తపశ్చైవ పావనాని, ఇత్యాదినా వచనేన. నిత్యాన్యపి కర్మాణి బంధహేతుత్వాశంకయా జిహాసోః ముముక్షోః కుత కామ్యేషు ప్రసంగః? 'దూరేణ హ్యవరం కర్మ' (2.49) ఇతి చ నిందితత్వాత్, యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర (3.9) ఇతి చ కామ్యకర్మణాం బంధహేతుత్వస్య నిశ్చితత్వాత్, 'త్రైగుణ్యవిషయా వేదాః' (2.45) 'త్రైవిద్యా మాం సోమపాః' (9.20) 'క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి' (9.21) ఇతి చ, దూరవ్యవహితత్వాచ్చ, న కామ్యేషు 'ఏతాన్యపి' ఇతి వ్యపదేశః.**

**తె.అ.** పావనములని చెప్పబడిన ఈ యజ్ఞదాన తపఃకర్మలు కూడా వాటియందు ఆసక్తిని వాటి ఫలాలను వదలి ఆచరించవలెనని నా నిశ్చయము, ఉత్తమము అయిన అభిప్రాయము. 'ఈ విషయంలో నా నిశ్చయం విను' అని ప్రకటించి పావనత్వమనే కారణం కూడా చెప్పి కర్మలు చేయవలసినవే, ఇది నా నిశ్చితము ఉత్తమము అయిన అభిప్రాయమనడం ప్రకటించిన విషయాన్ని ముగిస్తూ చెప్పిన మాటే గాని కొత్త విషయం గాదు, 'ఇవి కూడా' అన్న మాట అత్యంత సన్నిహిత విషయంతో సంబంధించినది. (యజ్ఞదాన తపఃకర్మలతోటే 'ఇవి కూడా' అన్నమాటకు సంబంధం) ఆసక్తితో ఫలం కోరి చేసేవారికి బంధహేతువులైన ఈ కర్మలు కూడా ముముక్షువులకు

కర్తవ్యమే అని 'కూడా' శబ్దం యొక్క అర్థం. ఇతర కర్మలనుద్దేశించి 'అవేగాక ఇవి కూడా' అని చెప్పడం లేదు.

కొందరిట్లా వ్యాఖ్యానిస్తారు. నిత్యకర్మలకు ఫలం ఉండదు. కనుక ఫలం వదలి అనడంలో అర్థం లేదు. ఇవి కూడా అనడం ఎందుకంటె నిత్యకర్మలు కాని, కామ్యకర్మల గురించి ఇవి కూడా చేయదగినవి, ఇక నిత్యకర్మలైన యజ్ఞదానతపాల గురించి చెప్పడమెందుకు అని. ఈ విధమైన వ్యాఖ్య సరికాదు. నిత్యకర్మలకు కూడా ఫలముంటుందని 'యజ్ఞో దాన తపశ్చైవ పావనాని' వంటి మాటల వలన నిరూపించబడింది కనుక. బంధ హేతువులనే భయంతో నిత్యకర్మలనే వదల వలెననుకునే ముముక్షువులకు కామ్యకర్మల ప్రసక్తి ఎట్లా వుంటుంది? 'దూరేణ హ్యవరం కర్మ' (2.49) అని నిందించిన కారణంగా, 'యజ్ఞార్థో కర్మణోన్యత్ర' (3.9) అని కామ్యకర్మలు బంధ హేతువులని నిశ్చయింపబడినందున, 'త్రైగుణ్య విషయా వేదాః' (2.45), 'త్రైవిద్యాయాం సోమపాః' (9.20), 'క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి' (9.21) అని చెప్పబడి వుండడం చేత, అంతేకాక కామ్యకర్మల విషయం దూరంలో చెప్పబడి ఉండడం చేత ఇక్కడ 'ఇవికూడా' అనే శబ్దం కామ్యకర్మల నుద్దేశించి గాదు.

('కామ్యకర్మలే కాక ఈ నిత్యకర్మలు కూడా' అన్న అర్థంలో గాదు.)

**భాష్యమ్ : 7.0 తస్మాదజ్ఞస్యాధికృతస్య ముముక్షోః –**

**తె.అ.** కనుక కర్మలయందు అధికారం కలిగినవానికి, అజ్ఞానియైన ముముక్షువుకు –

**మూ. నియతస్య తు సంన్యాసః కర్మణో నోపపద్యతే ।**
**మోహాత్తస్య పరిత్యాగస్తామసః పరికీర్తితః ॥ 7**

**తె.అ.** నియత కర్మలను సంన్యసించరాదు. మోహం చేత వాటిని త్యజించడం తామసమంటారు.

**భాష్యమ్ : 7.1 నియతస్య ఇతి. నియతస్య తు నిత్యస్య సంన్యాసః పరిత్యాగః కర్మణో, నోపపద్యతే, తస్య పావనత్వస్య ఇష్టత్వాత్. మోహాత్ అజ్ఞానాత్ తస్య నియతస్య పరిత్యాగః – నియతం చ అవశ్యం కర్తవ్యం, త్యజ్యతే చ, ఇతి హి ప్రతిషిద్ధం. అతో మోహనిమిత్తః పరిత్యాగః తామసః పరికీర్తితః మోహశ్చ తమః ఇతి. కించ –**

**తె.అ.** అజ్ఞాని నిత్యకర్మలను మానరాదు. ఎందుకంటే అవి పావనం చేసేవి అని భావించబడతాయి కనుక. నియతమంటే తప్పక చేయవలసినవి అని. వాటిని త్యజించడమన్నది విరుద్ధం. కనుక మోహం చేత అజ్ఞానం చేత వాటిని మానడం తామసమవుతుంది. మోహం తమస్సే అని కదా! అంతేకాదు –

**మూ. దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశ భయాత్త్యజేత్ ।**
**స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్. 8**

**తె.అ.** కష్టమని, శరీరమునకు ప్రయాస కలుగునని భయంచేత, కర్మను మానడం రాజసత్యాగం. దానివల్ల త్యాగఫలం లభించదు.

**భాష్యమ్ : 8.1 దుఃఖమితి. దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశభయాత్ శరీరదుఃఖభయాత్ త్యజేత్, స కృత్వా రాజసం రజో నిర్వర్త్యం త్యాగం నైవ త్యాగఫలం జ్ఞానపూర్వకస్య సర్వకర్మత్యాగస్య ఫలం మోక్షాఖ్యం న లభేత్ న లభేత.**

**తె.అ.** శరీరానికి కష్టం కలుగుతుందనే భయంచేత కర్మను మానడం రాజసత్యాగము. దానివల్ల జ్ఞానపూర్వకమైన సర్వకర్మ త్యాగఫలం, మోక్షం లభించదు.

**భాష్యమ్ : 9.0 కః పునస్సాత్త్వికస్త్యాగః ఇతి ఆహ -**

**తె.అ.** అయితే మరి సాత్త్విక త్యాగమేది? అంటే చెపుతున్నాడు -

**మూ. కార్యమిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున ।**
**సంగం త్యక్త్వా ఫలం చైవ స త్యాగః సాత్త్వికో మతః ॥ 9**

**తె.అ.** అర్జునా, నిత్యకర్మను తప్పక చేయవలసిందే అను నిశ్చయంతో, సంగాన్నీ, ఫలాన్ని కూడా వదలి చేయడం సాత్త్విక త్యాగమనబడుతుంది.

**భాష్యమ్ : 9.1 కార్యమితి. కార్యం కర్తవ్యమిత్యేవ యత్కర్మ నియతం నిత్యం క్రియతే నిర్వర్త్యతే, అర్జున, సంగం త్యక్త్వా ఫలం చైవ, ఏతత్ నిత్యానాం కర్మణాం ఫలవత్త్వే భగవద్వచనం ప్రమాణమవోచామ. అథ వా, యద్యపి ఫలం న శ్రూయతే నిత్యస్య కర్మణః, తథాఽపి నిత్యం కర్మ కృతం ఆత్మసంస్కారం ప్రత్యవాయపరిహారం వా ఫలం కరోతి ఆత్మనః ఇతి కల్పయత్యేవాజ్ఞః. తత్ర తామపి కల్పనాం నివారయతి 'ఫలం త్యక్త్వా' ఇత్యనేన. అతః సాధు ఉక్తం 'సంగం త్యక్త్వా ఫలం చ' ఇతి సః త్యాగః నిత్య కర్మసు సంగఫలపరిత్యాగః సాత్త్వికః సత్త్వగుణనిర్వృత్తోమతః అభిప్రేతః.**

**తె.అ.** నిత్యకర్మ తప్పక చేయవలసినదే అని దానియందు సంగము దాని ఫలము కూడా త్యజించి నిర్వర్తించడం సాత్త్వికత్యాగం అనబడుతుంది. నిత్యకర్మలకు ఫలముంటుందనడానికి భగవద్వచనమే ప్రమాణమని చూపి ఉన్నాము. లేక, శ్రుతి నిత్యకర్మలకు ఫలం చెప్పకపోయినా అజ్ఞాని నిత్యకర్మానుష్ఠానం చేసే ఆత్మ సంస్కారంగానీ, ప్రత్యవాయపరిహారం గాని ఫలం ఆత్మకు

కలుగుతుందని అనుకుంటాడు కనుక, ఆ విధమైన కల్పనను నివారించడం కొరకు 'ఫలమును త్యజించి' అని అంటున్నాడు. కనుక 'సంగమును, ఫలమును కూడా త్యజించి' అనడం యుక్తమే. నిత్యకర్మల యందు ఆ సంగ ఫల పరిత్యాగము సాత్త్వికమనబడుతుంది.

**భాష్యమ్ : 9.2 ఆక్షేపణ – నను కర్మ పరిత్యాగః త్రివిధః సంన్యాసః ఇతి చ ప్రకృతః. తత్ర తామసో రాజసశ్చ త్యాగః ఉక్తః. కథమిహ సంగఫలత్యాగః తృతీయత్వేనోచ్యతే? యథా త్రయో బ్రాహ్మణాస్సమాగతాః, తత్ర షడంగ విదౌ ద్వౌ, క్షత్రియస్తృతీయ ఇతి.**

**తె.అ.** ఆక్షేపణ – త్రివిధ కర్మ పరిత్యాగము సంన్యాసము కదా ప్రస్తుత విషయం. అందులో తామస రాజస త్యాగాలు చెప్పబడ్డాయి. ఇక్కడ సంగ ఫలత్యాగమని మూడవది చెప్పడం ఎట్లా కుదురుతుంది? ఇది ఎట్లాగ వున్నదంటే 'ముగ్గురు బ్రాహ్మణులు వచ్చారు, అందులో ఇద్దరు షడంగవిదులు, మూడవవాడు క్షత్రియుడు' అన్నట్లుంది.

**భాష్యమ్ : 9.3 తద్వన్ నైష దోషః. త్యాగ సామాన్యేన స్తుత్యర్థత్వాత్. అస్తి హి కర్మ సన్న్యాసస్య ఫలాభిసంధిత్యాగస్య చ త్యాగత్వసామాన్యం. తత్ర రాజసతామసత్వేన కర్మత్యాగనిందయా కర్మఫలాభిసంధిత్యాగః సాత్త్వికత్వేన స్తూయతే, 'స త్యాగః సాత్త్వికో మతః' ఇతి.**

**తె.అ.** సమాధానం – ఇది దోషం కాదు. త్యాగాన్ని సామాన్యంగా స్తుతించడమే ప్రస్తుత విషయం కనుక. కర్మ సంన్యాసానికి ఫలాభిసంధి త్యాగానికి త్యాగం సమానం. (రెంటిలోను త్యాగం వుంది) వాటిలో రాజసతామసత్వంలో కర్మలను త్యజించడాన్ని నిందిస్తూ కర్మ ఫలాభిసంధిని త్యజించడం సాత్త్వికమని స్తుతించబడుతున్నది. 'స త్యాగః సాత్త్వికోమతః' అని.

**భాష్యమ్ : 10.0 యస్తు అధికృతః సంగం త్యక్త్వా ఫలాభిసంధిం చ కర్మ నిత్యం కరోతి, తస్య ఫలరాగాదినా అకలుషీక్రియమాణమంతఃకరణ నిత్యైశ్చ కర్మభిః సంస్క్రియమాణం విశుధ్యతి. తద్విశుద్ధం ప్రసన్నం ఆత్మాలోచనక్షమం భవతి. తస్యైవ నిత్యకర్మానుష్ఠానేన విశుద్ధాంతః కరణస్య ఆత్మజ్ఞానాభిముఖస్య క్రమేణ యథా తన్నిష్ఠా స్యాత్, తద్వక్తవ్యమితి ఆహ –**

**తె.అ.** కర్మలయందు అధికారం కలవాడు సంగము, ఫలాపేక్ష వదలి నిత్యకర్మలను అనుష్ఠించడం చేత అతని అంతఃకరణం, ఫలాపేక్షచే కలుషితం కాలేదు కనుక, సంస్కరింపబడి విశుద్ధమవుతుంది. విశుద్ధము, ప్రసన్నము అయిన అంతఃకరణమే ఆత్మను గురించి ఆలోచించగలుగుతుంది. నిత్య– కర్మానుష్ఠానం చేత అంతఃకరణము విశుద్ధమై క్రమంగా ఆత్మజ్ఞానాభిముఖంగా సాగి అందులో అతడు ఏ విధంగా స్థిరంగా నిలుస్తాడో అది చెప్పవలెనని అంటున్నాడు –

**మూ. న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే ।**
**త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః ॥ 10**

**తె.అ.** త్యాగి బంధాది హేతువైన కర్మను ద్వేషించడు, కుశల కర్మయందు ఆసక్తుడు కాడు. అతడు సత్త్వంతో నిండినవాడు, మేధావి, సంశయాలన్నీ తొలగినవాడు.

**భాష్యమ్ : 10.1 న ద్వేష్టి ఇతి. న ద్వేష్ట్యకుశలం అశోభనం కామ్యం కర్మ, శరీరారంభద్వారేణ సంసార కారణం 'కిమనేన' ఇత్యేవమ్. కుశలే శోభనే నిత్యే కర్మణి సత్త్వశుద్ధి జ్ఞానోత్పత్తితన్నిష్ఠాహేతుత్వేన 'మోక్షకారణమిదం' ఇత్యేవం నానుషజ్జతే. అనుషంగం ప్రీతిం న కరోతి ఇత్యేతత్. కః పునరసౌ? త్యాగీ పూర్వోక్తేన సంగఫలత్యాగేన తద్వాన్ త్యాగీ యః కర్మణి సంగం త్యక్త్వా తత్ఫలం చ నిత్యకర్మానుష్ఠాయీ సః త్యాగీ, కదా పునరసౌ అకుశలం కర్మ న ద్వేష్టి, కుశలే చ నానుషజ్జతే ఇతి, ఉచ్యతే - సత్త్వసమావిష్టః యదా సత్త్వేన ఆత్మానాత్మ వివేకజ్ఞానహేతునా సమావిష్టః సంవ్యాప్తః, సత్త్వ సంయుక్త ఇత్యేతత్. అత ఏవ చ మేధావీ మేధయా ఆత్మజ్ఞాన లక్షణయా ప్రజ్ఞయా సంయుక్తః తద్వాన్ మేధావీ, మేధా విత్వాదేవ ఛిన్న సంశయః ఛిన్నః అవిద్యాకృతః సంశయః యస్య, 'ఆత్మ స్వరూపావస్థానమేవ పరం నిశ్రేయససాధనం, న అన్యత్ కించిత్' ఇత్యేవం నిశ్చయేన ఛిన్న సంశయః.**

**యః అధికృతః పురషః పూర్వోక్తేన ప్రకారేణ కర్మయోగానుష్ఠానేన క్రమేణ సంస్కృతాత్మా సన్ జన్మాదివిక్రియా రహితత్వేన నిష్క్రియమాత్మానమాత్మత్వేన సంబుద్ధః, సః సర్వకర్మాణి మనసా సంన్యస్య నైవ కుర్వన్నకారయన్నాసీనో నైష్కర్మ్యలక్షణాం జ్ఞాననిష్ఠామశ్నుతే ఇత్యేతత్. పూర్వోక్తస్య కర్మయోగస్య ప్రయోజనమనేనైవ శ్లోకేన ఉక్తమ్.**

**తె.అ.** అకుశలమైన కర్మ అంటే కామ్యకర్మ. కామ్యకర్మ మళ్ళీ శరీరాన్నిస్తుంది. ఆ విధంగా అది సంసార కారణం. కనుక అది అశుభకర్మ. ఆ అశుభకర్మను ద్వేషించడు. అట్లాగే అతడు కుశలకర్మ సత్త్వశుద్ధి చేసి జ్ఞానోత్పత్తికి కారణమై అందులో నిష్ఠ కలిగించి మోక్ష కారణమవుతుందని దానియందు ఆసక్తుడూ కాడు. అంటే అతనికి నిత్యకర్మలో కూడా ఏ ప్రయోజనము కనిపించదు అని. ఎవడతడు? త్యాగి, వెనుక చెప్పిన సంగఫలపరిత్యాగ సంపన్నుడు, కర్మలయందు సంగము వాటి ఫలము కూడా వదలి నిత్యకర్మలను అనుష్ఠించేవాడు. మరి ఇతడు ఎప్పుడు అకుశల కర్మను ద్వేషించడు, కుశలకర్మ యందు ఆసక్తుడు కాడు? అంటే చెపుతున్నాడు. ఆత్మానాత్మ వివేక విజ్ఞానహేతువైన సత్త్వంతో నిండినపుడు అని. అందుకే అతడు మేధావి. ఆత్మజ్ఞాన లక్షణమైన ప్రజ్ఞ గలవాడు. మేధావి కనుకనే సంశయాలన్నీ తొలగినవాడు. అవిద్యాకల్పితాలైన సంశయాలన్నీ తొలగి ఆత్మస్వరూపంలో నిలచిపోవడమే పరమమోక్ష సాధనము మరొకటి

కాదు అనే నిశ్చయం చేత సంశయాలు తొలగినవాడు. అధికారి అయినవాడు పై చెప్పిన ప్రకారంగా కర్మ యోగానుష్ఠానం చేత క్రమంగా ఆత్మ సంస్కారం పొంది జన్మాదివికార రహితుడై నిష్క్రియమైన ఆత్మను తన్నుగా తెలిసి 'సర్వకర్మలను మనసా సంన్యసించి', 'ఏమీ చేయక చేయించక ఉంటూ' (5.13) నైష్కర్మ్య లక్షణమైన జ్ఞాననిష్ఠను పొందుతాడు. ఈ ప్రకారంగా వెనుక చెప్పిన కర్మయోగం యొక్క ప్రయోజనం ఈ శ్లోకంలో చెప్పబడింది.

**భాష్యమ్ : 11.0 యః పునరధికృతస్సన్ దేహాత్మాభిమానిత్వేన దేహభృదజ్ఞః అబాధితాత్మకర్తృత్వ విజ్ఞానతయా 'అహం కర్తా' ఇతి నిశ్చితబుద్ధిః, తస్య అశేషకర్మ పరిత్యాగస్యాశక్యత్వాత్ కర్మఫలత్యాగేన చోదిత కర్మానుష్ఠానే ఏవ అధికారః, న తత్త్యాగే ఇత్యేతమర్థం దర్శయితుమహ –**

**తె.అ.** ఇక దేహాత్మాభిమానంతో దేహాన్ని భరిస్తూ ఉన్నవాడు, అజ్ఞాని, ఆత్మ కర్త అనే అజ్ఞానం తొలగినవాడు, నేను కర్తను అని నిశ్చతబుద్ధి గలవాడు – ఇటువంటి అధికారికి అశేషకర్మ పరిత్యాగం అశక్యం కనుక కర్మఫల త్యాగం చేసి విహితకర్మలను అనుష్ఠించడానికే అధికారముంది, వాటిని వదిలే అధికారం అతనికి లేదు అన్న అర్థం ప్రదర్శించడానికి అంటున్నాడు–

**మూ. న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః ।**
**యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీత్యభిధీయతే ॥ 11**

**తె.అ.** దేహాన్ని భరిస్తున్నవానికి కర్మలను నిశ్శేషంగా వదలడం శక్యం కాదు. కాని కర్మఫలాన్ని త్యాగం చేసేవాణ్ణి త్యాగి అంటారు.

**భాష్యమ్ : 11.1 న హి ఇతి. న హి యస్మాద్దేహభృతా, దేహం బిభర్తీతి దేహభృత్, దేహాత్మాభిమానవాన్ దేహభృదిత్యుచ్యతే, న వివేకీ, స హి 'వేదావినాశిన' (2.21) మిత్యాదినా కర్తృత్వాధికారాన్నివర్తితః. అతః తేన దేహభృతా అజ్ఞేన న శక్యం త్యక్తుం సంన్యసితుం కర్మాణి అశేషతః నిశ్శేషేణ. తస్మాద్యస్త్వజ్ఞోఽధికృతో నిత్యాని కర్మాణి కుర్వన్ కర్మఫలత్యాగీ కర్మఫలాభి–సంధిమాత్రసంన్యాసీ స త్యగీత్యభిధీయతే, కర్మ్యపి సన్నితి స్తుత్యభిప్రాయేణ. తస్మాత్పరమార్థదర్శిత్వేనైవ అదేహభృతా దేహాత్మభావరహితేనైవాశేషకర్మసంన్యాసశ్శక్యతే కర్తుమ్.**

**తె.అ.** దేహాత్మాభిమానం గలవాడు, దేహాన్ని భరిస్తూ ఉన్న, అజ్ఞానికి నిశ్శేషంగా కర్మలను సంన్యసించడం శక్యం కాదు. వివేకి విషయం వేరు. 'వేద అవినాశినాం' (2.21) మొదలైన వాక్యాలలో అతడు కర్తృత్వాధికారం నుండి తొలగించబడ్డాడు. కనుక అజ్ఞుడైన అధికారి గురించే ఇక్కడ చెప్పుకోవడం. నిత్యకర్మలను చేస్తూ కర్మఫలత్యాగం చేసే కర్మఫలాభిసంధి మాత్ర సంన్యాసిని, అతడు కర్మి అయినప్పటికి, అతనిని స్తుతించే అభిప్రాయంతో త్యాగి అంటారు. కనుక పరమార్థం

దర్శించినవానికి, దేహభారం లేనివానికి అంటే దేహాత్మ భావం లేనివానికి మాత్రమే అశేష కర్మ సంన్యాసం సాధ్యం.

**భాష్యమ్ : 12.0 కిం పునస్తత్ప్రయోజనం యత్సర్వకర్మసంన్యాసాత్స్యాదితి ఉచ్యతే –**

**తె.అ.** అయితే సర్వకర్మ సంన్యాసం వలన ఏం ప్రయోజనం? అంటే చెపుతున్నాడు.

**మూ. అనిష్టమిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్ ।**
**భవత్యత్యాగినాం ప్రేత్య న తు సంన్యాసినాం క్వచిత్ ॥ 12**

**తె.అ.** కర్మఫలత్యాగము చేయనివారికి మరణానంతరం అనిష్టము, ఇష్టము, మిశ్రము అని కర్మఫలం మూడు విధాలుగా ఉంటుంది. కాని సంన్యాసులకు ఎక్కడా కూడ ఫలం కలుగదు.

**భాష్యమ్ : 12.1 అనిష్టమితి. అనిష్టం నరకతిర్యగాదిలక్షణం, ఇష్టం దేవాదిలక్షణం, మిశ్రం ఇష్టానిష్టసంయుక్తం మనుష్యలక్షణం చ తత్త్రివిధం త్రిప్రకారం కర్మణః ధర్మాధర్మాది లక్షణస్య ఫలం బాహ్యానేకకారకవ్యాపార నిష్పన్నం సదవిద్యాకృతమింద్రజాలమాయోపమం మహామోహకరం ప్రత్యగాత్మోపసర్పి ఇవ – ఫల్గుతయా లయమదర్శనం గచ్ఛతీతి ఫలనిర్వచనమ్ – తదేవ లక్షణం ఫలం భవతి అత్యాగినాం అజ్ఞానాం కర్మిణాం అపరమార్థ సంన్యాసినాం ప్రేత్య శరీరపాతాదూర్ధ్వం. న తు సంన్యాసినాం పరమార్థసంన్యాసినాం పరమహంస – పరివ్రాజకానాం కేవలజ్ఞాననిష్ఠానాం క్వచిత్. న హి కేవల సమ్యగ్దర్శననిష్ఠా అవిద్యాదిసంసారబీజం నోన్మూలయతి కదాచిదిత్యర్థః. అతః పరమార్థదర్శిన ఏవ అశేషకర్మసంన్యాసిత్వం సంభవతి, అవిద్యాఽధ్యారోపితత్వాదాత్మని క్రియాకారక ఫలానాం, న త్వజ్ఞస్యాధిష్ఠానాదీని క్రియాకర్తృకారకాణ్యాత్మత్వేన పశ్యతః అశేషకర్మ సంన్యాసస్సంభవతి.**

**తె.అ.** పుణ్యాపాప రూపమైన కర్మలకు ఫలం మూడువిధాలుగా ఉంటుంది. (– అనిష్టము ఇష్టము మిశ్రము అని) అనిష్టమంటే నరకము, పశుపక్షి జన్మము మొదలైనవి. ఇష్టమంటే దేవాది లక్షణం. మిశ్రమంటే ఇష్టానిష్టాల మిశ్రమమైన మనుష్య లక్షణం. ఫల శబ్దానికి నిర్వచనం – బాహ్యమైన అనేక కారక వ్యాపారముల ద్వారా సాధించబడినది, అవిద్యాకల్పితము, ఇంద్రజాలం చేసే మాయ వంటిది, మహామోహం కలిగించేది, ప్రత్యగాత్మకు సన్నిహితమైనట్లు కనిపించేది, ఫల్గుత (సారరహితత్వ) కారణంగా లయమయేది అని. ఈ లక్షణం గలిగిన ఫలం అత్యాగులకు అంటే కర్మలాచరించే అజ్ఞానులకు, అపరమార్థ సంన్యాసులకు శరీరపాతమైన తరువాత కలుగుతుంది. కాని పరమార్థ సంన్యాసులకు, పరమహంస పరివ్రాజకులకు కేవలజ్ఞాన నిష్ఠులకు ఎన్నటికీ కలగదు. కేవల సంన్యాసనిష్ఠ ఎన్నడూ కూడ సంసారబీజమైన అవిద్యాది దోషాలను మూలచ్ఛేదం చేయకుండా ఎన్నటికీ ఉండదు అని అర్థం.

అవిద్య వలన క్రియాకారక ఫలములు ఆత్మయందు అధ్యారోపించబడినవి. కనుక పరమార్థం దర్శించినవానికే అశేషకర్మసంన్యాసం సంభవం. అజ్ఞానానికి కాదు. ఎందుకంటే, అతడు అధిష్ఠానం (శరీరం) మొదలైనవాటిని, కర్త క్రియలను, కారకాలను ఆత్మగా భావిస్తాడు కనుక కర్మలను నిశ్శేషంగా సంన్యసించలేదు.

**భాష్యమ్ : 13.0 తత్ ఏతత్ ఉత్తరైః శ్లోకైః దర్శయతి –**

**తె.అ.** ఈ విషయాన్నే ఈ క్రింది శ్లోకాలలో చెప్పబోతున్నాడు.

**మూ. పంచైతాని మహాబాహో కారణాని నిబోధ మే ।**
**సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్ ॥ 13**

**తె.అ.** మహాబాహూ! సమస్తకర్మలసిద్ధికీ వేదాంతశాస్త్రంలో చెప్పబడిన ఈ అయిదు కారణాలు చెపుతున్నాను, తెలుసుకొనుము.

**భాష్యమ్ : 13.1 పంచ ఇతి. పంచైతాని వక్ష్యమాణాని మహాబాహో, కారణాని నిర్వర్తకాని. నిబోధ మమ ఇత్యుత్తరత్ర చేతస్సమాధానార్థం వస్తువైషమ్య ప్రదర్శనార్థం చ. తాని చ కారణాని జ్ఞాతవ్యతయా స్తౌతి – సాంఖ్యే, జ్ఞాతవ్యాః పదార్థాస్సంఖ్యాయంతే యస్మిన్ శాస్త్రే తత్సాంఖ్యం వేదాంతః, కృతాంత ఇతి తస్యైవ విశేషణం. కృతమితి కర్మోచ్యతే, తస్యాంతః పరిసమాప్తిర్యత్ర స కృతాంతః, కర్మాంత ఇత్యేతత్ 'యావానర్థ ఉదపానే' (2.46) 'సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే' (4.33) ఇత్యాత్మజ్ఞానే సంజాతే సర్వకర్మణాం నివృత్తిం దర్శయతి. అతస్తస్మిన్నాత్మజ్ఞానార్థే సాంఖ్యే కృతాంతే వేదాంతే, ప్రోక్తాని కథితాని సిద్ధయే నిష్పత్త్యర్థం సర్వకర్మణామ్.**

**తె.అ.** అర్జునా, చెప్పబోయే ఈ అయిదు కారణాలు నా నుండి తెలుసుకో. అర్జునుని చిత్తంలో నాటుకోడానికి వాటిలోని తేడాలు చూపడానికి ఆ కారణాలను స్తుతిస్తున్నాడు. సాంఖ్యం – తెలియదగిన పదార్థాల సంఖ్య (లెక్క) చేయబడినది అని – అంటే వేదాంతం. కృతాంతం అనేది కూడా దీనికే విశేషణం. కర్మనే కృతమంటారు. దాని అంతమంటే కర్మ పరిసమాప్తి. ఆ కర్మ పరిసమాప్తి ఎక్కడ అవుతుందో అది కృతాంతం. 'యావానర్థ ఉదపానే' (2.46) 'సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే' (4.33) అని ఆత్మజ్ఞానం కలుగగానే సర్వకర్మలు నివృత్తి అవుతాయని చూపాడు. కనుక అటువంటి ఆత్మజ్ఞానం గురించి బోధించిన వేదాంతంలో చెప్పబడిన సర్వకర్మల సిద్ధికి కారణాలు (చెపుతా విను).

**భాష్యమ్ : 14.0 కాని తానీతి ఉచ్యతే -**

**తె.అ.** ఏవవి అంటే చెపుతున్నాడు -

**మూ. అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్ ।**
**వివిధాః చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పఞ్చమమ్ ॥ 14**

**తె.అ.** శరీరం, కర్త, ఇంద్రియాలు, అనేక ప్రాణవాయు చేష్టలు ఇవి కారణాలు. ఇక అయిదవ కారణం దైవం.

**భాష్యమ్ : 14.1 అధిష్ఠానమితి. అధిష్ఠానం ఇచ్ఛాద్వేషసుఖదుఃఖజ్ఞానాదీనా-మభివ్యక్తేరాశ్రయోఽధిష్ఠానం శరీరం, తథా కర్తా ఉపాధిలక్షణో భోక్తా, కరణం చ శ్రోత్రాది శబ్దాద్యుపలబ్ధయే పృథగ్విధం నానా ప్రకారం తద్వాదశసంఖ్యం, వివిధాశ్చ పృథక్చేష్టాః వాయవీయాః ప్రాణాపానాద్యాః దైవం చైవ దైవమేవ చ అత్ర ఏతేషు చతుర్షు పంచమం పంచానాం పూరణం ఆదిత్యాది చక్షురాద్యనుగ్రాహకమ్.**

**తె.అ.** అధిష్ఠానమంటే ఇచ్ఛ, ద్వేషము, సుఖము, దుఃఖము, జ్ఞానము, వీటి అభివృద్ధికి ఆశ్రయమైన శరీరము. కర్త అంటే ఉపాధిలక్షణమైన భోక్త. శబ్దము మొదలైనవాటిని గ్రహించే నానా విధాలైన చెవి మొదలైన పన్నెండు ఇంద్రియాలు (పంచ జ్ఞానేంద్రియాలు, పంచ కర్మేంద్రియాలు, బుద్ధి, మనస్సు). చేష్ట అంటే ప్రాణాపానాదులైన వాయు సంబంధమైన నానావిధ చేష్టలు. ఈ నాలుగింటికి తోడు అయిదవది కన్ను మొదలైన ఇంద్రియాలననుగ్రహించే ఆదిత్యాది దైవము.

**మూ. శరీరవాఙ్మనోభిర్యత్ కర్మ ప్రారభతే నరః ।**
**న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః ॥ 15**

**తె.అ.** శరీరం, వాక్కు, మనస్సుల చేత నిర్వర్తించే ప్రతీ కర్మకు, అది పుణ్యకర్మయైనా, పాపకర్మ అయినా ఈ అయిదును హేతువులు.

**భాష్యమ్ : 15.1 శరీర ఇతి. శరీరవాఙ్మనోభిః యత్ కర్మ త్రిభిరేతైః ప్రారభతే నిర్వర్తయతి నరః, న్యాయ్యం వా ధర్మ్యం శాస్త్రీయం విపరీతం వా అధర్మ్యమశాస్త్రీయం యచ్చాపి నిమేషాదికం చేష్టితాది జీవనహేతుః తదపి పూర్వకృత ధర్మాధర్మయోరేవ కార్యమితి న్యాయ్యవిపరీతయోరేవ గ్రహణేన గృహీతం, పంచైతే యథోక్తాస్తస్య సర్వస్యైవ కర్మణోహేతవః కారణాని.**

**నను ఏతాన్యధిష్ఠానాదీని సర్వకర్మణాం నిర్వర్తకాని. కథం ఉచ్యతే 'శరీర వాఙ్మనోభిర్యత్కర్మ ప్రారభత' ఇతి? నైష దోషః, విధిప్రతిషేధలక్షణం సర్వం కర్మ శరీరాదిత్రయప్రధానం తదంగతయా**

**దర్శనశ్రవణాది చ జీవనలక్షణం త్రిధైవ రాశీకృతముచ్యతే శరీరాదిభిరారభ్యత ఇతి. ఫల కాలేఽపి తత్ప్రధానైస్సాధనైర్భుజ్యతే ఇతి పంచానామేవ హేతుత్వం న విరుధ్యతే ఇతి.**

**తె.అ.** శరీరము వాక్కు మనస్సుల చేత నరుడు నిర్వర్తించే అన్ని పుణ్య పాపకర్మలకు ఈ అయిదు కారణాలు. జీవనహేతువులైన కళ్ళు మూయడం తెరవడం వంటి చేష్టలు గూడా పూర్వం చేసుకున్న పుణ్యపాపాల ఫలితమే.

ఆక్షేపణ – అధిష్ఠానాదులు సర్వకర్మలకు కారణమనిగదా (వెనుకటి శ్లోకంలో చెప్పారు?) మరి శరీరవాఙ్మనస్సులు కర్మను నిర్వర్తిస్తాయి అని ఎట్లా అంటారు?

సమాధానం – ఇది దోషంకాదు. విధి ప్రతిషేధరూపమైన సర్వకర్మలు శరీర వాఙ్మనస్సులచేతనే ప్రధానంగా నిర్వర్తించబడుతాయి కనుక. జీవన నిమిత్తమైన దర్శనశ్రవణాదులు వాటి అంగాలు. కనుక సమస్తకర్మలను మూడు రాసులుగా చేసి శరీరవాఙ్మనస్సులచేత నిర్వర్తించబడుతాయి అని చెప్పడం. ఫలం అనుభవించేటప్పుడు కూడా ఆ ప్రధాన కారణాలద్వారానే అనుభవించబడుతున్నాయి. కనుక హేతువులు అయిదు అన్నదానికి ఇది విరుద్ధం కాదు.

**మూ. తత్రైవం సతి కర్తారమాత్మానం కేవలం తు యః ।**
**పశ్యత్యకృతబుద్ధిత్వాన్న స పశ్యతి దుర్మతిః ॥ 16**

**తె.అ.** అటువంటపుడు బుద్ధి సంస్కారం లేని కారణంగా శుద్ధమైన ఆత్మను కర్మలకు కర్తగా తలచువాడు సరిగా తెలుసుకొన్నవాడు కాదు. అతడు దుర్మతి.

**భాష్యమ్ : 16.1 తత్ర ఇతి. తత్రేతి ప్రకృతేన సంబధ్యతే, ఏవం సతి ఏవం యథోక్తైః పంచభిర్హేతుభిర్నిర్వర్త్యే సతి కర్మణి. 'తత్రైవం సతీ' తి దుర్మతిత్వస్య హేతుత్వేన సంబధ్యతే. తత్ర ఏతేషు ఆత్మా అనన్యత్వేన అవిద్యయా పరికల్పితైః క్రియమాణస్య కర్మణః 'అహమేవ కర్తా' ఇతి కర్తారమాత్మానం కేవలం శుద్ధం తు యః పశ్యత్యవిద్వాన్, కస్మాత్? వేదాంతాచార్యోపదేశన్యాయైః అకృతబుద్ధిత్వాత్ అసంస్కృత బుద్ధిత్వాత్, యోఽపి దేహాదివ్యతిరిక్తాత్మవాదీ ఆత్మానమేవ కేవలం కర్తారం పశ్యతి. అసావప్యకృత బుద్ధిరేవ అతః అకృతబుద్ధిత్వాత్ న సః పశ్యత్యాత్మనస్తత్త్వం కర్మణో వా ఇత్యర్థః. అతో దుర్మతిః కుత్సితా విపరీతా దుష్టా అజస్రం జననమరణ ప్రతిపత్తిహేతుభూతా మతిః అస్య ఇతి దుర్మతిః. సః పశ్యన్నపి న పశ్యతి, యథా తైమిరికః అనేకచంద్రం, యథా వా అభ్రేషు ధావత్సు చంద్రం ధావంతం, యథా వాహనే ఉపవిష్టః అన్యేషు ధావత్సు ఆత్మానం ధావంతమ్.**

**తె.అ.** 'అటువంటపుడు' అంటే కర్మలు అయిదు కారణాలద్వారా నిర్వర్తించబడుతున్నపుడు అని. 'అటువంటపుడు' (తత్రైవం సతి) అన్నదానిని 'దుర్మతి' అన్న పదంతో అన్వయించుకోవాలి. ఈ అయిదు కారణాలు ఆత్మయే, వేరుకాదు, అని అవిద్యవలన భావించి అవి చేసే కర్మలకు నేనే కర్తను అని అనుకునేవాడు అజ్ఞాని. అతని బుద్ధి వేదాంతంచేత, ఆచార్యుని ఉపదేశంచేత, తర్కంచేత సంస్కరింపబడలేదు. దేహాదులకంటె ఆత్మవేరు, ఆ కేవలాత్మయే కర్త అని అనుకునేవాడు కూడా బుద్ధిలేనివాడే. వాడు ఆత్మతత్త్వం కాని, కర్మతత్త్వంకాని తెలిసినవాడు కాదు. వాడు దుర్మతి. అతని బుద్ధి కుత్సితము, విపరీతము, దుష్టము, సదా జననమరణకారణము. కనుక అతడు దుర్మతి. అతడు చూచికూడా చూడనివాడు. ఎట్లాగంటే రేచీకటి ఉన్నవాడు అనేక చంద్రులను చూస్తాడు. మబ్బులు పరుగెత్తుతున్నపుడు చంద్రుడు పరుగెత్తినట్లు అతనికి కనిపిస్తుంది. పల్లకిలో కూర్చున్నవాడు బోయీలు పరుగెత్తుతున్నపుడు తాను పరుగెత్తుతున్నానని అనుకొన్నట్లు.

**భాష్యమ్ : 17.0 కః పునస్సుమతిః యస్సమ్యక్పశ్యతీత్యుచ్యతే –**

**తె.అ.** వాడు దుర్మతి. మరయితే చూపు సరిగా ఉన్న సుమతి ఎవడు? అంటే చెపుతున్నాడు.

**మూ. యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే ।**
**హత్వాఽపి స ఇమాన్ లోకాన్ న హన్తి న నిబధ్యతే ॥ 17**

**తె.అ.** అహంకారభావం లేనివాడు, అనుతాపం చెందని బుద్ధిగలవాడు. ఈ లోకన్నంతా హత్య చేసినా అతడు హంతకాడు. అతనిని కర్మ బంధించదు.

**భాష్యమ్ : 17.1 యస్య ఇతి. యస్య శాస్త్రాచార్యోపదేశ న్యాయసంస్కృతాత్మనః న భవతి అహం కృతః 'అహం కర్తా' ఇత్యేవంలక్షణం భావః భావనా ప్రత్యయః – ఏతే ఏవ పంచ అధిష్ఠానాదయః అవిద్యయా ఆత్మని కల్పితాః సర్వకర్మణాం కర్తారః, న అహం అహం తు తద్వ్యాపారాణాం సాక్షిభూతః 'అప్రాణో హ్యమనాః శుభ్రో హ్యక్షరాత్పరతః పరః' (ముం.ఉ.2.12) కేవలః అవిక్రియః ఇత్యేవం పశ్యతి ఇతి ఏతత్ – బుద్ధి అంతఃకరణం యస్య ఆత్మనః ఉపాధిభూతా న లిప్యతే న అనుశయినీ భవతి – 'ఇదం అహం అకార్షం, తేన అహం నరకం గమిష్యామి', ఇత్యేవం యస్య బుద్ధిః న లిప్యతే – సః సుమతిః, సః పశ్యతి. హత్వా అపి సః ఇమాన్ లోకాన్, సర్వాన్ ఇమాన్ ప్రాణినః ఇత్యర్థః, న హంతి హననక్రియాం న కరోతి, న నిబధ్యతే నాపి తత్కార్యేణ అధర్మఫలేన సంబధ్యతే.**

**భాష్యమ్ : 17.2 నను హత్వాఽపి న హంతి ఇతి విప్రతిషిద్ధం ఉచ్యతే యద్యపి స్తుతిః?**

నైష దోషః లౌకిక పారమార్థికదృష్ట్యపేక్షయా తదుపపత్తేః. దేహాద్యాత్మబుద్ధ్యా హంతా అహం ఇతి లౌకికీం దృష్టిం ఆశ్రిత్య 'హత్వాఽపి' ఇతి ఆహ, యథాదర్శితాం పారమార్థికీ దృష్టిం ఆశ్రిత్య 'న హంతి న నిబధ్యతే' ఇతి ఏతత్ ఉభయం ఉపపద్యతే ఏవ.

నను అధిష్ఠానాదిభిః సంభూయ కరోతి ఏవ ఆత్మా, 'కర్తారమాత్మానం కేవలం తు' **(18.16)** ఇతి 'కేవల' శబ్దప్రయోగాత్.

నైష దోషః ఆత్మనః అవిక్రియస్వభావత్వే అధిష్ఠానాదిభిః సంహతత్వానుపపత్తేః. విక్రియావతః హి అన్యైః సంహననం సంభవతి, సంహత్య వా కర్తృత్వం స్యాత్. న తు అవిక్రియస్య ఆత్మనః కేనచిత్ సంహననం అస్తి ఇతి న సంభూయ కర్తృత్వం ఉపపద్యతే. అతః కేవలత్వం ఆత్మనః స్వాభావికమ్ ఇతి కేవలశబ్దః అనువాదమాత్రమ్. అవక్రియత్వం చ ఆత్మనః శ్రుతిస్మృతిన్యాయ ప్రసిద్ధమ్. 'అవికార్యోఽయముచ్యతే', **(2.25)** 'గుణైరేవ కర్మాణి క్రియంతే', **(3.27)** 'శరీర స్థోఽపి న కరోతి', **(13.31)** ఇత్యాది అసకృత్ ఉపపాదితం గీతాసు ఏవ తావత్. శ్రుతిషు చ ధ్యాయతీవ లేలాయతీవ (బృ.ఉ.**43.7**) ఇత్యేవమాద్యాసు. న్యాయతశ్చ నిరవయవం, అపరతంత్రం, అవిక్రియం ఆత్మతత్త్వం ఇతి రాజమార్గః. విక్రియావత్త్వాభ్యుపగమేఽపి ఆత్మనః స్వకీయా ఏవ విక్రియా స్వస్య భవితుం అర్హతి, న అధిష్ఠానాదీనాం కర్మాణి ఆత్మకర్తృకాణి స్యుః న హి పరస్య కర్మ పరేణ అకృతం ఆగంతుం అర్హతి. యత్తు అవిద్యయా గమితం, న తత్ తస్య, యథా రజతత్వం న శుక్తికాయాః, యథా వా తలమలినత్వం బాలైః గమితం అవిద్యయా న ఆకాశస్య తథా అధిష్ఠానాది విక్రియాఽపి తేషాం ఏవ, న ఆత్మనః. తస్మాత్ యుక్తం ఉక్తమ్ 'అహంకృతతత్వబుద్ధి లేపాభావాత్ విద్వాన్ న హంతి న నిబధ్యతే' ఇతి.

భాష్యమ్ : **17.3** 'నాయం హంతి న హన్యతే' ఇతి ప్రతిజ్ఞాయ 'న జాయతే' ఇత్యాది హేతువచనేన అవిక్రియత్వం ఆత్మనః ఉక్త్వా, 'వేదావినాశినం' ఇతి విదుషః కర్మాధికారనివృత్తిం శాస్త్రాదౌ సంక్షేపతః ఉక్త్వా మధ్యప్రసారితాం, తత్ర తత్ర ప్రసంగం కృత్వా ఇహ ఉపసంహరతి శాస్త్రార్థ పిండీకరణాయ 'విద్వాన్ న హంతి న నిబధ్యతే' ఇతి.

ఏవం చ సతి దేహభృత్త్వాభిమానాపపత్తౌ అవిద్యాకృతాశేషకర్మ సంన్యాసోపపత్తేః సంన్యాసినాం అనిష్టాది త్రివిధం కర్మణః ఫలం న భవతి ఇతి ఉపపన్నం, తద్విపర్యయాత్ చ ఇతరేషాం భవతి ఇతి ఏతత్ చ అపరిహార్యం ఇతి ఏషః గీతాశాస్త్రార్థః ఉపసంహృతః. స ఏషః సర్వవేదార్థసారః నిపుణమతిభిః పండితైః విచార్య ప్రతిపత్తవ్యః ఇతి తత్ర తత్ర ప్రకరణవిభాగేన దర్శితః అస్మాభిః శాస్త్రన్యాయానుసారేణ.

**తె.అ.** శాస్త్రాచార్య ఉపదేశం చేత, తర్కంచేత సంస్కరించబడిన అంతఃకరణం గలవాడు, నేను కర్తను అన్న అహంకారభావన లేనివాడు, అవిద్యచేత ఆత్మయందు ఆరోపించబడిన సర్వకర్మలకు కర్త ఈ అధిష్ఠానాదులయిదు నేను కాదు నేను వాటి వ్యాపారాలకు సాక్షిని మాత్రమే, 'ప్రాణరహితము, మనోరహితము, శుభము, అక్షరమునకంటె శ్రేష్ఠము' (ముం.ఉ.2.1.2) అయిన కేవలుడును అక్రియుడును అని ఈ విధంగా గ్రహించేవాడు. అటువంటివాని అంతః కరణం ఆత్మకు ఉపాధి అయినది, అనుతాపం చెందదు. 'నేనిది చేశాను దీనివల్ల నేను నరకానికి పోతాను' అని అనుతాపం చెందదు. అటువంటి సుమతి సరిగా గ్రహిస్తాడు. ఈ లోకాన్నంతా సమస్తప్రాణులను సంహరించినా అతడు చంపడము అనే పని చేసినవాడు కాడు. దాని ఫలితంగా ఆ అధర్మఫలంచేత అతడు బద్ధుడు కాడు కూడా.

ఆక్షేపణ – జ్ఞానాన్ని స్తుతించడం కొరకే అయినా, చంపినా చంపినట్లు కాదు అనడం విరుద్ధంగా ఉంది.

సమాధానం – ఇది దోషంకాదు. లౌకిక పారమార్థిక దృష్టి ననుసరించి ఈ విధంగా చెప్పవచ్చు. దేహాత్మ బుద్ధితో నేను హంతను అని లౌకికదృష్టిని బట్టి 'చంపినా' అన్నాడు. పైన చూపిన పారమార్థికదృష్టిననుసరించి చంపడంలేదు బద్ధుడు కాడు అని అన్నాడు. ఈ విధంగా రెండూ అనవచ్చు.

17.2 ఆక్షేపణ – 'కర్తారమాత్మానం కేవలం తు' అని కేవల శబ్దప్రయోగం చేత అధిష్ఠానాదులతో కలిసి ఆత్మయే కర్మ చేస్తున్నదని అర్థం కాదా?

సమాధానం – కాదు. ఆత్మ అవిక్రియ స్వభావం గలది కనుక అధిష్ఠానాదులతో కలవడం జరగదు. విక్రియమైనది మాత్రమే మార్పు చెందగలది మాత్రమే అన్యవస్తువుతో కలియడంగాని కలిసి కర్తగావడంగాని సంభవం. అవిక్రియాత్మ దేనితోను కలియడంగాని కలిసి కర్తగావడం గాని సంభవం గాదు. కనుక కేవలత్వం ఆత్మకు స్వాభావికమని ఇక్కడ కేవల శబ్దం అనువాదమాత్రం. (తెలిసిన విషయమే మళ్ళీ చెప్పడం.) ఆత్మ అవిక్రియమన్నది శ్రుతి స్మృతి న్యాయ ప్రసిద్ధం. 'అవికార్యోయముచ్యతే' (2.25), 'గుణైరేవ కర్మాణి క్రియన్తే' (3.27), 'శరీరస్థోఽపి న కరోతి' (13.31) వంటి వాక్యాలలో అనేకచోట్ల గీతలో ప్రతిపాదించబడింది. అదే విధంగా శ్రుతులలో "ధ్యాయతీవ లేలాయతీవ" – (ఆత్మ ధ్యానం చేస్తున్నట్లు, ఆయా చేష్టలు చేస్తున్నట్లు కనిపిస్తుంది, వాస్తవానికి అవన్నీ చేసేది బుద్ధియే)

ఆత్మకు విక్రియత్వం ఉందని ఒప్పుకున్నా ఆ వికారం స్వకీయమైనది కావాలి. అధిష్ఠానాదుల వలన జరిగే కర్మలు ఆత్మ కర్తృకాలు కాలేవు. ఒకడు చేసిన కర్మను చేయని మరొకరికి

అంటగట్టరాదు కదా? అవిద్య చేత అంట గట్టినా అది వాని కర్మ కాదు గదా? ముత్యపుచిప్పయందు ఆరోపించబడిన వెండిగుణం చిప్పకు లేదు. మూర్ఖులు అవిద్య కారణంగా ఆకాశానికి అంటగట్టిన తలమలినాదులు దానికి లేవు. అదే విధంగా అధిష్ఠానాదుల కారణంగా జరిగే మార్పులన్నీ వాటివే గాని ఆత్మవి గావు. కనుక నేను కర్తను అన్న భావన, కర్మవలన అనుతాపము, రెండూ లేని కారణంగా జ్ఞాని హత్యచేయడు, బద్ధుడు కాడు అనడం యుక్తమే.

17.3 'నాయం హన్తి న హన్యతే' (2.19) అని ప్రకటించి, 'న జాయతే' (2.20) వంటి మాటలలో ఆత్మ అవిక్రియమన్నదానికి హేతువు చెప్పి, 'వేదావినాశినమ్' (2.21) అని శాస్త్రారంభంలో జ్ఞానికి కర్మాధికార నివృత్తి సంక్షేపంగా చెప్పి, మధ్య మధ్య ఆ ప్రస్తావన తెచ్చి ఇక్కడ శాస్త్రార్థాన్ని సంగ్రహించడం కొరకు జ్ఞాని చంపడు బద్ధుడు కాడు అని చెప్పి ఉపసంహరిస్తున్నాడు. దేహాన్ని భరిస్తున్నాను అన్న అభిమానం లేదు కనుక అవిద్య వలన కలుగు సర్వకర్మలను సంన్యసించడం సంన్యాసులకు సంభవం. వారికి అనిష్టాది త్రివిధ కర్మఫలమూ ఉండదు అని తేలింది. ఇందుకు విపర్యయంగా ఇతరులకు (అసంన్యాసులకు) త్రివిధకర్మఫలం తప్పదు, ఇది గీతాశాస్త్రం యొక్క అర్థము అని ముగిస్తున్నాడు. ఈ సర్వ వేదార్థ సారము నిపుణమతులైన పండితులు విచారించి తెలిసికొనవలసినది అని దానిని మేము ప్రకరణ విభాగం చేసి శాస్త్ర న్యాయానుసారంగా అక్కడక్కడా వివరించాము.

**భాష్యమ్ : 18.0 అథ ఇదానీం కర్మణాం ప్రవర్తక ముచ్యతే –**

**తె.అ.** ఇక ఇప్పుడు కర్మలను ప్రవర్తింపజేసేది ఏది? అది చెప్పబడుతున్నది.

**మూ. జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా ।**
**కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః ॥ 18**

**తె.అ.** జ్ఞానము, జ్ఞేయము (తెలియదగినది) పరిజ్ఞాత (తెలిసికొనువాడు) అని కర్మచోదన త్రివిధము. కరణము, కర్మ, కర్త అని కర్మసంగ్రహం త్రివిధము.

**భాష్యమ్ : 18.1 జ్ఞానమితి. జ్ఞానం జ్ఞాయతేఽనేనేతి సర్వ విషయం జ్ఞానమవిశేషేణోచ్యతే తథా జ్ఞేయం జ్ఞాతవ్యం తదపి సామాన్యేనైవ సర్వముచ్యతే, తథా పరిజ్ఞాతా ఉపాధి లక్షణః అవిద్యా కల్పితో భోక్తా – ఇతి ఏతత్త్రయమవిశేషేణ సర్వకర్మణాం ప్రవర్తికా త్రివిధా త్రిప్రకారా కర్మచోదనా. జ్ఞానాదీనాం హి త్రయాణాం సన్నిపాతే హానోపాదానోపేక్షా ప్రయోజనః సర్వకర్మారంభస్స్యాత్. తతః పంచభిరధిష్ఠానాదిభిరారబ్ధం వాఙ్మనః కాయాశ్రయభేదేన త్రిధా రాశీభూతం త్రిషు కరణాదిషు సంగృహ్యతే ఇత్యేతదుచ్యతే – కరణం క్రియతేఽనేనేతి బాహ్యం**

**శ్రోత్రాది అంతస్థం బుద్ధ్యాది, కర్మ ఈప్సితతమం కర్తుః క్రియయా వ్యాప్యమానం కర్తా కరణానాం వ్యాపారయితోపాధి లక్షణః ఇతి త్రివిధస్త్రిప్రకారః కర్మ సంగ్రహః, సంగృహ్యతేఽస్మిన్నితి సంగ్రహః కర్మణస్సంగ్రహః కర్మ సంగ్రహః, కర్మ ఏషు త్రిషు సమవైతి, తేనాయం త్రివిధః కర్మ సంగ్రహః**

**తె.అ.** జ్ఞానము – దేనిద్వారా సర్వ విషయాలు – ఇవి అవి అని కాకుండా సర్వము – తెలియబడుతున్నాయో అది. జ్ఞేయము – తెలియదగినది సర్వము. పరిజ్ఞాత – ఉపాధి లక్షణమైన అవిద్యాకల్పిత భోక్త. ఈ మూడు అని కర్మలకు త్రివిధమైన కర్మచోదన, కర్మయందు ప్రవర్తింపజేసేవి. కర్మత్యాగం కాని కర్మగ్రహణం ప్రయోజనమైన ఈ మూడు కలిసినపుడే కదా సమస్త కర్మలు ప్రారంభమవుతాయి. అయిదు అధిష్ఠానాదులచేత ఆరంభించబడి, వాఙ్మనః కాయాశ్రయభేదం చేత మూడురాసులుగా చేయబడి మూడు ఇంద్రియాలలో సంగ్రహించబడినది అని చెపుతున్నాడు. కరణం – దేని ద్వారా కర్మ చేయబడుతున్నదో అది, చెవి మొదలైన బాహ్యకరణాలు బుద్ధి మొదలైన అంతఃకరణాలు. కర్మ – కర్తకు అత్యంతము ఇష్టమైనది, క్రియ ద్వారా కర్త సాధించునది. కర్త – కరణములను పనిచేయించు ఉపాధి లక్షణుడు. ఈ విధంగా కర్మ సంగ్రహం మూడువిధాలు. వేనినైనా ఒకదానిలో చేర్చడం సంగ్రహించడం. కర్మలన్నీ ఈ మూటిలో చేరుతాయి కనుక ఇది త్రివిధ కర్మ సంగ్రహం.

**భాష్యమ్ : 19.0 అథ ఇదానీం క్రియాకారక ఫలానాం సర్వేషాం గుణాత్మకత్వాత్ సత్త్వరజస్తమో గుణభేదతః త్రివిధః భేదః వక్తవ్య ఇతి ఆరభ్యతే –**

**తె.అ.** క్రియ కారకము ఫలము – ఇవన్నీ గుణాత్మకములు. కనుక సత్త్వరజస్తమో గుణభేదాన్ని అనుసరించి మూడు విధాలైన భేదాలను చెప్పవలసి ఉన్నది అని ఆరంభిస్తున్నాడు–

**మూ. జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః ।**
**ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావచ్ఛృణు తాన్యపి ॥ 19**

**తె.అ.** సాంఖ్యశాస్త్రంలో జ్ఞానము, కర్త, కర్మ ఈ మూడును గుణభేదాన్ని అనుసరించి త్రివిధంగా చెప్పబడినవి. వాటిని గురించి కూడా ఉన్న విషయం చెపుతాను విను.

**భాష్యమ్ : 19.1 జ్ఞానమితి. జ్ఞానం కర్మ చ కర్మ క్రియా, న కారకం పారిభాషికం ఈప్సితతమం కర్మ, కర్తా చ నిర్వర్తకః క్రియాణాం త్రిధైవ, అవధారణం గుణవ్యతిరిక్తజాత్యంతరాభావ ప్రదర్శనార్థం గుణభేదస్సత్త్వాది భేదేనేత్యర్థః, ప్రోచ్యతే కథ్యతే గుణ సంఖ్యానే కాపిలే శాస్త్రే తదపి గుణసంఖ్యాన శాస్త్రం గుణభోక్తృవిషయే ప్రమాణమేవ, పరమార్థ బ్రహ్మైకత్వ విషయే యద్యపి విరుధ్యతే, తథాపి తే హి కాపిలాః గుణగౌణవ్యాపారనిరూపణే అభియుక్తాః ఇతి తచ్ఛాస్త్రమపి వక్ష్యమాణార్థ**

**స్తుత్యర్థత్వేన ఉపాదీయతే ఇతి న విరోధః. యథావత్ యథాన్యాయం యథాశాస్త్రం శృణు తాన్యపి జ్ఞానాదీని తద్భేదజాతాని చ గుణభేద కృతాని శృణు, వక్ష్యమాణే అర్థే మనస్సమాధిం కురు ఇత్యర్థః.**

**తె.అ.** జ్ఞానము కర్మ కర్త – ఇక్కడ కర్మ అంటే క్రియ. వ్యాకరణంలో చెప్పినట్లు 'కర్తకు అత్యంతము ఇష్టమైనది' (18.18) అన్న పారిభాషిక పదం కాదు. కర్త అంటే క్రియలను నిర్వర్తించువాడు. మూడే విధాలు అనడం, సత్త్వరజస్తమో గుణాలు మూటికి సంబంధించనిది మరొక జాతిది ఏదీ లేదు అని చెప్పడానికి. కపిలుని శాస్త్రంలో (సాంఖ్యంలో) ఈ విషయం చెప్పబడింది. గుణాల గురించి వాటిని అనుభవించే భోక్త గురించి సాంఖ్యశాస్త్రం ప్రమాణమే. పరమార్థ బ్రహ్మము ఒకటి అనే విషయాన్ని వారు విరోధించినప్పటికి, కపిలుని అనుయాయులు గుణ గౌణ వ్యాపార నిరూపణంలో నిపుణులు. కనుక చెప్పబోయే విషయాన్ని స్తుతించడం కొరకు ఆ శాస్త్రాన్ని ప్రతిపాదించడంలో వైరుధ్యం లేదు. ఉన్నదున్నట్లు తర్కాన్ని శాస్త్రాన్ని అనుసరించి జ్ఞానాదులను, వాటిలో గుణభేదం చేత కలిగిన భేదాలను విను. అంటే, చెప్పబోతున్న విషయంలో మనసు పెట్టి విను అని అర్థం.

**భాష్యమ్ : 20.0 జ్ఞానస్య తావత్ త్రివిధత్వం ఉచ్యతే –**

**తె.అ.** ముందుగా జ్ఞానం యొక్క త్రివిధత్వం చెప్పబడుతున్నది.

**మూ. సర్వభూతేషు యేనైకం భావమవ్యయమీక్షతే ।**
**అవిభక్తం విభక్తేషు తద్ జ్ఞానం విద్ధి సాత్త్వికమ్ ॥ 20**

**తె.అ.** విభిన్నములైన సర్వభూతములయందు ఒకే అభిన్న అవ్యయ వస్తువును చూచు జ్ఞానము సాత్త్వికము.

**భాష్యమ్ : 20.1 సర్వభూతేషు ఇతి. సర్వభూతేషు అవ్యక్తాది స్థావరాంతేషు భూతేషు యేన జ్ఞానేన ఏకం భావం వస్తు భావ శబ్దః వస్తువాచీ, ఏకం ఆత్మ వస్తు ఇత్యర్థః అవ్యయం న వ్యేతి స్వాత్మనా స్వధర్మేణ వా, కూటస్థం ఇత్యర్థః, ఈక్షతే పశ్యతి యేన జ్ఞానేన. తం చ భావం అవిభక్తం ప్రతిదేహం విభక్తేషు దేహభేదేషు న విభక్తం తత్ ఆత్మ వస్తు వ్యోమవత్ నిరంతరమిత్యర్థః, తత్ జ్ఞానం సాక్షాత్ సమ్యగ్దర్శనం అద్వైతాత్మ విషయం సాత్త్వికం విద్ధి ఇతి. యాని ద్వైత దర్శనాని తాని అసమ్యగ్భూతాని రాజసాని తామసాని చ ఇతి న సాక్షాత్ సంసారోచ్ఛిత్తయే భవంతి.**

**తె.అ.** అవ్యక్తం నుండి స్థావరముల వరకు దేహభేదాలతో విభక్తమై ఉన్న సర్వభూతములయందు అవ్యయమైన ఒకే ఆత్మవస్తువు ఏ జ్ఞానంతో చూడబడుతుందో అది సాత్త్వికజ్ఞానము. అవ్యయము అంటే స్వరూపము నుండి కాని, ధర్మం నుండి కాని వ్యయం కానిది. అవినాశి కూటస్థమందు నిత్యమై ఉండేది అని అర్థం. అది ఆకాశం వలె నిరంతరంగా నిండి ఉంటున్నది. ఆ జ్ఞానం ఆ అద్వైతాత్మ దర్శనం సాత్త్వికము. అదే సమ్యగ్దర్శనమని తెలుసుకో. రాజస తామస ద్వైత దర్శనాలు సమ్యగ్దర్శనాలు కావు. కనుక అవి సంసారాన్ని తొలగించడానికి సమర్థములు కావు.

**మూ. పృథక్త్వేన తు యద్ జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్ ।**
**వేత్తి సర్వేషు భూతేషు తద్ జ్ఞానం విద్ధి రాజసమ్ ॥ 21**

**తె.అ.** సర్వభూతములయందు వేరు వేరు విధాలుగా నున్న అనేక అనాత్మ భావాలను అవి వేరు వేరు అనే భావంతో చూడడం రాజసజ్ఞానం.

**భాష్యమ్ : 21.1 పృథక్త్వేన ఇతి. పృథక్త్వేన తు భేదేన ప్రతి శరీర మన్యత్వేన యద్ జ్ఞానం నానాభావాన్ భిన్నాన్ ఆత్మనః పృథగ్విధాన్ పృథక్ప్రకారాన్ భిన్నలక్షణానిత్యర్థః. వేత్తి విజానాతి యత్ జ్ఞానం సర్వేషు భూతేషు జ్ఞానస్య కర్తృత్వాసంభవాత్ యేన జ్ఞానేన వేత్తీత్యర్థః, తత్ జ్ఞానం విద్ధి రాజసం రజోగుణ నిర్వృత్తమ్.**

**తె.అ.** సర్వభూతములయందు వేరు వేరు విధాలుగానన్ను వేరు వేరు అనాత్మలను అవి వేరు వేరు అని చూడడం రాజసజ్ఞానం. ఏ జ్ఞానం చేత గ్రహిస్తున్నామో ఆ జ్ఞానమని అర్థం. జ్ఞానం కర్తగా లేదు, అంటే జ్ఞానం గ్రహించదు.

**మూ. యత్తు కృత్స్నవదేకస్మిన్ కార్యే సక్తమహేతుకమ్ ।**
**అతత్త్వార్థవదల్పం చ తత్తామసముదాహృతమ్ ॥ 22**

**తె.అ.** ఒకే వస్తువును ఇదే సర్వమనుకుని దానియందు అహేతుకమైన ఆసక్తి ఏ జ్ఞానం చేత కలుగుతుందో అది తామసము. అట్టి జ్ఞానము యథార్థం కాదు. దానివల్ల ఫలం స్వల్పము.

**భాష్యమ్ : 22.1 యత్తు ఇతి. యత్ జ్ఞానం కృత్స్నవత్ సమస్తవత్ సర్వ విషయమివ ఏకస్మిన్ కార్యే దేహే బహిర్వా ప్రతిమాదౌ సక్తం 'ఏతావానేవ ఆత్మా ఈశ్వరో వా, నాతః పరమస్తి' ఇతి, యథా నగ్నక్షపణకాదీనాం శరీరాన్తర్వర్తీ దేహపరిమాణో జీవః, ఈశ్వరో వా పాషాణ దార్వాదిమాత్రం, ఇత్యేవమేకస్మిన్ కార్యే సక్తం అహైతుకం హేతువర్జితం నిర్యుక్తికం, అతత్త్వార్థవత్ అయథాభూతార్థవత్, యథాభూతార్థస్తత్త్వార్థః, సోఽ స్యజ్ఞేయభూతః అస్తీతి తత్త్వార్థవత్, న**

**తత్త్వార్థవదతత్త్వార్థవత్, అహైతుకత్వాదేవ అల్పం చ, అల్ప విషయత్వాత్ అల్పఫలత్వాద్వా. తత్ తామసముదాహృతం. తామసానాం హి ప్రాణినాం అవివేకినాం జ్ఞానమీదృశం దృశ్యతే.**

**తె.అ.** ఒకే వస్తువును, దేహాన్ని లేక బయటి ప్రతిమను, ఇదే సర్వము అనుకుని ఇదే ఆత్మ లేక ఈశ్వరుడు ఇంతకంటె వేరేమి లేదు అని దిగంబర జైనులవలె అనుకుంటారు. ఆత్మ శరీరాన్ని అనుసరించి ఉంటుంది. జీవుడు లేక ఈశ్వరుడు దేహ పరిమాణంలోనే ఉంటాడు, రాయి కర్ర మొదలైన ప్రతిమలే ఈశ్వరుడు అని అనుకొని హేతురహితంగా దానియందు ఆసక్తుడు కావడం ఏ జ్ఞానంచేత కలుగుతుందో అది తామసము. హేతురహితం కనుక ఆ జ్ఞానం యథార్థం కాదు. అది అల్ప ఫలమిచ్చే అల్ప జ్ఞానం. తామసులు అవివేకులు అయిన జీవుల జ్ఞానం ఇటువంటిది.

**భాష్యమ్ : 23.0 అథ ఇదానీం కర్మణః త్రైవిధ్యముచ్యతే –**

**తె.అ.** ఇక కర్మల త్రైవిధ్యం చెప్పబడుతున్నది –

**మూ. నియతం సంగరహితమరాగద్వేషతః కృతమ్ ।**
**అఫలప్రేప్సునా కర్మ యత్తత్సాత్త్వికముచ్యతే ॥ 23**

**తె.అ.** ఫలాపేక్ష లేకుండుట, ఆసక్తిని విడిచి రాగద్వేషములు లేకుండా నిత్యకర్మ చేయుట సాత్త్వికము అనబడుతుంది.

**భాష్యమ్ : 23.1 నియతమితి. నియతం నిత్యం సంగరహితం ఆసక్తివర్జితం అరాగద్వేషతః కృతం రాగప్రయుక్తేన ద్వేష ప్రయుక్తేన చ కృతం రాగద్వేషతః కృతమ్, తద్విపరీతమరాగద్వేషతః కృతమ్, అఫలప్రేప్సునా ఫలం ప్రాప్తుమిచ్ఛతీతి ఫలప్రేప్సుః ఫలతృష్ణః తద్విపరీతేన అఫలప్రేప్సునా కర్త్రా కృతం కర్మ యత్, తత్ సాత్త్వికముచ్యతే.**

**తె.అ.** ఫలతృష్ణ లేనివాడు, రాగముచేత ప్రేరేపించబడనివాడు, ద్వేషంచేత ప్రేరేపించబడనివాడు చేసే నిత్యకర్మను సాత్త్వికం అంటారు.

**మూ. యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః ।**
**క్రియతే బహులాయాసం తద్రాజసముదాహృతమ్ ॥ 24**

**తె.అ.** ఫలాకాంక్ష ఉన్నవాడు లేక అహంకారము గలవాడు బహుళ శ్రమతో చేయు కర్మ రాజసమనబడుతుంది.

**భాష్యమ్ : 24.1 యత్తు ఇతి. యత్తు కామేప్సునా కర్మఫలప్రేప్సునేత్యర్థః. కర్మ సాహంకారేణ ఇతి న తత్త్వజ్ఞానాపేక్షయా కిం తర్హి? లౌకిక శ్రోత్రియ నిరహంకారాపేక్షయా. యో హి పరమార్థ నిరహంకారః ఆత్మవిత్. న తస్య కామేప్సుత్వ – బహులాయాస కర్తృత్వ ప్రాప్తిః అస్తి సాత్త్వికస్యాపి కర్మణః అనాత్మవిత్ సాహంకారః కర్తా, కిముత రాజస తామసయోః. లోకే అనాత్మవిదపి శ్రోత్రియో నిరహంకారః ఉచ్యతే 'నిరహంకారః అయం బ్రాహ్మణః' ఇతి తస్మాత్ తదపేక్షయైవ 'సాహంకారేణ' వేత్యుక్తమ్. పునశ్శబ్దః పాదపూరణార్థః. క్రియతే బహులాయాసం కర్త్రా మహతా ఆయాసేన నిర్వర్త్యతే, తత్ కర్మ రాజసముదాహృతమ్.**

**తె.అ.** ఫలాకాంక్ష ఉన్నవాడు లేక అహంకారం గలవాడు బహుళశ్రమతో చేయుకర్మ రాజసమనబడుతుంది. అహంకారం గలవాడు అని తత్త్వజ్ఞానాన్ని దృష్టిలో పెట్టుకొని అన్నమాట కాదు. లోకంలో వేదం చదువుకున్నవానిని శ్రోత్రియుని దృష్టిలో పెట్టుకుని అన్నమాట. ఆత్మవిదుడు మాత్రమే నిజమైన నిరహంకారి. (నేనేమీ చేయడంలేదు అన్న నిష్క్రియాత్మ దర్శనం గలిగినవాడు) అటువంటివానికి ఫలాకాంక్ష గాని బహుళాయాసంతో కర్మలు చేయడం గాని ఉండవు. సత్త్వగుణంతో కర్మలాచరించే అనాత్మవిదుడు కూడా అహంకారం గల కర్తయే. ఇక రాజస తామస గుణాలతో కర్మలాచరించేవారి గురించి చెప్పడమెందుకు? లోకంలో అనాత్మవిదుడైనప్పటికీ (నేను చేస్తున్నానన్న అహంకారం తొలగనివాడైనప్పటికి వేదం చదువుకున్నవాడు గదా అన్న గౌరవంతో) శ్రోత్రియుణ్ణి నిరంహకారి అంటారు. 'ఈ బ్రాహ్మణుడు నిరంహకారి' అని. అటువంటి వానిని దృష్టిలో ఉంచుకుని 'అహంకారంతో గాని' అని ఈ శ్లోకంలో చెప్పడం. 'మళ్ళీ' (పునః) అనే శబ్దం పాదపూరణం కొరకు. (శ్రోత్రియుణ్ని అన్నట్టు మాటవరుసకు కూడా రాజసకర్మ చేసేవాణ్ణి నిరహంకారి అనడానికి అవకాశం లేదు అని అర్థం.)

**మూ. అనుబన్ధం క్షయం హింసామనపేక్ష్య చ పౌరుషమ్ ।**
**మోహాదారభ్యతే కర్మ యత్తత్తామసముచ్యతే ॥ 25**

**తె.అ.** అనుబంధము, క్షయము, హింస, పౌరుషము – వీటిని పరిగణించక మోహంతో చేయబూను కర్మ తామసమనబడుతుంది.

**భాష్యమ్ : 25.1 అనుబంధమితి. అనుబంధం పశ్చాద్భావి యద్వస్తు సః అనుబంధః ఉచ్యతే తం చ అనుబంధం, క్షయం యస్మిన్ కర్మణి క్రియమాణే శక్తి క్షయః అర్థక్షయో వా స్యాత్ తం క్షయం, హింసాం ప్రాణిబాధాం చ, అనపేక్ష్య చ నిరపేక్ష్య చ పౌరుషం పురుషకారం 'శక్నోమి**

**ఇదం కర్మ సమాపయితుం' ఇత్యేవమాత్మసామర్థ్యం, ఇత్యేతాని అనుబంధాదీన్యనపేక్ష్య పౌరుషాంతాని మోహాత్ అవివేకతః ఆరభ్యతే కర్మ యత్, తత్ తామసం తమో నిర్వృత్తముచ్యతే.**

**తె.అ.** అనుబంధమంటే పరిణామం, తరువాత జరుగబోయేది. క్షయము – శక్తిక్షయము అర్థక్షయము. హింస – ప్రాణిపీడ. పౌరుషము – ఈ కర్మను నేను పూర్తి చేయగలను అన్న ఆత్మ సామర్థ్యం. వీటిని పరిగణించక మోహంచేత, అవివేకంతో చేయబూను కర్మ తామసమనబడుతుంది, తమస్సు చేత నిర్వర్తించబడుతుంది అంటారు.

**భాష్యమ్ : 26.0 ఇదానీం కర్తృభేద ఉచ్యతే –**

**తె.అ.** ఇక కర్తల భేదం చెప్పబడుతున్నది –

**మూ. ముక్తసంగోఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః।**
**సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే ॥ 26**

**తె.అ.** అత్యాసక్తి లేనివాడు, అహంలేనివాడు, ధైర్యము, ఉత్సాహంతో ఉన్నవాడు, పని నెరవేరినా, నెరవేరకపోయినా చలించనివాడు అయిన కర్త సాత్త్వికుడనబడును.

**భాష్యమ్ : 26.1 ముక్త ఇతి. ముక్తసంగః ముక్తః పరిత్యక్తః సంగః యేన సః ముక్తసంగః, అనహంవాదీ నాహంవదనశీలః, ధృత్యుత్సాహ సమన్వితః ధృతిః ధారణం ఉత్సాహః ఉద్యమః తాభ్యాం సమన్వితః సంయుక్తః ధృత్యుత్సాహ సమన్వితః, సిద్ధ్యసిద్ధ్యోః క్రియమాణస్య కర్మణః ఫలసిద్ధౌ అసిద్ధౌ చ సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః, కేవలం శాస్త్ర ప్రమాణేన ప్రయుక్తో న ఫలరాగాదినా యః సః నిర్వికారః ఉచ్యతే. ఏవంభూతః కర్తా యః సః సాత్త్వికః ఉచ్యతే.**

**తె.అ.** సంగము (ఆసక్తిని)ను పరిత్యజించినవాడు, నేను చేస్తున్నాను అని చెప్పుకునే స్వభావం లేనివాడు, ధారణాశక్తి, ఉద్యమము (ప్రయత్నం) ఉన్నవాడు, చేస్తున్న కర్మలకు ఫలం సిద్ధించినా సిద్ధించకపోయినా వికారం చెందనివాడు, అంటే ఫలాపేక్ష చేతగాని, ఆసక్తి వలనగాని కాక కేవలం శాస్త్ర ప్రమాణం చేత – అంటే శాస్త్రం చెప్పింది కనుక కర్మలు చేయాలనుకొనేవాడు. ఇటువంటి కర్తను సాత్త్వికుడు అంటారు.

**మూ. రాగీ కర్మఫలప్రేప్సుర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః।**
**హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః ॥ 27**

**తె.అ.** ఆసక్తికలవాడు, కర్మఫలం కోరుకునేవాడు, ఆశాపూరితుడు, హింసా స్వభావంకలవాడు, అపవిత్రుడు, అశుచి, హర్షశోకాలున్నవాడు – ఇటువంటి కర్తను రాజసుడు అంటారు.

**భాష్యమ్ : 27.1 రాగీ ఇతి. రాగీ రాగః అస్యాస్తీతి రాగీ కర్మ ఫలప్రేప్సుః కర్మ ఫలార్థీ ఇత్యర్థః. లుబ్ధః పరద్రవ్యేషు సంజాత తృష్ణః, తీర్థాదౌ స్వద్రవ్యాపరిత్యాగీ వా హింసాత్మకః పరపీడాకర స్వభావః అశుచిః బాహ్యాభ్యంతర శౌచవర్జితః హర్షశోకాన్వితః ఇష్ట ప్రాప్తౌ హర్షః అనిష్ట ప్రాప్తావిష్టవియోగే చ శోకః తాభ్యాం హర్ష శోకాభ్యాం సమన్వితః సంయుక్తః, తస్యైవ చ కర్మణః సంపత్తి విపత్తిభ్యాం హర్షశోకౌ స్యాతాం తాభ్యాం సంయుక్తో యః కర్తా సః రాజసః పరికీర్తితః.**

**తె.అ.** ఆసక్తి ఉన్నవాడు, కర్మఫలాన్ని కోరుకునేవాడు, లుబ్ధుడు అంటే పరద్రవ్యమందు తృష్ణ పుట్టినవాడు, పవిత్రక్షేత్రాలలో తన ద్రవ్యాన్ని వదలనివాడు, పరులను పీడించేవాడు, బాహ్యాభ్యంతర శౌచమును వదలినవాడు, కోరినది లభించినప్పుడు హర్షము, అనిష్టం ప్రాప్తించినప్పుడు శోకము పొందువాడు – ఇటువంటివానికే మరి కర్మల సిద్ధ్యసిద్ధుల యందు హర్షశోకాలు కలుగుతాయి – ఇటువంటి కర్తను రాజసుడు అంటారు.

**మూ. అయుక్తః ప్రాకృతః స్తబ్ధః శఠో నైష్కృతికోఽలసః ।**
**విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే ॥ 28**

**తె.అ.** పనిలో నిలకడ ప్రదర్శించనివాడు, సంస్కారహీనుడు, మొండివాడు, మోసం చేసేవాడు, పరుల వృత్తికి భంగం కలిగించేవాడు, సోమరి, క్రుంగిపోయే స్వభావం కలవాడు, పనిలో జాప్యం చేయువాడు – ఇటువంటి కర్తను తామసుడంటారు.

**భాష్యమ్ : 28.1 అయుక్త ఇతి. అయుక్తః న యుక్తః న సమాహితః, ప్రాకృతః అత్యంతా- సంస్కృత బుద్ధిః బాలసమః, స్తబ్ధః దండవత్. న నమతి కస్మైచిత్, శఠః మాయావీ శక్తి గూహనకారీ, నైష్కృతికః పర విభేదనపరః, అలసః అప్రవృత్తి శీలః కర్తవ్యేష్వపి విషాదీ విషాదవాన్ సర్వదా అవసన్న స్వభావః, దీర్ఘసూత్రీ చ కర్తవ్యాదీనాం దీర్ఘప్రసారణః సర్వదా మందస్వభావః యదద్య శ్వో వా కర్తవ్యం తన్మాసేనాపి న కరోతి, యశ్చైవం భూతః కర్తా సః తామసః ఉచ్యతే.**

**తె.అ.** అయుక్తుడు, చిత్త సమాధానం లేనివాడు, ప్రాకృతుడు, అత్యంతము బుద్ధి సంస్కారము లేనివాడు, బాలుని వంటివాడు. స్తబ్ధుడు, ఎవరికి వంగి నమస్కరింపక కర్రవలె బిర్రబిగుసుకునేవాడు, సంస్కారంలేనివాడు, శఠుడు, శక్తిని దాచుకునే మాయావి. నైష్కృతికుడు, ఇతరుల వృత్తిని చెడగట్టేవాడు. అలసుడు, కర్తవ్యమైన వాటియందు గూడా ప్రవృత్తి లేని సోమరి, విషాది, సర్వదా శోకస్వభావం, క్రుంగిపోయేవాడు. దీర్ఘసూత్రి, కర్తవ్యాలను దీర్ఘకాలం వాయిదాలు వేసేవాడు, ఈ వేళనో రేపో చేయదగినవాటిని నెలల వరకు కూడా చేయకుండా ఉండేవాడు – ఇటువంటి కర్తను తామసుడు అంటారు.

**మూ. బుద్ధేర్భేదం ధృతేశ్చైవ గుణతస్త్రివిధం శృణు ।**
**ప్రోచ్యమానమశేషేణ పృథక్త్వేన ధనంజయ ॥ 29**

**తె.అ.** ధనంజయా! గుణాలను నిశ్శేషంగాను వాటిని గురించి వేరు వేరుగాను చెప్పుకుంటున్న ఈ సందర్భంలో బుద్ధి ధృతులు గుణాన్ని బట్టి మూడు విధాలుగా ఉన్నాయి, చెపుతాను విను.

**భాష్యమ్ : 29.1 బుద్ధేర్భేదమితి. బుద్ధేః భేదం ధృతేః చ ఏవం భేదం, గుణతః సత్త్వాదిగుణతః త్రివిధం శృణ్వితి సూత్రోపన్యాసః. ప్రోచ్యమానం కథ్యమానం అశేషేణ నిరవశేషతః యథావత్ పృథక్త్వేన వివేకతః ధనంజయ! దిగ్విజయే మానుషం దైవం చ ప్రభూతం ధనం జితవాన్ తేన అసౌ ధనంజయః తస్య సంబుద్ధిః హే ధనంజయ అర్జున.**

**తె.అ.** గుణాల గురించి నిరవశేషంగా ఉన్న విషయాన్ని వివేచన చేసి చెప్పుకుంటున్న ఈ సందర్భంలో గుణాన్ని బట్టి బుద్ధి ధృతుల యొక్క మూడు భేదాలు విను. దిగ్విజయం చేసి మానుష దైవధనం అశేషంగా జయించినవాడు కనుక ఈ అర్జునుడు ధనంజయుడు.

**మూ. ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే ।**
**బన్ధం మోక్షం చ యా వేత్తి బుద్ధిః సా పార్థ సాత్త్వికీ ॥ 30**

**తె.అ.** పార్థా! ప్రవృత్తి నివృత్తులను, కార్యాకార్యాలను, భయాభయాలను, బంధమోక్షాలను తెలిసిన బుద్ధి సాత్త్వికము.

**భాష్యమ్ : 30.1 ప్రవృత్తిమితి. ప్రవృత్తిం చ ప్రవృత్తిః ప్రవర్తనం బంధహేతుః కర్మమార్గః శాస్త్రవిహితవిషయః నివృత్తిం చ నివృత్తిః మోక్షహేతుః సంన్యాసమార్గః - బంధమోక్ష సమానవాక్యత్వాత్ ప్రవృత్తి నివృత్తీ కర్మ సంన్యాస మార్గావిత్యవగమ్యతే - కార్యాకార్యే విహిత ప్రతిషిద్ధే లౌకికే వైదికే వా శాస్త్రబుద్ధేః కర్తవ్యాకర్తవ్యే కరణాకరణే ఇత్యేతత్ కస్య? దేశకాలాద్యపేక్షయా దృష్టాదృష్టార్థానాం కర్మణాం. భయాభయే బిభేత్యస్మాదితి భయం చోరవ్యాఘ్రాది, న భయం అభయం, భయం చ అభయం చ భయాభయే, దృష్టాదృష్టవిషయయోః భయాభయయోః కారణే ఇత్యర్థః. బంధం సహేతుకం మోక్షం చ సహేతుకం యా వేత్తి విజానాతి బుద్ధిః, సా పార్థ! సాత్త్వికీ. తత్ర జ్ఞానం బుద్ధేః వృత్తిః బుద్ధిస్తు వృత్తిమతీ. ధృతిరపి వృత్తివిశేష ఏవ. బుద్ధేః**

**తె.అ.** ప్రవృత్తి శాస్త్ర విహిత విషయం. బంధహేతువైన కర్మమార్గం. నివృత్తి మోక్షహేతువైన సంన్యాసమార్గము. బంధము మోక్షము అనే పదాలు ఇదే వాక్యంలో ప్రయోగించబడి ఉండడం చేత ప్రవృత్తి నివృత్తులంటే కర్మ సంన్యాసమార్గాలు అని తెలుస్తున్నది. కార్యాకార్యాలు, విధి ప్రతిషేధాలు కర్తవ్య అకర్తవ్యాలు అంటే - శాస్త్రవిహిత కర్మలను చేయడం, శాస్త్రనిషేధిత

కర్మలను చేయకపోవడం – కరణాకరణాలు అని. భయాభయాలు, దేశకాలముల ఆపేక్ష చేత కలిగే దృష్ట అదృష్ట ఫలములైన కలిగిన కర్మల విషయంలో అంటే వాటి ఫలముల ద్వారా కలిగే ఇహలోక, పరలోక ప్రాప్తులు ద్వారా కలిగే భయ, అభయాలు. బంధమోక్షములను వాటి కారణాలతో సహా తెలిసిన బుద్ధి సాత్త్వికము. ఈ సందర్భంలో జ్ఞానమనేది బుద్ధి యొక్క వృత్తి. వృత్తి కలిగినది బుద్ధి. ధృతి కూడా బుద్ధి విశేషమే.

**మూ. యయా ధర్మమధర్మం చ కార్యం చాకార్యమేవ చ ।**
**అయథావత్ప్రజానాతి బుద్ధిః సా పార్థ రాజసీ ॥ 31**

**తె.అ.** పార్థా! ధర్మాధర్మాలను కార్యాకార్యాలను యథార్థం కాని రూపంలో తెలుసుకుంటుందో ఆ బుద్ధి రాజస బుద్ధి.

**భాష్యమ్ : 31.1 యయా ఇతి. యయా ధర్మం శాస్త్ర చోదితం అధర్మం చ తత్ప్రతిషిద్ధం కార్యం చ అకార్యమేవ చ పూర్వోక్తే ఏవ కార్యాకార్యే అయథావత్ న యథావత్ సర్వతః నిర్ణయేన న ప్రజానాతి బుద్ధిః సా పార్థ రాజసీ.**

**తె.అ.** శాస్త్ర విహిత ధర్మము. శాస్త్రం ప్రతిషేధించిన అధర్మము, వెనుక శ్లోకంలో చెప్పిన కార్యాకార్యాలు – వీటిని అన్ని వైపుల నుండి నిర్ణయించి తెలియని బుద్ధి రాజసము.

**మూ. అధర్మం ధర్మమితి యా మన్యతే తమసాఽఽవృతా ।**
**సర్వార్థాన్విపరీతాంశ్చ బుద్ధిః సా పార్థ తామసీ ॥ 32**

**తె.అ.** అజ్ఞానం చేత ఆచరించబడిన ఏ బుద్ధి అధర్మాన్ని ధర్మమని, సర్వపదార్థాలను విపరీతంగాను భావిస్తుందో ఆ బుద్ధి తామస బుద్ధి.

**భాష్యమ్ : 32.1 అధర్మమితి. అధర్మం ప్రతిషిద్ధం విహితం ధర్మమితి యా మన్యతే జానాతి తమసా ఆవృతా సతీ, సర్వార్థాన్ సర్వానేవ జ్ఞేయపదార్థాన్ విపరీతాంశ్చ విపరీతానేవ విజానాతి, బుద్ధిస్సా పార్థ తామసీ.**

**తె.అ.** సర్వజ్ఞేయ పదార్థాలను నిషిద్ధమైన దానిని విహితమైన దానినిగా ఏ బుద్ధి, తమస్సుచేత ఆవరించబడినదై విపరీతంగా గ్రహిస్తుందో ఆ బుద్ధి తామసము.

**మూ. ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేన్ద్రియక్రియాః ।**
**యోగేనావ్యభిచారిణ్యా ధృతిః సా పార్థ సాత్త్వికీ ॥ 33**

**తె.అ.** మనః ప్రాణేంద్రియ క్రియలు దేనిచే ధరింపబడుతున్నాయో ఆ నిత్యసమాధిరూప ధృతి సాత్త్వికము.

**భాష్యమ్ : 33.1 ధృత్యా ఇతి. ధృత్యా యయా – అవ్యభిచారిణ్యా ఇతి వ్యవహితేన సంబంధః, ధారయతే కిం? మనః ప్రాణేంద్రియ క్రియాః మనశ్చ ప్రాణాశ్చ ఇంద్రియాణి చ మనః ప్రాణేంద్రియాణి తేషాం క్రియాః చేష్టాః తాః ఉచ్ఛాస్త్రమార్గప్రవృత్తేః ధారయతే ధారయతి – ధృత్యా హి ధార్యమాణాః ఉచ్ఛాస్త్రమార్గవిషయాః న భవంతి – యోగేన సమాధినా అవ్యభిచారిణ్యా నిత్యసమాధ్యనుగతయా ఇత్యర్థః ఏతదుక్తం భవతి – అవ్యభిచారిణ్యా ధృత్యా మనః ప్రాణేంద్రియక్రియాః ధార్యమాణాః యోగేన ధారయతీతి యా ఏవం లక్షణా ధృతిః సా పార్థ, సాత్త్వికీ.**

**తె.అ.** మనస్సు ప్రాణములు ఇంద్రియములు – వీటి క్రియలు శాస్త్రమార్గం నుండి తొలగి అపమార్గం పట్టకుండా నిలిపే నిత్యసమాధిరూపధృతిని సాత్త్వికధృతి అంటారు. ఈ సాత్త్వికధృతి చేత ధరింపబడినందుననే ఇంద్రియాలు శాస్త్రవిరుద్ధ విషయాలయందు ప్రవర్తించడం లేదు. తాత్పర్యమేమంటే స్థిరమైన ధృతిచేత మనస్సు, ప్రాణా పానాదులు – ఇంద్రియముల యొక్క చేష్టలను ధారణ చేసే వ్యక్తి యోగంచేత వాటిని ధారణ చేస్తున్నాడు. ఇటువంటి స్వరూపం గల ధృతి సాత్త్విక ప్రధానమైనది.

**మూ. యయా తు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయతేఽర్జున ।**
**ప్రసంగేన ఫలాకాఙ్క్షీ ధృతిః సా పార్థ రాజసీ ॥ 34**

**తె.అ.** పార్థా! ఏ ఫలం కోరవలసిన సందర్భంలో ఆ ఫలాన్ని కోరుతూ ధర్మార్థకామాలను నిలిపే ధృతి రాజసము.

**భాష్యమ్ : 34.1 యయా ఇతి. యయా తు ధర్మకామార్థాన్ ధర్మశ్చ కామశ్చార్థశ్చ ధర్మకామార్థాః తాన్ ధర్మకామార్థాన్ ధృత్యా యయా ధారయతే మనసి నిత్యమేవ కర్తవ్యరూపాన్ అవధారయతి హే అర్జున, ప్రసంగేన యస్య యస్య ధర్మాదేర్ధారణ ప్రసంగః తేన తేన ప్రసంగేన ఫలాకాంక్షీ చ భవతి యః పురుషః, తస్య యా ధృతిః, సా పార్థ, రాజసీ భవతి.**

**తె.అ.** అర్జునా! ధర్మార్థకామాలలో దాని దాని ప్రసంగం వచ్చినప్పుడు ఏ ధృతి చేత ఆ ధర్మార్థకామాలలో ఒక్కొక్క దానిని ధరిస్తాడో – అంటే నిత్యకర్తవ్యమని మనస్సులో నిర్ధారణ చేసుకొంటాడో, ఫలాన్ని కోరతాడో ఆ ధృతి రాజస ధృతి.

**మూ. యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ ।**
**న విముఞ్చతి దుర్మేధా ధృతిః సా పార్థ తామసీ ॥ 35**

**తె.అ.** నిద్ర, భయము, శోకము, విషాదము, మదము - వీటిని ఏ కారణంగా దుర్మతి విడువడో ఆ ధృతి తామసి.

**భాష్యమ్ : 35.1 యయా ఇతి. యయా స్వప్నం నిద్రాం భయం త్రాసం శోకం విషాదం విషణ్ణతాం మదం విషయసేవాం ఆత్మనః బహుమన్యమానః మత్త ఇవ మదమేవ చ మనసి నిత్యమేవ కర్తవ్యరూపతయా కుర్వన్న విముంచతి ధారయత్యేవ దుర్మేధాః కుత్సితమేధాః పురుషః యః తస్య ధృతిః యా, సా తామసీ మతా.**

**తె.అ.** నిద్ర, భయము, విషాదము, మదము - వీటిని దుర్మతి విడువడు. విషయ సేవనమే తనకు ముఖ్యమని మత్తుడై మదమే నిత్యకర్తవ్యమని నిశ్చయించి మనస్సులో విడవకుండా చేస్తూ ఉంటాడో ఆ దుర్మతి ధృతి తామసి.

**భాష్యమ్ : 36.0 గుణభేదేన క్రియాణాం కారకాణాం చ త్రివిధో భేద ఉక్తః అథ ఇదానీం సుఖస్య చ ఫలస్య చ త్రివిధో భేదః ఉచ్యతే -**

**తె.అ.** గుణభేదాన్ననుసరించి క్రియలకు కారకాలను త్రిధాభేదం చెప్పబడింది. ఇక ఇప్పుడు ఫలరూప సుఖం యొక్క మూడు విధాలైన భేదం చెప్పబడుతున్నది.

**మూ. సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ ।**
**అభ్యాసాద్రమతే యత్ర దుఃఖాన్తం చ నిగచ్ఛతి ॥ 36**

**తె.అ.** భరతర్షభా! ఇప్పుడు మూడు విధాలైన సుఖం గురించి చెపుతా విను. అభ్యాసం చేత మనుష్యుడు దీనియందు రమిస్తాడు, దుఃఖశాంతిని పొందుతాడు.

**భాష్యమ్ : 36.1 సుఖమితి. సుఖం త్విదానీం త్రివిధం శృణు, సమాధానం కుర్విత్యేతత్, మే మమ భరతర్షభ. అభ్యాసాత్ పరిచయాత్ ఆవృత్తేః, రమతే రతిం ప్రతిపద్యతే, యత్ర యస్మిన్ సుఖానుభవే దుఃఖాంతం చ దుఃఖావసానం దుఃఖోపశమం చ నిగచ్ఛతి నిశ్చయేన ప్రాప్నోతి.**

**తె.అ.** అర్జునా, ఇప్పుడు మూడు విధాలైన సుఖాన్ని గురించి విను, చిత్తాన్ని సమాయత్తం చేయి. పరిచయంతో, మళ్ళీ మళ్ళీ అనుభవించిన అభ్యాసంతో, మనుష్యుడు ఏ సుఖంలో రమిస్తాడో, ఏ సుఖానుభవం చేత దుఃఖావసానం - దుఃఖం యొక్క ఉపశమనం నిశ్చయంగా పొందుతాడో ఆ సుఖం గురించి.

**మూ. యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్ ।**
**తత్సుఖం సాత్త్వికం ప్రోక్తమాత్మబుద్ధిప్రసాదజమ్ ॥ 37**

**తె.అ.** ప్రథమంలో విషం వలె పరిణామంలో అమృతం వలె ఉండే సుఖం సాత్త్విక సుఖమనబడుతుంది. దానివలన ఆత్మబుద్ధి ప్రసాదం కలుగుతుంది.

**భాష్యమ్ : 37.1 యదితి. యత్తత్సుఖం అగ్రే పూర్వం ప్రథమసన్నిపాతే జ్ఞానవైరాగ్య–ధ్యానసమాధ్యారంభే అత్యంతాయాసపూర్వకత్వాత్ విషమివ దుఃఖాత్మకం భవతి, పరిణామే జ్ఞానవైరాగ్యాదిపరిపాకజం సుఖం అమృతోపమం, తత్సుఖం సాత్త్వికం ప్రోక్తం విద్వద్భిః, ఆత్మనో బుద్ధిరాత్మబుద్ధిః, ఆత్మబుద్ధేః ప్రసాదః నైర్మల్యం సలిలస్య ఇవ స్వచ్ఛతా, తతః జాతమాత్మబుద్ధి ప్రసాదజం. ఆత్మవిషయా వా ఆత్మావలంబనా వా బుద్ధిః ఆత్మబుద్ధిః తత్ప్రసాదప్రకర్షాద్వా జాతమిత్యేతత్. తస్మాత్సాత్త్వికం తత్.**

**తె.అ.** ప్రథమంలో అంటే జ్ఞానవైరాగ్య సాధన సమాధి ప్రారంభించిన ఆరంభంలో చాలా ఆయాసంతో కూడినది కారణంగా, విషం వలె దుఃఖమయంగా ఉంటుంది. పరిణామంలో, చివర, జ్ఞానవైరాగ్యాదుల పరిపాకం చేత కలిగే సుఖం అమృతం వలె ఉంటుంది. అటువంటి సుఖం సాత్త్వికమని విద్వాంసులు అన్నారు. దానివలన బుద్ధికి ప్రసాదం కలుగుతుంది. ప్రసాదం అంటే నైర్మల్యం, అంటే నీటివలె స్వచ్ఛంగా ఉండడం. అటువంటి సుఖం సాత్త్వికమని విద్వాంసులు అంటారు. లేక ఆత్మ విషయంగా, ఆత్మావలంబనమైన బుద్ధి ఆత్మబుద్ధి. ఆ బుద్ధి యొక్క అధిక ప్రసాదం చేత కలిగినది కనుక సాత్త్విక సుఖము.

**మూ. విషయేన్ద్రియసంయోగాద్యత్తదగ్రేఽమృతోపమమ్ ।**
**పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్ ॥ 38**

**తె.అ.** విషయేంద్రియ సంయోగం చేత కలిగే సుఖం మొదట అమృతం వలె ఉండి విషంగా పరిణమిస్తుంది. ఆ సుఖాన్ని రాజసమని అంటారు.

**భాష్యమ్ : 38.1 విషయ ఇతి. విషయేంద్రియ సంయోగాజ్జాయతే యత్సుఖం తత్సుఖమగ్రే ప్రథమక్షణే అమృతోపమం అమృతసమం, పరిణామే విషమివ, బలవీర్యరూపప్రజ్ఞామేధా ధనోత్సాహ– హానిహేతుత్వాత్ అధర్మతజ్జనితనరకాది హేతుత్వాచ్చ పరిణామే తదుపభోగపరిణామాంతే విషమేవ, తత్సుఖం రాజసమ్ స్మృతమ్.**

**తె.అ.** ఇంద్రియాలకు విషయాలతో కలిగే సంయోగం చేత పుట్టే సుఖం మొదటిక్షణంలో అమృత సమానంగా ఉంటుంది. చివరకు విషంవలె మారుతుంది. మొదటి సుఖానుభవం

ముగిసిన తరువాత బలము, వీర్యము, రూపము, ప్రజ్ఞ, మేధస్సు, ధనము, ఉత్సాహము క్షీణిస్తాయి. అంతేకాదు అది అధర్మానికి, ఆ కారణంగా నరకానికి ఈడుస్తుంది. కనుక అది విషమే. అటువంటి సుఖం రాజసం.

**మూ. యదగ్రే చానుబన్ధే చ సుఖం మోహనమాత్మనః ।**
**నిద్రాఽఽలస్యప్రమాదోత్థం తత్తామసముదాహృతమ్ ॥ 39**

**తె.అ.** నిద్ర ఆలస్యము ప్రమాదము – వీటివలన కలిగే సుఖం తామసిక సుఖం. ఇది ఆరంభంలోను చివరలోను కూడా మోహం కలిగించేది.

**భాష్యమ్ : 39.1 యదగ్రే ఇతి. యదగ్రే చానుబంధే చ అవసానే చోత్తరకాలే సుఖం మోహనం మోహకరమాత్మనః, నిద్రాఽఽలస్యప్రమాదోత్థం నిద్రా చ ఆలస్యం చ ప్రమాదశ్చేతి ఏతేభ్యస్సముత్తిష్ఠతీతి నిద్రాఽఽలస్యప్రమాదోత్థం, తత్ తామసముదాహృతమ్.**

**తె.అ.** ఏది ప్రారంభంలో, చివరలో కూడా తనకు మోహాన్ని కలిగిస్తుందో, నిద్ర, బద్ధకం, పొరపాటు నుండి పుడుతుందో అది తామస సుఖమని చెప్పబడింది.

**భాష్యమ్ : 40.0 అథ ఇదానీం ప్రకరణోపసంహారార్థః శ్లోక ఆరభ్యతే –**

**తె.అ.** ఇక ఇప్పుడు ప్రకరణాన్ని ముగిస్తూ ఈ శ్లోకం –

**మూ. న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః ।**
**సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభిః స్యాత్త్రిభిర్గుణైః ॥ 40**

**తె.అ.** భూలోకంలో గాని స్వర్గంలోగాని, దేవలోకంలోగాని ఈ మూడు ప్రకృతిగుణాల నుండి ముక్తమైన వస్తువుగాని, ప్రాణి గాని లేదు.

**భాష్యమ్ : 40.1 న తత్ ఇతి. న తత్ అస్తి తత్ నాస్తి పృథివ్యాం వా మనుష్యాదిషు సత్త్వం ప్రాణిజాతం అన్యద్వా అప్రాణిజాతం, దివి దేవేషు వా పునః సత్త్వం ప్రకృతిజైః ప్రకృతితః జాతైః ఏభిస్త్రిభిర్గుణైః సత్త్వాభిర్ముక్తం పరిత్యక్తం యత్ స్యాత్ భవేత్ 'న తదస్తీ' తి పూర్వేణ సంబంధః.**

**తె.అ.** పృథివియందు మనుష్యాది ప్రాణిగాని లేక ఇతర అప్రాణిగాని దేవలోకంలోని దేవతలలోగాని ప్రకృతివల్ల కలిగే ఈ మూడు సత్త్వాదిగుణాల నుండి ముక్తమైనది, ఈ మూడు గుణాలు లేనిది, లేదు.

**భాష్యమ్ : 41.0 సర్వః సంసారః క్రియాకారకఫలలక్షణః సత్త్వరజస్తమోగుణాత్మకో అవిద్యాపరికల్పితః సమూలః అనర్థః ఉక్తః వృక్షరూపకల్పనయా చ 'ఊర్ధ్వమూల' (15.1)**

**మిత్యాదినా. 'తం చాసంగ శస్త్రేణ ధృఢేన ఛిత్వా తతః పదం తత్పరిమార్గితవ్యం' (14.3,4) ఇతి చ ఉక్తం. తత్ర చ సర్వస్య త్రిగుణాత్మకత్వాత్ సంసారకారణ నివృత్త్యనుపపత్తౌ ప్రాప్తాయాం, యథా తన్నివృత్తిస్స్యాత్ తథా వక్తవ్యం, సర్వశ్చ గీతాశాస్త్రార్థః ఉపసంహర్తవ్యః, ఏతావానేవ చ సర్వవేదస్మృత్యర్థః పురుషార్థమిచ్ఛద్భిరనుష్ఠేయః ఇత్యేవమర్థం చ 'బ్రాహ్మణక్షత్రియవిశాం' ఇత్యాదిః ఆరభ్యతే –**

**తె.అ.** క్రియాకారక ఫలలక్షణం గలిగి సత్త్వరజస్తమోగుణాత్మకమై అవిద్యా పరికల్పితమైన ఈ సమస్త సంసారము సమూలము అనర్థమని వృక్షరూప కల్పన చేత 'ఊర్ధ్వమూలం' (15.1) వంటి వాక్యాల ద్వారా చెప్పబడింది. అసంగమనే దృఢమైన శస్త్రంతో దానిని ఛేదించి తరువాత ఆ పరమ పదమును వెదకికొంటూ వెళ్ళవలెను అని కూడా చెప్పబడింది. ఈ సందర్భంలో ఒక సందేహం కలుగుతుంది. సర్వము త్రిగుణాత్మకమయినపుడు సంసార కారణం తొలగడమన్నది ఉండదు. మరి దానిని తొలగించడమెట్లా? అది చెప్పవలసి ఉంది. అంతేకాకుండా పురుషార్థాన్ని కోరుకునేవారు అనుష్ఠించదగిన సమస్త వేద స్మృతులలోని ప్రతిపాదించిన విషయం ఇదే అని ఈ విధంగా సర్వగీతాశాస్త్రార్థాన్ని ఉపసంహరించదగును అని 'బ్రాహ్మణ క్షత్రియ విశామ్' అనే శ్లోకంతో ఆరంభిస్తున్నాడు –

**మూ. బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాం చ పరంతప ।**
**కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః ॥ 41**

**తె.అ.** పరంతపా! బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యుల, కర్మలు శూద్రుల కర్మల స్వభావం వల్ల కలిగే గుణాలను బట్టి విభజించబడ్డాయి.

**భాష్యమ్ : 41.1 బ్రాహ్మణ ఇతి. బ్రాహ్మణాశ్చ క్షత్రియాశ్చ విశశ్చ బ్రాహ్మణక్షత్రియవిశః తేషాం బ్రాహ్మణక్షత్రియవిశాం, శూద్రాణాం చ – శూద్రాణామసమాసకరణమేకజాతిత్వే సతి వేదానధికారాత్ – హే పరంతప, కర్మాణి ప్రవిభక్తాని ఇతరేతరవిభాగేన వ్యవస్థాపితాని. కేన? స్వభావప్రభవైర్గుణైః స్వభావః ఈశ్వరస్య ప్రకృతిః త్రిగుణాత్మికా మాయా సా ప్రభవః యేషాం గుణానాం తే స్వభావప్రభవాః తైః, శమాదీని కర్మాణి ప్రవిభక్తాని బ్రాహ్మణాదీనామ్.**

**తె.అ.** బ్రాహ్మణ క్షత్రియ వైశ్యుల కర్మలు శూద్రుల కర్మలు వేరు వేరుగా విభాగింపబడ్డాయి. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులతో శూద్రులను కలిపి సమాసం చేయకపోవడానికి కారణం శూద్రులు ఏకజాతివారు కనుక (వారికి ద్విజత్వం లేదు). వారికి వేదమందు అధికారం లేకపోవడం వలన. స్వభావమంటే ఈశ్వరుని ప్రకృతి. త్రిగుణాత్మికయైన మాయ. ఆ మాయ వలన కలిగే శమాది గుణాలను బట్టి బ్రాహ్మణాది వర్ణాల కర్మలు విభాగం చేయబడ్డాయి.

**భాష్యమ్ : 41.2 అథవా బ్రాహ్మణస్వభావస్య సత్త్వగుణః ప్రభవః కారణం, తథా క్షత్రియస్వభావస్య సత్త్వోపసర్జనం రజఃప్రభవః, వైశ్యస్వభావస్య తమ ఉపసర్జనం రజః ప్రభవః, శూద్రస్వభావస్య రజఃఉపసర్జనం తమః ప్రభవః ప్రశాంత్యైశ్వర్యేహామూఢతాస్వభావదర్శనాత్ చతుర్ణాం.**

**తె.అ.** లేక, ఇట్లా కూడా అర్థం చెప్పుకోవచ్చు. బ్రాహ్మణ స్వభావం సత్త్వం నుండి ప్రభవిస్తుంది. అట్లాగే క్షత్రియస్వభావం సత్త్వంలో కలిసిన రజస్సు నుండి ప్రభవిస్తుంది. వైశ్య స్వభావం తమస్సులో కలిసిన రజస్సు నుండి ప్రభవిస్తుంది. శూద్ర స్వభావం రజస్సుతో కలిసిన తమస్సు నుండి ప్రభవిస్తుంది. ఈ నాలుగు వర్ణాలలో ప్రశాంతి, ఐశ్వర్యము, ఆశ, మూఢత్వము మనం చూస్తున్నాం, కనుక ఈ విధంగా చెప్పుకోవచ్చు.

**భాష్యమ్ : 41.3 అథవా జన్మాంతరకృతసంస్కారః ప్రాణినాం వర్తమాన జన్మనిస్వకార్యాభి-ముఖత్వేనాభివ్యక్తస్వభావః స ప్రభవో యేషాం గుణానాం తే స్వభావప్రభవాః, గుణాః, గుణప్రాదుర్భావస్య నిష్కారణత్వానుపపత్తేః 'స్వభావః కారణం' ఇతి చ కారణ విశేషోపాదానాం ఏవంస్వభావ ప్రకృతభవైః సత్త్వరజస్తమోభిర్గుణైః స్వకార్యానురూపేణ శమాదీని కర్మాణి ప్రవిభక్తాని.**

**తె.అ.** లేక, ఇట్లా కూడా అర్థం చెప్పుకోవచ్చు. జీవుల జన్మాంతర కృత సంస్కారం ఈ జన్మలో స్వకార్యాభిముఖత్వ రూపంలో అభివ్యక్తమవుతుంది. అదే వారి స్వభావం. ఆ స్వభావం వల్ల కలిగే గుణాలు అని చెప్పుకోవచ్చు. ఏ కారణమూ లేకుండా గుణాలు పుట్టుకురావు కనుక స్వభావం కారణమని ఒక కారణాన్ని ప్రతిపాదించడం. ఈ విధంగా స్వభావం చేత అంటే ప్రకృతి వల్ల కలిగే సత్త్వరజస్తమో గుణాలను బట్టి స్వకార్యానురూపంగా శమాది కర్మల విభాగం చేయబడింది.

**భాష్యమ్ : 41.4 నను శాస్త్రప్రవిభక్తాని శాస్త్రేణ విహితాని బ్రాహ్మణాదీనాం శమాదీని కర్మాణి, కథముచ్యతే సత్త్వాదిగుణ ప్రవిభక్తాని ఇతి? నైష దోషః, శాస్త్రేణాపి బ్రాహ్మణాదీనాం సత్త్వాది గుణ విశేషాపేక్షయైవ శమాదీని కర్మాణి ప్రవిభక్తాని, న గుణానపేక్షయా, ఇతి శాస్త్ర ప్రవిభక్తాన్యపి కర్మాణి గుణ ప్రవిభక్తానీత్యుచ్యతే.**

**తె.అ.** ఆక్షేపణ - బ్రాహ్మణాది వర్ణాలవారి శమాది కర్మలు శాస్త్రం చేత కదా విభాగించబడి విధించబడ్డాయి? మరి సత్త్వాది గుణాలను బట్టి విభజించబడ్డాయి అని ఎట్లా అంటారు?

సమాధానం - ఇది దోషం కాదు. శాస్త్రం కూడా బ్రాహ్మణాదుల శమాదికర్మలు సత్త్వాది గుణాలను దృష్టిలో ఉంచుకునే విభాగం చేసింది. గుణాలను ఉపేక్షించి కాదు. కనుక శాస్త్రమే ఈ విభాగం చేసినప్పటికి గుణాలను బట్టి చేయబడింది అని చెప్పబడింది.

**భాష్యమ్ : 42.0 కాని పునస్తాని కర్మాణి ఇతి ఉచ్యతే –**

**తె.అ.** మరి ఆ కర్మలేవి?అంటే చెపుతున్నాడు –

**మూ. శమో దమస్తపః శౌచం క్షాన్తిరార్జవమేవ చ ।**
**జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రహ్మకర్మ స్వభావజమ్ ॥ 42**

**తె.అ.** మనోనిగ్రహం, ఇంద్రియ నిగ్రహం, తపము, శౌచము, క్షాంతి, ఆర్జవము, జ్ఞానము, విజ్ఞానము, ఆస్తిక్యము – ఇవి బ్రాహ్మణ జాతికి స్వాభావిక కర్మ.

**భాష్యమ్ : 42.1 శమ ఇతి. శమః దమశ్చ యథావ్యాఖ్యాతార్థౌ, తపః యథోక్తం శారీరాది, (17.14–16) శౌచం వ్యాఖ్యాతం (16.3) క్షాంతిః క్షమా ఆర్జవం ఋజుతైవ చ జ్ఞానం విజ్ఞానం ఆస్తిక్యం ఆస్తికభావః శ్రద్ధధానతా ఆగమార్థేషు, బ్రహ్మకర్మ బ్రాహ్మణజాతేః కర్మ కర్మ స్వభావజమ్ – యదుక్తం 'స్వభావప్రభవైర్గుణైః ప్రవిభక్తానీ'తి తదేవోక్తం స్వభావజమితి.**

**తె.అ.** శమము దమము – వీటి అర్థం వెనుక చెప్పబడింది; (6.3, 10.4, 16.1.) తపము – వెనుక చెప్పిన శరీరాది తాపము; (17.14), శౌచము – (13.7, 16.3) లో చెప్పిన అర్థం; క్షాంతి – క్షమ; ఆర్జవము – ఋజుత్వం; జ్ఞానము; విజ్ఞానము; ఆస్తిక్యము – శాస్త్రార్థంలో శ్రద్ధ – ఇవి బ్రాహ్మణజాతికి స్వాభావిక కర్మ, బ్రహ్మకర్మ. 'స్వభావ ప్రభవైః గుణైః ప్రవిభక్తాని' (41) అని చెప్పినదే ఇక్కడ స్వాభావికమంటున్నాడు.

**మూ. శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్ ।**
**దానమీశ్వరభావశ్చ క్షత్రకర్మ స్వభావజమ్ ॥ 43**

**తె.అ.** శౌర్యము, తేజము, ధృతి, దాక్ష్యము, యుద్ధం నుండి పలాయనం చేయకపోవడము, దానము, ఈశ్వరభావము – ఇవి క్షత్రియ జాతికి స్వాభావిక కర్మ.

**భాష్యమ్ : 43.1 శౌర్యమితి. శౌర్యం శూరస్య భావః, తేజః ప్రాగల్భ్యం, ధృతిః ధారణం, సర్వావస్థాసు అనవసాదః భవతి యయా ధృత్యా ఉత్తంభితస్య దాక్ష్యం దక్షస్య భావః సహసా ప్రత్యుత్పన్నేషు కార్యేషు అవ్యామోహేన ప్రవృత్తిః, యుద్ధే చాప్యపలాయనం అపరాఙ్ముఖీ భావః శత్రుభ్యః, దానం దేయద్రవ్యేషు ముక్తహస్తతా, ఈశ్వరభావశ్చ ఈశ్వరస్య భావః, ప్రభుశక్తి ప్రకటీకరణం ఈశితవ్యాన్ ప్రతి, క్షాత్రం కర్మ క్షత్రజాతేః విహితం కర్మ క్షాత్రం కర్మ స్వభావజమ్.**

**తె.అ.** శౌర్యము – శూరుని గుణం. తేజము – ప్రాగల్భ్యం, ఇతరులకు లొంగియుండని స్వభావం. ధృతి – ధారణ. ధృతి చేత ఉత్సాహితుడైనవాడు, ఎటువంటి పరిస్థితియందు కూడా

విషాదము చెందదు. దాక్ష్యము – దక్షత, అనుకోకుండా ఎదురైన కర్తవ్య విషయంలో మూఢుడు కానివాడు, ఏది కర్తవ్యమనే విషయంలో మోహం చెందక స్పష్టమైన బుద్ధి కలిగి ఉండడం. యుద్ధం నుండి పలాయనం చేయకపోవడం అంటే శత్రువులకు వెన్నుచూపి పారిపోకపోవడం. దానము– ఇవ్వదగినవాటిని ఉదారంగా ఇవ్వడం. ఈశ్వరభావము – శాసించదగిన వారిపట్ల ప్రభుశక్తిని ప్రకటించుకోడం – ఇవి క్షత్రియజాతికి స్వాభావిక కర్మ.

**మూ. కృషిగౌరక్ష్యవాణిజ్యం వైశ్యకర్మ స్వభావజమ్ ।**
**పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్ ॥ 44**

**తె.అ.** వ్యవసాయం, గోసంరక్షణ, వర్తకం, వాణిజ్యము – ఇవి వైశ్యజాతికి స్వాభావిక కర్మ. పరిచర్య శూద్రజాతికి స్వాభావికకర్మ.

**భాష్యమ్ : 44.1 కృషి ఇతి. కృషిగౌరక్ష్యవాణిజ్యం కృషిశ్చ గౌరక్ష్యం చ వాణిజ్యం చ కృషిగౌరక్ష్యవాణిజ్యం, కృషిః భూమేః విలేఖనం, గౌరక్ష్యం గాః రక్షతీతి గోరక్షః తస్య భావః గౌరక్ష్యం, పశుపాల్యమిత్యర్థః, వాణిజ్యం వణిక్కర్మ క్రయవిక్రయాదిలక్షణం వైశ్యకర్మ వైశ్యజాతేః కర్మ వైశ్యకర్మ స్వభావజమ్. పరిచర్యాత్మకం శుశ్రూషాస్వభావం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్.**

**తె.అ.** కృషి – భూమి దున్నడం. గోరక్ష – పశువులను పాలించడం. వాణిజ్యము – కొనడం అమ్మడం వంటి పని. ఇవి వైశ్యజాతికి స్వాభావిక కర్మ. పరిచర్య – శుశ్రూష సేవ చేయడం శూద్రజాతికి స్వాభావిక కర్మ.

**భాష్యమ్ : 45.0 ఏతేషాం జాతివిహితానాం కర్మణాం సమ్యగనుష్ఠితానాం స్వర్గప్రాప్తిః ఫలం స్వభావతః, 'వర్ణాః ఆశ్రమాశ్చ స్వకర్మనిష్ఠా ప్రేత్య కర్మఫలమనుభూయా తతశ్శేషేణ విశిష్టదేశ జాతికులధర్మాయుశ్శ్రుత – వృత్తవిత్తః సుఖమేధసో జన్మ ప్రతిపద్యంతే' ఇత్యాది స్మృతిభ్యః, పురాణే చ వర్ణినామాశ్రమిణాం చ లోకఫలభేదవిశేష – స్మరణాత్. కారణాంతరాత్తు ఇదం వక్ష్యమాణం ఫలముచ్యతే –**

**తె.అ.** ఈ జాతి విహితకర్మలను చక్కగా అనుష్ఠించినవారికి స్వర్గప్రాప్తి అనే ఫలం సహజంగా కలుగుతుంది. 'వర్ణాశ్రమాల ననుసరించి స్వకర్మ నిష్ఠులైనవారు మరణించిన తరువాత కర్మఫలమనుభవించి ఆ తరువాత మిగిలిన కర్మఫలం వల్ల దేశము, జాతి, కులము, ధర్మము ఆయువు, ఆచారము, విత్తము, సుఖము, మేధస్సు – ఇవన్నీ విశేషంగా కలిగిన జన్మను పొందుతాడు' (ఆప.ధ. సూ.2.2. 2.3) మొదలైన స్మృతి వాక్యాలలోను, పురాణాలలో కూడాను వర్ణాశ్రమాలను అనుసరించేవారికి వేరు వేరు ఫలాలు చెప్పబడ్డాయి. కాని ఇప్పుడు చెప్పబోయే

ఫలం కారాణాంతరం చేత కలిగేది.

**మూ. స్వే స్వే కర్మణ్యభిరతస్సంసిద్ధిం లభతే నరః ।**
**స్వకర్మనిరతః సిద్ధిం యథా విన్దతి తచ్ఛృణు ॥ 45**

**తె.అ.** స్వకర్మయందు తత్పరుడైన నరుడు సిద్ధిని పొందుతాడు. తన కర్మయందు శ్రద్ధ గలవాడు ఏ విధంగా సిద్ధి పొందుతాడో చెపుతా విను.

**భాష్యమ్ : 45.1 స్వేస్వే ఇతి. స్వేస్వే యథోక్తలక్షణభేదే కర్మణి అభిరతః తత్పరః, సంసిద్ధిం స్వకర్మానుష్ఠానాత్ అశుద్ధి క్షయే సతి కాయేంద్రియాణాం జ్ఞానిష్ఠాయోగ్యతాలక్షణాం సంసిద్ధిం లభతే ప్రాప్నోతి నరః అధికృతః పురుషః, కిం స్వకర్మానుష్ఠానత ఏవ సాక్షాత్ సంసిద్ధిః? న. కథం తర్హి? స్వకర్మనిరతః సిద్ధిం యథా యేన ప్రకారేణ విందతి, తచ్ఛృణు.**

**తె.అ.** వెనుక చెప్పిన లక్షణం కలిగిన తమ తమ కర్మయందు తత్పరుడైన కర్మాధికారికి స్వకర్మానుష్ఠానం చేత శరీరానికి ఇంద్రియాలకు ఉన్న అశుద్ధి తొలగిపోయి జ్ఞాననిష్ఠాయోగ్యత కలగడంచేత సిద్ధిని పొందుతాడు. అయితే స్వకర్మానుష్ఠానం చేయడం చేతనే నేరుగా సిద్ధి పొందుతాడా? లేదు, స్వకర్మ నిరతుడు ఏ ప్రకారంగా సిద్ధి పొందుతాడో విను.

**మూ. యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్ ।**
**స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః ॥ 46**

**తె.అ.** ఎవ్వని వలన సమస్త ప్రాణులు పుడుతున్నాయో, ఎవ్వనిచేత ఈ సర్వజగత్తు నిండివున్నదో అతనిని స్వకర్మచేత అర్చించి మానవుడు సిద్ధి పొందుతాడు.

**భాష్యమ్ : 46.1 యత ఇతి. యతః యస్మాత్ ప్రవృత్తిః ఉత్పత్తిః చేష్టా వా యస్మాత్ అంతర్యామిణః ఈశ్వరాత్ భూతానాం ప్రాణినాం స్యాత్, యేన ఈశ్వరేణ సర్వం ఇదం జగత్ తతం వ్యాప్తం స్వకర్మణా పూర్వోక్తేన ప్రతివర్ణం తం ఈశ్వరమభ్యర్చ్య పూజయిత్వా ఆరాధ్య కేవలం జ్ఞాననిష్ఠాయోగ్యతా లక్షణాం సిద్ధిం విందతి మానవః మనుష్యః.**

**తె.అ.** ఎవ్వని వలన సమస్తప్రాణులు పుడుతున్నాయో లేక ప్రవర్తిస్తున్నాయో, ఎవ్వనిచేత ఈ జగత్తు సర్వము నిండి వున్నదో ఆ అంతర్యామి ఈశ్వరుణ్ణి ప్రతీ వర్ణంవారికి విధించబడిన, వెనుకచెప్పిన కర్మానుష్ఠానం చేత అర్చించి పూజించి ఆరాధించి కేవలము జ్ఞాననిష్ఠకు యోగ్యతను మానవుడు పొందుతాడు. కనుక –

**భాష్యమ్ : యతః ఏవం, అతః –**

**తె.అ.** ఎందుకంటే –

**మూ. శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।**
**స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥ 47**

**తె.అ.** చక్కగా అనుష్ఠించబడిన పరుల ధర్మంకంటె గుణహీనమైనది అయినప్పటికి స్వధర్మం మేలైనది. స్వభావం చేత నిర్ణయించడిన కర్మ ఆచరిస్తున్నవాడు ఎవడూ పాపం పొందడు.

**భాష్యమ్ : 47.1 శ్రేయాన్ ఇతి. శ్రేయాన్ ప్రశస్యతరః స్వోధర్మః స్వధర్మః విగుణోఽపి ఇతి అపి శబ్దో ద్రష్టవ్యః, పరధర్మాత్ స్వనుష్ఠిత్వాత్. స్వభావ నియతం స్వభావేన నియతం, యదుక్తం స్వభావజమితి, తదేవోక్తం స్వభావం నియతమితి, యథా విషజాతస్య కృమేః విషం న దోషకరం, తథా స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషం పాపమ్.**

**తె.అ.** కొంచెం లోపాలున్నప్పటికీ స్వధర్మం చక్కగా అనుష్ఠించబడిన పరధర్మం కంటె శ్రేయస్కరము. 'స్వభావజమ్' అని వెనుక చెప్పిందే ఇక్కడ స్వభావనియతమంటున్నాడు. స్వభావాన్ని బట్టి నిర్ణయించబడిన కర్మ చేసేవాడు పాపం పొందడు. ఎట్లాగంటే, విషంలో పుట్టిన క్రిమిని విషమేమీ చేయలేనట్లు.

**భాష్యమ్ : 48.0 స్వభావనియతం కర్మ కుర్వాణో విషజ ఇవ కృమిః కిల్బిషం నాప్నోతీత్యుక్తం, పరధర్మశ్చ భయావహః ఇతి, అనాత్మజ్ఞశ్చ 'న హి కశ్చిత్ క్షణమపి అకర్మకృత్తిష్ఠతి' ఇతి అతః –**

**తె.అ.** విషంలో పుట్టిన పురుగును విషమేమీ చేయలేనట్లే స్వభావాన్ని బట్టి నిర్ణయించబడిన కర్మను ఆచరించిన వాడు పాపం పొందడు అని చెప్పబడింది. పరధర్మం భయావహమని కూడా. అనాత్మజ్ఞుడు ఎవ్వడూ క్షణం కూడా కర్మ చేయకుండా ఉండలేడు అని కూడా చెప్పబడింది. కనుక –

**మూ. సహజం కర్మ కౌన్తేయ సదోషమపి న త్యజేత్ ।**
**సర్వారమ్భా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః ॥ 48**

**తె.అ.** అర్జునా! జన్మతో కలిగిన కర్మను, దానిలో దోషమున్నప్పటికి, వదలరాదు. సర్వకర్మలు పొగచేత నిప్పువలె కప్పబడి ఉన్నాయి.

**భాష్యమ్ : 48.1 సహజమితి. సహజం సహ జన్మనైవ ఉత్పన్నం. కిం తత్? కర్మ, కౌంతేయ, సదోషమపి త్రిగుణాత్మకత్వాత్ న త్యజేత్, సర్వారంభాః ఆరభ్యంత ఇత్యారంభాః సర్వకర్మాణీత్యేతత్, ప్రకరణాత్ యే కేచిత్ ఆరంభాః స్వధర్మాః పరధర్మాశ్చ, తే సర్వే హి యస్మాత్ – త్రిగుణాత్మకత్వం**

**అత్ర హేతుః – త్రిగుణాత్మకత్వాత్ దోషేణ ధూమేన సహజేన అగ్నిరివ, ఆవృతాః. సహజస్య కర్మణః స్వధర్మాఖ్యస్య పరిత్యాగేన పరధర్మానుష్ఠానేఽపి దోషాన్నైవ ముచ్యతే, భయావహశ్చ పరధర్మః. న చ శక్యతే అశేషతః త్యక్తుం అజ్ఞేన కర్మ యతః, తస్మాత్ న త్యజేత్ ఇత్యర్థః.**

**తె.అ.** సహజమంటే తోబుట్టినది. మనకు జన్మతో కలిగిన కర్మ సహజకర్మ. అది త్రిగుణమయం కనుక అందులో దోషముంటుంది. (అది త్రిగుణమయం కావడమే దాని దోషం.) దానిలో దోషమున్నప్పటికి దానిని విడువరాదు. ఆరంభించబడేవి ఆరంభాలు. సర్వారంభాలు అంటే సమస్తకర్మలు అని ఈ సందర్భంలో అర్థం చెప్పుకోవాలి. ఈ కర్మలన్నీ, స్వధర్మం కాని పరధర్మం కాని, త్రిగుణాత్మకమైనవి. త్రిగుణాత్మకమైనవి కనుక అవి పొగచేత నిప్పువలె దోషంచేత కప్పబడి ఉన్నాయి.

(నిప్పును ప్రకాశింపనీయకుండా పొగ ఆవరించినట్లు సమస్తకర్మలను, అవి స్వధర్మరూపమైనవైనా పరధర్మరూపమైనవైనా, గుణదోషం ఆవరించి ఉంటుంది. కనుక దోషంలేని కర్మ ఉండడం అసంభవం). స్వధర్మమనే సహజకర్మను (దోషమున్నదని) పరిత్యజించి పరధర్మమనుష్ఠించినప్పటికి దోషం వదలదు. పైగా పరధర్మం భయావహం కూడాను. అజ్ఞానికి కర్మను నిశ్శేషంగా త్యజించడం శక్యం కాదు. కనుక త్యజించరాదు అని అర్థం.

**భాష్యమ్ : 48.2 కిమశేషతః త్యక్తుం అశక్యం కర్మ ఇతి న త్యజేత్? కిం వా సహజస్య కర్మణః త్యాగే దోషో భవతీతి? కిం చాతః, యది తావత్ అశేషతః త్యక్తుం అశక్యం ఇతి న త్యాజ్యం సహజం కర్మ, ఏవం తర్హ్యశేషతస్త్యాగే గుణ ఏవ స్యాదితి సిద్ధం భవతి. సత్యమేవం, అశేషతస్త్యాగ ఏవ నోపపద్యత ఇతి చేత్, కిం నిత్యప్రచలితాత్మకః పురుషః? యథా సాంఖ్యానాం గుణాః, కిం వా క్రియైవ కారకం యథా బౌద్ధానాం స్కంధాః క్షణప్రధ్వంసినః, ఉభయథాఽపి, కర్మణః అశేషతః త్యాగః న సంభవతి, అథ తృతీయోఽపి పక్షః – యదా కరోతి తదా సక్రియం వస్తు. యదా న కరోతి, తదా సక్రియం వస్తు. యదా న కరోతి, తదా నిష్క్రియం తదేవ. తత్రైవం సతి శక్యం కర్మాశేషతస్త్యక్తుం. అయం త్వస్మిన్ తృతీయే పక్షే విశేషః – న నిత్యప్రచలితం వస్తు, నాపి క్రియైవ కారకం కిం తర్హి? వ్యవస్థితే ద్రవ్యే అవిద్యమానా క్రియా ఉత్పద్యతే విద్యమానా చ వినశ్యతి, శుద్ధం తద్ద్రవ్యం శక్తిమదవతిష్ఠతే. ఇత్యేవమాహుః కాణాదాః, తదేవ చ కారకమితి అస్మిన్ పక్షే కో దోషః ఇతి.**

**తె.అ.** ఆక్షేపణ – కర్మను నిశ్శేషంగా త్యజించడం అశక్యం కనుక త్యజించరాదా, లేక సహజకర్మను త్యజించడం దోషం కనుక త్యజించరాదా?

సమాధానం – ఎందుకీ ప్రశ్న?

ఆక్షేపణ – సహజకర్మను నిశ్శేషంగా త్యజించడం అశక్యం కనుక దానిని త్యజించరాదు అంటే నిశ్శేషంగా త్యజించడంలో గుణముంది అని అర్థం.

సమాధానం – అది నిజమే. కాని, (మీ మీ సిద్ధాంతాల ప్రకారం) కర్మలను నిశ్శేషంగా త్యాగం చేయడమే సాధ్యం కానపుడు (అది గుణమా దోషమా) అన్న చర్చ ఎందుకు? మీరెవరు? సాంఖ్యులా? గుణాలు క్షణక్షణమూ మారిపోయేవి అని మీ వాదం. మీరెవరు? బౌద్ధులా? ప్రతిక్షణము నశించే పంచస్కంధాల (రూపము, వేదన, విజ్ఞానము, సంజ్ఞ, సంస్కారము – ఇవి పంచస్కంధాలు. వీటి ఉనికి క్షణికం. వీటి విషయంలో క్రియకు, కారకానికి తేడా లేదు, క్షణికాలు కనుక.) వలె క్రియయే కారకమని (క్రియను జరిపేవాడు వేరొకడు లేడు) అని మీ వాదం. మీ ఇద్దరి సిద్ధాంతాల ప్రకారం కర్మను నిశ్శేషంగా త్యాగం చేయడమన్న ప్రశ్నే లేదు.

ఆక్షేపణ – (వైశేషికులు, ప్రపంచంలో సిద్ధాంతాలు ఈ రెండేనా?) మూడవది కూడా వినండి. వస్తువు పని చేస్తున్నపుడు అది సక్రియం. పనిమానినపుడు అదే వస్తువు నిష్క్రియం. మరి ఈ విధంగా పనిమానేసి కర్మను నిశ్శేషంగా త్యాగం చెయ్యవచ్చు గదా? ఈ మా వాదంలో మీరు చెప్పిన సాంఖ్య బౌద్ధ వాదాలలో లేని విశేషముంది. అదేమిటంటే ఇక్కడ వస్తువు నిత్యము మారిపోతూ ఉండడం లేదు. (క్రియయే కారకం కావడం కూడా లేదు. మరేమి ఉందంటారా? ఉన్న వస్తువులో లేని క్రియ ఒకటి పుడుతున్నది, ఉన్న క్రియ నశించిపోతున్నది. శుద్ధ వస్తువు క్రియాశక్తి కలిగి ఉంటున్నది. అదే కారకం (క్రియయే కారకం కావడం కాదు, కారకమే క్రియాశక్తి కలిగి ఉండడం) ఈ వాదంలో దోషమేముంది?

**భాష్యమ్ : 48.3 అయమేవ తు దోషః – యతస్త్వభాగవతం మతమిదం, కథం జ్ఞాయతే? యతః ఆహ భగవాన్ 'నాసతో విద్యతే భావః' (2.16) ఇత్యాది. కాణాదానాం హి అసతః భావః, సతశ్చాభావః. ఇతి, ఇదం మతమభాగవతం, అభాగవతమపి న్యాయవచ్చేత్ కో దోషః ఇతి చేత్, ఉచ్యతే – దోషవత్త్విదం సర్వప్రమాణవిరోధాత్. కథం? యది తావద్ద్వ్యణుకాది ద్రవ్యం ప్రాగుత్పత్తేః అత్యంతమేవ అసత్, ఉత్పన్నం చ స్థితం కంచిత్కాలం పునః అత్యంతమేవ అసత్త్వమాపద్యతే, తథా చ సత్యసదేవ సత్ జాయతే, సదేవ అసత్త్వం ఆపద్యతే, అభావః భావో భవతి, భావశ్చాభావో భవతీతి, తత్రాభావో జాయమానః ప్రాగుత్పత్తేశ్శశవిషాణకల్పః సమవాయ్యసమవాయినిమిత్తాఖ్యం కారణమపేక్ష్య జాయతే ఇతి, న చైవమభావ ఉత్పద్యతే, కారణం చాపేక్షతే ఇతి శక్యం వక్తుం, అసతాం శశవిషాణాదీనామదర్శనాత్, భావాత్మకాశ్చేత్**

**ఘటాదయః ఉత్పాద్యమానాః, కించిత్ అభివ్యక్తిమాత్రే కారణం అపేక్ష్య ఉత్పద్యంతే ఇతి శక్యం ప్రతిపత్తుం. కిం చ, అసతశ్చ సద్భావే సతశ్చాసద్భావే న క్వచిత్ ప్రమాణప్రమేయవ్యవహారేషు విశ్వాసః కస్యచిత్స్యాత్, 'సత్సదేవాసదేవేతి' నిశ్చయానుపపత్తేః. కించ – ఉత్పద్యతే ఇతి ద్వ్యణుకాదేః ద్రవ్యస్య స్వకారణసత్తాసంబంధం ఆహుః. ప్రాక్ ఉత్పత్తేశ్చ అసత్, పశ్చాత్ కారణవ్యాపారం అపేక్ష్య స్వకారణైః పరమాణుభిః సత్తయా చ సమవాయలక్షణేన సంబంధేన సంబధ్యతే. సంబద్ధం సత్ కారణసమవేతం సత్ భవతి. తత్ర వక్తవ్యం కథం అసతః స్వం కారణం భవేత్, సంబంధః వా కేనచిత్ స్యాత్? న హి వంధ్యాపుత్రస్య స్వం కారణం, సంబంధః వా కేనచిత్ ప్రమాణతః కల్పయితుం శక్యతే.**

**తె.అ.** సమాధానం – ఇది అభాగవతమతం కావడమే ఇందులో దోషం. (భగవానునికి సమ్మతం కాదు కనుక ఇది దోషం.)

ఆక్షేపణ – తమకెట్లా తెలుసు?

సమాధానం – భగవానుడన్నాడు కదా? 'నాసతో విద్యతే భావః' (2.16) వంటి వాక్యాలలో, అసత్తు నుండి సత్తు కలగదు అని. మరి మీరు లేని దానినుండి ఉన్నది రావడం, ఉన్నది లేకుండా పోవడం అనే వాదం చేస్తారు.

ఆక్షేపణ – భగవానుడికి సమ్మతం కాకపోతే మాత్రమేమి? యుక్తియుక్తంగా ఉంది అనుకుంటే ఆ వాదాన్ని ఒప్పుకోవడంలో తప్పేమిటి?

సమాధానం – ఏమిటి తప్పా? వినండి ఇది సర్వప్రమాణాలకు విరుద్ధం కనుక.

ఆక్షేపణ – ఎట్లా?

సమాధానం – ద్వ్యణుకాది ద్రవ్యం ఉత్పత్తికి పూర్వం అత్యంతము అసత్తు, ఎంతమాత్రము లేనిది. అవి ఉత్పన్నమవుతున్నాయి కొంతకాలం ఉంటున్నాయి. మళ్ళీ ఏ మాత్రము లేకుండా పోతున్నాయి. ఈ వాదం ప్రకారం అసత్తు సద్భావం పొందుతున్నది. అభావం భావము భావం అభావము అవుతున్నది. అంటే పుడుతున్న అభావం ఉత్పత్తికి పూర్వం కుందేలు కొమ్మువలె అత్యంతము అసత్తు అయి వుండి సమవాయి అసమవాయి నిమిత్త కారణాల వలన పుడుతున్నది అని అన్నట్లు. కాని ఈ విధంగా అభావం ఉత్పన్నమవుతుందని కాని కారణాన్ని అపేక్షిస్తుందని గాని అనడానికి వీలు లేదు. ఎందుకంటే కుందేటి కొమ్ము విషయంలో ఇవేవీ మనం చూడడం లేదు. (కుందేటికొమ్ము అభావం. అది ఉత్పన్నమవడం కాని దాని ఉత్పత్తికి ఒక కారణం ఉండడం గాని మనం చూడడం లేదు). ఉత్పత్తి చేయబడుతున్న కుండ మొదలైన వస్తువులు

భావరూపంలో ఉంటాయని అభివ్యక్తి మాత్రకారణం చేత ఉత్పన్నమవుతాయని ఒప్పుకోవచ్చు. అంతేకాక, అసత్తు సద్భావము సత్తు అసద్భావము పొందుతుంది అని ఒప్పుకుంటే ఇక ఎవడికీ ప్రమాణ ప్రమేయ వ్యవహారంలో విశ్వాసముండదు. సత్తు సత్తేనని అసత్తు అసత్తేనని నమ్మకమేమిటి? అంతేకాదు, ఉత్పన్నమవుతున్నది అని ద్వ్యణుకాది ద్రవ్యానికి తన కారణంతో సత్తాతో సంబంధం చెపుతున్నారు. ఉత్పత్తికి పూర్వం అసత్తు, తరువాత తన కారణ వ్యాపారం చేత తన కారణమైన పరమాణవులుతోను సత్తాతోను సమవాయ లక్షణమైన సంబంధం కలిగి కారణంతో కలిసిపోయి సత్తు అవుతున్నది. అసత్తుకు సత్తు ఎట్లా కారణం కాగలదో, అసత్తుకు దేనితో గాని సంబంధం ఎట్లా సాధ్యమో వారు (వైశేషికులు) చెప్పవలసి ఉంది. గొడ్రాలి కొడుకుకు సత్తాతో సంబంధం గాని కారణంగాని ఏ ప్రమాణం చేత గాని కల్పించడం సాధ్యం కాదు.

**భాష్యమ్ : 48.4 నను నైవం వైశేషికైః అభావస్య సంబంధః కల్ప్యతే. ద్వ్యణుకాదీనాం హి ద్రవ్యాణాం స్వకారణసమవాయలక్షణః సంబంధః సతామేవ ఉచ్యతే ఇతి. న; సంబంధాత్. ప్రాక్ సత్త్వానభ్యుపగమాత్. న హి వైశేషికైః కులాలదండ చక్రాదివ్యాపారాత్ ప్రాక్ ఘటాదీనామస్తిత్వం ఇష్యతే. న చ మృద ఏవ ఘటాద్యాకారప్రాప్తి - మిచ్ఛంతి. తతశ్చ అసత ఏవ సంబంధః పారిశేష్యాదిష్టో భవతి.**

**తె.అ.** ఆక్షేపణ - వైశేషికులు అభావానికి సంబంధం కల్పించడం లేదే! ఉన్న ద్వ్యణుకాది ద్రవ్యాదులకే తన కారణంతో సమవాయ లక్షణసంబంధం చెపుతారు.

సమాధానం - కాదు. సమవాయ సంబంధం కలుగక పూర్వం ఏదీ ఉన్నదని వారు ఒప్పుకోరు. కుమ్మరి కర్ర చక్రము వాటి పని ప్రారంభించక పూర్వం కుండ మొదలైన వస్తువుల అస్తిత్వం వైశేషికులు ఒప్పుకోరు. మట్టియే కుండ మొదలైన వస్తువుల ఆకారం పొందుతుంది అని కూడా వారు ఒప్పుకోరు. అటువంటప్పుడు పారిశేష్య న్యాయంగా అసత్తుకే సంబంధం చెప్పుకోవలసి ఉంది.

**భాష్యమ్ : 48.5 నను అసతోఽపి సమవాయలక్షణః సంబంధః న విరుద్ధః.**

**న, వంధ్యాపుత్రాదీనామదర్శనాత్. ఘటాదేరేవ ప్రాగభావస్య స్వకారణ సంబంధో భవతీతి న వంధ్యాపుత్రాదేః, అభావస్య తుల్యత్వేఽపి ఇతి విశేషః అభావస్య వక్తవ్యః, ఏకస్య అభావః, ద్వయోః అభావః సర్వస్యాభావః, ప్రాగభావః ప్రధ్వంసాభావః, ఇతరేతరాభావః, అత్యంతాభావః ఇతి చ లక్షణతో న కేనచిద్విశేషో దర్శయితుం శక్యః. అసతి చ విశేషే ఘటస్య**

**ప్రాగభావ ఏవ కులాలాదిభిర్ఘటభావమాపద్యతే సంబధ్యతే చ, భావేన, కపాలాఖ్యేన, స్వకారణేన సంబద్ధశ్చ సర్వవ్యవహారయోగ్యశ్చ భవతి, న తు ఘటస్యైవ ప్రధ్వంసాద్యభావః అభావత్వే సత్యపి ఇతి ప్రధ్వంసా భావానాం న క్వచిత్ వ్యవహారయోగ్యత్వమ్ ప్రాగభావస్యైవ ద్వ్యణుకాదిద్రవ్యాఖ్యస్య ఉత్పత్త్యాది – వ్యవహారార్హత్వం ఇత్యేదసమంజసం, అభావత్వావిశేషాత్ అత్యంతప్రధ్వంసాభావయోరివ.**

**నను నైవ అస్మాభిః ప్రాగభావస్య భావాపత్తిః ఉచ్యతే.**

**భావస్యైవ తర్హి భావాపత్తిః, యథా ఘటస్య ఘటాపత్తిః పటస్య వా పటాపత్తిః ఏతదపి అభావస్య భావాపత్తి వదేవ ప్రమాణ విరుద్ధం.**

**తె.అ.** ఆక్షేపణ – అసత్తుకైనా సమవాయ లక్షణంమైన సంబంధం విరుద్ధం కాదు గదా?

సమాధానం – విరుద్ధమే. గొడ్రాలి కొడుకు వంటి విషయంలో ఇటువంటి సంబంధమేదీ మనం చూడం. రెండూ అభావమే అయినప్పటికీ కుండవంటివాటి విషయంలో మాత్రమే ప్రాగభావానికి తన కారణాలతోటి సంబంధం ఉంటుంది గాని గొడ్రాలి కొడుకు వంటి విషయాలలో ఉండదు అంటారా? మరి ఒక అభావంలో లేని విశేషం మరొక అభావంలో ఏమిటో చెప్పవలసి ఉంది. ఒకదాని అభావం, రెంటి అభావం, సర్వాభావం, ప్రాగభావం, ప్రధ్వంసాభావం, ఇతరేతరాభావం, అత్యంతాభావం – ఈ లక్షణాలను బట్టి అభావంలో ఎటువంటి విశేషము చూపించడం సాధ్యం కాదు. విశేషమేమీ లేనపుడు ఘటం యొక్క ప్రాగభావం మాత్రమే కుమ్మరి మొదలైన వానిద్వారా ఘటభావం పొందుతుంది. కపాలమనే స్వకారణంతో సంబంధం కలిగి సర్వవ్యవహార యోగ్యమవుతుంది కూడాను, కాని అదే ఘటం యొక్క ప్రధ్వంసాభావం, అదీ అభావమే అయినప్పటికీ, ఇట్లా కాదు – అని ఈ విధంగా ప్రధ్వంసాది అభావాలకు ఎటువంటి వ్యవహార యోగ్యత ఒప్పుకోకుండా ద్వ్యణుకాది ద్రవ్యమనే ప్రాగభావానికి మాత్రమే ఉత్పత్తి మొదలైన వ్యవహారార్హతను చెప్పడం అసమంజసం. ఎందుకంటె అత్యంతాభావ ప్రధ్వంసాభావాల వంటిదే ప్రాగభావం కూడాను, అందులో విశేషమేమీ లేదు కనుక.

ఆక్షేపణ – ప్రాగభావం భావం కావడం మేం చెప్పలేదే?

సమాధానం – మరయితే మీరు భావమే భావం కావడం చెపుతున్నారన్నమాట, ఘటం ఘటమవుతుందని పటం పటమవుతుందని. అభావం భావం కావడం ఎంత ప్రమాణ విరుద్ధమో ఇదీ అంతే.

**భాష్యమ్ : 48.6 సాంఖ్యస్యాపి యః పరిణామపక్షః సోఽపి అపూర్వధర్మోత్పత్తివినాశాంగీకరణాత్ వైశేషిక – పక్షాన్న విశిష్యతే, అభివ్యక్తితిరోభావాంగీకరణేఽపి అభివ్యక్తితిరోభావయోః విద్యమానవత్వావిద్యమానత్వనిరూపణే పూర్వవదేవ ప్రమాణవిరోధః. ఏతేన కారణస్యైవ సంస్థానముత్పత్త్యాది ఇత్యేతదపి ప్రత్యుక్తమ్.**

**పారిశేష్యాత్ – సత్ ఏకమేవ వస్త్వవిద్యయోత్పత్తివినాశాదిధర్మైః అనేకధా నటవత్ వికల్ప్యతే ఇతి. ఇదం భాగవతం మతం ఉక్తం, 'నాసతో విద్యతే భావః' (2.16) ఇత్యస్మిన్ శ్లోకే, సత్ప్రత్యయస్య అవ్యభిచారాత్ వ్యభిచారాచ్చ ఇతరేషామితి.**

**తె.అ.** సాంఖ్యుల పరిణామవాదం కూడా పూర్వం లేని ధర్మం ఉత్పత్తి కావడము వినాశము రెండూ అంగీకరించడం చేత వైశేషిక వాదం కంటే విశేషమేమీ కాదు. అభివ్యక్తి తిరోభావాలను అంగీకరించినప్పటికి కూడా వాటి విద్యమానత అవిద్యమానతల నిరూపణంలో పూర్వం వలెనే ప్రమాణవిరోధం ఏర్పడుతుంది. దీనితో, ఉత్పత్తి మొదలైనవి కారణం యొక్క స్థితులేనన్న మతాన్ని ఖండించినట్లయింది. ఇక మిగిలిందేమిటంటే, ఉన్నది ఒకే వస్తువు, అవిద్య వలన ఉత్పత్తి వినాశము మొదలైన ధర్మాలు దానియందు నటుడు అనేక విధాలుగా కనిపించినట్లు కల్పించబడుతున్నవి అని. అదే అభిప్రాయం భగవానుడు 'నాసతో విద్యతే భావః' (2.16) అన్న శ్లోకంలో వ్యక్తం చేశాడు. సత్ప్రత్యయం సదా ఉంటున్నది, తక్కిన వాటి విషయంలో ప్రత్యయం మారుతున్నది. (సత్ప్రత్యయమంటే 'ఉన్నది' అన్న ఎరుక. కుండ ఉన్నది బట్ట ఉన్నది అన్నపుడు కుండ బట్ట మారుతున్నాయి కాని 'ఉన్నది' అన్నది మారటం లేదు.)

**భాష్యమ్ : 48.7 కథం తర్హ్యాత్మనో అవిక్రియత్వే అశేషతః కర్మణస్త్యాగో నోపపద్యత ఇతి?**

**యది వస్తుభూతాః గుణాః. యది వా అవిద్యా కల్పితాః తద్ధర్మః కర్మ, తదాత్మన్యవిద్యయాఽధ్యారోపితమేవేత్యవిద్వాన్) 'న హి కశ్చిత్ క్షణమపి అశేషతస్త్యక్తుం శక్నోతి' (3.5) ఇత్యుక్తమ్. విద్వాంస్తు పునః విద్యయా అవిద్యాయాం నివృత్తాయాం శక్నోత్యేవాశేషతః కర్మ పరిత్యక్తుం అవిద్యాఽధ్యారోపితస్య శేషానుపపత్తేః. న హి తైమిరకదృష్ట్యా అధ్యారోపితస్య ద్విచంద్రాదేస్తిమిరాపగమేఽపి శేషః అవతిష్ఠతే, ఏవం చ సతి ఇదం వచనముపపన్నం 'సర్వ కర్మాణి' మనసా' (5.13) ఇత్యాది, 'స్వే స్వే కర్మణ్యభిరతస్సంసిద్ధిం లభతే నరః', (18.45) 'సకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః' (18.46) ఇతి చ.**

**తె.అ.** ఆక్షేపణ – మరి ఆత్మ అవిక్రియమంటూనే, కర్మలను నిశ్శేషంగా త్యాగం చేయడం సాధ్యం కాదంటారేమిటి?

సమాధానం – శరీరము ఇంద్రియాలు మొదలైన గుణాలు వాస్తవమైనవైనా అవిద్యాకల్పితాలైనా కర్మ వాటి ధర్మం. అప్పుడు అవి ఆత్మయందు అధ్యారోపించబడే ఉంటాయి. కనుక అజ్ఞాని ఎవ్వడూ క్షణం కూడా నిశ్శేషంగా కర్మను త్యజించలేడు అని చెప్పబడింది. కాని జ్ఞాని మాత్రం విద్యచేత అవిద్య తొలగించబడినందున కర్మను నిశ్శేషంగా పరిత్యజించగలడు, అవిద్యచేత అధ్యారోపించబడిన వస్తువేదీ మిగిలిలేదు కనుక. తిమిరరోగమున్నవానికి ఒక చంద్రుడు రెండుగా కనిపిస్తాడు. తిమిరరోగం తొలగిన తరువాత రెండవ చంద్రుడు ఏ కొంచెము మిగిలి ఉండడు. అట్లాగే. కనుక, 'సర్వకర్మాణి మనసా సంన్యస్య' (5.13), 'స్వే స్వే కర్మణ్యభిరతః' (4.5), 'స్వకర్మణా తమభ్యర్చ్య' (4.6) అన్న వాక్యాలలో చెప్పినది యుక్తమే.

**భాష్యమ్ : 49.0 యా కర్మజా సిద్ధిః ఉక్తా జ్ఞాననిష్ఠాయోగ్యతాలక్షణా, తస్యాః ఫలభూతా నైష్కర్మ్యసిద్ధిః జ్ఞాననిష్ఠాలక్షణా చ వ్యక్తవ్యేతి శ్లోకః ఆరభ్యతే –**

**తె.అ.** కర్మానుష్ఠానం చేత జ్ఞాన నిష్ఠాయోగ్యత సిద్ధిస్తుంది అని చెప్పబడింది. జ్ఞాననిష్ఠాయోగ్యత సిద్ధించినదానికి ఫలంగా జ్ఞాననిష్ఠాలక్షణమైన నైష్కర్మ్యసిద్ధి కలుగుతుంది. అది కూడా చెప్పవలెనని ఈ శ్లోకం –

**మూ. అసక్తబుద్ధి స్సర్వత్ర జితాత్మా విగతస్పృహః ।**
**నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసేనాధిగచ్ఛతి ॥ 49**

**తె.అ.** సర్వత్ర ఆసక్తిలేనివాడు, నిరహంకారి, ఫలమును ఆశించనివాడు సంన్యసించి సర్వోత్తమమైన నిష్క్రియమైన ఆత్మ స్థితిని పొందుతాడు.

**భాష్యమ్ : 49.1 అసక్తబుద్ధిః ఇతి. అసక్తబుద్ధిః అసక్తా సంగరహితా బుద్ధిః అంతఃకరణం యస్య సః అసక్తబుద్ధిః సర్వత్ర పుత్రదారాదిషు ఆసక్తినిమిత్తేషు జితాత్మా, జితో వశీకృతః ఆత్మా అంతఃకరణం యస్య స జితాత్మా, విగతస్పృహః విగతా స్పృహా తృష్ణా తదేవజీవితభోగేషు యస్మాత్ సః విగతస్పృహః య ఏవంభూతః ఆత్మజ్ఞః సః నైష్మర్యసిద్ధిం నిర్గతాని కర్మాణి యస్మాత్ నిష్క్రియబ్రహ్మాత్మ సంబోధాత్ స నిష్కర్మా తస్య భావో నైష్కర్మ్యం, నైష్కర్మ్యం చ తత్ సిద్ధిశ్చ సా నైష్కర్మ్యసిద్ధిః నిష్కర్మత్వస్య వా నిష్క్రియాత్మ స్వరూపావస్థానలక్షణస్య సిద్ధిః నిష్పత్తిః, తాం నైష్కర్మ్య సిద్ధిం పరమాం ప్రకృష్టాం కర్మజసిద్ధి విలక్షణాం సద్యోముక్త్యవస్థాన రూపాం, సంన్యాసేన సమ్యగ్దర్శనేన తత్పూర్వకేన వా సర్వకర్మ సంన్యాసేన, అధిగచ్ఛతి ప్రాప్నోతి. తథాచోక్తం – సర్వకర్మాణి మనసా సంన్యస్య, నైవ కుర్వన్న కారయన్నాస్తే' (5.13) ఇతి.**

**తె.అ.** సర్వత్ర అంటే ఆసక్తిని కలిగించే పుత్రదారాదులయందు, అసక్తబుద్ధి–ఆసక్తి లేనివాడు అంతఃకరణంలో సంగము లేనివాడు. జితాత్ముడు అంటే అంతఃకరణాన్ని వశంలో ఉంచుకున్నవాడు. విగతస్పృహుడు దేహజీవిత భోగాదులయందు తృష్ణ తొలగినవాడు. ఇటువంటి ఆత్మజ్ఞుడు నైష్కర్మ్యసిద్ధిని పొందుతాడు. 'నేను నిష్క్రియ బ్రహ్మమును' అన్న బోధ కలగడం చేత ఎవనిని కర్మలు వదలినవో ('ఎవడు కర్మలను వదలెనో అతడు' అనడంలేదు. 'ఎవనిని కర్మలు వదలెనో అతడు' అంటున్నాడు) అతడు నిష్కర్మి. అతని లక్షణం నైష్కర్మ్యం. ఆ నైష్కర్మ్యము సిద్ధి కూడా కలుగుతాయి. లేక, నైష్కర్మ్యం సిద్ధిస్తుంది. నిష్క్రియాత్మ స్వరూపంలో నిలిచి ఉండడమనే ఈ సిద్ధి పరమమైనది, పరమోత్కృష్టమైనది, కర్మానుష్ఠానం వల్ల కలిగే దానికంటె విలక్షణమైనది, సద్యోముక్తి యందు ఉండడమనే ఉత్తమసిద్ధి. ఇది సంన్యాసం చేత కలుగుతుంది, అంటే సమ్యగ్దర్శనం చేత లేక సమ్యగ్దర్శనపూర్వక సర్వకర్మ సంన్యాసం చేత అతడు పొందుతాడు. 'సర్వకర్మాణి మనసా సంన్యస్య', ('నైవ కుర్వన్నకారయన్' (5.13) అని భగవానుడు ఈ మాటే అన్నాడు.

**భాష్యమ్ : 50.0 పూర్వోక్తేన స్వకర్మానుష్ఠానేన ఈశ్వరాభ్యర్చనరూపేణ జనితాం ప్రాగుక్తలక్షణాం సిద్ధిం ప్రాప్తస్యోత్పన్నాత్మవివేకజ్ఞానస్య కేవలాత్మజ్ఞాననిష్ఠారూపా నైష్కర్మ్యలక్షణా సిద్ధిః యేన క్రమేణ భవతి, తద్వక్తవ్యమిత్యాహ –**

**తె.అ.** వెనుక చెప్పిన ఈశ్వరార్చన రూపమైన స్వధర్మానుష్ఠానం వలన జ్ఞాననిష్ఠా యోగ్యత కలుగుతుంది అని చెప్పబడింది. ఆ యోగ్యత కలిగి ఆత్మ విషయక వివేకజ్ఞానం ఉత్పన్నమైనవానికి కేవలాత్మజ్ఞాన నిష్ఠారూపమైన నైష్కర్మ్య లక్షణం గలిగిన సిద్ధి ఏ క్రమంలో కలుగుతుంది అనేది చెప్పడానికి ఈ శ్లోకం –

**మూ. సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాఽఽప్నోతి నిబోధ మే ।**
**సమాసేనైవ కౌంతేయ నిష్ఠా జ్ఞానస్య యా పరా ॥ 50**

**తె.అ.** కౌంతేయా, జ్ఞాననిష్ఠాయోగ్యత సిద్ధించినవాడు జ్ఞాననిష్ఠా పరాకాష్ఠ అయిన బ్రహ్మమును పొందే విధానాన్ని సంక్షేపంగా చెపుతాను, దానిని బట్టి నిశ్చయంగా తెలుసుకో.

**భాష్యమ్ : 50.1 సిద్ధిమితి. సిద్ధిం ప్రాప్తః స్వకర్మణేశ్వరం సమభ్యర్చ్య తత్ప్రసాదజాం కాయేంద్రియాణాం జ్ఞాననిష్ఠాయోగ్యతాలక్షణాం సిద్ధిం ప్రాప్తః – సిద్ధిం ప్రాప్తః ఇతి తదనువాద ఉత్తరార్థః. కిం తదుత్తరం యదర్థః అనువాదః ఇతి ఉచ్యతే – యథా యేన ప్రకారేణ జ్ఞాననిష్ఠారూపేణ బ్రహ్మ పరమాత్మానం ఆప్నోతి. తథా తం ప్రకారం జ్ఞాననిష్ఠాప్రాప్తిక్రమం**

**మే మమ వచనాత్ నిబోధ త్వం నిశ్చయేన అవధారయ ఇత్యేతత్, కిం విస్తరేణ? న ఇత్యాహ – సమాసేనైవ సంక్షేపేణైవ, హే కౌంతేయ, యథా బ్రహ్మ ప్రాప్నోతి తథా నిబోధేతి అనేన యా ప్రతిజ్ఞాతా బ్రహ్మప్రాప్తిః తాం ఇదంతయా దర్శయితుమాహ – 'నిష్ఠా జ్ఞానస్య యా పరా' ఇతి. నిష్ఠా పర్యవసానం పరిసమాప్తిః ఇత్యేతత్, కస్య బ్రహ్మజ్ఞానస్య, యా పరా, సా కీదృశీ? యాదృశం ఆత్మ జ్ఞానం కీదృక్ తత్? యాదృశః ఆత్మా? కీదృశ సః? యాదృశో భగవతా ఉక్తః, (18.17) ఉపనిషద్వాక్యైశ్చ న్యాయతశ్చ.**

**తె.అ.** స్వధర్మానుష్ఠానం చేత ఈశ్వరుని అర్చించి ఆయన అనుగ్రహం చేత దేహేంద్రియాలకు జ్ఞాన నిష్ఠాయోగ్యత సిద్ధించినవాడు ఏ ప్రకారంగా పరమాత్మను పొందుతాడో ఆ జ్ఞాన నిష్ఠాప్రాప్తి క్రమాన్ని చెపుతాను, నా మాట ద్వారా నిశ్చయంగా ఆ క్రమం తెలుసుకో. సవిస్తరంగా చెపుతారా అంటే, లేదు, సంక్షేపంగా అని అంటున్నాడు. బ్రహ్మమును ఏ విధంగా పొందుతాడో ఆ విధం తెలుసుకో అని ఏ బ్రహ్మప్రాప్తిని గురించి ప్రతిజ్ఞ చేశాడో దానిని స్పష్టంగా ప్రదర్శించడం కొరకు పరమోత్కృష్టమైన జ్ఞాననిష్ఠను తెలుసుకో అంటున్నాడు. నిష్ఠ అంటే పర్యవసానము పరిసమాప్తి. బ్రహ్మజ్ఞానం యొక్క పరిసమాప్తిని తెలుసుకో, అది ఎటువంటిది? ఆత్మజ్ఞానమెటువంటిదో అటువంటిదే. ఆ ఆత్మజ్ఞానం ఎటువంటిది? ఆత్మ ఎటువంటిదో అటువంటిది. ఆత్మ ఎటువంటిది? భగవానుడు చెప్పినటువంటిది, ఉపనిషద్వాక్యాలు వర్ణించినటువంటిది, యుక్తిచేత నిర్ణయింపబడినటువంటిది.

**భాష్యమ్ : 50.2 నను విషయాకారం జ్ఞానం. న జ్ఞానవిషయః నాప్యాకారవాన్ ఆత్మేష్యతే క్వచిత్. ననుః 'ఆదిత్యవర్ణం' (శ్వే.ఉ.3.8) 'భారూపః' (ఛాం.ఉ.3.14.2) 'స్వయంజ్యోతిః' (బృ.ఉ. 4.3.9) ఇత్యాకార వత్త్వమాత్మనః శ్రూయతే. న; తమోరూపత్వ ప్రతిషేధార్థత్వాత్ తేషాం వాక్యానామ్ – ద్రవ్యగుణాద్యాకారప్రతిషేధే ఆత్మనః తమోరూపత్వే ప్రాప్తే తత్ప్రతిషేధార్థాని 'ఆదిత్యవర్ణం' ఇత్యాదీని వాక్యాని. 'అరూపం' (కఠ. 3.15) ఇతి చ విశేషతః రూప ప్రతిషేధాత్. అవిషయత్వాచ్చ – 'న సందృశే తిష్ఠతి రూపమస్య న చక్షుషా పశ్యతి కశ్చనైనం. (శ్వే.ఉ.4.20) 'అశబ్దమస్పర్శం' (కఠ.ఉ. 3.15) ఇత్యాదేః, తస్మాత్ ఆత్మాకారం జ్ఞానమిత్యనుపపన్నమ్.**

**కథం తర్హి ఆత్మనః జ్ఞానం? సర్వం హి యద్విషయం యత్ జ్ఞానం తత్తదాకారం భవతి, నిరాకారశ్చ ఆత్మా ఇత్యుక్తం. జ్ఞానాత్మనోశ్చోభయోర్నిరాకారత్వే కథం తద్భావనా నిష్ఠేతి.**

**న అత్యంత నిర్మలత్వాతిస్వచ్ఛత్వాతిసూక్ష్మత్వోపపత్తేః ఆత్మనః. బుద్ధేశ్చాత్మవన్నైరల్యాదుపపత్తేః ఆత్మచైతన్యాకార భాసత్వోపపత్తిః. బుద్ధ్యాభాసం మనః తదాభాసాని ఇంద్రియాణి, ఇంద్రియాభాసశ్చ దేహః. అతః లౌకికైః దేహమాత్రే ఏవ ఆత్మదృష్టి క్రియతే.**

**తె.అ.** ఆక్షేపణ – జ్ఞానం విషయాకారం గదా? మరి ఆత్మ విషయమని గాని దానికి ఆకారముందని గాని ఎవడూ అనడం లేదు గదా?

సమాధానం – 'ఆదిత్యవర్ణం' (శ్వే.ఉ.3.8), 'భారూపః' (ఛాం.ఉ.3.14.2), 'స్వయం జ్యోతిః' (బృ.ఉ.4.39) అని ఈ విధంగా ఆత్మకు ఆకారం చెప్పబడింది. కదా?

ఆక్షేపణ – కాదు. ఆత్మ తమోరూపం కాదు అని చెప్పడానికే పై వాక్యాలు. ద్రవ్య, గుణ ఆకారలు ప్రతిషేధించినపుడు ఇక ఆత్మ తమోరూపమని అనుకునే ప్రమాదమున్నదని దాన్ని తొలగించడం కొరకు 'ఆదిత్యవర్ణమ్' మొదలైన వాక్యాలు. 'అరూపమ్' (క.ఉ.1.3.15) అని ప్రత్యేకించి రూపం లేనిది అని కూడా చెప్పబడింది. 'అతని రూపం ఇంద్రియాల పరిధిలో లేదు. ఎవడూ అతనిని కంటితో చూడలేడు' (శ్వే.ఉ.4.20), 'అశబ్దమ్ అస్పర్శమ్' (క.ఉ.1.3.15) వంటి వాక్యాలు ఆత్మ అవిషయమని చెపుతున్నాయి. కనుక జ్ఞానం ఆత్మాకారమనడం యుక్తియుక్తం కాదు. (ఆత్మ ఎటువంటిదో జ్ఞానమటువంటిదే అనడం కుదరదు అని) అటువంటపుడు ఆత్మజ్ఞానం ఎట్లా కలుగుతుంది? ఏ విషయాన్ని గురించిన జ్ఞానం ఆ విషయాకారంగా ఉంటుంది, మరి ఆత్మ నిరాకారం అని చెప్పబడింది. జ్ఞానము ఆత్మ రెండూ నిరాకారమే అయితే దాని భావనలో నిష్ఠ ఎట్లా కలుగుతుంది?

సమాధానం – కాదు. ఆత్మకు అత్యంత నిర్మలత్వము స్వచ్ఛత సూక్ష్మత్వము ప్రసిద్ధము. బుద్ధికి కూడా ఆత్మతో సమానమైన నైర్మల్యాది లక్షణాలు సిద్ధించి దానికి ఆత్మ చైతన్యాకారమైన ఆభాసం కలుగుతున్నది. ఆత్మయొక్క ఆభాస బుద్ధికి కలిగినట్లు; బుద్ధియొక్క ఆభాస మనసుకు; మనసు యొక్క ఆభాస ఇంద్రియాలకు; ఇంద్రియాభాస దేహానికి కలగడం చేత లోకులు దేహం మాత్రమే ఆత్మ అనే దృష్టిని అవలంబిస్తున్నారు.

**భాష్యమ్ : 50.3 దేహచైతన్యవాదినశ్చ లోకాయతికాః 'చైతన్యవిశిష్టః కాయః పురుషః' ఇత్యాహుః. తథా చాన్యే ఇంద్రియచైతన్యవాదినః, అన్యే మనశ్చైతన్యవాదినః, అన్యే బుద్ధిచైతన్యవాదినః తతోఽప్యాంతరమవ్యక్తమవ్యాకృతాఖ్యం అవిద్యావస్థమాత్మత్వేన ప్రతిపన్నాః కేచిత్. సర్వత్ర బుద్ధ్యాదిదేహాంతే ఆత్మచైతన్యా భాసతా ఆత్మభ్రాంతికారణమిత్యతశ్చ ఆత్మవిషయం జ్ఞానం న విధాతవ్యం, కిం తర్హి? నామరూపాద్య నాత్మాధ్యారోపణ నివృత్తిరేవకార్యా. నాత్మచైతన్యవిజ్ఞానం కార్యం అవిద్యాఽధ్యారోపితసర్వపదార్థాకారైః ఏవ విశిష్టతయా దృశ్యమానత్వాత్ ఇతి. అత ఏవ హి విజ్ఞానవాదినో బౌద్ధాః విజ్ఞానవ్యతిరేకేణ వస్త్వేనాస్తీతి ప్రతిపన్నాః, ప్రమాణాంతర నిరపేక్షతాం చ స్వసంవిదితత్వాభ్యుపగమేన. తస్మాదవిద్యాఽధ్యారోపిత నిరాకరణమాత్రం బ్రహ్మణి కర్తవ్యం, న తు బ్రహ్మవిజ్ఞానే యత్నః, అత్యంతప్రసిద్ధత్వాత్.**

**అవిద్యాకల్పితనామరూపవిశేషాకారపహృతబుద్ధీనాం అత్యంతప్రసిద్ధం సువిజ్ఞేయం ఆసన్నతరమాత్మభూతమప్యప్రసిద్ధం దుర్విజ్ఞేయమతిదూరమన్యదివ చ ప్రతిభాతి అవివేకినాం. బాహ్యాకారనివృత్త బుద్ధీనాం తు లబ్ధగుర్వాత్మప్రసాదానాం నాతః పరం సుఖం సుప్రసిద్ధం సువిజ్ఞేయం స్వాసన్నతరమస్తి, తథాచోక్తం – 'ప్రత్యక్షావగమం ధర్మ్య' (9.2) మిత్యాది.**

**తె.అ.** దేహ చైతన్యవాదులైన లోకాయతికులు కూడా చైతన్యవిశిష్టమైన దేహమే ఆత్మ అంటారు. అట్లాగే కొందరు ఇంద్రియ చైతన్యవాదులు, మరికొందరు బుద్ధిచైతన్యవాదులు. బుద్ధికంటె కూడా ఇంకా లోపల వ్యక్తమయే అవ్యక్తమనే అవిద్యావస్థను ఆత్మ అని ఆశ్రయిస్తారు కొందరు. బుద్ధి మొదలు దేహ పర్యంతము అంతటా ఆత్మ చైతన్యం యొక్క ఆభాస ఇదే ఆత్మ అనే భ్రాంతికి కారణమవుతున్నది. కనుక ఆత్మ విషయమైన జ్ఞానం విధించరానిది. (ఆత్మజ్ఞానం పొందదగును అన్న విధి చేయరానిది) మరేమిటి? నామము రూపము వంటి అనాత్మాధ్యారోపణం తొలగించడం మాత్రమే చేయవలసినది, ఆత్మవిజ్ఞాన చైతన్యం పొందడం కాదు. అవిద్యచేత ఆరోపించబడిన సర్వ పదార్థాల ఆకారమే ఆత్మ అని మనం గ్రహిస్తూ ఉండడం చేత. అందుకనే విజ్ఞానవాదులైన బౌద్ధులు విజ్ఞానం తప్ప మరొక వస్తువేదీ లేదు అంటారు. ఆ జ్ఞానం స్వసంవేద్యమని వారు భావించడం చేత దానికి ప్రమాణాంతరాపేక్ష లేదు. కనుక బ్రహ్మమందు అవిద్యచేత అధ్యారోపించబడినదానిని నిరాకరించడం మాత్రమే కర్తవ్యం. అంతేకాని బ్రహ్మజ్ఞానం కొరకు ఏ ప్రయత్నము చేయపనిలేదు. బ్రహ్మము అత్యంతము ప్రసిద్ధము. (తాడును చూచి పామనుకున్నాం. ఇది పాము అన్న భ్రాంతి తొలగితే చాలు, ఇది తాడు అని తెలియడానికి ప్రత్యేకంగా వేరే ప్రయత్నమేదీ చేయనక్కర్లేదు. ప్రసిద్ధమంటే ఎవరికంటే వారికి ఎప్పుడంటే అప్పుడు ఎక్కడంటే అక్కడ సిద్ధంగా ఉన్నది. అవిద్యా కల్పిత నామరూప భేదంచేత బుద్ధి అపహరింపబడినందున అత్యంత ప్రసిద్ధము సువిజ్ఞేయము, అతిసమీపము, ఆత్మస్వరూపము అయినది కూడా అప్రసిద్ధము, దుర్విజ్ఞేయము, అతిదూరము, అన్యము అయినట్లు అవివేకులకు అనిపిస్తుంది. బుద్ధినుండి బాహ్యాకారం తొలగినవారికి, గురుకృప ఆత్మ ప్రసాదము లభించినవారికి మాత్రం దానికంటె సుఖము, సుప్రసిద్ధము, సువిజ్ఞేయము, అతిసమీపము మరొకటి లేదు. 'ప్రత్యక్షావగమం ధర్మ్యమ్' (9.2) వంటి వాక్యాలలో ఇదే చెప్పబడింది.

**భాష్యమ్ : 50.4 కేచిత్తు పండితంమన్యాః 'నిరాకారత్వాత్ ఆత్మవస్తు న ఉపైతిబుద్ధిః. అతః దుస్సాధ్యాసమ్యక్ జ్ఞాననిష్ఠా' ఇత్యాహుః, సత్యమ్, ఏవం గురుసంప్రదాయరహితానాం అశ్రుత వేదాంతానాం అత్యంత బహిర్విషయాసక్త బుద్ధీనాం సమ్యక్ప్రమాణేషు అకృతశ్రమాణాం. తద్విపరీతానాం తు లౌకికగ్రాహ్యగ్రాహకద్వైతవస్తుని సద్బుద్ధిః నితరాం దుస్సంపాద్యా, ఆత్మచైతన్య**

**వ్యతిరేకేణ వస్త్వంతరస్యానుపలబ్ధేః, యథా చ 'ఏతదేవమేవ, నాన్యథా' ఇతి అవోచామ, ఉక్తం చ భగవతా 'యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః' (2.69) ఇతి. తస్మాత్ బాహ్యాకారభేద బుద్ధిః నివృత్తిరేవ ఆత్మస్వరూపావలంబనకారణం, న హి ఆత్మా నామ కస్యచిత్ కదాచిదప్రసిద్ధః ప్రాప్యః, హేయః. ఉపాదేయో వా, అప్రసిద్ధే హి తస్మిన్ ఆత్మని స్వార్థాః సర్వాః ప్రవృత్తయః వ్యర్థాః ప్రసజ్యేరన్, న చ దేహాద్యచేతనార్థత్వం శక్యం కల్పయితుం, న చ సుఖార్థం సుఖం దుఃఖార్థం దుఃఖం. ఆత్మావగత్యవసానార్థత్వాచ్చ సర్వవ్యవహారస్య, (బ్ర.సూ.3.4.26.27) తస్మాత్ యథా స్వదేహస్య పరిచ్ఛేదాయ న ప్రమాణాంతరపేక్షా తతోఽపి ఆత్మనః అంతరతమత్వాత్ తదవగతిం ప్రతి న ప్రమాణాంతరాపేక్షా. ఇతి ఆత్మజ్ఞాననిష్ఠా వివేకినాం సుప్రసిద్ధేతి సిద్ధమ్.**

**తె.అ.** మేము పండితులం అనుకొనే కొంతమంది ఆత్మవస్తువు నిరాకారంగాన బుద్ధి దానిని పొందజాలదు. అందువలన సమ్యగ్జ్ఞాన నిష్ఠ దుస్సాధ్యమని అంటారు. నిజమే. గురుసంప్రదాయరహితులకు, వేదాంత వాక్యాలను విననివారికి, బహిర్విషయాలపై అత్యంత ఆసక్తి కలిగినవారికి, సరిఅయిన ప్రమాణాలయందు పరిశ్రమ చేయనివారి విషయంలో ఇది నిజమే! కాని తద్విపరీతులకు లోకంలోని గ్రాహ్యగ్రాహక వస్తువులయందు సద్బుద్ధి కలగడం చాలా కష్టం. ఎందుకంటె ఆత్మ చైతన్యంకాని మరొక వస్తువేదీ వారికి కనిపించదు. ఇదింతే మరోవిధం కాదు అని ఇంతకుముందే మేము చెప్పి ఉన్నాము. భగవానుడు కూడా అన్నాడు 'యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః' (2.69) అని. కనుక ఆత్మస్వరూపాన్ని పట్టుకోవాలంటే బాహ్యాకారభేదబుద్ధిని తొలగించడమే మార్గం. అంతేకాని ఎవడికీ ఎన్నటికీ తన ఆత్మ అప్రసిద్ధంగాని, పొందదగినది గాని, వదలదగినది గాని గ్రహించదగినది-గాని కాదు. అదే అప్రసిద్ధమైతే సర్వస్వార్థప్రవృత్తులు వ్యర్థమన్నట్లే. (ఆత్మ కొరకే, అంటే తనకొరకే, ఎవడు ఏం చేసినా. ఆ ఆత్మే అప్రసిద్ధమైనపుడు ఈ కర్మలన్నీ ఎవరికోసం చేస్తున్నట్లు?) దేహాది అచేతనాల కొరకు సర్వప్రవృత్తులు అని కూడా కల్పించలేము. సుఖం కొరకు సుఖము, దుఃఖం కొరకు దుఃఖము అని కూడా అనలేము. ఎందుకంటె సర్వవ్యవహారాలకు ఆత్మను తెలుసుకోవడమే ప్రయోజనం. కనుక, ఇది నా శరీరమని తెలుసుకోవడానికి మరొక ప్రమాణంతో పనిలేనట్లు, అంతకంటె ఇంకా ఆంతర్యంలో ఉన్న ఆత్మను తెలుసుకోవడానికి మరొక ప్రమాణంతో పనిలేదు. కనుక వివేకులకు ఆత్మజ్ఞాననిష్ఠ సుప్రసిద్ధమని తేలింది.

**భాష్యమ్ : 50.5 యేషామపి నిరాకారం జ్ఞానం అప్రత్యక్షం తేషామపి జ్ఞానవశేనైవ జ్ఞేయాఽవగతిరితి జ్ఞానమత్యంత ప్రసిద్ధం సుఖాదిదేవేత్యభ్యుపంగతవ్యం. జిజ్ఞాసానుపపత్తేశ్చ అప్రసిద్ధం చేత్, జ్ఞానం జ్ఞేయవత్ జిజ్ఞాస్యేత. యథా జ్ఞేయం ఘటాదిలక్షణం జ్ఞానేన జ్ఞాతా వ్యాప్తుమిచ్ఛతి**

**తథా జ్ఞానమపి జ్ఞానాంతరేణ జ్ఞాతా వ్యాప్తుమిచ్ఛేత్. న చైతదస్తి, అతః అత్యంతప్రసిద్ధం జ్ఞానం, జ్ఞాతాఽపి అత ఏవ ప్రసిద్ధః ఇతి. తస్మాద్ జ్ఞానే యత్నో న కర్తవ్యః, కిం తు అనాత్మని ఆత్మబుద్ధి నివృత్తావేవ. తస్మాత్ జ్ఞాననిష్ఠా సుసంపాద్యా.**

**తె.అ.** జ్ఞానం నిరాకారము అప్రత్యక్షము అనేవారు కూడా జ్ఞేయం జ్ఞానాధీనమే, కనుక జ్ఞానం సుఖాదులవలె అత్యంతప్రసిద్ధమని అంగీకరించవలెను. అంతేకాదు జిజ్ఞాస లేదు కనుకనూ. (అంటే జ్ఞానాన్ని తెలుసుకోవలెననే కోరిక లేదు కనుకనూ అని). జ్ఞానం అప్రసిద్ధమైతే ఇతర జ్ఞేయ వస్తువులవలె దానిని తెలుసుకోవలెననే కోరిక ఉంటుంది. కుండవంటి జ్ఞేయవస్తువులను జ్ఞాత జ్ఞానం చేత గ్రహించజూచినట్లే జ్ఞానాన్ని కూడా మరొక జ్ఞానం చేత గ్రహించకోరుతాం. కాని అటువంటి కోరిక కలగడం లేదు. కనుక జ్ఞానం అత్యంతప్రసిద్ధము, జ్ఞాత కూడా అదే కారణంగా ప్రసిద్ధము ప్రత్యక్షము. కనుక జ్ఞానంకొరకు యత్నం చేయవలసిన పనిలేదు, అనాత్మబుద్ధిని తొలగిస్తే చాలు. అందుకని జ్ఞాననిష్ఠ సులభసాధ్యము.

**భాష్యమ్ : 51.0 సా ఇయం జ్ఞానస్య పరా నిష్ఠా ఉచ్యతే, కథం కార్యా ఇతి –**

**తె.అ.** ఆ జ్ఞాననిష్ఠ ఏ విధంగా చేయవలెనో చెపుతున్నాడు.

**మూ. బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాఽత్మానం నియమ్య చ ।**
**శబ్దాదీన్ విషయాంస్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ ॥ 51**

**తె.అ.** విశుద్ధమైన బుద్ధి కలిగి ధైర్యంతో తనను అదుపులో ఉంచుకొని, శబ్దాది విషయాలను త్యజించి రాగద్వేషాలను వదలి –

**భాష్యమ్ : 51.1 బుద్ధ్యా ఇతి. బుద్ధ్యా అధ్యవసాయలక్షణయా విశుద్ధయా మాయారహితయా యుక్తః సంపన్నః, ధృత్యా ధైర్యేణ ఆత్మానం కార్యాకరణసంఘాతం నియమ్య చ నియమనం కృత్వా వశీకృత్య, శబ్దాదీన్ శబ్దః ఆదిః ఏషాం తాన్ విషయాన్ త్యక్త్వా సామర్థ్యాత్ శరీరస్థితిమాత్రహేతు– భూతాన్ కేవలాన్ ముక్త్వా తతః అధికాన్ సుఖార్థాన్ త్యక్త్వా ఇత్యర్థః, శరీరస్థిత్యర్థత్వేన ప్రాప్తేషు రాగద్వేషౌ వ్యుదస్య చ పరిత్యజ్య చ. తతః –**

**తె.అ.** విశుద్ధమైన అంటే మాయ తొలగిన నిశ్చయాత్మకమైన విశుద్ధబుద్ధి కలిగినవాడై, ధైర్యంతో కార్యకారణసంఘాతమైన తనను అంటే దేహాన్ని వశంలో ఉంచుకొని శబ్దాదివిషయాలను పరిత్యజించినవాడై అంటే సందర్భాన్ని బట్టి ఇక్కడ శరీరస్థితికి అవసరమైనంతమాత్రమే తప్ప సుఖం కొరకైన అధిక విషయాలను విడిచి అని అర్థం చెప్పుకోవచ్చు. శరీరస్థితికొరకు ప్రాప్తించిన వాటియందు కూడా రాగద్వేషాలు పరిత్యజించి – తరువాత –

**మూ. వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః ।**
**ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః ॥ 52**

**తె.అ.** ఏకాంత స్థలాలలో నివసించేవాడు, మితంగా భుజించేవాడు, వాక్కును శరీరాన్ని మనస్సును వశంలో ఉంచుకున్నవాడు విరాగి నిత్యము ధ్యానయోగపరుడు-

**భాష్యమ్ : 52.1 వివిక్త ఇతి. వివిక్తసేవీ అరణ్యనదీపులినగిరిగుహాదీన్ వివిక్తాన్ దేశాన్ సేవితుం శీలమస్య ఇతి వివిక్తసేవీ, లఘ్వాశీ లఘ్వశనశీలః వివిక్తసేవాలఘ్వశనయోః నిద్రాదిదోష-నివర్తకత్వేన చిత్తప్రసాదహేతుత్వాత్ గ్రహణం యతవాక్కాయమానసః వాక్చ కాయశ్చ మానసం చ యతాని సంయతాని యస్య జ్ఞాననిష్ఠస్య స జ్ఞాననిష్ఠః యతిః యతవాక్కాయమానసః స్యాత్, ఏవముపరత సర్వకరణస్సన్ ధ్యానయోగపరః ధ్యానమాత్మస్వరూపచింతనం యోగః ఆత్మవిషయే ఏకాగ్రీకరణం తౌ ధ్యానయోగౌ పరత్వేన కర్తవ్యౌ యస్య సః ధ్యానయోగపరః, నిత్యం నిత్యగ్రహణం మంత్రజపాద్య న్యకర్తవ్యాభావదర్శనార్థం, వైరాగ్యం విరాగస్య భావో వైరాగ్యం దృష్టాదృష్టేషు విషయేషు వైతృష్ణ్యం సముపాశ్రితః నిత్యమేవ ఇత్యర్థః, కించ.**

**తె.అ.** అరణ్య నదీతీర పర్వత గుహాది ఏకాంతస్థలాలను సేవించే స్వభావం గలవాడు. మితంగా ఆహారం తీసుకునేవాడు. ఏకాంతసేవ, మితాహారము, నిద్రాది దోషాలను తొలగించి చిత్తప్రసాదం కలిగిస్తాయని వాటిని చెప్పడం. వాక్కును, శరీరాన్ని, మనసును వశంలో ఉంచుకొన్న జ్ఞాన నిష్ఠుడైన యతి ఈ విధంగా ఇంద్రియాలనన్నిటిని కర్మలనుండి మరలించినవాడు. ధ్యానయోగ పరుడు, ధ్యానమంటే ఆత్మస్వరూప చింతనం. యోగమంటే ఆత్మ విషయంలోనే ఏకాగ్రత. ఆ ధ్యానయోగాలే ఎవరికి పరమకర్తవ్యమో అతడు ధ్యానయోగపరుడు. నిత్యము అనడం మంత్రము జపము మొదలైన అన్యకర్తవ్యాలేవీ అతనికి ఉండవు అని చెప్పడానికి. ఇహపరభోగాలయందు తృష్ణ తొలగడం వైరాగ్యం. సదా వైరాగ్యాన్ని ఆశ్రయించినవాడు అని అర్థం. అంతేకాదు -

**మూ. అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్ ।**
**విముచ్య నిర్మమః శాన్తో బ్రహ్మభూయాయ కల్పతే ॥ 53**

**తె.అ.** అహంకారము, బలము, దర్పము, కామము, క్రోధము, పరిగ్రహము వదలి మమకారము లేనివాడు, శాంతుడు అయినవాడు బ్రహ్మగా అవడానికి యోగ్యుడు.

**భాష్యమ్ : 53.1 అహంకారమితి. అహంకారమహంకరణం అహంకారః దేహాదిషు తం బలం సామర్థ్యం కామరాగ - సంయుక్తం - న ఇతరత్ శరీరాది సామర్థ్యం, స్వాభావికత్వేన తత్త్యాగస్యాశక్యత్వాత్ - దర్పం, దర్పో నామ హర్షానంతరభావీ ధర్మాతిక్రమహేతుః, హృష్టో**

**దృప్యతి దృప్తో ధర్మమతిక్రామతి (ఆప.ధ.1.13.4) ఇతి స్మరణాత్, తం చ కామం ఇచ్ఛాం క్రోధం ద్వేషం, పరిగ్రహం ఇంద్రియమనోగత దోషపరిత్యాగేఽపి శరీరధారణ ప్రసంగేన ధర్మానుష్ఠాననిమిత్తేన వా బాహ్యః పరిగ్రహః ప్రాప్తః తం చ విముచ్య పరిత్యజ్య పరమహంస పరివ్రాజకోభూత్వా, దేహజీవనమాత్రేఽపి నిర్గతమమభావః నిర్మమః అత ఏవ శాంతః ఉపరతః యస్సంహృత హర్షాయాసః యతిః జ్ఞాననిష్ఠః బ్రహ్మభూయాయ బ్రహ్మభవనాయ కల్పతే సమర్థో భవతి. అనేన క్రమేణ –**

**తె.అ.** దేహేంద్రియాలే నేను అనుకోడం అహంకారం. బలమంటే ఇక్కడ కామము రాగములతో కలిగిన సామర్థ్యం, శరీరాదులకు స్వాభావికమైన సామర్థ్యం కాదు. స్వాభావికమైన సామర్థ్యాన్ని త్యజించలేము. దర్పమంటే హర్షం తరువాత కలిగేది, ధర్మాన్ని అతిక్రమింపజేసేది. 'హర్షం కలిగిన వానికి దర్పం కలుగుతుంది, దర్పం కలిగిన వాడు ధర్మాన్ని అతిక్రమిస్తాడు' (ఆప.ధ.సూ. 1.13.4) అని స్మృతి కూడా ఉంది. కామమంటే కోరిక, క్రోధమంటే ద్వేషం. ఇంద్రియ మనోగత దోషాలను త్యాగం చేసినప్పటికీ, శరీర ధారణకు, ధర్మానుష్ఠానానికి అవసరమైన బాహ్యవస్తువులను సంగ్రహించడం పరిగ్రహం. వీటినన్నిటిని వదలి పరమహంస పరివ్రాజకుడై దేహంయొక్క జీవన విషయంలో కూడా మమకారం లేకుండా శాంతుడై, జ్ఞాననిష్ఠుడై అన్ని ఆయాసాలు వదలిన యతి బ్రహ్మమవడానికి యోగ్యుడు. ఈ విధంగా –

**మూ. బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి ।**
**సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్ ॥ 54**

**తె.అ.** బ్రహ్మమును పొందినవాడు ప్రసన్నాత్ముడు శోకించడు కోరడు. సర్వభూతములయందు సముడై నా యందు పరమభక్తిని పొందుతాడు.

**భాష్యమ్ : 54.1 బ్రహ్మభూతఇతి. బ్రహ్మభూతః బ్రహ్మప్రాప్తః, ప్రసన్నాత్మా లబ్ధాధ్యాత్మ ప్రసాదభావః న శోచతి కించిదర్థ – వైకల్యమాత్మనః వైగుణ్యం వోద్దిశ్య న శోచతి న సంతప్యతే. న కాంక్షతి న హ్యప్రాప్తవిషయాకాంక్షా బ్రహ్మవిదః ఉపపద్యతే అతః బ్రహ్మభూతస్యాయం స్వభావః అనూద్యతే. 'న శోచతి నకాంక్షతీతి'. 'న హృష్యతీ' తి వా పాఠాంతరం సమస్సర్వేషు భూతేషు, ఆత్మౌపమ్యేవ సర్వభూతేషు సుఖం దుఃఖం వా సమమేవ పశ్యతి ఇత్యర్థః, న ఆత్మ సమదర్శనం ఇహ, తస్య వక్ష్యమాణత్వాత్ 'భక్త్యా మామభిజానాతి' (18.55) ఇతి. ఏవంభూతః జ్ఞాననిష్ఠః మద్భక్తిం మయి పరమేశ్వరే భక్తిం భజనం పరమేశ్వరే భక్తిం భజనం పరాముత్తమాం జ్ఞానలక్షణాం చతుర్థీం లభతే 'చతుర్విధా భజంతే మాం' ఇత్యుక్తమ్.**

**తె.అ.** బ్రహ్మమును పొందినవాడు అధ్యాత్మ ప్రసాదమును పొంది దేనికీ శోకించడు. దేనినీ కోరడు. అంటే ఆర్థికంగా నష్టపోయినపుడు గాని తనలో ఏదైనా గుణం లోపించినపుడు గాని శోకించడు, లేనిదానిని కోరడు అని. బ్రహ్మభూతుడైనవాని స్వభావమిది అని, 'శోకించడు కోరడు' అని ఉన్నమాటే మళ్ళీ చెపుతున్నాడు. బ్రహ్మవేత్తకు ప్రాప్తించని విషయంలో వాంఛ ఉండడం అసంభవం. 'న కాంక్షతి' (కోరడు) అనేచోట 'న హృష్యతి' (హర్షము పొందడు) అని వేరే పాఠం కూడా వుంది. సర్వభూతములయందు సముడు, సర్వభూతములకు సుఖము దుఃఖము తనకు వలెనే అని భావించేవాడు. ఇక్కడ ఆత్మ సమదర్శనం చెప్పడం లేదు. అది 'భక్త్యా మామభిజానాతి' అని తరువాతి శ్లోకంలో చెప్పబోతున్నాడు. ఇటువంటి జ్ఞాననిష్ఠుడు పరమేశ్వరుడైన నాయందు 'చతుర్విధా భజన్తే మామ్' (7.16) అని చెప్పబడిన నాలుగవ విధమైన జ్ఞానలక్షణమైన ఉత్తమభక్తిని పొందుతాడు.

**భాష్యమ్ : 55.0 తతః జ్ఞానలక్షణయా –**

**తె.అ.** ఈ జ్ఞానలక్షణమైన –

**మూ. భక్త్యా మామభిజానాతి యావాన్యశ్చాస్మి తత్త్వతః ।**
**తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్ ॥ 55**

**తె.అ.** భక్తిచేత నేనెంతటివాడనో, ఎట్టివాడనో నన్ను యథార్థంగా తెలుసుకుంటాడు. అప్పుడు నన్ను యథార్థంగా తెలుసుకొని ఆ తరువాత నాయందు ప్రవేశిస్తాడు.

**భాష్యమ్ : 55.1 భక్త్యా ఇతి. భక్త్యా మామభిజానాతి, యావాన్ అహం ఉపాధికృతవిస్తర-భేదః, యశ్చ అహం అస్మి విధ్వస్తసర్వోపాధిభేదః, ఉత్తమః పురుషః ఆకాశకల్పః తం మామద్వైతం చైతన్యమాత్రైకరసం అజరం అమరం అభయమనిధనం తత్త్వతః అభిజానాతి. తతః మాం ఏవం తత్త్వతః జ్ఞాత్వా విశతే తదనంతరం మామేవ జ్ఞానానంతరం, నాత్ర జ్ఞానాంతరప్రవేశక్రియే భిన్నే వివక్షితే 'జ్ఞాత్వా విశతే తదనంతరం' ఇతి, కిం తర్హి? ఫలాంతరాభావాత్ జ్ఞానమాత్రమేవ. 'క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి' (13.2) ఇతి ఉక్తత్వాత్.**

**తె.అ.** భక్తిచేత నన్ను యథార్థంగా తెలుసుకుంటాడు. నేనెంత, ఉపాధుల వలన నాకు కలిగిన విస్తారము; నేనెవరు, సర్వ ఉపాధులు తొలగి ఆకాశంతో సమమైన పురుషోత్తముడైన నన్ను, అద్వితీయుడు, కేవలం చైతన్యస్వరూపుడు, పుట్టుక, ముసలితనం, మరణం, భయం, నాశనంలేనివాడనని తెలుసుకుంటాడు. అంతటా నన్ను యథార్థంగా తెలుసుకుని అంటే జ్ఞానం కలిగిన తరువాత నాయందే ప్రవేశిస్తాడు. 'తెలుసుకొని ఆ తరువాత ప్రవేశిస్తాడు' అనడంలో

తెలుసుకోవడము ప్రవేశించడము అని రెండు భిన్నక్రియలను ఉద్దేశించలేదు. మరేమిటి? మరొక ఫలం లేదు కనుక జ్ఞానమొకటే ఇక్కడ చెప్పబడింది, 'క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి' అని చెప్పబడింది ఉండడం చేత.

**భాష్యమ్ : 55.2 నను విరుద్ధమిదముక్తం, "జ్ఞానస్య యా పరా కాష్ఠా తయా మాం అభిజానాతి" ఇతి. కథం విరుద్ధమితి చేత్, ఉచ్యతే – యదైవ యస్మిన్ విషయే జ్ఞానముత్పద్యతే జ్ఞాతుః, తదైవం తం విషయమభిజానాతి జ్ఞాతా ఇతి న జ్ఞాననిష్ఠాం జ్ఞానావృత్తిలక్షణాం అపేక్షతే ఇతి, అతశ్చ జ్ఞానేన న అభిజానాతి, జ్ఞానావృత్త్యా తు జ్ఞాననిష్ఠయా అభిజానాతీతి. నైష దోషః, జ్ఞానస్య స్వాత్మోత్పత్తిపరిపాకహేతుయుక్తస్య ప్రతిపక్ష విహీనస్య యత్, ఆత్మానుభవనిశ్చ యావసానత్వం తస్య నిష్ఠాశబ్దాభిలాషాత్. శాస్త్రాచార్యోపదేశేన జ్ఞానోత్పత్తి పరిపాకహేతుం సహకారి కారణం బుద్ధి విశుద్ధత్వాద్యమానిత్వాది గుణం (13.7) చాపేక్ష్య జనితస్య క్షేత్రజ్ఞపరమాత్మైకత్వ జ్ఞానస్య కర్తృత్వాదికారకభేదబుద్ధినిబంధనసర్వకర్మసంన్యాససహితస్య స్వాత్మానుభవనిశ్చయరూపేణ యదవస్థానం సా పరా జ్ఞాననిష్ఠా ఇత్యుచ్యతే. సేయం జ్ఞాననిష్ఠా ఆర్తాదిభక్తిత్రయాపేక్షయా పరా చతుర్థీ భక్తిరిత్యుక్తా. (7.17) తయా పరయా భక్త్యా భగవంతం తత్త్వతః అభిజానాతి, యదనంతరమేవ ఈశ్వరక్షేత్రజ్ఞభేదబుద్ధిః అశేషతః నివర్తతే. అతః జ్ఞాననిష్ఠాలక్షణయా భక్త్యా మామభిజానాతీతి వచనం న విరుధ్యతే, తత్ర చ సర్వం నివృత్తివిధాయి శాస్త్రం వేదాంతేతిహాసపురాణస్మృతిలక్షణం న్యాయప్రసిద్ధం అర్థవత్ భవతి – 'విదిత్వా ... వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరంతి (బృ.ఉ.3.5.1), తస్మాంన్యాసమేషాం తపసామతిరిక్తమాహుః' (మహా.నా.ఉ.24.1), 'న్యాస ఏవాత్యరేచయత్' (మహా.నా.ఉ.21.2) ఇతి. 'సంన్యాసః కర్మణాం న్యాసః' (18.2) 'వేదానిమం లోకమముం చ పరిత్యజ్య', (ఆప. ధ.2.23.13) 'త్యజ ధర్మమధర్మం చ' (శాం.ప.329.40; 331.44) ఇత్యాది. ఇహ చ (5.13) ప్రదర్శితాని వాక్యాని, న చ తేషాం వాక్యానాం ఆనర్థక్యం యుక్తం, న చ అర్థవాదత్వం, స్వప్రకరణస్థత్వాత్, ప్రత్యగాత్మ – విక్రియస్వరూపనిష్ఠత్వాచ్చ మోక్షస్య, న హి పూర్వసముద్రం జిగమిషోః ప్రాతిలోమ్యేన ప్రత్యక్సముద్రజిగమిషుణా సమానమార్గత్వం సంభవతి. ప్రత్యగాత్మవిషయ ప్రత్యయసంతానకరణాభినివేశశ్చ జ్ఞాననిష్ఠా సా చ ప్రత్యక్సముద్ర గమనవత్ కర్మణా సహభావిత్వేన విరుధ్యతే. పర్వతసర్షపయోరివ అంతరవాన్ విరోధః ప్రమాణవిదాం నిశ్చితః. తస్మాత్ సర్వకర్మసంన్యాసేనైవ జ్ఞానినష్ఠా కార్యా ఇతి సిద్ధమ్.**

**తె.అ.** ఆక్షేపణ – 'పరమమైన జ్ఞాననిష్ఠచేత నన్ను తెలుసుకుంటాడు' అనడం విరుద్ధంగా లేదా? ఏమిటి విరుద్ధమంటారా? వినండి, జ్ఞాతకు ఏ విషయంలో ఎప్పుడు జ్ఞానం కలుగుతుందో

అప్పుడే వెంటనే ఆ విషయం అతడు తెలుసుకుంటాడు. దానికొక జ్ఞాననిష్ఠ అవసరంలేదు. జ్ఞానం ఆవృత్తి కానక్కర్లేదు, అంటే ఆ జ్ఞానం మళ్ళీ మళ్ళీ కలుగుతూ ఉండనక్కర్లేదు. మరి ఇక్కడ మీరు జ్ఞానం చేత తెలుసుకుంటాడు అనడం లేదు, జ్ఞానావృత్తిచేత, జ్ఞాననిష్ఠచేత తెలుసుకుంటాడు అంటున్నారు.

సమాధానం - ఇది దోషం కాదు. నిష్ఠ అంటే ఆత్మానుభవం నిశ్చయపూర్వకంగా అంచులు అందుకోవడమే. ఆ అనుభవానికి ఎదురుప్రశ్నలేదు, ఇక ఏ సందేహము దానిని బాధించదు. ఎందుకంటె ఉదయించిన ఆత్మజ్ఞానం దానితో పరిపాకానికి వస్తుంది కనుక. శాస్త్రాచార్యోపదేశం చేత, జ్ఞానోదయానికి దాని పరిపాకానికి హేతువులై సహకారులైన విశుద్ధబుద్ధి అమానిత్వాదిగుణాల కారణంగా క్షేత్రజ్ఞుడు పరమాత్మ ఒకటేనన్న జ్ఞానం కలుగుతుంది. ఆ జ్ఞానంలో కర్తృత్వాది కారకభేద బుద్ధి తొలగి సర్వకర్మ సంన్యాససహితమైన స్వాత్మానుభవం నిశ్చయరూపంగా నిలుస్తుంది. ఆ నిలవడాన్నే పరమజ్ఞాననిష్ఠ అంటున్నాడు. 'ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ' (7.17) అని చెప్పిన మూడువిధాలైన భక్తితో పోల్చి నాలుగవదైన జ్ఞానికిగల భక్తినే ఇక్కడ జ్ఞాననిష్ఠ అంటున్నాడు. అటువంటి పరమభక్తితో భగవంతుని యథార్థంగా తెలుసుకుంటాడు, వెంటనే ఈశ్వరుడు క్షేత్రజ్ఞుడు వేరు అన్న బుద్ధి నిశ్శేషంగా తొలగిపోతుంది. కనుక జ్ఞాననిష్ఠాలక్షణమైన భక్తిచేత నన్ను గుర్తెరుగును అన్న వాక్యం విరుద్ధం కాదు. ఈ విధంగా వ్యాఖ్యానించినపుడే నివృత్తిని విధించే వేదాంత ఇతిహాస పురాణ స్మృతిరూపమైన సర్వశాస్త్రము సార్థకమవుతుంది. 'తెలుసుకొని ... ఇక లేచి భిక్షాటనం చేస్తారు' (బృ.ఉ.3.5.1), 'అన్ని తపముల కన్న సంన్యాసమే మేలని అంటారు' (మహా.నా.ఉ.24.1), 'సంన్యాసమే మిన్న' (మహా.నా.ఉ.21.2) అని, 'వేదాలను ఇహపరాలను పరిత్యజించి' (ఆప.ధ.2.23.13), 'ధర్మాన్ని అధర్మాన్ని కూడా వదలు' (శాం.ప.329.40, 331.44) అని, ఇంకా ఈ గీతలో (5.13), కూడా ఇటువంటి వాక్యాలున్నాయి. ఈ వాక్యాలు వ్యర్థమైనవి అనలేము. ఆ వాక్యాలు సంన్యాసాన్ని గొప్ప చేయడానికి ఊరకే చెప్పారు అనడానికి కూడా లేదు, ఎందుకంటే అవి సందర్భంలో సరిపోతున్నాయి. అదేకాదు, మోక్షమంటే అంతరాత్మ అవిక్రియ స్వరూపంలో ఉండిపోవడమే. తూర్పుసముద్రంవైపు వెళ్ళదలచినవాడు వెనక్కు తిరిగి పడమటి సముద్రం వైపు వెళ్ళదలచినవానితో కలిసి ఎట్లా నడుస్తాడు? అంతరాత్మ విషయమైన ఎరుక నిరంతరంగా కొనసాగించడంలో రుచియే జ్ఞాననిష్ఠ. ఆ జ్ఞాననిష్ఠకు కర్మకు చుక్కెదురు. ఒకటి తూర్పు మరొకటి పడమర. ఆ రెంటికి పర్వతానికి ఆవగింజకు ఉన్నంత అంతరమని ప్రమాణ విదులు నిశ్చయించారు. కనుక సర్వకర్మ సంన్యాసం చేతనే జ్ఞాననిష్ఠ సాధించదగును అని తేలింది.

**భాష్యమ్ : 56.0 స్వకర్మణా భగవతః అభ్యర్చనభక్తియోగస్య సిద్ధిప్రాప్తిః ఫలం జ్ఞాననిష్ఠా-యోగ్యతా, యన్నిమిత్తా జ్ఞాననిష్ఠా మోక్షఫలావసానా. సః భగవద్భక్తియోగః అధునా స్తూయతే శాస్త్రార్థోపసంహారప్రకరణే శాస్త్రార్థ నిశ్చయదార్ఢ్యాయ –**

**తె.అ.** భక్తియోగమంటే స్వకర్మానుష్ఠానం చేత భగవంతుని అర్చించడం. ఆ భక్తియోగానికి ఫలం జ్ఞాననిష్ఠాయోగ్యత కలగడం. జ్ఞాననిష్ఠ మోక్షఫలంతో ముగుస్తుంది. అటువంటి మోక్షఫలమిచ్చే భగవద్భక్తి యోగాన్ని శాస్త్రార్థాన్ని ఉపసంహరించే ఈ సందర్భంలో శాస్త్రార్థ నిశ్చయం దృఢం చేయడానికి ఇప్పుడు స్తుతిస్తున్నాడు –

**మూ. సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః ।**
**మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్ ॥ 56**

**తె.అ.** నన్నే ఆశ్రయించినవాడు సర్వకర్మలు సదా చేస్తూ ఉన్నప్పటికి నా అనుగ్రహం వలన శాశ్వతమూ, నాశరహితమూ అయిన పదము పొందుతాడు.

**భాష్యమ్ : 56.1 సర్వకర్మాణి ఇతి. సర్వకర్మాణ్యపి ప్రతిషిద్ధాన్యపి సదా కుర్వాణః అనుతిష్ఠన్, మద్వ్యపాశ్రయః అహం వాసుదేవః ఈశ్వరః వ్యపాశ్రయో వ్యపాశ్రయణం యస్య సః మద్వ్య-పాశ్రయః, మయ్యర్పిత సర్వాత్మ భావః ఇత్యర్థః సోఽపి మత్ప్రసాదాత్ మమ పరమేశ్వరస్య ప్రసాదాత్ అవాప్నోతి శాశ్వతం నిత్యం వైష్ణవపదమవ్యయమ్ యస్మాదేవం తస్మాత్–**

**తె.అ.** నన్నే ఆశ్రయించినవాడు, వాసుదేవుడు ఈశ్వరుడు అయిన నాయందు సర్వాత్మ భావం కలిగి వున్నవాడు, సర్వకర్మలు అంటే ప్రతిషిద్ధమైన కర్మలు కూడా చేస్తూ ఉన్నవాడైనప్పటికి ఈశ్వరుడనైన నా అనుగ్రహం వలన నిత్యము, అవ్యయము అయిన వైష్ణవపదమును పొందుతాడు. కనుక –

**మూ. చేతసా సర్వకర్మాణి మయి సంన్యస్య మత్పరః ।**
**బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్తః సతతం భవ ॥ 57**

**తె.అ.** సర్వకర్మలు వివేకంతో నాకు వదలి, నన్ను ఉత్తమగతిగా భావించి బుద్ధియోగాన్ని ఆశ్రయించి సతతము నాయందు చిత్తం ఉంచు.

**భాష్యమ్ : 57.1 చేతసా ఇతి. చేతసా వివేకబుద్ధ్యా, సర్వకర్మాణి దృష్టాదృష్టార్థాని మయి ఈశ్వరే సంన్యస్య 'యత్కరోషి యదశ్నాసి' ఇత్యుక్తన్యాయేన మత్పరః అహం వాసుదేవః పరో యస్య తవ సః త్వం మత్పరః సన్ మయ్యర్పిత సర్వాత్మభావః బుద్ధియోగం సమాహితబుద్ధిత్వం**

**బుద్ధియోగః తం బుద్ధియోగం అపాశ్రిత్య అపాశ్రయః అనన్య - శరణత్వం మచ్చిత్తః మయ్యేవ చిత్తం యస్య తవ సః త్వం మచ్చిత్తః సతతం సర్వదా భవ.**

**తె.అ.** ఇహపర ప్రయోజనం గల సర్వకర్మలు వివేకబుద్ధితో, 'యత్కరోషి యదశ్నాసి' (9.27) అన్నట్టు ఈశ్వరుడనైన నాకు వదలి వాసుదేవుడైన నన్నే పరమునిగా భావించి నాయందు బుద్ధిని స్థిరం చేయడమనే బుద్ధియోగాన్ని ఆశ్రయించి అంటే నీవు తప్ప మరి వేరు లేదు అని శరణుచెంది, సతతము చిత్తం నాయందు నిలుపు.

**మూ. మచ్చిత్తః సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి ।**
**అథ చేత్త్వమహంకారాన్న శ్రోష్యసి వినఙ్క్ష్యసి ॥ 58**

**తె.అ.** నాయందు చిత్తముంచినట్లయితే నా అనుగ్రహం చేత దాటరాని కష్టాలు దాటగలవు. లేక అహంకారం చేత నా మాట విననట్లయితే వినాశం చెందగలవు.

**భాష్యమ్ : 58.1 మచ్చిత్తః ఇతి. మచ్చిత్తః సర్వదుర్గాణి సర్వాణి దుస్తరాణి సంసార హేతుజాతాని మత్ప్రసాదాత్ తరిష్యసి అతిక్రమిష్యసి. అథ చేత్ యది త్వం మదుక్తం అహంకారాత్ 'పండితః అహం' ఇతి న శ్రోష్యసి న గ్రహీష్యసి, తతః త్వం వినంక్ష్యసి వినాశం గమిష్యసి.**

**తె.అ.** నాయందు చిత్తముంచి నా అనుగ్రహం చేత దుస్తరమైన సంసార కారణాలనన్నిటిని దాటగలవు. లేక నీవు నేను పండితుడను అనే అహంకారంతో నే చెప్పినదానిని విననట్లయితే గ్రహించనట్లయితే వినాశం చెందుతావు.

**భాష్యమ్ : 59.0 ఇదం చ త్వయా న మంతవ్యం స్వతంత్రః అహం, కిమర్థం పరోక్తం కరిష్యామి?**

**తె.అ.** 'నేను స్వతంత్రుణ్ణి, మరొకడు చెప్పింది నేనెందుకు చేయవలె' అని నీవు అనుకోరాదు.

**మూ. యదహంకారమాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే ।**
**మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి ॥ 59**

**తె.అ.** 'నేను యుద్ధం చేయను' అని అహంకారంతో నీవు అనుకుంటే ఆ నిశ్చయం మిథ్య అవుతుంది. ఎందుకంటే నీ స్వభావం నిన్ను నియోగిస్తుంది.

**భాష్యమ్ : 59.1 యద్యహంకారం ఇతి. యది చేత్ త్వం అహంకారం ఆశ్రిత్య న యోత్స్యే ఇతి న యుద్ధం కరిష్యామి ఇతి మన్యసే చింతయసి నిశ్చయం కరోషి, మిథ్యా ఏషః వ్యవసాయః నిశ్చయః తే తవ, యస్మాత్ ప్రకృతిః క్షత్రియస్వభావః త్వాం నియోక్ష్యతి. యస్మాచ్చ-**

**తె.అ.** నీవు అహంకారం చేత నేను యుద్ధం చేయను అని నిశ్చయించుకుంటే ఆ నిశ్చయం నిలువదు. అది మిథ్య అవుతుంది. ఎందుకంటె నీ క్షత్రియ స్వభావం నిన్ను నియోగిస్తుంది, నీ చేత యుద్ధం చేయిస్తుంది. ఎందుకంటే –

**మూ.** **స్వభావజేన కౌంతేయ నిబద్ధః స్వేన కర్మణా ।**
**కర్తుం నేచ్ఛసి యన్మోహాత్ కరిష్యస్యవశోఽపి తత్ ॥ 60**

**తె.అ.** కౌంతేయా! స్వభావసిద్ధమైన స్వకర్మచేత నీవు బద్ధుడవు. మోహం చేత కర్మచేయవలెనని నీవు కోరకపోయినప్పటికి నీవు అవశుడవై ఆ కర్మ చేస్తావు.

**భాష్యమ్ : 60.1 స్వభావజేన ఇతి. స్వభావజేన శౌర్యాదినా యథోక్తేన కౌంతేయ! నిబద్ధః నిశ్చయేన బద్ధః స్వేన ఆత్మీయేన కర్మణా కర్తుం న ఇచ్ఛసి యత్ కర్మ మోహాత్ అవివేకతః కరిష్యసి అవశః అపి పరవశః ఏవ తత్ కర్మ. యస్మాత్ –**

**తె.అ.** అర్జునా, వెనుక చెప్పిన శౌర్యాది స్వభావం చేత నిర్ణయింపబడిన స్వకీయకర్మ నిన్ను గట్టిగా బంధించి వుంది. (అంటే నీవు అనుకుంటున్నట్టు నీవు స్వతంత్రుడవుగావు, బద్ధుడవు, అని.) మోహం చేత నీవు కర్మ చేయడానికి ఇష్టపడకపోయినప్పటికి అవశుడవై ఆ కర్మ చేస్తావు. (కర్మ చేయకపోవడం నీ వశం కాదు) ఎందుకంటే –

**మూ.** **ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి ॥**
**భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా ॥ 61**

**తె.అ.** అర్జునా, ఈశ్వరుడు సమస్తప్రాణుల హృదయదేశంలో ఉంటాడు. ఉండి, సమస్త ప్రాణులను యంత్రంమీద (కట్టెబొమ్మల రాట్నం మీద) బొమ్మలను త్రిప్పినట్లు త్రిప్పుతూ ఉంటాడు.

**భాష్యమ్ : 61.1 ఈశ్వరః ఇతి. ఈశ్వరః ఈశనశీలః నారాయణః సర్వభూతానాం సర్వప్రాణినాం హృద్దేశే హృదయదేశే అర్జున శుక్లాంతరాత్మస్వభావ! విశుద్ధాంతఃకరణ – 'అహశ్చ కృష్ణమహరర్జునం చ' (ఋ.సం.6.9.1) ఇతి దర్శనాత్ – తిష్ఠతి స్థితిం లభతే. తేషు సః కథం తిష్ఠతీతి? ఆహ – భ్రామయన్ భ్రమణం కారయన్ సర్వభూతాని యంత్రారూఢాని యంత్రాణి ఆరూఢాని అధిష్ఠితాని ఇవ – ఇతి ఇవశబ్దః అత్ర ద్రష్టవ్యః – యథా దారుకృతపురుషాదీని యంత్రారూఢాని. మాయయా ఛద్మనా భ్రామయన్ తిష్ఠతి ఇతి సంబంధః.**

**తె.అ.** ప్రభువైన నారాయణుడు సమస్త ప్రాణుల హృదయదేశంలో ఉంటాడు. ఎట్లా ఉంటాడు? యంత్రములకు అమర్చిన పురుషుల కొయ్యబొమ్మలను మాయచేత త్రిప్పినట్లు సమస్త ప్రాణులను

భ్రమింపచేస్తూ ('భ్రామయన్' అంటే త్రిప్పుతూ అని, భ్రమ కలిగిస్తూ అని కూడా అర్థాలు చెప్పుకోవచ్చు. ఇక్కడ భ్రమే ముఖ్యార్థం. ఈశ్వరుడు త్రిప్పితే తిరిగే కీలుబొమ్మ తనే తిరుగుతున్నాననుకోడం భ్రమ.) ఉంటాడు. ఇక్కడ 'ఇవ' (వలె) అనే పదం చేర్చుకోవలెను. 'కొయ్యబొమ్మలనువలె' అని.

**మూ. తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత ।**
**తత్ప్రసాదాత్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ ॥ 62**

**తె.అ.** భారతా! ఆ ఈశ్వరుణ్ణే సర్వభావంతో శరణు చెందు. ఆయన అనుగ్రహం వలన పరమశాంతిని శాశ్వతస్థానమును పొందగలవు.

**భాష్యమ్ : 62.1 తమేవ ఇతి. తమ్ ఏవ ఈశ్వరం శరణం ఆశ్రయం సంసారార్తిహరణార్థం గచ్ఛ ఆశ్రయ సర్వభావేన సర్వాత్మనా హే భారత! తతః తత్ప్రసాదాత్ ఈశ్వరానుగ్రహాత్ పరాం ప్రకృష్టాం శాంతి ఉపరతిం స్థానం చ మమ విష్ణోః పరమం పదం ప్రాప్స్యసి శాశ్వతం నిత్యమ్.**

**తె.అ.** ఆ ఈశ్వరుణ్ణే నీవు సంసారకష్టం తొలగించుకోవడం కొరకు సర్వాత్మభావంతో ఆశ్రయించు. అప్పుడు ఈశ్వరానుగ్రహం వలన పరమశాంతిని, ఉపరతిని, శాశ్వతమైన నా విష్ణుపదమును కూడా పొందగలవు.

**మూ. ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా ।**
**విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు ॥ 63**

**తె.అ.** ఈ విధంగా రహస్యాలలోకెల్లా అతి రహస్యమైన జ్ఞానం నీకు నేను చెప్పాను. దానిని నీవు పూర్తిగా ఆలోచించి నీకు ఏది చేయవలెనని తోస్తే అది చేయి.

**భాష్యమ్ : 63.1 ఇతి ఇతి. ఇతి ఏతత్ తే తుభ్యం జ్ఞానం ఆఖ్యాతం కథితం గుహ్యాత్ గోప్యాత్ గుహ్యతరం అతిశయేన గుహ్యం రహస్యం ఇత్యర్థః, మయా సర్వజ్ఞేన ఈశ్వరేణ. విమృశ్య విమర్శనం ఆలోచనం కృత్వా ఏతత్ యథోక్తం శాస్త్రం అశేషేణ సమస్తం యథోక్తం చ అర్థజాతం యథా ఇచ్ఛసి తథా కురు.**

**తె.అ.** ఈ విధంగా రహస్యములలోకెల్ల అతి రహస్యమైన జ్ఞానం సర్వజ్ఞుడనైన ఈశ్వరుడను అయిన నేను నీకు చెప్పాను. ఇప్పుడు చెప్పిన సమస్త శాస్త్రార్థాన్ని ఆలోచించి నీకు ఏది చేయవలెనని తోస్తే అది చేయి.

**భాష్యమ్ : 64.0 భూయోఽపి మయా ఉచ్యమానం శృణు -**

**తె.అ.** మళ్ళీ చెపుతున్నాను విను –

**మూ. సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమం వచః ।**
**ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్ ॥ 64**

**తె.అ.** అత్యంత రహస్యమైన విషయం మళ్ళీ చెపుతున్నా. పరమోత్తమమైన నా మాట విను. నాకు మిక్కిలి ఇష్టుడవని నీ మేలు కోరి చెపుతున్నాను.

**భాష్యమ్ : 64.1 సర్వగుహ్యతమం ఇతి. సర్వగుహ్యతమం సర్వేభ్యః గుహ్యేభ్యః అత్యంత గుహ్యతమం అత్యంతరహస్యం ఉక్తమ్ అపి అసకృత్ భూయః పునః శృణు మే మమ పరమం ప్రకృష్టం వచః వాక్యమ్. న భూయాత్ నాపి అర్థకారణాత్ వా వక్ష్యామి, కిం తర్హి? ఇష్టః ప్రియః అసి మే మమ దృఢం అవ్యభిచారేణ ఇతి కృత్వా తతః తేన కారణేన వక్ష్యామి కథయిష్యామి తే తవ హితం పరమం జ్ఞానప్రాప్తిసాధనమ్, తత్ హి సర్వహితానాం హితతమమ్.**

**తె.అ.** అత్యంత రహస్యమైన విషయం, చెప్పిందే అయినా, మళ్ళీ చెపుతున్నా. పరమ శ్రేష్ఠమైన నా మాట విను. నేను చెప్పడం భయం చేత కాదు లాభమాశించి కాదు. మరెందుకు? నాకు ఎప్పుడూ ప్రియుడవని, సర్వహితములకు హితమైన జ్ఞానప్రాప్తి సాధనం నీకు చెపుతున్నాను.

**భాష్యమ్ : 65.0 కిం తత్ ఇతి? ఆహ –**

**తె.అ.** ఏమిటది? అంటే చెపుతున్నాడు –

**మూ. మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।**
**మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే ॥ 65**

**తె.అ.** మనసు నాయందు నిలుపు. నాయందు భక్తి నిలుపు. నాకొరకు యజ్ఞం చేయి. నాకు నమస్కరించు. నన్నే చేరుకుంటావు. నీవు నాకు ప్రియుడవని ప్రతిజ్ఞ చేసి చెబుతున్నాను.

**భాష్యమ్ : 65.1 మన్మనాః ఇతి. మన్మనాః భవ మచ్చితః భవ. మద్భక్తః భవ మద్భజనః భవ. మద్యాజీ మద్యజన శీలః భవ. మాం నమస్కురు. నమస్కారం అపి మమైవ కురు. తత్ర ఏవం వర్తమానః వాసుదేవే ఏవ సమర్పిత సాధ్య సాధనప్రయోజనః మాం ఏవ ఏష్యసి ఆగమిష్యసి. సత్యం తే తవ ప్రతిజానే, సత్యాం ప్రతిజ్ఞాం కరోమి ఏతస్మిన్ వస్తుని ఇత్యర్థః, యతః ప్రియః అసి మే. ఏవం భగవతః సత్యప్రతిజ్ఞత్వం బుద్ధ్వా భగవద్భక్తేః అవశ్య సంభావి మోక్షఫలం అవధార్య భగవచ్ఛరణైకపరాయణః భవేత్ ఇతి వాక్యార్థః.**

**తె.అ.** నాయందు చిత్తముంచు. నన్ను భజించు, ప్రేమించు. నా కొరకు యజ్ఞం చేస్తూ ఉండు. నమస్కారం కూడా నాకే చేయి. ఈ విధంగా చేస్తూ వాసుదేవునియందే సమస్త సాధ్య సాధన ప్రయోజనాలు సమర్పించి నన్నే చేరుకుంటావు. ఈ విషయంలో సత్యప్రతిజ్ఞ చేస్తున్నాను. ఎందుకంటే నీవు నాకు ప్రియుడవని. ఈ విధంగా భగవానుడు చేసిన సత్యప్రతిజ్ఞను తెలుసుకుని, భగవద్భక్తికి మోక్షం తప్పని ఫలమని గ్రహించి భగవంతుని ఏకమాత్రంగా శరణు చెందడంలో తత్పరుడు కావలెను అని వాక్యార్థం.

**భాష్యమ్ : 66.0 కర్మయోగనిష్ఠాయాః పరమరహస్యం ఈశ్వరశరణతాం ఉపసంహృత్య అథ ఇదానీం కర్మయోగనిష్ఠాఫలం సమ్యగ్దర్శనం సర్వవేదాంతసారవిహితం వక్తవ్యమ్ ఇత్యాహ–**

**తె.అ.** కర్మయోగ నిష్ఠలోని పరమరహస్యం ఈశ్వర శరణాగతి. దానిని గురించి చెప్పడం ముగించి ఇక యిప్పుడు ఆ కర్మయోగనిష్ఠకు ఫలము సమస్త ఉపనిషత్తుల సారము అయిన సమ్యగ్దర్శనం చెప్పవలసి ఉంది అని అంటున్నాడు.

**మూ. సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।**
**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥ 66**

**తె.అ.** సర్వధర్మాలను పరిత్యజించి, ఉన్న నన్నొకనిని (మామేకం అంటే నన్నొకనినే అని కాదు. మామేకమేవ అనలేదు. ఏకమైన నన్ను అని అర్థం). శరణు చెందుము. నేను నిన్ను సమస్త పాపముల నుండి విముక్తుణ్ణి చేస్తాను. శోకించవద్దు.

**భాష్యమ్ : 66.1 సర్వధర్మాన్ ఇతి. సర్వధర్మాన్ సర్వే చ తే ధర్మాశ్చ సర్వధర్మాః తాన్ – ధర్మశబ్దేన అత్ర అధర్మః అపి గృహ్యతే, నైష్కర్మ్యస్య వివక్షిత్త్వాత్, 'నావిరతో దుశ్చరితాత్', (కఠ.ఉ. 2.24), 'త్యజ ధర్మమధర్మం చ' (శాం.ప. 329.331.44) ఇత్యాది శ్రుతిస్మృతిభ్యః – సర్వధర్మాన్ పరిత్యజ్య సంన్యస్య సర్వకర్మాణి ఇత్యేతత్. మాం ఏకం సర్వాత్మానం సమం సర్వభూతస్థితం ఈశ్వరం (అచ్యుతం గర్భజన్మ జరామరణవివర్జితం) 'అహమేవ' ఇత్యేవం ఏకం శరణం వ్రజ, న మత్తః అన్యత్ అస్తి ఇతి అవధారయ ఇత్యర్థః. అహం త్వా త్వాం ఏవంనిశ్చితబుద్ధిం సర్వపాపేభ్యః సర్వధర్మాధర్మబంధనరూపేభ్యః మోక్షయిష్యామి స్వాత్మభావ – ప్రకాశీకరణేన. ఉక్తం చ 'నాశయామ్యాత్మ భావస్థో జ్ఞానదీపేన భాస్వతా' (10.11) ఇత్యతః మా శుచః శోకం మా కార్షీః ఇత్యర్థః.**

**తె.అ.** సర్వధర్మాలను పరిత్యజించి – ఇక్కడ ధర్మశబ్దానికి అధర్మమని కూడా అర్థం చేర్చుకోవాలి. ఎందుకంటె ఇక్కడ చెప్పదలచిన విషయం నైష్కర్మ్యం కనుక. 'దుశ్చరితం నుండి విరమించినవాడు'

(క.ఉ.2.24), 'ధర్మము అధర్మము కూడా వదలు' (శాం.ప.329.40, 331.44) వంటి శ్రుతి స్మృతి వాక్యాలు చెప్పినట్లు సర్వధర్మాలను పరిత్యజించి, సర్వకర్మలను సంన్యసించి అని అర్థం, సర్వము నేనై ఉన్న నన్నొకనిని అన్ని ప్రాణులయందు ఒకటిగా ఉన్న ఈశ్వరుని అచ్యుతుని గర్భ జన్మ జరామరణరహితుని నేనే అని ఉన్న ఒకనిని శరణు చెందు. 'నేను తప్ప వేరేమీ లేదు' అని నిశ్చయంగా తెలిసి ఉండు అని అర్థం. ఈ విధంగా నిశ్చితబుద్ధివైన నిన్ను ధర్మాధర్మ బంధనరూపమైన సర్వపాపముల నుండి స్వాత్మభావం ప్రకటించి ముక్తుణ్ణి చేస్తాను. 'నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా' (10.11) అని చెప్పి ఉన్నాను. కనుక శోకం పొందవద్దు అని అర్థం. (సర్వ పాపములను భగవానుడు ఏ విధంగా తొలగిస్తాడు? ఆత్మయొక్క స్వరూపం తెలిపి. స్వాత్మభావం ప్రకటించడమంటే నేనెవరు అన్న ఎరుక కలిగించడం. ఆ ఆత్మజ్ఞానదీపం వెలుగుతూనే పాపాలు తొలగిపోతాయి).

## శాస్త్ర ఉపసంహార ప్రకరణం

**భాష్యమ్ : 66.2 కిం అస్మిన్ గీతాశాస్త్రే పరం నిఃశ్రేయససాధనం నిశ్చితమ్? – కిం జ్ఞానం కర్మ వా ఆహోస్విత్ ఉభయమ్ ఇతి? కుతః సంశయ? 'యత్ జ్ఞాత్వాఽ మృతమశ్నుతే' (13.12) తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరం (18.55) యిత్యాదీని వాక్యాని కేవలజ్ఞానాత్ నిశ్శ్రేయసప్రాప్తిం దర్శయంతి. 'కర్మణ్యేవాధికారస్తే' (2.47) 'కురు కర్మైవ' (4.15) ఇత్యేవమాదీని కర్మణాం అవశ్యకర్తవ్యతాం దర్శయంతి. ఏవం జ్ఞానకర్మణోః కర్తవ్యత్వోపదేశాత్ సముచ్చితయో అపి నిఃశ్రేయసహేతుత్వం స్యాత్ ఇతి భవేత్ సంశయః.**

**తె.అ.** ఈ గీతాశాస్త్రంలో పరమ నిశ్శ్రేయస సాధనం ఏదని నిశ్చయింపబడింది? (నిశ్శ్రేయస మంటే 'ఇంతకంటె కలగగలిగిన శ్రేయస్సు లేదు' అని దేనిని గురించి అనగలమో అది. అంటే మోక్షం.) జ్ఞానమా? కర్మా? లేక ఉభయమా?

ఎందుకీ సంశయం?

ఎందుకంటే, 'యద్జ్ఞాత్వామృతమశ్నుతే' (18.12) 'తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్' (18.55) వంటి వాక్యాలు కేవల జ్ఞానం చేతనే నిశ్శ్రేయస ప్రాప్తి అని చెపుతున్నాయి. 'కర్మణ్యేవాధికారస్తే' (2.47), 'కురు కర్మైవ' (4.15) వంటి వాక్యాలు కర్మలు తప్పక చేయవలసినవే అని చెపుతున్నాయి. ఈ విధంగా జ్ఞానకర్మలు రెండూ కర్తవ్యమే అని చెప్పడం చేత రెండును కలిసి నిశ్శ్రేయసహేతువు అన్న సంశయం కలగవచ్చు.

**భాష్యమ్ : 66.3 కిం పునః అత్ర మీమాంసాఫలమ్?**

**నను ఏతత్ ఏవ – ఏషాం అన్యతమస్య పరమనిఃశ్రేయస సాధనత్వావధారణం, అతః విస్తీర్ణతరం మీమాంస్య ఏతత్.**

**ఆత్మజ్ఞానస్య తు కేవలస్య నిఃశ్రేయస హేతుత్వం, భేదప్రత్యయనివర్తకత్వేన కైవల్యఫలావసాయిత్వాత్. క్రియాకారకఫలభేదబుద్ధిః అవిద్యయా ఆత్మని నిత్యప్రవృత్తా – 'మమ కర్మ, అహం కర్తా, అముష్మై ఫలాయ యిదం కర్మ కరిష్యామి' ఇతి ఇయం అవిద్యాం అనాదికాలప్రవృత్తా. అస్యాః అవిద్యాయాః నివర్తకం – 'అయం అహం అస్మి కేవలః అకర్తా అక్రియః అఫలః, న మత్తః అన్యః అస్తి కశ్చిత్' – ఇత్యేవంరూపం ఆత్మవిషయం జ్ఞానం ఉత్పద్యమానం కర్మప్రవృత్తిహేతు భూతాయాః భేదబుద్ధేః నివర్తకత్వాత్. తుశబ్దః పక్షద్వయవ్యావృత్త్యర్థః – న కేవలేభ్యః కర్మభ్యః, న చ జ్ఞానకర్మభ్యాం సముచ్చితాభ్యాం నిః శ్రేయసప్రాప్తిః ఇతి పక్షద్వయం నివర్తయతి. అకార్యత్వాచ్చ నిఃశ్రేయసస్య కర్మసాధనత్వానుపపత్తిః. న హి నిత్యం వస్తు కర్మణా జ్ఞానేన వా క్రియతే.**

**తె.అ.** ఈ చర్చ వలన ఫలమేమిటి?

– ఏమిటంటే, వీటిలో పరమ నిశ్శ్రేయస సాధనమేదో నిశ్చయించుకోడం. కనుక దీనిని సవిస్తరంగా చర్చించవలసి వుంది.

భేదబుద్ధిని తొలగించడం ద్వారా చివరకు కైవల్యఫలం ఇస్తుంది కనుక కేవలాత్మజ్ఞానం మాత్రమే నిశ్శ్రేయసహేతువు. క్రియ, కారకము, ఫలము అనే భేదబుద్ధి అవిద్యచేత నిత్యము ప్రవర్తిస్తున్నది – నా కర్మ, నేను కర్తను, ఈ ఫలం కొరకు ఈ కర్మ చేస్తాను – ఈ విధంగా ఈ అవిద్య అనాదికాలం నుండి పనిచేస్తూ ఉన్నది. ఈ అవిద్యను తొలగించేది ఆత్మవిషయజ్ఞానం – ఈ 'నేను' కేవలుడను, అకర్తను అక్రియుడను, అఫలుడను నేను తప్ప ఏదీ లేదు అని కర్మప్రవృత్తికి హేతుభూతమైన భేదబుద్ధిని తొలగించే జ్ఞానం. 'తు' ('మాత్రమే') శబ్దం పక్షద్వయాన్ని తోసివేయడం కొరకు. అంటే, కేవల కర్మవల్ల గాని, జ్ఞానకర్మల సముచ్చయం వల్లగాని నిశ్శ్రేయసం ప్రాప్తిస్తుంది అన్న రెండు పక్షాలను తోసివేయడం కొరకు. నిశ్శ్రేయసం క్రియవల్ల కలిగేది కాదు. కనుక దానికి సాధనం కర్మ అనడం కుదరదు. ఎప్పుడూ ఉన్న వస్తువును కొత్తగా కర్మగాని జ్ఞానంగాని ఉత్పత్తి చేయలేదు.

**భాష్యమ్ : 66.4 కేవలజ్ఞానమ్ అపి అనర్థకం తర్హి?**

**న, అవిద్యా నివర్తకత్వే సతి దృష్టకైవల్య ఫలావసానత్వాత్. అవిద్యా తమో నివర్తకస్య జ్ఞానస్య దృష్టం కైవల్యఫలావసానత్త్వం, రజ్జ్వాదివిషయే సర్పాద్యజ్ఞానతమోనివర్తకప్రదీపప్రకాశవత్. వినివృత్తసర్పాదివికల్పరజ్జుకైవల్యావసానం హి ప్రకాశఫలమ్, తథా జ్ఞానమ్. దృష్టార్థానాం చ ఛిదిక్రియాగ్నిమంథనాదీనాం వ్యాపృతకర్త్రాదికారకాణాం ద్వైధీభావాగ్నిదర్శనాదిఫలాత్ అన్యఫలే కర్మాంతరే వా వ్యాపారానుపపత్తిః యథా, తథా దృష్టార్థాయాం జ్ఞాననిష్ఠాక్రియాయాం (నిష్క్రియాయాం జ్ఞాననిష్ఠా క్రియాయాం) ఇతి, 'నిష్క్రియాయాం జ్ఞాననిష్ఠాయాం' ఇతి చ పాఠౌ వ్యాపృతస్య జ్ఞాత్రాదికారకస్య ఆత్మకైవల్యఫలాత్ కర్మాంతరే ప్రవృత్తిః అనుపపన్నా ఇతి న జ్ఞాననిష్ఠా కర్మసహితా ఉపపద్యతే.**

**భుజ్యగ్నిహోత్రాదిక్రియావత్ స్యాత్ ఇతి చేత్ –**

**న, కైవల్యఫలే జ్ఞానే క్రియాఫలార్థిత్వానుపపత్తేః. కైవల్యఫలే హి జ్ఞానే ప్రాప్తే, సర్వతః సంప్లుతోదకఫలే కూపతడాగాది క్రియాఫలార్థిత్త్వాభావతత్, ఫలాంతరే తత్సాధనభూతాయాం వా క్రియాయాం అర్థిత్వానుపపత్తిః. న హి రాజ్యప్రాప్తి ఫలే కర్మణి, వ్యాప్రుతస్య క్షేత్రమాత్రప్రాప్తిఫలే వ్యాపార ఉపపద్యతే, తద్విషయం వా అర్థిత్వమ్. తస్మాత్ న కర్మణః అస్తి నిఃశ్రేయససాధనత్వామ్. న చ జ్ఞానకర్మణోః సముచ్చితయోః. నాపి జ్ఞానస్య కైవల్యఫలస్య కర్మసాహాయ్యాపేక్షా, అవిద్యా నివర్తకత్వేన విరోధాత్. న హి తమః తమసః నివర్తకమ్. అతః కేవలమ్ ఏవ జ్ఞానం నిఃశ్రేయస సాధనం ఇతి.**

**తె.అ.** అయితే మరి కేవలజ్ఞానం కూడా వ్యర్థమేనన్నమాట?

– కాదు. అది అవిద్యను తొలగించి చివరకు కైవల్యఫలం ఇవ్వడం ప్రత్యక్షంగా చూస్తున్నాం కనుక. రజ్జువు మొదలైన వస్తువులయందు సర్పము మొదలైన అజ్ఞానమనే చీకటిని తొలగించే దీపపుకాంతి వలె, అవిద్య అనే చీకటిని తొలగించి జ్ఞానం చివరకు కైవల్యఫలం ఇవ్వడం చూస్తున్నాం. సర్పాది వికల్పాలను తొలగించి 'ఇది కేవలం రజ్జువే' అని చూపడమే ప్రకాశఫలం. జ్ఞానమూ అంతే. ఇతర దృష్టాంతాలు గూడా ఉన్నాయి. కట్టెను చీల్చడం, అగ్నికొరకు వాటిని మథించడం వంటి వ్యాపారంలో కర్త మొదలైన కారకాలకు కట్టె ముక్కలు కావడం అగ్ని పుట్టడం వంటి ఫలం కాక ఇతర ఫలమిచ్చే మరే కర్మయందు ప్రవృత్తి ఉండదు. అట్లాగే జ్ఞాననిష్ఠ అనే క్రియయందు లగ్నమైన జ్ఞాత వంటి కారకాదులకు ఆత్మకైవల్య ఫలం కాక అన్యఫలమిచ్చే మరే ఇతర కర్మయందు ప్రవృత్తి ఉండదు. కనుక జ్ఞాననిష్ఠ కర్మతో కలిసి వుండదు.

– భోజనము, అగ్నిహోత్రము వంటి క్రియలవలె రెంటి సముచ్చయం సాధ్యం కావచ్చు కదా? అగ్నిహోత్రాది వైదికకర్మతో పాటు భోజనం చేయడమనే క్రియకూడా జరుగుతున్నది. అట్లాగే జ్ఞానము, కర్మ కలిసి ఉండవచ్చుగదా? అని ప్రశ్న.

– కాదు. కైవల్యమే ఫలమైన జ్ఞానం కలిగిన తరువాత క్రియాఫలంపై కోరిక ఉండదు కనుక. అంతటా నీరు నిండి ఉన్నప్పుడు బావి చెరువు వంటివి త్రవ్వవలెననే కోరిక కలుగదు. ఆ త్రవ్వడమనే క్రియకు గల ఫలంపై కోరిక కూడా కలగదు. అంతటా నిండి వున్న నీరువంటి జ్ఞానం కలిగిన తరువాత బావివంటి మరొక అల్పఫలంపై గాని ఆ ఫలానికి సాధనభూతమైన క్రియయందు గాని కోరిక ఉండదు. రాజ్యప్రాప్తి కొరకు యత్నం చేసేవాడు క్షేత్రప్రాప్తి కొరకు యత్నం చేయడు, ఆ విషయంలో అతనికి కోరికా వుండదు. కనుక కర్మగాని జ్ఞానకర్మలు కలిసిగాని నిశ్శ్రేయససాధనం కావు. కైవల్యమే ఫలమైన జ్ఞానానికి కర్మ సహాయంతో పనిలేదు. అవిద్యను తొలగించేది కనుక జ్ఞానానికి కర్మతో విరోధం. చీకటిని చీకటి తొలగించలేదు కదా! కనుక కేవలము జ్ఞానమే నిశ్శ్రేయస సాధనము అని.

(ఇద్దరు పూర్వపక్షుల ఆక్షేప సమాధానములు)

**66.5 భాష్యమ్ : న – నిత్యాకరణే ప్రత్యయవాయప్రాప్తేః, కైవల్యస్య చ నిత్యత్వాత్, యత్ తావత్ కేవలజ్ఞానాత్ కైవల్యప్రాప్తిః ఇత్యేతత్, తత్ అసత్, యతః నిత్యానాం కర్మణాం శ్రుత్యాక్తానాం అకరణే ప్రత్యవాయః నరకాదిప్రాప్తి – లక్షణః స్యాత్ –**

**నను ఏవం తర్హి కర్మభ్యః మోక్షః నాస్తి ఇతి అనిర్మోక్షః ఏవ.**

**నైష దోషః, నిత్యత్వాత్ మోక్షస్య. నిత్యానాం కర్మణాం అనుష్ఠానాత్ ప్రత్యవాయస్య అప్రాప్తిః ప్రతిషిద్ధస్య చ అకరణాత్ అనిష్టశరీరానుపపత్తిః కామ్యానాం చ వర్జనాత్ ఇష్టశరీరానుపపత్తిః, వర్తమానశరీరాభకస్య చ కర్మణః ఫలోపభోగక్షయే పతితే అస్మిన్ శరీరే దేహాంతరోత్పత్తౌ చ కారణాభావాత్ ఆత్మనః రాగాదీనాం చ అకరణే స్వరూపావస్థానం కైవల్యమ్ ఇతి అయత్నసిద్ధం కైవల్యం ఇతి.**

**అతిక్రాంతానేకజన్మాంతరకృతస్య స్వర్గనరకాదిప్రాప్తిఫలస్య అనారబ్ధకార్యస్య ఉపభోగానుపపత్తేః క్షయాభావః ఇతి చేత్ –**

**న, నిత్యకర్మానుష్ఠానాయాసదుఃఖోపభోగస్య తత్ఫలోపభోగత్వోపపత్తేః. ప్రాయశ్చిత్తవద్వా–పూర్వోప చితదురితక్షయార్థం నిత్యం కర్మ. ఆరబ్ధానాం చ కర్మణాం ఉపభోగేన ఏవ క్షీణత్వాత్ అపూర్వాణాం చ కర్మణాం అనారంభే అయత్నసిద్ధం కైవల్యమ్ ఇతి.**

**తె.అ.** మొదటి పూర్వపక్షి – కాదు. నిత్యకర్మలను చేయకపోవడం వలన పాపము కలుగుతుంది. మోక్షమేమో నిత్యము. కేవలజ్ఞానం వల్లనే కైవల్య ప్రాప్తి అని మీరన్నమాట సత్యం కాదు. ఎందుకంటే, శ్రుతి విధించిన నిత్యకర్మలను చేయకపోవడం వలన నరకాది ప్రాప్తి లక్షణమైన పాపము కలుగుతుంది.

ఆక్షేపానికి ఆక్షేపం – మరి కర్మల నుండి మోక్షం లేదు అంటే మోక్షమే లేదన్నమాట.

రెండవ పూర్వపక్షి – అటువంటి దోషమేమీ లేదు, మోక్షం నిత్యమైనది కనుక. నిత్యకర్మల అనుష్ఠానం వలన పాపము కలుగదు. ప్రతిషిద్ధ కర్మలను చేయకపోవడం వలన అనిష్ఠశరీరం (దుఃఖహేతువైన శరీరం) కలగదు. కామ్యకర్మలను వదలడం వలన ఇష్టశరీరమూ కలగదు. వర్తమాన శరీరం కలగడానికి కారణమైన కర్మలు, ఆ కర్మఫలం అనుభవించడంతో, క్షయమై ఈ శరీరం రాలిపోతుంది. తరువాత మరొక దేహం పుట్టడానికి కారణం లేదు. (ప్రతిషిద్ధ కామ్యకర్మలు రెండూ ఆచరించలేదు కనుక). దేహం లేదు కనుక ఆత్మకు దేహసంబంధమైన రాగాదులుండవు. ఆత్మ స్వరూపంలో ఉండిపోవడమే కైవల్యం. కనుక కైవల్యం అయత్నసిద్ధం.

మొదటి పూర్వపక్షి – గడిచిన అనేక జన్మలలో చేసిన స్వర్గనరకాది ప్రాప్తి హేతువైన కర్మలు ఫలమివ్వడం ఆరంభించనివి, వాటి ఫలము అనుభవించబడకపోవడం చేత క్షయం కావు అంటే?

రెండవ పూర్వపక్షి – కాదు. నిత్య కర్మానుష్ఠానంలో కలిగే ఆయాసరూపమైన కష్టమను భవించడమే గడచిన జన్మలలో చేసిన కర్మల ఫలమనుభవించడమవుతుంది. పూర్వం పోగుచేసుకున్న దురితం క్షయం కావడం కొరకు ప్రాయశ్చిత్తం వంటిదే నిత్యకర్మ. ఆరబ్ధకర్మలు అనుభవంతో క్షయమవుతాయి. కొత్తకర్మలు ఆరంభించడం లేదు. ఇక అప్పుడు కైవల్యం అప్రయత్నంగా సిద్ధిస్తుంది.

**భాష్యమ్ : 66.6 న, 'తమేవ విదిత్వాఽతిమృత్యుమేతి నాన్యః పంథా విద్యతేఽయనాయ' (శ్వే.ఉ.3.8) ఇతి విద్యాయా అన్యః పంథాః మోక్షాయ న విద్యతే ఇతి శ్రుతేః, చర్మవదాకాశవేష్టనా సంభవవత్ అవిదుషః మోక్షాసంభవశ్రుతేః (శ్వే.ఉ.6.20), 'జ్ఞానాత్ కైవల్యమాప్నోతి' ఇతి చ పురాణస్మృతేః అనారబ్ధఫలానాం పుణ్యానాం కర్మణాం క్షయానుపపత్తేశ్చ. యథా పూర్వోపాత్తానాం దురితానాం అనారబ్ధఫలానాం స్యాత్ సంభవః, తథా పుణ్యానాం అనారబ్ధ ఫలానాం స్యాత్ సంభవః. తేషాం చ దేహాంతరం అకృత్వా క్షయానుపపత్తౌ మోక్షానుపపత్తిః, ధర్మాధర్మహేతూనాం చ రాగద్వేషమోహానాం అన్యత్ర ఆత్మజ్ఞానాత్ ఉచ్ఛేదానుపపత్తేః ధర్మాధర్మోచ్ఛేదానుపపత్తిః.**

**నిత్యానాం చ కర్మణాం పుణ్యఫలత్వశ్రుతేః, 'వర్ణాః ఆశ్రమాశ్చ స్వకర్మనిష్ఠాః (గౌ.ధ.సూ. 11.29) ఇత్యాదిస్మృతేశ్చ కర్మయక్షయానుపపత్తిః.**

**తె.అ.** సిద్ధాంతం – (మీ ఇద్దరి) ఈ వాదమంతా తప్పు. "దానిని (ఆ పరమాత్మను) తెలుసుకొని మృత్యువును దాటిపోతాడు. మోక్షప్రాప్తికి మరొక మార్గం లేదు", (శ్వే.ఉ. 3.8) అని విద్య తప్ప మోక్షానికి మరో మార్గం లేదని శ్రుతి చెపుతున్నది. చర్మాన్ని చుట్టచుట్టినట్టు ఆకాశాన్ని చుట్టడం అసంభవం; అవిద్వాంసునికి మోక్షం అంతే అసంభవమని కూడా శ్రుతి (శ్వే.ఉ. 6.20) చెపుతున్నది. పురాణం కూడా అంటున్నది 'జ్ఞానం చేత కైవల్యం పొందుతాడు', అని. ఫలమారంభించని పుణ్యకర్మలు క్షయం కావడం జరగదు. ఫలమారంభించని పూర్వం పోగుచేసుకున్న పాపాలు పుణ్యాలు ఒకే విధమైనవి. అవి మరొక దేహం కల్పించకుండా క్షయం కావడం జరగదు. కనుక మోక్షం కలగదు. ధర్మాధర్మ హేతువులైన రాగద్వేష మోహాలను నిర్మూలించగలిగింది ఆత్మజ్ఞానం తప్ప మరొకటి లేదు కనుక ధర్మాధర్మాలు నిర్మూలించబడటం లేదు. అంతేకాదు నిత్యకర్మలకు ఫలముంటుందని శ్రుతి చెపుతున్నది. స్మృతి కూడా 'స్వకర్మ నిష్ఠులైన వర్ణాశ్రమావలంబులు' (గౌ.ధ.సూ. 11.29) అని అంటున్నది. అంటే (కర్మాచరణం చేత, అది నిత్యకర్మాచరణం మాత్రమే అయినప్పటికి) కర్మక్షయం జరగదు అని.

**భాష్యమ్ : 66.7 యే తు ఆహుః – నిత్యాని కర్మాణి దుఃఖరూపత్వాత్ పూర్వకృతదురిత కర్మణాం ఫలమేవ, న తు తేషాం స్వరూప వ్యతిరేకేణ అన్యత్ ఫలం అస్తి, అశ్రుతత్వాత్, జీవనాదినిమిత్తే చ విధానాత్ ఇతి.**

**న; అప్రవృత్తానాం కర్మణాం ఫలదానాసంభవాత్, దుఃఖఫలవిశేషానుపపత్తిశ్చ స్యాత్. యత్ ఉక్తమ్ – పూర్వజన్మ కృతదురితానాం కర్మణాం ఫలం నిత్యకర్మానుష్ఠానాయాసదుఃఖం భుజ్యతే ఇతి – తత్ అసత్. న హి మరణకాలే ఫలదానాయ అనంకురీభూతస్య కర్మణః ఫలం అన్యకర్మారబ్ధే జన్మని ఉపభుజ్యతే ఇతి ఉపపత్తిః. అన్యథా స్వర్గఫలోపభోగాయ అగ్నిహోత్రాదికర్మారబ్ధే జన్మని నరకఫలోపభోగానుపపత్తిః న స్యాత్. తస్య దురిత దుఃఖవిశేషఫలత్వానుపపత్తేశ్చ – అనేకేషు హి దురితేషు సంభవత్సు భిన్నదుఃఖసాధనఫలేషు నిత్యకర్మానుష్ఠానాయాస – దుఖమాత్రఫలేషు కల్ప్యమానేషు ద్వంద్వరోగాదిబాధనం, నిర్నిమిత్తం న హి శక్యతే కల్పయితుం, నిత్యకర్మానుష్ఠానాయాసదుఃఖమ్ ఏవ పూర్వోపాత్త – దురితఫలం న శిరసాపాషాణవహనాది దుఃఖమ్ ఇతి. అప్రకృతం చ ఇదం ఉచ్యతే – నిత్యకర్మానుష్ఠానాయాస దుఃఖం పూర్వకృతదురితకర్మఫలం ఇతి. కథమ్ – అప్రసూతఫలస్య హి పూర్వకృతదురితస్య క్షయః న ఉపపద్యతే ఇతి ప్రకృతమ్. తత్ర ప్రసూతఫలస్య కర్మణః ఫలం నిత్యకర్మానుష్ఠానాయాస దుఃఖం**

**ఆహ భవాన్, న అప్రసూతఫలస్య ఇతి. అథ సర్వమేవ పూర్వకృతం దురితం ప్రసూతఫలమ్ ఏవ ఇతి మన్యతే భవాన్ – తతః నిత్యకర్మానుష్ఠానాయాస దుఃఖమ్ ఏవ ఫలం ఇతి విశేషణం అయుక్తమ్. నిత్యకర్మవిధ్యానర్థక్యప్రసంగశ్చ, ఉపభోగనైవ ప్రసూతఫలస్య దురితకర్మణః క్షయోపపత్తేః. కించ – శ్రుతస్య నిత్యస్య దుఃఖం చేత్ ఫలం, నిత్యకర్మానుష్ఠానాయాసాత్ ఏవ తత్ దృశ్యతే వ్యాయామాదివత్, తత్ అన్యస్య ఇతి కల్పనానుపపత్తిః. జీవనాదినిమిత్తే చ విధానాత్, నిత్యానాం కర్మణాం ప్రాయశ్చిత్తవత్ పూర్వకృతదురిత – ఫలత్వానుపపత్తిః. యస్మిన్ పాపకర్మణి నిమిత్తే యత్ విహితం ప్రాయశ్చిత్తం న తు తస్య పాపస్య తత్ ఫలమ్. అథ తస్య ఏవ పాసస్య నిమిత్తస్య ప్రాయశ్చిత్తదుఃఖం ఫలం, జీవనాదినిమిత్తేఽపి నిత్యకర్మానుష్ఠానాయాస దుఃఖం జీవనాదినిమిత్తస్య ఏవ ఫలం ప్రసజ్యేత, నిత్యప్రాయశ్చిత్తయోః నైమిత్తికత్వావిశేషాత్. కించ అన్యత్ – నిత్యస్య కామ్యస్య చ అగ్నిహోత్రాదేః అనుష్ఠానాయాసదుఃఖస్య తుల్యత్వాత్ నిత్యానుష్ఠానాయాస–దుఃఖమ్ ఏవ పూర్వకృత – దురితస్య ఫలమ్, న తు కామ్యానుష్ఠానాయాస దుఃఖం ఇతి విశేషః న అస్తీతి తదపి పూర్వకృతదురితఫలం ప్రసజ్యేత. తథా చ సతి నిత్యానాం ఫలాశ్రవణాత్ తద్విధానాన్యథా – నుపపత్తేశ్చ నిత్యానుష్ఠానాయాసదుఃఖం పూర్వకృతదురితఫలం ఇతి అర్థాపత్తికల్పనా చ అనుపపన్నా. ఏవం విధానాన్యథానుపపత్తేః అనుష్ఠానాయాసదుఃఖ – వ్యతిరిక్తఫలత్వానుమానాచ్చ నిత్యానామ్. విరోధాచ్చ, విరుద్ధం చ ఇదం ఉచ్యతే – నిత్యకర్మణా అనుష్ఠీయమానేన అన్యస్య కర్మణః ఫలం భుజ్యతే ఇతి అభ్యుపగమ్యమానే స ఏవ ఉపభోగః నిత్యస్య కర్మణః ఫలం ఇతి, నిత్యస్య కర్మణః ఫలాభావః ఇతి విరుద్ధం ఉచ్యతే. కించ – కామ్యాగ్నిహోత్రాదౌ అనుష్ఠీయమానే నిత్యమ్ అపి అగ్నిహోత్రాది తంత్రేణ ఏవ అనుష్ఠితం భవతీతి తదాయాసదుఃఖేన ఏవ కామ్యాగ్నిహోత్రాదిఫలం ఉపక్షీణం స్యాత్, తత్తంత్రత్వాత్. అథ కామ్యాగ్నిహోత్రాది ఫలం అన్యత్ ఏవ స్వర్గాదితదనుష్ఠానాయా సదుఃఖమ్ అపి భిన్నం ప్రసజ్యేత. న చ తత్ అస్తి, దృష్టవిరోధాత్. న హి కామ్యానుష్ఠానాయాస–దుఃఖాత్ కేవలనిత్యానుష్ఠానాయాసదుఃఖం భిన్నం దృశ్యతే. కించ అన్యత్ – అవిహితం, అప్రతిషిద్ధం చ కర్మ తత్కాలఫలం, న తు శాస్త్రచోదితం ప్రతిషిద్ధం వా తత్కాలఫలం భవేత్. తదా స్వర్గాదిషు అపి అదృష్టఫలశాసనేన ఉద్యమః న స్యాత్ – అగ్నిహోత్రాదీనామ్ ఏవ కర్మస్వరూపావిశేషే అనుష్ఠానాయాస దుఃఖమాత్రేణ ఉపక్షయః నిత్యానాం, స్వర్గాదిమహాఫలత్వం కామ్యానాం – అంగేతికర్తవ్యతాద్యాధిక్యే తు అసతి – ఫలకామిత్వమాత్రేణ ఇతి. తస్మాచ్చ న నిత్యానాం కర్మణాం అదృష్టఫలభావః కదాచిత్ అపి ఉపపద్యతే.**

**తె.అ.** 'నిత్య కర్మలు శ్రమతో కూడుకున్నవి. అవి పూర్వం చేసుకున్న పాపకర్మలకు ఫలమే. కష్టం కలిగించడమనే స్వరూపం తప్ప వాటికి మరొక ఫలమేదీ లేదు. ఉన్నట్టు కూడా మనం

వినలేదు. జీవన నిర్వాహం కొరకు అవి విధించబడినందు వల్ల కూడా' అన్న వాదం కూడా తప్పు. ఎందుకంటే ప్రవృత్తం కాని కర్మలు ఫలమివ్వవు. (కనుక ఆ కర్మల ఫలమే నిత్యకర్మలు అనడం సరికాదు. అంతేకాదు, ఆ కర్మలకు నిత్యకర్మానుష్ఠానరూపమైన శ్రమ ఒక్కటే ఫలమని కూడా అనడం సరికాదు. అటువంటప్పుడు 'నిత్యకర్మలకు ఫలముందని వినలేదు కనుక, వాటిని విధించడానికి మరొక కారణం చెప్పబడలేదు కనుక, నిత్యకర్మానుష్ఠానంలో కలిగే ఆయాసదుఃఖ రూపంలో పూర్వకృతపాపఫలం అనుభవించ బడుతున్నది' అనడం తప్పు. ఫలమివ్వడం కొరకు మరణకాలంలో మొలకెత్తని కర్మఫలం ఇతర కర్మలవలన కలిగిన జన్మలో అనుభవానికి వస్తుంది అనడం తప్పు. లేకపోతే, స్వర్గఫలభోగం కొరకు చేసిన అగ్నిహోత్రాది కర్మలవల్ల కలిగిన జన్మలో నరకఫలం అనుభవానికి రాదని ఎట్లా చెప్పగలం? అదేకాక, పూర్వకృతపాపాలకు నిత్యకర్మాచరణరూపమైన శ్రమ ఒక్కటే ఫలమనికూడా చెప్పలేము. పాపాలు అనేకంగా ఉన్నపుడు వాటి ఫలంకూడా వివిధదుఃఖరూపంగా ఉండడం సంభవం. అటువంటపుడు, నిత్యకర్మానుష్ఠానంలో కలిగే ఆయాసదుఃఖం మాత్రమే అన్ని పాపాలకు ఫలమని, తక్కిన శీతోష్ణాది ద్వంద్వాలవల్ల రోగాలవల్ల కలిగే బాధలు ఏ కర్మకు ఫలం కాదని కల్పించడం సాధ్యం కాదు. నిత్యకర్మానుష్ఠాన దుఃఖం మాత్రమే పూర్వోపాత్తపాపఫలమని, బండలు తలకెత్తుకొని మోయడంవంటి కష్టాలు కావని కల్పించలేము. పైగా, నిత్యకర్మానుష్ఠాన ఆయాసదుఃఖం పూర్వం చేసుకున్న పాపఫలం అనడం అప్రస్తుతం కూడా. ఎట్లాగంటే, పూర్వం చేసుకున్న పాపాలు ఫలమివ్వకుండా క్షయంకావు అన్నది ప్రస్తుత విషయం. ఈ సందర్భంలో, ఫలమివ్వనారంభించిన కర్మలకు ఫలమే నిత్యకర్మానుష్ఠాన ఆయాసదుఃఖము, ఫలమివ్వనారంభించని కర్మల ఫలం కాదు అని మీరంటున్నారు. లేక, పూర్వకృతపాపాలన్నీ ఫలమివ్వనారంభించాయని మీ అభిప్రాయమా? అప్పుడు నిత్యకర్మానుష్ఠాన ఆయాసదుఃఖం మాత్రమే వాటి ఫలమని విశేషించడం యుక్తం కాదు. పైగా, నిత్యకర్మలు చేయవలెనన్న విధి వ్యర్థమనవలసివస్తుంది కూడా. ఎందుకంటె ఫలమివ్వనారంభించిన పాపకర్మలు అనుభవంతో కాని క్షయం కావు. అదే కాదు, శ్రుతి విధించిన నిత్యకర్మలకు ఆయాసమే ఫలమైతే, నిత్యకర్మానుష్ఠానం వల్లనే ఆ ఆయాసం కలుగుతున్నది. నిత్యకర్మానుష్ఠానం వల్ల కలిగే ఆ ఆయాసదుఃఖం మరేదో ఇతర కర్మలకు ఫలమని కల్పించవలసిన పనిలేదు. శరీరవ్యాయామం వల్ల ఆయాసం కలుగుతుంది. ఆ ఆయాసం వ్యాయామం వల్ల కాక మరేదో కర్మకు ఫలమని కల్పించవలసిన పనిలేదు. జీవననిమిత్తం నిత్యకర్మలు విధించబడ్డాయి. ప్రాయశ్చిత్తం పూర్వకృత పాపాలకు ఫలమని అనలేము. నిత్యకర్మల విషయమూ అంతే. ఒక్కొక పాపకర్మకు ఒక్కొక ప్రాయశ్చిత్తం చెప్పబడింది. ఆ ప్రాయశ్చిత్తం ఆ పాపకర్మకు ఫలంకాదుగదా. అప్పుడు, జీవనాదినిమిత్తంగా కలిగే నిత్యకర్మానుష్ఠాన ఆయాసదుఃఖంకూడా

జీవనాది నిమిత్తమైన ఫలమే అనవలెను. ఎందుకంటే, నిత్య ప్రాయశ్చిత్తకర్మలు రెండూ నైమిత్తికాలే, రెంటికీ భేదమేమీ లేదు కనుక. అంతేకాదు, మరొక దోషం కూడా ఉంది. నిత్యకర్మలకు అగ్నిహోత్రాది కామ్యకర్మలకు అనుష్ఠాన ఆయాసదుఃఖం సమానమైనపుడు, నిత్యకర్మానుష్ఠానఆయాసదుఃఖం మాత్రమే పూర్వకృత పాపఫలము, కామ్యకర్మానుష్ఠాన ఆయాసదుః ఖం కాదు అనడానికి ఆ రెంటికీ భేదమేమీ లేదు, కనుక కామ్యకర్మానుష్ఠాన దుఃఖం కూడా పూర్వకృతపాపఫలమే అనవలసివస్తుంది. అటువంటపుడు, 'ఈ ఫలం కొరకు నిత్యకర్మలు చేయవలెను అని వేదం చెప్పలేదు, మరొకందుకు విధించబడ్డాయి అని చెప్పడానికి ఆధారమేమీ లేదు, కనుక నిత్యకర్మానుష్ఠాన ఆయాసదుఃఖం పూర్వకృతపాపఫలము' అన్న ఊహాకల్పన సరికాదు అని తేలింది. ఈ విధంగా నిత్యకర్మలు ఇందుకొరకు విధించబడ్డాయి అని చెప్పడానికి మరొక కారణమేదీలేదు కనుక వాటికి అనుష్ఠాన ఆయాసదుఃఖంకాక వేరే ఫలముండవలెనన్న అనుమానం కలగవలెను. (అటువంటి అనుమానం కలగలేదు కనుక కూడా మీ ఊహాకల్పన సరికాదు). మీ ఊహాకల్పనలో మరొక వైరుధ్యం ఉంది. నిత్యకర్మానుష్ఠానంలో అన్యకర్మలఫలం అనుభవించబడుతున్నది అంటే ఆ అనుభవమే నిత్యకర్మలకు ఫలమని అన్నట్లు. నిత్యకర్మలకు ఫలం లేదని మళ్లీ మీరే అంటున్నారు. ఇది విరుద్ధం.

అంతేకాదు. కామ్యాగ్నిహోత్రాదులు అనుష్ఠించబడుతున్నపుడు నిత్యాగ్నిహోత్రాదులు కూడా అందులో భాగంగా అనుష్ఠించబడుతున్నాయి. కనుక, వాటి ఆయాసదుఃఖం చేతనే వాటిలో భాగమైన కామ్యాగ్నిహోత్రాదులఫలం కూడా క్షయం కావలెను. లేదు, కామ్యాగ్నిహోత్రాదులకు స్వర్గాదిఫలం వేరే ఉందని అంటారా, అప్పుడు దాని అనుష్ఠానాయాసదుఃఖం కూడా భిన్నంగా ఉండవలెను. అట్లా ఉండడం లేదు. కామ్యానుష్ఠాన ఆయాసదుఃఖము, కేవల నిత్యానుష్ఠాన ఆయాసదుఃఖము వేరు కావుగదా.

మరొక విషయం గమనించాలి. శాస్త్రం విధించని ప్రతిషేధించని కర్మకు ఫలం తాత్కాలికం. శాస్త్రం విధించిన లేక ప్రతిషేధించిన కర్మకు ఫలం తాత్కాలికం కాదు. తాత్కాలికమే అయితే స్వర్గాది పారలౌకిక ఫలం గురించి శాసనం గానీ, ప్రయత్నంగాని ఉండవు.

నిత్యాగ్నిహోత్రానికి, కామ్యాగ్నిహోత్రానికి కర్మస్వరూపంలో భేదమేమీ లేదు. అంగ ఇతి కర్తవ్యత మొదలైన విధానంలో కామ్యాగ్నిహోత్రంలో ఆధిక్యమేమీ లేదు. అటువంటప్పుడు కేవలం నిత్యాగ్నిహోత్రఫలం అనుష్ఠానాయాసదుఃఖమాత్రం చేత క్షయమవుతుంది, ఫలాకాంక్షామాత్రం చేత కామ్యాగ్నిహోత్రాదులకు స్వర్గాది మహాఫలం ఉంటుంది అని కల్పించలేము. కనుక నిత్యకర్మలకు ఎంతమాత్రము పారలౌకికఫలం ఉండదు అని సిద్ధాంతం చెయ్యలేము.

**భాష్యమ్ : 66.8 అతశ్చ అవిద్యాపూర్వకస్య కర్మణః విద్యా ఏవ శుభస్య అశుభస్య వా క్షయ కారణం అశేషతః, న నిత్యకర్మానుష్ఠానమ్, అవిద్యాకామబీజం హి సర్వమేవ కర్మ. తథా ఉపపాదితం అవిద్వద్విషయం కర్మ, విద్వద్విషయా సర్వకర్మసంన్యాసపూర్వికా జ్ఞానిష్ఠా 'ఉభౌ తౌ న విజానీతః' (2.19) 'వేదావినాశినం నిత్యం' (2.21) 'జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినాం' (3.3) 'అజ్ఞానాం కర్మసంగినాం' (3.26), 'తత్త్వవిత్ మహాబాహో ... గుణా గుణేషు వర్తంతే ఇతి మత్వా న సజ్జతే' (3.28), 'సర్వకర్మాణి మనసా సంన్యస్యాస్తే' (5.13), 'నైవ కించిత్ కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్' (5.7), అర్థాత్ అజ్ఞః 'కరోమి' ఇతి, ఆరురుక్షోః కర్మ కారణం, ఆరూఢస్య యోగస్థస్య శమ ఏవ కారణం' (6.3); 'ఉదారాః' త్రయోఽపి అజ్ఞాః 'జ్ఞానీ త్వాత్మైవ మే మతం' (7.18), 'అజ్ఞాః కర్మిణః గతాగతం కామకామాః లభంతే' (9.21); 'అనన్యాశ్చింతయంతో మాం నిత్యయుక్తాః యథోక్తం ఆత్మానం ఆకాశకల్పం అకల్మషమ్ ఉపాసతే' (9.22) ; 'దదామి బుద్ధియోగం తం ఏన మాముపయాంతి తే' (10.10) - అర్థాత్ న కర్మిణః అజ్ఞాః ఉపయాంతి. భగవత్కర్మణ కారిణః యే యుక్తతమాః అపి కర్మిణః అజ్ఞాః తే ఉత్తరోత్తరహీనఫలత్యాగావసానసాధనాః. (12.6.11).**

**అనిర్దేశ్యాక్షరోపాసకాస్తు 'అద్వేష్టా సర్వభూతానామ్' (12.13-20) ఇతి ఆ అధ్యాయపరిసమాప్తి ఉక్తసాధనాః క్షేత్రాధ్యాయాద్యధ్యాయోక్తజ్ఞాన సాధనాశ్చ (13.7-11; 14.22-26; 15.3-5) - అధిష్ఠానాది పంచకహేతుక సర్వకర్మసంన్యాసినాం (18.14) ఆత్మైకత్వా కర్తృత్వజ్ఞానవతాం పరస్యాం జ్ఞాననిష్ఠాయాం వర్తమానానాం భగవత్తత్త్వవిదాం అనిష్టాదికర్మఫలత్రయం (18.12) పరమహంస పరివ్రాజకానామ్ ఏవ లబ్ధభగవత్స్వరూపాత్మైకత్వ శరణానాం న భవతి, భవతి ఏవ అన్యేషాం అజ్ఞానాం కర్మిణాం అసంన్యాసినాం ఇత్యేషః గీతాశాస్త్రోక్తకర్తవ్యార్థస్య విభాగః.**

**తె.అ.** కనుక అవిద్యాపూర్వకమైన శుభాశుభకర్మలు నిశ్శేషంగా క్షయం కావడానికి విద్యయే కారణం, నిత్యకర్మానుష్ఠానం కాదు అని తేలింది. సర్వకర్మలకు అవిద్యాకామములే బీజం కదా. అదే వెనుక ప్రతిపాదించబడింది, కర్మ అవిద్వాంసుని విషయమని, విద్వద్విషయం సర్వకర్మ సంన్యాస పూర్వకమైన జ్ఞాననిష్ఠ అని - 'ఉభౌ తౌ న విజానీతః' (2.19), 'వేదావినాశినం నిత్యం' (2.21), 'జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినాం' (3.3), 'అజ్ఞానాం కర్మసంగినాం' (3.26), 'తత్త్వవిత్తు మహాబాహో ... గుణాగుణేషు వర్తన్త ఇతి మత్వా న సజ్జతే' (3.28), 'సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే' (5.13) 'నైవ కించిత్ కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్' (5.7) అంటే అజ్ఞాని చేస్తున్నాను అనుకుంటాడు అని; ఆరోహించదలచినవానికి కర్మ కారణం, ఆరోహించినవానికి యోగస్థునకు శమమే కారణము (6.3), ' 'ఉదారులు' ముగ్గురూ

అజ్ఞానులు కాని జ్ఞాని మాత్రం నా ఆత్మయే అని నా అభిప్రాయము' (7.18), 'కామకాములై కర్మలాచరించే అజ్ఞానులకు చావుపుట్టుకలు సంప్రాప్తమవుతాయి,' (9.21) 'అనన్యాశ్చిన్తయన్తో మాం' (9.22), నిత్యయుక్తులు వెనుక చెప్పబడిన ఆకాశంవలె అకల్మషమైన ఆత్మను ఉపాసిస్తారు; 'దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తి తే' (10.10) అంటే కర్మలాచరించే అజ్ఞానులు నన్ను పొందరు అని. భగవంతుని కొరకు కర్మలాచరించే యుక్తతములు కూడా కర్మలాచరిస్తున్నందున అజ్ఞానులే. వారు ఒకదానికంటె ఒకటి హీనమైన సాధనాలు – చిత్తసాధనం మొదలు ఫలత్యాగం వరకు – అవలంబిస్తారు (12.6–11).

అనిర్దేశ్య అక్షరోపాసకులు 'అద్వేష్టా సర్వభూతానాం' (12.13–20) అని అధ్యాయం చివరివరకు, పదమూడవ అధ్యాయం మొదలుకుని మూడు అధ్యాయాలలోను (13.7–11; 14.22–26; 15.3–5) చెప్పబడిన సాధనాలను అవలంబిస్తారు. అధిష్ఠానాది పంచక కారణంగా కలుగుతున్న సర్వకర్మలను సంన్యసించినవారికి, ఆత్మ ఒక్కటే, అది ఏమీ చేయదు అని తెలిసినవారికి, పరమమైన జ్ఞాన నిష్ఠయందు వర్తించేవారికి, భగవత్తత్త్వవేత్తలకు, పరమహంసపరివ్రాజకులకు, భగవత్స్వరూపము తాము ఒకటేనన్న జ్ఞానమే శరణ్యమైనవారికి మాత్రమే అనిష్టాది కర్మఫలత్రయం ఉండదు, అజ్ఞులైన ఇతరులకు కర్మలాచరించేవారికి అసంన్యాసులకు ఉండి తీరుతుంది. ఇది గీతాశాస్త్రంలో చెప్పబడిన కర్తవ్య అకర్తవ్య విషయ విభాగం.

**భాష్యమ్ : 66.9 అవిద్యాపూర్వకృతం సర్వస్య కర్మణః అసిద్ధమ్ ఇతి చేత్ –**

**న; బ్రహ్మహత్యాదివత్. యద్యపి శాస్త్రావగతం నిత్యం కర్మ; తథాఽపి అవిద్యావతః ఏవ భవతి. యథా ప్రతిషేధశాస్త్రావగతమ్ అపి బ్రహ్మహత్యాదిలక్షణం కర్మ అనర్థకారణం అవిద్యాకామాది దోషవతః భవతి – అన్యథా ప్రవృత్త్యనుపపత్తేః – తథా నిత్యనైమిత్తికకామ్యాని అపి ఇతి.**

**దేహవ్యతిరిక్తాత్మని అజ్ఞానే ప్రవృత్తిః నిత్యాదికర్మసు అనుపపన్నా ఇతి చేత్ – న చలనాత్మకస్య కర్మణః అనాత్మకర్తృకస్య 'అహం కరోమి' ఇతి ప్రవృత్తిదర్శనాత్. దేహాదిసంఘాతే అహంప్రత్యయః గౌణః, న మిథ్యా ఇతి చేత్ –**

**న, తత్కార్యేష్వపి గౌణత్వోపపత్తేః. ఆత్మీయే దేహాదిసంఘాతే అహంప్రత్యయః గౌణః, యథా ఆత్మీయే పుత్రే 'ఆత్మా వై పుత్రనామాఽసి' (తై.సం.2.11) ఇతి, లోకే చ మమ ప్రాణ ఏవ అయం గౌః ఇతి, తద్వత్. నైవం మిథ్యాప్రత్యయః. మిథ్యాప్రత్యయస్తు స్థాణుపురుషయోః అగృహ్యమాణ విశేషయోః. న గౌణప్రత్యయస్య ముఖ్యకార్యార్థతా, అధికరణస్తుత్యర్థత్వాత్**

**లుప్తోపమాశబ్దేన. 'యథా సింహో దేవదత్తః' 'అగ్నిః మాణవకః' ఇతి సింహ ఇవ, అగ్నిరివ క్రౌర్యపైంగల్యాది సామాన్యవత్త్వాత్ దేవదత్తమాణవకాధికరణస్తుత్యర్థమ్ ఏవ, న తు సింహకార్యాం అగ్నికార్యం వా గౌణశబ్దప్రత్యయ నిమిత్తం కించిత్ సాధ్యతే, మిథ్యాప్రత్యయకార్యం తు అనర్థం అనుభవతి ఇతి. గౌణప్రత్యయవిషయం జానాతి 'నైష సింహః దేవదత్తః', 'నాయం అగ్నిః మాణవకః' ఇతి. తథా గౌణేన దేహాదిసంఘాతేన ఆత్మనా కృతం కర్మ న ముఖ్యేన అహంప్రత్యయవిషయేణ ఆత్మనా కృతం స్యాత్. న హి గౌణసింహాగ్నిభ్యాం కృతం కర్మ ముఖ్యసింహాగ్నిభ్యాం కృతం స్యాత్. న చ క్రౌర్యేణ పైంగల్యేన వా ముఖ్యసింహాగ్న్యోః కార్యం కించిత్ క్రియతే, స్తుత్యర్థత్వేన ఉపక్షీణత్వాత్. స్తూయమానౌ చ జానీతః 'న అహం సింహః న అహం అగ్నిః' ఇతి; న హి 'సింహస్య కర్మ మమ, అగ్నేశ్చ' ఇతి. తథా 'న సంఘాతస్య కర్మ మమ ముఖ్యస్య ఆత్మనః ఇతి ప్రత్యయః యుక్తతరః స్యాత్, న పునః 'అహం కర్తా మమ కర్మ' ఇతి. యచ్చ ఆహుః 'ఆత్మీయైః స్మృతీచ్ఛాప్రయత్నైః కర్మహేతుభిః ఆత్మా కర్మ కరోతి' ఇతి. న, తేషాం మిథ్యాప్రత్యయపూర్వకత్వాత్. మిథ్యాప్రత్యయనిమిత్తేష్టానిష్టానుభూతక్రియాఫలజనిత సంస్కారపూర్వకాః హి స్మృతీచ్ఛాప్రయత్నాదయః. యథా అస్మిన్ జన్మని దేహాదిసంఘాతాభిమానరాగ ద్వేషాదికృతౌ ధర్మాధర్మౌ తత్ఫలానుభవశ్చ తథా అతీతే అతీతేతరేఽపి జన్మని ఇతి అనాదిః అవిద్యాకృతః సంసారః అతీతః అనాగతశ్చ అనుమేయః. తతశ్చ సర్వకర్మసంన్యాససహిత - జ్ఞాననిష్ఠయా ఆత్యంతికః సంసారోపరమః ఇతి సిద్ధమ్. అవిద్యాత్మకత్వాచ్చ దేహాభిమానస్య తన్నివృత్తౌ దేహానుపపత్తేః సంసారానుపపత్తిః. దేహాదిసంఘాతే ఆత్మాభిమానః అవిద్యాత్మకః. న హి లోకే 'గవాదిభ్యః అన్యః అహం, మత్తశ్చ అన్యే గవాదయః' ఇతి జానన్ తాన్ 'అహం' ఇతి మన్యతే కశ్చిత్. అజానంస్తు స్థాణౌ పురుష విజ్ఞానవత్ అవివేకతః దేహాదిసంఘాతే కుర్యాత్ 'అహం' ఇతి ప్రత్యయం, న వివేకతః జానన్. యస్తు 'ఆత్మా వై పుత్రానామాఽసి' (తై.సం.2.11) ఇతి పుత్రే 'అహం' ప్రత్యయః, స తు జన్యజనకసంబంధనిమిత్తః గౌణః. గౌణేన చ ఆత్మనా భోజనాదివత్ పరమార్థకార్యం న శక్యతే కర్తుం, గౌణసింహాగ్నిభ్యాం ముఖ్యసింహాగ్నికార్యవత్.**

**తె.అ.** ఆక్షేపణ - కర్మలన్నీ అవిద్యాపూర్వకం అనడం యుక్తం కాదంటే?

సమాధానం - యుక్తమే. బ్రహ్మహత్యవంటి నిషిద్ధ కర్మలవలె, నిత్యకర్మ కూడా శాస్త్రం తెలియజెప్పినదే అయినా, అవిద్యావంతునకే చెప్పబడింది. బ్రహ్మహత్యవంటి కర్మ అనర్థకారణమని ప్రతిషేధశాస్త్రం చెప్పినప్పటికి అవిద్య కామమువంటి దోషాలున్నవాడు ఆ కర్మలు చేస్తున్నాడు. ఆ కర్మలు చేయవలెనన్న ప్రవృత్తి మరొకవిధంగా కలగదు. నిత్యనైమిత్తిక కామ్యకర్మలూ అంతే.

ఆక్షేపణ – ఆత్మ దేహంకంటె వేరు అన్న జ్ఞానం కలగకపోతే నిత్యాదికర్మలయందు ప్రవృత్తి కలగదు. (దేహమే ఆత్మ అనుకునేవానికి పరలోకంలో నమ్మకం ఉండదు. అటువంటివాడు నిత్యాదికర్మలు చేయడు. కనుక అవిద్య తొలగినపుడే నిత్యాది కర్మలయందు ప్రవృత్తి కలగగలదు. అటువంటపుడు 'అవిద్య తొలగనపుడే అన్ని కర్మలు' అనడం తప్పు.)

సమాధానం – కాదు. కాళ్ళు చేతులు కదలడంవంటి చలనరూపమైన కర్మకు ఆత్మ కర్త కాకపోయినా నేను చేస్తున్నాను అన్న ప్రవృత్తి చూస్తున్నాం.

ఆక్షేపణ – దేహాదిసంఘాతమే నేను అన్న బుద్ధి గౌణం (గౌణమంటే అముఖ్యార్థం. 'సింహము మృగరాజు' అన్నపుడు 'సింహము' ముఖ్యార్థంలో ప్రయోగించబడింది. 'దేవదత్తుడు సింహము' అన్నపుడు ముఖ్యార్థంలో కాదు. క్రూరస్వభావము అన్న గౌణార్థంలో ప్రయోగించబడింది). మిథ్యకాదు.

సమాధానం – కాదు. కారణం గౌణమయితే కార్యం కూడా గౌణం కావలసి వస్తుంది.

ఆక్షేపణ – తన దేహాది సంఘాతంలో అహం ప్రత్యయం గౌణం. ఎట్లాగంటే తన కుమారుని విషయంలో 'నీ పుత్రుడనబడేవాడు నీవే' (శత.బ్రా. 14. 9. 4. 26) అన్నట్లు. లోకంలో కూడా మనం వింటుంటాం. 'ఈ ఆవు నా ప్రాణమే' అని. ఇట్లా అనడం మిథ్యాప్రత్యయం కాదు. మిథ్యాప్రత్యయం ఏదంటే చీకట్లో కొయ్యమొద్దును చూసి మనిషి అని పొరబడడం, రెంటికీ భేదం తెలియక. అట్లాగే దేహేంద్రియాదుల విషయంలో కూడా ఇవి నేనే అన్న అహంప్రత్యయం కూడా ఈ దేహమే నేనని కాదు. అది గౌణార్థంలో అన్నమాట.

సమాధానం – కాదు, గౌణప్రయోగం అధికరణాన్ని లుప్తోపమ శబ్దంచేత స్తుతించడం కొరకు. అంతేకాని గౌణప్రత్యయం వల్ల ముఖ్యకార్యం కలగదు. ఎట్లాగంటే 'దేవదత్తుడు సింహము', 'మాణవకుడు నిప్పు' అన్నపుడు సింహమువలె నిప్పువలె క్రౌర్య పింగళ వర్ణాది గుణాలు సమానం కనుక అధికరణాలైన దేవదత్త మాణవకులను స్తుతించడం కొరకే. సింహం చేసేపనికాని నిప్పుచేసే పనిగాని గౌణప్రత్యయంవల్ల సిద్ధించదు. గౌణప్రత్యయ విషయం మనకు తెలుస్తూనే ఉంది. ఈ దేవదత్తుడు సింహం కాదు, మాణవకుడు నిప్పుకాదు అని. ఇదే విధంగా దేహేంద్రియ సంఘాత రూపంలో గౌణాత్మకృతకర్మ ముఖ్యార్థంలో అహం ప్రత్యయవిషయమైన ఆత్మ చేసినట్లు కాదు. గౌణసింహము నిప్పు (దేవదత్తుడు, మాణవకుడు) చేసిన పని ముఖ్య సింహము నిప్పు చేసినట్లు కాదు. దేవదత్తుని క్రౌర్యంగాని మాణవకుని పింగళవర్ణంగాని ముఖ్యసింహము నిప్పు చేసే పనులు చేయవు, ఎందుకంటే కేవలం స్తుతించడం కొరకే అవి ప్రయోగించబడడం చేత

స్తుతించడంతో వాటిపని అయిపోయింది. అంతకంటే ఆ ప్రయోగాలకు శక్తి లేదు. మనం ఎవరిని స్తుతిస్తున్నామో వారికీ తెలుసు నేను సింహం కాదు నేను నిప్పుకాదు అని, సింహం చేసేపని నేను చేయను నిప్పుచేసేపని నేను చేయలేను అని. అదే విధంగా దేహాదిసంఘాతం చేస్తున్న కర్మ ముఖ్యార్థంలో ఆత్మనైన నేను చేస్తున్న కర్మ కాదు అన్న ప్రత్యయం కలగాలి. అంతేగాని మళ్ళీ నేను కర్తను నా కర్మ అని కాదు. (నేను కర్తను ఇది నా కర్మ అన్న ప్రత్యయం కలుగుతున్నది కనుక దేహాది సంఘాతం నేను అన్నది గౌణప్రత్యయం కాదు, మిథ్యాప్రత్యయం. దేవదత్తుడు సింహము అన్నటువంటిది కాదు నేను దేహము అనడం. కొయ్యమొద్దును చూచి మనిషి అని పొరబడడం వంటిది.) కొందరంటారు, కర్మహేతువులైన తన స్మృతి ఇచ్ఛ ప్రయత్నాలద్వారా ఆత్మ కర్మ చేస్తూ ఉంటుంది, అని. అది సరికాదు, ఎందుకంటే అవి మిథ్యాప్రత్యయం వల్లనే కలుగుతున్నవి. కనుక మిథ్యాప్రత్యయనిమిత్తంగా ఇష్టానిష్టాలు కలుగుతాయి. ఆ ఇష్టానిష్టాలనుబట్టి మనం కర్మలు చేస్తాం. ఆ కర్మల ఫలాలు ఇష్టానిష్టరూపంగా ఉంటాయి. ఆ కర్మ ఫలాల అనుభవం నుండి సంస్కారాలు కలుగుతాయి. ఆ సంస్కారాలతోనే స్మృతి, ఇచ్ఛ, ప్రయత్నము కలుగుతున్నాయి. ఈ జన్మలో దేహాదిసంఘాత అభిమానము రాగము ద్వేషము మొదలైనవాటి కారణంగా పుణ్యపాపాలు, వాటి ఫలానుభవము కూడా ఎట్లా కలుగుతున్నాయో అట్లాగే వెనుకజన్మలో ఆ వెనుక జన్మలో కూడా. ఈ సంసారం, గడచినది రానున్నది కూడా, అనాదియైన అవిద్యవలన కలుగుతున్నది అని అనుమానించవచ్చు కనుక జ్ఞాననిష్ఠలో సర్వకర్మ సంన్యాసంచేతనే సంసారం పూర్తిగా ఆగిపోతుంది అని తేలింది. దేహాభిమానం అవిద్యచేత కలుగుతున్నది కనుక, అది తొలగితే దేహం లేదు, దేహం లేనపుడు సంసారంలేదు. దేహాదుల సంఘాతమే నేను అన్న అభిమానం అవిద్యవల్ల కలిగేది. లోకంలో ఆవు వేరు నేను వేరు అని తెలిసినవానికి ఎవనికిగాని నేను ఆవు అన్న బుద్ధి కలగదు. తెలియనివాడు స్థాణువును చూసి పురుషుడని పొరబడినట్లు, దేహాదుల సంఘాతవిషయంలో 'అది నేను' అన్న ప్రత్యయం అవివేకంవల్ల కలుగుతుంది. వివేకంతో తెలుసుకుంటే లేదు. 'పుత్రుడనబడేవాడు నీవే' అన్నపుడు పుత్రునియందు నేను అన్న ప్రత్యయం, జన్యజనకసంబంధంవల్ల కలిగినది, గౌణము. గౌణార్థంలో 'నేను' తింటే నేను తిన్నట్టు కాదు. నా పనులు పుత్రునిచేత చేయబడలేవు. ముఖ్యసింహము అగ్ని చేసేపనులు గౌణసింహము నిప్పు చేయలేనట్లు.

**భాష్యమ్ : 66.10 అదృష్టవిషయచోదనాప్రామాణ్యాత్ ఆత్మకర్తవ్యం గౌణైః దేహేంద్రియాత్మభిః క్రియతే ఏవ ఇతి చేత్.**

**న ; అవిద్యాకృత ఆత్మకత్వాత్ తేషామ్. న గౌణాః ఆత్మనః దేహేంద్రియాదయః కిం తర్హి? మిథ్యాప్రత్యయేన ఏవ అనాత్మనః సంతః ఆత్మత్వం ఆపాద్యంతే, తద్భావే భావాత్, తదభావే చ**

**అభావాత్. అవివేకినాం హి అజ్ఞానకాలే బాలానం దృశ్యతే 'దీర్ఘః అహం' 'గౌరః అహం' ఇతి దేహాదిసంఘాతే అహంప్రత్యయః. న తు వివేకినాం అన్యః అహం దేహాదిసంఘాతాత్ ఇతి. జానతాం తత్కాలే దేహాదిసంఘాతే అహంప్రత్యయః భవతి. తస్మాత్ మిథ్యాప్రత్యయాభావే అభావాత్ తత్కృతః ఏవ, న గౌణః. పృథగ్గృహ్యమాణ - విశేషసామాన్యయోః హి సింహదేవదత్తయోః అగ్నిమాణవకయోః వా గౌణః ప్రత్యయః శబ్దప్రయోగః వా స్యాత్, న అగృహ్యమాణ విశేషసామాన్యయోః. యత్తు ఉక్తం 'శ్రుతిప్రామాణ్యాత్' ఇతి - తత్ న, తత్ప్రామాణస్య అదృష్ట - విషయత్వాత్. ప్రత్యక్షాదిప్రమాణానులబ్ధే హి విషయే అగ్నిహోత్రాది సాధ్యసాధనసంబంధే శ్రుతేః ప్రామాణ్యం, న ప్రత్యక్షాదివిషయే అదృష్టదర్శనార్థవిషయత్వాత్ ప్రమాణస్య. తస్మాత్ న దృష్టమిథ్యా-జ్ఞాననిమిత్తస్య అహంప్రత్యయస్య దేహాదిసంఘాతే గౌణత్వం కల్పయితుం శక్యమ్. న హి శ్రుతిశతమపి 'శీతః అగ్నిః, అప్రకాశో వా' ఇతి బ్రువత్ ప్రామాణ్యం ఉపైతి. యది బ్రూయాత్ 'శీతః అగ్నిః, అప్రకాశో వా' ఇతి, తథాఽపి అర్థాంతరం శ్రుతేః వివక్షితం కల్ప్యమ్, ప్రామాణ్యాన్యథాఽను-పపత్తేః, న తు ప్రమాణాంతరవిరుద్ధం స్వవచనవిరుద్ధం వా కల్ప్యమ్.**

**తె.అ.** ఆక్షేపణ - స్వర్గాది అదృష్ట విషయాలలో చేయదగిన కర్మలను విధించడంలో వేదం ప్రమాణం. కనుక ఆత్మ చేయవలసిన కర్మ గౌణాత్మ అయిన దేహేంద్రియాదుల చేత చేయబడుతున్నది అంటే?

సమాధానం - కాదు. ఇంద్రియాదులయందు ఆత్మభావం అవిద్యవల్ల కలిగేది కనుక దేహేంద్రియాదులు ఆత్మకు గౌణం కావు.

ఆక్షేపణ - మరేమిటి? (దేహేంద్రియాదులు ఆత్మ అన్న భావం ఎట్లా కలుగుతున్నది?)

సమాధానం - మిథ్యా ప్రత్యయంవల్ల సంగరహితమైన ఆత్మకు సంగతి కల్పించి దేహేంద్రి యాదులందు ఆత్మభావం ఆపాదించబడుతున్నది. మిథ్యాప్రత్యయం ఉన్నంతకాలం ఆ ఆత్మభావం ఉంటుంది. అది పోతే ఇదీ పోతుంది. అజ్ఞానకాలంలో అవివేకులకు నేను పొడుగ్గా ఉన్నాను ఎర్రగా ఉన్నాను అని ఆత్మాభిమానం ఉండడం చూస్తున్నాం. అదే దేహేంద్రియాలయందు అహంప్రత్యయం. దేహేంద్రియాదులు వేరు నేను వేరు అన్న జ్ఞానం కలవారికి ఆ జ్ఞానం ఉన్నంతకాలం దేహాదిసంఘాతంలో అహం ప్రత్యయం ఉండదు. అహంప్రత్యయం మిథ్యాప్రత్యయమున్నపుడు ఉంటున్నది. మిథ్యాప్రత్యయం లేనపుడు ఉండడంలేదు. కనుక అది మిథ్యాప్రత్యయకార్యమని తెలుస్తున్నది. అది గౌణం కాదు. సింహదేవదత్తులకు అగ్ని మాణవకులకు పోలికలు తేడాలు వేరువేరుగా తెలిసినపుడే గౌణప్రత్యయంగాని, ప్రయోగంగాని

సంభవం, పోలికలు తేడాలు తెలియనపుడు కాదు. ఇక శ్రుతిప్రామాణ్యం మాట. స్వర్గాది అదృష్టవిషయాలలోనే శ్రుతిప్రమాణం. ప్రత్యక్షాది ప్రమాణాలచేత తెలియలేని విషయాలలోనే అగ్నిహోత్రాదిసాధ్యసాధన సంబంధంలో శ్రుతి ప్రమాణం, ప్రత్యక్షాది విషయంలో కాదు. మనం చూడలేని విషయాలను చూపించడం కొరకే శ్రుతి ప్రామాణ్యం. కనుక, దేహాది సంఘాతంలో అహంప్రత్యయం మిథ్యాజ్ఞాన నిమిత్తంగా కలగడం మనం ప్రత్యక్షంగా చూస్తున్నపుడు అది గౌణమని ఎట్లా కల్పన చేయగలం? నిప్పు చల్లగా ఉంటుంది లేకపోతే దానికి వెలుగుండదు అని ఒక వేదం కాదు వంద వేదాలు చెప్పినా ఆ మాటను ప్రమాణంగా గ్రహించలేము. ఒకవేళ నిప్పు చల్లగా ఉంటుంది లేక దానికి వెలుగుండదు అని వేదం అన్నదంటే దానికి వేరే అర్థం ఉద్దేశించబడింది అని మనం అనుకోవలెను. మరొకవిధంగా దానికి ప్రామాణ్యం కలగదు కనుక. అంతేకాని ప్రత్యక్షాది ఇతర ప్రమాణాలకు గాని, వేదమే మరొకచోట చెప్పిన మాటకుగాని విరుద్ధమైన అర్థం కల్పించరాదు.

**భాష్యమ్ : 66.11 కర్మణః మిథ్యాప్రత్యయవత్కర్తృకత్వాత్ కర్తుః అభావే శ్రుతేః అప్రామాణ్యమ్ ఇతి చేత్ – న ; బ్రహ్మవిద్యాయాం అర్థవత్త్వోపపత్తేః.**

**కర్మవిధిశ్రుతివత్ బ్రహ్మవిద్యావిధిశ్రుతేః అపి అప్రామాణ్య ప్రసంగః ఇతి చేత్ –**

**– న; బాధక ప్రత్యయానుపపత్తేః. యథా బ్రహ్మవిద్యావిధిశ్రుత్యా ఆత్మని అవగతే దేహాది సఘాతే అహంప్రత్యయః బాధ్యతే తథా ఆత్మని ఏవ ఆత్మావగతిః న కదాచిత్ కేనచిత్ కథంచిత్ అపి బాధితుం శక్యా, ఫలావ్యతిరేకాత్ అవగతేః యథా అగ్నిః ఉష్ణః ప్రకాశశ్చ ఇతి, న చ ఏవం కర్మవిధిశృతేః అప్రామాణ్యం, పూర్వపూర్వప్రవృత్తినిరోధేన ఉత్తరోత్తరాపూర్వప్రవృత్తి జననస్య ప్రత్యగాత్మభిముఖ్యేన ప్రవృత్త్యుత్పాదనార్థత్వాత్. మిథ్యాత్వేఽపి ఉపాయస్య ఉపేయసత్యతయా సత్యత్వమ్ ఏవ స్యాత్, యథా అర్థవాదానాం విధిశేషాణామ్, లోకేఽపి బాలోన్మత్తాదీనాం పయ ఆదౌ పాయయితవ్యే చూడావర్ధనాది వచనమ్. ప్రకారాంతరస్థానం చ సాక్షాత్ ఏవ ప్రామాణ్యం సిద్ధం, ప్రాక్ ఆత్మజ్ఞానాత్ దేహాభిమాననిమిత్తప్రత్యక్షాదిప్రామాణ్యవత్.**

**తె.అ.** ఆక్షేపణ – మిథ్యాప్రత్యయం కలవాడు మాత్రమే కర్మలు చేస్తాడు. అంటే వాస్తవంలో కర్త లేడు. కర్త లేనపుడు శ్రుతి అప్రమాణం కాదా?

సమాధానం – కాదు. బ్రహ్మవిద్యావిషయంలో శ్రుతి సార్థకమే కనుక.

ఆక్షేపణ – కర్మను విధించే శ్రుతి వలెనే బ్రహ్మవిద్యను విధించే శ్రుతి కూడా అప్రమాణం కాదా?

సమాధానం – కాదు. బ్రహ్మవిద్యను తొలగించగల ప్రత్యయం కలగదు కనుక. బ్రహ్మవిద్యను విధించే శ్రుతివలన ఆత్మజ్ఞానం కలిగి దేహాదులయందు ఆత్మప్రత్యయం తొలగిపోయిన విధంగా ఆత్మయందు ఆత్మబుద్ధి ఎవడిచేతను ఎప్పటికి ఏ విధంగాను తొలగదు. ఎందుకంటె జ్ఞానము, జ్ఞానఫలము ఒకటే కనుక, నిప్పు, వేడి వెలుగు వలె. (కర్మ తొలగి జ్ఞానం మిగిలినట్లు, జ్ఞానం తొలగి జ్ఞానఫలం మిగిలే అవకాశం లేదు, జ్ఞానానికి ఫలం జ్ఞానమే కనుక. కాబట్టి బ్రహ్మవిద్యను విధించే శాస్త్రం ఆ బ్రహ్మవిద్య కలిగిన తరువాత పనికిరాకుండా పోతుంది అన్నమాట లేదు.) ఆ మాటకొస్తే బ్రహ్మవిద్యను విధించే శ్రుతే కాదు కర్మను విధించే శ్రుతి కూడా అప్రమాణం కాదు. స్వాభావికమైన పూర్వ పూర్వప్రవృత్తులను నిరోధించి ఉత్తరోత్తర అపూర్వ ప్రవృత్తులను కలిగించి అంతరాత్మయందు ఆభిముఖ్యం కలిగిస్తుంది కనుక. ఉపాయం (సాధనం) మిథ్యే అయినా ఉపేయం (సిద్ధి) సత్యం కనుక అదీ సత్యమే అవుతుంది, విధి చివర చెప్పే స్తుతివాక్యాలవలె. లోకంలో కూడా చూస్తుంటాం పసివానిచేతనో, పిచ్చివానిచేతనో పాలు త్రాగించవలసినపుడు పాలు తాగితే జుట్టు బాగా పెరుగుతుంది అని చెప్పడం. ఆత్మజ్ఞానం కలగకముందు దేహాభిమాన నిమిత్తంగా కలిగే ప్రత్యక్షాది ప్రమాణాల వలెనే కర్మను విధించే శ్రుతి ప్రామాణ్యం కూడా ప్రత్యక్షమే.

**భాష్యమ్ : 66.12 యత్తు మన్యసే స్వయమవ్యాప్రియమాణోఽపి ఆత్మా సన్నిధిమాత్రేణ కరోతి, తదేవ ముఖ్యం కర్తృత్వమాత్మనః యథా రాజా యుధ్యమానేషు యోధేషు యుధ్యత ఇతి ప్రసిద్ధం స్వయమయుధ్య - మానోఽపి సన్నిధానాదేవ జితః పరాజితశ్చేతి, తథా సేనాపతిః వాచైవ కరోతి, క్రియాఫలసంబంధశ్చ రాజ్ఞః సేనాపతేశ్చ దృష్టః. యథా చ ఋత్విక్కర్మ యజమానస్య, తథా దేహాదీనాం కర్మ ఆత్మకృతం స్యాత్, ఫలస్య ఆత్మగామిత్వాత్, యథా వా భ్రామకస్య లోహభ్రామ- యితృత్వాత్, అవ్యాపృతస్యైవ ముఖ్యమేవ కర్తృత్వం, తథా చాత్మాన ఇతి. తదసత్ అకుర్వతః కారకత్వ ప్రసంగాత్.**

**కారకమనేక ప్రకారమితి చేత్ -**

**న, రాజప్రభృతీనాం ముఖ్యస్యాపి కర్తృత్వస్య దర్శనాత్. రాజా తావత్ స్వవ్యాపారేణాపి యుధ్యతే యోధానాం చ యోధయితృత్వే ధనాదానే చ ముఖ్య కర్తృత్వం తథా జయపరాజయ ఫలోపభోగే, యజమానస్యాపి ప్రధానత్యాగే దక్షిణాదానే చ ముఖ్యమేవ కర్తృత్వం. తస్మాత్ అవ్యాపృతస్య కర్తృత్వోపచారో యః, సః గౌణః ఇతి అవగమ్యతే. యది ముఖ్యం అన్యత కర్తృత్వం స్వవ్యాపారలక్షణం నోపలభ్యేత రాజయజమానప్రభృతీనాం, తదా సన్నిధి మాత్రేణాపి కర్తృత్వం ముఖ్యం పరికల్ప్యేత, యథా భ్రామకస్య లోహభ్రమణేన, న తథా రాజయజమానాదీనాం**

**స్వవ్యాపారో నోపలభ్యతే, తస్మాత్సన్నిధిమాత్రేణ కర్తృత్వం గౌణమేవ తథా చ సతి తత్ఫలసంబంధోఽపి గౌణ ఏవ స్యాత్, న గౌణేన ముఖ్యం కార్యం నిర్వర్త్యతే, తస్మాత్సన్నిధిమాత్రేణ కర్తృత్వం గౌణమేవ. తథా చ సతి తత్ఫలసంబంధోఽపి గౌణ ఏవ స్యాత్, న గౌణేన ముఖ్యం కార్యం నిర్వర్త్యతే, తస్మాదసదేవ ఏతత్ గీయతే 'దేహాదీనాం వ్యాపారేణ అవ్యాపృత ఏవాత్మా కర్తా భోక్తా చ స్యాత్' ఇతి. భ్రాంతినిమిత్తం తు సర్వముపపద్యతే, యథా స్వప్నే, మాయాయాం చ ఏవం, న చ దేహాద్యాత్మప్రత్యయభ్రాంతి సంతానవిచ్ఛేదేషు సుషుప్తిసమాధ్యాదిషు కర్తృత్వభోక్తృత్వాద్యనర్థః ఉపలభ్యతే. తస్మాత్ భ్రాంతిప్రత్యయ నిమిత్తఏవాయం సంసారభ్రమః, న తు పరమార్థతః ఇతి సమ్యగ్దర్శనాత్ అత్యంతోపరమ ఇతి సిద్ధమ్.**

**తె.అ.** ఆక్షేపణ – ఆత్మ స్వయంగా ఏ వ్యాపారము చేయనిదైనా సన్నిధిమాత్రంచేత చేస్తుంది. అదే ఆత్మకు ముఖ్య కర్తవ్యం. యోధులు యుద్ధం చేస్తుంటే రాజు యుద్ధం చేస్తున్నాడు అనడం లోకప్రసిద్ధం. స్వయంగా యుద్ధం చేయకపోయినా రాజు గెలిచాడు ఓడిపోయాడు అనికూడా అంటుంటాం. అట్లాగే సేనాపతికూడా. కేవలం మాటమాత్రంచేతనే చేస్తున్నాడు. క్రియాఫలంతో రాజుకు సేనాపతికి కూడా సంబంధం మనం చూస్తున్నాం. ఋత్విజుడు చేసే కర్మ యజమాని చేసినదే అయినట్లు దేహాదులు చేసే కర్మ ఆత్మ చేసినట్లే, ఎందుకంటే ఆ కర్మఫలం ఆత్మకు చెందుతుంది కనుక. సూదంటురాయి స్వయంగా ఏ వ్యాపారము చేయదు, కాని ఇనుపముక్కను అటూ ఇటూ కదిలిస్తుంది. కనుక అది ముఖ్యార్థంలో కర్త. ఆత్మకూడా అంతే.

సమాధానం – అట్లా అనడం పొరపాటు. చేయని దానిని చేసింది (కారకము) అనడమే ఆ పొరపాటు.

ఆక్షేపణ – కారకం అనేకవిధాలుగా ఉండవచ్చుగదా?

సమాధానం – ఉండదు. రాజు సేనాపతి మొదలైనవారు ముఖ్యార్థంలో కూడా కర్తలు కావడం చూస్తున్నాం కనుక. రాజు స్వయంగా కూడా యుద్ధం చేస్తాడు, యోధులచేత చేయిస్తాడు. ధనమిస్తాడు. జయాపజయఫలమనుభవిస్తాడు. అంటే అతని కర్తృత్వం ముఖ్యం, గౌణం కాదు. అట్లాగే యజమానికూడా ప్రధాన ఆహుతి స్వయంగా ఇస్తాడు దక్షిణ కూడా ఇస్తాడు. కనుక అతని కర్తృత్వం కూడా ముఖ్యమే. దీనినిబట్టి క్రియారహితమైనదానియందు ఆరోపించబడే కర్తృత్వం గౌణమని తేలింది. ఒకవేళ రాజు మొదలైనవారిలో స్వవ్యాపారలక్షణమైన కర్తృత్వం లేకపోయినా, సూదంటురాయి ఇనుపముక్కను కదిలించినవిధంగా సన్నిధిమాత్రంచేత వారు కర్తలని కల్పించవలసి ఉంటుంది. కాని రాజయజమానులు సూదంటురాయివలె కాదు. కనుక సన్నిధిమాత్రంచేత కలిగే కర్తృత్వంకూడా గౌణమే. కర్తృత్వం గౌణమైనపుడు దాని ఫలసంబంధం

కూడా గౌణమే అవుతుంది. ఎందుకంటే గౌణకర్త ద్వారా ముఖ్యకార్యం చేయబడదు. కనుక, దేహాదుల వ్యాపారకారణంగా ఏ వ్యాపారము చేయని ఆత్మ కర్త భోక్త అవుతుంది అనడం అసత్యం. అయితే భ్రాంతివల్ల సర్వము సంభవమే, కలలో గారడీలోవలె. దేహాదులే నేను అన్న భ్రాంతి సంతానం విచ్ఛేదమైనపుడు సుషుప్తి సమాధివంటి అవస్థలయందు కర్తృత్వము భోక్తృత్వమువంటి అనర్థం ఉండదు. కనుక భ్రాంతి ప్రత్యయ నిమిత్తమైనదే ఈ సంసారభ్రమ, వాస్తవికం కాదు. అందుకని సమ్యగ్దర్శనంచేత అది పూర్తిగా నివృత్తి అవుతుంది అని తేలింది.

**భాష్యమ్ : 67.0 సర్వగీతాశాస్త్రార్థం ఉపసంహృత్య అస్మిన్ అధ్యాయే, విశేషతశ్చ అంతే ఇహ శాస్త్రార్థ దార్ఢ్యాయ సంక్షేపతః ఉపసంహారం కృత్వా, అథ ఇదానీం శాస్త్ర సంప్రదాయవిధిమ్ ఆహ.**

**తె.అ.** సమస్త గీతాశాస్త్రార్థాన్ని ఈ అధ్యాయంలో ఉపసంహరించి, విశేషించి చివర మళ్ళీ ('సర్వధర్మాన్') అన్న శ్లోకంలో శాస్త్రార్థాన్ని దృఢం చేయడంకోసం సంక్షేపంగా ఉపసంహరించి ఇక యిప్పుడు శాస్త్రసంప్రదాయ విధిని చెపుతున్నాడు.

**మూ. ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదా చన ।**
**న చాశుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్యసూయతి ॥ 67**

**తె.అ.** ఈ శాస్త్రాన్ని నీవు తపించనివానికి, భక్తిలేనివానికి ఎన్నటికీ చెప్పవద్దు. వినదలచని వానికి కూడా చెప్పవద్దు. నన్ను దూషించేవానికీ చెప్పవద్దు.

**భాష్యమ్ : 67.1 ఇదం ఇతి. ఇదం శాస్త్రం తే తవ హితాయ మయా ఉక్తం సంసారవిచ్ఛిత్తయే అతపస్కాయ తపోరహితాయ న వాచ్యం ఇతి వ్యవహితేన సంబధ్యతే. తపస్వినేఽపి అభక్తాయ గురౌ దేవే చ భక్తిరహితాయ కదాచన కస్యాంచిత్ అపి అవస్థాయాం న వాచ్యమ్. భక్తః తపస్వీ అపి సన్ అశుశ్రూషుః యః భవతి తస్మై అపి న వాచ్యమ్. న చ యః మాం వాసుదేవం ప్రాకృతం మనుష్యం మత్వా అభ్యసూయతి ఆత్మప్రశంసాది దోషాధ్యారోపణేన ఈశ్వరత్వం మమ అజానన్ న సహతే. అసౌ అపి అయోగ్యః, తస్మై అపి న వాచ్యమ్. భగవతి అనసూయాయుక్తాయ తపస్వినే భక్తాయ శుశ్రూషవే వాచ్యం శాస్త్రం ఇతి సామర్థ్యమ్ గమ్యతే. తత్ర 'మేధావినే తపస్వినే వా' ఇతి అనయోః వికల్పదర్శనాత్ శుశ్రూషాభక్తియుక్తాయ తపస్వినే తద్యుక్తాయ మేధావినే వా వాచ్యమ్. శుశ్రూషాభక్తి వియుక్తాయ న తపస్వినే నాపి మేధావినే వాచ్యమ్. భగవతి అసూయాయుక్తాయ సమస్తగుణవతేఽపి న వాచ్యమ్. గురుశుశ్రూషాభక్తిమతే చ వాచ్యం ఇత్యేషః శాస్త్రసంప్రదాయ విధిః.**

**తె.అ.** నీ మేలు కోరి, సంసార విచ్ఛేదం కొరకు, ఈ శాస్త్రం నీకు నేను చెప్పాను. దీనిని నీవు తపోవిరహితునికి చెప్పవద్దు. తపస్వి అయినప్పటికి గురువునందు దైవమందు భక్తిలేనివానికి ఎన్నటికి ఎటువంటి పరిస్థితిలోను చెప్పవద్దు. భక్తుడు తపస్వి అయి ఉండికూడా వినవలెనని కోరిక లేనివానికి కూడా వినిపించవద్దు. వాసుదేవుడనైన నా ఈశ్వరత్వం తెలియక నేను ప్రాకృతమనుష్యుడనని తలచి ఆత్మ ప్రశంసవంటి దోషాలు నాయందు ఆరోపించి నన్ను సహించలేని అసూయాపరునికి కూడా చెప్పవద్దు. భగవంతునియందు అసూయలేనివానికి, తపస్వికి, భక్తిగలవానికి వినగోరువానికి ఈ శాస్త్రం చెప్పదగును అని అర్థం చేసుకోవలెను. 'మేధావికేగాని తపస్వికేగాని' అన్న వికల్పం కొన్ని స్మృతులయందు కనిపిస్తున్నది కనుక వినవలెనని కోరిక భక్తిగల మేధావికి లేక అవి ఉన్న తపస్వికి చెప్పదగును. వినవలెననుకోరిక భక్తిలేనివానికి, వాడు మేధావి తపస్వి అయినప్పటికి, చెప్పతగదు. భగవంతునియందు అసూయగలవానికి, అతనికి ఎన్ని మంచి గుణాలు ఉన్నప్పటికి, చెప్పరాదు. గురుశుశ్రూష భక్తి ఉన్నవానికి చెప్పదగును. ఇది శాస్త్రసంప్రదాయవిధి.

**భాష్యమ్ : 68.0 సంప్రదాయస్య కర్తుః ఫలం ఇదానీం ఆహ -**

**తె.అ.** సంప్రదాయాన్ని పాటించేవానికి కలిగే ఫలం ఇప్పుడు చెపుతున్నాడు.

**మూ. య ఇమం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి ।**
**భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః ॥ 68**

**తె.అ.** నాయందు పరమభక్తి కలిగి, పరమరహస్యమైన ఈ శాస్త్రాన్ని నా భక్తులకు చెప్పేవాడు నన్నే చేరుకుంటాడు.

**భాష్యమ్ : 68.1 య ఇమం ఇతి. యః ఇమం యథోక్తం పరమం పరమనిఃశ్రేయసార్థం కేశవార్జునయోః సంవాదరూపం గ్రంథం గుహ్యం గోప్యతమం మద్భక్తేషు మయి భక్తిమత్సు అభిధాస్యతి వక్ష్యతి, గ్రంథః అర్థతః చ స్థాపయిష్యతి ఇత్యర్థః, యథా త్వయి మయా. భక్తేః పునర్గ్రహణాత్ భక్తిమాత్రేణ కేవలేన శాస్త్రసంప్రదానే పాత్రం భవతి ఇతి గమ్యతే. కథం అభిధాస్యతి ఇతి? ఉచ్యతే భక్తిం మయి పరాం కృత్వా 'భగవతః పరమగురోః అచ్యుతస్య శుశ్రూషా మయా క్రియతే' ఇత్యేవం కృత్వా ఇత్యర్థః. తస్య ఇదం ఫలమ్ - మాం ఏవ ఏష్యతి ముచ్యతే ఏవ. అసంశయః అత్ర సంశయః న కర్తవ్య. కించ -**

**తె.అ.** కేశవార్జున సంవాదరూపమైన ఇప్పుడు చెప్పబడిన శాస్త్రం పరమనిశ్శ్రేయస ప్రయోజనం గలిగినది. ఈ గ్రంథం అతిగోప్యమైనది. దీనిని నా భక్తులకు గ్రంథ రూపంగాగాని అర్థరూపంగా

గాని నేను నీకు చెప్పిన విధంగా చెప్పేవాడు, శాస్త్రాన్ని స్థాపించేవాడు, నన్నే చేరుకుంటాడు, అంటే ముక్తుడవుతాడు. శ్లోకంలో రెండవపాదంలో 'భక్తి' అనే పదం మళ్ళీ ప్రయోగించడం వలన కేవలం భక్తిమాత్రం చేత శాస్త్రసంప్రదానానికి పాత్రమవుతాడు అని తెలుస్తున్నది. ఏ విధంగా చెపుతాడు ఈ శాస్త్రాన్ని? అంటే, నాయందు పరమభక్తి గలిగి, 'పరమగురువు అచ్యుతుడు అయిన భగవంతునికి నేను చేయుసేవ' అని భావించి అని అర్థం. దానికి ఫలమిది – నన్నే చేరుతాడు, తప్పక ముక్తుడవుతాడు. ఈ విషయంలో సందేహించ పనిలేదు. అంతే కాదు–

**మూ. న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః ।**
**భవితా న చ మే తస్మాదన్యః ప్రియతరో భువి ॥ 69**

**తె.అ.** శాస్త్రసంప్రదాయం పాటించడంకంటె ప్రియం ఎవడూ నాకు చేయగలిగింది లేదు. ఆ విధంగా చేసేవానికంటె ఈ లోకంలో నాకెవ్వడూ ఎక్కువ ఇష్టుడు లేడు, కాబోడు.

**భాష్యమ్ : 69.1 న చ ఇతి. న చ తస్మాత్ శాస్త్రసంప్రదాయకృతః మనుష్యేషు మనుష్యాణాం మధ్యే కశ్చిత్ మే మమ ప్రియకృత్తమః అతిశయేన ప్రియకరః, అన్యః ప్రియకృత్తమః, నాస్త్యేవ్యం ఇత్యర్థః వర్తమానేషు. న చ భవితా భవిష్యత్యపి కాలే తస్మాత్ ద్వితీయః అన్యః ప్రియతరః ప్రియకృత్తరః భువి లోకేఽస్మిన్ న భవితా. యోఽపి.**

**తె.అ.** శాస్త్రసంప్రదాయం పాటించేవానికంటె ఎక్కువ ప్రియమాచరించేవాడు మనుష్యులలో ఎవడూ లేడు. వర్తమానకాలంలో అంతకంటె ప్రియమాచరించేవాడు మరొకడు లేడు. భవిష్యత్కాలంలో కూడా ఈ లోకంలో మరొకడెవడూ నాకు అతనికంటె ఇష్టుడుండబోడు. అతడే గాదు.

**మూ. అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాదమావయోః ।**
**జ్ఞానయజ్ఞేన తేనాహమిష్టః స్యామితి మే మతిః ॥ 70**

**తె.అ.** మన ఈ పుణ్యసంవాదం ఎవడు అధ్యయనం చేస్తాడో వాడు జ్ఞానయజ్ఞంతో నన్ను పూజించిన వాడవుతాడు అని నా అభిప్రాయం.

**భాష్యమ్ : 70.1 అధ్యేష్యతే ఇతి. అధ్యేష్యతే చ పఠిష్యతి యః ఇమం ధర్మ్యం ధర్మాదనపేతం సంవాదరూపం గ్రంథం ఆవయోః, తేన ఇదం కృతం స్యాత్. జ్ఞానయజ్ఞేన విధిజపోపాంశుమాన–సానాం యజ్ఞానాం జ్ఞానయజ్ఞః మానసత్వాత్ విశిష్టతమః ఇత్యతః తేన జ్ఞానయజ్ఞేన గీతాశాస్త్రస్య అధ్యయనం స్తూయతే, ఫలవిధిః ఏవ వా, దేవతాదివిషయజ్ఞానఫలతుల్యం అస్య ఫలం భవతీతి – తేన అధ్యయనేన అహం ఇష్టః పూజితః స్యాం భవేయం ఇతి మే మమ మతిః నిశ్చయః.**

**తె.అ.** మన సంవాదరూపమైన ఈ పుణ్యగ్రంథాన్ని ఎవడు అధ్యయనం చేస్తాడో వాడు జ్ఞానయజ్ఞంలో నన్ను పూజించిన వాడవుతాడు అని నా నిశ్చయం. విధియజ్ఞము, జపయజ్ఞము ఉపాంశుయజ్ఞము (సన్నని స్వరంతో చేసే జపం) మానస యజ్ఞము - ఈ నాలుగు విధాలైన యజ్ఞాలలో జ్ఞానయజ్ఞం మానసం కనుక ఉత్తమమైనది. అందుకని ఆ జ్ఞానయజ్ఞంతో గీతాశాస్త్ర అధ్యయనాన్ని స్తుతిస్తున్నాడు. లేక దేవతాదులను గూర్చిన జ్ఞానయజ్ఞంవల్ల కలిగే ఫలమే ఈ అధ్యయనం వల్ల కూడా లభిస్తుంది.

**భాష్యమ్ : 71.0 అథ శ్రోతుః ఇదం ఫలమ్ -**

**తె.అ.** ఇక శ్రోతకు ఫలం -

**మూ. శ్రద్ధావాననసూయశ్చ శృణుయాదపి యో నరః ।**
**సోఽపి ముక్తః శుభాన్ లోకాన్ ప్రాప్నుయాత్పుణ్యకర్మణామ్ ॥ 71**

**తె.అ.** శ్రద్ధ కలిగి, అసూయలేకుండా దీనిని విన్నవాడు కూడా ముక్తి పొందుతాడు. పుణ్యకర్మలు చేసినవారు వెళ్ళే పుణ్యలోకాలను కూడా చేరుకొంటాడు.

**భాష్యమ్ : 71.1 శ్రద్ధావాన్ ఇతి. శ్రద్ధావాన్ శ్రద్దానః అనసూయః చ అసూయావర్జితః సన్ ఇమం గ్రంథం శృణుయాత్ అపి యః నరః అపిశబ్దాత్ కిముత అర్థజ్ఞానవాన్? సః అపి పాపాత్ ముక్తః శుభాన్ ప్రశస్తాన్ లోకాన్ ప్రాప్నుయాత్ పుణ్యకర్మణాం అగ్నిహోత్రాది కర్మవతామ్.**

**తె.అ.** ఈ గ్రంథాన్ని శ్రద్ధతో అసూయావర్జితుడై ఎవడు వింటాడో వాడు కూడా పాపంనుండి ముక్తుడై అగ్నిహోత్రాది పుణ్యకర్మలు చేసినవారు పొందే ప్రశస్తమైన పుణ్యలోకాలను పొందుతాడు. 'విన్నవాడు కూడా' అనడం చేత కేవలం వినడమే కాకుండా అర్థం కూడా తెలిసినవానికి ఎటువంటి ఫలం ఉంటుందో చెప్పవలసిన పని ఏముంది అని అర్థం.

**భాష్యమ్ : 72.0 శిష్యస్య శాస్త్రార్థగ్రహణాగ్రహణవివేకబుభుత్సయా పృచ్ఛతి. తద్గ్రహణే జ్ఞాతే పునః గ్రాహయిష్యామి ఉపాయాంతరేణ అపి ఇతి ప్రష్టుః అభిప్రాయః యత్నాంతరం చ ఆస్థాయ శిష్యస్య కృతార్థతా కర్తవ్యా ఇతి ఆచార్యధర్మః ప్రదర్శితః భవతి.**

**తె.అ.** శిష్యుడు శాస్త్రార్థాన్ని గ్రహించాడా లేదా అని తెలుసుకోవలెనని ప్రశ్నిస్తున్నాడు. గ్రహించలేదని తెలిస్తే మరొకవిధంగానైనా గ్రహించేటట్లు చేద్దామని ఆయన అభిప్రాయం. మరొక ఉపాయాన్ని అవలంబించి శిష్యుని కృతార్థుని చేయడమే కర్తవ్యము అన్న ఆచార్యధర్మం ఇక్కడ మనకు తెలియ చెప్పబడింది -

**మూ. కచ్చిదేతత్ శ్రుతం పార్థ త్వయైకాగ్రేణ చేతసా ।**
**కచ్చిదజ్ఞానసంమోహః ప్రనష్టస్తే ధనంజయ ॥ 72**

**తె.అ.** పార్థా, ఇది నీవు ఏకాగ్రమైన చిత్తంతో విన్నావా? ధనంజయా, నీ అజ్ఞాన సమ్మోహం నశించిందా?

**భాష్యమ్ : 72.1 కచ్చిత్ ఇతి. కచ్చిత్ కిం ఏతత్ మయా ఉక్తం శ్రుతం శ్రవణేన అవధారితం పార్థ! త్వయా ఏకాగ్రేణ చేతసా చిత్తేన? కిం వా అప్రమాదతః? కచ్చిత్ అజ్ఞానసమ్మోహః అజ్ఞాననిమిత్తః సమ్మోహః అవివిక్తభావః (విచిత్తభావః) అవివేకః స్వాభావికః కిం ప్రనష్టః? యదర్థః అయం శాస్త్రశ్రవణాయాసః తవ, మమ చ ఉపదేష్టృత్వాయాసః ప్రవృత్తః – తే తవ హే ధనంజయ.**

**తె.అ.** అర్జునా, నీకు నేను చెప్పిన దీనిని ఏకాగ్రమైన చిత్తంతో విని గ్రహించావా? లేక సరిగా వినలేదా? అజ్ఞాన నిమిత్తమైన సమ్మోహం, స్వాభావికమైన అవివేకం నశించిందా? దేని నిమిత్తమై నీవు శాస్త్రం విన ఉత్సాహాన్ని చూపించాలో నేను ఉపదేశించడం అనే శ్రమను వహించానో అందుకు తగ్గట్టుగా నీ అజ్ఞాన నాశం కలిగిందా?

**అర్జున ఉవాచ –**

**మూ. నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాఽచ్యుత ।**
**స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ ॥ 73**

అర్జునుడంటున్నాడు –

**తె.అ.** అచ్యుతా, నీ అనుగ్రహం వలన నా మోహం నశించింది. స్మృతి లభించింది. సందేహం తొలగిపోయి నిలచి ఉన్నాను. నీ మాట ప్రకారం నడచుకుంటాను.

**భాష్యమ్ : 73.1 నష్టః ఇతి. నష్టః మోహః అజ్ఞానజః సమస్తసంసారానర్థహేతుః, సాగరః ఇవ దుస్తరః. స్మృతిః చ ఆత్మతత్త్వవిషయా లబ్ధా – యస్యాః లాభాత్ సర్వహృదయగ్రంథీనాం విప్రమోక్షః త్వత్ప్రసాదాత్ తవ ప్రసాదాత్ మయా త్వత్ప్రసాదం ఆశ్రితేన అచ్యుత. అనేక మోహనాశప్రశ్న ప్రతివచనేన సర్వశాస్త్రార్థజ్ఞానఫలం ఏతావత్ ఏవ ఇతి నిశ్చితం దర్శితం భవతి, యతః జ్ఞానాత్ మోహనాశః ఆత్మస్మృతిలాభః చ ఇతి. తథా చ శ్రుతౌ 'అనాత్మవిత్ శోచామి' ఇతి ఉపన్యస్య ఆత్మజ్ఞానేన సర్వగ్రంథీనాం విప్రమోక్షః ఉక్తః (ఛాం.ఉ.7.1.3.26.2) 'భిద్యతే హృదయగ్రంథి' (ముం.ఉ.2.2.8) 'తత్ర కో మోహః కః శోకః ఏకత్వమనుపశ్యతః' (ఈ.ఉ.7) ఇతి చ మంత్రవర్ణః. అథ ఇదానీం త్వచ్ఛాసనే స్థితః అస్మి గతసందేహః ముక్తసంశయః**

**కరిష్యే వచనం తవ. అహం త్వత్ప్రసాదాత్ కృతార్థః, న మే కర్తవ్యం అస్తి ఇత్యభిప్రాయః.**

**తె.అ.** అచ్యుతా, అజ్ఞానం వల్ల కలిగినది, సంసారమనే సర్వానర్థానికి కారణమైనది, సముద్రం వలె దాటడం కష్టమైనది అయిన మోహం నశించింది. నీ అనుగ్రహాన్ని ఆశ్రయించిన నాకు సర్వహృదయగ్రంథులు విడివడి ఆత్మతత్త్వ విషయమైన స్మృతి కలిగింది. మోహం నశించిందా అన్న ప్రశ్న, దానికి ప్రతివచనం – వీటివలన సర్వ శాస్త్రార్థము తెలుసుకున్నందుకు ఫలమిది అని నిశ్చయించి తెలిపినట్లయింది, ఆ జ్ఞానం వల్ల మోహనాశము, ఆత్మ స్మృతి లాభము కలుగుతుంది అని. శ్రుతికూడా ఇదే చెపుతున్నది, 'నేనెవరో తెలియక నాకీ శోకం' (ఛాం.ఉ.7.1.3) అని ప్రారంభించి 'ఆత్మజ్ఞానం చేత సర్వగ్రంథులు విడివడుతాయి' అని చెప్పబడింది. మంత్రవర్ణాలు కూడా ఉన్నాయి– 'హృదయగ్రంథి విడివడుతుంది' (ముం.ఉ.2.2.8), 'ఏకత్వాన్ని చూచేవానికి మోహమెక్కడిది, శోకమేమిటి?'(ఈ.ఉ.7). ఇక ఇప్పుడు సందేహం తొలగి నీ శాసనం ప్రకారం నడచుకోడానికి నిలిచి ఉన్నాను. నీవు చెప్పినట్లు చేస్తాను. అంటే నీ అనుగ్రహం వలన నేను కృతార్థుణ్ణి. ఇక నాకు చేయవలసినదేదీ లేదు అని అభిప్రాయం. ('కరిష్యే వచనం తవ' (నీవు చెప్పినట్టు చేస్తాను) అన్నదానికి 'నాకు చేయదగినదేదీ లేదు' అని వ్యాఖ్య. అంటే 'నేను' లేను. ఇకపై నీమాటే అని.)

**భాష్యమ్ : 74.0 పరిసమాప్తః శాస్త్రార్థః అథ ఇదానీం కథాసంబంధప్రదర్శనార్థం సంజయః ఉవాచ –**

**తె.అ.** శాస్త్రార్థం పరిసమాప్తమైనది. ఇక ఇప్పుడు దీనిని కథతో కలుపుతున్నాడు. సంజయుడంటున్నాడు –

**మూ. ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః ।**
**సంవాదమిమమశ్రౌషమద్భుతం రోమహర్షణమ్ ॥ 74**

**తె.అ.** ఈ విధంగా నేను వాసుదేవునికి మహాత్ముడైన అర్జునునికి జరిగిన ఈ సంవాదం, అద్భుతము, రోమాంచకము అయిన సంవాదం, విన్నాను.

**భాష్యమ్ : 74.1 ఇత్యహం ఇతి. ఇతి ఏవం అహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః సంవాదం ఇమం యథోక్తం అశ్రౌషం శ్రుతవాన్ అస్మి అద్భుతం అత్యంతవిస్మయకరం రోమహర్షణం రోమాంచకరమ్. తం చ ఇమమ్.**

**తె.అ.** ఈ విధంగా నేను వాసుదేవునికి మహాత్ముడైన అర్జునునికి జరిగిన ఇప్పుడు చెప్పిన ఈ సంవాదం అత్యంత విస్మయం రోమాంచనం కలిగేలా విన్నాను. ఇది కూడా–

**మూ. వ్యాసప్రసాదాచ్ఛ్రుతవానిమం గుహ్యతమం పరమ్ ।**
**యోగం యోగేశ్వరాత్ కృష్ణాత్సాక్షాత్కథయతః స్వయమ్ ॥ 75**

**తె.అ.** సాక్షాత్తు యోగేశ్వరుడైన కృష్ణుడు స్వయంగా చెపుతుండగా పరమరహస్యమైన ఈ యోగం – నేను వ్యాసుని అనుగ్రహం చేత విన్నాను.

**భాష్యమ్ : 75.1 వ్యాస ఇతి. వ్యాసప్రసాదాత్ తతః దివ్యచక్షుర్లాభాత్ శ్రుతవాన్ ఇమం సంవాదం గుహ్యతమం పరం యోగం – యోగార్థత్వాత్ గ్రంథోఽపి యోగః – సంవాదం ఇమం యోగమ్ ఏవ వా యోగేశ్వరాత్ కృష్ణాత్ సాక్షాత్ కథయతః స్వయం, న పరంపరయా.**

**తె.అ.** వ్యాసుని అనుగ్రహం చేత దివ్యదృష్టి పొంది సంవాదరూపమైన ఈ పరమ రహస్యయోగం – యోగాన్ని చెప్పే గ్రంథం కూడా యోగమే– సాక్షాత్తు యోగేశ్వరుడైన కృష్ణుడు స్వయంగా చెపుతుండగా విన్నాను, శిష్యపరంపరద్వారా కాదు.

**మూ. రాజన్ సంస్మృత్య సంస్మృత్య సంవాదమిమమద్భుతమ్ ।**
**కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః ॥ 76**

**తె.అ.** రాజా! కేశవార్జునుల ఈ అద్భుత పుణ్యసంవాదం ప్రతిక్షణము జ్ఞాపకం చేసుకుని మళ్ళీమళ్ళీ ఆనందిస్తున్నాను.

**భాష్యమ్ : 76.1 రాజన్ ఇతి. హే రాజన్ ధృతరాష్ట్ర, సంస్మృత్య సంస్మృత్య ప్రతిక్షణం సంవాదం ఇమం అద్భుతం కేశవార్జునయోః పుణ్యం ఇమం శ్రవణేన అపి పాపహరం శృత్వా హృష్యామి చ ముహుర్ముహుః ప్రతిక్షణమ్.**

**తె.అ.** ఓ రాజా! ధృతరాష్ట్రా, కేశవార్జునుల అద్భుతమైన ఈ పుణ్యసంవాదం శ్రవణమాత్రం చేత పాపాలను పోగొట్టునటువంటిది. దీనిని ప్రతిక్షణము గుర్తు చేసుకుంటూ మళ్ళీమళ్ళీ ఆనందం పొందుతున్నాను.

**మూ. తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూపమత్యద్భుతం హరేః ।**
**విస్మయో మే మహాన్ రాజన్ హృష్యామి చ పునః పునః ॥ 77**

**తె.అ.** రాజా, మళ్ళీ మళ్ళీ హరియొక్క అద్భుతరూపం మనసుకు తెచ్చుకుని నేను మహా విస్మయం చెందుతున్నాను. మళ్ళీమళ్ళీ ఆనందిస్తున్నాను కూడా.

**భాష్యమ్ : 77.1 తచ్చ ఇతి. తత్ చ సంస్మృత్య రూపం అత్యద్భుతం హరేః విశ్వరూపం విస్మయః మే మహాన్ రాజన్! హృష్యామి చ పునః పునః. కిం బహునా –**

**తె.అ.** హరియొక్క ఆ అద్భుత విశ్వరూపం మళ్ళీమళ్ళీ మనసుకు వచ్చి నాకు మహా విస్మయం కలుగుతున్నది. మళ్ళీమళ్ళీ ఆనందిస్తున్నాను కూడా. ఇంతెందుకు –

**మూ. యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః ।**
**తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మతిర్మమ ॥ 78**

**తె.అ.** ఎక్కడ యోగేశ్వరుడైన కృష్ణుడు, ఎక్కడ ధనుర్ధరుడైన పార్థుడు ఉంటారో అక్కడ లక్ష్మి, విజయము, స్థిరమైన వైభవం, నీతి, ఉంటాయి అని నా నిశ్చయము.

**మూ. ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జున సంవాదే మోక్ష సంన్యాసయోగో నామ అష్టాదశోఽధ్యాయః.**

**తె.అ.** ఇది వ్యాసభగవానుని శతసహస్ర సంహిత అయిన శ్రీమహాభారతంలో భీష్మపర్వంలో ఉపనిషత్తులు బ్రహ్మవిద్య యోగశాస్త్రము శ్రీకృష్ణార్జున సంవాదము అయిన శ్రీమద్భగవద్గీతల యందు మోక్ష సంన్యాసమనే పద్దెనిమిదవ అధ్యాయానికి తెలుగు అనువాదం.

**భాష్యమ్ : 78.1 యత్ర ఇతి. యత్ర యస్మిన్ పక్షే యోగేశ్వరః సర్వయోగానాం ఈశ్వరః తత్ప్రభవత్వాత్ సర్వయోగబీజస్య – కృష్ణః, యత్ర పార్థః యస్మిన్ పక్షే ధనుర్ధరః గాండీవధన్వా తత్ర శ్రీః తస్మిన్ పాండవానాం పక్షే శ్రీః విజయః, తత్రైవ భూతిః శ్రియః విశేషః విస్తారః భూతిః ధ్రువా అవ్యభిచారిణీ నీతిః నయః, ఇత్యేవం మతిః మమ ఇతి.**

**తె.అ.** యోగేశ్వరుడు, అన్ని యోగాలకు ఈశ్వరుడు, అన్నియోగాలు పుట్టినచోటు అయిన, కృష్ణుడు ఏ పక్షంలో ఉంటాడో గాండీవం ధరించిన అర్జునుడు ఏ పక్షంలో ఉంటాడో అక్కడ ఆ పాండవ పక్షంలో శ్రీ విజయము అక్కడే సంపద చెదరని నీతి ఉంటాయి అని నా నిశ్చయము.

**ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యగోవిన్దభగవత్పూజ్యపాదశిష్య శ్రీమచ్ఛంకరభగవతః కృతౌ శ్రీమద్భగవద్గీతాభాష్యే మోక్షసంన్యాసయోగో నామ అష్టాదశోఽధ్యాయః.**

ఇది శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యగోవిందభగవత్పూజ్యపాదశిష్యులు శ్రీమత్ శంకర భగవత్పాదులు రచించిన శ్రీమద్భగవద్గీతా భాష్యంలో మోక్షసంన్యాసయోగమనే పద్దెనిమిదవ అధ్యాయానికి తెలుగు అనువాదం.



# శ్లోకానుక్రమణిక

## అ

## ప

## ర

## హ



'సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ'
(గీత.8.7)

గీతలో అర్జునునికి భగవానుని ఉపదేశం యుద్ధం చేయమని కాదు. మానమని కాదు. యుద్ధం చేయను అని అనడానికి అర్జునుడు చెప్పిన కారణంలోని దోషాన్ని చెప్పాడు. అర్జునుడు యుద్ధం చేయను అనలేదు. 'అధర్మం ఆచరించినవాడు నావాడు (నా వంశం కులం జాతి మతంవాడు) కనుక నేనతనితో యుద్ధం చేయలేను' అన్నాడు. భగవానుడు యుద్ధం చేయమని చెప్పింది యీ నేను, నావాడు అన్న మోహంతో. ఈ యుద్ధంలో గెలిచినవాడు మహాభారత యుద్ధాలు చేయడం మానడం ఒకటే! చేయడానికి మానడానికి మోహం కారణం కాదు కనుక. రెండూ ధర్మమే.

---

బ్రతుకులో ఏదో సమయంలో యుద్ధం ఏదోవిధమైనది అనివార్యం కావచ్చు. అప్పుడు 'ఎదిరి బలమెంత పెద్దది! నేను ఒంటరిని', అనుకోవద్దు. నీవు ఒంటరివి కావు. వెంట మరొకడున్నాడు, భగవానుడు. మరచిపోవద్దు. ఎదిరిబలమెంత నా బలం ముందు? అని కూడా అనుకోవద్దు. భగవానుడున్నాడు. మరచిపోవద్దు.

---

సంన్యాసమే గీతాశయమని శంకరుని భాష్యం. సర్వకర్మ సంన్యాసంలో సన్న్యసించేది కర్మను కాదు, కర్తను. సంన్యాసమంటే కర్మలు మానడం కాదు. కర్మకు అహంకు ఉన్న బంధం వదలిపోవడం. (వదలవలసిన బంధం అదే. తక్కినవేవీ బంధాలు కావు). ఆ బంధం వదలిన తరువాత అహం అహం కాదు, కర్మ కర్మ కాదు. బంధమున్నంత వరకే ఆ రెండూ ఉంటాయి. బంధం తెగిన తరువాత రెండూ ఉండవు. అవి కలిస్తే సంసారం. విడివడితే సంన్యాసం. ఆ రెండూ లేవు అన్న అకర్మదర్శనమే జ్ఞానం. ఆ జ్ఞానమే సంన్యాసలక్షణం. (తక్కినవన్నీ అవలక్షణాలు) ఆ రెంటికీ ఉన్న బంధం వదలిపోవడమే ముక్తి.

---




రామకృష్ణ మఠం
దోమలగూడ, హైదరాబాదు-29
email : publication@rkmath.org

CONQUER YOURSELF
ISBN 93-83142-63-7

9789383142637

www.rkmath.org

Srimadbhagawadgita Shankara Bhashyam ₹ 250/-